శ్రీ ర స్తు

# ఉపోద్ఘాతము

—:o:—

ఈ మహాప్రపంచమును సృష్టించిన సృష్టికర్తయే ప్రపంచమందలి జీవకోటి కంతటికిని నధిపతియని మన మొప్పుకొనక తప్పదు. ఆ మహానుభావుఁడె సృష్టిలయ కారకుఁడై ప్రపంచ మందలి యాయా ఖండములలోఁ బలు తెఱంగులఁ గపట నాటక ఖేలన మొనరించు చున్నాఁడు. ఆ మహామహుని లీలల నర్థము చేసికొనఁగల మహాపురుషుఁ డిఁక ముందేమో కాని యిప్పటి వఱకు జన్మించి యుండ లేదని మా యభిప్రాయము. ప్రపంచ మందలి మానవకోటి కంతకు నొకే సృష్టికర్త యని మేము మరలఁ జెప్పఁ బనిలేదు. అట్టి సర్వేశ్వరుని సృష్టిలో మత కుల భేదములకుఁ జోటు లేకుండెను. అందఱును నాది మధ్యాంత రహితుఁడగు సర్వేశ్వరుని తమ యిచ్చవచ్చిన తెఱంగున సేవించు చుండిరి.

అటుల జరుగుచుండ రాను రాను మానవులలో విపరీత బుద్ధులు పొడసూపె. దుర్మార్గులు ప్రబలి సన్మార్గులను బాధింపఁ దొడఁగిరి. సన్మార్గులు దుర్మార్గుల నెదుర్కొనఁ జాలక ఆదిమూర్తి యగు శ్రీమహావిష్ణువును బ్రార్థించి తమ్ముఁ జెనటుల బారినుండి రక్షింపఁ గోరిరి. అందుకు శ్రీమన్నారాయణుఁడు వారిం జూచి

శ్లోకము—

యదా యదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహం. 1

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాప నార్థాయ
సంభవామి యుగే యుగే. 2

—(భగవద్గీత-4 వ అధ్యాయము.)

అనఁగా సృష్టిలో నేయే భూభాగమున దుర్మార్గులు ప్రబలి ధర్మమును నశింపఁజేసి యధర్మమును స్థాపింపఁ బూనుదురో; ఆభాగమునందుఁ దా నవతరించి దుర్మార్గులఁ జెండి మరల ధర్మసంస్థాపన మొనరింతును భయపడ వలదని యూన తిచ్చెను.

ఆ లక్ష్మీపతి తా నానతిచ్చిన ప్రకారము దుర్మార్గులు ప్రబలినపు డంతయుఁ దా నేదో యొక రూపముం దాల్చి వచ్చి దుష్ట సంహారంబును శిష్ట పరిపాలనంబును గావించు చుండెను. అట్టి భగవంతుని లీలలనే భాగవతు లవతారంబులని పేర్కొనిరి. అట్టి యవతారంబు లసంఖ్యాకములు. అయిన నేలకో ప్రాజ్ఞులు

శ్లో. మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధో కల్కి మేవచః.

అను దశావతారములకే ప్రాముఖ్యము నొసంగిరి. మనము కూడ భగవంతుని యవతారంబు లసంఖ్యాకము లనియు నందు బుధులు సెలవిచ్చిన రీతిఁ బైని బేర్కొన్న దశావతారములకే ప్రాముఖ్యము నొసంగుదము.

ఇఁక నవతారంబు లెన్ని విధంబులో కొంత చర్చించి యావల మన విషయమునకు వత్తము. అవతారంబు లంశావతారంబులు సంపూర్ణావతారంబులని రెండు విధములు. దశావతారములలో శ్రీరామావతారము సంపూర్ణావతారమని మహనీయు లందురు. కనుక మన కథానాయకుఁడగు 'శ్రీరాముని' అవతారమును గూర్చి చర్చింతము.

పూర్వము సనకసనందనాది మహాఋషుల శాపంబునకు గురియైన జయవిజయులను లక్ష్మీకాంతుని ద్వారపాలకులు తాము సత్వరముగ శ్రీమహావిష్ణు సన్నిధానమును జేర నుద్దేశించి మూఁడు జన్మములు నారాయణునకు విరోధులుగనే జన్మింపఁ గోరినది సర్వజన విదితము. ఆరీతిగా జయవిజయులు ముందు హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులుగ జన్మించి శ్రీమన్నారాయణమూర్తిచేఁ బొలియింపంబడి రెండవ జన్మంబున రావణ కుంభకర్ణులై జనించిరి. అద్దానవుల నిర్జించుటకే శ్రీ విష్ణుమూర్తి రామావతారమును దాల్పవలసి వచ్చెను.

ఇపుడు కొందఱు వితండవాదులు శ్రీవిష్ణుమూర్తి 'రామ' అను పేరుతోడనే యేల అవతరింప వలెనని వాదింతురు. భగవంతుఁ డేనామమున యవతరించినను ఫలిత మొకటియే యని గుర్తింప వలెను. అందునను 'రామ' అను

నామకరణము కేవలము దశరథమహారాజు కోరికపై వసిష్ఠమహర్షి కౌసల్యాదేవికి జనించిన పుత్రునకుఁ జేయఁ బడినదని తెలిసి కొందరు గాత.

ఇఁక 'రామ' అను నామ మందలి గూఢార్థమును దెలిసి కొందము. రామ నామమున కనేకు లనేకార్థముల నొసంగు చున్నారు. 'రామ' అను శబ్దమున ర-అ-మ అను మూఁడు వర్ణము లిమిడి యున్నవి. ర, అను నక్షరమునకు శత్రువుల భస్మీకరించు వాఁడనియు, అ, యను వర్ణమునకు ప్రకాశ ప్రతాపాది గుణముల నొప్పువాఁడనియు, మ, యను నక్కరమునకు నాహ్లాదమును గూర్చు వాఁడనియు నర్థముఁ జెప్పుదురు.

అదియుఁ గాక యోగిపుంగవులు సమాధి కాలమున నతని యందు రమింతురు గాన 'రామ' అని యందురు. జనులను సౌందర్యాది గుణములచే రమింపఁ జేయు వాఁడు. 'రాముఁడు' అని చెప్పుదురు. ఆశ్రితుల నానందింపఁ జేయువాఁడు 'రాముఁడు'. ఇటులనే 'రామ నామవుఁ జెలమ'ను జల్లు కొలఁది, అందుందు నానార్థ జలరాశి యూరుచునే యుండును. కనుక రామనామ మందలి గూఢార్థ చర్చ నింతటితో ముగింతుము.

మన దేశము హిందూదేశము. మనము హిందువులము. మన మతము హిందూమతము. అట్టి హిందూ మతమునకు సర్వేశ్వరుని దివ్య ప్రభావమును విశదీకరించి భగవంతుని యందు భక్తిని నెలకొల్పు వేదములే ప్రామాణిక గ్రంథములు. వేదములు మనకెట్లు ప్రామాణికము లయ్యెనో యటులనే వాల్మీకిమహర్షి వలన రచింపఁబడిన శ్రీమద్రామాయణము స్రష్ట యాజ్ఞానుసారము నారద మహాముని యుపదేశము ననుసరించి రచింపఁ బడినందున నీగ్రంథమునకుఁ బ్రామాణిక గ్రంథముల ఘనత సంభవించె ననుటలో నతిశయోక్తి దోసము కలుగదు,

సంపూర్ణావతారుఁడగు శ్రీరామచంద్రుని చరిత్రయే శ్రీమద్రామాయణమని మరలఁ జెప్పఁ బనిలేదు. అట్టి మహాకావ్యమును రచించిన యాదికవి శ్రీ వాల్మీకిమహర్షి కీర్తిచంద్రికలు నల్దిశల వ్యాపించి స్థిరస్థాయియై వెలయుటయే గాక యమ్మహర్షి శ్రీరామచంద్రుని కరుణా కటాక్షములకుఁ బాత్రుఁడై మోక్షమును సాధింపఁ గలిగెను.

భగవంతుని కృపాకటాక్షము వలన మనకు లభించిన యా శ్రీరామచంద్రుని చారిత్రక పవిత్ర గ్రంథరాజమును జతుర్విధ పురుషార్థములఁ గాంక్షించి పఠించినచో వారి జన్మము సార్థక మగుననుట తథ్యము. శ్రీ రామ అను పవిత్ర

నామ మందలి శక్తి నిరుపమానము. అందులకే భారతదేశ మందు శ్రీరామా
లయము గాని, రామ మందిరము గాని, కడకు రామ భజన సమాజము గాని లేని
గ్రామ ముండదని గట్టిగఁ జెప్ప వచ్చును. పౌరాణికుని వలన రామాయణ కథను
జెప్పించుకొని విని యానందింపని మానవుఁ డుండఁడనియే యనవలసి యున్నది.

శ్రీమద్రామాయణము సంపూర్ణ ప్రబంధ లక్షణములతోడను, నెనిమిది
వందల ముప్పది సర్గల తోడను, బాల అయోధ్య అరణ్య కిష్కింధా సుందర యుద్ధ
ఉత్తర కాండలను సప్త కాండములలో దేవభాష యందు రచింపఁ బడియెను.

ఆదికవి వాల్మీకి మహాముని రచించిన యీ మహాకావ్యమును నతని పిమ్మట
గీర్వాణభాష యందే పలువురు కవిపుంగవులు గద్య నాటక చంపూ సంగ్రహ
గ్రంథములఁ బెక్కింటి రచించి యున్నారు. గీర్వాణాంధ్ర భాషలలో శ్రీరామా
యణమును గద్య పద్య ద్విపద పద యక్షగాన రూపములుగ రచించిన కవిశిఖా
మణులను వారి గ్రంథములను లెక్కింప వీలు గాదనుటలో మా పొరబాటుండదని
మనవిఁ జేయుచున్నాము. ఇఁక నన్య భాషలలో భాషాంతరీకరణ మొనరింపఁబడిన
కవులను వ్యాఖ్యాన కర్తలను విమర్శకుల నిందఱిని చెప్పఁ గలవారెవరును లేరు.
శ్రీమద్రామాయణ మహాకావ్యోత్కృష్టతను గుఱించి విపులముగ జర్చింపఁ దలఁ
చుట కిది సమయము కాదని యింతటితో విరమించుచున్నాము.

శ్రీరామ కథను ఎంద ఱెన్నివిధముల రచించినను, ఎన్ని సారులు చదివి
నను విన్నను మానవులకుఁ దనివి తీరుట లేదు. అందువలననే యాదికవి సంస్కృత
మున రచించిన గ్రంథము సామాన్యులు చదువుటకును నందలి రసమును గ్రోలి
యానందించుటకును నవకాశ ముండదని తర్వాతి కవులు తదితర భాషలలో
వ్రాయఁ దలఁచి వ్రాసిరి. అట్టి వారిలో ముఖ్యులఁ గొందఱ మాత్రము పేర్కొందుము.

రంగనాథకవి—శ్రీమద్రామాయణము నాంధ్ర భాషలో రచించిన కవు
లలో రంగనాథ కవి ప్రథముఁడని యాంధ్రలోక మంగీకరించెనని వేఱె చెప్పఁ బని
లేదు. ఈకవి పుంగవుని జన్మస్థాన వంశ కుల గోత్ర సూత్రాదులఁ దెలిసికొనుట
కేయాధారములు గన్పట్టక పోవుట సారస్వత దీక్షాపరులకుఁ జింతఁ గలిగింపక
పోదు. రంగనాథకవి కోనబుద్ధరాజు (బుద్ధారెడ్డి) ఆస్థానకవియై యుండెనని పెద్దలు
నిశ్చయించిరి. అతఁడు తన ప్రభువును మెప్పించి బిరుదులనో లేక బహుమతులనో
పొందఁగోరి తన పేరున రంగనాథ రామాయణమును ద్విపద కావ్యముగ రచిం
చెను. అద్దానిఁ గొందఱు కోనబుద్ధారెడ్డియే రచించి తన తండ్రియగు విట్ఠలరాజున
కంకిత మొనరించె నందురు. ఇది విశ్వసనీయమా? అని ప్రశ్నించిన నంతరాత్మ

కాదని వెంటనే ప్రత్యుత్తర మిచ్చునో లేదో చూడుఁడు. కోనబుద్ధారెడ్డియే రచించి యుండినచోఁ దన విరచిత గ్రంథమునకు రంగనాథుని పేరేల తగిలించి యుండును? కష్టపడి వ్రాసినకవి పుంగవుఁడు తన గ్రంథమున కితరుల పేరు పెట్టుట కంగీకరింపఁడు. అందువలన రంగనాథరామాయణము రంగనాథునిదే యనక తప్పదు. ఒకవేళ రంగనాథకవి ధనకాంక్ష చేతనో ప్రబల భీతి చేతనో తన రామాయణమునకు కోనబుద్ధరాజును కర్తగా జేయుట కంగీకరించి యుండి యుండ వచ్చును. పాపము కవి ధనకాంక్షణము చేతనో తన ప్రభువును రామాయణ కర్తగాఁ జేయ నెంచినను, భగవంతుఁడు సత్యమును వెల్లడించుటకేఁ గాబోలు దానికి రంగనాథ రామాయణ మను నామమునే ప్రసిద్ధి యగునటు లొనరించి రంగనాథకవియే రంగనాథరామాయణ కర్తయని నిరూపించెను. అదియుఁ గాక రంగనాథుఁడే రామాయణోత్తర కాండను గూడ రచించి కోనబుద్ధరాజును కర్త నొనరించె నందురు. ఈవిషయమును గుఱించిన చర్చను బండితులకు వదలెదము.

భాస్కరుఁడు—(శ్రీరామాయణము నాంధ్రీకరించిన వారిలో భాస్కరకవి రెండవవాఁడు. రంగనాథుఁడు రామాయణమును ద్విపద కావ్యముగ రచింప భాస్కరుఁడు గద్య పద్యాత్మకముగ రచించెను. రంగనాథరామాయణ కర్తను గుఱించి కలిగిన సందేహమే భాస్కరరామాయణ కర్తను గుఱించియుఁ గలిగి నందులకుఁ జింతింప వలసియున్నది. అందులకుఁ గారణ మొకేపేరుగల భాస్కరులు పెక్కురుండుట చేతనే యనక తప్పదు. ఏది యెటులున్నను మహనీయులు సరియగు 'భాస్కరరామాయణ' కర్తను నిర్ణయింపఁ గలిగిరి. అతనినే హుళక్కి భాస్కరుఁడని దృఢపఱచిరి. ఈ భాస్కరుని యింటిపేరు మంగళవల్లి వారనియు నతఁడు తన యసమాన పాండిత్యమునుఁ జాటి యగ్రతాంబూలమును బొందె ననియుఁ దాంబూలమునకుఁ గన్నడమున 'హుళకి' యను పేరుండుటచే ఆపదమును భాస్కరుఁడు అను నామమునకుఁ బ్రథమమునఁ గూర్చి హుళకి భాస్కరుఁడని పిలువఁ దొడఁగి రనియు, నయ్యదియె క్రమముగ హుళక్కిగ మాఱి అతనికి మంగళపల్లి భాస్కరుఁడను పేరు మాసి 'హుళక్కి భాస్కరుఁడు' అను పేరు నిలిచె నని కొందఱందురు. ఇతఁడు ప్రతాపరుద్రుని పండితసభలోఁ బ్రఖ్యాతిఁ గాంచఁ గలిగెను. ఇతఁడు రంగనాథకవికి సమకాలికుఁ డనియుఁ గోనబుద్ధరాజు ఆస్థానకవి రంగనాథుఁడు రామాయణమును ద్విపదకావ్యముగ రచించి ప్రభువు మన్ననలకుఁ బాత్రుఁడు గానున్నాఁడని తాను గూడ ప్రభువు మన్ననలఁ బడయఁ గోరి రామాయణమును గద్యపద్యాత్మకముగ రచించి రంగనాథకవి రాజస్థానమునుఁ జేరు సమయమునకేఁ దాను గూడ వెళ్లి తానొక రామాయణమును రచించినట్లును,

దానిని ప్రభువునకీ దలఁచి నట్లును జెప్ప నాప్రభువు కవిద్వయమును బోనాడఁ జాలక ఇరువురి గ్రంథముల నందుకొనె ననియు; అట్లందుకొనుటలో రంగనాథ రామా యణమును గుడిచేతను, భాస్కరరామాయణమును నెడమ చేతను నందుకొనుటచే భాస్కరుఁడు తన పాత్రమునకు వన్నె తఱిగినట్లు భావించి ప్రభువుపై గినిసి నరాంకితము కంటె భగవదంకితమె లెస్సయని శ్రీకృష్ణ భగవానున కర్పించె ననియుఁ జెప్పుదురు. ఇట్టి యంశము లన్నిటిని నిచ్చటఁ జర్చించుటకంటె శ్రీరామ ముని చరితంబును నాంధ్రీకరించిన వారిలో భాస్కరకవిచంద్రుఁడు రెండవవాఁడని పాఠకులకు మనవి చేయుచున్నాము.

గోపీనాథకవి—శ్రీరామచంద్రుని దివ్యచారిత్రమును దెనిగించిన వారిలో నీకవి పుంగవుఁడు మూఁడవ వాఁడుగ గణింపఁ బడెను. ఈతఁడు నెల్లూరు మండలము నందలి కావలి తాలూకా యందలి లక్ష్మీపురమున జన్మించె ననియు నిక్కవి పుంగవుని వంశమున కాదిపురుషుఁడు గోపీనాథుని వేంకటశాస్త్రి యనియు, వేంకటశాస్త్రికిఁ గామాక్షీ దేవియను కళత్రము వలన బుచ్చన (బుచ్చనార్యుఁడు) యుదయించె ననియు ఆబుచ్చనార్యునకుఁ గోనమాంబయను భార్యవలన నరస శాస్త్రి జన్మించె ననియు అతనికి వేంకటాంబ వలన పద్మనాభశాస్త్రి బుచ్చన్న అను పుత్రులు జన్మించి రనియు నందు పద్మనాభునకు లక్ష్మీదేవి యను సర్ధాంగి వలన వేంకటనాథుఁడు అను పుత్రుఁడు జన్మించె ననియు ఆ వేంకటనాథుఁడే గోపీనాథరామాయణమును రచించె ననియుఁ దెలియు చున్నది.

ఈ కవికుల తిలకుఁడు పై రంగనాథ భాస్కరుల వలెనే రామాయణమును వాల్మీకి రామాయణము ననుసరించియే గద్యపద్యాత్మకముగ రచించి భాస్కరుని వలెనే తన కృతిని నరాంకిత మొనరింపక శ్రీకృష్ణభగవానున కర్పిత మొనరించి శ్రీరామచంద్రుని కరుణా కటాక్షమునకుఁ బాత్రుఁడై స్వర్గము నలంకరించెను.

ఆంధ్రవాల్మీకి—రాయలసీమలోఁ గడప మండలము పూర్వము నుండియు మహాకవులకు జన్మస్థానమై వెలయు చున్నదని వ్రాయుటలో నతిశయోక్తి దోస ముండునని పాఠకులు భ్రమింప కుందురు గాక.

అట్టి కడప మండలము నందలి జమ్మలమడుగు పట్టణమున నాంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు, ఆవల వాసుదాసు అని పిలువఁ బడెడి ఆంధ్రవాల్మీకి జన్మించెను. ఈ కవికులఁ దిలకుఁడు బహుగ్రంథకర్తయై భక్తశిఖామణి యని పించుకొని బమ్మెర పోతనామాత్యుని వలె రామభక్తుఁడై, ఒంటిమిట్ట యని పిలువంబడు నేకశిలా నగరమందే యాశ్రమము నేర్పఱచుకొని, బమ్మెర పోతనా

మాత్యుఁడు భాగవతమును రచించి కోదండరామున కర్పించి నటులఁ దాను సహితము వాల్మీకిరామాయణమును మూలము ననుసరించి యాంధ్రీకరించి యా కోదండరామునకే యర్పించి శ్రీరామ పాదపంకజములఁ జేరి రామాయణమును రచించిన నాలవకవి యనిపించుకొనెను.

జనమంచి—జనులందఱ చేతను మంచివాఁ డనిపించుకొని మరణించిన యీ కవిశిఖామణికి జనమంచి యను నామము సార్థకమయ్యెను. కావ్యస్మృతితీర్థ కళాప్రపూర్ణ ఇత్యాది బిరుదలఁ బడసిన శ్రీజనమంచి శేషాద్రిశర్మగారు శ్రీవాల్మీకి రామాయణమును తెనుఁగున నిర్వచనముగ వ్రాసి వెలయించి భగవంతున కర్పించి భగవంతునిఁ జేరఁ గలిగిరి. ఈ పండితకవి నెల్లూరుమండలమున గడపజిల్లాకు సరిహద్దులలో నుండు కలవాయి యను గ్రామమున జన్మించి కడప మండలమునఁ జెరిగి తమ కవితాకీర్తిచంద్రికల నాంధ్రావనియం దంతటను బ్రసరింపఁ జేసి కడప పట్టణమునఁ బందొమ్మిది వందల యేబదియవ సంవత్సరము జులై మొదటి తేది (1-7-1950) పరమపదించిరి. శ్రీరామభద్రుని దివ్యచరిత్రమును రచించిన వారిలోని సీకవి పుంగవుఁడు అయిదవ వాఁడు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి—శ్రీమద్రామాయణమును తెలుఁగుబాసలో రచించి కీర్తి వహించిన కవితావతంసులలో శ్రీపాదవారు ఆఱవ వారని తెలియుచున్నది. ఈమహాకవి భారతమును సంపూర్ణముగ నాంధ్రీకరించుటయే గాక శతాది గ్రంథకర్తయు కళాప్రపూర్ణ కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ బిరుదాంకితులును, ప్రకృతపు ప్రజాప్రభుత్వ ఆస్థానకవియునై ఆంధ్రభారతిని తన యమూల్య గ్రంథరత్నమాలచే నలంకరించు చున్నాఁడు.

పూర్వ కవులలోనేమి, ప్రకృతపు సత్కవులలో నేమి మున్ముందు ఆంధ్రభారతి పవిత్రగర్భమున నుద్భవింపఁ బోవు కవికుమారులేమి శ్రీరామాయణమునే రచించి శ్రీరామ కటాక్షమును గడించఁ గలరు. కొందఱు ఆంగ్లభాషాదురంధరులు ఒకరామాయణము చాలదా? వ్రాసినదే వ్రాయుటకంటెఁ గ్రొత్తమార్గము ననుసరించి సాంఘిక గ్రంథముల నెలకొల్పి సంఘసేవ చేయరాదా? యని యెత్తిపొడుతురు. పాపము వారు శ్రీరామచంద్రుని దివ్యచారిత్రము ఎందఱి కవులచే లిఖింపఁ బడినను ఎన్ని భాషలలోకి భాషాంతరీకరించినను దనివి తీఱుట లేదను దానిలోని సత్యమును గ్రహింపరైరి. శ్రీరామాయణము ప్రపంచమున నిందఱు కవులచే రచింపఁ బడెననియు, నిందఱిచే నిన్నిభాషలలో భాషాంతరీకరింపఁ బడెననియు నిష్కర్షగఁ జెప్పఁగల వారు లేకున్నారు. ఏకవి గాని గ్రంథకర్త గాని

శ్రీరామకథ నేవిధముగ వర్ణింపఁ బూనినను దద్రచనచే శ్రీరాముని ప్రేమకుఁ బాత్రుఁడై తద్ద్వారా మోక్షమును బడయు తలంపు ననే యని మా తలంపు.

ఉత్తరరామాయణము—ఇంతవఱకు శ్రీరామాయణమును గుఱించియు, ఆరామాయణమునే పలువురు కవులు గ్రంథకర్తలు అనేకరీతుల సంస్కృతాంధ్ర భాషలలో రచించుటను గూర్చియు దానిని బహుభాషలలో తర్జుమా చేయుటకు హేతువును గూర్చియు వివరించితిమి. ఇఁక ఉత్తరరామాయణమును గూర్చి చర్చింతమన్న దీని నెందఱో కవులు రచ్చింప లేదు. ఇప్పటివఱకు ఉత్తరరామాయణమును రచించిన కవిపుంగవులలో భవభూతి సంస్కృతమున ఉత్తరరామచరితము అను పేర నాటక రూపమునను, మహాకవి తిక్కన తెనుఁగున ఉత్తరరామాయణమును రచించినట్లు తెలియుచున్నది. ఆగ్రంథములు పాఠకులకు లభ్యము కాగలవు. ఈగ్రంథద్వయము తప్ప నితర గ్రంథములు కంకంటి వారి ఉత్తరరామాయణమునకుఁ బ్వారము రచింపఁ బడినవి కానంబడుట లేదు. పైమూఁడు గ్రంథములలోఁ గంకంటివారి ఉత్తరరామాయణమునకున్న వ్యాప్తి తక్కిన రెండు గ్రంథములకు లేదని చెప్పుటలోఁ బొరపాటుండదని తలంచుచున్నాము. పది గుడిసెలు గల పల్లెటూరు మొదలుకొని పట్టణముల వఱకు నాంధ్రభాషను జదువ నేర్చిన యెవ్వరిని గాని ప్రశ్నించిన కంకంటి పాపరాజు కృత ఉత్తరరామాయణమునే బేర్కొందు రనుటలో నతిశయోక్తి లేదనక తప్పదు. పూర్వకవులలో నేమి, ఇప్పటికవులలో నేమి ఉత్తరరామాయణమున కంటె లావుగ్రంథముల రచించినవా రనేకులు గలరు కాని పాప మేలకో వారికిఁ గాని వారి గ్రంథములకు గాని కంకంటి పాపరాజుకు నతని ఉత్తరరామాయణమునకుఁ గలిగిన వ్యాప్తి కలుగక పోయినందులకు మే మెంతయుఁ జింతించు చున్నామన నా గ్రంథకర్తల కెట్లుండునో గదా!

కంకంటి పాపరాజు—ఈ ఉత్తరరామాయణమును సృష్టించిన శ్రీకంకంటి పాపరాజు సుమారు వంద సంవత్సరములకు పూర్వముండిన కవులలోఁ జేరినవాఁడు. అనఁగాఁ బదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగమున నీయుత్తరరామాయణమును రచించినట్లు తెలియుచున్నది.

ఇతఁడు బడగలనాటి కన్నడ తెగనుండి యుద్భవించిన నియోగిశాఖ యుపశాఖలగు వండవరీక ఆర్వేల అను నియోగిశాఖలలో ఆర్వేల నియోగి శాఖకుఁ జేరినవాఁ డనియు, ఆపస్తంబసూత్ర శ్రీవత్స గోత్రజుఁ డనియు గ్రంథకర్త

పీఠికలోని ఇరువది యేడవ పద్యమునుఁ జదివినచోఁ దెలియఁ గలదు. ఇఁక గ్రంథ కర్త వంశమును గూర్చి పరిశీలించిన నిట్లున్నది.

—: వంశవృక్షము :—




ఇంతటి పాండిత్యమును నసర్గల కవితాధారయుఁ గలిగిన యిక్కవికుల తిలకుఁడు వాల్మీకి మొదలుగాఁగల మహాకవులు శ్రీమద్రామాయణమునే సంస్కృతాంధ్రములలో రచించి శ్రీరామకటాక్షమునకుఁ బాత్రులు కాఁగోరి నటులఁ దాను కూడ రామాయణకథనే రచించి శ్రీరామచంద్రుని కటాక్షమును సంపాదింపఁ గోరక యేలకో ఉత్తరరామాయణమునే రచించి భగవంతుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁగోరెను.

శ్రీమదుత్తరరామాయణమును తాను రచింపఁ బూనుటకుఁ గల కారణము పాపరాజు రచించిన కృతిప్రశంస లోని పదునాలవ పద్యమును జదివినఁ దెలియఁ గలదు. ఈకవి తన పదునైదవ పద్యమున అన్నిటికంటె నుత్తమమైన మానవ జన్మము నెత్తిన వాఁడు విద్యాధనమును గడించి కవియై శ్రీరాముని దివ్యచరిత్రమును బాడి కీర్తింపనిచో నట్టి పురుషుని జన్మము నిరర్థకమని వాక్రుచ్చెను. అనఁగా పాపయామాత్యునకు శ్రీరామచంద్రుని మహాశక్తి యందును, శ్రీరామచరిత్రమును రచించుట యందును నంత నమ్మక ముండినదని తెలియు చున్నది. వాల్మీకి మున్నగు కవులవలె రామాయణమునే కాక శ్రీరాముని మహిమలఁజాటు

నే గ్రంథమైనను సద్గతిఁ గూర్పఁ గలదను నమ్మకము తోడనే పైకవులవలె రామాయణమును గాక తాను ఉత్తరరామాయణమును రచింప సంకల్పించెను. ఆవలఁ దన కృతికిఁ దగిన కృతిభర్తను సంపాదింప నెంచి యోజించుచు నిద్రింప స్వప్నమందు శ్రీమదనగోపాలుఁడు సాక్షాత్కరించి నీవింతకుముందు రచించి నాకు సమర్పించిన విష్ణుమాయావిలాసము అను యక్షగానము వలెనే ఉత్తరరామాయణమును గూడ సమర్పింపు మనియు, నందు వలన నతనికిని నతని గ్రంథమునకును శాశ్వతకీర్తి కలుగఁ గలదని చెప్పి యదృశ్యుఁడైనట్లుఁ గవి తన 19–22 వ పద్యములలో లిఖించెను.

పాపరాజు వేకువన నిదురనుండి లేచి స్వప్నమున శ్రీమదనగోపాలుఁడు సాక్షాత్కరించి పలికిన వచనములఁ దనమిత్రుఁడగు పుష్పగిరి అప్పయ్య కుమారుఁడగు తిమ్మయ్యను బిలిపించి యున్నదున్నట్లు వచింపఁ దిమ్మయ్య మిక్కిలి సంతసించి అన్నా! నీవు కృతిభర్తకై వెదకుచుండ శ్రీకృష్ణభగవానుఁడే నీపుత్రినిఁ బ్రేమించి తనకు సమర్పింపఁ గోరెను కదా! శ్రీమదనగోపాలుఁడే నీయల్లుఁడాయెను గదా! ఔరా! నీవు ధన్యుఁడ వైతివి. నీజన్మము సార్థక మాయెను. లెమ్ము. సత్వరమున నీకృతిని ముగింపుమని తన మిత్రునిఁ బ్రోత్సహించి తన నిజసదనంబున కేగినవాఁడయ్యె.

ఇచ్చట మఱియొక యంశమును జర్చింప వలసి వచ్చినది. కొందఱు కంకంటి పాపరాజు తన ఉత్తరరామాయణమును పుష్పగిరి తిమ్మకవి సహాయముతో వ్రాసెననువారును, పాపరాజు గారికిఁ దాను ఋణపడిన విత్తము నీయఁజాలక తిమ్మకవి ఉత్తరరామాయణమును రచించి పాపరాజున కొసఁగి తన యప్పును దీర్చుకొనెననువారును, నట్లొసఁగిన గ్రంథముచు వేయిన్ని యేడువందల తొంబదవ సంవత్సర ప్రాంతమునఁ బాపరాజు తనపేరఁ బ్రకటించు కొనెననువారును గలరు. కాని వీరి పలుకు లన్నియు సత్య దూరములని యించుక యోజించినచోఁ దెలియఁ గలదు. ఈ వదంతిఁ గల్పించిన వారి పలుకులు నమ్మదగినవి కాదని యీక్రింది విషయములు చెప్పక చెప్పు చున్నవి.

1. కంకంటి పాపరాజు కవిత్వము చేతఁగాని దద్దమ్మకాదని యతఁడు వ్రాసిన యాశ్వాసాంత గద్యములే చాటు చున్నవి. అట్టి మహాకవి యితర కవిచే వ్రాయఁబడిన గ్రంథమును దనపేరఁ బ్రకటించు కొనెనను వారాకవి పుంగవునకు మహాద్రోహ మొనర్చిన వారు కాఁగలరు.

2. పుష్పగిరి తిమ్మనార్యుఁడు ఉత్తరరామాయణమును వ్రాసి యుండినచో; పాపరాజు తన స్వప్న వృత్తాంతమును తిమ్మకవిని తన యింటికిఁ బిలిపించుకొని చెప్పవలసినంత యవసర ముండి యుండదు కదా! అంతకు ముందు తిమ్మకవి యేమైన ఉత్తరరామాయణమును రచించి నట్లు గాని రచింప నున్నట్లు గాని యితరు లట్లుండఁ దిమ్మకవియైనను నెచ్చటను వ్రాసి యుండ లేదు.

3. పుష్పగిరి తిమ్మకవి భర్తృహరి నీతిశతకమును, సమీరకుమార విజయమును దప్పఁ దదితర గ్రంథముల రచించినట్లు సాక్ష్య మిచ్చు వారెవరును లేరు.

4. ఏదో పాపరాజుగారి కిచ్చిన గ్రంథమును గుఱించి నేనేలఁ బదుగురకుఁ జాటవలెనని తా నెచ్చటను దాని నామమైనఁ గనఁబఱచ లేదనియు, నటులఁ గనఁ బఱచినఁ బాపరాజున కపయశముఁ దెచ్చిన వాఁడనగుదుననియు భావించి తిమ్మనార్యుఁడు ఉత్తరరామాయణ ప్రశంసను బొత్తిగ వదలెనని యనుకొందమన్న; తిమ్మకవి కవిత్వమునకును; ఉత్తరరామాయణ రచనకును నేలాటి సంబంధ ముండినట్లు కనఁబడదు.

5. కవిత్వమను కళ ప్రారంభమైనది మొదలు గ్రంథకర్తల రచనలఁ బరిశీలించి చూచినచో నేరెండుమూఁడో అంతకంటె యెక్కువో వ్రాసిన ఒక గ్రంథకర్త శైలిని పోకడలను జూచిన నతని ప్రతిగ్రంథములోని శైలి యుద్దేశములు మున్నగునవి కొంచె మించుమించు ఒకే విధముగ నుండునని పండితులకు మేము చెప్పఁ బనిలేదు. ఇఁకఁ బుష్పగిరి వారి గ్రంథములోని రచన పోకడలు మున్నగు వానిని; ఉత్తరరామాయణ రచన పోకడలతోఁ బోల్చి చూచినచో నేలాటి సంబంధ మున్నట్లు కనఁబడనందున నుత్తరరామాయణకర్త కంకంటి పాపరాజు గారే యని తీర్మానింప వలసినదే కాని మఱొకరీతి తీర్మానించుటకుఁ గారణ మగు పడుట లేదు.

గ్రంథప్రాశస్త్యము—ఇఁక మహాకావ్య లక్షణముల యందించుకేని కొఱత లేకుండ రచింపఁ బడిన యీ గ్రంథరాజ లక్షణములఁ గూర్చి మేము వ్రాయఁదలఁచుట కంటెఁ బాఠకులకే వదలి మాశ్రమ తగ్గించుకొనుట లెస్సయని మాతలంపు. ఒకవేళ నాప్రయత్న మొనరించినను దివ్యతర ఫలాహారాదుల ముందిడుకొని తినఁ బోవు వారికి దూరమునఁ గూర్చుండి యా పదార్థముల రుచిని వర్ణింపఁ బూనినట్లుండునని మాయభిప్రాయము. వేయేల. ఈ గ్రంథరత్నమున శ్రీకారము మొదలుకొని యంత్యాక్షరము వఱకుఁ గల ప్రతి పద్యగద్యాక్షరముల పొందికలో గొప్ప పటిమ గలదనియు, నేపద్యమును జదివినను మనోహ్లాదమును గలిగించు

ననియు, నిట్టి కవితాధార యేపుణ్యపురుషునకో గాని యెల్లర కలవడదనుటలో నతిశయోక్తి లేదనియు మా నమ్మకము. ఇటుల వ్రాసినందులకు భావ నవ్యసాహిత్య వస్తోంది పోతోంది వచ్చారు పొయ్యారు వ్రాతల వ్రాయు కవిపుంగవులు మాపై గ్రుడ్డెఱ్ఱఁ జేసినఁ జేయవచ్చును, కాని యందులకు భయఁపడి సత్యమును దాఁచుట తప్పు కదా?

కంకంటి వారి ఉత్తరరామాయణమును జదివినచో ఉత్తరరామాయణముతోఁ బాటు రామాయణమును గూడ జదివి నట్లగుననుట కీకవిపుంగవుఁ డిందు సంగ్రహముగ ఎనుబదియేడు పద్యములలో రచించి ముంగించిన రామాయణము చు జదివినవారెఱుంగఁ గలరు. ఈ గ్రంధమును సంపూర్ణముగఁ జదివినను, పురాణశ్రవణము గావించినను శ్రీమద్రామాయణమును ఉత్తరరామాయణమును జదివిన ఫలమును బొందఁ గలరు.

ఇట్టి యుత్తమగ్రంథమును పండితులచే సరిచూపించి కాకితము లభింపని యీ కఱవు దినములలో వ్యయ ప్రయాసల లెక్కింపక మంచి కాగితములపైఁ జక్కఁగ ముద్రించి సామాన్యుల కందుబాటగు మూల్యమును నిర్ణయించితిమి. ఇందేమైన ఇంకను పొరపాట్లుండినచోఁ బాఠక మహాశయులు మాకు దయతోఁ దెలిపిన రెండవ ముద్రణమున సవరింపఁ గలము. ఆంధ్రలోకము ఆంధ్రభారతికి మే మొనరించు సేవ నెట్లుఁ బ్రోత్సహించునో చూడవలసి యున్నది.

మదరాసు
30-6-1951

ఇట్లు
సి. వి. కృష్ణా బుక్కు డిపో.

శ్రీ ర స్తు

# విషయసూచిక

—:o:—

## పీఠిక



## ప్రథమాశ్వాసము

ద్వి తీ యా శ్వా స ము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

## సప్తమాశ్వాసము

షష్ఠమాశ్వాసము

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమదుత్తరరామాయణము

## పీ ఠి క.

---

శ్లో. చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

—: o :—

### ఇష్టదేవతాప్రార్థనము

శ్రీరాధాధరబింబమున్ దొరయురాచిల్కన్ నిజోరస్స్థలీ
రారాజన్మణికాంతి రాఁ బిలిచి తద్రాకేందుబింబాననా
స్మేరాంకూరముచేఁ గృతార్థుఁ డగుచుం జెల్వొందు గోపాంగనా
జారగ్రామణి కృష్ణుఁ డీవుత మహైశ్వర్యంబు మా కెప్పుడున్. 1

### లక్ష్మీస్తుతి

సీ. పుష్కరవిహరణస్ఫురణంబు వహియించి యచలానుగుణవృత్తి యవధరించి
సూర్యాభిగణ్యసౌకర్యంబును రహించి ప్రబలహిరణ్యావర్ధనత మించి
త్రిభువనాంచితరూపవిభవంబు ప్రాపించి భృగుకులంబు పవిత్రముగ జనించి
యంభోధిభంగలీలాసక్తి వర్తించి కామపాలనరీతి ఖ్యాతిఁ గాంచి

తే. పుణ్యజనములపూజనములు గ్రహించి
కలికితన మెందు నిట్టిది కలదె యనఁగఁ
జెలువుచెలువున నలు వొందు కలిమిచెలువ
మెచ్చి నిచ్చలు మాకోర్కు లిచ్చుఁగాత. 2

శివస్తుతి

చ. వనితరొ వెండికొండ నెలవంకలు పెక్కు వహించెఁ జూచితే
యని సరసోక్తిఁ దా ననిన సచ్చపుగంధపుఁబూఁత నుబ్బ జా
ఱిన నునుఁబైఁటకొంగు సవరించుచు నవ్వినగౌరిఁ గౌఁగిటం
దనిపెడుచంద్రశేఖరుఁ డుదారకృపన్ మముఁ బ్రోచుఁ గావుతన్. 3

పార్వతీస్తుతి

ఉ. ఊరక చుట్టుకొన్నఁ గమలోత్పలపంక్తులు వాడు నంచునో
యేఱును గూర్చి చుట్టితివ యెంతటిజాణవు మేలు మేలు నీ
నేరుపు మెచ్చవచ్చు నని నిచ్చలు మచ్చిక శంభుఁ గేరునీ
హారగిరీంద్రకన్యక దయామతిఁ గోర్కులు మా కొసంగుతన్. 4

బ్రహ్మస్తుతి

చ. భువనములం బ్రసిద్ధిఁ గని భూరితరోర్మివరప్రభావ మొం
ది విధునిఁ గాక కుబ్బుచు సుదీర్ణగుణాంచితరత్నరాశియై
కవులు సమాశ్రయింపఁ దగి కర్బురగర్భత శ్రీగుణత్వముం
దవులుసరస్వతీశ్వరుఁ డుదారత మాకుఁ జిరాయు వీవుతన్. 5

సరస్వతీస్తుతి

చ. తనహృదయాంబుజాతమునఁ దార్కొనునాథగతానురాగవా
హిని వెలిఁ గ్రమ్మఁ జేసెనొకొ యీగతి నాఁగ విధాతచెంగటన్
దనరి జపాప్రసూనసవిధస్ఫటికాకృతిరక్తిఁ గుల్కు వా
గ్వనజదళాక్షి మా కొసఁగుఁగాత వచోరచనాచమత్కృతుల్. 6

విఘ్నేశ్వరస్తుతి

మ. కలుషేభావళి నాఁప నంకుశము విఘ్నక్ష్మాధరశ్రేణి వ్ర
క్కలు గావింప వరస్ఫురత్కులిశమున్ గర్వప్రమత్తారిపీ
డల బంధింపఁగఁ బాశ మున్నతమనోరుగ్రేణువుల్ మాన్పఁ బు
ష్కలదానాంబువు లూనువేల్పడఁచు మత్కావ్యాంతరాయచ్ఛటల్. 7

ఆంజనేయస్తుతి

సీ. శైశవంబుననె భాస్కరు మ్రింగె నితనితేజమున కేఘనుఁ డింక సదృశుఁ డనుచు
హనుతటోద్ధతి వజ్ర మడఁచె నీతనితనుద్రఢిమ కేమిఁకఁ బోల్పఁ దగు నటంచు
నురుధాటిఁ గడలిలో మెఱసె నీతనిగభీరతకు నెయ్యది యింకఁ బ్రతి యటంచు
వాలాగ్రమున గిరుల్ వ్రాల్చె నీతనిధైర్యసంపద కిఁక నెవ్వి సాటి యనుచు

తే. జానకీరామచంద్రు లేశౌర్యవంతు
పటుగుణస్ఫూర్తు లప్పటప్పటికి నెంతు
రామహాశాంతు నతిదాంతు నరికృతాంతు
సత్ఫలమతిమంతు హనుమంతు నభినుతింతు. 8

సుకవిప్రశంస

ఉ. ఏకవిజిహ్వఁ దొల్త నటియించె సరస్వతి పాదనూపుర
ద్రేంకరఝుళంఝుళార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నేశుభ
శ్లోకునిమానసాబ్జమున శోభిలెఁ దారకహంస మట్టివా
ల్మీకిమహర్షి శేఖరు నమేయగుణాకరు నాశ్రయించెదన్. 9

మ. ధరణీభృన్మణిపాళివ ర్తనములం దళ్కొంది యార్యోక్తినై
ఖరి ప్రాపించి యహీనవిస్ఫురదలంకారార్తి శోభిల్లి భూ
రిరసారూఢిఁ జెలంగి యర్థవరమైత్రిం జొక్కి మేటి కవీ
శ్వరులన్ గొల్చెద సన్మనోహంకళాచంచత్ప్రభావాఢ్యులన్. 10

కుకవినిరాకృతి

చ. సరసతఁ దామునుం దెలియఁ జాలరు చెప్పిన నీసు లేక యా
దరణ వహించి యూఁకొనరు తప్పులె పట్టుదు రొప్పుఁ గన్న మె
చ్చరు వెడయుక్తు లెన్నుదురు శక్తులు గారొకఁడైన నింపు చే
కుఱ రచియింప నట్టిచెడుగుల్ విన నోర్తురె సత్ప్రబంధముల్. 11

వ. అని యిష్టదేవతాప్రణామఖేలనంబును విశిష్టకవిస్తుతిమేళనంబును నికృష్టకవిజనావహేళనంబునుం గావించి. 12

కృతిప్రశంస

మ. పరమశ్రావ్య మఘవ్యయామితకథాభవ్యంబు దీవ్యత్సుధీ
పరిషత్సంతతసేవ్య మబ్జభవసంభావ్యంబునై మించు ను
త్తరరామాయణకావ్యమున్ మృదువచోధారార్థసందర్భని
ర్భరతత్తద్రసముల్ రసింప రచియింపం బూనితిన్ వేడుకన్. 13

మ. వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై తెగం జేసె ను
త్తరరామాయణ మందునన్ మఱి ప్రబంధం బూని నిర్మించు టే
సరసత్వం బని ప్రాజ్ఞులార సిరసించం బోకుఁడీ రాఘవే
శ్వరుచారిత్రము నెంద ఱెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే. 14

ఉ. మానక కర్మభూమిపయి మానుషదేహముతోఁ హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించెనేనియున్
వాని వివేక మేమిటికి వానికవిత్వమహత్త్వ మేటికిన్. 15

ఉ. శ్రీకరరామమంత్రజపసిద్ధిఁ బ్రసిద్ధిఁ వహించి వెన్క వా
ల్మీకి రఘుప్రవీరుకథ లే రచియించి గదా చెలంగె ము
ల్లోకములందు నెల్లమునులుం గొనియాడఁగ నట్టి చాటుఁ బు
ణ్యాకర మైనరాముకథ హైన్యము మాన్పదె యెట్టివారికిన్. 16

శా. ఆవాల్మీకిమనీషివర్యమతిమంథాహార్యసంశోభితం
బై విశ్వాతిగకామితార్థఫలదం బై శ్రీపదం బై సుశ
బ్దావాసం బయి మాధురిం దనరు రామాంచత్కథాక్షీరపా
రావారంబు సమాశ్రయింతుఁ గవితా ప్రఖ్యాతి కర్థంబుగన్. 17

చ. ఇహపరసాధకం బన రహించుప్రబంధ మొనర్చ శ్రీరఘూ
ద్వహునిచరిత్రముం దొరకె వాసిగ నీకృతిరత్నమే మహా
మహునకు సంతసంబున సమర్పణ సేయుదు నంచు నెమ్మదిన్
దుహితకు భర్తనారయుజనుం బలె యోజన సేయుచున్నెడన్. 18

కృతిపతినిర్ణయము

సీ. పొడువుఁగెంపు వహించుబెడిదంపునినుగెంపురహింపు కంఠహారంబువాఁడు
కోమలాంఘ్రులయోర గొనబురింగులు జాఱఁ గట్టినబంగారుబట్టవాఁడు
శృంగారగతి మీఱి చెలువొందుకస్తూరితిలకంబుచే ముద్దుగులుకువాఁడు
మకరకుండలలోలమణిజాలరుచి మీఱఁ దళుకొత్తుచెక్కుటద్దములవాఁడు
తే. తలను వలగొన్న పింఛెపుదండవాఁడు, విమలశతపత్త్రజైత్రనేత్రములవాఁడు
మురళికాచేతఁ గలజగన్మోహనుం డొ,కండు నాస్వప్నమునను సాక్షాత్కరించె.

క. ఏనును నతనిం బొడగని, ధ్యానంబున నలరుశ్రీమదనగోపాలుం
డౌ నని కలలోననె పర,మానందముఁ జెంది మ్రొక్కి యర్చించు నెడన్. 20

ఉ. అమ్మహనీయకీర్తి కరుణాన్వితుఁ డై యను వత్స నీప్రబం
ధమ్ము మదంకితంబుగ నొనర్చు కృతార్థుఁడ వయ్యె దింతె కా
దిమ్మహి వసువాహనసమృద్ధికుమారరమణీయభోగభా
గ్యమ్ములుఁ గల్గెడుం గృతియు నారవితారకమై ప్రకాశిలున్. 21

తే. శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస, యక్షగానంబు మాకె సమర్పణముగఁ
జేసి తది యాదిగా మేము నీసుధాను,సారివాక్కులఁ జొక్కియున్నార మనఘ.

క. అని పల్కి యాకృపాళుఁడు, సనుటయు నే మేలుకాంచి స్వప్నమునందున్
నను నేలుస్వామిఁ గనఁ గలి, గె నెయని రోమాంచకంచుకితగాత్రుఁడ నై. 23

మ. హనుమద్దివ్యపదారవిందమకరందానందనేందిందిరా
త్మ ననేకాంధ్రకృతిప్రకల్పనసమర్థుం బుష్పగిర్యప్పనా
ర్యునిసత్పుత్త్రునిఁ దిమ్మనాఖ్యకవిచంద్రున్ మత్సహశ్రోతఁ బ్రొ
ద్దున నే పిల్వఁగఁ బంచి కన్నకల సంతోషంబునం దెల్పినన్. 24

మ. అతఁ డానందముఁ జెంది నన్నుఁ గని యన్నా జాళువాపైఁడికిం
గృతవర్ణాంచితరత్న మబ్బినటు లయ్యెన్ నీవు వాక్ప్రౌఢిమన్
గృతి సేయంగఁ దొడంగు రామకథకుం గృష్ణుండు రా జౌటఁ బ్ర
స్తుతి గావింపఁగ మాకు శక్యమె భవత్పుణ్యప్రభావోన్నతుల్. 25

తే. అని కిరీటికి శౌరి తోడైనయట్టు, లమ్మహాకవి సాహాయ్య మాచరింపఁ
గృతి నొనర్పఁగఁ బూనినయేను మొదట, నెంతు మద్వంశవిధ మది యెట్టులనిన.

గ్రంథకర్తృవంశవర్ణనము

సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవోదీర్ణవితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయసతతనిర్వ్యాజహారిపరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘటస్వామికార్యనిర్వహణప్రవీణతాధారు లార్వేలవారు
తే. విమతగర్వాపహారు లార్వేలవార, లట్టి యార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయుశ్రీవత్సగోత్రారవింద హేళి, మహితగుణశాలి వల్లభామాత్యమౌళి. 27

ఉ. ఎల్లభయంబులన్ విడువుఁ డేఁ గల నంచు వచించి ప్రేమతో
భిల్లభరించు బంధుజనబృందము డెందమునందు భక్తి రం
జిల్ల భజించు సంతతము శ్రీహరిదివ్యపదారవిందముల్
వల్లభమంత్రి బుద్ధి సురవల్లభమంత్రి యమాత్యమాత్రుఁడే. 28

క. శ్రీవల్లభుండు లక్ష్మీ, దేవిని మును పెండ్లియైన తెఱఁగునఁ దనరన్
దేవేరిఁగ లక్ష్మాంబిక, నావల్లభమంత్రి పెండ్లియాడెన్ వేడ్కన్. 29

సీ. జడనిధిఁ బొడమనిజలజాతగేహిని చండికాఖ్యఁ దొఱఁగుశైలకన్య
బహుముఖావాసంబుఁ బాయుసరస్వతి గోత్రభిత్సతి యనఁగూడనిశచి
చక్రవిద్వేషణాశ్రయ గానిరోహిణి పతి ప్రతాపము మెచ్చి ప్రబలుసంజ్ఞ
హీనవంశోత్పత్తి లేనియరుంధతి పృథుపంక మొందనిభీష్మజనని
తే. యీమె యౌ నని చుట్టంబులెల్లఁ బొగడ, నగణితక్షాంతిసంపద నవనిఁ బోలి
వల్లభునిసేవ సేయు నవార్యలలిత, లక్షణకదంబ కంకంటి లక్ష్మమాంబ. 30

క. అల్లక్ష్మమాంబయందు దా, వల్లభనామప్రధానవర్యుఁడు గనియెన్
బల్లవశాణాకారున్, హల్లకహితకీర్తిధారు నయ్యనధీరున్. 31

మ. కనకాహార్యసమానధైర్యుఁ డగుకంకంట్యయ్యనామాత్యవ
ర్యునకుం బ్రాక్తనమంత్రు లద్యతనమంత్రుల్ విశు
ద్ధనయోద్యుక్తిఁ బరోపకారవినయౌదార్యప్రసక్తిన్ మృదూ
క్తి నిజస్వామిహితోరుకార్యఘటనాధీశక్తి నీడౌదు రే. 32

క. అయ్యనవద్యగుణావని, యయ్యనమంత్రిమణి నరసమాంబ వివాహం
బయ్యె నహార్యకుమారిని, నెయ్యంబునఁ బెండ్లి యయిన నెలతాల్పురహిన్. 33

సీ. వసియింప ప్రభుఁ డురం బొసఁగినచో వనజాతంబు డాయుశ్రీసతి హసించి
ప్రియునిసామేన నుండియును తత్తేజంబు సైరింపఁ జాలనిశాంభవి నగి
విభుసమ్ముఖంబున వెలసియు బహురసజ్ఞాధీన యైన బ్రహ్మాణిఁ దెగడి
తన కెందు గతి యైనధవునిలావణ్యంబుఁ గలయునప్పు డడంచుగంగఁ గేరి

తే. యేకొఱంతయు లేక యస్తోకభక్తిచే నిజేశునిపరిచర్య సేయు నెపుడు
ధర్మగుణధామ పతిదేవతాలలామ, భవ్యమతిపేటి నరసమాంబావధూటి. 34

క. అనరసమాంబగర్భాం, భోనిధి నమ్మృతాంశుచందమున దానయశో
నూనవిభావిభవైకని,ధానం బగునప్పయప్రధానుం డొడమెన్. 35

మ. దయమానాత్మ దయాబ్ధిగుప్తకవివిద్యావైనమిషీభోజభూ
దయితగ్రామణి పూర్వదాత్రుమసమానాఘోకారిదానప్రభూ
తయశోధౌతదిశావకాశుఁడు మహోద భ్రాతవామాంగుఁ డ
ప్పయమంత్రీశ్వరుఁ డమ్మహామహుని నుతింపం జెల్లదే యెయ్యెడన్. 36

తే. వినయమున కిమ్ము దాక్షిణ్యమునకు నెలవు
సత్యమున కాస్పదము సదాచారమునకుఁ
బ్రాపు నైపుణ్యమునకుఁ జేపట్టు గొన్న
యలవిమెఁ నుతింపఁ గంకంటి యప్పఘనుని. 37

క. జననుతుఁ డయ్యప్పఘనుం, డనఘుఁడు చిదురూరినరసయకుఁ దిమ్మమకున్
దనుజామణి యై గుణములఁ, బెనుపొందిననరసమాంబఁ బెండిలియయ్యెన్. 38

సీ. తలఁప సురాధీశుతల్లి గాకుండెనే నదితి నించుక సాటి యనఁగ వచ్చు
రూఢిగా దోషాకరునిఁ బెంపకుండెనే ననసూయ నింత జో డనఁగ వచ్చు
శక్తి గర్భీకరించక యుండెనే నరుంధతి నొక్కగతి నీ డనఁగ వచ్చు
జనులు నిందింప మందునిఁ గాంచకుండెనే ఛాయఁ గొంత సమంబు సేయవచ్చు

తే. నక్కడవ లున్నవార లయ్యతివకుఁ బ్రతి
యాదురే యని బుధు లెంచ నతిశయిల్లె
నప్పయామాత్యమాళి యర్ధాంగలక్ష్మి
నయదయాదిగుణాలంబ నరసమాంబ. 39

క. అన్నరసమాంబయందు స,మున్నతిగుణుఁ డప్పనార్యముఖ్యుఁడు గని యెన్
సన్నుతినిఁ బాపరాజా,ఖ్యు న్నరసింహాభిధానుఁ గులము వెలయఁగన్. 40

తే. వారిలోఁ బాపరాజాఖ్యవర్యుఁ గన్న, వాఁడ నేఁ బూర్వకృతపుణ్యవాసనావి
శేషమునఁగృష్ణదేవునిఁజెలఁగికొలిచి, తత్కృపమహాకృతియొనర్పఁదలఁచినాఁడ.

ఉ. కాంచనగర్భశంకరముఖత్రిదశేంద్రులు ప్రాఘరీతిఁ గీ
ర్తించిన మెప్పుతో విననికృష్ణుఁడు మత్కృతకీర్తనం బ్రహ
ర్షించి వినున్ స్వకీయకృపచే విలసిల్లెడువాక్కులొటఁ దా
ర్పించినచిల్కపల్కు వినఁ బ్రీతి వహింపక యుందురే దొరల్. 42

శా. వైదర్భీవిలసద్విలాసమునఁ జెల్వంబూని సత్యోక్తి నెం
తే దీపించి కళిందజోజ్జ్వలరసాప్తిన్ మించి భద్రాత్మకం
బై దీవ్యద్ఘనలక్షణాశ్రయసమాఖ్యం గాంచుమత్కావ్య మా
హ్లాదం బిచ్చు గ్రహింపఁ గృష్ణునకు నర్హంబే కదా యెయ్యెడన్. 43

సీ. శ్రీరుక్మిణికి మకరికలు చెక్కుల వ్రాసి సత్యకీల్జడకు బూసరులు సుట్టి
జాంబవతికి గొప్పు చక్కఁగా నిడి మిత్రవిందకుఁ బుక్కిటివిడె మొసఁగి
భద్రసిబ్బెంపుగుబ్బల గంద మలఁది సుదంతకు తిలక మందముగ దిద్ది
కాళిందిముఖఘర్మకణము గోటను మీటి లక్షణాయనుగుల లాలించి యుంచి

తే. నీళకు మణివిభూషణపాళి దొడిగి, సవ్యవసనంబు రాధికకిచ్చి మురియుచు
...దిమిన్నలు పదియారువేలు గొలువ, నింపుమీఱంగ నొప్పు శృంగారమంచపతికి.

షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణనిధికిన్, దైవతచాపాంకఘనాఘనప్రతిమకికిన్
లావణ్యరసాంబుధికిని, సేవకసేవధికి మానినీచిత్తావధికిన్. 45

క. పురుషగ్రామణికి సురో, త్కరభృతవరమణికిని బాలతనాప్రాణమరు
ద్ధరణాగ్రఫణికి వినతా, వరమణికి మహాహరోరవర్యాగ్రమణికిన్. 46

క. ఆనతపిందునకున్ శ్రుతి, నానటితపదారవిందునకు నుదితయశో
చానందునకు సదాత్మస, దానందున కనిశశివశతానందునకున్. 47

క. కందళితానందశతా, సందసుతాననాననవనాథ్యతికిన్
గుందశరత్కందమరు, త్తుందభరప్రభువిభాపృథుయశోలతికిన్. 48

క. నీలమణీనీలఘృణీ, జాలత్రుణీకరణనిపుణచారుతనునకున్
శూలధరాభీలకరా, వేలశరాకారిఘోరవిహృతిఘనునకున్. 49

క, వివిధావతారునకు సఖ, రవిజితతారునకుఁ బరధరాతారునకున్
స్తవనదవప్లుషితసుదృ, గ్భవకాంతారునకు భువనభయతారునకున్. 50

క. వ్రజగజగమనాలోలున, కజగరవరజరదవారణాభీలునకున్
సుజనైకకృపాళునకున్, కుజనవిఘాలునకు మదనగోపాలునకున్. 51

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## ప్రథమాశ్వాసము

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీమదుత్తరరామాయణకావ్యంబు మొదట సంక్షేపరూపంబుగా రచియింపం దలంచిన పూర్వరామాయణకథా ప్రపంచంబునకు నాదికారణం బయినసాకేతపట్టణం బెట్టిదనిన. 1

### సాకేతపురవర్ణనము

ఉ. శ్రీతరుణీవిహారసరసీజవిరాజితరాజసౌధసం
ఘాతము గోపురస్ఫురితకాంచనకుంభవిభాభిభూతఖ
ద్యోతము ద్యోతమానమణితోరణవారసమేత మొప్పు సా
కేతము వాతసంచలితకేతుపటప్రహతాభ్రజాత మై. 2

### వప్రవర్ణనము

సీ. కృష్ణపక్షవిభావరీవేళలఁ జకోరసమితి చంద్రిక లంచు సంతసింప
వలిపక్రొండళ్లకుమేల్ వెలిపట్టుఁబుట్టముల్ గట్టినయట్లు దిక్కాంత లలర
గంగాతరంగసంఘము వీటిపైఁ బొర్లి యేలవచ్చె నటంచు నింద్రుఁ డరయఁ
దారకాకైరవోద్యన్నభఃకాసార ముదుటురాయంచలయునికిఁ దెలుపఁ

తే. బరఁగు శరదంబుధరదిగంబరగురుప్రకాశపేశలవజ్రసంఘటితవప్ర
దీప్రరోచిఃపరంపరల్ దివముఁ బ్రాకెఁ, బరతమోలీల దూల నప్పట్టణమున. 3

### పరిఖావర్ణనము

మ. హరిదశ్వస్ఫురదశ్వఘోరఖురభిన్నారామభూనారికే
రరసారుట్ఫలనిర్గళద్విమలనీరస్ఫారధారాధరాం
తరవర్తిష్ణుతఁ దోయపూర్తిఁ గని దానన్ మబ్బు ధారాధరా
ఖ్య రహింపన్ జలరాశి వ్యర్థమయి ఖేయస్ఫూర్తిఁ గొల్చెం బురిన్. 4

మ. పురిఖేయంబుఁ బయోధియుం గని జనంబుల్ రెంటికిన్ భేదమే
ర్పఱుపం జాలక యున్న బ్రహ్మ వివరింపం బూని వారాశిపైఁ
గర మొప్పన్ మణిముద్ర వైచె నది యాఁ గా కున్న నీలచ్ఛవిన్
ధరియింపం గత మేమి యేటికి సముద్రఖ్యాతి మున్నిటికిన్. 5

మ. పరిఖాంభోనిధి నప్పురంబు ప్రతిబింబం బొప్పు నేవేళ దు
ర్ధరభూలోకధురంధరాహీంద్రవపుఃప్రాకారోత్థకీలావళిం
బరితాపంబు వహించి భోగినులతోఁ బాతాళముం బాసి భా
సురవాఃకేళికి వచ్చుభోగవతి యంచుం బోల్పఁగా నర్హమై. 6

## సౌధవర్ణనము

ఉ. నీలపుఱాలమేడలకు నిచ్చలపుంబటికంపుమెట్లులం
బోలు మెఱుంగుగోపురపుముత్తపువాకిటికీలుజాళువా
మేలిపసిండిబొమ్మచనుమిట్టలకుం దెలిచల్వపైఁటిణీ
చేలచెఱంగులై యుచటఁ జెన్నగు వేలుపుటేటిపెందెరల్. 7

సీ. కేళిసరఃపద్మపాళీవిహారి యై కొంచు సుగంధంబు గంధవహుఁడు
లీలాద్రిసన్యామహారావళుల్ డాసి గ్రహియించు విరులచాల్ గగనలక్ష్మి
నూతనాంశుకరత్నకేతనాంశుకయుక్తిఁ బ్రాపించుఁ జిత్రాంబరములు హేళి
గణనీయవివిధతోరణనికాయము లాని మొనయు ముత్తైపుఁ బేరు లనిమిషనది
తే. నర్మహర్మ్యాంతరస్త్రైణనవ్యగాన, కౌశలీద్రవమాణాబ్జకాంతవారి
పుషితచాతక మైనయప్పురవరమునఁ, జతురలంకారవితతు లాశ్రితుల కరుదె. 8

మ. జను లెల్లప్పుడుఁ దోయదానమునఁ జంచత్తాళవృంతానిలం
బునఁ బాంథవ్రజ మొందుదప్పియు శ్రమంబుల్ మాన్పఁ బ్రోల్లచ్చియున్
వనితాగానరసద్రవచ్ఛశిమణీవార్ధారచేఁ జాతకా
వనముం జేసి ధ్వజాశుగాప్తి నడఁచున్ వైమానికశ్రాంతియున్. 9

చ. ఘనజఘనస్తనద్వితయగౌరవముల్ ధరియించి యాకసం
బునఁ జరియింపలేక తమముందట నందముఁ జెందుజాళువా
మినుకుఁబసిండిమేలిపని మెచ్చులమేడలు సూచి పోలి వ్రా
లినయమరీశిరోమణులలీలఁ జెలంగుదు రింగు లప్పురిన్. 10

మ. త్రిదివోద్యానము డాయుమాడువులపైఁ గ్రీడించుపూఁబోండ్లకున్
త్రిదశస్త్రీలు వయస్యలై సవినయోక్తిం జూడుఁ డారంభయి
ల్లదె యాచెంగటిదే తిలోత్తమని కాయ్యం బూర్వశీమందిరం
బిదె యంచున్ వివరించి చూపుదురు వారింపొందు వీక్షింపఁగన్. 11

మ. విధుకాంతోజ్జ్వలసౌధవీథికల తీవిన్ దంపతుల్ గూడి యి
త్తుఫనుఃకేళికిఁ జొక్కి కూర్చుటయు నచ్చో వేకువన్ వందిమా
గధసంఘాతముపోల్కి మేల్కొలుపు నుత్కంఠార్భటిన్ నాకలో
కధునీహాటకపద్మఘాటచరచక్రక్రౌంచచక్రాంగముల్. 12

చ. ఘనతరరత్నసంఘటితకాంచనసౌధము లప్పురంబునం
దనరఁగఁ జూచి భాస్కరుఁడు దైవతశైలము వీసితోడ జో
డనఁగఁ దగుం బరాశుగహాటాంచితశృంగము గాక యున్నచో

నసుచు నసూరుతో ననుఁ దదంతికజాలకమార్గవర్తియై. 13

తే. అహికులము లావరింప నయ్యడుగువట్టి, తెలియఁబడకున్నభోగవతియు దివంబు
పేరుగనియాసురలకుఁ బ్రాపింపఁదగిన, స్వర్గపురము నప్పురముతో సాటియగునె.

—బ్రాహ్మణాదివర్ణనము—

సీ. బ్రహ్మోహమనఁ బోయి భంగమొందినశుచిద్విజవాహనునిసద్వివేక మెంత
యనిశంబు దోషాకరుని కళాళి ధరియించుధర్మాభియాత్రిప్రతాప మెంత
ఘనతరస్వర్ణముల్ గలిగియు మకరసంగతినున్న యక్షేశుకలిమి యెంత [యెంత
యేబు వ్రయ్యలొనర్చి యారుడయ్యఁగఁ జేసి మలయులాహిరికాని మహిమ
తే. యని చతుర్ముఖ చండీశ ధనద సీర, ధరుల సుజ్ఞాన ధర్మ సత్పుణ్యకృషివి [లు.
శేషములమెచ్చ రప్పురిఁజెలఁగు ద్విజశి,ఖామణులు రాజులూరుజుల్ గాఁపుఁబ్రజ

—గజవర్ణనము—

చ. ప్రతిగజశంక నభ్రనికరమ్ము రదమ్ములఁ గ్రుమ్ము దిక్కరి
ప్రతతుల మార్కొనం బిలుచుభంగిని బృంహితముల్ ఘటించు న
భ్రతటినిఁ బద్మముల్ వెనఁచి పట్టి పెకల్చుటకుం బలెన్ సము
న్నతకరముల్ నిగుడ్చు గగనమ్మున కప్పురిమత్తవేనుఁగుల్. 16

—అశ్వవర్ణనము—

సీ. రవగాలునకు సాటి రాక గాడ్పుపటాణి పొదలుసిగ్గునఁ బోయి పొదలఁ జొచ్చె
జోడనల కొకింత జోడు గా నేరక వేల్పురాయని తేజి వెల్లనయ్యె
బలునిబ్బరమునకుఁ బ్రతి గాక గరుడి యనామధేయునివాహనం బనఁ దగెఁ
జుట్టుఁబక్కలకు నించుకయు నీడొందలేకినుహరుల్ పిచ్చుకుంటున కగపడె
తే. నింకనీవాహముల కెద్ది యెన యటంచు, జనులు వొగడ మనోవేగ మెనసిధార
లొలసి లోకప్రసిద్ధుల నూనిమేటి, సాహిణులశిక్ష నరుల నచ్చటిహయములు.

—రథవర్ణనము—

మ. వరనీలోన్నతి మించుటం దనరె దివ్యద్రాజరాజాప్తి భూ
ధరరూఢిం గన నాట శృంగకలనన్ దళ్కొందెఁ గేతుస్థితిం
గర మొప్పరుట నభ్రముల్ దొరసెఁ జక్రస్ఫూర్తి వర్తిల్లుటన్
హరిలీలన్ వహియించెఁ గాంచనశతాంగానీక మాప్రోలునన్. 18

—భటవర్ణనము—

చ. గిరినికరమ్ము లైనఁ బిడికిళ్ల నె వ్రయ్యలొనర్తు రుగ్రకే
సరిసటలైనఁ జేకొని వెసం బెకలింపుదు రత్యయాభ్రవి
స్ఫురదశనివ్రజం బయినచో నటచేతన తట్టి వైతురో
డరు హరుఁడైనఁ బోరులకుఁ డాసినయప్పుడు వీరులప్పురిన్. 19

—వేశ్యావర్ణనము—

సీ. ఓడి డస్సినది గాకున్న నెందులకుఁ గా మబ్బు తద్ధూపధూమమున బలియుఁ
దనకంటె ఘనకాంతి గన కున్న నెల వీని కాశ్రితగతి నేల యావహించుఁ

దమ్ములకంటె నందమ్ములు గాకున్న నంచ లేమిటికిఁ గా ననుసరించుఁ
దమసొంపు గుదియించి తఱుమ కున్నను దార లేటికిఁ గా బట్టబైట వ్రేలు
తే. నని ప్రకీర్తింపఁ దగుకొప్పు లాననములు, చరణయుగములు నఖములు సాటిలేని
పెంపువహియింప నెపుడు నిలింపసతుల, నవతునఁ జెలఁగుదురు వారయువతులచట.

పుష్పలావికావర్ణనము

సీ. పొగడ విరుల్ లేవె మృగరాజమధ్యమ విటరాజ చెంగల్వవిరులు గావె
జాతు లేమైనను సంతరించితె కొమ్మ నేర్చుకోవలసిన నీటుకాఁడ
నగలాఁడి యిచట సువర్ణముల్ గలుగునే కలయిండ్లఁ గలుగును జెలువరాయ
తమ్ములఁ జూపవే తరుణీశిరోమణి యాడఁగాఁ జనిరరే పాడి రమ్ము
తే. వలయుపున్నాగతతు లేవె వన్నెలాఁడి, యేల యడిగెద వీయూర నేమికొదవ
యని విటుల జాణతనమున నపహసించి, పువ్వు లమ్ముదు రవ్వీటఁ బువ్వుబోండ్లు.

మందమారుతవర్ణనము

ఉ. సారవకైరవాంబురుహసారమరందభరంబు సెంది శ్రం
గారవనావలీవివిధకౌసుమరేణువు లూఁది సౌధసం
చారివధూకుచోరుఘనసారమృగీమదగంధసారకా
శ్మీరసువాసనల్ దొరసి మీఱు సమీరకుమారుఁ డప్పురిన్. 22

సస్యవర్ణనము

మ. నగరాధీశునిసద్గుణంబులకు నానందించి దేవేంద్రుఁ డ
న్నగరీరత్నముచుట్టునుం గురియుస్వర్ణగ్రావచూర్ణంబు నాఁ
దగు నంచత్సరయూనదీనికటకేదారంబులం బండి సో
యగమై యెన్నులవ్రేఁగునన్ ధరణి మ్రొయన్ వ్రాలి సస్యావళుల్. 23

పూర్వరామాయణకథాసంగ్రహము

క. ఆప్రోలమరావతి యమ,రప్రభుఁ డేలుగతిఁ బంక్తిరథుఁ డేలు దినేం
ద్రప్రతిభాసుప్రతిభా, దీప్రశుభాన్వితగుణప్రతిష్ఠానిధియై. 24
సీ. తనయాజిభావంబు గనిపించె సకలసన్నుత సత్కళాప్రవీణత వహించి
తనగభీరత సూపెఁ దటినీమనోహరప్రఖ్యాతసఖ్యసంపదలఁ జెలఁగి
తనప్రభావము దెల్పెఁ దపననందనగర్వనిర్గ్రంథనక్రియానిరతిఁ దనరి
తనతేజ మెఱిఁగించె ననిమిషేశ్వరవజ్రదుస్సాధదైత్యపంక్తుల వధించి
తే. రాజమాత్రుండె యష్టదిగ్రాజవినుత, రాజితయశఃప్రతాపనిర్దళితరాజ
హేళి రిపురాజభయదాజికేళీ రాజ, రాజధనశాలి దశరథరాజమౌళి. 25
తే. ఆనరేంద్రుండు బంధుసంతాన మలరి, పొగడ సంతానభూజంబుపగిదిఁ బెద్ద
కాల మిల యేలి సంతానకాంక్ష మించి, శిష్టసమ్మతి నొకయిష్టి సేయునపుడు.
మ. అమరుల్ విష్ణునిఁ జేరి పంక్తివదనుం డత్రాసియై గాసి సే
య మఱల్లోకము సంచలించె నిఁక మమ్మాపన్నులం బ్రోవ నా

యమరుల్ నీకెదురే జయింపఁగదవయ్యా యన్న లేనప్పుడా
య మరుల్ గొల్పుచు వారి వీడ్కొలిపి దైత్యచ్ఛేదనోద్యోగియై. 27

సీ. శ్రీసూర్యకులసుధాసింధువాకాంక్షించి పాలమున్నీటిపై బాళి మాని
సహసముద్భూతవాత్సల్య ముంపఁ దలంచి చిలువరాపాన్పుపై నెలమి మాని
యవనీసుతాంగసౌఖ్యము గాంచఁ గామించి కలిమితొయ్యలితోడి చెలిమి విడిచి
యలఘుమానుషలీల లవధరింపఁ దలంచి తనయమానుషచర్యయును దొఱంగి

తే. వనచరత్వంబుఁ బూని ప్రోవఁగఁ దలంచి
బ్రహ్మరుద్రాదిదేవతాప్రభులమీఁది
హాళియును మాని నందకాద్యాయుధాభి
రాముఁ డయ్యెడ దశరథరాముఁ డయ్యె. 28

సీ. చలిగట్టుదొరపట్టి జపియించుమంత్రంబు వేయితేఁపలతమ్మి వెఱయునంచ
పలుకుఁగొమ్మకు తేనెఁ గలిగించుతొలిపెద్ద యీరేడుజగముల నేలుఱేఁడు
ప్రాబల్యజవరాండ్రబలఁగంపుముచ్చట పినునీటఁ దేలాడుపిన్నపాప
మరుగొంగతలఁపుదామరమీఁదిమెలదేఁటి కలిమియొయ్యారినోములఫలంబు

తే. కటికచీఁకటి వెలుఁగునొక్కటి వెలుంగు, మేటి రేద్రిమ్మరుల గెంటుపోటుబంటు
తొగలఁదమ్ములఁ బ్రోచుకందోయిఁ జూచు వేల్పు కౌసల్యకొమరుఁడై వృద్ధినొందె.

క. దారకుఁ డయి రఘువీరుఁడు, దారకుతూహలముతోడఁ దండ్రి వనుప బృం
దారకు లెంచఁగ మునిబృం, దారకుఁ గ్రతురక్ష కరిగెఁ దమ్ముఁడు గొలువన్. 30

వ. ఈవిధంబునఁ గౌశికతపోవనంబునకు సవనావనంబు సేయం జనినతదనంతరంబ.

సీ. హోమధూమంబుతో వ్యోమంబు వ్యాపించె భీమదైత్యస్తోమధూమరుచులు
సవనాగ్నిశిఖలతో దివిఁ బ్రాఁకె రేగాము కఱకుజుంజుఱు వెండ్రుకలబెడంగు
లనలకుండస్ఫులింగాళితోఁ జవులాని నసురదంష్ట్రోద్ఘట్టనాగ్నికణము
లలఘుమంత్రారవంబులతోడ నిండె నాకసము రాక్షసచమూకలకలములు

తే. జటిలసంకల్పములతోడఁ జటులదనుజ
కుటిలసంకల్పములు మీఱెఁ గుశికతనయు
డసదృశప్రజ్ఞ రాఘవునాజ్ఞచేత
యజ్ఞదీక్ష వహించినయాక్షణమున. 32

ఉ. దానవినీతినీతిగుణధాముఁడు రాముఁడు దొల్తఁ దాటకా
దానవిప్రాణముల్ గొనినదారుణశాతశిలీముఖంబునం
దా నవిరాజముక్ నముచిదానవసూదనుఁ డుర్విఁ గూల్చుచం
దాన విరాజమానభుజదర్పముతోఁ గెడపెన్ సుబాహునిన్. 33

క. పారమ్ము లేనివడి గల, పాఱమ్మున రఘువరుండు వడ నేసె నకూ
పారమ్మునఁ గుటిలవ్యా, పారమ్మున మెలఁగునలఘుబలు మారీచున్. 34

వ. అప్పుడు. 35

ఉ. జన్నము నిర్వహించి తని సన్నను లెంచఁగ నింతచిన్నరా
జన్నము గల్గఁ జేసె మన కందఱ కంచు సురల్ ప్రకీర్తనం
బన్న మునీంద్రుతో జనకుపాలికిఁ బోవుచుఁ ద్రోవ శాపపుం
బన్నముఁ బాపె గౌతమికి భానుకులుండు నిజాంఘ్రిసంగతిన్. 36

సీ. నిటలాక్షుధనువు ద్రుంచుటకుఁ గౌశికుఁ డెట్టు లనుమతించెనటంచు నమరు లనఁగఁ
జెలికాని ధర్మంబుఁ జెఱుపఁ గాకుత్స్థుఁ డేతెంచెఁబో నని శైవగణము నుడువఁ
గడిఁదివిల్ దునియుచప్పుడు వీనులకు విందు సేయు నెప్పు డటంచు సీత దలఁప
నిటఁ డల్లుఁ డైన శ్రీపతిమాను మసురమూజనకుఁబోల నె యంచుజనకుఁ డెంచ

తే. హరధనుర్భంగకార్య మెవ్వరికిఁ దెలిసి, సూడు పుట్టింతు నని నిల్చుచో నిలువక
కలహభోజనసాని నల్లడలఁ దిడగ, శివునివిలు ద్రుంచె రఘువీరశేఖరుండు. 37

మ. హరకోదండవిఖండనప్రవణబాహాదండపాండిత్యవి
స్ఫురణం జెందినకీర్తిలక్ష్మివలె భూపుత్త్రీలలామంబు సే
కుఱ నక్కోమలికొప్పుఁ దేఁటి సెగకుర్ గుందంబు లర్పించుపో
ల్కి రఘుగ్రామణి క్రొత్తముత్తియపుఁబ్రాల్నించెన్ వివాహంబునన్. 38

ఉ. భాసబశూరునిం జెనకుపార్థివు లెవ్వ రటంచుఁ గేడడం
బాడి బలాయి దేటిమద మంచు భృగూద్వహుగర్వవార్ధికిన్
బాడబ మాప్రతాపము గనంబడఁ జేసి దివిన్ సురీజనం
బాడ బలంబుతో రఘుకులాగ్రణి సేరె నయోధ్య వేడుకన్. 39

మ. తనుహేమం బధరాబ్జరాగమణియున్ ధమ్మిల్లనీలంబు నా
ననపద్మంబు నఖాంశుమౌక్తికవితానంబున్ గటీచక్రముం
స్తనదుర్గంబులుఁ గల్గి రాజ్యరమచందం బొందుభూపుత్త్రితో
జనకాజ్ఞన్ వనిఁ జేరె రాముఁ డెలమిన్ సౌమిత్రి సేవింపఁగన్. 40

సీ. చిత్రకూటమణీవిచిత్రకూటసుఖేటచిత్రకూటస్థలాసీనుఁ డగుచు
దండకాశరభవేదండకాసరముఖోద్దండకాననమృగధ్వంసి యగుచు
మానవారితపూజ్యమానవాసవిరాధమానవాదహిమోగ్రభానుఁ డగుచు
దానవాగ్నిభిదానిదానవార్యభయప్రదానవాక్పరితుష్టమౌని యగుచు

తే. దూషణాలాపఖరఖరదూషణాము, రేషణద్వేషణానీకశోషణాతి
భీషణాశనిఘోషణాశ్లేష్మణాస్త్ర, పోషణుఁడు మించె రఘువంశభూషణుండు. 41

వ. తత్కాలంబున, 42

ఉ. శూర్పణఖోక్తిమారుతము సోఁక దశాస్యుఁడు కోపవహ్నియున్
దర్పకరోషవహ్నియు నెదం దగులం దగునీతి డెందమున్
జేర్పక మాయలేడివలెఁ జేసి సుబాహునియన్న నంపినన్
దర్ప మెలర్ప వాఁడు రఘునందనుముందర చేష్ట లొందఁగన్. 43

పంచచామరము. నరాదుఁ డీమృగంబు డంబునన్ వనంబులోనఁ గా

నరా దురాశ సీత దెల్పినన్ నరేంద్ర వేఁటఁ బూ
నరాదు మాయ యంచుఁ దో డనంగ నవ్వకొంచుఁ గి
న్నరాదు లెంచ రామభూమినాథుఁ డేఁగె వెంబడిన్. 44

శా. సారంగంబు దయాంతరంగమున మున్ సంరక్ష గావించి యా
సారంగంబు హరించు టెట్లనక కాంక్షన్ సీత వర్షాబ్దమున్
సారంగంబువలెన్ నిజాగతిఁ దలంచం దన్నఃపద్మినీ
సారంగంబు విభుండు పట్టువడ కేఁచన్ లేడిఁ జంపెన్ దుదిన్. 45

వ. ఇవ్విధంబున గుహానాహారిణంబున్ మరణంబు నొందించి యుత్తరణికులాభర
ణంబు మరల నరుదెంచి పంచవటిం బ్రవేశించి. 46

చ. అవనిజఁ బర్ణశాలకడ నారసి కానక రాముఁ డింపు వా
య వనిఁ జరింపుచుం జని జటాయువు దెల్పఁగ భార్యకార్య మొ
ప్ప విని ఘనాకబంధునిఁ గబంధునిఁ ద్రుంచి కిరాతిపూజ ల
ప్పవినిభనాయకుండు గొని పంపకడన్ వసియించి యున్నెడన్. 47

సీ. హిమధామకరకుందసుమధామశరబృందసమధామమై జన్నిదము పొసంగ
వినుఁగెంపునగఁజాలునునుఁగెంపుతెగడాలు మొనయింపుకుండలంబులు వెలుంగ
శుచిరత్నవరనీలరుచినూత్నహరినీలసుచిరత్నహారరోచులు సెలంగఁ [హింపఁ
దులకించుతోలుకారు బలుమించుఁ బలుమాఱు నలయించుమేనికాంతులు ర

తే. బసిఁడిముంజియు హొంబట్టుబంచ హేమ, కంకణంబులు నరుణముఖంబు దీర్ఘ
వాలమును గల్గునొకమహావానరుఁడు, వచ్చి పొడగన్న రఘువంశవర్యుఁ డలరి.

ఉ. ఆయన భక్తియుక్తిఁ దన కంబుజమిత్త్రునిపుత్త్రు మిత్త్రునిం
జేయ బహూకరింపుచు నజేయభుజాయతశక్తితో శతా
రాయుతశాతబాణహతి నైంద్రి సురేంద్రునిఁ జూడ నంపి తా
రాయుత మైనప్రాజ్యకపిరాజ్య మొసంగెఁ బతింగనూతికిన్. 49

క. ఈలాగున రఘువీరన్నృపాలుఁడు సుగ్రీవునెడఁ గృపాళుం డగుచున్
మేలు ఘటియించి కపిపద, మేలు మనుచు వాన కొక్కయెడ వసియించెన్. 50

వ. తత్కాలంబున. 51

సీ. కాదంబినులు మానసోదంబులనె యుండెఁ గాదంబినులు నభోంగణము నిండెఁ
జాతకంబులు జాలిఁ జాలించె దవశిఖాజాతకంబులు సముజ్జ్వలత డించెఁ
బుండరీకముల భూపుఁడు డాఁప సెలవిచ్చెఁ బుండరీకములగుంపులును హెచ్చెఁ
జంచలాలోకాప్తి సంసారి వర్తించెఁ జంచలాలోకాప్తిఁ జదలు మించె

తే. స్తనితములు మీఱెఁ గరకలు ధాత్రి జాఱె
నదులు వడిఁ బాఱె మృగములు పొదలు దూఱెఁ
గర్షకుఁడు మెచ్చె వలిమిరిగాడ్పు హెచ్చె
వనధి బహుఘోషమున నార్చె వాన పేర్చె. 52

ఉ. వాన కరంబు దీఱుటయు వానరనాథుఁ డనేకసేనతో
మానవనాథుఁ గాంచి బహుమానవచోగతి కుబ్బి జానకీ
మానవతిం గనంగ నసమానవనాటులఁ బంప వారలున్
మానితమానితన్ జడిమ మాని తదాజ్ఞఁ జనంగ వారిలోన్. 53

క. పావని తారకమంత్రజ, పావని రఘువీరుఁ డనుప నరిగెఁ ద్రిలోకీ
పావని వెదకుటకుఁ దలం, పావనితాలోకనార్థ మై త్వరపడఁగన్. 54

వ. ఈచందంబునం బవననందనుండు జనకనందినీసందర్శనంబు సేయం జని. 55

సీ. తనధైర్యరమ కోర్వ దనినట్లు లోకగట్టువడి మెట్టి యొకగట్టు జడియదాఁకెఁ
దనగభీరతఁ జాల దనులీల జలరాశి మేజవంబునఁ గ్రిందుమీఁదు చేసెఁ
దనయణుత్వముమహత్త్వముఁ దెల్పుచందాన సురసలోఁ దనులీలఁజొచ్చి వెడలెఁ
దనలోకబాంధవత్వము గోచరము సేయుకరణి ఛాయాగ్రాహకత్వ మొందెఁ
తే. దనతపఃఫలదేవతఁ గనినసరణి, ధరణిసుత లంకలోఁ గాంచెఁ దనహరిత్వ
మెఱుక గావించుజోక ననేకదైత్య, వరమదేభంబులనుద్రుంచె వాయుసుతుఁడు.

వ. మఱియును. 57

మ. పురదాహం బొనరిం మశూలివలె నంభోజాప్తభూమంత్రిభీ
కరవాలానలకీలికావళుల లంకాదాహముం జేసి ముం
దరరామాస్త్రపరంపరాగ్నిశిఖ లీదారిం బ్రవేశించు నం
చరులెల్లన్ వినఁ బల్కి వచ్చి సతిమే లాత్మేశుతోఁ దెల్పినన్. 58

మ. పరమానందమునన్ విభుం డనిలభూబాహాప్రతీపప్రతా
పరమావైఖరి కాత్మ మెచ్చి శుభ మాపాదింప నాపత్పరం
పర మాన్పన్ నినుబోఁటిబాంధవుని సంపాదింపఁ గల్గెన్ దయా
పర మాకేమికొఱంత యం చతని సంభావించి దీవింపుచున్. 59

సీ. పటువనాటకవీరభటమహోర్భటులచే వనమార్గమార్గముల్ వనటఁ జెంద
నగచరవ్యాయామనాదంబుచేఁ బ్రతిధ్వనిమిషంబున ధరాధరము లడలఁ
బ్లవగవేగాటోపబాహుళ్యమున నదీగణము లుత్తుంగభంగముల నొలయ
హరియూథపులయట్టహాసంపురవళిచేఁ బూర్వాదిదిగ్గజంబులు చలింప
తే. బలసి బహువాహినీప్రభుల్ గొలువ రామ,విభుఁడు దక్షిణవాహినీవిభునిఁ జేరి
విరహవారాశిదరిఁ జేరువిధము దోఁపఁ, దత్తటంబున దిటముతో దండు విడిసె.

వ. తదనంతరంబున. 61

తే. దశముఖుఁడు యుద్ధచలితత్రిదశముఖుండు
తన్ను నయమార్గ మెంచక తన్నుటయు వి
భీషణుఁడు ధర్మదూరవిభీషణుండు
శరణు శర ణనె ఖరవినాశరణుఁ జేరి. 62

క. పగతునియనుజు సమీపో,పగతుని దయఁ బ్రోచి విభుఁడు పౌలస్త్య వధిం
పఁగ దేవ త్రోన యిటఁ జూ, పఁగదే యని మూఁడునాళ్లపాంపతి వేఁడెన్. 63

వ. ఇవ్విధంబున. 64

మ. పలుమాఱుం దను వేఁడు రామవిభునిం బాటింప కుత్తుంగభం
గలసత్తోయభుజంగసంఘఫణభాగప్రాఘరంగత్తిమిం
గిలవాలప్రహతప్రవాళశకలాకీర్ణారుణార్ణఃప్రభా
కలనం దేజము నూపె వార్ధి జడధుల్ గైకొందురే ధీరులన్. 65

క. తనవారిసత్త్వగతిచే,త నలారితనాద మగునుదధిఁ జూచి విలో
కనజరదనలశిఖుం డై, కనలుచు రఘువీరుఁ డుగ్రకార్ముక మూనెన్. 66

వ. ఇవ్విధంబున నుద్దండకోదండమండితకరుం డై యచ్చండకరకులుండు ప్రచండ రోషరసావేశంబున వారిరాశిం గనుంగొని. 67

సీ. మొగు లానిసపరాగములు పరాగములు శతకోటిశితకోటిశరము లేసె
గగనంబునొరయుభంగములుభంగములుగాఁ జటులబాడబశిఖాస్త్రములువఱపె
సవరై నజలకరేణువులు రేణువులుగా హరిదంష్ట్రికోగ్రసాయకము లనిచెఁ
గమఠమీనాదికాంగవిభూతి భూతిగాఁ గాలాగ్నితులితాంబకములు నించె

తే. మహితవిద్రుమములు విద్రుమములు గాఁగ
లలితమణిజాలములు జాలములును గాఁగఁ
గ్రకచముఖనిష్ఠురశిలీముఖములు గురిసె
వారినిధిమీఁద రఘువంశవర్యుఁ డడరి. 68

క. భువనములు దలఁకఁగాఁ దన, భువనము లింకించు రామభూపతి జితవా
సవి నయవిధిఁ గని జలనిధి, సవినయముగఁ గదిసి మ్రొక్కి సంస్తుతిఁ జేసెన్. 69

సీ. శ్రీకరరఘుకులక్షీరాంబునిధిసోమ సోమముఖ్యామరస్తోమధామ
ధామనిధిప్రశస్తప్రతాపోదార దారకత్వవిదారితారివీర
వీరభద్రోన్నిద్రవీరరసాధార ధారణాభ్యాసచేతఃప్రచార
చారుణశ్రీవిలాసనిరస్తరాజీవ జీవభావైక్యసృష్టిప్రదాన

తే. దానవప్రాణహృతిబాణతతిభుజంగ, జంగమస్థావరరచనాంచత్ప్రభావ
భావనాదూర బహుపావనావతార, తారకబ్రహ్మనామ కోదండరామ. 70

మ. శరముల్ దావకృశానుకీలల వినాశం బొందుచందాన నా
శరముల్ డిందె భవత్కరస్థలమిళచ్చాపప్రయుక్తంబు లౌ
శరముల్ డాసినయంతి నీ కెదురె యీసప్తాంబురాసుల్ జితా
శర ముల్లోకములుం జలించె నిఁక రోషం బూనకే నావుఁడున్. 71

క. జలధిక్ రఘుపతికరుణం, జలధిం గానీక కాచి సరగఁ దదాజ్ఞన్
నలుచే రిపుసైన్యదవా,నలుచే సేతువు ప్రియంబునం గట్టించెన్. 72

చ. కపులు హితోచితక్రియలు గైకొని చేయుటయుం బయోధిపై
విపులశిలాపరంపరలు వేసినఁ దేలుటయున్ నరుల్ నరా
దపుల జయింపఁ బూనుటయుఁ దా విపరీత మటంచు రావణుం
డపుడుఁ దలంచెఁ గాని కనఁ డయ్యెను రాముప్రభావ మెంతయున్. 73

మ. పదవిధ్వస్తగిరుల్ గపీంద్రులు భజింపన్ దేవభూదేవతా
పదవిచ్ఛేదనవజ్రి రామధరణీపాలుండు సేతుస్థలీ
పదవిం బోయి సువేల మెక్కి యెదుటం బౌలస్త్యు ప్రోల్ గన్నసం
పద విన్నట్టుల చూచి సైనికులఁ బంపన్ వార లత్యుగ్రులై. 74

స్రగ్ధర. కారాకూరంబులై రాక్షసులహృదయముల్ గాడ్పడన్ రామునాజ్ఞం
గారాకుల్ డుల్చువాత్యాగణముపగిది వేగంబు మీఱం బ్రదీప్రా
కారాఘ్యుల్ వీరవర్యుల్ కపులు గదిసి లంకాపురీగోపురప్రా
కారాదుల్ గూల్చి కారాగతసురవనితాక్లాంతి మాయించి రంతన్. 75

మ. రవిపుత్రాంగదజాంబవత్పవనభూరంభప్రజంఘాంజనా
ధవనీలర్షభతాలధూమ్రనలమైందశ్వేతముఖ్యుల్ ప్రహ
స్తవిరూపాక్షనరాంతకప్రముఖదైత్యగ్రామణుల్ మార్కొనన్
బవరం బయ్యె సురాసురాదిసమరస్పర్ధాళుతాత్యుగ్రమై. 76

సీ. అత్రాసహస్తప్రహస్తాద్యదైత్యవిధ్వంసినీలాదియూథపమహోగ్ర
మనలధూమ్రాక్షదేవాంతకప్రముఖేభపంక్తిహారీభవత్పవనభవము
ఘటకర్ణపటునాసికాకరనిగ్రహోగ్రహారవిగ్రహకుమారప్రచార
మతికాయమేఘనాదతమోవినిర్భేదమిత్రాయమాణసౌమిత్రిశరము

తే. భూరిబలమూలబలవనప్లోషరోష, భీమరఘురామసాయకస్తోమభూమ
దావపావకశలభీకృతత్రిలోక, కంటకదశాస్య మగుచు నక్కదన మమరె. 77

చ. సమరనిదాఘవేళ శరశాతకరంబుల రామభాస్కరుం
డమరవిరోధిరాజకుముదావలి నొంచి తపస్విమానసా
బ్జము లలరించి వేల్పుఁగవజక్కవలన్ వెలిఁగించి లోకశు
క్తమము లడంచి తోరపుఁబ్రతాపమునన్ వెలుఁగొందె నయ్యెడన్. 78

మ. నటదాదిత్యవధూటిశాతమవితానశ్రీలు సౌదామనీ
పటలచ్ఛాయలుగా నభస్తటరటత్వాకాభియాతిస్ఫు
త్పుటహాధ్వానము గర్జగాఁ గురిసెఁ గల్పక్ష్మాజసూనచ్ఛటా
పటువర్షంబు దశాస్యకోపపరితప్తక్షోణిపైఁ జల్లఁగన్. 79

సీ. అని దీర్ఘనిద్రఁ జెందినవనేచరకోటి బ్రతికించి యాశ్చర్యరసముఁ జూపె
శుచిముఖంబున నిత్యశుచి యైనసీతతో రహిఁ గూడి శృంగారరసముఁ జూపెఁ
బగతుసోదరునికిఁ బ్రాజ్య రాజ్య మొసంగి రక్షించి కారుణ్యరసముఁ జూపె
నర్కజాదులుగొల్వ హైమపుష్పక మెక్కి ప్రభుతఁ గైకొని శాంతరసముఁ జూపెఁ

తే. నల భరద్వాజమునివిందు లారగించి
సంతసమెసంగ స్నేహాతిశయముఁ జూపె
భరతుక్షేమంబుఁ గన వాయుభవునిఁ బంపి
దశరథసుతుండు భ్రాతృవత్సలతఁ జూపె. 80

క. ఆనందించుచు రఘుపతి, యానందిగ్రామమునకు నటుల యరిగి సీ
తానుజపరిజనయుతుఁ డై, తాను జతురలంకృతులు నుదారతఁ బూనెన్. 81

వ. ఇవ్విధంబునం జతుర్విధాలంకారచారుశరీరుం డై తదవసరంబున. 82

సీ. తనదివ్యమకుటంబు దనడంబున ననంతమణిసంతతిద్యోతమహిమఁ గాంచఁ
దరకాంచనరథంబు దనవిధంబున సమాశ్రితదేవతానగశ్రీ రహించ
దపసితచ్ఛత్రకేతనరాజి దనలీల ఘనమార్గవర్తిష్ణుగతి వహించఁ
దనపార్శ్వచామరద్వంద్వంబు దనయట్ల సరిలేనిశరకళాస్ఫురణ మించఁ

తే. దనపురోవీథిమ్రోయువాద్యములు దనమ
హోద్యమంబులవలెఁ ద్రిలోకోత్సవప్ర
దానహేతువు లై దిగంతముల నొలయ
రామచంద్రుం డయోధ్యాపురంబుఁ జేరె. 83

శ్రీరామచంద్రపట్టాభిషేకమహోత్సవము

సీ. కనఁ గల్గె నేఁటికై నను రాము ననుచుఁ గౌసల్యాదిజనము లుత్సాహ మొంద
రామ సీకీర్తి యారవిచంద్ర మవుఁగాత మని వసిష్ఠుండు దీవన లొసంగఁ
దమపు సేసినసుధర్మములు నేఁడు ఫలించె నని పౌరు లుత్సవమ్మున మెలంగ
సకలదేశాధినాయకులు గానుక లిచ్చి యలికకీలితహస్తు లై భజింప

తే. భరత లక్ష్మణ శత్రుఘ్న పవనతనయ
భాను జాంగద జాంబవత్ప్రముఖధన్య
లుచిత మగునూడిగములు సేయుచును గొలువ
రాముఁ డప్పుడు పట్టాభిరాముఁ డయ్యె. 84

సీ. కమనీయరత్నోర్మికలఁ బూని సితఫేనచందనాంగకుఁ డయ్యె సాగరుండు
పైరుపచ్చలతాళి మీఱ మొల్కలగసుర్పాటుఁగంచుక మూనె రత్నగర్భ
వినుఁగెంపుఁబతకంబు గనిపింప సురదీర్ఘి కాచేల యై మించె గగనలక్ష్మి
విమలకోరకమౌక్తికములతోఁ జిగురుఁగెంబట్టుఁబుట్టముఁ గట్టె బహువనాళి

తే. కుంభికుంభాగ్రశోణమృత్కుంకుమంబు, దంతరుచివజ్రహారముల్ దాల్చె దిశలు
సీతతోఁ గూడి సరిలేనిచెలువు పూని, శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁ డైన. 85

శా. దిగ్దంతుల్ నిదురించె నిర్భరతఁ జెందెన్ భూధరంబుల్ మదు
ద్యద్గర్వేంద్రుఁడు భోగినీరతిసుఖంబుల్ గాంచె యజ్ఞాంగతి
ర్యగ్గ్రాహంబు శమించె నాటవిడు పైన ట్లుండెఁ గూర్మంబు స
మ్యగ్దోర్దండమునన్ ధరాభరము రామక్ష్మావరుం డూనినన్. 86

వ. ఇత్తెఱంగున నత్తరణికులగ్రామణి సకలదిగ్రామణీయకయశశ్చంద్రచంద్రికా విశేషంబున నశేషబుధలోకచకోరకంబులతో నతజనమహోత్పలంబుల నలరింపుచుం దామసగుహాంధతమసంబుల విరియించుచు సింధురాట్చతుష్టయపరివేష్టితబంధుర వసుంధరాభారధురంధరుం డై యొక్కనాఁడు పూర్వపర్వతోర్వీరమణశిరోభాగభాగరుణమణిప్రభాగణితమకుట ప్రకటాతిశయంబునకు నికటంబయి యంబుజప్రియబింబంబు డంబు సెందకయ ముందర నమందమకరందరసాస్వాదనానందరంగద్భృంగసంఘాతసంగీతప్రసంగంబులతో వికసించుసితకమలంబులవిమలప్రకాశంబునఁ జెలువొంద వందిమాగధజనబృందాభినందనంబునం దననేత్రారవిందంబులు విచ్చి మచ్చికతో నెదుట వచ్చి నిలుచున్నపుడమికన్నె చిన్నారినగుముద్దుమొగంపుటద్దంబుం గనుంగొనుచుం బాన్పు డిగ్గి సమయోచితాచారంబులు సంఘటించి కొలువు సింగారం బై యభంగతరాష్టాంగవజ్రమయకుడ్యమహాష్టాంగసంగంబునం గనుపట్టు గట్టురాయనిపట్టి నెమ్మేనిచాయలం దొట్టినగట్టిసీలంపుదూలంబులదిటతనంబు లెచ్చరించి హెచ్చునంబయిపయిం గ్రచ్చుకొనుపచ్చఱాచుఱుంగులపచ్చలచ్చజిగిపచ్చికలనిమచ్చికలతో వచ్చి మూర్కొనులీలాబాలకురంగంబులకు బెదరు పుట్టించుపులిచర్మంబులుగలచిత్తరుఁదపసులపెన్జడలకెంజాయవలెఁ బుంజి గనుమంజులప్రవాళమహాస్తంభంబుల రంగారుబంగారుబొమ్మల ప్రతిబింబంబులకు నెలవైన నిర్మలచంద్రకాంతజగతీస్థలంబులను గంగాజలంబులం దోఁగుచందువాచెందామరకెందొగలపువ్వుతెగలం గ్రందుకొనుతుమ్మెదలయెమ్మెల కిమ్ముఁ జూపునాంబ్రాణిధూపధూమంబులతో వాసించుప్రాలం బకుసుమమాలికాపరంపరలకాంతిసంపదలకిరుగుపొరుగులగు సోరణగండిగొప్పసువ్వాణిముత్తెంపుఱాలతండంబులు భుజగాండకాండంబు లని నిండుకొనుగృహమయూరికల విప్పు గలపించెంబులయొప్పులనుప్పతిల్లు కొలువువెలయొప్పులాడుల కప్పుఁగీలుకొప్పులకు క్రొమ్మొగిలులకు మెఱుంగు లగుతదుపరిపరివేష్టితకాంచనదామంబులతోఁ బురుడించుకాంచనతోరణస్తంభంబులు నిజమణినభోమణికాంతిపరీక్షార్థం బరుణబింబంబు నంబరకలితకరాగ్రంబులం బిలుచుచున్నవా యనఁ జెన్నగునున్నతధ్వజపటలంబులపటాత్కారంబుల కళుకుపద్మరాగవిటంకభాగరటత్పారావతవారంబుల యారావంబు మించినరఘువీరునగరివాకిట నుండియు జలధిఘోషం బేల బేలతనంబున నేర్చితి రని సుధాగౌరవర్ణచ్ఛలంబున వాని నగుసౌధలక్ష్మినవ్వులవెన్నెలలముకుళించిన కెందమ్మిమొగ్గ లన నగ్గలం బగుపసిండిచూరు మొగ్గలనిగ్గుల జగ్గుమను పుష్యరాగవలభీప్రతానంబులతో నుప్పరం బొరసి యుబ్బుచప్పరంబులలోపల నేపొందు స్ఫటికోపలసోపానమార్గంబుల చెంగటికురంగనాభికాపంకసంకుమదపంకిలాంగణంబులు రంగయిన మణిమయరంగవల్లికలప్రభావల్లిక లల్లుకొనఁ గొల్ల లగు ఫలపుష్పభరానమ్రకమ్రతరకనకకదళికాక్రముకతరు సం

భంబుల మీఁదు ప్రతిద్వారంబులఁ దీరయిన నవరత్నఘటిత కవాటదేహళీవిశే
షంబులవాటం బగుకొలువుకూటంబుఁ బ్రవేశించి భద్రాసనాసీనుం డయి నలు
వంకలభరతలక్ష్మణశత్రుఘ్నహనుమత్సుగ్రీవాంగదనలనీలజాంబవద్విభీషణాదులు
సేవింప నిండుకొలువున్నసమయంబున. 87

కణ్వాదిమహర్షులు రాముం జూడ వచ్చుట

సీ. కణ్వగాలవగార్గ్యకౌశికవరతంతురోమశాదికులు తూరుపుననుండి
విముఖశంఖదళాదసుముఖాత్రికుంభజప్రముఖమౌనులు దక్షిణముననుండి
జాబాలికుత్సత్రిశంకులోధ్రికధూమ్రమంకణాఢ్యులు పశ్చిమముననుండి
వత్సకశ్యపభరద్వాజగౌతమపౌండ్రజమదగ్నిముఖు లుత్తరముననుండి
తే. ప్రాప్తసామ్రాజ్యవిభవుఁ డై బాగుమీఱు
దనుజసంహారు రఘువీరుఁ గని ప్రశంస
సేయుతలఁపుల శిష్యప్రశిష్యకోటి
గొలువ నరుదెంచి మొగసాల నిలిచి రపుడు. 88

మ. మును లేతెంచినవార్తఁ దెల్పు రఘురాముం జేరి నీ వం చగ
స్తి నియోగించిన ద్వారపాలుఁడు సముద్రేకత్వరం బోయి రా
ముని సేవించి పరాకు స్వామి ఘటభూముఖ్యవ్రతుల్ వచ్చినా
రని విజ్ఞాపన మాచరించుటయుఁ దా నత్యంతహర్షంబునన్. 89

శ్రీరామచంద్రుఁడు మునుల నెదుర్కొని సత్కరించుట

ఉ. బంగరుకొండనుండి దిగుబాలదివాకరులీల రాముఁ డు
త్తుంగమణీమయాసనముఁ దొరపువేడుక డిగ్గి యంగ ము
ష్వాంగ మహర్షులం గదియఁ బోయి నమస్కృతు లాచరించి భ
క్తిం గరముల్ మొగిడ్చి తోడితెచ్చి సభాంతరరత్నవేదికన్. 90

చ. కుశమృగచర్మసంకలితకోమలకాంచనరత్నపీఠులం
గుశికసుతాత్రికణ్వభృగుకుంభజముఖ్యుల నుంచి పూజనా
తిశయవిశేషగౌరవవిధేయగుణంబుల నింపొసర్చుచున్
దశరథనందనుం డను నదభ్రనవాభ్రనదభ్రమార్భటిన్. 91

మ. కుశలంబే. మునులార శిష్యులకు మీకున్ శిష్యసంఘం బహ
ర్నిశమున్ సేవలు సేయునే తపములున్ నిర్విఘ్నతన్ సాగునే
కుశపర్ణాంబుఫలాదు లబ్బునె వనక్షోణిన్ మిముం జేరి దు
ర్దశ లెవ్వారును జేయకుందురుగదా తథ్యంబుగాఁ దెల్పరే. 92

మ. భవదాశీర్మధువైభవంబునఁ గదా ప్రాప్తించు మాదృగ్భుజా
భవదావంబు యశఃప్రతాపసుమశుంభత్పల్లవంబుల్ మహా
భవదాహంబు శమించు మీపదజలప్రాశంబునం బద్మభూ
భవదామోదరు లైనమీ రలిగినన్ భాషింపఁగా శక్తులే. 93

సీ. ఊరుభాగమున భూభార మిమ్మని దాల్చె బ్రహ్మయష్టినె యత్తపస్వి పూనె
నలత్రిమూర్తులఁ బుత్త్రకులఁగ నియ్యతి గాంచె నలిగి వారల నమ్మహర్షి తన్నె
భువనసృష్టికి మాఱు పుట్టించె నిమ్మౌని పూని యాయన మ్రింగె భువనరాశిఁ
దనయోగమహిమ నిత్తపసి క్రోధు జయించె నడఁగ కుగ్రతనుగ్రునతఁడు గెలిచె

తే. యోగమహిమంబులను మెచ్చ రొకరి నొకరు
యోగ మన్నను నవ్వుచు నుందు రెపుడు
వింటి మీచర్య లెద మెచ్చుకొంటి నిత్య
హర్షులను మిమ్ముఁ గంటి మహర్షులార. 94

వ. అని యదంభగంభీరవచోనిగుంభనం బొగడు నక్కుంభినీసుతాధీశ్వరునితోఁ గుంభసంభవాదు లిట్లనిరి. 95

అగస్త్యాదిమహర్షులు శ్రీరాముని గీర్తించుట

ఉ. లోకము నీదృగంచలవిలోకమునన్ రహిఁ జెందె భాస్కరా
లోకమునం బయోజిని వెలుంగురహిన్ సుజనావనైకలీ
లాకుశలప్రభావము సెలంగ జగం బిటు లీవు ప్రోవఁగా
మాకుశలంబు వేఱె యొకమాటడుగన్ వలెనా రఘూత్తమా. 96

శా. శీలత్త్రాధరవజ్ర తాపసజనశ్రేణీతపస్యానిల
వ్యాళస్వామి పరాంగనాంతిలతావాలంబు ధర్మాంబుద
ట్కాలాంభోదము రావణుం డరిగె నీకాండాగ్నిచే మాతపం
బేలా గొందెడు విఘ్నమేఁచుఖలుఁ డింకెవ్వాఁడు సీతాధిపా. 97

తే. అనిమిషులగుండెలో గాల మఖిలలోక, నేత్రమున నాటి వేధించు నెరసు గాలి
కాలిముల్లు కుభృత్పాళిపాలిపిడుగు, రావణుఁడు డిందె భువనముల్ రక్తిఁ జెందె.

సీ. మునుఁ గేసికొని మూలమూలదాఁగినదిశాధిపుల కిప్పుడు బయల్ దేఱఁగలిగె
గులుకులొందక కొండగుహల ద్రిమ్మరు వేల్పుఁ జెలులకిప్పుడు చెల్వుసేయఁగలిగె
జపతపంబులు మాని జడవృత్తిఁ దిరుగుమానులకు నిప్పుడు నిష్ఠ సలుపఁగలిగె
ననదలై గతి మాలి చనినఖేచరుల కిప్పుడు విమానము లెక్కిపోవఁగలిగెఁ

తే. బడగ లెత్తక పడుకులఁ బట్టి యడఁగి
యున్నఫణిజాతి కిప్పుడు వన్నె గలిగె
దశరథకుమారతిలక నీధర్మమునను
దనుజవిభుఁ ద్రుంచి భయము మాన్పినకతమున. 99

సీ. మునులపాలిటివాఁడ వనుట కాదని నీవు సవరించుయజ్ఞరక్షణమె సాక్షి
యతిపావనుఁడ వౌట కలయహల్యాదోషరాశిఁ ద్రోచినపాదరజమె సాక్షి
భువనాధికుఁడ వౌట కవిరతోద్ధతి శూలివిలు దళించినబాహుబలమె సాక్షి
యఘటనప్రఘటనోద్యముఁడ వౌటకు ఱాలు నీటిపైఁ దేలించునేర్పె సాక్షి

తే. యఖిలజీవేశ్వరుఁడవైన యందులకును, వనచరులచేతఁ దగుపనుల్ గొనుటె సాక్షి
యిట్టినీ కేము దీపింప నీప్రతాప. మీయశముఁ గల్గె ననుమాట కేమి సాక్షి.

క. ఐన నిజాశ్రితపక్షము, చే నానతి యిచ్చితివి విశిష్టుల మనుచున్
మీనామము జపియింపం,గానె కద ప్రతిష్ఠ మాకుఁ గలిగె జగములన్. 101

సీ. ఖలశిక్ష సాధురక్షయు నొనర్పనె కదా గురునాజ్ఞ వని నీవు దిరుగు టెల్లఁ
బగతు ఖండింప నెపంబు గల్గనె కదా సతి నొంటి యిడి వేఁట సనుట యెల్లఁ
గాందిశీకులఁ బ్రోచుకరుణఁ జూపనె కదా భానునందనునిఁ జేపట్టు టెల్ల
నేకాంతభక్తుఁ డౌ టెఱిఁగి యేలనె కదా హనుమచే నుంగరం బనుపు టెల్ల

తే. గణన సేయక దశకంఠుఁ దృణముగాఁ ద,లంచియె కదా విభీషణు లంక కబ్ధి
కట్టకయ మున్నె పట్టంబు గట్టు టెల్ల, రవిసహస్రమహస్సాంద్ర రామచంద్ర.

సీ. కులకర్త నింతి మీఁగురు నంపి మాన్పసాయకుభంగమని గంగ యమున కనియెఁ
దనతోడఁబుట్టు వింద్రుని కగ్గమాయెఁ గా యని గౌరి పతిమొగం బట్టె చూచె
మామ నీగతిఁ గలంపఁగ నాయమే యంచుఁ బరవాసుదేవుతోఁ బద్మ వలికెఁ
దిరుగ నబ్ధులతోడఁ ద్రిభువనంబు లొనర్పవలయునో యని వాణి వరుని నడిగెఁ

తే. దనహయంబులకెల్ల జీవనములిచ్చు, నన్విభుఁడు నొచ్చెనో యంచు నడలె వజ్రి
బాడబజ్వాలలట్లు నీపటుశరములు, వార్ధి నింకించునప్పు డిక్ష్వాకుతిలక. 103

చ. కరమున నీవు విల్లుగొని కాండముఁ బూనిన మూఁడులోకముల్
కరము భయంబు నొందుఁ గడఁకన్ నిను మార్కొన నెవ్వఁ డోపు భీ
కరముఖనిర్గతాననశిఖాపరిదగ్ధసుపర్వ రావణున్
దురమున బంధుయుక్తముగఁ ద్రుంపఁగ నీకె తగున్ రఘూద్వహా. 104

సీ. అమితాస్త్రశస్త్రప్రహస్తుఁడైన ప్రహస్తుఁ డురుమహోదరుఁ డమ్మహోదరుండు
చండయుద్ధాకంపనుం డకంపనుఁడు దేవాంతకుం డైన దేవాంతకుండు
కువచోనికుంభుఁడు కుంభుం డుదితశత్రు దానికుంభుండు నాఁ దగునికుంభుఁ
డహితవిరూపాక్షుఁ డగువిరూపాక్షుండు యతియజ్ఞకోపుఁడౌ యజ్ఞకోపుఁ

తే. డాదిగాఁ గలదైతేయు లడఁగి రుగ్ర, సంగరంబున నీయోధసమితిఁ దొడరి
కడఁక నతికాయుఁ డగునతికాయుఁ డీల్గె, నీసహోదరుచేత సీతాసమేత. 105

మ. ప్రళయాబ్దప్రతిమాప్రమాణతనుశుంభత్కుంభకర్ణాద్రి నీ
కులిశాత్యుగ్రనిశాతబాణహతులం గూలెన్ దశగ్రీవదో
ర్బల మైనన్ సహియింప వచ్చు సహియింపం గూడునే యింద్రజి
ద్బల మవ్వీరుఁడు సచ్చె నీకు హిత మాపాదించు సౌమిత్రి చేన్. 106

మ. సురకన్యాకబరీపరిగ్రహణజాశుభ్రాపకీర్తిచ్ఛటా
భరసంసూచకవర్ణు రావణసుతున్ భంజించు టింద్రాదిభీ

కరపౌలస్త్యముఖాసురప్రవరులన్ ఖండించు కార్యంబుతో
సరి యా నందునఁ గాదె నిర్భయత మించం గల్గె జేజేలకున్. 107

క. జేజే యని జగ మెంచఁగ, జేజేలకు నభయ మొసఁగి చెలఁగితివి బలీ
యాఁజేయ వీరవై తే, యాజేయజయాప్తి నలరు మని యగ్గింపన్. 108

క. ఆరాముఁడు, బుధవిహగచ, యారాముఁడు నెఱఁగు సెంది యంజలియుతుఁడై
వారలఁ గని గగనధునీ, వారలఘుంఘుమఘుమారవంబునఁ బలికెన్. 109

సీ. ఘటకర్ణకంపనాకంపనాదుల మాని యింద్రజిత్ప్రతాప మెంచ నేల
ధూమ్రాక్షయూపాక్షదుర్ముఖాదుల మాని యింద్రజిత్ప్రతాప మెంచ నేల
యతికాయవికటప్రహస్తాదులను మాని యింద్రజిత్ప్రతాప మెంచ నేల
త్రిశిరోనరాంతకత్రిదశాంతకుల మాని యింద్రజిత్ప్రతాప మెంచ నేల
తే. వారికంటెను మీఁ డెంత వీరుఁ డైన, కారణం బేమి జన్మప్రకార మెట్టి
లెవ్వరివరంబుచే నిర్జరేంద్రు గెలిచె, నెటులుఁ దనతండ్రికంటెఁ దా నెక్కుడయ్యె.

శ్రీరాముఁడు మునులను రావణజననాదివృత్తాంతముల నడుగుట

ఉ. తాదృశవిక్రమాన్వితసుతప్రభవంబున కాదికారణం
బాదశకంఠుజన్మము తదన్వయపద్ధతి తత్తపోమహ
త్త్వాదులు తత్త్రిలోకవిజయంబును మున్నగుచర్యలెల్లఁ బు
ణ్యోదయులార గోప్యదశ నొందిన డాఁపక యానతీయరే. 111

చ. పరులకు డాఁచుపోలికఁ బ్రపన్నులకున్ మిమువంటి తెల్విచూ
పఱు లగు పెద్ద లుచితకృపారతి నెంతరహస్య మైన డాఁ
పరు లలితాత్ములార యని పల్కు—రామునిఁ జూచి తత్తపః
పరులయనుజ్ఞఁ గుంభజుఁడు వల్కె సదంభవచోనిగుంభనన్. 112

అగస్త్యుఁడు రావణువృత్తాంతముం జెప్ప నారంభించుట

ఉ. వారిజబంధువంశవర వారిధిచంద్ర దశాననాది దే
వారిజనుస్తపోబలజయస్ఫురణంబులు విస్తరించెదన్
సారవభృంగఝుంకరణసంగతసంగరవంబులీల నా
నారవచోవిజృంభణలు సారె వినం దగు నంచు నిట్లనున్. 113

పులస్త్యబ్రహ్మవృత్తాంతము

చ. పదములు నాల్గు కల్గి కవిపద్యము క్రైవడిఁ జెందు ధర్మ మెం
దది కృత మయ్యుగంబునఁ దదంచితధర్మగుఁడై పులస్త్యుఁ డన్
మొదలిటివేల్పుఁ బట్టి మునిముఖ్యులకున్ గమకాఁడు జ్ఞానసం
పదలబిడారు శాంతుఁడు కృపానిధి యొప్పు నహఃపతిప్రభన్. 114

క. శ్రీమించుసత్య మెనసి పి, తామహునకు సాటి యై యుదంచితకరుణా
నామగ్రిసత్త్వయుక్తిఁ బి, తామహునకు సాటి యన నతఁడు విలసిల్లున్. 115

సీ. అకలంకసుగుణమౌక్తికజన్మదేశమై యేమహానిహృదయాబ్జ మింపు గులుకుఁ
ద్రిభువనవిమలవారిజవనీహంసి యై యేతపోధనుకీర్తి యెమ్మెఁ గాంచు
నజమనఃకమలహర్షాపాది యై యేమహర్షి మహాతపం బతిశయిల్లు
సకలమౌనివతంసులకు మేలుబంతియై యేపుణ్యుదినచర్య యేపుఁ జెందు

తే. వినతదేవకిరీటభావితసరోజ
రాగరుచిచక్రచక్రచంక్రమణగతుల
నేమునిపదాంబుజము లొప్పు నామహాత్ముఁ
డతఁడు సాధారణుఁడె పులస్త్యాహ్వయుఁడు. 116

ఉ. ఆమునిచక్రవర్తి దనయంచితధైర్యముపోల్కి మించు నా
హైమనగంబు చెంతఁ జెలువౌ తృణబిందునియాశ్రమంబునం
దామస ముజ్జగించి వనితావిముఖత్వముఁ గాంచి క్రోధుతోఁ
గాము జయించి నూత్నశివుకై వడి నుగ్రతపంబు సేయఁగన్. 117

సీ. వలరాజుకోసమై యలవసంతుఁడు గుంపుసేసినచిలుకతేజీ లనంగ
వనరాశి నావరించినకరంజకమేఘతలి మించుచంచలాలత లనంగ
భువనముల్ భ్రమియించి పూవిల్తు నెలయింప రతిదాల్చురూపాంతరంబు లనఁగ
మునిచిత్తముల నొంప మనసిజుం డపు డంపవచ్చుమంత్రాదిదేవత లనంగ

తే. బెళుకుఁజూపులు నొయ్యార మొలుకునడలుఁ
దళుకుఁదొడలును సిబ్బెంపుఁగులుకుగుబ్బ
లమరునమరాహిఖచంకన్యలు సఖీస
మాజములతోఁ బులస్త్యాశ్రమంబుఁ జేరి. 118

సీ. పాటఁ బాడుదు రొక్కచోటఁ బ్రోఁకులు పల్లవించి కోయిలలకు విందు సేయ
నాటలాడుదు రొక్కచోటఁ గాంచిఘంటికలు మ్రోయ మరుమదావళము లనఁగ
మాటలాడుదు రొక్కచోటఁ జక్కెరవింటిజాణతేజికిఁ దియ్యఖాణ మొసఁగ
నీటు సేయుదు రొక్కచోటఁ గేళిని మనోహరుఁ డేడ వలచునో యని చలింప

తే. నగుదు రొకచోటఁ గుముదసంతతులు విరియ
నిలుతు రొకచోట మెట్టతమ్ములు జనింప
ఖచరగంధర్వకిన్నరాంగనలు మీఱి
బ్రహ్మకొడుకు తపోవనాభ్యంతరమున. 119

సీ. గణిక సోఁకఁ గురంటకము కంటకమిషంబునను గగుర్పాటొందె వనిత చూడు
సరస మాధవి సేర విరితేనెనెపముతోఁ జెమరించె సురపొన్న చెలియ చూడు
లతకూన గదియఁ బల్లవదంభమున రసాలము రక్తిఁ గనిపించె రమణి చూడు
తనజాతికొమ్మ సెందిన మరుద్గతి బంధుజీవంబు వడఁకె నెచ్చెలువ చూడు

తే. మల్లికాయోగ మంది సంపఁగి సువర్ణ
పుష్పములు పెక్కు మొనయించెఁ బొలఁతి చూడు
మనుచు సకలర్తుశోభితం బైనమునిత
పోవనంబున మెలఁగి రప్పువ్వుఁబోండ్లు. 120

చ. ఇటువలె జవ్వనంపుమద మెచ్చఁగ నెచ్చెలు లిచ్చ మెచ్చఁగా
నటు నిటుఁ జెంత వారు చెరలాడఁగఁ గందువమాట లాడఁగాఁ
జిటిపొటిగుబ్బచేల లిలఁ జీఱఁగఁ బల్మఱుఁ జేరఁ జీరఁగా
జటి జపవిఘ్న మోరువఁగఁ జాలక చాలఁ గలంగి యిట్లనున్. 121

శా. ఓ లీలావతులార నేఁడు మొద లేయొయ్యారి వీక్షించు న
న్నాలోలేక్షణ యాక్షణంబునన కన్యాత్వంబు దూష్యంబు గాఁ
జూలా లా ననుచుర్క శపింప మునిరాజుం జూడ శంకించి యిం
దేలా యాటలు సాలుఁ జాలు నిఁక రారే యంచు వా రేఁగుచున్. 122

సీ. మగజాలచికిలికమ్మలు డాయఁ దెలుపెక్కఁ జెక్కులేమనియోర్తు చెలియ నడిగె
నీలకాంచీచ్ఛాయ నెరయ నీనూఁగారు మెఱసె నేమనియోర్తు మెలఁత నడిగెఁ
గస్తూరి గరఁగి పైఁ గ్రమ్మ నేటిదె చూచుకములనల్పని యోర్తు కాంత నడిగె
నళుకుచేఁ బరుగెత్తి యలసిరానేమొ యీయలసత్వమనియోర్తు గలికి నడిగె

తే. దారి నడచుచు నలజడదారికినుక
దారితోత్సాహ లై తప్పి తారి యతనిఁ
జూచితిమె యంచుఁ జూలాంద్రసొబగు లెంచి
బ్రమసి యొండొరు నడుగుచుఁ బడఁతు లరుగ. 123

వ. అంత. 124

ఉ. బిందునిరోధమందుఁ దృణబిందునినందిని తత్తపోవనం
బిందునిభాననంబు గలయిష్టసఖీమణితోడఁ జేరి యం
దంద చరించుచుండె భయ మన్న దొకింతయు లేక మానిసం
క్రందనుఁ దప్పు డాడిన తెఱం గది విన్నది గాదు గావునన్. 125

వ. ఇవ్విధంబున. 126

సీ. తనతనూసురభిళత్వము ఘుమ్మనఁ గ్రమ్ముకొన గంధవహాభావమనిలుఁడొందఁ
దనకాంతిలత లల్లుకొన వనీతరు లెల్లఁ గనకసాలశ్రీలఁ గని వెలుంగఁ
దనమందహాసకుందములకై విరియునారిని గూర్పు మరుఁడు సారెకును దిరుగఁ
దనకరారుణరుచుల్ ఘనలతాదులఁ దారసిలి నవ్యకిసలయావళుల నింపఁ

తే. దనపలుకు చిల్కపల్కులతోఁ బ్రసరింపఁ, దననడలు నెమ్మికొమ్మలఁ దప్పువట్టఁ
దననఖాంశువు లిలకు గందంబు పూయ, రాజఋషిపుత్రి వనవిహారంబుసలిపె.

వ. ఇవ్విధంబున నవ్వనంబులోన నజ్జవ్వని విహరించుచుఁ దనతోడిముద్దులాఁడిం
బొడగానక యవ్వాలుఁగంటి యెటువోయెనో యని యొంటిగా నవ్వలం జనిచని.

పులస్త్యదర్శనముచే దృణబిందునిపుత్త్రి గర్భిణి యగుట

మ. కనకాంగీమణి కంచుగీచినగతిం గంఠంబు మీఱన్ జటాం
తనిరూఢశ్రుతిపాఠ మొందినపులస్త్యబ్రహ్మ వేదధ్వనిన్
విని యారక్తజటాధరుం గుశతృణాన్వీతాసనస్థున్ మృగా
జినవాసఃపిహితాంగు నజ్జటిలుఁ గాంచెం దత్సమీపంబునన్. 129

మ. కనుఁగొన్నంతనె కన్యకామణికి లేఁ గానింత గాన్పించెఁ జ
న్నానలన్ నీలిమ యావరించె ముఖపాండుశ్రీ మిటారించెఁ గు
ల్కునడల్ గొంచెఁ గృశించె మే నరుచి యాలో మించె నా దుల్లసిం
చె నురుశ్రాంతి జనించె గర్భము రహించెన్ మించె నిట్టూరుపుల్. 130

క. ఈలాగున బాలామణి, చూలాలితనంబు దనకుఁ జొప్పుబడిన మదిం
జాలన్ జాలిం బడి యిది, యేలీల ఘటిల్లె హేతు వెయ్యదియొ కదా. 131

తే. పేరు ఋషిగాని మాతండ్రి పేరు పెంపు, గలమహారాజమణియట్టిఘనునికడుపునఁ
బుట్టి యే నిట్టిఱట్టాడిఁ గట్టుకొన్నఁ, జెట్ట యని తిట్టరే తోడిచేడెలెల్ల. 133

క. వచ్చినవేళాగుణమో, యచ్చటియోషధులమహిమ మిటు సేసినదో
మచ్చరమునఁ గన్నెఱిక, మ్మొచ్చెము గన నెవ్వ రిటుల యొనరించిరొకో. 133

మ. కనులేఁబ్రాయపుఁబూపచన్నుఁగవసింగారంబుఁ బోనాడి యీ
కడుపున్ నేనును బోయి మ్రోల నిలువం గన్నయ్య కాపట్య మెం
చఁడె విన్నయ్యలు విశ్వసింపుదురె యేసంబంధమున్ లేనియీ
నడి నావంటిలతాంగికిన్ విధి ఘటించం జెల్లునే యక్కటా! 134

వ. అని చింతింపుచు. 135

మ. స్తనభారానత యై మదాన్వితసముద్యద్గర్భదౌర్బల్యసం
జనితోచ్ఛ్వాసపరంపరాగతకవోష్ణమ్లానితాస్యాబ్జ యై
కనదాలోకనిరోధిబాష్పకణ యై గాఢత్రపాక్రాంత యై
జనకుం జేరి కుమారి యేమియు గణించన్ నేరకున్నంతటన్. 136

క. వంచినతల యెత్తక తన, యంచల నిలుచున్న కన్నె నట్టే యవలో
కించి యొకించుక సంశయ, మెంచి వెఱ వహించి తండ్రి యిట్లని పలికెన్. 137

ఉ. ఎక్కడఁ బోయి తింత తడ వెవ్వరి కప్రియ మాచరించి తీ
వెక్కటినుండు నిన్ను శపియించె నిమేషములోన నీకుఁ జూ
లెక్కరణిన్ ఘటిల్లెఁ దగ వెంచక యింతయకృత్య మెవ్వఁ డే
దిక్కున నుండి చేసె నది తెల్లముగా వివరింపు మమ్మరో. 138

చ. కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ బోవ బాంధవా
వలి దల వంపఁ దల్లి వగవం జెలికత్తెలు సిగ్గుసేటులం

గళవళ మొంద నెవ్వఁడును గైకొన కేఁగఁగ జన్మనష్టి గా
నళుకుఁ దొఱంగి కన్నెఱిక మాఱడి వెట్టుదు రేమొ కూఁతురా. 139

మ. తఁ వంపుల్ ఘటియించి తండఱుకుఁ గాంతా యింక నీకేల యా
దల వంపర్ వివరింపు మెట్లొదవె నేతద్గాహ్యదశ్రీ యనర్
జెలి బద్ధాంజలియై వడంకుచు భయస్వేదంబుతో మోము వె
ల్వెలఁ బాఱం దనుఁ గన్నతండ్రిఁ గని పల్కెం బల్కు దొట్రిల్లఁగన్. 140

శా. ఏ నేపాప మెఱుంగ నాటలకుఁ దండ్రీ యీపులస్త్యాశ్రమ
స్థానాభ్యంతరభూమికిం జని వయస్యాసంఘముం గాన క
చ్చో నే నొంటి చరింప నద్భుతముగాఁ జూ లేర్పడెన్ హేతువుం
గానన్ నీచరణంబు లాన మదిఁ జక్కం జూడవే నావుడున్. 141

శా. ఆరాజర్షివరుండు పుత్త్రివచనం బాలించి ధ్యానావధా
నారూఢాంచితదృష్టిదర్పణముచే నాద్యంతముం జూచి యెం
తే రోమాంచముతోఁ గుమారిఁ గని తల్లీ నిన్ను శోధింప కే
నేరం బెంచితి వంతఁ జెందకుము సందేహంబు దీఱెన్ మదిన్. 142

మ. తనుఁ గన్గొన్నది గర్భ [illegible] నని పులస్త్యబ్రహ్మ ముర్ పల్కె నా
తనిశాపం బిది నీవెఱుంగ కెదుటన్ దర్శింప నిట్లైతి విం
దున నీ కేమికొఱంత యంచుఁ దృణబిందుం డప్పుడే పుత్త్రిఁ దో
డ్కొని బ్రహ్మాత్మజుఁ జేరఁ బోయి భయభక్తుల్ మీఱఁగా నిట్లనున్. 143

{ తృణబిందుఁడు పులస్త్యదర్శనముచే గర్భిణియైన
తనపుత్త్రిని బులస్త్యబ్రహ్మ కొసంగుట }

సీ. మునిచంద్ర సద్గుణంబున మించునీకన్యహస్తాభియుక్తి నీకగు వహింపు
వ్రతిమహేశ్వర సతీత్వము గన్నదీశ్యామ మహిభృత్కుమారిఁ బ్రేమమున నేలు
జటిలభాస్కర చారుసంజ్ఞ యీపద్మిని ఛాయానుసారిణి సమ్మతింపు
మపరాత్మభవ నిర్మలాంగి యీమృదువాణి విద్యావతి దయార్ద్రవీక్షఁ జూడు

తే. యోగిచక్రేశ విను మిప్ప యోజపాణి, శ్రీవిలాసినిఁ బోలుఁ బరిగ్రహింపు
శమధవర్ష భకామితార్థము లొసంగు, సురుచిశుభరాశి యీబంధుసురభిఁ బ్రోవు.

క. ఆతపమునందె నిలిచి మ,హాతపము లొనర్చి బడలి యుడెంచిన మీ
కీతరుణి కల్పలతవలె, శీతలసత్క్రియల నింపు సేయక యున్నే. 145

శా. అశ్రాంతశ్రుతిపాఠయత్నజనితాయాసంబు పంచాగ్ని మ
ధ్యశ్రద్ధాసహితప్రకల్పితతపస్యాకార్శ్య మత్యుగ్రయో
గశ్రాంతిస్ఫురణంబు మాన్పఁ గల దీకన్యాలలామంబు మీ
శుశ్రూషార్థము దీనిఁ గైకొనుఁ డటంచుం బుత్త్రి నర్పించినన్. 146

ఆ. ఆమహర్షి మిగుల హర్షించి రాజఋషీంద్రుసుతఁ బరిగ్రహించి మామ

సత్కరించి పనుప శౌరికి మామయా, నబ్ధికరణిఁ బొంగు చతఁడు సనియె. 147

సీ. స్నానంబుగావించి చనుదెంచునంతలో జపవేదిఁ దగురీతిఁ జక్కఁజేయు
జపనిష్ఠ యొనరించి చాలించునంతలోఁ జక్కఁగా దేవపూజకు నమర్చు
దేవపూజ యొనర్చి తిలకించునంతలో షడ్రసాపూర్ణభోజనము వెట్టు
భోజనంబై కరంబులు గడుగునంతలోఁ బర్ణాజినములచేఁ బాన్పొనర్చుఁ

తే. బాన్పుపైఁ జేరునంతలో బడలి రని మ
నంబునఁ దలఁచి తాలవృంతమున విసరి
తొడలపై నంఘ్రు లుంచి యొత్తుచు ననేక
సేవ లొనరించుఁ దపసి కచ్చిగురుబోఁడి. 148

ఉ. తోయములాడుచో నొడలు దోమెడుకూర్మి కొకింత యాఁకటన్
గాయము డయ్యనీక యొడికంబుగ నన్నము వెట్టుప్రేమకున్
రేయిఁబగల్ సపర్య లొనరించుటకుం గరఁగెం దపస్వి లేఁ
బ్రాయపుఁబాలిసేవలఁ గరంగరె యెంతటివారు రాఘవా. 149

చ. పలికినచో సముత్తరము వల్కఁడె కాని బహూక్తు లాడఁగాఁ
దలఁకుట కెప్పు డేది యుచితం బది సేయుటకున్ మనోగతుల్
దెలిసి మెలంగ నేర్చుటకు దీమసమున్ వినయంబుఁ దాల్మియున్
గలుగుట కుబ్బి తాపసుఁ డొకానొకనాఁ డలకన్యతో ననున్. 150

విశ్రవోబ్రహ్మజననప్రకారము

శా. ఓలీలావతి నీగుణంబులకు నాయుల్లంబు రంజిల్లె న
న్నాలోకింపఁగ నైనగర్భమున నీకస్మాదృశుం డాత్మజుం
డీలోఁ బుట్టెడు నేఁ బఠించుశ్రుతి నీ వేవేళ నాలించి తా
వేళన్ గర్భగుఁ డౌట విశ్రవుఁ డనన్ వీఁ డొప్పు లోకంబునన్. 151

శా. సుధ్యగ్రేసరుఁ డప్రతర్క్యనియమాస్తోకక్షమాయుక్తప
స్స్వాధ్యాయవ్రతశీలుఁ డాగమరహస్యజ్ఞానవైజ్ఞానికుం
డధ్యాత్మార్థవిశారదుం డుభయవంశాధారుఁ డజ్ఞాతురా
పధ్యానార్కవిధ నిరస్తతముఁ డీపౌలస్త్యుఁ డబ్జాననా. 152

క. మాతామహుఁడు బితామహుఁ, డీతనయునిఁ డకఁ జూచి యింపొందుదురం
చాతపసి యానతీయ స,తీతిలకము హర్షజలధిఁ దేలుచు నుండెన్. 153

వ. తత్కాలంబున. 154

మ. శుభనక్షత్రమునన్ శుభేక్షుగ్రహముల్ నూడన్ శుభోచ్చస్థితిన్
శుభవేళం దృణబిందుపుత్త్రి గనియెన్ శుద్ధాత్ముఁ దేజస్వి నా
త్మభవున్ విశ్రవు నాతఁడున్ సకలవిద్యావైదుషిం దండ్రి నా
త్మభవుం బోలి తపంబునన్ సిలిపె స్వాంతం బంత బాల్యంబునన్. 155

సీ. పూరుషాకారంబుఁ బొందుత్రయీవిద్య బాలత్వ మొందిన బ్రహ్మచర్య
మాలోకగోచర యాధర్మదేవత ప్రాణంబు లూనినభవ్యనియమ
మవయవంబులు దాల్చినట్టివైరాగ్యంబు జంగమస్థితిఁ గన్నశాంతరసము
వైయాత్య మొందినవైదికాచారంబు బ్రాహ్మణ్య మెనయుకృపాగుణంబు
తే. దానె యన విశ్రవోబ్రహ్మ తల్లిదండ్రు
లనుమతి యొసంగ నొకతపోవనముఁ జేరి
యాశలు జయించి వెలయుభూమీశులిల
నాశలు జయించి తపము సేయంగఁ దొడఁగె. 156

క. రుచిరజటారుచికీల, ప్రచయమువోలం గుశాస్తరణపరివృత్తుఁడై
శుచిభావమునఁ దపము సే, యుచు నచ్చిఱుతజడదారి యున్నట్టియెడన్. 157

క. ఆమునితనయుఁ గృతేంద్రియు, యామునియోగముఖభావితాంచత్ప్రాణా
యాముని జపఫలితప్రతి, యామునిఁ గని రోమహర్షులైరి మహర్షుల్. 158

మ. శమసౌఖ్యామృతవార్ధిమగ్ను నతనిన్ జామాతఁగాఁ జేయుచి
త్తముతో నుత్తమతాపసుం డగుభరద్వాజుండు లేఁబ్రాయముం
గోమరుం గల్గినపుత్త్రిఁ దోడ్కొని రమాశోకస్తనిన్ దెచ్చి తొ
ల్లి మధుద్వేషి కొసంగ వచ్చుభృగుపోల్కిన్ వచ్చి పల్కెన్ రహిన్. 159

క. వర్ణినిధానమ యీవర, వర్ణిని మత్పుత్త్రి దేవవర్ణిని యనఁగా
వర్ణింపఁ దగిన దిది యా, కర్ణాంతవిశాలనయనఁ గైకొమ్మనియెన్. 160

సీ. అలమందగమనంబు హంసబోధ మొసంగఁ గాను నభోలక్ష్యగతిఁ బొసంగ
మోవికెంజిగురు జపావృత్తి వహియింపఁ బలుచాయ లష్టాంగపటిమ నింప
ఘననఖప్రభ తారకాయోగము గణింప నాననం బమృతకరాభ మించఁ [ల్పఁ
గోమరుఁ జెందు పిఱుందుగురుమహత్త్వముఁ దెల్పఁ జిఱునవ్వుముక్తానుసరణదా
తే. దనతపోరీతి కుచితమై తగినదేవ, వర్ణినీనామకన్య నవ్వర్ణి దల్లి
దండ్రులయనుజ్ఞ వరియించి తత్సమాగ, మమున సకలగృహస్థధర్మములు నడపె.

విశ్రవోబ్రహ్మకుఁ గుబేరుఁడు పుట్టుట

శా. ఈలీలన్ స్వగుణానుగుణ్యమతి యాయిల్లాలితోఁ గూడి యా
పౌలస్త్యుండు గృహస్థధర్మకలనాపారీణుఁడై సార్వతీ
రోలంబాలకయందు శంభుఁడు కుమారున్ గన్నయట్లాధరా
స్థూలాంచత్కటియందుఁ గాంచె నొకపుత్త్రున్ పుణ్యచారిత్రునిన్. 162

చ. అవిరళపుణ్యలీల యగునాశిశుసంభవవేళ భారతీ
ధవుఁ డరుదెంచి పౌత్త్రజునిఁ దప్పక కాంచి ధనేశ్వరుండు వీఁ
డవు నిఁక విశ్రవోమునికులాగ్రణి గన్నయపత్య మాటవై
శ్రవణుఁ డనన్ జగంబునఁ బ్రశస్తి వహించు నటంచు నేఁగినన్. 163

చ. ఉపనయనంబు సేసి శ్రుతియుక్తునిఁ గా నొనరించి శాస్త్రముల్
కృపఁ జదివించి ధర్మ మెఱిఁగించి హితం బుపదేశ మిచ్చి పు
ణ్యపురుషుఁ డైనతండ్రి దను నన్నిట నేర్పరిఁ జేయ నాతఁడుం
దపమున కేఁగె వంశగతధర్మము మానరు సాధు లెయ్యెడన్. 164

వ. ఇవ్విధంబున వైశ్రవణుఁడు తపంబు సేయం జని. 165

క. ఆహుతులఁ బ్రజ్వరిల్లెడు, స్వాహావిభులీల బ్రహ్మవర్చసము ఘుమన్
బాహుళ్య మొంద నియమో, త్సాహంబున నుగ్రతప మతం డొనరించెన్.

మ. ఘననిష్ఠన్ జలపాయి యై పటుతటిత్కాంతిచ్ఛటన్ బెంజడల్
దనరన్ మించె సహస్రవర్షము లనంతక్షాంతి వాతాశనం
బున వేయేండ్లు క్రమించె మే నచలమున్ బోలన్ నిరాహారుఁ డై
తను వాశింపక యేండ్లు వేయుఁ గడపెన్ ద్రైలోక్య మౌరా యనన్. 167

సీ. పద్మాప్తగతి వహింపఁగలాఁడు గావున మొనసి పద్మాప్తాధిముఖ్య మూని
మకరసంగతి మీఁద మనుఁ గాన మకరభీకరజలాకరతరంగముల నాని
ఘనవిభావసుసముగ్రత ముందరికిఁ గాంచ ఘనవిభావసుమధ్యగత్వ మొంది
యతనువర్ధనమైత్రి నలరఁ బోయెడుఁ గాన నతనువర్ధనవృత్తి యవధరించి

తే. ఘోరతపములు సేసి మిక్కుటపుమహిమ, లవధరించినమునులు ప్రయాస మనుచు
వర్ణన లొనర్పఁ ద్రిసహస్రవత్సరములు, తపము గావించె విశ్రవస్తనుభవుండు. 169

వ. అంత.

సీ. ద్వాదశద్వాదశాత్మకకిరీటమణిప్రకాండదీధితులు లేయెండఁ గాయ
ఖాషాబ్జపత్త్రదృక్పత్త్రాతపత్త్రముల్ స్థిరశరచ్చంద్రచంద్రికల నీన
సురనదీతటిదుదుస్ఫురణతోఁ దనతనూవరరుచుల్ బంగారువానఁ గురియఁ
బ్రగుణాగమశ్రీలఁ దగుఋషుల్ కిసలయోజ్జ్వలజటాగ్రముల నంజలులు దాల్ప

తే. గగురుపాటును వడఁకును గానిపింప, నెల్లసుమనోవితానంబు నెనసి కొల్వ
మంచుజిగిపట్టి పొగడ విరించనుండు, గరుణఁ బౌలస్త్యజునకు సాక్షాత్కరించె.

## కుబేరునకు బ్రహ్మప్రత్యక్షం బై వరంబు లిచ్చుట

క. పెన్నిధివలెఁ దన కిటువలె, సన్నిధి సేసినకడానిచాయలజేజే
మన్నదొరపెద్దఁ జూచి ప్ర, పన్నమతిన్ లేచి మ్రొక్కి భయభక్తులతోన్. 171

పంచచామరము. హరామరాగ్రణిస్తుతావ్యయప్రభావభాస్వరా
స్వరాదినైకలోకసృష్టిశాసనక్రియాదరా
దరాబ్జహీరహారభాస్యుదారదార ధీపరా
పరాఖ్యమంత్రభృన్మనోబ్జపద్మినీమనోహరా. 172

క. అని తనుఁ బొగడినమనుమని, వినయమునకు మెచ్చి నలువ వేఁడుము వత్సా
నిను మెచ్చితి వరమిచ్చెద, నని వచ్చితి ననఁ బులస్త్యజాత్మజుఁ డనియెన్. 174

తే. లోకపతి వైననిన్ను నేలోకపాల,కత్వమును హైమగర్భతఁ గన్ననిన్ను
బహుధనాధీశ్వరత్వంబుఁ బ్రార్థనంబు, సేయుచున్నాఁడఁ గట్టుప సేయుమయ్య.

ఉ. కామితదాయి వైననినుఁ గన్గొనినంత ననంతలోకలో
కామితచింతితార్థము లయారె లభింపవె యంచు వేఁడినన్
దామరచూలి వల్కె ధననాథపదంబు దిగీశ్వరత్వమున్
నే ముదమంది నీకె కరుణించితి దేవత లెల్ల మేలనన్. 175

క. ప్రాగపరదక్షిణములకు, నీగిరిపువరుణయముల సృజియించి యుద
గ్భాగమున కొకనిఁ దలఁపం గాఁ గలిగితి నీవు మేము కౌతుక మొందన్. 176

ఉ. పాలితసత్యధర్మ మగు బ్రహ్మకులంబునఁ బుట్టినట్టినన్
నాలవవానిఁ జేయఁ దగునా యనఁ బోకు దిగీశ్వరాళిలో
నాలవవాఁడ వై బహుధనస్థుఁడ వై మను మంచు మన్ననన్
లాలనసేసి ధాత యొకనవ్యవిమాన మొసంగి వెండియున్. 177

ఆ. పుష్పకాఖ్య మిది యపూర్వయానము దివ్య, పుష్పకాయమానపూజ్యమాన
మీవిమాన మెక్కి యెల్ల వేల్పులలోన, నీవి మాన కలరు మింక ననుచు. 178

కుబేరుండు దండ్రి యనుజ్ఞవలన లంకం జేరుట

మ. సవిశేషాదరభాష లాడి యజుఁడున్ జన్నన్ ధనేశుండు వి
శ్రవుఁ జేరన్ జని మ్రొక్కి తండ్రి భవదాజ్ఞన్ బ్రహ్మ మెప్పించి యి
ష్టవరంబుల్ గొని వచ్చితిన్ తగునివాసం బాయజున్ వేఁడ నై
తి వినూత్నస్థల మెయ్య దెందు నిలుతున్ దెల్లంబుగాఁ దెల్పవే. 179

ఆ. ఈతిబాధ లేక యింతైనఁ బగవారి, చేతిబాధ లేక చెలువు గలుగు
నట్టిగీము నలయు నానతి యిమ్మన్నఁ, బట్టిమోముఁ జూచి పలికె గురుఁడు. 180

మ. కల దీదక్షిణవార్ధి మధ్యమున లంకానామదివ్యత్పురం
బలఘుప్రాకృతటీనివిటోత్కరమణధుర్యావార్యహార్యశ్వర
ధ్యలసత్కాంరఖురాగ్రసాధగతపంకాలేపసంక్షాళనా
కలితాకాశతరంగిణీతరళరంగత్తుంగభంగాఢ్య మై. 181

సీ. కనకకుంభప్రభాకలన బాలార్కవిభ్రమముఁ జూపెడుగోపురములు గలుగ
భర్మభూమిధరంబు పలురూపులాయెనో యనిమించునర్మ్యహర్మ్యములుగలుగ
హీరకాంతులచేతఁ దారకావళిఁ గేరులసమానలీలాచలములు గలుగ
నగరేందిరాదేవి నడుముఁ బూనినకాంచి కొమరు గాంచినప్రాఁడికోట గలుగ

తే. భూరివైడూర్యతోరణస్ఫురితవిపణి, మార్గములు గల్గ స్వర్గసామ్యముగ విశ్వ
కర్మ నిర్మించె నిర్మాణకౌశలమున, రాక్షసార్థంబు మున్నప్పురము కుమార. 182

క. ముందు ముకుందునిభయమున, నందు నిలువ వెఱచి దైత్యులందఱు సుతలం
బొందిరి నిర్భయపద మది, సెంది సుఖింపుమని తండ్రి సెలవిచ్చుటయున్. 183

సీ. ఉపవనీరమ మారుతోత్పతత్కుసుమరాజీకైతవంబున సేస లిడఁగఁ
బ్రాకారలక్ష్మివజ్రపుజాలతళుకుచేఁ దనమేన మంచిగందంబుఁ బూయ
భర్మగోపురచరత్పారావతద్విజశ్రేణి పల్కులనె యాశీర్వదింప
జరామార్గచిరత్నరత్నసౌధశ్రీలు గనురక్తి కుంకుమ గాన్క సేయఁ

తే. గేళిభూభృత్పరంపరల్ కేతనాంశు, కాప్తిఁ బావడ లూన ముక్తాశ్మధామ
లలితరుచిఘూతచంద్రకలంకఁ లంక, రాజసమునఁ బ్రవేశించె రాజరాజు. 184

మ. ధనదుఁ డీగతి లంకఁ జేరి సురగంధర్వాప్సరస్సేవ్యుఁడై
తనయాజ్ఞోన్నతి నైరృతుల్ భయము జెందన్ దత్పురం బేలుచున్
జనయిత్రిన్ జనకున్ గనుంగొనఁగ నిచ్చల్ పుష్పకారూఢుఁడై
చనుచున్ గ్రమ్మఱుచున్ సుఖించె నతులైశ్వర్యం బవార్యంబుగన్. 185

తే. అని యదంభవచోనిగుంభనలఁ గుంభ, సంభవుండు పులస్త్యవంశక్రమంబు
గొంత దెలిపిన విని శ్రీరఘుప్రవీర,వర్యుఁ డిట్లను నాశ్చర్యధుర్య డగుచు. 186

శా. ఓవింధ్యాచలగర్వనిర్హరణయాత్రోద్యోగ పూర్వంబు లం
కావాసంబు సురారినాథులనికాయ్యం బంచు మీ రానతీఁ
గా విన్నప్పటినుండి చిత్రరసశంకాసంకులం బయ్యె మ
ద్భావం బంతకు మున్న తాదృశబలుల్ దైతేయు లెవ్వారొకో. 187

ఉ. ఆదిఁ బులస్త్యవంశభవు లాసురముఖ్యు లనంగ వింటినే
తాదృశరాక్షసాధికులు దానవు లంతకు మున్నె లంకలోఁ
బాదుక యుండు రం చిపుడు వల్కితి రీదశకంధరప్రహ
స్తాదులకంటె వీరవరు లైనసురారులు వార లెవ్వరో. 188

ఉ. వారికి వంశకర్త యగువారి తెఱంగులు వారి పేరులున్
వారిబలోన్నతుల్ పిదప వారు ముకుందున కోడి లంకకున్
జేరక పోవుటల్ జటిలశేఖర తెల్పుము విస్తరించి నీ
చారుసుధారసోపమవచఃకలనన్ జెవు లింపు సెందెడిన్. 189

ఉ. భానునిచే మహాతమముఁ బాయు తెఱంగున మాను మాదృశా
జ్ఞానము మిమ్ముఁబోఁటిబుధచంద్రులచే నని జానకీబహిః
ప్రాణము రామభూవిభుఁడు ప్రశ్న మొనర్ప దరస్మితంబుతోఁ
దా ననియెన్ దథావిధకథావిదుఁ డమ్ముని సమ్మదంబునన్. 190

మ. రవివంశోత్తమ సంశయం బయినచోఁ బ్రశ్నంబు గావింప నే
ర్తు విన న్నేర్తువు సావధానముగ నిన్ స్తోత్రంబు సేయంగ మా
కు వశంబే పరమేష్ఠినుండియును రక్షోవంశ మాద్యంతమున్
వివరింతున్ వినుమం చగస్త్యుఁ డను బ్రావృట్కాలమేఘార్భటిన్. 191

### రాక్షసవంశోత్పత్తి క్రమము

మ. హరినాభీరుహసారవిందమకరందానందనేందిందిరం
బు రహిన్ మించి విరించి యంచితతపస్స్ఫూర్తిన్ జగత్సృష్టికై
ఖరఁ బ్రాపించి మహాజలంబు దొలుతన్ గల్పించి తద్రక్షణా
కరకాంక్షన్ సృజియించె సత్త్వముల సంకల్పంబునల్పంబుగన్. 192

శా. ఆసత్త్వంబులు క్షుత్తృడాతురత బ్రహ్మన్ జేరఁగా వచ్చి వి
శ్వాసంబుల్ గనుపింప నేమి యొనరింపన్ మమ్ముఁ బుట్టించి తీ
వో సామీ యిపు డేమి సేయుదుము నా నుక్తీశుఁడున్ నవ్వుతో
మీసామర్థ్యముఁ జూత మిజ్జలము నెమ్మిన్ బ్రోవుఁడీ నావుడున్. 193

మ. జలసంరక్ష యొనర్తు మంచుఁ జని యాసత్త్వావళుల్ క్షుత్తృడా
విలభావంబు వహింప కంబుహృతి గావింపంగ నుంకించి యం
చల బ్రహ్మన్ గని కొంచి కొన్ని యనె "జక్షామే" తిథాత్వర్థవా
క్కలనన్ నీళ్ల వసించుకొన్ని యనె "రక్షామే" తి వాగ్వైఖరిన్. 194

తే. అపుడు పరమేష్ఠి జక్షింతు మని పలికిన, జంతువులయక్షులగుచుఁ బ్రశస్తిఁజెందుఁ
డనియె రక్షింతు మనిపల్కినట్టివారి, రాక్షసులుగండనుచుఁ బల్కె రఘువరేణ్య.

### హేతిప్రహేతుల వృత్తాంతము

ఆ. రామ యట్టి యక్షరాక్షసకోటిలో, నెంచఁ దగినవీరు లిద్ద ఱౌరి
యెవ్వ రన లాయగ్ని హేతి బోలినహేతి, హస్తదీప్రహేతి యగుప్రహేతి. 196

క. ఖేటప్రతివీరులు మధు,కైటభనిభవిక్రమప్రకాండులు పటుబా
హాటోపపేటు లాదిని, శాటులు హేతిప్రహేతు లద్భుతహేతుల్. 197

క. వారలయందుఁ బ్రహేతి యు,దారుఁడు కామాదిరిపువిదారుఁడు శ్రితమం
దారుఁడు గుణనందితబృం,దారుం డనపేక్షితార్థదారుం డయ్యెన్. 198

మ. భయదూరుం డలహేతి తాత పనుపన్ భార్యాకుమారస్పృహో
భయసంగాత్ముఁ డౌటఁ గాలభగినిన్ భద్రేభకుంభస్తనిన్
భయ యన్దానిఁ బరిగ్రహించె దశదిగ్భాగస్ఫురన్మల్లికా
భయశగపాండురమౌక్తికప్రతతి పైపై సేస గావింపఁగన్. 199

క. ఆశాతోదరి విద్యు,త్కేశుని సంధ్యాబ్దనికటదీపితవిద్యు
త్కేశునిఁ దేజశ్శోచి,ష్కేశునిఁ గనె హేతి ప్రీతి చెన్ను వహింపన్. 200

శా. విద్యుత్కేశుఁడు తోయగాంబుజముఖీవిన్ దాత్మకీర్త్యున్నతిన్
విద్యాభ్యాసివివేకమున్ వలె మహాజ్ఞానివైరాగ్యమ
ట్లుద్యోగస్థునికల్మిలీల హఠయోగోద్భాసియాయుర్గతిన్
ఖద్యోతద్యుతి వృద్ధిఁ బొందెఁ బితృరక్షం జేసి నానాఁటికిన్. 201

మ. నవవర్షాగమజృంభితాంబుదముచందానన్ మధుస్ఫూర్జితా
టవిలీలన్ బటుయౌవనస్ఫురదవష్టంభంబునన్ బుత్త్రకుం
డు విజృంభించినరీతి హేతి గని సుష్ఠుప్రీతిఁ బ్రాపించి వా
నివయోరూపనిరూఢికిన్ దగినకన్నం గాంతుఁ గావింపఁగన్. 202

సీ. కమనీయకమలకోశములతో సమము లై కులుకుగుబ్బ మెఱుంగుగుబ్బ లమర
నసమాననీలోత్పలసమానరుచ లొంది కలికిసోయగపువాల్గన్ను లలర
శ్రీవందనస్యందనానందరథాంగపటిమ విస్తృతనితంబము రహింపఁ
గంజరాగము మీఱుసంజకెంజిగిఁదీరు వహియించి కెమ్మోవి వన్నెమిగుల

తే. నిరులసరులను బెన్నెఱు లిరవుకొనఁగఁ, దారకస్ఫూర్తి గన నఖోదారకాంతి
సంధ్యవలె మించుసంధ్యాత్మజాలలామఁ, బ్రియకుమారున కాహేతి పెండ్లి సేసె.

శా. తత్కాలంబునఁ జారుగాత్రి యగుసంధ్యాపుత్త్రిఁ బ్రాపించి వి
ద్యుత్కేశుండు శచీసమేతుఁ డగునింద్రున్ రోహిణీయుక్తుఁ డౌ
సత్కాంతున్ గిరిజావిలోలుఁ డగుపశ్యత్ఫాలునిన్ బోలి య
త్యుత్కంఠోత్థరతిక్రియన్ మదనదేవోపాస్తి గావింపఁగన్. 204

ఉ. నీలపయోదయుక్చపల నీటున నాథునిఁ గూడి యొప్పునా
సాలకటంకటాయువతి స్వాతిగతాంబుదవృష్టి శుక్తియున్
బోలె నిజేశుతేజమున భూరితరంబుగ నంత గర్భమున్
దాలిచి మందరాచలనితంబమునం దురుసాహసంబునన్. 205

మ. పరు లెవ్వారును గానకుండ నిజగర్భస్థార్భకున్ దద్ధరా
ధరమధ్యంబున డించి వహ్నిజనితోద్యద్గర్భభారంబు మున్
శరమున్ జేర్చినగంగఁ బోలి సురతేచ్ఛాలోల యై జీవితే
శ్వరుఁ జేరన్ జనెఁ బాప మెంచరుగదా చానల్ రఘుగ్రామణీ. 206

శా. ఆసంధ్యాతనయావిసృష్టశిశు వాస్యాంతస్స్ఫురన్ముష్టి యై
యాసన్నక్షితిభృద్గుహల్ బదులు మ్రోయన్ గాలజీమూతగ
ర్జాసామ్యధ్వని రోదనంబు ఘటియించన్ నాగసింహాదినా
నాసత్త్వంబులు తద్ధ్వనిన్ బెదరి చెంతన్ జేర లేకేఁగఁగన్. 207

వ. అప్పుడు. 208

సీ. బలుకెంజడలతోడఁ దెలికన్నెరులవన్నె గలక్రొన్నెలవతంసంబుతోడ
వలుఁదశూలముతోడ నలినుబ్బునలముబ్బు వెలిద్రొబ్బగరళభృద్గళముతోడ
గిబ్బతత్తడితోడ గిరిరాజు హరిరాజుఁ గరిరాజు నగుమేనికాంతితోడఁ
బునుకకంచముతోడ ననతూపులనయేవు గన నోపుదారబూదిమినుకుతోడఁ

తే. బ్రమథతతితోడఁ బార్వతీప్రమదతోడఁ, గరిముఖాదికుమారవర్గంబుతోడ
శివుఁడు మంథానగిరితుంగశృంగవీథిఁ, జెలువు మీఱంగ స్వారి వేంచేయునపుడు.

## సుకేశుం డనురాక్షసుని వృత్తాంతము

క. వాపోయెడుసంధ్యాతన, యాపత్యముదిక్కుఁజూచె నభవుఁడు కారు
ణ్యాపారసుధాపూర, వ్యాపారకటాక్షవీక్షణాతిశయమునన్. 210

క. అంగజహరుఁ గని ప్రియ మెన, యంగ జగజ్జనని గిరిజ యవధా రహిరా
డంగద యీపసిపాపని, యంగదఁ బాయంగఁజేయ నర్హం బనినన్. 211

మ. ప్రియురా లాడినమాట దాఁటక పురస్త్రీచిత్రకక్షాళనా
క్షయదుర్ధర్షశరుండు శంభుఁడు దయాంచద్బుద్ధిఁ దద్బాలుఁ జూ
చి యమర్త్యత్వము మాతృసన్నిభవయశ్శ్రీస్ఫూర్తియున్ విశ్వది
గ్జయతేజంబు నభశ్చరత్పురముఁ గల్గంగా వరం బిచ్చినన్. 212

శా. శ్రీగౌరీజలజాయతాక్షి పలలాశిశ్రేణికిం గూర్మి స
ద్యోగర్భాతిశయప్రసూతులును సద్యోయౌవనప్రాప్తి స
ద్యోగాఢప్రతిభాపరాక్రమజయోద్యోగంబు లిచ్చెన్ లస
ద్యోగారూఢమనఃప్రసన్నుఁ డగుకాంతుం డట్టు లౌఁ గాకనన్. 213

క. దేవికి వేడుక యవు నని, దేవరయును వరము లొసఁగ దేవరఁ గనుచున్
దేవియు సాటికి బేటికి, దీవింపఁగ దైత్యశిశువు తేజము నొందెన్. 214

చ. జనని సుఖంబె కోరె కని శైలతటంబునఁ బాఱవైచి పో
యినశిశు వేడ వానికి యతీంద్రులకున్ గనరాని వేలుపుల్
గనఁబడి కోర నేరఁ డని గాఢవరంబు లొసంగు టేడ య
ద్దనుజునిపూర్వజన్మసుకృతం బెటువంటిదొ గాక రాఘవా. 215

ఉ. ధారుణిలో నరక్షితుఁడె దైవసురక్షితుఁ డందు రార్య లా
వా రది యట్టులుండె రఘువంశసుధాంబుధిచంద్ర వింటివే
యారజనీచరార్భకుఁడు నంత సుకేశుఁ డనన్ బ్రసిద్ధుఁడై
గౌరియు శంభుఁడున్ బనుపఁగా శివదత్తపురానువర్తియై. 216

సీ. జలజాతరాగమండలపిచండిలమండలావిష్టుఁ డగుభాను ననుకరించి
తపనీయదివ్యరత్నవిమానసంచరిష్ణుత నిర్వహించుజిష్ణుని హసించి
బహుయోజనాయతప్రథమానరథ మెక్కి చరియించుపూర్ణిమాచంద్రుఁ దెగడి
కనకాచలాంగసంగతపతంగపతంగవాహనుం డగువిష్ణువైఖరి నగి

తే. గగనబహుపాదరారుహాగ్రము స్వకీయ పురమణీదీప్రవప్రగోపురవిభామ
తల్లికావల్లికాశ్రేణు లల్లికొన సు, కేశుఁ డలరారె నంబరకేశుకరుణ. 217

క. ఆమనుజాశిస్తోమల, లామునికీర్తిప్రతాపలావణ్యంబుల్
గ్రామణి యనుగంధర్వ, గ్రామణి తిలకించి కౌతుకం బలరారన్. 218

సీ. వేణికారుచిఁ గృష్ణవిభవంబు వహియించి ముఖదీప్తిఁ బూర్ణసోముని గ్రహించి
తనుకాంతిఁ గనకగర్భనిరూఢిఁ బ్రాపించి స్తనలీల గిరిజాతఘనతఁ గాంచి

వరనాభిగతి దేవవల్లభోన్నతి నొంది మధ్యరీతి ననంగమహిమఁ జెంది
కటితటస్ఫురణఁ జక్రహితాభ్యుదయ మూని నడలచే శిఖివాహనటన మూని
తే. సౌరభంబున సుమనఃప్రసక్తి మీఱి, యఖిలమనోగుణంబుల నతిశయించు
దేవవతి యనుతనకన్యఁ దెచ్చి యిచ్చె, నలసుకేశాఖ్యునకు భానుకులవరేణ్య.

సుకేశుండు దేవవతిని వరించి మాల్యవదాదులం గనుట

శా. రక్షోరాజ్యరమావధూటి యనఁగా రంజిల్లునప్పద్మప
త్త్రాక్షిన్ బెండిలియై సుకేశుఁ డధనుం డర్థంబుఁ బ్రాపించిన
ట్లక్షీణస్పృహ మించె నద్దివిజకన్యారత్నమున్ నిర్జరా
ధ్యక్షున్ జెందుపులోమజన్ దెగడు దివ్యద్భోగభాగ్యోన్నతిన్. 220

చ. కరియుఁ గరేణువున్ బెనఁగుకైవడి నిచ్చలు హెచ్చుమచ్చికల్
దొరసి సుఖించువారలకుఁ దోడనె పుట్టిరి పావకత్రయ
స్ఫురణఁ ద్రిలోకసంగతిఁ ద్రిపూరుషమంత్రగతిన్ ద్రినేత్రవై
ఖరిఁ ద్రిగుణంబులున్ బలెఁ ద్రికాలములట్టుల మువ్వు రాత్మజుల్. 221

మాల్యవదాది రాక్షసుల చరిత్రము

మ. వియదంభోమరుదున్నతిన్ వెలయునవ్వీరత్రయిన్ సద్వ్రా
జియశోనిర్మలమాల్యవంతుఁ డన మించెన్ మాల్యవంతుండు ద్వి
ట్చ్ఛయసంపత్కుసుమాలి నాఁ దదనుజాంచత్ఖ్యాతిఁ గాంచెన్ సుమా
లియుఁ దేజోవిజితాంశుమాలి యయి పొల్చెన్ మాలి తద్భ్రాతృతన్. 222

శా. ఆరక్షస్త్రితయం బుపేక్షితమహావ్యాధిత్రయంబున్బలెన్
దారుణ్యంబు వహించి తంద్రికరణిన్ దా నెంతయున్ దేవతా
కారుణ్యంబులఁ గామితంబులు గనంగా నెంచి యంచత్తపః
ప్రారంభంబు వహించి కాంచనగిరిప్రత్యంతశైలస్థులై. 223

శా. కీలాలం బని నీరు గ్రోలురహి సృక్కించెన్ బలాశంబు లం
చాలోకించుట మానెఁ బర్ణముల మధ్యాఖ్యన్ బ్రవర్తింపఁగాఁ
జాలించెన్ విరిదేనె చాయ దొరయన్ జన్నన్ రవిద్రోహదు
శ్శీలం బౌ నని రాక్షసత్రయి విసర్జించెన్ దరుచ్ఛాయయున్. 224

మ. అతిలోకం బగుతాల్మితోఁ దపము లిట్లారాక్షసుల్ సల్పఁగా
యతిలోకం బరుదందె నంతటఁ దదీయప్రాంచితాచారసూ
నృతసంభావ్యమహాతపోజనితవహ్నిజ్వాలికామాలికా
హతి ముల్లోకములున్ దపింపఁ గని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై. 225

మాల్యవదాదులకుఁ బ్రత్యక్షమై బ్రహ్మ వరంబు లొసఁగుట

సీ. పలలభోజనతపోనలము వేఁడిమి నంచ తేజి బంగరుఱెక్క తేజరిల్ల
దోషాచరతపోగ్నిధూమాళి భారతీధవలాక్షికొప్పు పూదండ లాన

దనుజత్రయీతపోదమునస్స్ఫులింగముల్ మహనీయమకుటాగ్రమణులనొరయ
దైత్యమూర్ధన్యమూర్ధజతపశ్శిఖిశిఖాచయముచే సావిత్రిమెయి సెమర్ప

తే. నుగ్రనిష్ఠాగరిష్ఠు లై యుగ్రమహిమ, నుగ్రతపమును గావించుచున్నరాక్ష
సాగ్రణులచెంత కరుదెంచి యట్టికాంచి, వెఱఁగుమించి విరించి దీవించి యనియె.

ఉ. ఇంకఁ బ్రయాస మొంద వలదే మిము మెచ్చితిఁ గోర్కు లిచ్చెదన్
శంకఁ దొఱంగి లెం డసురశంకరులార యటంచు భారతీ
పంకజలోచనాకచవిభాసురకేసరవాసనాగతా
హంకరణాళిఝుంకరణహారిమృదూక్తుల నానతిచ్చినన్. 227

మ. అమృతాంభోధితరంగఘుంఘుమరవోద్యత్తన్మృదూక్తిన్ గత
శ్రము లై కన్నులు విచ్చి రాక్షసులు సాక్షాత్కార మైయున్నబ్ర
హ్మముఖాంభోజముఁ జూచి లేచి భయకంపావాప్తి సాష్టాంగదం
డము లర్పించి నుతించి రిట్లని లలాటన్యస్తహస్తాబ్జు లై. 228

మ. పురుషుం డంచుఁ బరేశ్వరుం డనుచు వేల్పుంబెద్ద యంచున్ మహే
శ్వరుఁ డంచుం బరమాత్ముఁ డంచు శ్రుతిశాస్త్రజ్ఞానపారీణు లే
ర్పఱుపం జాలక పెక్కు భేదముల నేభావ్యాత్ము నూహింతు రా
పరమేశున్ నినుఁ గొల్తు మేము శుభముల్ ప్రాపింప నశ్రాంతమున్. 229

శా. ఆశాస్యంబులు నీవలెన్ నతుల కీయన్ జాలు జేజే గలాఁ
డే శశ్వత్కృప మా యెడన్ నిలిపి తండ్రీ ప్రోచెదేనిన్ సమ
స్తాశాధీశజయప్రతాపములు దీర్ఘాయుస్సదారోగ్యవి
ద్యాశాలిప్రతిభల్ పరస్పరహితత్వంబున్ బ్రసాదింపవే. 230

క. ప్రభవిష్ణుల మై యెందును, నభివృద్ధి వహింతు మనుచుఁ బ్రార్థించినఁ బ
ద్మభవుం డాదరమున న,య్యభిమతము లొసంగి చనియె నాత్మీయులతోన్. 231

వ. అంత. 232

మాల్యవదాదులు లోకంబుల బాధించుట

శా. భాషానాథవరప్రదానవిలసద్బాహాబలాటోపు లై
దోషాటాధిపతుల్ మదాంధత సుధాంధోముఖ్యులన్ గెల్చి త
ద్యోషారత్నములన్ గ్రహించి మునులన్ దూలించి సాధ్యాదులన్
రోషాగ్నిన్ దపియింపఁ జేసి సురవైరుల్ మెచ్చ వర్తించినన్. 233

సీ. పట్టు గానక బయల్ వట్టి రాదిత్యులు ఖచరులత్రోవలు గట్టువడియె
దీను లై గరుడులు దెస సెడి పాఱిరి తుషితులు బడలికతోఁ దిరిగిరి
వసువులు పేదలవలె గాసిఁ జెందిరి గమిఁ బాసి రుద్రులు గాడుపడిరి
యడ్డగింపులకు లోనైరి మరుత్తులు చేరిరి గిరిగుహల్ సిద్ధవర్య

తే. లోఁడి గంధర్వు లూడనిఁబోఁడి రచ్చ,రలకుఁ జెఱ లుప్పతిలె మహారాజికులకుఁ
గలిగెఁ దలగంప దింపనివలసపాటు, రాక్షసులు సేయురాయిడి రఘువరేణ్య.

క. నిరయగతు లైనప్రాణుల, కరణిక్ రక్షకుని నొకనిఁ గనక సుకేశా
సురసుతబాధితభువనాం, తరగతు లాపదలఁ బడిరి తత్కాలమునన్. 235

శా. ఆరాత్రించరశేఖరుల్ ముగురు ని ట్లాదిత్యహృద్భీకర
స్వైరస్ఫారవిహారులై తమకు భూస్వర్గంబులీలన్ మనో
హారం బౌనగరం బొనర్చుటకుఁ గా నర్థించి శిల్పప్రభా
ధౌరేయుం డగువిశ్వకర్మఁ దలఁపన్ దద్దన్యుఁ డేతెంచినన్. 236

ఉ. మాల్యవదాదు లి ట్లని రమర్త్యులకల్మియు బల్మి కీర్తిబా
హుళ్య మెఱింగి వారికి యథోచితగేహము లీ వొనర్పఁ బ్రా
బల్యముఁ జెందె నీచతురభావము దిక్కుల నోయి శిల్పకౌ
శల్యనిధాన మాకు నిఁక సద్గృహముల్ రచియింపఁగాఁ దగున్. 237

మ. హిమవత్పర్వతమౌళిమీఁద నయినన్ హేమాద్రిపై నైన మం
థమహీధ్రాగ్రణిమీఁద నైనఁ గలధౌతక్షోణిభృచ్ఛృంగతుం
గమణీగోపురసౌధయూథములు గల్గన్ మాకు నిర్మింపు గే
హము లంచున్ వచియింప నయ్యమరశిల్పాచార్యవర్యుం డనున్. 238

విశ్వకర్మవలన నెఱింగి మాల్యవదాదులు లంకఁజేరుట

ఉ. దక్షిణవారిరాశితటధారుణి భాసుర మౌఁ ద్రికూటనా
మక్షితిభృద్వరేణ్య మసమానమణీమయసానుసంపదన్
దక్షిణదిక్త్రికూట మనఁ దద్గిరిశృంగమునం దొనర్చితిన్
రాక్షసులార ము న్నొకపురం బసురేంద్రునియాజ్ఞ పెంపునన్. 239

వ. అదియును షష్టియోజనవిస్తీర్ణంబును శతయోజనాయతంబును వినిర్మలముక్తా
ఫలనిర్మితనర్మహర్మ్యచ్ఛవిచ్ఛటాధవళితహరిదశ్వహరిత్తురంగంబును నుత్తుంగ
గోపురోపరిద్వారాంతరస్థాపితకాంచన పాంచాలికాబాలికాస్తనాంతరక్షౌమ
పటోత్తరీయాయితవియత్తటినీతరంగంబును వాసవకృతత్రాసనిరాసార్థవనరాశి
సమానీత కలధౌత గిరిపోతతులితలలితమణిమయ క్రీడాచలవిరాజమానంబును
నిజవైభవాధఃకృతసమగ్రసౌభాగ్య లక్ష్మీప్రార్థనానిమిత్తసమాగత భోగవతీపుర
వ్యంజకపరిఖాయితాంభోధిగతాత్మప్రతిబింబంబును శతకోటి శివాలయనీల
ప్రాకారజాలప్రభాభిధముధాభ్రమర సముదయారుణ కమలాయిత కమలహిత
మండలంబును నాయికోచిత మరకత మణిమయ ఘననివసనకనకవసనగగనలక్ష్మీ
ప్రకల్పితపుష్పోపహారాయితతారాప్రతానంబును వనపవనచలితలతాప్రతాన
పతత్ప్రసూనపరిమళమిళితపరాగవాసితాజాండకరండంబునుసమస్తవస్తువిశేషం
బులకు జన్మనివాసంబును నఖిల విభవలక్ష్మీవిలాసంబులకు వీడుపట్టును నై
కనుపట్టునట్టుగా గంగాదిశకునదుష్ప్రవేశంబును టంకాగ్రవిచ్ఛిన్నచతుర్దిశా

వకాశంబున నసుత్రికూటశిఖరశిఖరప్రదేశంబున స్వర్గలోకవస్వౌకసారాది
దిక్పాలపురంబులు నిర్మించి యాజితేజినశిల్పనైపుణ్యము మెఱసి నిర్మించిన
యాలంకాపురంబు మీకాఁపురంబునకుఁ దగు నందు నిలువుం డని వెండియు
విశ్వకర్మ వారలం గనుంగొని. 240

శా. లంకాదుర్గముఁ జేరి శాత్రవులకున్ లక్షింపఁగా రాకని
శ్శంకఖ్యాతిఁ గనం గలా రని గణించన్ శిల్పసమ్రాట్సుధా
సంకాశోక్తుల నుత్సహించి బహురక్షశ్శ్రేణితో దోర్బలా
హంకారంబునఁ జేరి రప్పురి నిశాటాధ్యక్షు లొక్కుమ్మడిన్. 241

మాల్యవదాదులు వివాహమై పుత్త్రులం గాంచుట

శా. ఆలేఖద్విపదగ్రగణ్యులభుజాహంకారతేజోవయ
శ్శ్రీ లెల్లం దిలకించి నర్మద యనం జెల్వొందుగంధర్వి సు
శ్రీలావణ్యగుణాభిజాత్యముల హ్రీశ్రీకీర్తులన్ బోల్ప నా
స్త్రీలన్ ముగ్వుర నిచ్చె నాత్మసుతలన్ జ్యేష్ఠానుపూర్వంబుగన్. 242

తే. నర్మద వళిప్రహాసితమహోర్మికలిత, నర్మద సుపర్వసతి యయ్యె దుర్మదులకు
నసురులకు నెట్లొసంగెఁ గన్యకల ననకు, కలిమిగుణ మట్టి దిక్ష్వాకుకులవరేణ్య.

చ. మరుఁడు త్రిలోకమోహకరమాత్రనిగుంభితమార్గణత్రయిన్
దరుణులు గా నొనర్చి భువనత్రయభీకరరాక్షసత్రయిన్
మరులున ముంప నంపెనో యనన్ దగునజ్జవరాండ్ర ముగ్వురన్
బరిణయమై యమర్త్యులక్రమంబున వారు సుఖించి రంతయున్. 244

వ. అంత. 245

క. సుందరి యనునిజసుందరి,యందుఁ గనియె మాల్యవంతుఁ డాత్మజ నొకతెన్
నందనుల నేడుగుర విను, మందఱనామములు దశరథాత్మజతిలకా. 246

మాల్యవదాదులకు వజ్రముష్ట్యాదిరాక్షసులు పుట్టుట

మ. అనిలక్రోధుఁడు వజ్రముష్టియు విరూపాక్షాఖ్యుఁడున్ దుర్ముఖుం
డును సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁ డనువాఁడున్ మత్తుఁ డున్మత్తకుం
డనలానామకుమారియున్ బొడమినన్ హర్షించె నమ్మాల్యవ
న్మనుజాశీంద్రుఁడు పుత్త్రవంతుఁడును సంపన్నుండునై రాఘవా. 247

క. కేతుమతి వృష్ణిపాంగజ, కేతుమతి సుమాలిసతి శుకీవాణి తనూ
జాతలఁ దనుజాతులఁ గనె, సీతాధిప వారిపేళ్లు సెప్పెద వినుమా. 248

వ. సుప్రహస్తుం డనన్ దగుప్రహస్తుండును రణస్థలాకంపనుం డగు నకంపనుండును
సురవికటుండగు వికటుండును విధ్వస్తశత్రురథన్యస్తశకటీముఖుం డగు శకటీ
ముఖుండునున్ బరుషరుషానలధూమ్రాక్షుం డగుధూమ్రాక్షుండును నుద్దండ
భుజాదండుం డగు దండుండునున్ జతురంగబలాక్రాంతసుపార్శ్వుం డనన్ దగు

సుపార్శ్వుండును నశనిసంహ్రాది యగుసంహ్రాదియుఁ దనుప్రభాప్రహసితోద్దీప్రఘనుం డగుప్రఘనుండును మాగధీభూతసుస్తవనశ్రవణసముదాసకర్ణుం డగుభాసకర్ణుండునుఁ బుట్టి దిట్టతనంబుఁ జేపట్టి రట్టిరట్టడివీరులకుఁ దోఁబుట్టువులై బాలయుఁ బుష్పోత్కటయుఁ గైకసియుఁ గుంభీనసయు ననఁ దగుకన్నెలు చెన్నువహించి రంత. 249

మ. వసుదావోపశమాంబుదప్రతిమదీవ్యద్గాత్రుఁ డమ్మాలియుఁ
వసుదారిద్ర్యయుతుండు పెన్నిధులఁ జెందఁ గోరుచందంబునఁ
వసుదాభామినిఁ గూడి శౌర్యనిధులఁ వాంఛించి విద్విడ్విభా
వసుదాయాదులఁ గాంచెఁ బుత్రులఁ జతుర్వారాశిసంకాశులన్. 250

క. సరసుం డనలుఁడు ననిలుఁడు, హరుఁడుఁ సంపాతి యనఁగ నల్లనలువురఁ
బురుషార్థంబులవలె నొప్పిరి రాఘవ వారెకద విభీషణమంత్రుల్. 251

మ. ఇటు లమ్మాల్యవదాదు లాత్మజులతోఁ నింద్రాదిదిక్పాలకో
త్కటసంపద్గరిమంబుతోఁ ద్రిభువనత్రాసప్రదోద్యద్భటో
ద్భటధాటీఘటితార్భటీపటిమతోఁ దా రందఱుఁ గూడి ము
స్పటిలీలఁ గరుడోరగామరమునీంద్రశ్రేణి బాధింపఁగన్. 252

సురలు మునులు శివునిపాలి కరిగి యసురులం బరిమార్ప వేఁడుట

ఉ. వారియుపద్రవంబున నివారితనైభవులై సమస్తబృం
దారకులుఁ వసింపఁ దగుతా వెఁక నెయ్యది యేది త్రోవ యె
వ్వారికి విన్నవింపుదము వైదలరా పని చింతఁ జేసి యి
బ్బారి పురాపహారి యెడఁబాపఁ గలాఁ డని నిశ్చితాత్ములై. 253

తే. శ్వేతరుచిభూతిఁ దగి భవ్యశృంగకలనఁ,దనరి గజముఖసంయుక్తిఁ గని యనంతపాదకటకాప్తి నెంతయు బాగు మీఱి, శివునివలె నున్నకైలాసశిఖరిఁ జేరి.254

సీ. అహిరాజభూషణుం డైనయావేల్పు మాయహిభయం బేరీతి నడఁచు ననక
యెపుడుఁ గుత్తుక విషం బిడుకొని మాటాడు నితనిమాటలు నమ్మ పెట్టు లనక
తనవారితనముతోఁ గనుఁ బుణ్యజనుల నీయన పుణ్యజనవైరి యౌనె యనక
త్ర్యంబకుం డితఁ డనేకాంబకుల్ దేవతారిపు లెట్టువారి నిర్జించు ననక

తే. యల సుకేశకుమారసంహారమునకు
నెట్టు లొడఁబడు నితఁ డన కింద్రముఖ్యు
లటుల యాపన్నులై భద్రవటమునీడ
నిండుకొలు వున్న పార్వతీనేతఁ గనిరి. 255

క. కనివినయముభయమును బెనఁగొనఁ గరములు మొగిచి శివునకును బహుసాష్టాంగనమస్కృతు లొనరిచి యిట్లని పొగడిరి మునులఁగూడి యమరేంద్రముఖుల్.

మత్తేభగర్భితసీసము—

అభవ కందర్పమదాప హానలదృశా పద్మారికోటిప్రభా జోహారు

సుకవిసంస్తుత్య రజోగుణేతరమతీగౌరీవధూనాయకా జోహారు
ప్రభవకుంభీంద్రవిభంజనక్రమహారి బ్రహ్మాదిదేవాధిపా జోహారు
త్రిభువనాధీశ్వర దేవసంయమిమనఃపూజావిధేయాత్మకా జోహారు

తే. చంద్రశకలశిరోవతంసక జోహారు, సురధరాధరకోదండధర జోహారు
శరధికన్యామనోహరశర జోహారు, ప్రణతరక్షావిచక్షణేక్షణ జోహారు. 257

చ. రతిపతివైరి శంకర పరాకు సుకేశసురారినందన
త్రితయముచేతిబాధ నతిదీనులమై గతిమాలి లోకసం
తతులకు దిక్కు నీ వగుటఁ దావకపాదము లాశ్రయింప వ
చ్చితిమి దయాప్రసక్తి మముఁ జేకొని విన్నప మాదరింపవే. 258

ఉ. కాలిచి రాశ్రమావళులఁ గార్ముకముక్తశరాగ్నికీలలం
ద్రేలిచి రెల్లదేవతల భీరులఁ జేసిరి సిద్ధముఖ్యులం
దాలిచి రుగ్రరూపములు దైవగృహాంతరగోపురాదులన్
గూలిచి రేమి చెప్పెదము క్రూరసురారులచెయ్వులీశ్వరా. 259

సీ. పద్మాసనస్థులై ప్రణవంబు నొడువుచు ముక్కుఁ బట్టఁగఁ బాసె మునివరులకు
నేపట్లనైన స్వాహాపూర్వముగ హవ్య మగ్ని వేల్వఁగఁ బాసె యజ్వలకును
హవిరన్న కాంక్ష నేసవనకర్త గృహంబు దేఱి చూడఁగఁ బాసె దేవతలకు
గుహలలో నొంటిగాఁ గూర్చుండి నీపాదచింత సేయఁగఁ బాసె సిద్ధులకును

తే. జేరి గురుకులవాసంబుఁ జేసి శ్రుతులఁ, జదువుకొనఁ బాసె నీబ్రహ్మచారులకును
బార్వతీనాథ మాల్యవత్ప్రముఖదైత్య, శేఖరులు సేయునాజ్ఞావిశేషమునను.

ఉ. ఏమె యజాచ్యుతేశ్వరుల మేమె దినేశహుతాశనక్షపా
కాముల మేమె యింద్రయమకంధివరేణ్యుల మంచు భీమసం
గ్రామకుతూహలంబున జగత్త్రయమున్ బడలించురాక్షస
గ్రామణులన్ హరించి మముఁ గావఁగదే శివ యంచు మ్రొక్కినన్. 261

శా. ఆముక్కంటి దరస్మితంబున సుపర్వాధీశులన్ జూచి మీ
తో మోమోటము లేక తెల్పెద నవధ్యుల్ రాక్షసుల్ వారలన్
నే మర్దింపఁగ నోప వారి గెడపన్ నేర్చున్ ముకుందుండు మీ
రీమంత్రం బెద నమ్మి శౌరిఁ గనఁ బొం డిష్టార్థముల్ సేకుఱున్. 262

క. దితిజాహితుచేఁ దక్కఁగ, నితరులచేఁ జెడరు వార లిది నిజ మని య
య్యతనుహరుం డాడిన నా, శ్రితహిత మొనరింప మీకె చెల్లు నటంచున్. 263

ఇంద్రాదులు విష్ణునియొద్దకుఁ బోవుట

శా. ఆకైలాసనివాసు వీడుకొని కార్యైకాతురత్వంబునన్
బాకార్యాదులు వోయి బాడబశిఖిప్రజ్వాలికాసంగతిన్

పైకిన్ బొంగుచు ఫేనమాలికలతోఁ బల్మ్రోఁతయున్ గన్నతీ
రాకూపారముఁ జేరి తజ్జలధిమధ్యద్వీపదేశంబునన్. 264

సీ. కడలిరాయఁడు మిన్న గలమిన్న గమిడాఁప ఘటియించుబంగారుకణఁజ మనఁగ
జలధిమధ్యమునందు జనియించినసహస్రపత్త్రశోభితహైమపద్మ మనఁగఁ
దెలిదీవిపుడమిముద్దులగుమ్మ నిజవలగ్నమునఁ బూనుసువర్ణఘంట యనఁగఁ
శాథోధిసుతవీడుపట్టుచొక్కపుగుడారంపుహొంబట్టు సరాతి యనఁగ

తే. నలువు మీఱినవైకుంఠనగరిపసిడి
కోటఁ బొడగాంచి మ్రొక్కుచు గోపురంబు
దఱియఁ జొచ్చి మహోన్నతగరుడకేతు
రాజి నలరారుహరిహజారంబుఁ జేరి. 265

చ. తెలిమగజాతికంబములఁ దీఱినబంగరుకీలుబొమ్మగుం
పులకు మెఱుంగుఁగొప్పుసొలపుల్ మొలపించెడుకప్పురాలలో
పలఁ గలకల్వచప్పరపువన్నెలఁ జెన్నగునొక్కమేడలో
నలరుచు నేకతంబ కొలు వైనహరిన్ విని రాదిశాధిపుల్. 266

క. విని సమయ మౌనొ కాదో, యని యించుక నిలిచి యచట నవసరపుఁజెలిన్
గని స్వామికి మాయాగతి, వినిపింపం దగు నటంచు వేఁడిన నదియున్. 267

సీ. తిలకంబు దిద్ది దిద్దితిఁ జూడు మనురమాసుదతిచెక్కుల నీడఁ జూచువాని
మొనపంటమడుపు వేఁడిననీళ యొసఁగనందుచుఁ జుఱుక్కని మోవినొక్కువానిఁ
దనచిన్నెలకును జక్కని మొగం బటు వెట్టుకొనినభూసతి వేఁడుకొనెడువాని
వారియింతులకు మున్ వాదు తానె ఘటించి నలిరేఁగి పోరాడ నవ్వువాని

తే. నిచ్చఁ బరిపూర్ణకాముఁ డై హెచ్చువాని
నచ్యుతునిఁ గాంచి మ్రొక్కి యింద్రాదిసురలు
దేవ యరుదెంచినా రంచుఁ దెలిపినంత
శీఘ్రమునఁ దోడితెమ్మని సెల వొసంగె. 268

క. ఆవిశ్వంభరు ననుమతి, దౌవారికు లెఱిఁగి పనుపఁ దత్పరమతు లై
దేవతలు సన్నిధికిఁ జని, సేవించిరి శుక్రశిష్యజిష్ణున్ విష్ణున్. 269

వ. ఈచందంబున శంఖచక్రగదాశార్ఙ్గనందకధరుండును భక్తజనానందకరుండును నగు నద్దయాకరునకు నభివందనంబు లొనర్చి బృందారకు లిట్లని యభినందించిరి.

దేవతలు మాల్యవదాదిరాక్షసోపద్రవమును విష్ణుదేవునకు విన్నవించుట

సీ. దండంబు శార్ఙ్గకోదండోగ్రకాండప్రకాండఖండితదైత్యకాండ నీకు
జోహారు మదగజద్రోహోగ్రహావహాగ్రాహచ్ఛిదాహవోత్సాహ నీకు
వందనం బరవిందమందిరామందిరత్సుందరోరస్స్థలాళింద నీకు
జేజే హరాజాదిరాజీవపూజాసమాజోచితాంఘ్రిపంకేజ నీకు

తే. బహునమస్కారములు చక్రపాణి నీకు, నైకసాష్టాంగములు జగన్నాథ నీకుఁ
బ్రణతిశతములు సురసార్వభౌమ నీక, నంతసేవాంజలులు సదానంద నీకు. 271

ఉ. దానవవీరవైరి యవధారు సుకేశతనూజవుల్ మహో
గ్రానలదీప్తవిగ్రహు లుదగ్రులు మువ్వురుఁ గూడి లోకసం
తానము గాసిచేసెదరు తద్వ్యథ లోరువ లేక మిక్కిలిన్
దీనతఁ జెంది యిం దరుగుదెంచితి మాపదఁ బాపవే కృపన్. 272

సీ. ఖపురభేదియు నంతకచ్ఛేది యన మించుహరుభుజావైభవం బనఁగ నెంత
దరముతో జడవృత్తిఁ దాల్చి యరూపుఁ డౌ శార్ఙ్గకోదండునిసత్త్వ మెంత
చోదుచే నపహృతశ్రుతియై యజాఖ్య కాస్పదమైన వేల్పురాజస మదెంత
పాకాపహృతియు జంభవిఘాత మొనరించి యలరువృద్ధశ్రవుబలిమి యెంత

తే. యితరసుమనోగణములయహీనసమర, కర్కశత్వ మదెంతని గణుతిసేయ
రసురముఖ్యులు తామె బ్రహ్మాదిదేవ, వరుల నందఱ మించినవార మనుచు.

సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులు నిండు
బలురయంబున నీవు బాణముల్ వఱపిన విమతసైనికులప్రాణములు వఱచుఁ
గడిమిమై నీవు చక్రముఁ గేల నంటిన రాక్షసగుప్తచక్రము గలంగు
నలిరేఁగి పాంచజన్యము నీవు పూరింప నహితజన్యములు జన్యములు మాను

తే. గరుడవాహన మెక్కి లోకములు వొగడ, నందకము బూని కలనికి నడచితేనిఁ
గొంచ కెవ్వాఁడు నిన్నెదిరించువాఁడు, తామసము సేయ నేల రావే ముకుంద.

విష్ణువు సురల కభయం బొసంగుట

వ. అని యాపన్నులయి విన్నవించినవేల్పుమన్నెదొరలమొగం బ్రసన్నుం డయి వెన్నుం డిట్లని యానతిచ్చె. 275

చ. ఎఱుఁగుదు మున్ సుకేశుఁడు మహేశుకృపన్ విభవాభిరాముఁ డౌ
టెఱుఁగుదు వానిపుత్త్రకు లహీనవరంబులు బ్రహ్మ యీయఁగా
మెఱసి జగత్త్రయంబునకు మీకును బాధకు లౌట సర్వ మే
నెఱుఁగుదు వేల్పులార వెత నింకకుఁ డింక జయింతు వారలన్. 276

శా. పూర్వాదిత్యమహావిలాసము లయంబున్ జెంద నస్మద్ధను
ర్జ్యావిటంకృతిగర్జ హెచ్చ సుమనోమ్లానిత్వముల్ మాన మ
ద్దుర్వారాశుగవృష్టి ముంచి యిఁకఁ దద్దుష్టోద్యమగ్రీష్మత
ప్తోర్వీతాపముఁ బాపు నేఁగుఁ డన వా రుత్సాహముం బొందుచున్. 277

తే. ఇందిరానాథవదనారవిందగళద, మందమధురవచోమకరందబిందు
బృందతుందిలసుమనోమిళిందులై పు, రందరాదులు సెందిరి మందిరముల. 278

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని రాఘవుఁ డవల నెట్టివృత్తి మెలఁగి ర
ద్దనుజులు హరి వారలతో, నని యెటువలెఁ జేసెఁ దెల్పుఁ డని యడుగుటయున్.

ఆశ్వాసాంతము

శా. హేలాగోపితగోపికాంశుక శుకప్రేక్షాపయోధిస్ఫుర
త్ప్రాలేయాంశుయశోధురంధర ధరప్రత్యర్థిముక్తాంబుదా
భీలప్రస్తరవర్ష వారణ రణస్ఫీతామృతాంధోద్విష
జ్జాలవ్యాళభిదాఖగోత్తమ తమస్సంఛేది తేజోనిధీ. 280

క. యతికువలయహిమకర కర, భృతనందకచక్రచక్ర సితఘృణిమణిభా
సితవత్స వత్సదనుజా, యతమారుతభుజగ జగదుదంచితనియతీ. 281

భుజంగప్రయాతము.—

నిశాంతస్ఫురత్పాండుసీరేజనేత్రా, నిశాంతజ్జగద్వందనీయాబ్జమిత్రా
యశోదానదాక్షిణ్యహారిత్వధుర్యా, యశోదామనోరంజకాశ్చర్యచర్యా. 282

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర వితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనిషావిశేషమంధాన వసుంధరాధర శోభితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణం బనుమహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

———

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## ద్వితీయాశ్వాసము

—:o:—

శ్రీ రాధామధురసుధా
ధారాధరలోల కామితప్రదశీలా
శారీరశ్రీజితనవ
ధారాధరజాల శ్రీమదనగోపాలా. 1

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ సుర లిట్లు శార్ఙ్గిచేత, నభయదానంబుఁ గొని వేడ్క నరిగి రంత. 2

మాల్యవంతుఁడు విష్ణుప్రభావమును దమ్ములకుఁ జెల్పుట

శా. ఆవృత్తాంతము వేగరుల్ దెలుపఁగా నాలించి యమ్మాల్యవ
ద్దేవద్వేషి నిజానుజద్వయము నెంతేఁ గూర్మి రప్పించి మం
త్రావాసంబున నుండి యి ట్లనియె నేకాంతంబుగా శేముషీ
ప్రావీణ్యంబును గార్యతత్పరత సాభిప్రాయంబుఁ గాన్పింపఁగన్. 3

ఉ. వింటిరె తమ్ములార యొకవింత వినంబడె మొన్న నేము ము
క్కంటిఁ గనంగ నెల్ల తెఱఁగంటిదొరల్ మును లేఁగి మ్రొక్కి మీ
బంటుల మమ్ము నొంచెదరు బాధలఁ బెట్టి సుకేశపుత్త్రు ల
క్కంటకులన్ వధించి మముఁ గావఁ గదే శివ యంచు వేఁడినన్. 4

చ. కరచలనంబు మస్తకవికంపనముం గనిపింప వారితో
హరుఁ డవు డానతిచ్చెనఁట యాయసురేంద్రులు మా కజయ్యు లా
హరి యగునే జయించుఁ జనుఁ డాయనయొద్ద కటంచు నట్ల సు
స్థిరమతి వార లేఁగి రట శీఘ్రముగా నసురారియొద్దకున్. 5

చ. హరునకుఁ దెల్పినట్ల మనయాగడముల్ హరితోడఁ దెల్ప నా
హరి వెత లేల శాత్రవచయంబు వధించెదఁ గొంచ కింక మీ

యిరవుల నుండుఁ డం చభయ మిచ్చి ప్రియంబున వీడుకొల్పఁగా
నరుసముఁ జెంది వచ్చిరఁట యందఱు ముందటిలీల గుంపులై. 6

చ. అమరులపాలివాఁడు హరి యాయన యిచ్చినబాస దప్పఁడే
క్రమమున నైన గెల్చు మనగర్వము లింతకుఁ దెచ్చె నెప్డు న
క్రమమె యొనర్తు మేబలులఁ గైకొన మెంతటివారి నాదరిం
పము బలవద్విరోధము శుభం బొనరించునె యెంతవారికిన్. 7

క. హీనునితోఁ దగు రణము స,మానునితోఁ జేయఁ దగు సమాధానము సం
ధానరణంబులు దగ వస,మానునితోఁ దొలఁగి కొలిచి మనుటయె యొప్పున్. 8

మ. నయమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డై
క్కడువారిన్ దొడరంగఁ బోయి మడియున్ ఘోరానలజ్వాలలోఁ
బడి సీతా శలభంబులీల సహజభ్రాజిష్ణుశౌర్యుండు ని
ల్కడ భావంబున నుండుఁ గయ్యమునకున్ గాల్ద్రవ్వఁ దేపట్టునన్. 9

క. తనబలము నెదిరిబలమును, గనుఁగొనక హితోపదేశకర్తలపలుకున్
వినక కుజనుండు సాహస,మునఁ జెడు బలుగాడ్పుఁ దొడరు బూరుగులీలన్. 10

ఉ. కావున దేవతార్థముగఁ గయ్యము సేయఁగ వచ్చువిష్ణుపైఁ
బోవుట పాడి గా దతఁడు పుణ్యజనప్రియుఁ డాశ్రయించినన్
గావక పోవఁ డిప్పు డవకార్యము కయ్యము సెయ్య మొప్ప స
ద్భావముతో ముకుందునకె భక్తుల మైన నసాధ్య మున్నదే. 11

క. రాక్షసులు సేరినను హరి, రక్షించునె యనఁగ వలదు ప్రహ్లాదాదుల్
రాక్షసులు గారొ వారల, రక్షింపఁడొ మీ రెఱుంగరా హరిమహిమల్. 12

సీ. ప్రళయాబ్ధి మోఁకాలిబంటిగాఁ జరియించుమధుకైటభులఁ బట్టి మట్టువెట్టెఁ
జాఁపచుట్టుగ ధరాచక్రంబుఁ జుట్టి కొంపోవుహిరణ్యాక్షుఁ బొడవడంచెఁ
ద్రైలోక్యనాథుఁ డై తన కీడుజోడును గాంచ కున్నహిరణ్యకశిపుఁ ద్రుంచెఁ
జదువులదొంగ యై జలరాశి డాఁగిన కపటిహయగ్రీవు కడిమిఁ జెఱిచె

తే. నముచి వధియించె సంహ్రాదనాము నొంచె, గెలిచె శుంభనిశుంభుల నలసహస్ర
కవచుఁ దెగటార్చెఁ బరిమార్చెఁ గాలనేమిఁ, దరమె విష్ణునితోఁ బోరఁ దమ్ములార.

ఉ. వారలకంటె నెక్కు డగువారమె విష్ణునితోడఁ బోర ని
ష్కారణ మల్గఁ డాయన నిజంబుగ నేరము లేక శౌరియుం
దారయ దోస మేమి మనయందఱదోసమె తన్నోంబుజం
బీరస మొందఁ జేసె నిది యెంచి యొనర్పుఁడు మీఁదికార్యముల్. 14

తే. అని హితం బెఱిఁగించినయన్నమాట, నాసుమాలియు మాలియు నాలకించి
నీతిఁ దెలిసియుఁ దెలియక నీతి మాలి, యిద్దఱును గూడి యతనితో నిట్టులనిరి.

శా. ఇష్టైశ్వర్యయుతంబు నీనెలవు నీయిచ్ఛాదృశం బాయు వు
త్కృష్టప్రాభవశాలి వంచితతపోధిక్యంబు నీసొమ్ము నీ

శిష్టాచారము మేలుబంతి పలలాశిశ్రేణికిన్ శాత్రవా
నిష్టోత్సాహనిధాన నీకుఁ దగునే నేఁ డింత చింతింపఁగన్. 16

మ. విశిఖోత్తుంగతరంగఘుంఘుమరవోద్వేలంబు దుర్వారవీ
రశతాంబూద్భటసంకులంబు సముదగ్రచ్ఛత్ర ఫేనావృతం
బు శతాంగాద్రియుతంబు నాసురబలాంభోరాశి నీబాడబా
గ్రశరజ్వాలల నింకె; నెవ్వ రెదు రింకన్ నీకు దైత్యాగ్రణీ. 17

మ. బలవంతుల్ భవదీయపుత్త్రకులు నీభ్రాతల్ త్రిలోకైకవీ
రులు నిన్ మృత్యువు దేఱి చూడ వెఱచున్ రుద్రాచ్యుతాంభోజగ
ర్భులు నీపే రనినన్ దలంకుదురు భీరుత్వంబు నీ కేల నిన్
దెలియన్ జాలక యానతిచ్చెదవు దైతేయాన్వయగ్రామణీ. 18

తే. అస్మదాదులు సేయురాయిడి సుపర్వ
లచ్యుతునితోడఁ దెలిపినా రనియె భయముఁ
జెందెదవుగాని మనలను జెఱుప నింత
కెత్తుకొని రని యలుగ వదేమి యధిప. 19

మ. అరులన్ జంపు మటంచుఁ బంద లయి యయ్యాదిత్యు లార్తిన్ గణిం
చిరి పో సర్వసమానుఁ డైనహరి ద్వేషిత్వంబుఁ దాఁ బూని యే
కరణిన్ గయ్యము సేయ వచ్చు మనతోఁ గ్రౌర్యంబుఁ గౌటిల్య మా
హరికిన్ గల్గిన మాదృశుం డతఁడు గా కాధిక్య మే మారయన్. 20

తే. సహజమాత్సర్యమున దేవసమితితోడ, మనము దొడరిన హరియేల మచ్చరించు
నతఁడె నిష్కారణద్వేషి యయ్యె నేని, సంధికార్యంబు పొసఁగునే సరసగతిని.

తే. వనజనాభుండు గనుపించుకొను నటంచు
వెఱచి పగతురపైఁ గిన్క విడువవలెనె
యేటియోజన బలవంతుఁ డీహరి యని
యిపుడు శరణన్న నవ్వరే యెవ్వరైన. 22

తే. వెన్నునకు నస్మదాదుల మెన్నఁడైన, నపకృతి యొనర్ప నతఁ డెన్నఁడైన మనకుఁ
జేయఁ డపకృతి వేల్పులు సేసి రింత, వేలుపులమీఁద నిఁక దండు వెడలవలయు.

చ. త్రిదశులతోడఁ గయ్య మొనరించి రమాపతి యస్మదాదులన్
గదిసి రణం బొనర్చినను గా దన వచ్చునె యంతభాగ్య ము
న్నదె యెటులైన మంచిది రణం బొనరింతము వేదశాస్త్రముల్
సదివితి మీవు లిచ్చితిమి జన్నము లూనితి మైహికంబునన్. 24

తే. అన్న నీమాట జవదాఁటి యాడితి మని
యలుక సేయక ప్రతివాదములు క్షమించి
యనుమతి యొసంగు మిపుడె మదాంధు లగుసు
ఘాంధుల జయించి వచ్చెద మనుచుఁ బలికి. 25

మాల్యవంతుఁడు మొదలగురాక్షసు లింద్రునిపై దండెత్తుట

క. సేనాధిపతుల రమ్మని, దానవపతి యమరరాజధానిపయిఁ జనన్
బూనినవాఁ డిప్పుడె మన, సేనల రప్పింపుఁ డనుచు సెల విచ్చుటయున్. 26

భుజంగప్రయాతము.—

దణా పెద్దయాజ్ఞన్ సుధాభుగ్విరోధ్య, గ్రణీసేనలన్ మించె గంభీరభేరీ
ధణంధాణముల్ దేవధాసీవసద్గ, ర్భిణీగర్భగభ్రూణభేదంబు గాఁగన్. 27

సీ. తననిర్జరాచలత్వమున కుల్కి సురాద్రి వాపోవుగతిఁ బ్రతిధ్వను లొసంగఁ
దన కింక నెద్ది జీవన మంచు వారాశి గలఁగె నా జలము పంకిలము గాఁగఁ
దనమేను గరుసారఁ దమి మీఱి శశిధారి వడఁకుగుబ్బలికన్నె వడకుఁ దీర్పఁ
దనకోర్కె లీడేఱె నను చొక్కపరువుతోఁ గలహాంభోజి ముకుందుకడకుఁ బఱవఁ
తే. జెవులలో వ్రేళు లునిచి రాజీవగర్భుఁ
డిచ్చు నేమియు ననలేక ఱిచ్చపడఁగ
మించి ప్రస్థానభేరి వేయించి దండు
వెడలి రసురులు జేజేలవీటిమీఁద. 28

సీ. సౌందర్యకృత మేరుమందరాచలనిందనము లౌమహాస్యందనములమీఁద
భూరిదానోదకాపూర్ణబంధురకంధరములైన మదసింధురములమీఁద
స్వజవమానసగంధవాహవాహసబాంధవములైనఘనసైంధవములమీఁద
బ్రతిపక్షకుంభికుంభచ్ఛిదారంభరంహములైనఘోరసింహములమీఁద
తే. శరభచమరీమృగవ్యాఘ్రశల్యభల్ల, కాసరవరాహఖడ్గపుంగవఖరోష్ట్ర
విహగఫణికూర్మమకరాది వివిధవాహ, వారములమీఁద దైతేయవీరు లెక్కి.

సీ. మధ్యందినాదిత్యమండలోగ్రాంశుపాణింధమాయుధదీప్తి నింగి మ్రింగ
గాఢసర్వాంగీణకవచవజ్రచ్ఛటాచ్ఛాయ లాశాకుడ్యచర్చ లొసఁగ
వీరపాణప్రక్రియారక్తదృగ్దృశ్యవిభఖదిరాంగారవృష్టి గురియఁ
బ్రళయకాలాభ్రగర్జావదావదనిష్ఠురాట్టహాసముల బ్రహ్మాండ మగల
తే. దేవలోకజిగీష చేఁ ద్రిపురహంతు, కామకామాంతకోద్భటాకారు లగుచు
లంక విడిచి మనోపీథ శంక విడిచి, యసురు లుత్సాహము గ్రాల నరుగువేళ.

శా. ఆలంకాపురిలో వినంబడె సృగాలారావముల్ భూతవే
తాళక్రూరతరాట్టహాసములు మిథ్యాదుర్విలాపంబు ల
వ్వేళన్ వేలయు దాఁటి నద్దెసలఁ బర్వెన్ సాగరోల్లోలక
ల్లోలశ్రేణి చలించె క్షోణి నుడుపాళుల్ రాలె ప్రీలెన్ గిరుల్. 31

శా. రక్షస్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ నటించెన్ ద్రిలో
కక్షోభంబుగ మేఘముల్ గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్
పక్షక్షేపము లొప్ప నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చెఁ బ
ద్మాక్షుం డిప్పుడె మిమ్ము గెల్చు ననుప ల్కాకాశభూతం బనెన్. 32

శా. ప్రీతిన్ సూరెల నశ్వినీసుతులు రాఁ బెం పొందునింద్రున్ బలెన్
ధాత్రిన్ గొల్వఁగ మాల్యవంతుఁ డపు డాభూమాంతరిక్షో దితో
త్పాతంబుల్ దిలకించి దైవకృతముల్ దప్పింప రా దంచు ని
ర్భీతిన్ సైన్యముఖంబునన్ నడిచె నీరేజాక్షవీక్షాస్పృహన్. 33

ఉ. మాల్యవదాసురుం డిటుల మాల్యవదాఖ్యనగంబులీల నై
శ్చల్యముతో ననేకదివిషద్రిపుసంగతుఁ డై పటీర నై
ర్మల్యలసద్యశోధనసమన్వితదాత ధనార్థికోటిలోఁ
గల్యతఁ గన్యకై వడిఁ బ్రకాశిలె శత్రులు భీతి నొందఁగన్. 34

ఆ. విభునిశౌర్యధైర్యవిక్రమోన్నతిసాహ, సములు సూచి సకలసైనికులును
భయము మాలి మాలిపనుపున మృత్యువ, శాత్మ లగుచు నడచి రమరపురికి. 35

చ. దనుజవరూథినీసలలితత్వరితాశ్వఖురాహతోర్వరా
జనితపరాగ మింద్రపురిచక్కటికిన్ జను టొప్పె మీపురం
బున కదె డాడిగా దనుజముఖ్యులు వచ్చెద రేడ కైనఁ బోం
డనిమునుమున్నె ధాత్రి యమరాళికిఁ దెల్పఁగ నేఁగెనో యనన్. 36

మ. సురదంతావళదానగంధలహరిన్ సొంపొందు సారాపగాం
బురుహాళిందమిళిందబృందము మహామోదంబునన్ బైకొనెన్
జరనీలాచలభాసురాసురబలస్తంబేరమోద్యత్కటాం
తరచంచన్మద మాహరింప రిపు లన్నన్ సైఁప రెవ్వారలున్. 37

ఉ. ధాత్రితలవీటి కీగతి నుపాధి విరోధు లొనర్పఁ జూడఁ బా
లైతి నటంచు విన్ననయినట్టిక్రమంబునఁ గాంతి మాసి ఖ
ద్యోతుఁడు వీరరాక్షసభటోద్భటపాణికృపాణదీధితి
వ్రాతము గప్పినన్ గనె వివర్ణత యద్దపుబిల్లకై వడిన్. 38

వ. తత్సమయంబున. 39

విష్ణువు దేవసాహాయ్యార్థము వచ్చి మాల్యవదాదులతో సమరం బొనర్చుట

ఉ. ఆసురరాడ్భయానకజయానకనాదము లాలకించెనో
వాసవదూత వోయి యిదె వచ్చిరి దైత్యులు నా నెఱింగెనో
తా సకలాత్ముఁ డౌట విభుతన్ గనెనో తెలియంగ రాదు ల
క్ష్మీసరసోక్తులన్ దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెచ్చెరన్. 40

వ. ఈప్రకారంబున క్షీరాబ్ధికుమారితోడివిహారంబు సాలించి దనుజసంహారంబునందు డెందంబుఁ గీలించి సురబృందంబు మే లెంచి మహోత్సాహంబున. 41

సీ. వనజమోహంబునఁ జేరినభాస్కరుఁడో నాఁగ శయకుశేశయమునఁ జక్రమమరఁ
గరికరంబున సితాంబురుహంబు దగులీల నొకకేల నంబుజం బొప్పు మీఱ

నంజనాచలముపై నరుణాతపము నిండు రహి మేచకఁ గనకాంబరము దనర్పఁ
దొలువేల్పు రాప్రతిమలచెక్కడపుగండపెండెంబు డాకాల దండిఁ జూప

తే. శార్ఙ్గతూణగదాఖడ్గసహితమహిత
గరుడస్కంధ మెక్కి బంగరపుగట్టు
పుడమి గనుపట్టునీలతోయద మనంగ
శాత్రవజిగీష నరుదెంచెఁ జక్రధరుఁడు. 42

వ. తత్సమయంబున. 43

సీ. తూలఖండములట్లు తునుకలై పాథోధరములు రోదోంతరాళమున నెఱసె
సపక్షములలీల శైలముల్ దివిఁ బ్రతిధ్వానములతో నొండొంటిఁ దాఁకులాడె
శరనిధుల్ లోఁతుసూప రసాతలము దోఁపఁ జిలువరాచెలులకంటెలుచలించెఁ
కులశైలచలనంబువలన భారము మోవ బెదిరి దిక్కరులు గీపెట్టసాగె

తే. విఱిగి పెళపెళ ధరఁగూలె విపినతరులు, గ్రహవిభుని తేరిహరులపగ్గములువదలెఁ
బ్రళయఝంఝూనిలాభీలపక్షిరాజ, పక్షవిక్షేపజాతప్రభంజనమున. 44

క. పక్షీంద్రపక్షహతదీ, ప్రక్షోణీరేణుపటలి ప్రతిపక్షచమూ
రక్షోవీక్షల కప్ర,త్యక్షము గావించె భువన మంతయు నధిపా. 45

చ. హరిశరపంక్తికంటె మును పగ్గరుడోగ్రగరున్మరుత్పరం
పరలు విరోధిసైన్యములపైఁ జనఁ గూలె ధ్వజాతపత్రచా
మరసుభటప్రకాండభుజమండలమండితమండలాగ్రముల్
కదులు హరుల్ రథంబులును గాడ్పుడెఁ జేడ్పడి రెల్లసైనికుల్. 46

చ. అమరులు పుష్పవృష్టి గురియన్ దివిఁ దుంబురునారదాదిగా
నములు రహింప సేవకజనంబులు గొల్వఁగఁ జారణస్తుతుల్
ప్రమద మొనర్ప వచ్చి రిపుభంజనుఁ డాహరి యొత్తె దక్సమూ
హమథితరాజమున్ రవధుతారిసమాజము శంఖరాజమున్. 47

చ. అదిరి కడున్ సురారిభటు లాజయశంఖరవంబు వీనులన్
గదిసిన గుండియల్ వగులఁ గంపముతోఁ దల లెత్తి కాంచన
చ్ఛదరుచి మించునగ్గరుడుఁ జక్కఁ గనుంగొన లేక భీతులై
యదె యిదె వాఁడె వీఁడె హరి యంచుఁ జలింపఁగ సైనికాగ్రణుల్. 48

ఉ. గర్వముతోఁ సుపర్వులకుఁ గా నని సేయఁగ వచ్చితే యిదే
సర్వసమానలక్షణము వాలు హరీ నిలు పోకు మం చహం
పూర్వికతో గదాపరశుముద్గరతోమరపాణులై మహా
పర్వతరాజమున్ మశకపంక్తులయ ట్లెదిరించి రొక్కటన్. 49

సీ. వర్షాబ్దగతి నంపవానదైత్యులు ముంప నచలుఁడై హరి యంజనాద్రిఁ దెగడె
శలభసంహతిలీల శత్రు లొక్కట మీఱఁ గేదారగతి నొందెఁ గేశవుండు

మశకపంక్తులయట్లు మూర్తు రుద్ధతిఁ జూపఁ గట్టుఁదాలువుజెట్టిబెట్టుఁ జెందె
మకరవైఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధివహి వహించెఁ
తే. బూర్వదివిజులు దివిజులపోల్కి నిగుడ
నయ్యనంతుం డనంతాభ నతిశయిల్లె
దొరయు మధుమక్షికలవీఁకఁ బడులు దాఁకఁ
దేనెపెరదారి మధువైరి గానిపించె. 50

శా. రక్షోరాజధనుర్విముక్తశతధారస్ఫారహృద్వాయువే
గాక్షీణాస్త్రపరంపరల్ నిగిడి కీలాభీలతన్ వచ్చి ప
ద్మాక్షుం జొచ్చి యడంగె నొక్కటఁ దదీయాంగంబునన్ బద్మగ
ర్భక్షీణావసరంబునన్ భువనముల్ ప్రాపించి లో నొరహిన్. 51

వ. అప్పుడు. 52

సీ. పలునగంబులు వజ్రపాణి మార్కొనులీల రథికసారథులతో రథము లడరె
హరినీలశిఖరిఁ గోరాడఁ దార్కొనుజాడ నిజయూథపులతోడ గజము లడరెఁ
బక్షితార్క్ష్యుత సహింపనిచందమున నాశ్వికశ్రేణితోఁ దురంగమము లడరెఁ
గదనమం దెటులైన నిదియె దిక్కనురీతి హరిపదంబున భటోత్కరము లడరె
తే. నడరినప్పుడె రథికదోంధికధన్వ, శింజినీఘోషములును హస్తిపకహుంక
రణము లాశ్వికధిక్కారరవము లుగ్ర,భటకహాకహాచ్ఛటులు దిశాపటలి నెరసె.

శా. ఆనక్తంచరశేఖరుల్ గురియుదివ్యాస్త్రప్రవర్షంబులున్
నానాశస్త్రపరంపరల్ పయిపయిన్ నారాయణున్ గ్రమ్మినన్
దా నుచ్ఛ్వాసము లేనియట్లొకముహూర్తం బయ్యెడన్ గన్పడెన్
బ్రాణాయామపరాయణుం డయినవిప్రగ్రామణిన్ బోలుచున్. 54

క. మీనసమూహము పొరల మహానీరధిఁ గలఁగ నట్లు హరియున్ రక్ష
స్సేనాధిపనానాస్త్రవి,తానములకుఁ గలఁగఁ డుగ్రతరకోపమునన్. 55

మ. అతిశీఘ్రంబున శార్ఙ్గ మెక్కిడి గుణం బాభీలతన్ దీటుచున్
శతధారాగ్రములై మనోజవములై సంవర్తకాలానలా
ద్భుతకీలాభములై తనర్చుశరముల్ దోరంబుగా నేసినన్
శతశఃఖండములైరి రాక్షసవరుల్ సంగ్రామరంగంబునన్. 56

క. శ్రుతివాఁక శరము లరిఁ బో,సి తిగిచి హరి యేయ నసురసేనలఁ బడియెం
జతురంగంబులు దిలశ, శ్శతశఃకణశస్సహస్రశః ఖండములై. 57

ఉ. వాయువుచేఁ బ్రభూత మగువానవలెన్ నిజశార్ఙ్గముక్త మా
సాయకపాత మద్దనుజసైన్యము ముంచిన నుత్సహించి నా
రాయణుఁ డొత్తె నప్పుడు యుగాంతపయోధరఘర్షణోదిత
స్ఫాయదభంగురాశనినిభధ్వనిధుర్యము శంఖవర్యమున్. 58

శా. ఆ నారాయణశంఖరాజరవ మిట్లత్యుగ్రమై విద్విష
త్సేనాధీశులవీనులన్ దూరయ భీతిం జెంది సింహం బర
ణ్యానిన్ గర్జిల నేనుఁగుల్ బెగడున ట్లందంద మూర్ఛిల్లుచున్
దీనత్వంబునఁ ద్రెళ్లుచున్ నలుగడన్ దృష్టించుచున్ స్రుక్కఁగన్. 59

చ. గతులకుఁ బాసె నశ్వములు గంధగజంబులు మూర్ఛిలెన్ రథ
ప్రతతుల త్రోవ గట్టువడె బన్నముఁ జెందెఁ బదాతిజాతి య
ద్భుతవిజయాంబుజధ్వనికిఁ దోడుగఁ గేశవుఁ డార్చి సంగర
క్షితి యద్రువన్ దిశాకరులు చేడ్పడ శార్ఙ్గగుణంబు దీటినన్. 60

వ. వెండియు నక్కుండలీశశయనుండు కుండలీకృతకోదండమండితకరుం డయి గండు మిగిలి చండతరాఖండలమండలాగ్రనిభాఖండకాండ మండలాగ్రంబులన్ గొండలవలె దండిగల చండరాక్షసులగుండెలన్ బగిలించుచుఁ గండల నగలించుచుఁ గోదండంబుల ఖండించుచు దోర్దండంబులన్ దుండించుచు జోళ్లన్ జించుచుఁ గాళ్లన్ ద్రుంచుచుఁ బ్రక్కలన్ గ్రొచ్చుచు డొక్కల వ్రచ్చుచు నెమ్ముల రాల్చుచుఁ గొమ్ముల జీల్చుచు ఛత్త్రంబుల ఛేదించుచు గాత్త్రంబుల భేదించుచు మెడలన్ ద్రెంచుచు నొడల నొంచుచుఁ జేతికత్తులన్ ద్రోయుచు భీతచిత్తులన్ జేయుచుఁ గపాలంబుల నాస్ఫోటించుచుఁ గపోలంబుల నుత్పాటించుచు నరంబుల వదలించుచు శిరంబుల విదలించుచు భూషణంబుల నులుపుచు దూషణంబుల సలుపుచు ధైర్యంబుల నెంచుచు శౌర్యంబుల నడంచుచు ధ్వజంబులన్ జెడఁగొట్టుచు గజంబులన్ బడఁబెట్టుచు దొండంబులఁ గోయుచు గండంబుల వ్రేయుచుఁ దేరుల కరుగుచు సూరెల దిరుగుచు భీతుల వడఁదీర్చుచు సూతులఁ గడతేర్చుచు యోధులఁ గట్టుచు బాధలఁ బెట్టుచు బిరుదులన్ బాపుచుఁ గఱదలన్ జూపుచు నెక్కడఁ జూచినన్ దాన యై చుట్టుఁగ్రైదువున్ బట్టుకయై దిట్టతనంబుతో బెట్టిదంబుఁ గనిపించు నెడన్ బ్రళయోద్దండమార్తాండమండలంబుననుండి నలుగడల నిండికొను కరమండలంబుల మెండున నజాండోపరీతరంగమాలికలవలన్ దుఱంగలించు నభంగతకోత్తుంగతరంగమాలికల తెఱంగున మహాగరుత్ప్రేరితగిరి గుహాకుహరసరణిన్ బఱతెంచు కాలసర్పంబులదర్పంబులన్ గప్పుజిగి దలిర్ప నుప్పొంబునన్ గప్పుకొని మిగుల మెఱయు కారుమొగిళులవలన దిగునగణిత జలధారలతీరున దద్విశిఖంబు లసంఖ్యాతంబు లయి నిశాటులశరీరంబులు శోషింపన్ జేయుచు నమృతాశనవైరుల లోఁబఱచి ముంచుచుఁ జక్రిదూషకులమర్మంబులు నాటుచు ఘనవిపక్షులశిరంబులపయిఁ దొరఁగుచు మఱియు నరిదిగా నరిపుండరీకంబుల ఖండించుచుఁ గౌశిక ప్రతోషకరంబులై పరవాహినుల యుబ్బడంచుచు నత్యంత సంతాపకరంబు లయి యెదిరించిన

వారి కమృతపదంబుఁ జూపుచు గరుత్పరంపరాపరిణద్ధంబు లై రుధిరంబు వెడ
లించుచు నప్రదీప్రశిఖిశిఖాప్రతీపంబులయి ప్రతిపక్షబలంబులపయిం బ్రవహించు
నప్పుడు పద్మనాభుండు భద్రేభవరదుండు మీ రతనిధర్మంబున మెలంగుచుం
డియు మమ్ము నొంచవచ్చుట మేరగాదని వారించుతీరున సంచలత్కరంబులయి
ఘీంకరణంబు లొనర్చుచుఁ దదభిముఖంబుగా శరణాగతరీతిఁ బడుగంధసింధు
రంబులకు హరి సారూప్యం బొసంగెనో యన నూతనక్షతధారాపూరంబులు
గెంబట్టుఁబుట్టంబులుగాఁ గరాగ్రపరిసరపతద్రథచక్రంబులు చక్రంబులుగా విమత
విగతవిజయశంఖంబులు దొలిశంఖంబులుగాఁ గ్రిందఁబడిన వీరయోధబాహు
కాండంబులుశయనీకృతబిలేశయప్రకాండంబులుగాఁ జెలువొందనందుఁ గ్రందు
సేయుచు భూతప్రేతవేతాళకూశ్మాండబ్రహ్మరాక్షసపిశాచశాకినీఢాకినీగణంబులు
దేవాసురగణంబువలె ద్వివిధంబయి యాయుధాస్థిభూషణరజస్సికతాతలంబున
నిలిచి మహాసింధురబంధురకబంధమంథాచలంబునడుమ నిడుదనరంబులు నూఱా
ఱు లొక్కటిసేసి గట్టిగాఁ జుట్టి యిరుదెగలవా రిరుదెసం బట్టి శోణితాంబుధి
మథించుచుఁ దన్మధ్యంబుననుండి శాకినీభూతంబుపొడవుగా నెత్తినముత్యాలగొ
డుగు గ్రొత్తగాఁ బొడమినచంద్రుం డనియుచు బ్రచ్ఛన్నంబుగా మునింగియుండి
బయలుదేఱినమోహినీభూతంబు లచ్చర లనియు నంగహీనంబు గానిమత్తమా
తంగశవంబునకు వెండియు రెండుకొమ్ములిడి ప్రేతావేశంబునఁ బఱతేర నదియే
చతుర్దంతదంతావళం బనియును శ్వేతాశ్వశవం బుచ్చైశ్శ్రవం బనియును
విచిత్రవర్ణపతాకాకీర్ణపటచ్ఛత్రచామరశకలావికలరథస్తంభజాతంబు పారిజాతం
బనియుఁ గమనీయసౌందర్యలీలఁ బయలుపడినకామిని యిందిరాకామిని యని
యును బ్రహ్మరక్షో ధన్వంతరిస్థూలకపాలకలశంబునం దెచ్చినరసతైలం బమృత
రసం బనియు నిబంధించి తదర్థంబుగా నిరుదెసలపెద్దలును సన్నద్ధులై పెద్దయుం
బ్రొద్దు యుద్ధంబుసేయుకోలాహలంబు కౌతూహలంబుగల్పింపఁగా వరించి విరించి
పట్టి విపంచిపట్టి బెట్టుగా బొట్టగీతంబులం దలపెట్టె నట్టియెడ నజ్జగజెట్టి మహా
రణ్యంబు సొచ్చినకార్చిచ్చు పెచ్చునం బ్రళయసముద్రంబుదొరసిన సంకర్షణాగ్ని
బింకంబున. మేఘజాలంబుపయి నడరినఝంఝానిలంబువేగంబున నంధతమసంబు
పయి నొలసిన మధ్యందినసూర్యశౌర్యంబున నవార్యక్రౌర్యంబుఁజూపినయా
పురుషోత్తముదాపున నిలువనోపక కకావికలై భేరుండంబునకుం బాఱుశరభం
బులరభసంబున కులుకుకొదమసింగమ్ముల భంగంబునఁ గొదమసింగంబునకుఱుకు
మత్తమాతంగంబులఘటలయటుల మత్తమాతంగంబునకుం బఱచువ్యాఘ్రం
బులశీఘ్రంబున వ్యాఘ్రంబునకు వెఱచుకురంగంబులతెఱంగున నిలిచినచో

నిలువక యొండొరులఁ బిలువక తిరిగి చూడక పడినకత్తు లెత్తఁ జేతులాడక
హతశేషు లైన దోషాచరులు విముఖులై లంకాభిముఖులయి పఱచి రయ్యెడ.

క. పాఱెడిరిపుల రణస్థలిఁ, బాఱెడిబహురుధిరనదులఁ బ్రతిబలములపై
శాఱెడి శరములఁ గని సాం, పాఱెడి మతిశంఖ మొత్తె హరి యవ్వేళన్. 62

సుమాలి విష్ణునితో యుద్ధము సేయుట

మ. హరిచే నొచ్చి సదైన్యమై పఱచు సైన్యంబున్ జయోత్సాహి నా
హరి వీక్షించి సుమాలి రోషవివశుం డై చండకాండంబులన్
హరిశాతాశుగవృష్టి మాన్చి రవి నీహారచ్ఛటల్ గప్పువై
ఖరి మైఁ దూపుల ముంచి దిక్కు లద్రువంగాఁ బేర్చి పెల్లార్చినన్. 63

శా. ప్రావృట్కాలఘనార్భటుల్ విని శిఖివ్రాతంబు లేతెంచున
ట్లావీరాగ్రణిసింహగర్జ విని మున్నాపన్నులై చన్నయా
దేవద్వేషులు క్రమ్మఱన్ మఱలి బుద్ధిస్థైర్యశౌర్యాఢ్యులై
గోవిందున్ వెసఁ దాఁకి మున్పటివలెన్ ఘోరంబుగాఁ బోరఁగన్. 64

చ. అపుడు సుమాలి హేమకవచావృతుఁ డై సతటిద్ఘనంబుతో
నుపమకు వచ్చి రత్నకటకోజ్జ్వల ఘాకర మెత్తి యుత్కట
ద్వీపమువలెన్ ముకుందుఁ బఱ తెమ్మని పిల్చుచుఁ గేకవ్రేయుచున్
విపులశతాంగమున్ మెఱయ వే చని మార్కొని విక్రమించినన్. 65

మ. సరసీజాక్షుఁడు మందహాసము దనర్పన్ బ్రోల్లసత్కుండల
స్ఫురితం బైనతదీయసూతుశిర మచ్చోఁ ద్రుంచి యజ్ఞోదుమై
శరసంఘంబులు నించి యార్చిన రథాశ్వంబుల్ నిజక్షత్త లే
మి రథం బీడ్చుక యేఁగెఁ దత్సమరభూమిన్ బాసి యుద్భ్రాంతిమై. 66

వ. ఈక్రమంబున. 67

విష్ణునిదరిసెనముచే సుమాలి యనురాక్షసుఁడు మడియుట

ఉ. భ్రాంతము లై రథాశ్వములు పాఱ సుమాలియు నిల్వలేక యు
ద్భ్రాంతి వహించె నింద్రియపరంపర నిల్వనిభ్రాంతచిత్తున
ట్లంతఁ బరాఙ్ముఖుం డయినయన్నఁ గనుంగొని మాలి వచ్చి శ్రీ
కాంతునిఁ దాఁకె యుద్ధకుతుకంబున హైమరథాధిరూఢుఁ డై. 68

వ. ఇవ్విధంబునం బ్రతాపజితాంశుమాలి యగుమాలి వనమాలిన్ దాఁకి మహా
సాహసంబున. 69

మ. ఘనకోదండగుణారవంబు దశదిగ్భాగంబులన్ నిండఁ గాం
చనపుంఖాంచితబాణముల్ దొడిగి లక్ష్యం బైన శ్రీవత్సలాం
ఛనువక్షంబునఁ దూఱ నేయ నవి క్రౌంచంబున్ బ్రవేశించుహం

సనికాయంబులలీలఁ జొచ్చి చన నిచ్చెన్ గుండె దేవౌఘముల్. 70

ఉ. మాలిధనుర్విముక్తశితమార్గణముల్ శతకోటికోటు ల
వ్వేళ నిజాంగమున్ దొరసి వేదన సేయఁగ ధైర్యసంపదన్
దాళెఁ బయోజనాభుఁడు రణంబున నింద్రియజేత యోధులన్
దాలిమిమై సహించినవిధంబున రామనృపాల వింటివే. 71

క. ఈక్రమమున మాలిభుజా, విక్రమమున నొచ్చి మెచ్చి విష్ణుఁడు శార్ఙ్గా
వక్రజ్యారవ మఖిలా, శాక్రోడము లావరింప సంరంభమునన్. 72

చ. కులిశసముజ్జ్వలద్విశిఖకోటులు మాలిశరాళిఁ ద్రుంచి త
జ్జలదనిభాంగమున్ గదియ శార్ఙ్గి మెఱుంగులఁ బోలువాలుఁదూ
పులు నిగిడింపఁగా నవియుఁ బోయి తదీయశరీరరక్తమున్
బలువిడిఁ గ్రోలె మున్నమృతపానము సేయుసురౌఘమున్ బలెన్. 73

చ. మద మిటు లార్చి పేర్చి వనమాలి చలంబున మాలివాజి ప
ల్చిదురుప లై ధరన్ గలయఁ జేసి శరాసముఁ ద్రుంచి టెక్కెమున్
బ్రదరముపా లొనర్చి హయపాటవమున్ ఘటియించి సూతునిన్
దుదిఁ గనఁ జేయ వాడు విరథుం డయి చండతరాగ్రహంబునన్. 74

మ. గదఁ గేలన్ గొని శృంగవద్గిరిరహిన్ గ్రావంబుపై నుండి యు
న్నదమై కేసరి డిగ్గులీల రథ మంతన్ డిగ్గి పల్లాఱు న
గ్గదఁ జక్రాకృతిఁ ద్రిప్పుచున్ గదిసి నాగద్వేషిమూర్ధంబు బి
ట్టదరన్ గొట్టె మహాద్రి వజ్రహతి వ్రయ్యన్ జేయుజిష్ణున్ బలెన్. 75

ఉ. మాలిగదాహతిన్ బిలుకుమాలి విహంగమవాజి ధైర్యమున్
దూలి పయోధి మున్ దిరుగుతోరపుగట్టువలెన్ జలించి య
వ్వేళఁ బరాఙ్ముఖుం డయిన వెన్నుఁడు నివ్వెఱ నొందె నందునన్
మే లని యార్చి రాసురులు మింట సుపర్వులు పిచ్చలింపఁగన్. 76

వ. అప్పుడు. 77

చ. గరుడుపరాఙ్ముఖత్వమును గర్వితు లై రిపు లార్చుపేర్మియున్
సురలభయాకులస్థితియుఁ జూచి యి దేమి ఖగేంద్ర యంచు శ్రీ
హరి దనహస్తపద్మమున నాతనిమస్తము సంస్పృశించి యా
తురత హరించి శాత్రవు నెమొర్గొనఁ జేసి పరాక్రమంబునన్. 78

ఉ. కేలి సుదర్శనాయుధముఁ గేశవుఁ డంప యుగాంతపావకా
భీలమహాస్ఫులింగచయభీషణకీలకరాళ మై లయో
ద్వేలఘనాఘనోద్గళితదీర్ఘతరాశనిభూరిఘోష మై
మాలిశిరంబుఁ ద్రుంచె క్షణమాత్రముతో దివి వేల్పు లుబ్బఁగన్. 79

క. చక్రాహతి నీక్రమమున, నాక్రవ్యాదోత్తమోత్తమాంగము దెగి భూ

చక్రము గ్రక్కదలన్ బడె, శక్రశతారచ్ఛితోగ్రశైలము లీలన్. 80

శా. ఈలీలన్ హరి మాలిఁ ద్రుంచుటయు దేవేంద్రాదిదిక్పాలకుల్
చాలన్ సంతసమంది దివ్యసుమవర్షంబుల్ ప్రవర్షించి ర
వ్వేళన్ వానివిధంబుఁ గన్ను లెదుటన్ వీక్షించి శోకానల
జ్వాలల్ గ్రాలఁ దదగ్రజుల్ వగచుచున్ సైన్యంబుతోఁ బాఱఁగన్. 81

శా. లంకామార్గము వట్టినట్టిరిపులన్ లక్షించి తార్క్ష్యుండు సా
హంకారస్థితి వెంబడిన్ బడి స్వపక్షాభీలవాతంబు న
ల్వంకల్ దార్కొనఁ జేయఁ దూలములలీలన్ వార లుద్విగ్ను లై
బింకం బేది చనంగఁ గేశవుఁడు గంభీరాట్టహాసంబునన్. 82

మహాస్రగ్ధర. బెదరించున్ బెట్టుమించున్ బెనుశరములచే భీకరస్ఫూర్తి ముంచున్
గుదియించున్ గోపగించున్ గురుముసలములన్ గొట్టి బాధించు వంచున్
గదనొంచున్ గండడంచున్ ఘనపరిఘములన్ ఖడ్గమున్ గైధరించున్
విదళించున్ వెంబడించున్ విసువ కసురులన్ విష్ణుఁడీరీతిఁ ద్రుంచున్. 83

వ. అప్పుడు. 84

మ. జహదస్త్రంబు లుదత్తురంగముఁ బతచ్ఛత్త్రధ్వజంబున్ క్షిప
ద్బహుశీర్షంబు నటత్కబంధము గళద్రక్తంబు ధావద్భటం
బుహాసద్భ్వాతము విస్రవచ్ఛ్రమపయఃపూరంబు నై యిందిరా
గృహిచే శత్రుబలంబు పెంపు సెడి పాఱెన్ దక్షిణాశాగతిన్. 85

క. హరివెనువెంటన్ దగిలిన, కరినివహముచందమునఁ గకావిక అగుచున్
హరి వెనుతగిలినఁ బఱచిరి, కరినివహముతోడ రిపులు కాకుత్స్థమణీ. 86

తే. ప్రళయఝంఝాసమీరంబువలనఁ జెదరి
పఱచుకాలాభ్రములలీలఁ బద్మనాభ
శార్ఙ్గకోదండనిర్ముక్తసాయకోగ్ర
పవనహతి దైత్యసంఘముల్ పఱచె నపుడు. 87

చ. గరుడతురంగనందకవిఖండితదానవరాట్తనుచ్యుతా
భరణరుచుల్ దిగంతములఁ బర్వ ఘనాఘనకోటినుండి భా
సురగతి మించుమించు లన క్షోణిపయిన్ హరి కుంకుమాంబువుల్
గురియు తెఱంగునం దొఱఁగెఁ గ్రొత్తగ నెత్తురుటేఱు లత్తఱిన్. 88

మ. ఘనదైతేయఘనాఘనప్రచయ మాకాశంబునం దాజనా
ర్దనపర్జన్యునియుక్తిఁ జెంది రణవర్షావేళ వర్షించె నూ
తనకీలాలము హారమౌక్తికలసద్వర్షోపలవ్యాప్తి భూ
తనికాయం బనుచాతకప్రతతి కుత్సాహంబుఁ గల్పింపుచున్. 89

వ. ఈక్రమంబున. 90

మ. గమకంబుల్ సెడి క్రైదువుల్ విడిచి యంగంబుల్ సెమర్పన్ నిరూ
ఢ మహాప్రాణభయంబునన్ దలలు వీడన్ రక్తముల్ గ్రక్కుచున్
విముఖత్వంబునఁ బాఱురాత్రిచరులన్ వెన్నాడి మున్నాడి వి
క్రమమున్ జూపుత్రివిక్రమున్ మరలి చక్కన్ జూచి రోషంబునన్. 91

మాల్యవదాదులు యుద్ధమునుండి తొలఁగుట

చ. రణనయవేది యద్భుతపరాక్రమవంతుఁడు మాల్యవంతుఁ డా
క్షణమున వేల దాఁటి చనుసంద్రములీల స్వకీయవాహినీ
గణముఁ గ్రమించి యాహరిముఖాముఖికిన్ జని ప్రజ్వలత్క్రుధా
రుణనయనంబులన్ మిడుఁగుఱుల్ సెదరన్ దలయూఁచి యిట్లనున్. 92

ఉ. ఒప్పునె నీకు మాధవ యయో రణధర్మము వీరధర్మమున్
దప్పి భయార్తులై పఱచుదైత్యుల వెన్కొని హింస సేయఁగా
నిప్పని హీనుఁడైన ఘటియించునె భీతులఁ ద్రుంచువానికిం
జెప్పెడి దేమి కీర్తియును సేమము స్వర్గముఁ గల్గ నేర్చునే. 93

చ. సమరపరాఙ్ముఖున్ దొడరి చంపినవాఁ డెటువంటిమంచిపు
ణ్యము లొనరించినన్ బొరయఁ డంద్రు దివం బది యట్లు లుండెఁ
గయ్యము ఘటియింప నంత ప్రియ మైనను నే నిదె యున్నవాఁడఁ జూ
పుము భుజశౌర్య మీవెఱచిపోయెడిదైత్యులఁ దాఁక నేఁటికిన్. 94

క. అని పలికి మాల్యవంతం, బనుశైలములీల నిశ్చలాత్ముం డై ని
ల్చినమాల్యవంతుఁ గను గొని, కనుఁగొనఁ గెంజాయదొలుకఁగా హరి పలికెన్.

ఉ. ఓయినిశాచరప్రవర యొప్పగ నిప్పుడు వల్కినీరణ
న్యాయము లెందుఁ బోయె సురనాథులఁ దోలెడుచోటఁ జాలుఁ బో
న్యాయముచేతఁ గాదె జయ మందుట మీరు జగం బెఱుంగదే
న్యాయము మేము దప్ప మొకనాఁటి కి దెట్లన విన్ము తెల్పెదన్. 96

ఉ. మున్ను విధాత మీకు వరముల్ కరుణించుటఁ జేసి త్రోయ రా
కిన్నిదినంబు లేను క్షమియించితి వేల్పులు మాకుఁ బ్రాణముల్
విన్నఁదనంబు వారి కొదవించినమిమ్ము రసాతలంబునన్
మిన్నక తూఱినన్ వెఱచి, మి న్నిఁక బ్రాఁకినఁ బట్టి చంపుదున్. 97

మ. అమరుల్ మీవలనన్ భయార్తులయి న న్నర్థించినన్ దైత్యులన్
సమరక్షోణి జయింతుఁ బొండని ప్రతిజ్ఞాపూర్వకాభీతిదా
సము ము న్నిచ్చితి భీతి నున్న శర ణన్నన్ వందినన్ వ్రాలినన్
మిము ఖండింపక బోవ నన్న నతఁడున్ మే లంచుఁ బెల్లార్చుచున్. 98

చ. కనుఁగవ గొప్పనిప్పు లొలుకన్ బటురోషరసారుణాబ్జలో
చనుఁ డగువిష్ణుమీఁద నొకశక్తి మహాభుజశక్తిఁ బూన్చి వై

చిన నది ఘంటికల్ రొదలు చేయఁగ మంటలు మింట నంటఁగాఁ
జని హరిఁబొమ్మునన్ మెఱసెఁ జాదఘనస్థితచంచలాద్యుతిన్. 99

మ. దనుజారాతియు నంతఁ బేరురమునం దళ్కొత్తుతద్ఘోరసా
ధనముల్ గ్రమ్మఱఁ బూని శాత్రవునిమీదన్ వైవ సేనాని పం
చినశక్తిన్ బలె మాల్యవంతు నెదఁ జొచ్చెన్ వ్రచ్చి దానన్ మహా
శనిపాతంబునఁ గూలునీలగిరియోజన్ వ్రాలె వాఁ డుర్వరన్. 100

చ. తొడిగినజోడు వ్రయ్యలుగఁ దొరవునెత్తుటఁ దోఁగి యాగతిం
బడి మఱికొంతసేపునకుఁ బైకొనుభ్రాంతి దొఱంగి స్వస్థుఁ డై
యడరి నిశాచరాగ్రణి మహాగిరిపోలిక సుస్థిరాకృతిన్
దడఁబడ కేగుదెంచి హరి దార్కొని మార్కొని విక్రమంబునన్. 101

మ. రటదత్యుజ్జ్వలకింకిణీశతసహస్రస్ఫారకార్ష్ణాయస
స్ఫుటశాతోత్కటకంటకప్రకట మై పొల్పొందుశూలంబు ని
క్కటపుందెంపునఁ బూని కేశవునివక్షోదేశముల్ గ్రుమ్మి యం
తటఁ బో కద్దివిజారి ముష్టినిహతిన్ దాటించె రోషంబునన్. 102

ఉ. ఆతనిసాహసంబునకు నచ్చెరువందె వియచ్చరవ్రజం
బాదటఁ మేలు మే లనుచు నార్చిరి దైత్యులు మాల్యవంతుఁ డీ
రీతి ముకుందు నొంచి యరరే నిలు మంచు ఖగేంద్రుమోము ని
ర్ఘాతముఁ బోలుముష్టిహతి ఘట్టన సేసి పరాక్రమించినన్. 103

ఉ. పక్షికులేంద్రుఁ డగ్గి నిజపక్షపరంపరఁ బుట్టుగాడ్పునన్
రాక్షసరాజసైనికుల రాయుడిఁ జేసిన పండుటాకుల
ట్లక్షమతన్ క్షణం బయిన నచ్చట నిల్వఁగ లేక బెండు లై
దక్షిణవార్ధిలోఁ బడిరి దైవవశంబున లంకత్రోవగన్. 104

వ. అంత. 105

మ. వినతానందనపక్షమారుతహతిన్ విభ్రాంతుఁ డై మాల్యవ
ద్దనుజేంద్రుం డట నిల్వఁ గూడకయ సోదర్యాప్తమిత్రంబుగాఁ
జనియెన్ లంకకు సిగ్గుతో నిటుల కంజాతాక్షుచేఁ బెక్కుమా
ర్గనిలో నొచ్చి రసాతలస్థు లయి రయ్యా దానవుల్ రాఘవా. 106

తే. వెలయసాలకటంకటకులమువార, లధికు లమ్మాల్యవన్ముఖ్యు లాహవమున
రామ నీచేత హతు లైనరావణాది, దనుజవరులు పులస్త్యగోత్రంబువారు. 107

తే. రావణాదులకంటె నిర్వక్రవిక్ర,మక్రమంబున ఘను లైనమాల్యవన్ము
ఖాసురగ్రామణుల గెల్వ హరికిఁ దక్క,నలవియె తదన్యులకు భానుకులవరేణ్య.

చ. హరి హరి యంచు మే మనఁగ నన్యువలెన్ విన వేల నీవె శ్రీ
హరి విభుఁ డాలకించినమహత్త్వము నీయదె శంఖచక్రముల్

కరములఁ బూన కిద్దివిజకంటకులం బాలియింప మానుష
స్ఫురణ జనించినాఁడవు ప్రబోధనిధుల్ నినుఁ గందు రాత్మలన్. 109

ఉ. దుర్మతు లెచ్చి సాధులకు ద్రోహము సేయునెడన్ జగంబునన్
ధర్మము దప్పునప్పు డవతారము లెత్తి విశిష్టరక్షణల్
గూర్మి నొనర్చి దుష్టజనకోటి హరింతువు రావణాదిదు
ష్కర్మపరామరారిగిరిశంబకరా రఘువంశశేఖరా. 110

మ. అలపౌలస్త్యులకంటె వీరు లగుపూర్వాదిత్యులన్ లంక వా
రలు ప్రాపించుట శౌరి వైరమున వీరత్వంబు దీఱన్ రసా
తల మాభీరులు సేరుటం దెలిపితిన్ దర్వాతివృత్తాంతమున్
దెలియన్ జెప్పెద నాలకింపుము కథాధీనావధానుండ వై. 111

వ. అని కలశజుండు మున్ను తన్ను రఘువీరుం డడిగిన ప్రశ్నంబునకు నిటుల సదు
త్తరం బొసంగినవాఁ డై మఱియు నిట్లనియె. 112

సుమాలినిర్దేశముచేఁ గైకసి విశ్రవునాశ్రమంబు సేరి యతని వరించుట

సీ. అమరలోకముజోక నాలోకనీయ మై యేలోకము సమృద్ధి నింపొనర్చుఁ
గమలాప్తకమలారికాంతు లొందకయ యేస్థలము రత్నప్రకాశముల వెలుఁగు
బలినిశాచరసార్వభౌమునాజ్ఞావిశేషమున నేభువనంబు సౌఖ్యముఁ గను
భోగవత్యాపగాంభోజగంధానిలవ్యాప్తి నేనెలవు పావనతఁ జెందు

తే. హాటకేశ్వరసేవాగతాగతాహి, కన్యకానూపురారభటిఁ గర్ణసుఖ మొ
సంగు నేపద మట్టిరసాతలమున, నుండి యంత సుమాలి తానొక్కనాఁడు. 113

మ. ధరణీలోకవిలోకనోత్సవ మెదన్ దార్కొన్న స్వర్ణాద్రితుం
గరథస్థుం డయి పుత్త్రి కైకసి నిజాంకం బెక్కి రాఁ జంచలా
స్ఫురితం బై తగునీలమేఘమువలెన్ భూపాలసద్గాత్రుఁ డై
సరిదంభోధివనప్రదేశములఁ సంచారంబు గావింపఁగన్. 114

లయగ్రాహి.—
చారుపదనూపురము లారభటి మీఱమణిహారములు చన్గవలఁ దాళిసిల మెలో
య్యారముల నచ్చరలు పేరణినటింప వరచారణులు దేవ యవధారనిజతై తై
వారముఘటింపఁ బలుమాఱు వెలిచామరము సూరెలవియచ్చరకుమారికలు వీవ
న్బేరుగలపుష్పకముపై రుచిరలీల గురు జేరఁ జనుధీరునిఁ గుబేరుఁ బొడగాంచెన్.

ఉ. కాంచి సుమాలి వెండియు నెగాదిగఁ జూచి కళానిరూఢి నూ
హించఁగ వీనిఁ బోలఁ గలఁడే యలరేడొర యిట్టిపుత్త్రునిన్
గాంచినవిశ్రవోమునిది గా మఱి భాగ్య మయారె రాక్షసుల్
గాంచరె సౌఖ్య మీదృశునిఁ గైకసి విశ్రవుఁ జేరి కాంచినన్. 116

మ. అని రక్షోహితకార్యకాంక్షి యగునయ్యాదిత్యవిద్వేషి యో

జనఁ గావించి విముక్తపద్మ యగుశ్రీచందాన నింపొందునం
దనమో మాదరపూరితేక్షణములన్ దర్శించి వంశంబు మ
న్ననుపాయం బొకటే గణింతు వినుమంచున్ గూర్మితో నిట్లనున్. 117

ఉ. మానిని యీమణీమయవిమానముపై జనువాఁడు విశ్రవో
మానికుమారుఁ డీశ్వరసమానుఁ డుదగ్దిశ యేలు నెప్పుడున్
వీని జయించుపాటిరణవీరులు గల్గుదు రమ్మహామునీ
శానునిభార్య వై యతని సాధుమతిన్ భజియించి తేనియున్. 118

సీ. దౌహిత్రకులముచేఁ దనకు మేలగునంచుఁ బితృదేవతలు మనఃప్రియముఁగందు
రాఁడుబిడ్డయు నల్లుఁడని వేడుకలు సేయఁగలిగెఁగా యని తల్లి యెలమిఁబొందుఁ
గన్యకాదానాభిగణ్యఫలంబు దనకుఁ జేకురు నంచు జనకుఁ డలరు
వరుసతో భోగించి వరములీయఁ దలంచి యనలేందుగంధర్వ లాశ్రయింతు

తే. రాత్మజామణి జనియించె నన్నమాత్ర
నట్టికన్య యసామాన్య యని యెఱింగి
కులవయోరూపశీలభంగులకుఁ దగిన
విభు వెదకి పెండ్లి గావించి నెలయు గురుఁడు. 119

మ. తనుజామాత్రవు గావు వంశమున సౌందర్యంబునన్ సద్గుణం
బున శ్రీదేవికి సాటి సేయఁ దగు నిన్ బూఁబోఁడి మావాని కి
మ్మని యేబంధుఁడు వేఁడఁగా వెఱచుఁ బ్రత్యాఖ్యానశంకాప్తి జ
వ్వని వైనన్ దినముల్ గ్రమింపఁబడె నుద్వాహోద్యమిన్ గానమిన్. 120

చ. కమలదళాక్షి కూఁతు నిలఁ గాంచుట మేలగు నైననొక్కప
క్షమున విచారహేతు వని కాంచెద నెట్లగు నన్నుఁ దల్లి వం
శము గురునన్వయంబు పతిసంతతి కన్య దురాత్మయైన నొ
ప్పమి యపకీర్తియున్ సకలబాంధవనిందయు నొందుఁ గావునన్. 121

ఉ. దీని వరించు వీఁ డనుచు దేవుఁ డెఱుంగునొ లేకెఱుంగఁడో
కాని తదన్యుఁ డెట్లెఱుఁగుఁ గాన యెఱుంగ నితండు నీవిభుం
డౌ నని తల్లి నీవలన నన్వయ మొప్పు బ్రసిద్ధిఁ గాంచు నం
చేనును నెల్లబాంధవులు నెన్నుదు మిప్పనిఁ దీర్పవే యనన్. 122

ఉ. కమ్మలడాలు చెక్కుల ధగద్ధగ లీన మొగంబు వాంచి కా
నిమ్మని లేచి సిగ్గు మది నెక్కొన మ్రొక్కినఁ దండ్రి యెత్తి మా
యమ్మ సుపుత్రులన్ గని శుభాన్విత వై మను మిమ్మహామునిన్
సమ్మతిఁ గొల్చి నీ వని ప్రసన్నత దీవన లిచ్చి పంచినన్. 123

సీ. నఖరుచుల్ చరణారుణచ్ఛాయలను గూడి యలరుకుంకుమగంధ మవనికొసఁగ
రమణీయమణినూపురధ్వనుల్ శుచిపక్షు లగుద్విజాతులపల్కు లనుసరింప
సొగసువాలుమెఱుంగుఁజూపు లాశావీథి కలఁ గల్వవిరిమేలుకట్లమర్పఁ

గరిపల్లవశ్రీలు కంకణారవముచేఁ గోయిలయెలనాఁగఁగుంపుఁ బిలువఁ
తే. గాంచికాఘంటికలు మ్రోయ నంచితోడ, కదళికలు మీఱ ఘనకుచకనకకలశ
యుగనిగన్నిగలొలుక నయ్యువిద శోభనాకృతిని జేరెఁ బౌలస్త్యునాశ్రమంబు.

క. కాంచనపాంచాలికవలె, మించినయక్కాంచనాంగి మెయిజిగిపయి వ్యా
పించం గాంచినతరువులు, గాంచనతరువుల తెఱంగు గైకొనె నచటన్. 125

క. సాయమున మఱుని కెందొగ, నాయక మన రమణి యిటుల చని హోమంబుం
జేయుచు రెండవస్వాహా, నాయకుఁ డనఁ దగుపులస్త్యనందనుఁ జేరెన్. 126

ఉ. చూచి మరీచిమాలిరుచిఁ జొక్కడుపద్మినిలీల రక్తితో
నాచెలి యిచ్చ మెచ్చుకొని యాతనిమ్రోల నతాననాబ్జ సం
సూచితలజ్జ యై నిలిచి క్షోణిఁ బదాగ్రమునన్ లిఖించుచున్
వేచినయంత హోమవిధి విశ్రవుఁడున్ నెఱవేర్చి ముందటన్. 127

సీ. తెలివి యాచేరలం తేసికన్నులదాని మొలకనవ్వులముద్దుమోముదాని
వెలయు సందేఁడుతలవెండ్రుకల్ గలదానిఁ బసమించునెలవంకనొసలిదానిఁ
గమ్మఁడా లొరయుబంగారుఁజెక్కులదానిఁ దావిపీడెవుఁగావిమోవిదాని
నుబ్బుసిబ్బెపుగబ్బిగుబ్బచన్నులదానిఁ బిడికిట నడఁగు నెన్నడుముదాని
తే. మెఱుఁగువలెఁ దళ్కుతళుకనుమేనిదానిఁ
గన్నె ప్రాయంబుచే వన్నెఁ గన్నదానిఁ
దొంపుఁబిఱుందుదానిఁ బెందొడలదాని
సొగసునడదాని నక్కన్నెఁ జూచె నతఁడు. 128

ఉ. చూచి సవిస్మయాత్ముఁ డగుచున్ ముని యెవ్వతె వేమి నీదుపే
రేచెలి లేక యొంటి యిట కేటికి వచ్చితి వెవ్వ రైనఁ బ్రే
రేచిరొ నీవె వేడ్కకుఁ జరించెదొ కల్గినమాట గల్గిన
ట్లోచెలి తెల్పుమన్న నదియుం గరముల్ ముకుళించి యిట్లనున్. 129

మ. కరుణాసాగర నే సుమాలి యనురక్షస్స్వామిగారాముఁగూఁ
తురఁ బుష్పోత్కటచెల్లెలన్ రహిఁ వహింతుం గైకసీసంజ్ఞచేఁ
గురునిర్దేశమునన్ భవచ్చరణముల్ గొల్వం గదా వచ్చితిం
బరికింపం దగు నామనోరథము మీభవ్యప్రభావంబునన్. 130

వ. అని పలికినయచ్చిలుకలకొలికిపలుకులు విని తనమనోదృష్టి నదివచ్చినరాక
యెఱింగి సుగుణాభినందనుం డగునప్పులస్త్యనందనుం డిట్లనియె. 131

మ. కలకంఠీమణి నీమనోరథము నేఁ గంటిన్ సుతాపేక్ష నిం
దులకున్ వచ్చితి వైన సంజకడ నన్నుం జేరి మాటాడుటన్
ఖలులౌ రాక్షసు లుద్భవించెదరు నీగర్భంబునన్ నావుడుం
జెలి భీతిల్లి వినీతి మ్రొక్కి వచియించెన్ విశ్రవోబ్రహ్మతోన్. 132

మ. అనఘా మూఁడవబ్రహ్మ వై విబుధలోకారాధ్యశీలుండ వై
ఘను నీతేజమునన్ జనించినసుతుల్ మాంసాశు లై దుష్టవ
ర్తను లై సాధువిరోధు లై మెలఁగు టర్హంబె గుణస్ఫూర్తిచే
నినుఁ బోల్పం దగుసత్కుమారకుల మన్నింపంగదే నావుడున్. 133

మ. అలపౌలస్త్యుఁడు గ్రమ్మఱం బలికెఁ గన్యం గాలదోషంబు పె
ద్దలకే కాదు విధాతకైన వశమే తప్పింప నిం కేల చిం
తిల నీపుత్త్రులయందు మేటి యనఁగా దీపించు విద్యాగరి
ష్ఠులలో శ్రేష్ఠుఁడు బ్రహ్మనిష్ఠుఁడు గనిష్ఠుం డింపుబింబాననా. 134

క. ననుఁ బోలు బ్రహ్మనిష్ఠుల, నినుఁ బోలుఁ బ్రతాపరుచుల నెసయువినీతిన్
నినుఁ బోలు సత్కుమారుఁడు, మను నాతనివలనఁ గులము మనికిత మేలా. 135

వ. అని భవిష్యదర్థంబు వివరించి విరించిపౌత్త్రుండు పుత్త్రకాంక్ష లాచరించి తను
వరించి మరులునం దీవరించినయక్కన్యకు గర్భాధానంబుం బ్రసాదించిన. 136

సీ. మేరుశృంగములపై మేఘముల్ దిగురీతి నాతిచూచుకములు నల్లనయ్యె
దాహృదశ్రీ నిల్పుధవళాంబుజముపోల్కిఁ దెలిగంటినెమ్మోము దెల్లనయ్యెఁ
గృతదైత్యజాతి వర్ధిలు నిటు లనురీతిఁ గలకంఠి లేఁగౌను బలితమయ్యె
గర్భగార్భకతనూకాంతి బైలగులీల విమలాంగినూఁగారు విపుల మయ్యె
తే. నలరుబోడికి నొకయెడ గాముడయ్యెఁ, గీరవాణికిఁ జిట్టుముల్ దోరమయ్యె
నబ్జపాణికి మంటిపై నాసయయ్యె, సైకతశ్రోణికిఁ బ్రసూతిసమయమయ్యె. 137

రావణకుంభకర్ణవిభీషణులజననము

క. భువనములు దలఁక మునులును, దివిజు లడల ధనదుగుండె దిగ్గు మనఁగ రా
హువు శని మొదలగుదుర్గ్రహ, నివహము నికటస్థలమున నిలిచినవేళన్. 138

సీ. పిడుగుఁజప్పుడుతోడ జెడఁగుజేగురునిండుచాయ దేఱెడుదశాస్యములతోడ
నిడుదకోఱలతోడ నెరయఁ గాటుక రాశి యైనట్టు గనుపట్టుమేనితోడఁ
జుఱుకుఁజూపులతోడ జ్యోతిర్లతారుణారుణములౌ కఱువెండ్రుకలతోడఁ
దామ్రోష్ఠములతోడ దారుణాహులలీల వెలయువింశతిభుజార్గళులతోడ
తే. భయముబీభత్సమొలయురూపంబుతోడఁ, గైకసీభామినీమణిగర్భమున మ
హోగ్రుఁడగురాక్షసుండొకఁడుదయమయ్యె, గాలకూటంబువారాశిగనినయటుల.

శా. ఆరక్షోవరుఁ డుద్భవించునెడ గృధ్రారావముల్ మించె మే
దోరక్తంబులు మేఘముల్ గురిసె నాందోళించె భూతావళుల్
భీరుత్వం బెనసెన్ సురౌఘములు గంపించెన్ సృగాలచ్ఛటల్
భూరిజ్వాలలు వాంతిసేసె రవిదీప్తుల్ మాసె మ్రోసెన్ దిశల్. 140

క. ఆవేళ, బుత్త్రజన్మము, భావించి పులస్త్యసుతుఁడు పఱతెంచి దశ
గ్రీవుం డనుపే రతనికిఁ, గావించి యథోచితంబుగా నున్నయెడన్. 141

ఉ. వెండియు విశ్రవస్స్ఖలితవీర్యమునన్ బలుచూలు దాల్చి బ్ర
హ్మాండవిఖండనోద్భటతరార్భటి మీఱెడువానిఁ గుంభక
ర్ణుండను పుత్రునిన్ సురవరుల్ బెగడందఁగఁ గాంచె నంతన
య్యండజయాన శూర్పణఖ యన్ తనయం గనియెం గ్రమంబునన్. 142

వ. తదనంతరంబున. 143

మ. గుణరత్నాకరుఁ డింద్రియార్థఘురుదంకూరాహివన్యాశుశు
క్షణి విద్యానిధి విశ్రవఃకులహితాచారాశ్రయుం డార్యపో
షణచింతామణి సర్వభూతకరుణాసంగాత్మకుం డౌ విభీ
షణుఁడుం గైకసిగర్భవార్ధిఁ బొడమెన్ సంపూర్ణచంద్రాకృతిన్. 144

తే. ఆకుమారత్రయంబున కాగమోక్త, మార్గమునఁ దండ్రి జాతకర్మంబు నామ
కరణములు మున్నుగాఁగలకర్మతతులు, క్రమమున నొనర్చియుపనయనము జేసె.

వ. ఇత్తెఱంగున నవ్విశ్రవస్తనూజాతు లుపనీతు లయి తండ్రివలన నఖిలవిద్యావిశే
షంబు లెఱింగి చిత్రభానుత్రయసమానులు దినదినప్రవర్ధమానులునై వెలయు
చుండి రయ్యవసరంబున. 146

దశగ్రీవకుంభకర్ణవిభీషణుల బాల్యక్రీడలు

సీ. అలఁతిగట్టులు భుజార్గళనిరర్గళత నుత్పాటించి కందుకప్రౌఢిఁ జూపు
నుడువీథి నొరసి పోయెడువిమానము లందుకొని బిట్టు నేలతోఁ గొట్టి యార్చు
నాశ్రమోన్నతభూరుహములుదాఁ బడఁద్రోచి పఱచుమౌనులఁ జూసి పరిహసించు
శరభసింహామదేభసమితి నీడిచి తెచ్చి గట్టిగా దామెనఁ గట్టివైచు

తే. గరుడగంధర్వపన్నగాగ్రణుల నెచటఁ
గనిన మీతో భుజాభుజిఁ బెనఁగ వలయు
నిలువుఁడను వార లుఱుక వెన్వెంటఁ దగులు
బాల్యలీలావిలోలుఁడై పంక్తిముఖుఁడు. 147

సీ. గిరిదిశాకరిభోగికిటికూర్మములు వ్రాల నంఘ్రిఘట్టన నుర్వి నడఁగఁద్రొక్కు
నరుణచోదితరథం బట్టిట్టుగాఁబట్టి నలినాప్తుబింబంబు నాఁకి విడుచు
బాల సాఁచి దిగీశపట్టణాభ్యంతరోద్యానపక్వఫలాగతతులఁ గూల్చుఁ
గనుఁగొన్నవైమానికశ్రేణి వివృతాస్యబిలగతంబుగ నొక్క పెట్ట మ్రింగు

తే. నెదుటఁబడకున్న మునికోటి వెదకి వెదకి
పట్టి భక్షించుఁ గ్రొవ్వెగఁ దొట్టి కుఱుక
విడిచి నిదురించు లేచు నల్గడలఁ దిరుగుఁ
గుంభకర్ణుండు నడయాడుకొండకరణి. 148

చ. అతనిసహోదరుండు సుజనావనశాలి విభీషణుండు సు
వ్రతములు సల్పుచున్ శ్రుతిపరంపరయర్థముఁ దండ్రి దెల్పఁగా

హితమతి నాలకింపుచు జితేంద్రియుఁ డై యుపకారశీలతం
బ్రతిదినముం జరించు మృదుభావముతోఁ గులధర్మపద్ధతిన్. 149

ఉ. అన్నలు సేయురాయిడి భయాతురు లై బరువెత్తుమానులం
గన్నులఁ జూచెనేనిఁ దనుకంపము మానిచి నానిమిత్త మా
పన్నుల వీరిఁ బ్రోవుఁ డని ప్రార్థన సేయు నతండు వారలం
చిన్నతనాననుండియు విభీషణుఁ డెంత పరోపకారియో. 150

క. క్రూరుఁ డగుకుంభకర్ణునిఁ, బారిఁ బడి విభీషణో క్తిబ్రదికి మునులు త
త్కారుణికుని దీవింపుదు, రారవితారముగ బ్రతుకు మన్నా యనుచున్. 151

ఉ. అంతట నొక్కనాడు దమయయ్యఁ గనుంగొన రత్నఘంటికా
క్రాంతవిమానమెక్కికొని కన్నులపండువుగా ధనేశ్వరుం
డెంతయు వేడ్క వచ్చుచెలు వెల్లను తప్పక చూచి కైకసీ
కాంత స్వభావసిద్ధ మగుక్రౌర్యమునన్ దశకంఠుతో ననున్. 152

మ. కనుగొంటే భవదగ్రజుం డయినయక్షస్వామిసౌభాగ్య మీ
తనిచందంబున నీవు నిట్టిసిరు లొందం జూడఁ గాంక్షించెదం
దనయా యెందున నీదృశస్ఫురణఁ జెందన్ వచ్చు నానేర్పుఁ గై
కొను శీఘ్రంబున నేటి కూరక యశక్తుం బోలి వర్తింపఁగన్. 153

వ. అని ప్రబోధించిన. 154

మ. జననీవాగ్వ్యజనానిలజ్వలితరోషజ్వాలుఁ డై యద్దశా
ననుఁ డి ట్లంచుఁ బ్రతిజ్ఞఁ జేసె జననీ నామాట తథ్యంబు గా
విను మే ఘోరతపస్వి నై ధనదుఠీవిన్ మించెదన్ లేనిచోఁ
దనతేజంబున నీదృశం బగు ప్రభుత్వం బైనఁ బ్రాపించెదన్. 155

క. పెక్కువకు సాటియును గా, కెక్కువయుం గాక జోక నీతనికంటెం
దక్కువయైనా నిఁక నను, మక్కువ వీడ్కొలుపు మని సమగ్రవినీతిన్. 156

మ. వినతుల్ సేసె దశాననుండు మమతన్ వేమాఱు దీవించున
జ్జననిన్ వీడ్కొని కుంభకర్ణుఁడుఁ గనిష్ఠభ్రాతయున్ వెంట రాఁ
జని గోకర్ణసమాహ్వయాశ్రమము విశ్వాసంబుతోఁ జేరి కాం
చనగర్భున్ మది నుంచి యుగ్రతపముల్ సల్పంగ నుద్యుక్తుఁడై. 157

వ. తమ్ములతో ని ట్లనియె. 158

రావణ కుంభకర్ణ విభీషణులు బ్రహ్మనుగూర్చి తపంబు సేయుట

సీ. కమలగర్భుఁడు భక్తికామధేనువు నిక్కువంబుగా వత్సలత్వంబుఁ జూపుఁ
బరమేష్ఠి యాశ్రితపారిజాతము శ్రాంతిం బాసి కావలసినఫలము లొసఁగు
భారతీనాథుండు ప్రణతచింతామణి రాతనం బూనియు రక్తి నెరపు
చతురాననుండు దాససమీహ మేరువు కద్బరదాతృత్వగరిమ మించుఁ

తే. దాత తాపసజనకామితప్రదాత
పెద్దవేల్పు మునిశ్రేణిఁ బ్రీతి నిల్పు
నలువ యతివీక్షణాళులు నిలుచుకలువ
యతని భజియింప మనకోర్కు లబ్బు టరుదె. 159

మ. అని వాణీరమణీమనోహరునిమాహాత్మ్యంబు వర్ణించి, య
య్యనుఁగుందమ్ముల నిద్వురన్ ఘనతపన్యాసక్తచేతఃప్రవ
ర్తనధౌరేయులఁ జేసి వారి సవిధారణ్యంబులన్ నిల్పి తా
నును బ్రత్యేకవనాంతరంబునఁ బ్రశాంతుం డై తపం బున్నెడన్. 160

సీ. వనజాననశోషకున కెంత కువలయపరితాపకృతి నాఁగఁ బ్రబలుతపను
కరములు సోఁక భగ్గన మండురవిరత్నములతనుజ్వాలిక లొలసినపుడె
చురచురఁ గాలెడిశుష్కతృణశ్రేణిసరణిఁ గన్పడునికుంజములఁ దగులు
మంటలు వెదురుజొంపములఁ బ్రాఁకి మహోగ్రమైతదంతికభూరుహములనెగసి
తే. దరికొని వహించునక్కాఁకఁ దాళలేక
తెరలిమృగములు మృగతృష్ణ కఱిగి సొరుగు
మండువేసవిఁ బంచాగ్నిమధ్యమునను
గుంభకర్ణుండు గావించె ఘోరతపము. 161

క. ఇటు లెండకు వానకు నుత్కటతర మగుచలికి వెఱక కంపింపక వే
సటఁ బడక కుంభకర్ణుఁడు, పటునిష్ఠ ఘటించెఁ దపము పదివేలేఁడుల్. 162

సీ. కంటిచూపు జగంబుకంటిరూపు సజాతికద్యుతికతన నైక్యంబు సేసి
సర్వభూతదయాప్రసన్న భావంబుతోఁ దరలనినియమంబుఁదగులుపఱిచి
యించుకించుక సందడించుకోరికలతో వివిధేంద్రియవికారవితతు లడఁచి
ద్వంద్వముల్ సహియించుతాల్మికంబంబుతోఁ గడిఁదిచిత్తేభంబుఁ గట్టివైచి
తే. కమలపట్కంబు శోధించి కమలభవుని, కమలపదములు దలఁచుచు గాఢశక్తిఁ
దగ విభీషణుఁ డేకపాదమున నిలిచి, యైదువేలేండ్లు కావించె నతులతపము.

క. మఱి యైదువేలయేఁడులు, దెఱచిన కనుమాయ కినునిదెసఁ జూచుచు నే
త్రైఱనూర్ధ్వబాహుఁడై మతి,దఱుమక శ్రుతినొడివికొనుచుఁ దపమొనరించెన్.

మ. ఎలుకల్ పిల్లులు నీలకంఠములు భోగీంద్రంబు లేణచ్ఛటల్
పులులున్ సింహము లేనుఁగుల్ శరభపాళుల్ గండభేరుండముల్
చెలిమిం జెంది విభీషణాశ్రమమునం జెల్వొందు భూనాథ యం
దుల కుప్పొంగి నటింత్రు రచ్చర లమర్త్యుల్ పూలు వర్షింపఁగన్. 165

వ. అని పలికి లోపాముద్రాధిపతి వెండియు రామభద్రున కిట్లనియె. 166

దశముఖుఁడు వీరహోమంబు సల్పుట

సీ. అఖిలలోకాతీత మగుమహామహిమంబుఁ బడయంగ నూహించి పంక్తిముఖుఁడు
విధిదేవతాక మై విలసిల్లు మంత్రంబు జపియించుచును నిరశనతఁ దాల్చి

నొకకాలిపెనువ్రేలి నుర్విఁ జక్కఁగ నిల్పి సూర్యావలోకనధుర్యుఁ డగుచుఁ
దనహృదయాకాశమునఁ బితామహు నుంచి ధ్యానించి వేయేఁడు లైనవెనుక
తే. నగ్రమున మండునుగ్రతరాగ్నిలోన, మునుకొని కరాసిఁ దలఁద్రుంచికొనిసభక్తి
కముగ బ్రహ్మార్పణంబగుఁగాక యంచు, వీఁకహోమంబుఁ గావించె విస్మయముగ.

మ. వికటాచారుఁ డతండు నిశ్చలమతిన్ వేయేండ్ల కొక్కొక్కమ
స్తకమున్ ఛేద మొనర్చి వేల్చు దమునస్సంభాసితార్చిం దదీ
యకరోటిప్రతతుల్ పటిల్లు మని వ్రయ్యం బుట్టుఘోషం బజాం
డకటాహస్ఫుటనాప్రచండతరమై నానాదిశల్ నిండఁగన్. 168

శా. పౌలస్త్యార్చితకీకసాస్రపలశుంభన్మస్తకప్లోషణ
స్థూలాభీలకరాళపావకశిఖాస్తోమంబు ధూమంబుతోఁ
బౌలోమీపతిప్రోలు చుట్టికొనియెన్ భావిప్రవృద్ధాసురో
ద్వేలాస్త్రార్చులు తద్బలంబు లిటు లుద్దీపించు నన్పోలికన్. 169

మ. ఉరునిష్ఠోగ్రదశాస్యనిర్మితశిరోహోమక్రియాదగ్ధమే
దురమేదఃపలలాస్థికైశికమిళద్దుర్వాసనల్ భూనభోం
తరముల్ నిండఁగ సైఁప నోప కిఁక నెన్నం డిచ్చునో వీనికిన్
వర మబ్జాసనుఁ డంచు నెంచు వినుత్రోవం బోవుదేవౌఘముల్. 170

క. తైకసికొడు కిటువలె ని,ర్వ్యాకులమతి దశసహస్రవర్షము లరుగన్
భీకరగతిఁ బదియవతల, వీఁకం దెగఁ గోసి వహ్ని వేల్వఁగఁ దలఁచెన్. 171

వ. అప్పుడు. 172

చ. గగనము మ్రోసె వీచె సుడిగాలి సముద్రము లింకె మేరువుల్
దిగఁబడె భూమి చక్రముగతిం దిరిగెన్ రవి త్రోవఁ దప్పె న
మ్మఁగలమగండు వీఁక దశమం బగుమస్తక ముత్తరించి వే
ల్వఁ గడఁగి హోమవహ్ని చటులంబుగఁ బ్రజ్వరిలంగఁ జేసినన్. 173

శా. ఆపౌలస్త్యవివర్ధమానఘనహోమాగ్నిజ్వలజ్జ్వాలికల్
పైపైఁ బ్రాకిన దిక్పతుల్ యతులు విభ్రాంతాత్ములై సర్వలో
కాపూర్ణాధిపతిత్వసౌఖ్యనిధి బ్రహ్మం జేరి సేవించి స్వా
మీ పద్మాసన యార్తులన్ మముఁ గృపాదృష్టిన్ విలోకింపవే. 174

మ. దశకంఠాసురుఁ డగ్నిఁ దొమ్మిదితలల్ దా వేల్చియున్ నేఁటిఁ క
ద్దశమం బైనశిరంబు వేల్వఁ గడఁగం దద్ధోమధూమచ్ఛటల్
దశదిగ్భాగము లావరించె నిఁకఁ బ్రత్యక్షంబు గాకుండి తే
ని శిఖిజ్వాలలఁ గ్రాఁగు ముజ్జగములున్ నిక్కంబు వాణీశ్వరా. 175

ఉ. ఒప్పిద మైననీకరుణ నున్నతుఁడై మఱి మీఁదుగా జగం
బప్పిశితాశి యేఁచు హవనానిల మిప్పుడె యేఁచ బూనెడిం

జెప్పెడి దేమి యింక నెడ చేసినఁ దప్పగు మీఁదిబాధ కే
మొప్పితి ముగ్ర మవ్వికృతహోమము మాన్పఁ గదయ్య చయ్యనన్. 176

వ. అని భయోత్పాతవిఘూతచేతస్కుఁ డై చేతులు ముకుళించి ప్రార్థించు వేల్పు దొరల దరహాసవదనంబు దెరలం గనుంగొని మంచి దని సమ్మతించి విరించి కాంచనమయకమలాసనంబు డిగ్గ నుఱికి యతిసత్వరంబుగ. 177

రావణకుంభకర్ణవిభీషణులకు బ్రహ్మ ప్రత్యక్షమై వరంబు లిచ్చుట

సీ. శ్వేతకేతుఁడు జోకసేసి తెచ్చినపదార్వన్నెయంచహుమాయి వడిగ నెక్కి
వెనువెంట వచ్చుసావిత్రీముఖస్త్రీలప్రణయభాషలమీఁదిశాళి మాని
ప్రాఁబల్కుతుదలతోఁ బ్రణుతించుసంయమిప్రవరులనుతిఁ బెడచెవులఁ బెట్టి
సృష్టిక్రమముఁ దెల్పఁ జేరికై నడచుబ్రహ్మదిక్కుగని మాటలాడ మఱచి
తే. గునుకుపరువునఁ బఱతెంచుకొడుకువీణ
వినెదురక్తియుఁ బూనక వేల్పుఁ జెలువ
లాడఁ బాడంగ నెడ యాక యాక్షణమున
దశముఖున కబ్జభవుఁడు ప్రత్యక్ష మయ్యె. 178

శా. ఈచందంబునఁ బంక్తికంఠునకు వాణీశుండు గాన్పించి నీ
రాచారుం డతఁ డున్నయొక్కతలపై హస్తాసిఁ బూన్పంగ నో
హో చాలింపు దశాస్య యీతెగువ కుద్యోగింతురే మెచ్చితిన్
నీచిత్రాధ్వరకర్మనైష్ఠికతకున్ నీకోర్కు లీ వచ్చితిన్. 179

వ. అని వారించి హితోక్తులు వివరించిన విరించనుపలుకు లాలించి సాహసోద్యోగంబు సాలించి లేచి తలయెత్తి యతనిం బొడగాంచి పులకాంచితశరీరుం డయి యవ్విశ్రవసకుమారుం డనేకనమస్కారంబు లాచరించి యిరువదికరంబులు ముకుళించి హర్షగాద్గద్యంబు వహించి యిట్లనియె. 180

సీ. ప్రకృతిదురాప వై పరిపూర్ణరూప వై యెసఁగుసత్తామాత్ర మీవె కావె
సత్త్వప్రధాన వై సాక్షితాధీన వై యెసఁగునీశ్వరతత్త్వ మీవె కావె
సృష్టినిర్మాత వై యిష్టార్థదాత వై యెసఁగుసర్వనియంత వీవె కావె
పురుషాహ్వయుండ వై బోధమయుండ వై యెసఁగుమహాత్ముండ వీవె కావె
తే. నిన్ను సృజియించుకొన్నది నీవె కావె
నిన్ను నీయందుఁ గనుఁగొందు వీవె కావె
యెల్లశ్రుతు లెంచ మనువేల్ప వీవె కావె
యెల్లశ్రుతులకు నావాస మీవె కావె. 181

మ. తనుబుద్ధీంద్రియసముల్ వికారములు నాత్మన్ జెందఁగాఁ జేసి వా
నిని దత్తద్బహుకర్మముల్ సలుపఁగా నీవే నియోగించి యం
దున దారిద్ర్యము వైభవంబు సుఖమున్ దుఃఖంబుఁ గాలంబు వెం
టనె కల్పించి సమస్తముం గను నినున్ ధ్యానింతు నశ్రాంతమున్. 182

ఉ. దేవ శుభాశుభస్థితులు దేవనరాసురముఖ్యు లొందఁ గా
నీవె యొనర్త్ర వాఁడవు నీ కొకవిన్నప మాచరించెదన్
జీవులు మృత్యు వన్న వెఱ సెందుదు రుగ్రవిరోధి మృత్యువే
కావునఁ దద్భయంబు వెలిగా బ్రదుకన్ వర మీయవే కృపన్. 183

మ. గరుడాదిత్యనభశ్చరాసురమరుద్గంధర్వసిద్ధర్షి భా
స్వరవిద్యాధరయక్షకిన్నరపిశాచప్రేతరక్షోగఫణా
ధరభూతగ్రహవిశ్వసాధ్యవసురుద్రశ్రేణిచేఁ బోరులన్
మరణం బొందనిమన్కి యిమ్ము గణియింపన్ దక్కుమర్త్యాదులన్. 184

మ. అని ప్రార్థించినఁ బద్మగర్భుఁడు తదీయాశాస్య మీడేర్చి తెం
పున ము న్నాతఁడు వహ్ని వేల్చినశిరంబుల్ గ్రమ్మఱన్ మొల్చి చె
ల్వొనయన్ గట్టడ సేసి సౌఖ్యనిధి వై యీరేడులోకంబులం
దు నజయ్యుం డనుకీర్తిఁ గాంచు మని సంతుష్టాత్ముఁ గావించుచున్. 185

చ. అతనిసపర్యలన్ బ్రముదితాత్మకుఁ డై పరమేష్ఠి యోగరం
జితమతి యావిభీషణునిఁ జేరి తపంబున ధర్మమార్గసు
స్థితి ననివార్యభూతహితశీలత నీప్రతిఁ గాన నేను మె
చ్చితి విను వత్స నీవలచుచింతితముల్ వచియింపు నావుడున్. 186

శా. అంతర్నాదము విన్నయోగివరున ట్లామాట లాలించుచున్
సంతోషించి విభీషణుండు "విమలస్వాన్తం భవన్తం దయా
వంతం శాన్త మనన్తరూపిణ మహం వన్దే" యటంచున్ వచశ
కాంతున్ జేరి నమస్కరించి పలికెన్ గంభీరవాచార్భటిన్. 187

చ. ఇనుఁడు కరంబులన్ గళల నిందుఁడు కీలల వహ్ని వన్నె గాం
చినక్రియ సద్గుణంబులఁ బ్రసిద్ధి వహించినలోకకర్త వీ
వెనసినకూర్మి వచ్చి నను నెంతయు మెచ్చితి నంటి వింతకం
టెను వర మున్నదే యిపుడు నేఁ గృతకృత్యుఁడ నైతి నీశ్వరా. 188

ఉ. ఐన నమోఘదర్శనుఁడ వైనజగత్పతి వీవె మెచ్చి యిం
పై నవరంబు వేఁడు మని యానతి యియ్యఁగ నూర కుండ రా
దే నుతి సేసి వేఁడెద సహింపఁగఁ గూడనియట్టియాపదన్
మానితధర్మమార్గమున మామకచిత్తము నిల్వఁ జేయవే. 189

క. ఏయాశ్రమంబు జెందిన, నాయాశ్రమధర్మమునకు ననుకూలముగాఁ
జేయుము హృదయము ధార్మికుఁ, డేయెడ నవిజయ్యుఁడనఁగ నే వినియుందున్.

తే. శిక్షితముగాకయె మదీయచిత్తవృత్తి, కనుగుణంబుగ నిమ్ము బ్రహ్మాస్త్ర మనిన
నావరము లిచ్చి తద్బుద్ధి కజుఁడు మెచ్చి, యిచ్చననుకంపజనియింప నిట్టులనియె.

ఉ. ఆసురయోనిఁ బుట్టియును నాసురవృత్తి యొకింత లేదు నీ

కీసురు లైన దీ టగుదురే భవదుక్తులు నన్నుఁ బ్రీతునిన్
జేసె నమర్త్యభావము సుశీల యొసంగితి నింక నీవు దే
వాసురకోటిలోఁ ఘనుఁడ వై మను మంచు ననుగ్రహించినన్. 192

క. కొనియాడి రమరు లజుఁ గనుఁ, గొని యాడిరి వేల్పుముద్దుగుమ్మలు వెత వీ
డ్కొని పాడిరి గంధర్వులు, పెను పగునమరత్వ మవ్విభీషణుఁ డొందన్. 193

చ. పరహితుఁ డైనవానికి శుభంబు లభించిన నెల్లవారలున్
హరుసమె కంద్రు దుర్జనున కాయువు శ్రీయును వృద్ధిఁబొందినన్
బరమభయంబుఁ జెందుదురు భానుకులేశ్వర కావునన్ దయా
పరుఁడు విభీషణుం డమరభావము నొందిన నుబ్బి రందఱున్. 194

దేవతలు కుంభకర్ణునకు వరంబు లీయవల దని బ్రహ్మను వేఁడుట

చ. బిసరుహగర్భుఁ డిట్టుల విభీషణు కోర్కు లొసంగి ప్రాభవం
బెసఁగఁగఁ గుంభకర్ణుకడ కేగెడునప్పుడు వేల్పు లాడి ర
య్యసుర కభీష్ట మియ్యఁ దగ దయ్య పరాకు సరస్వతీశ వాఁ
డసదృశకాయుఁ డీభువన మంతయు మ్రింగఁగ నోపు నొక్కటన్. 195

సీ. గట్టిగాఁ బద మూర్విఁ బెట్టె నేనియు సప్తపాతాళలోకముల్ భగ్నము లగు
నొక్కమా టటు నిల్చి నిక్కె నేనియు శిరఃప్రహతి చేనూర్ధ్వకర్పరములగలు
నుత్సాహ మొదవ మై నుబ్బించె నేనియుఁ బచ్చిగోడలజాడ విచ్చు దిశలు
లేచి నీల్గుచు బార సాఁచె నేనియుఁ జక్రవాళాచలేంద్ర మవ్వలికి వీఁగుఁ

తే. గేరి నవ్విన మాబోఁటివారి కెల్ల
గుండెదిగు లగు మమ్ముఁ బేర్కొనఁగ నేటి
కీవఱకు వాఁడు సేసిన హింస లెంచఁ
గూడ దటువంటిఖలు దయఁ జూడ నేల. 196

ఆ. తనువుఁజూత మన్నఁ గన రాదు తుద మొద, లాత్మఁ జూతమన్న నతికఠినము
నడకఁ జూత మన్నఁ గడుహింస వాఁడేల, ధాత వానితపము దయ్య మెఱుఁగు.

క. నందనవనవాసులఁ బు, రందరసహచరుల నచ్చరల బెక్కండ్రన్
మ్రందించె మ్రింగె నరముని, బృందంబుల ఖలుఁడు వీఁడు పిన్నతనమునన్. 198

క. ఏవరము లేకయే బలు, కావరమున జగము లేఁచుఖలునకు వరముల్
దేవర యొసఁగుట మండెడు, పావకులోఁ నేయి వోయు భంగిన కాదే. 199

ఉ. కావునఁ గుంభకర్ణుపయిఁ గారుణికత్వము మాని నీవు మా
యావివశాత్ముఁ జేసి వర మం చొకదాని నొసంగినన్ శుభం
బావహిలున్ జగంబులకు నంచు సురల్ వివరింప భారతీ
దేవిముఖంబుఁ జూచెఁ దొలిదేవర సాదరవీక్షణంబునన్. 200

వ. ఇటువలెఁ దనమొగంబు గనినవలుమొగంబుల వేలుపుదొరయింగిత మెఱింగి
మెఱుంగుల తెఱంగునఁ దుఱంగలించు మెఱుంగుజూపులఁ దొంగలిఱెప్పలనప్ప

ళించుచు విప్పు గలకప్పుఁగొప్పువిరుల సరులకై కప్పుకొనునళిపరంపరల కళుకు సంపాదించునవతంసచాంపేయప్రభాసంపదకు లంకెలగుచుఁగనత్కనకతాటంక దీప్తులు విద్దెంబుఁ జూపుకోపున నందంపుఁ జెక్కుటద్దములపై ముద్దుగురియం గరంబులఁ బుస్తకాక్షమాలికావిపంచికలు మెఱయఁ గొదమరాయంచవలె నచ్చపుదువ్వులజవరాలు పతియెదుటి కడదెంచి యుదంచితాంజలి యొనరించి వినయలజ్జాభరానతివిలోకనంబులన్ దద్వదనంబు లలంకరించి యల్లన యేమి పని యాచరింతు నాన తిం డనిన నజుండు నద్దేవి నాదరించి యిట్లనియె. 201

మ. సరసీజేక్షణ యెల్లజీవ్రులరసజ్ఞల్ సేరి క్రీడించునే
ర్పరి వీవే కద కుంభకర్ణురసనాభాగంబునన్ నిల్చి నే
వర మీవచ్చినవేళ నయ్యసురచే వ్యర్థోక్తులాడింపు మేల్
వరముం గోరఁగ నీకు నొమ్మనిన నవ్వాగ్దేవి య ట్లుండినన్. 202

సరస్వతితోడ్పాటుచే బ్రహ్మ కుంభకర్ణునకు నిద్ర వరంబుగా నిచ్చుట

మ. అమరజ్యేష్ఠుఁడు నంత నయ్యసుర డాయం బోయి లే కుంభక
ర్ణ మహాభాగ భవత్తపంబు గల నానందంబు వర్ధిల్లె వేఁ
డు మభీష్టం బొడఁగూర్తు నిప్పుడన వాఁడున్ మ్రొక్కి షణ్మాసముల్
తమి నిద్రింపఁగ నొక్కనాఁ డశన మొందన్ జేయవే నావుడున్. 203

చ. వనజజుఁ డట్ల యా నది యవశ్యము మేలు సుఖాన నిద్ర పో
మ్మని సురకోటితోఁ జనియె నంత సరస్వతియున్ దదాస్యవ
ర్తన ముడిగెన్ నిజప్రతిభఁ దాలిచి యప్పుడు కుంభకర్ణుఁడున్
దనమనువుల్ దలంచుకొని తా నిటు లంచుఁ దలంచె నెంతయున్. 284

మ. అకటా పద్మజునంతవాఁడు వర మియ్యన్ మంచికో
రిక లర్థింపక నిద్ర యిమ్మనెడివెఱ్ఱిన్ గంటిమే యిట్టి దే
టికి నానోటికి వచ్చెహా తెలిసికొంటిన్ వేల్పులే చేసి రీ
వికలత్వం బిఁక నేల దైనపనికిన్ విభ్రాంతి వాటింపఁగన్. 205

క. పౌరుషమునకును దైవం, బారయ ఫలకారి యందు రాదైవంబే
వైరస్యము వహియించిన, నేరూపునఁ బురుషుఁడొందు నిష్టార్థంబుల్. 206

క. దైవోపహతుఁడు సుకృతపుఁ, ద్రోవ వెదకి పోవ నదియె దుర్గతి యగు మేల్
గావలయునన్నఁ గీ డగుఁ, గావున నిఁక జాలిఁ జెందఁగా దనుచున్నన్. 207

ఉ. అన్నయుఁ దమ్ముఁ డచ్చటికి నంతటిలోఁ గడువేడ్క వచ్చి తా
నున్నవిధంబుఁ జూచి యదియున్ విని దైవమె యిట్లు సేసినన్
విన్నఁదనంబుఁ జెందఁ దగునే వగపేటికిఁ బామరుండవే
యన్నఁ గలంక దేఱె నతఁ డర్కకులేశ్వర వారిమాటలన్. 208

క. ఈతెఱఁగున దశకంఠుఁడు, ధాతవరంబునను గామితము లొనఁగూడన్

భార్గవసమేతంబుగ శ్లేష్మాతకవనమునకుఁ జనియె సంతోషమునన్. 209

వ. అని యెఱింగించి రఘుకులగ్రామణితో మఱియు నగస్త్యమునిశిఖామణి యిట్లనియె. 210

సుమాలి పాతాళమునుండి ప్రహస్తాదిపుత్రులతోఁగూడ రావణునియొద్దకు వచ్చుట

చ. దశముఖుఁ డీప్రకారమునఁ దమ్ములతోఁ జని తల్లికిన్ బ్రతీ
ప్రశమధి యైనతండ్రికిని భక్తిఁ బ్రణామము లాచరించి దై
త్యశతము గొల్వఁ గాయక తదాశ్రమభూమి వసించు టంతయున్
విశదముగా నెఱింగి కడువేడుకఁ బొంగి సుమాలి యయ్యెడన్. 211

చ. చిలువలగుంపు వెల్వడినచెల్వున రాక్షససైనికుల్ రసా
తలమున నుండియున్ వెడలి తన్ భజియింప బ్రహస్తముఖ్యపు
త్రులు సహితాప్తబంధు లయి తోడన రా దుహితృప్రియాత్మజా
తులఁ దిలకించునుత్సవము దోరము గా నరుదెంచుచున్నెడన్. 212

శా. ఆమాతామహురాక మున్నె విని భార్గవస్వాతుఁ డైకైకసీ
కామిన్యగ్రసుతుం డెదుర్కొని నమస్కారంబులన్ బూజలన్
క్షేమప్రశ్నములన్ వినీతియును భక్తిస్నేహముల్ సూప న
త్యామోదంబు వహించి యాతఁడును నుద్యత్ప్రౌఢవాగ్జృంభణన్. 213

సీ. చిలువమేపరిపుల్గుబలుచట్టుపలఁ బుట్టుగాడ్పుచే నొదవినకాళ్లవడఁకు
గొంటుబంగరుఁగంటికంటు వేలుపువింటిగుణరవంబున నంటుగుండెదిగులుఁ
దాలివేల్పుఁ జిందంపుఁదోరంపురవళిచేఁ గర్ణరంధ్రములందుఁ గవియుచెవుడు
వేయియంచులవాలు మ్రోయు చుద్ధతి డాయునపుడు పైకొనినభయజ్వరంబు

తే. నేఁటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీరహోమంబుచే నీవు వేల్పుఁబెద్ద
వెఱఁగుపడఁ జేసి లోకైకవిజయహేతు, వరములొందుటఁ బౌలస్త్యవరకుమార.

మ. పరిపూర్ణోజ్జ్వలకార్తికీకుముదినీప్రాణేశ్వరజ్యోత్స్నవై
ఖరి నీకీర్తిరమావిలాసము పొసంగన్ సొంపుఁ గాంచెన్ నిశా
చరవంశాబ్ధి మదీయహృత్సరసిజోత్సాహైకసంపాదన
స్ఫురణన్ మించె భవత్ప్రతాపరవి రక్షోనాథ నిక్కంబుగన్. 215

మ. పరమాన్నాజ్యసమిన్ముఖాహుతులచే బ్రహ్మార్పణం బంచు న
ధ్వరముల్ సేయుదు రందఱున్ వసుమతిన్ ధైర్యోన్నతిన్ నీగతిన్
శిరముల్ పాణిఁ గృపాణిఁ జేర్చి యనలార్చిన్ వేల్చి నీయద్భుతా
ధ్వరకర్మం బొనరింప రెవ్వరును సత్యం బాసురగ్రామణీ. 216

తే. మిగులఁ గోపించి తన్నిన భృగుమహర్షి, యడుగుపట్టిన వేల్పురాయిడికి వెఱచి
యడుగుపట్టినదైత్యులయాపదబ్ధి, కధిప యుష్మత్ప్రతాప మౌర్వాగ్ని యయ్యె.

క. బలియుఁడ వన్వయకర్తవు, కలిగితి వింక నేల డాఁపఁగా మనకొఱకే

తొలుతన్ మత్ప్రీతుఁడై, లలితస్థితి విశ్వకర్మ లంక యొనర్చెన్. 218

వ. అట్టిపట్టణం బిటు లేల విడిచి పెట్టితి రందు వేని వినిపించెద నాకర్ణింపుము. 219

మ. త్రిజగద్ద్రోహు లొనర్చుచున్ సమదవృత్తిన్ గూడి క్రీడించుమా
భుజగర్వంబు సహింప లేక చని వేల్పుల్ దెల్పికొన్నన్ జతు
ర్భుజుఁ డభ్రంకషశంఖరాజనినదంబుల్ మీఱ సంగ్రామకే
ళిజయోత్పాదనశాలి మాలి మును కూల్చెన్ గెల్చె మమ్మందఱన్. 220

ఉ. అడ్డము వచ్చి వేల్పుపురి యాఁగెడుమ మ్మిటు లావరించి మా
యొడ్డనముల్ దెరల్చి హరి యుద్ధతిఁ జూపిన గొల్ల వెల్చినన్
దొడ్డికిఁ బాఱునాపసులతో సరియై పురిఁ బాసి యాండ్రనన్
బిడ్డలఁ వెంటఁ బెట్టుకొని భీతిని చేరితి ముర్వి క్రిందటన్. 221

తే. అదిమొదలు లంక పాడైన నసురనాథ
యంత మీయన్న నడుమఁ దా నాక్రమించె
దానమున నైన సామభేదముల నైన
బలిమి నైన గ్రహింపు మప్పట్టణంబు. 222

తే. ఒరులపాలైనతమసొమ్ము మరలఁ గొనుట
యార్తిఁ జెందినచుట్టాల నరసికొనుట
నిజకులోచితధర్మంబు నిలిపికొనుట
బలియుఁ డగుటకు ఫల మండ్రు పంక్తివదన. 223

తే. కరముచేఁ గంకణమ్ము గంకణమువలన, గరముఁ గర మొప్పుకరణి లంకాపురాధి
పత్యమున నీవు వెలయు దప్పట్టణంబు, వెలయునీచేతనని తాత దెలుపుటయును.

మ. దశకంఠుం డనుఁ దాత నీనుడి యథార్థం బైనచో నెంత బా
లిశుఁ డైనన్ నయ మేది యగ్రజుని బల్మిన్ ద్రోచి దుర్వృత్తిఁ ద
ద్వశ మౌని ల్లిటు లాక్రమించు మఱి లేవా యిండ్లు పెద్దల్ భవా
దృశులే యిట్లన నస్మదాదులకు బుద్ధిస్థైర్యముల్ గల్గునే. 225

క. అని తాత బోధ సేసిన, పనికిన్ సమ్మతిల కతఁడు ప్రత్యాఖ్యానం
బొనరించె నంత నొకనాఁ, డనువగుసమయంబుఁ గని ప్రహస్తుం డనియెన్. 226

శా. పౌలస్త్యాన్వయచంద్రశూరులకు సౌభ్రాత్రంబు బాంధవ్యమున్
వాలాయం బన వచ్చునే బలిమి యెవ్వాఁ డొందు వాఁడే కదా
త్రైలోక్యంబున మేటి యానడతయే ధర్మంబు యక్షేశుపై
నేలా యీమొగమాట మాతనిపురంబే లంక శంకింపఁగన్. 227

ఉ. ఏల బహూక్తు లప్పురి మహిన్ సృజియించినయట్టివారు వీ
రేలినవారు వీ రతని కే డది గా దతఁ డేలె కంటివా
యేలఁడె యింతకాల మిఁక నేలఁగ నీ కగుఁ బాలివంతునన్
బాలికి లంకె లెయ్యెడల భ్రాతలు గారె పులస్త్యనందనా. 228

ఉ. అన్నను ద్రోచి యెంతచెడు గైన దదీయగృహంబుఁ జేరునే
యన్నది వింటి మీవలన నారయఁ గశ్యపునాండ్రు దైత్యులన్
గన్న నెలంత వేలుపులఁ గన్న నెలంతయుఁ దత్సుత వ్రజం
బున్న తెఱంగు వారల సహోదరమైత్రి జగం బెఱుంగదే. 229

ఉ. ఎక్కువ లాడఁగా వెఱతు నింద్రుఁడు భ్రాతలటంచుఁ గాచెనే
యెక్కడనైన దైత్యుల మహోద్ధతి గల్గిన నొంచుఁ దక్కినన్
దిక్కయి కావు మంచు హరిఁ దెచ్చి వధింపగఁ బంపుఁ జూడమే
యెక్కడి యన్న లేటి తగ వేటి విచారము శూరకోటికిన్. 230

మ. దయయున్ ధర్మము సత్య మార్జవము శాంతం బెప్పుడుం బూని స
త్క్రియలన్ సౌఖ్యము లొందు వేలుపులె దైతేయచ్ఛటన్ ద్రుంపఁగా
భయ మేలా మనవంటివారలకుఁ దద్భంగిన్ బ్రవర్తింప నె
ట్లయినన్ మేలగు దాయ గెల్వ మసురేంద్రా యంచు బోధించినన్. 231

దశగ్రీవుఁడు లంకఁ దన కిమ్మని ధనేశునితోఁ జెప్పఁ బ్రహస్తునిఁ బంపుట

శా. ఆకర్ణించి యతండు రెండుగడియల్ ధ్యానించి మీభాషితం
బే కర్తవ్య మటంచుఁ దాతవదనం బీక్షించుచున్ లేచి బా
హాకాశ్లేయకులై యమాత్యులు ప్రహస్తాదుల్ భటుల్ గొల్వ లం
కాకాంక్షన్ జని నిల్చె దండధరదిగ్రాజత్రికూటంబునన్. 232

వ. నిలిచి యచ్చట. 233

చ. అతులవచఃప్రశస్తునిఁ బ్రహస్తునిఁ జూచి దశాస్యుఁ డీ విఁకన్
బితృసము నస్మదగ్రజుఁ గుబేరుని శీఘ్రమ చేరి నాయభీ
ప్సితమును లంక మున్నసురశేఖరు లేచినకార్యభంగియున్
జతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వే చని యాడి రమ్మనన్. 234

చ. అతఁడు హసాదటం చతిరయంబున లంకకు బోయి కిన్నరీ
శితమణికంకణక్వణనచారుకరోదరచామరానిల
ప్రతిహతకుంతలుం డయి సభాస్థలి నోలగ మున్న దేవతా
పతినిభునిన్ ధనప్రభుని భక్తిఁ గనుంగొని మ్రొక్కి యిట్లనున్. 235

ఉ. దానదయాదిసద్గుణనిధాన పరాకు భవత్ప్రియానుజుం
డైన దశాననుండు వినయంబున మీ దగుసేమ మారయం
గా ననుఁ బంచె మీపదయుగంబునకున్ నతు లాచరించి మీ
తో నొక మాటఁ జెల్పు మనె దొరవు వేడ్క వినుండు తెల్పెదన్. 236

మ. మనమాతామహు లాదికాలమున నిర్మాణంబు సేయించి యుం
డిన గేహంబఁట లంక యెవ్వరచటన్ లేకుండినన్ మీరు గై
కొని పాలించితి రిప్పు డద్దనుజముఖ్యుల్ వచ్చినా రందఱున్

ననుఁ గొల్వక బుధమేను మీవలెనె కొన్నాళ్లేలఁ గాంక్షించితిన్. 237

మ. అని మీఁకూరిమిత్రముఁ డాడు ననినాఁ డామాట యట్లుండె మో
జనయుక్ దెల్పెదఁ బంక్తికంధరుఁడు భాషానాథదివ్యద్వరం
బునఁ దేజంబున మేటి నెయ్యమె తగుక్ మూర్ఖుల్ విరోధంబు సే
యన యున్నా రమితంబుగా నచట నయ్యా నీదుచిత్తం బనన్. 238

శా. ఆయక్షేశుఁడు పంక్తికంధరునమాత్యగ్రామణిక్ జూచి యే
మోయం చుండితి నింతమాత్రమున కోహో యింతసంకోచ మే
లా యీప్రో లొకఁ డెంత సాధనము నాయైశ్వర్యముక్ బ్రోవఁ దా
నే యర్హుం డగు నెమి మీ రెఱుఁగరే యి మ్మేది భేదోక్తికిన్. 239

క. నేనై చేయఁగ వలసిన, దాని నెఱింగించె మేలు తమ్ముఁడు నెమ్మిం
దా నిప్పట్టణ మేలుట, నే నేలుటకంటె వేఱ యిబ్బడి గాదే? 240

వ. అని కలయం బలికి. 241

క. కాఁపురము సేయ కిఁక లంక,కాపుర మెడఁబాయ వలసెఁ గా యనుబలు వౌ
త్రాపము దోఁపఁగ నిక ప్ర,తాపము గలయనుజుఁ దలఁచి ధనదుఁడు మరలన్.

క. రమ్మను నూ తమ్ముఁడు దన, సొమ్మనుమా లంక రాక్షసులతో మేల్ గై
కొమ్మనుమా వల దనుమా,న మ్మనుమా యనుచు దండనాథునిఁ బనిచెన్. 243

వ. ఇవ్విధంబున మనుష్యధర్ముండు దుర్మదుం డగుదశకంధరునకుఁ బ్రత్యుత్తరంబు వచియింప దూతక్ బంచి తత్క్షణంబ. 244

విశ్రవునిదేశంబువలన ధనేశుండు కైలాసంబు సేరుట

మ. నవరత్నోజ్జ్వలదివ్యపుష్పకవిమానం బెక్కి వేవేగ వి
శ్రవసుక్ జేరి నమస్కరించి యనుజప్రారంభ మాద్యంతముక్
సవిశేషంబుగఁ దెల్పి యెయ్యది నివాసం బెందు వర్తింతు మీఁ
దివిచారం బిఁక నేమి తండ్రి కృప నిర్దేశింపవే నావుడున్. 245

మ. ధనదుక్ గన్గొని దండ్రి యిట్లనియెఁ బుత్రా నేఁడు గా దద్దురా
త్ముని దానప్పని యల్లనాఁడె విని యీదుర్బుద్ధి యేమూర్ఖు దె
ల్పె నయో యగ్రజుప్రోలు గావలెనె బల్మిక్ గైకొనఁ జోటు లే
దె నయం బేల పరిత్యజించె దని సూక్తిక్ నీతి నేఁ జెప్పినన్. 246

క. చిలువకు బదనికఁ జూపిన, చెలువున నాపలుకు వాఁడు సేకొన కలుకక్
బలుకక మొగముల జేగుఱు, లొలుకఁగ వడి లేచి యిచట నుండక చనియెన్.

ఉ. వాఁడు మదాంధుఁ డాద్య లగువారలు వల్కినవాక్యపద్ధతిక్
రాఁడు పయోజగర్భునివరంబున లోకవిభుండుఁ దాన యై
నాఁడు దురాత్ము లైనదితినందనులక్ బలుమందిఁ గూడుకో
న్నాఁడు శపించినక్ గినిసినక్ బని సేయదు వానిపై నిఁకన్. 248

చ. తగనికుమారుఁ డైన మమతాఁబహితస్థితి యొప్పఁ దండ్రికిన్
దగనిసహోదరుం డయినఁ దానును బాయుట యొప్పు నన్నకున్
దగ దని నిగ్రహించినను దాదృశు లౌదురు గాన వానితోఁ
దగ దిఁకఁ బొత్తు నీ కొక హితం బెఱిఁగించెద విన్ము పుత్త్రకా. 249

శా. లీలోద్యానలతాకుడుంగవిహరల్లేఖాంగనాహాసరు
గ్జాలప్రస్రవదిందుకాంతలహరీసంబంధమందాకినీ
నాళీకోత్పలవాసనాజనితకాంతాయుగ్మలోల్లాస మౌ
కైలాసంబు వసింప నీకుఁ దగు నింకన్ జేయ మచ్చోటికిన్. 250

ఉ. అచ్చటి కేళికావనము లచ్చటికల్పితభూధరోచ్చయం
బచ్చటియచ్చపుంగొలఁకు లచ్చటిబంగరుఁజాయతమ్మిపూ
లచ్చటిరత్నమందిరము లాత్మకు మెప్పొనగూర్చునే కదా
యచ్చటికాఁపురంబునఁ బురారి సఖుం డగుఁ బొమ్ము నావుడున్. 251

చ. జనకునియాజ్ఞ మౌళి నిడి సమ్మద మొప్ప ధనేశుఁ డప్పుడే
ధనమణివస్తువాహనకదంబము సేకొని యాశ్రితుల్ హితుల్
దనయులు సైనికుల్ గొలువఁ దక్కక లంకఁ బరిత్యజించి శం
భుని శరణంబుఁ జేరి ప్రియపూర్వముగా శరణంబు వేఁడినన్. 252

క. శరణాగతసులభుం డగు, హరుఁ డాతని నాదరించి యలకాహ్వయ మహా
పుర మిచ్చి మెచ్చి మచ్చికఁ, బరమాప్తునిఁగా నొనర్చి పరిపాలించెన్. 253

క. అనయము వినయము నయమును, దనసొమ్ముగ మెలఁగుకీర్తిధనుఁ డెచ్చటి కే
గిన నిష్టార్థముఁ జేకొనుఁ, గన రామ ధనేశుఁ డిటుల కాంక్షిత మొందెన్. 254

రావణుఁడు మొదలగు రాక్షసులు లంకలోఁ బ్రవేశించుట

మ. జనలోకేంద్ర కుబేరుఁ డిట్లరుగఁ ద్రింశద్యోజనీదీర్ఘయై
కనకోద్భాసితసౌధ యై సుగృహ యై కన్పట్టునాలంక ని
ర్జన యయ్యున్ జెలువొందె నొక్కవిభుఁ డాసన్ గూడి వీడ్కొన్నఁ జ
య్యన వేఱొక్కనిరాకకున్ దనరు వేశ్యాకాంతచందంబునన్. 255

ఉ. అంతఁ బ్రహస్తుఁడున్ జని దశాస్యున కెంతయు వేడ్క నంతవృ
త్తాంతము విన్నవింప దరహాసముతో సభవారిఁ జూచినన్
వింతయె నీభుజామహిమ వీటిఁడి యై పగఁ బూన రాజరా
జింతకు గాసి గాఁడె పుర మీయక యుండిన నంచు వారనన్. 256

క. అది నిజ మౌనని పలుకుచు, మదిలోన ముదంబు వొదల మంచిముహూర్తం
బిది యని భార్గవనందను, లదురుగడన్ వచ్చి తెలుప నద్దశముఖుఁడున్. 257

సీ. తనపురోవీథి మాతామహుల్ మదమత్తమాతంగములమీఁదఁ బ్రీతిఁ జనఁగఁ
దనతల్లి కైకసీధవళాక్షి ముత్యాలపల్లకిపై వారిపజ్జ నరుగఁ

దనయిరుదెసల నిద్దఱుతమ్ము లపరిమితానీకినీయుక్తు లగుచుఁ గొలువఁ
దనవెంబడిని ప్రహస్తమహోదరసుపార్శ్వమారీచముఖమంత్రిమణులు నడువ

తే. దివ్యరథ మెక్కి శంఖవాదిత్రవేణు, కాహళాదులరవము లాకాశ మొరయ
ఛత్త్రచామరకేతనచ్ఛాయ లొలయ, వింశతిభుజుండు లంకఁ బ్రవేశమయ్యె. 258

మ. అరుసం బొందుచు మాల్యవత్ప్రముఖపూర్వాదిత్యు లవ్వేళ బం
గరుపీఠంబునఁ బంక్తికంఠు నిడి లంకాపట్టణాధ్యాసి వై
పరిపాలింపుము దైత్యపాళి ననుచున్ బట్టాభిషేకం బొన
ర్చిరి శుక్రాత్మజదత్తలగ్నమున భేరీశంఖముల్ మ్రోయఁగన్. 259

శా. ఆపౌలస్త్యకులేశ్వరుం డిటుల లంకాధీశ్వరుం డై హిత
వ్యాపారజ్ఞుల బంధులన్ సఖుల మిత్రామాత్యులన్ మాన్యభా
షాపూర్వంబుగఁ దత్తదర్హపదవీసంభావ్యులన్ జేసి వి
ద్యాపాండిత్యతపోబలాన్వయవయోహంకారముల్ మీఱఁగన్. 260

శూర్పణఖను విద్యుజ్జిహ్వున కిచ్చి పెండ్లిసేయుట

మ. అనవద్యస్థితి నుల్లసిల్లు చొకనాఁ డాత్మానుజన్ నిండుజ
వ్వని నాశూర్పణఖాఖ్యఁ గన్యఁ గని యుద్వాహంబు గావింప బం
ధునికాయాన్వితుఁ డై తలంచి యలవిద్యుజ్జిహ్వుఁడన్ కాలకే
యునకున్ బెండ్లి యొనర్చెఁ దల్లిహృదయం బుత్సాహమగ్నంబుగన్. 261

వ. ఈప్రకారంబున శూర్పణఖకు వివాహం బాచరించి యావిరించిపౌత్త్రుఁ డొక
శరత్సమయంబున మృగయావినోదం బొనరింపన్ దలంచి సముంచితమణి
మయస్యందనారోహణంబు గావించి ధనుర్బాణంబులు ధరియించి యొక్క
రుండ పోయి యమితాగమసమన్వితం బయి పులస్త్యజనకాననంబునుం బోలె
నున్నయొక్కనిర్జనకాననంబుఁ బ్రవేశించి యచ్చట. 262

రావణుఁడు మయుకూఁతురగు మందోదరిని బెండ్లియాడుట

క. సురమృగముల నీఁక నిటువలె, హరియింతు నటంచుఁ దెలుపుననువున నయ్యా
సురశార్దూలుఁడు వనభూ, సురమృగముల వేఁటలాడుచున్ జని యెదుటన్. 263

క. మయునిఁ బ్రశాంతకృపారస, మయుని హఠాభ్యాసనియమమహిమాపహృతా
మయుని గుణముదితనరసుం, మయునిఁ దొలుతఁ గైకసీకుమారుఁడు సూచెన్.

వ. చూచి తదనంతరంబ. 265

సీ. హరినీలములకప్పు నళిజాలములయొప్పుఁ గలకొప్పురహి మెప్పు గులుకుదానిఁ
గలువఱేకులయేపు ఖంజనంబులరూపు నిరసించువాల్చూపునీటుదానిఁ
జళుకుబంగరుగిండ్లు దులకించువిరిచెండ్లు నడఁగించుపాలిండ్ల సమరుదానిఁ
గండచక్కెరదీవి దండకెంపులఠీవి మొలపించుచెంగావిమోవిదానిఁ

తే. దళుకుఁజెక్కులదాని సిగ్గొలుకుదాని
నాఁజవు గలదానిఁ దొలుకారు మెఱుపుఁ జాయ
హెచ్చుజిగిదాని మయువెంట వచ్చుదాని
గాల నొక్కతెఁ జూచె నప్పంక్తిముఖుఁడు. 266

క. చూచి తలలూఁచి యెటు లని, యోచినతమిఁ దలఁచె| నౌర యీయొయ్యారం
బీచిన్నిపాయ మీచెలు, వీచెలువలయందుఁ గంటిమే లోకమునన్. 267

సీ. ఈనాతికౌనుతో నెన గాక కాఁబోలు సింగముల్ గుహలలోఁ జిక్కుటెల్ల
నీబాలనడలతో నెన గాక కాఁబోలు నేనుంగు లడవిలో నీఁగుటెల్ల
నీచెల్వచూడ్కితో నెన గాక కాఁబోలు సారంగములు పొదల్ దూఱుటెల్ల
నీకన్యఘనవేణి కెన గాక గాఁబోలు నహులు పుట్టలు సొచ్చి యడఁగుటెల్ల
తే. నీనెలఁతఁ జేరి కాఁబోలు నించువింటి, చెంచతనుఁడయ్యు జగముజయించుటెల్ల
నీలలన సృష్టి సేసి కాఁబోలుఁ బంక, జాసనుడు విశ్వమున స్రష్ట యగుట యెల్ల.

సీ. ఎలదేఁటి విహరణం బెపుడు వొందనిపుల్లకమలంబు దొరసె సిక్కలికిమోము
రాచిల్క ముక్కుఁ జేర్పనిపక్వబింబంబు ప్రతిబింబ మొనసె నిప్పఁడతిమోవి
గండుఁగోయిలకు దక్కనిమావిచిగురుల క్లొసఁగె నీలతకూనమృదుకరములు
నవభుజంగాలింగనమ్ము సేకొనని గేదఁగి తావిఁ దెలిపె నీతరుణివలపు
తే. వన్నెగలక్రొన్ననకటారిమన్నెవాఁడు, చిన్నవాఁడు వహించినచికిలికలువ
తూపులన మించె నీచెల్వచూపు లవుర, పెండ్లి లేనట్టు లున్న దిబ్బిసరుహాక్షి.

శా. ఈపద్మేక్షణజాతి యెయ్యదియొ పే రేమందురో యీఘనుం
డీపూఁబోఁడికి నేమిగా వలయునో యే నర్థి నిమ్మన్నచో
నీపూర్ణేందునిభాస్య నియ్యఁడొ కదా యీకున్న నిం తేల సం
తాపం బప్పటి కీతనిన్ గెలిచి యైనన్ దీనిఁ బెండ్లాడెదన్. 270

క. అను సాహసంబు మది నిడి, వినయము గలవాఁడపోలె వింశతిభుజుఁ డా
యన పోవు త్రోవ కడ్డము, చని వినతి యొనర్చి పలికెఁ జతురత్వమునన్. 271

ఉ. ఓమహితాత్మ యీవిపిన ముగ్రమృగాకుల మిప్పు డిందు మీ
రేమిటి కేగుదెంచితిరొ యెప్పుడు నెచ్చట నుందు రేమి మీ
నామము లానుపూర్విగ వినన్ వలతున్ వినిపింపుఁ డన్న వీ
తామయుఁ డామయుం డను దశాస్యునితోఁ గలరూప మేర్పడన్. 272

క. దానవశిల్పాచార్యుఁడ, నేను మయుం డనెడువాఁడ నిందువదన యి
మ్మానిని మందోదరి యనఁగా నొప్పు మదీయపుత్త్రి గాంభీర్యనిధీ. 273

ఉ. నామహనీయశిల్పమును నాసుగుణంబులు మెచ్చి దేవతల్
హేమ యనన్ బ్రసిద్ధి వహియించిన యచ్చరలేమ నిచ్చి రా
హేమకుఁగా మనోజ్ఞమగు హేమపురంబు సృజించి యచ్చటన్

హేమను గూడి యేను సుఖియించితి పంచశతాబ్దముల్ రహిన్. 274

శా. ఏ మెన్నో యీశ్వరమాయ యేమొ యెఱుఁగన్ గాంచఁడి హేమతో నున్న చో
వ్యామోహంబునఁ బెద్దకాలము క్షణంబై తోఁచు నా చెల్వనె
మ్మో మొక్కించుక చూడకున్న నిమిషంబుల్ కల్ప మౌ వేయు నే
లా మే లెట్టిదొ దాని యిల్లు వెడఁగాయన్ లే నహోరాత్రముల్. 275

శా. ఆ యేల్ బోయెను నాఁటిజోలి యిఁక నేలా యీవలన్ వింటివే
యోయయ్యా యిటు గొన్నినాళ్లు సన నా యోగంబునన్ దౌహృద
శ్రీ యప్పద్మపలాశలోచన ధరించెన్ గాంచె మాయావి యా
మాయావిన్ మఱి దుందుభిన్ బిదప నిమ్మందోదరీకన్యకన్. 276

చ. అనిమిషు లంతటన్ బిలువ నంపిన నన్నెడఁబాసి హేమ పో
యిన నది లేనిచోట వసియింప సహింపక సంసృతిప్రవ
ర్తనము జుగుప్స గాఁ గని విరాగుఁడ నై తప మాచరింపఁ బో
వనె సమకట్టి యీసుత వివాహము సేయఁ దలంచి యిమ్మెయిన్. 277

క. తగువాని నెందుఁగానక, జగతిన్ గ్రుమ్మరెద రాత్రిచరశేఖర నీ
దగుకులము నామ మే వినఁ, దగుదు ననుచుఁ దోఁచె నేనిఁ దగు వివరింపన్.

ఉ. నా విని పంక్తికంఠుఁడు మనంబున సంతస మంది యో మహా
త్మా విను నాకు బ్రహ్మ ప్రపితామహుఁడేను బులస్త్యపౌత్త్రుఁడన్
బావనమూర్తి విశ్రవుఁడు మజ్జనకుండు జగంబునన్ దశ
గ్రీవుఁడు నా బ్రసిద్ధుఁడ నరీణపరాక్రమధైర్య ధుర్యుఁడన్. 279

మ. లవణాంభోధిగభీరఖేయవృత మాలంకాపురం బేలుదున్
స్వవయోరూపకులానురూప యగుకన్యన్ గోరుచున్నాఁడ లే
దు వివాహం బని పల్కినన్ మయుఁడు సంతోషించి యర్ఘ్యం డితం
డవు మత్పుత్త్రిఁ బరిగ్రహించుటకు నూహాపోహ లింకేటికిన్. 280

క. అని కృతనిశ్చయుఁడై యయ, ద్దనుజమణికి దారవోసెఁ దనపుత్త్రి మయుం
డనలునిసన్నిధి నతఁడున్, దనరుచుఁ బాణిగ్రహణముఁ దగ నొనరించెన్. 281

శా. మాణిక్యోజ్జ్వలకంకణస్ఫురిత మందోదరీకన్యకా
పాణిన్ బట్టిన సాత్త్వికోదయము సూపట్టెన్ దశగ్రీవుమై
క్షోణీనాయక యెంత తామసగుణస్థుం డైనచో సద్గుణ
శ్రేణిన్ మించినవారిపొం దొలసినన్ జేకూరుఁ దద్భావమున్. 282

ఉ. రాక్షసరాజ్యలక్ష్మి యన రంగు వహించిన యప్పయోజప
త్త్రేక్షణ నిట్లు పెండ్లి యయి యెంతయు వేడ్క దశాస్యరాక్షసా
ధ్యక్షుఁడు మామకున్ బహువిధార్చన లిచ్చిన నాతఁడున్ లలా
టాక్షుని నైన నొంచునొక యద్భుతశక్తి యొసంగి ప్రేముడిన్. 283

క. ఇది పరమఘోరసాధన, మెదిరించిన నెట్టిపగతు నేనిఁ జెఱచు బె
ట్టిదుమీఁదఁ గాని నైవకు, మద రొండెడువారిమీఁద నని వీడ్కొనియెన్.

తే. రామయాశక్తిఁగొనికాదె రావణుండు,మున్నమనలక్ష్మణునినొంచిమూర్ఛవుచ్చె
నదియుఁబెనులోభిఁ బ్రార్థించునర్థియాశ,వలె నిరర్థక మై చన్న వగలఁ బొగిలె.

కుంభకర్ణ విభీషణుల వివాహము

మ. అవి యెల్లన్ రఘువీర నీ వెఱుఁగవే యాగాథ లట్లుండె ని
ట్లు వివాహోత్సవ మాచరించి శశకంఠుం డెంత సౌదామనీ
చ్ఛవిమీఱ బలిపుత్త్రికామహిత వజ్రజ్వాల యన్ దాని బాం
ధవు లౌరా యనఁ గుంభకర్ణునకు నుద్వాహం బొనర్చెన్ రహిన్. 286

మ. సరమన్ గేసరమంజుసౌరభవతిన్ సౌందర్యలీలావిలా
సరమన్ భాసురమన్మథాస్త్రతులితన్ శైలూషగంధర్వశే
ఖరుకన్యామణిఁ జిన్నతమ్మునకు వేడ్కన్ బెండ్లి సేసెన్ నిశా
చరవంశాగ్రణి యద్దశాననుఁ డెదన్ సౌభ్రాత్ర ముప్పొంగఁగన్. 287

మేఘనాదుని జననము

ఉ. ఆదటఁ గొన్నినాళ్లకు దశాస్యునిపట్టపుదేవి యైనమం
దోదరి గాంచె నొక్కసుతు నుద్ధతు నాతఁడు పుట్టినప్పుడే
రోదసి భేదిలన్ సురవరుల్ బెగడన్ ఘనలీల మ్రోయఁగా
నాదృతి మేఘనాదుఁ డనునాఖ్య యిడెన్ జనకుండు వేడుకన్. 288

చ. చిదుగుల వృద్ధిఁ బొందుశిఖిచెల్వున నద్దశకంఠుపుత్త్రుఁ డ
భ్యుదయముఁ జెందుచుండెఁ బితృపోషణపెంపున నక్కుమారుఁడే
కద మఱి యింద్రజిత్తనఁ బ్రకాశిలె నత్తెఱఁ గెల్ల జానకీ
హృదయసరోజమిత్త్ర వివరించెద మీఁద గథాక్రమంబునన్. 289

కుంభకర్ణునకు నిద్రింప దశగ్రీవుం డొకయిల్లు గట్టించుట

చ. విను మటమీఁద బ్రహ్మ యొదవించిననిద్దురమబ్బు కుంభక
ర్ణుని మొగ మాని జాగ్రదవబోధ మొనర్చినఁ బవ్వళింపఁగాఁ
దన కొకయిల్లు గావలయు దానవనాయక యంచు నన్నతోఁ
ననుటయు నాతఁ డప్పనికి నప్పుడ పంచె ననేకశిల్పులన్. 290

వ. వారును దదాజ్ఞ శిరంబున ధరియించి తత్క్షణంబ. 291

సీ. చిలికిప్రాఁగెంపుటిట్టికలగోడలు వెట్టి వజ్రంపుగారలపను లొనర్చి
మూలజారాకంబములు పెక్కుజతసేసి జాళువాప్రతిమలచా లమర్చి
తులకించుపవడంపుదూలముల్ పయి నుండి పచ్చజాపలకలు పాదుకొలపి
పులుదిండిరాముత్తములలోవ లమరించి స్ఫటికసోపానముల్ సంఘటించి

తే. పుష్యరాగవితర్దికల్ భూరిచంద్ర, కాంతజగతులు గోమేధికపుఁదలుపులు
కళుకుముత్యాలసోరణగండ్లు వేడ్క, సేయఁ బడకిల్లు గట్టి రాశిల్పివరులు. 292

క. ఆమడనర వెడలుపు మూఁ, డామడ నిడివియును గలిగి యతిరమ్యం బై
రామ ఘటకర్ణుపటుని,ద్రామందిర మలరు మృదులతల్పతతులతోన్. 293

వ. అటుల ధవళప్రభాపహసితకైలాసం బగుతన్నివాసంబున. 294

సీ. కిన్నరాదులఁ గిట్టి గెలుచునాందోళంబు మించఁ బల్లఁ గల్వారించుకొనుచు
దిక్కరుల్ సెవు డొంద దేవతల్ వెఱ సెంద బెట్టుగా గుఱకలు వెట్టుకొనుచుఁ
గలలోన దిక్పాలకులమీఁదఁ జని మాఱుకొనువారిఁగని పండ్లు గొఱికికొనుచు
నెలవుల లాల చిప్పిల నప్పటప్పటి కించుకించుక చప్పరించుకొనుచు

తే. మరలుచును బొర్లుచును మేను మఱచి మిగులఁ
జెమ్మటలఁ దొప్పదోఁగుచు నిమ్మళించు
నిబిడతామససుఖ మిచ్చు నిద్రఁ గలిసి
కాలముఁ గ్రమించె నక్కుంభకర్ణుఁ డధిప. 295

దశగ్రీవుండు గరుడప్రముఖుల బాధించుట

క. కూరుఁడు దశముఖుఁ డంతఁ బ,యోరుహభవదత్తవరమదోద్రేకమునన్
మేం దలంపక దుష్ట,ప్రారంభమునందె బుద్ధి యలవఱిచె నృపా. 296

వ. అది యెట్లనిన. 297

సీ. గరుడుల గరుడులకంబంబులనె కట్టి గంధర్వగంధర్వగతు లడంచి
యక్షులఁ బక్షులయటుల పాఱఁగఁదోలి ఖచరులఁ గుచరులఁ గా నదల్చి
కిన్నరు లెన్నరు తన్నని నొప్పించి సిద్ధులఁ బద్ధులఁ జేసి కలఁచి
సాధ్యులు సాధ్యులై శరణుఁ బొందఁగఁ జేసి యమరులఁ జమరులయండ కనిచి

తే. భోగుల విభోగుల నొనర్చి యోగితతి వి,యోగితతివలె బలువెత నొందఁజేసి
చారణానిలతుషితభాస్వరుల నోడిచి, యుద్ధతేజంబుఁ జూపె లంకేశ్వరుండు. 298

మ. హవనంబుల్ భువనంబులున్ జెఱుచు మాయన్ దాల్చుఁ గూల్చున్ సుధా
శివనంబుల్ పవనంబులీల ద్విజులన్ ఛేదించి భేదించుఁ ద
ద్భవనంబుల్ భువనంబు లున్నతటినుల్ బంధించి మ్రందించు స
త్సవనంబుల్ ప్లవనంబుఁ జెంద గిరు లుద్యన్మష్టి నొంచున్ వడిన్. 299

ధనాధిపుఁడు దశగ్రీవునకు నీతిం జెప్ప దూతను బంపుట

ఉ. ఆతఁడిఁ గొన్నినాళ్లకు ధనాధిపుఁ డంతయు నాలకించి దు
ర్నీతి వహించుతమ్మునికి నీతియు ధర్మవుఁ దెల్పుకూరిమిన్
దూత నతిత్వరన్ బనుప దుశ్శకునంబులతోడ లంకకున్
భీతిల కేఁగి వాఁడును విభీషణు ముందఱ కాంచెఁ గాంచినన్. 300

ఉ. అన్నయశాలి వానిహృదయం బలరంగ బహూకరించి మా

యన్నకు సేమమే వదిన హర్షముఁ గాంచునె పుత్త్రు లెల్ల సౌ
ఖ్యోన్నతులే కదా కుశలయుక్తులె యాప్తులు మంత్రు లాశ్రితుల్
ని న్నిట కేల యంపెఁ బతి నేఁ డన నంతయు వాఁడు దెల్పినన్. 301

తే. కొంత చింతించి మనహితోక్తులు సగౌర,వముగ విననేర్చునే పంక్తివదనుఁ డేల
యన్నయిప్పనిఁ దలపెట్టె నైన నేమి, వచ్చితివికద రమ్మని వానిఁ గొనుచు. 302

మ. గణనాతీతనిశాచర స్తవము లాకర్ణించుచున్ గంకణ
క్వణనంబుల్ దగఁ జామరంబు లమరీవారంబు వీవన్ సభాం
గణసమ్మర్దము వేత్రహస్తు లుడుపంగా నిండుకొల్వున్న రా
వణునిన్ జేరి విభీషణుం డెఱిఁగి క్రేవన్ దూతఁ గాన్పించినన్. 303

క. ధనదునిదూతయు వినయం,బున నించుక చేరి మ్రొక్కి ముకుళితకరుఁ డై
దనుజులబహుసమ్మర్దం,బున నొదుఁగుచు నిలిచి బంక్తిముఖుతో ననియెన్. 304

ఉ. స్వామి పరాకు దైత్యకులచంద్ర త్వదగ్రజుఁ డైనకిన్నర
గ్రామణి వంశవిత్తగుణగౌరవయుక్తి సమానుఁ డౌట మీ
సేమము వేఁడి మీకొకవిశేషహితం బెఱిఁగింపు మంచు న
న్నీ మెయిఁ బంచె నెయ్యము వహించి వినుం డది విన్నవించెదన్. 305

చ. సమతఁ బరోపకారకృతి సల్పుటయే సుకృతంబు ఘోరపా
పము పరపీడ సేయుటయె బ్రహ్మకులంబునఁ బుట్టి దేవతా
ప్రముఖవిరోధముల్ నెరపఁ బాడియె ధర్మముచేతఁ గాదె యీ
సమధికసంపదల్ దొరసి సంతత మందఱమున్ సుఖించుటల్. 306

ఉ. నాస్తికుఁడున్ శఠుండుఁ గులనాశకుఁడున్ గను దుష్టవర్తనం
బాస్తికతాధురంధరున కర్హమె యద్భుతనిష్ఠచే నజో
పాస్తి ఘటించినాఁడవు కృపాగుణశూన్యుఁడ వై భుజాబల
ధ్వస్తులఁ జేయ నేల సురవర్యుల నార్యుల ధర్మధుర్యులన్. 307

ఉ. నందన మాది యాసురవనంబులఁ గూల్చితి వప్సరోవధూ
బృందము బల్మిఁ బట్టి చెఱఁ బెట్టితి వార్యులు సేయుయాగముల్
మ్రందఁగఁ జేసి తార్తు లగుమానులఁ జంపితి వస్మదాదు లే
మందురొ యన్ భయం బెఱుఁగ వైతివి తెల్పెడి దెట్లు నీ కిఁకన్. 308

ఉ. గొట్టుతనానఁ దన్ వెడలఁ గొట్టినఁ దిట్టను రట్టడంచుఁ దోఁ
బుట్టువనాట నొం డనక పోయితిఁ బల్మఱు బెట్టు సూపినన్
జుట్టము లైనఁ దాళుదురె శూరతయే జడదారిపెద్దలన్
బట్టి వధించుటల్ వెడఁగుభావము మానఁ గదయ్య తమ్ముఁడా. 309

మ. హిమవత్పర్వతతుంగశృంగమున నే నిన్నాళ్లు శైవవ్రతం
బమితశ్రద్ధ నొనర్చి వచ్చి భవదీయాద్ధత్య మాలించి ధ
ర్మము గా దంచుఁ బ్రబోధ సేసితి ననున్ బాటించి వంశోచిత

క్రమముల్ గైకొను మంచుఁ దెల్పు మనె యక్షస్వామి రక్షోధిపా. 310

మ. అదిగా కన్యలకల్మిఁ గన్గొని యసూయామగ్నుఁడై వాని కా
పద సేకూరు నవశ్య మట్టియశముల్ బ్రాపించె మీయన్న యే
యది తాఱ్ఱాణగ విన్నవింతు వినుఁ డం చద్దూత కేల్మోడ్చి నె
న్నుదుటన్ జేరిచి పల్కెఁ గ్రమ్మఱ నుదాంధుండౌ దశగ్రీవుతోన్. 311

మ. దితిజాధీశ్వర యొక్కనాఁడు తుహినాద్రిన్ జేరి మీయన్న యం
దతిసౌభాగ్యనిరూఢి శంకరునియర్ధాంగంబునన్ మించుప
ర్వతరాట్కన్యక నట్టె చూచి నెటు సంప్రాప్తించె నీభాగ్య మీ
సతి కంచున్ దనసవ్యనేత్రమున నీర్ష్యాలోపమగ్నాత్ముఁడై. 312

ఆ. ఇటుల కుటిలబుద్ధి నీక్షించుయత్నేశు, సవ్యలోచనంబు క్షణములోన
దివ్యయోగమహిమ దేవి దగ్ధము సేయ, నేమి సేయువాఁడ నింక ననుచు. 313

క. విత్తవిభుఁ డడిలి యగ్గిరి, యుత్తరశృంగమున నియమయుక్తి నిలిచి య
ష్టోత్తరదశశతవర్షము, లుత్తమశైవవ్రతంబు లొనరించునెడన్. 314

ఉ. భూరిజటల్ ప్రవాళములపోల్కిఁ గనన్ ఘనబాహుశాఖలన్
మీఱి యపర్ణ పర్ణరుచి మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా
కారముఁ బూన నీలగళకాంతులు తేఁటులనీటుఁ జెంద మం
దారములీల శూలి ధననాథునకున్ గనుపించి యిట్లనున్. 315

ఉ. మెచ్చితి నీతపంబునకు మీ టగునిష్ఠకు నిమ్మహావ్రతం
బచ్చుపుబత్తి నెవ్వరుఁ బ్రయత్నముతో నిటు సంఘటింప లే
రచ్చుగ మున్ను నే సలిపినట్టులె సల్పితి వీ వొకండవే
యిచ్చితి నాసఖిత్వము వహింపుము మత్తులితప్రభావమున్. 316

తే. దేవి నేదృష్టి గంటి వాదృష్టి యొకటి
యును ధరారేణుపరివృతజ్యోతిగతిఁ బి
శంగరుచిఁ గాంచు నేకపిశంగనయనుఁ
డనఁగ నందున వెలయుదు వనఘ నీవు. 317

చ. అని వర మిచ్చి శూలి రజతాద్రికి నెచ్చెలికాని వెంటఁ దో
డ్కొని చనుదెంచె నట్లగుటఁ గోప మసూయయుఁ గీడు ధర్మవ
ర్తనము సమస్తబాంధవహితం బగు నగ్రజుబుద్ధిమాటఁ జే
కొనుము శుభంబు మాన్పు చెడుగుం దన మేలని దూత దెల్పినన్. 318

దశగ్రీవుఁడు ధనేశ్వరునిదూతం జంపి యలకాపురిపై దండెత్తుట

మ. పదిమోములన్ ప్రళయార్కబింబములరూపం బూనఁ గోపంబునన్
రదసంఘట్టన మాచరించుచు నదభ్రభ్రూకుటుల్ మీఱ ని
ర్వదికన్నుల్ జ్వలితాగ్నికుండములయుగ్రత్వంబు సూచింప మూ
ర్ఖ దశాస్యుం డలదూతఁ జూచి మిగులన్ గ్రూరాత్ముఁడై యిట్లనున్. 319

తే. మంచితనమున నీతి బోధించువాఁడ, వోలెఁ దనయుగ్రతపమును శూలితోడి
చెలిమియును గల్మిబలిమియుఁ దెలుపఁబంచి, నాఁడె మీఁదార నాచెంత నానలేక.

ఉ. రొక్కము గన్న కల్మియును రుద్రుని చెల్మియు నమ్మి కొన్నిదు
ర్వాక్కుల వాఁడు దెల్పి యిటు రమ్మన నీ వెటు లాడవచ్చితే
యిక్కడ మూర్ఖ యం చడిదమెత్త వధింపకుఁ డంచుఁ దమ్ముఁడుల్
మ్రొక్క నదల్చి దూతశిరముల్ దెగవ్రేసె వివేకశూన్యుఁడై. 321

మ. అలకాధీశునిదూత నిట్లతఁడు ప్రాణాంతంబు నొందించి యా
తలయుల్ మొండెముఁ గొల్వులో మెలఁగుభృత్యశ్రేణిపాల్ సేసెఁ బ్ర
జ్వలితాత్యుగ్రదవాగ్ని నే విడిచినం జల్లారునే నీతివా
క్కుల మూర్ఖుండు శమించునే కినుకఁ గాకుత్స్థాన్వయగ్రామణీ. 322

క. చెనఁటి యని దశముఖుని ననఁ, బనిలే దతనికి హితోక్తిఁ బ్రకటింపఁ దలం
చినధననాయకు ననవలె, జనవర విను మంత నద్దశగ్రీవుండున్. 323

తే. తనయమాత్యులఁ గనుఁగొని ధనదుమాట, వింటిరే యిప్పుడెంత గర్వించినాఁడు
మాకుఁ దనకున్నపాటివివేక మున్న, దే ప్రబోధింపఁ దాఁగాక యెవ్వ రింక. 324

ఉ. పట్టణ మాక్రమించి దనుఁ బాఱఁగఁ దోలిన నోర్చి తానుఁ దోఁ
బుట్టువు గాన పోయె నఁట పోవక నిల్చిన నేమి సేయునో
గట్టిగఁ జూత మిప్పు డలకాపురి ముట్టడి చేసి గట్టువిల్
పట్టిన దిట్టఁ గూడి మనపై భుజశౌర్యముఁ జూపుఁ గా కిఁకన్. 325

ఉ. మాన్యుఁ డటంచు నెంచు బహుమాన మెఱుంగక యత్తుఁడే యసా
మాన్యవిరోధకృద్వచనమార్గణపంక్తుల నొంచె నింద్రము
ఖ్యాన్యులు నన్ను గెల్వఁగఁ బ్రయత్నము సేయుట యుగ్గడించె నీ
సైన్యము దీఱ నింక ధనదాదిదిగీశుల గెల్వఁ బోఁ దగున్. 326

ఉ. లెమ్ము ప్రహస్త తొల్త నవలీల ధనేశుని గెల్వఁ బోయెదన్
బొమ్ము బలంబుఁ గూర్పు మన ప్రోలను గల్గినవీరదైత్యులన్
దెమ్ము భయానకార్భటులు దిక్కులఁ బిక్కటిలంగ నాబడిన్
రమ్ము రయమ్ముతో నన భరంపడి యాతఁడు నట్ల చేసినన్. 327

సీ. శాతమన్యవశిలాచక్రఘుర్ఘురదీర్ఘరావంబు దిక్కుల వ్రక్కలింప
గారుత్మతద్యుతిస్ఫారసైంధవఖురోద్ధురసముద్ధతుల నిద్ధం చలింప
సారసారసరాగచారుకేతనకాంతు లాకాసమణిదీప్తి నపహరింప
ఘనఘంటికాఘణంఘణనాదమున ధరాధరగుహాళులు ప్రతిధ్వనులొసంగ

తే. శరశరాసనముసలముద్గరకృపాణ, తోమరగదాదిసాధనస్తోమపూర్తి
మిక్కుటంబైన యొక్క తేరెక్కి వెడలె, వింశతిభుజుండు త్రైలోక్యవిజయకాంక్ష.

క. మారీచమహోదరశుక, సారణధూమ్రాక్షముఖ్యసచివులలోఁ బెం
పారఁ బ్రహస్తుఁడు ముంగలి, దై రాక్షససేన నడపె నపుడు నృపాలా. 329

క. మల లూ ఁబాడ నదీనదములు గలఁగఁగఁ జండనిపినములు గూలఁ బురం
బులు బెదర ముహూర్తంబునఁ, బలలాదబలంబు లలకపట్టణుఁ జనియెన్. 330

సీ. చరనీలగిరిశంక సవరించుమదమత్తకరులదంతురదంతకాండరుచులుఁ
దనువు లొందినగాడ్పు లననొప్పను త్తమాశ్వములముత్యాలకళ్లెములరుచులు
బలుమేరువులతీరు గలతేరులను మిఱుకళుకువజ్రపుబండికండ్లరుచులుఁ
గలనైన భయమెఱుంగనిభటోత్కరమెత్తువిచ్చుకత్తుల నిచ్చ హెచ్చురుచులు

తే. ధవళకేతనరుచులు ఛత్త్రములరుచులుఁ, జామరంబులరుచు లొక్కసారి నిగిడి
మొదుకొని యెండకొండపై నిండ నాప్ర,చండభుజదండుఁడాతండుదండువిడిసె.

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁ డవల వింశతిభుజుఁడున్
ధనవిభుఁడును బోరినవిధ, మనఘా విన వలతుఁ జెప్పు మని యడుగుటయున్.

ఆశ్వాసాంతము

ఉ. నందకుమార మారద సనందననారదమానసాంతరా
ళిందవిహారి హారిమురళీమృదుగానవిలోలగోపికా
నందవిదాన దానవఘనాఘనభిన్నరదుల్లలద్గరు
ద్బృందతురంగ రంగదమరీజనరంజన రాసఖేలనా. 333

క. వనదారుణశిఖివారణ, వనదా మదవారణేంద్రవరద జగత్పా
వనదాసజననిరూఢా, వనదాక్షిణ్యాదిసుగుణవరరత్ననిధీ. 334

పంచచామరము. సనాతనప్రసిద్ధిపూరుసత్త్వకీర్తిభాజనా
జనాదిలోకసంగివానిసంఘసౌఖ్యసాధనా
ధనాధినాథనందనాత్తతాపహృత్కృపాఘనా
ఘనాత్మరూపదర్శనోత్సుకత్సరోరుహాసనా. 335

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన
వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ
వికీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర
ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనిషావిశేషమంధాన
వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర
కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన
నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన
నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామా
యణం బనుమహాకావ్యంబునందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## తృతీయాశ్వాసము

—:o:—

శ్రీవనితానిభనీళా
దేవీకుచమృగమదాభదేహరుచిఝరీ
గోవర్ధనలీలాధృత
గోవర్ధనశిఖరి వేణుగోపాల హరీ. 1

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ యిటు లద్దశాననుండు, విత్తవిభుపీటిపై దండు విడిసినపుడు. 2

మ. భటకోలాహలముల్ మహారథికశుంభచ్ఛంఖఘోషంబు లు
ద్భటదంతావళబృంహితంబులు హయప్రత్యగ్రహేషార్భటుల్
పటహాద్యద్భుతవాద్యభేదరవముల్ బ్రహ్మాండభాండచ్ఛిదా
పటిమన్ మించె విరోధిరాడ్యువతిగర్భభ్రూణముల్ భేదిలన్. 3

### కుబేరుఁడు దశగ్రీవునిమీఁదికి యక్షులను బంపుట

వ. అప్పు డప్పర్వతప్రదేశంబున నుక్కళం బున్నయక్షకిన్నరు లన్నరవాహనున కిది విన్నవింపకయ మించి మన మొక్కించుక శరపరంపరల ముంచిన మాట వచ్చు నని కొంచి కొంద ఱందుఁ దరలక కొంద ఱలకాపురంబున కరుదెంచి యుదంచితప్రాభవంబు మెండుకొన నిండుకొలు వున్నకిన్నరేశ్వరున్ బొడగని. 4

క. వందనములు సేసి పరా, కిందుకళాఫాళిమిత్ర యిదె నేఁడు చమూ
బృందముతో దశవదనుఁడు, నందాతీరమున విడిసినాఁ డని తెలుపన్. 5

తే. ఆకుబేరుఁడు నవ్వి బళా మఱేమి, దశముఖుఁడు మంచిపని సేయఁ దలఁచె హితవు
దలఁచినన్ మఱిముక్కుకోఁతలనుమాట, నేఁడు నిజమయ్యె నిఁక నేల నెనరు దలఁప.

ఆ. మొగముఁ బొడువ లేనిముంగోప మిఁక నెప్పు, డలకఁ జొచ్చె నేనిఁ జులుకనగుదు
మటుల చేయ నీయ కాఁగి భండన మాచ,రింపుఁ డనుచు వారిఁ బంపుటయును.

### యక్షరాక్షసుల యుద్ధము

ఉ. యక్షవరాజ్ఞ వహాళి నిడి యక్షులు నక్షుల నిప్పు లుర్ల హ
ర్యక్షములో యనన్ గహకహార్భటు లభ్రము నిండఁ జేయుచున్

రాక్షససేనఁ దాఁకి రల రాక్షసులున్ నలిరేఁగి మార్కొనన్
ద్ర్యక్షధరాధరం బదరె నంబుజపత్త్రగతిన్ దదుద్ధతిన్. 8

మ. అసిఘర్షోదితవిస్ఫులింగమయ మై యస్త్రానలాభీలకీ
లసముజ్జృంభిత మై గదాముసలశూలప్రాససంప్రేరణా
వసరాన్యోన్యకృతాభినందనవచోవ్యాపార మై యక్షరా
క్షససంగ్రామము సూచుఖేచరులకున్ గల్పించె దృక్పర్వముల్. 9

శా. దోరుత్తుంగతరంగముల్ నిగుడఁ దద్ఘోరాసిమీనప్రభల్
మీఱన్ సైనికచంద్రు లుబ్బసఁగ గాంభీర్యం బవార్యంబుగా
భేరీభాంకృతిరావ మొప్పఁ గరిభూభృత్కోటి మీఁ టొందఁగాఁ
బోరాడెన్ వడి యక్షరాక్షసబలాంభోరాసు లొండొంటితోన్. 10

వ. అప్పుడు. 11

ఉ. కూలెడునేనుఁగుల్ దెరలుగుఱ్ఱములున్ వడి ద్రెళ్లుతేరులున్
వ్రాలెడిపెక్కెముల్ మునిసి వమ్మగుఛత్త్రము లాడునట్టలున్
దూలెడిరూపులున్ దొరఁగుతోరవు నెత్తురు టేఱు లందుపైఁ
దేలెడుపీనుఁగుల్ గలిగ ధీరతఁ బోరెడు రెండుసేనలన్. 12

ఉ. రాక్షససేనముందటఁ దిరంబుగ నిల్చి రణం బొనర్చు న
య్యక్షులఁ జూచి పంక్తిముఖుఁ డక్షముఁ డై నిజసైన్యరక్షణా
ధ్యక్షుల మార్కొనన్ బనిచి తానును నిర్వదిచేతులన్ గదా
సిక్షురికాదిసాధనవిశేషవిజృంభము గానుపించినన్. 13

చ. చెదరక యక్షులున్ దనుజశేఖరు బిట్టెదిరించి భీకర
ప్రదరపరంపరల్ గురిసి పైపయి నైకవిధాయుధచ్ఛటల్
గుదిగొన నించి బీరమునఁ గో యని యార్చినచో మహోదరుం
డుదుటున నొక్కఘోరగద యూని కృతాంతునిలీల నుగ్రుఁ డై. 14

క. వాయువు బలువడిఁ గుజములఁ ద్రోయుతెఱంగున గదాహతులచే క్షితిపాల్
గా యక్షసేనఁ గూల్చె భళీ యని శుకసారణాదు లెల్ల నుతింపన్. 15

క. శుకసారణధూమ్రాక్షాదికసేనాధీశు లొక్కదెస దశకంఠుం
డొకదెస యక్షుల జముపీటికి నతిథులఁ జేసి రోహటింపక యధిపా. 16

ఆ. అపుడు పఱచుయక్షు లతిభీతు లై పూరి, మఱచుయక్షు లొడలు పఱచుయక్షు
లఱచుయక్షు లై మహావాతధూతజీ, మూతరీతిఁ జని రరాతు లలర. 17

ఉ. విచ్చిన నొచ్చినన్ వెఱచి వేఁడిన నోడిన వారిఁ బోవ నీ
కచ్చెడుగుల్ దయారహితు లై యలకాపురిదాఁక గోటలోఁ
జొచ్చినదాఁక వెంటఁబడి శూలములన్ బలితంపుటీఁటెలన్
గ్రుచ్చిరి చొచ్చి వచ్చి రదిగో యని పౌరులు దల్లడిల్లఁగన్. 18

సంయోధకంటకుఁ డనుయక్షవరేణ్యుఁడు యుద్ధము సేసి పాఱి పోవుట

మ. ప్రకటక్రోధములన్ ధనాధిపతి పంపన్ వేగ సంయోధకం
టకుఁడన్ యక్షవరేణ్యుఁ డొక్కఁ డపు డడ్డంబై పురద్వార ము
త్సుకతం జొచ్చునిశాటకోటిపయి శక్తుల్ దోమరంబుల్ శర
ప్రకరంబుల్ గురియించి నిల్చెఁ దనశౌర్యం బందఱున్ మేలనన్. 19

శా. ఆరక్షోబల మాతనిన్ గడవలే కాకంపమున్ జెందఁగా
మారీచుం డెదిరించి శాతశరసంపన్నత్వమున్ జూప న
వ్వీరుండున్ గద యెత్తి వానిశిరమున్ వ్రేయన్ వెసన్ గూలె న
త్ప్రారంభం బుడి వోవ నేలఁ బహుపుణ్యభ్రష్టుచందంబునన్. 20

ఉ. కూలి ముహూర్తమాత్రమునకున్ దెలివిన్ గని ఱాటకేయుఁడున్
వాలుమెఱుంగుఁదూపు లనివారణ యక్షునిమేనఁ గ్రుచ్చి యా
భీలతఁ జూపినన్ సమరభీతి జనించి యతండు దాళఁగా
జాలక వీఁగి పోయిన నిశాచరు లార్చిరి సంభ్రమంబునన్. 21

వ. ఇవ్విధంబున నంయోధకంటకుం డాయోధనంబు విడిచి, యోధధర్మంబు దల
కడచి పాఱిన మీఱినకౌతుకంబునం బదిమొగంబులఁ గుతుకం బగుమంద
స్మితంబుతో నలకమొగంబు దాఁటి మేటికిరీటి పచ్చరాజంతులన్ గనుపట్టుకోట
వాకిటిరచ్చపట్టుకొట్టంబున నట్టనడి తెరువుం బట్టుకొని నూర్గొనలపట్టెంబు వట్టు
వేల్పుఁజలుపలన్ గట్టిన గోపురంబు డాసి వాసిగలచిగురుఁదొగరులం దెగడుపగ
డంపుద్వారబంధంబు లురలం ద్రోచి మగఱాలబోరుతలుపులు వీడన్ దన్ని
పదాలువన్నెహొన్నుపనులన్ జూడన్ జూడవేడుక యగు నగరిముందరి
వైడూర్యతోరణస్తంభంబుకడక స్తంభసంరంభమునన్ జొచ్చి వచ్చునక్కుంభ
కర్ణాగ్రజున్ గనుంగొని. 22

దౌవారికుం డగుసూర్యభానునిఁ దుత్తుమురై పడ దశగ్రీవుండు గొట్టుట

తే. అచటిదౌవారికుఁడు మహాహాసితతీవ్ర
భానుఁ డగుసూర్యభానుఁడప్పంక్తిముఖున
కడ్డమై యెందు వచ్చెద వనుచు నతని
జుట్టు నరుదెంచు దైత్యుల బిట్టదల్చె. 23

ఉ. సింధువు మించి రా విడనిచెల్లెలికట్టతెఱంగునన్ సురా
బంధుబలంబు నిల్పి నిలుపన్ నిల కేఁగెడుపంక్తికంఠు గ
ర్వాంధునిఁ జూచి పోకు నిలుమా చలమా ఫలమా బలాప్తి కీ
బంధుల నొంప వచ్చు టని పల్కి మహాగద పూన్చి వైచినన్. 24

శా. కుంభీంద్రంబు మృణాళమున్ దునుములాగున్ దోఁప దానిన్ భుజా
శుంభల్లీల సురారి ద్రుంపఁ గని యక్షుం డుగ్రుఁడై తోరణ

స్తంభంబుఁ బెకలించి వైవ నతఁడుఁ దానఁ ధరఁ గూల క
య్యంభోజాసనదత్తదివ్యవరమాహాత్మ్యంబునఁ గ్రూరుఁడై. 25

క. అత్తోరణంబు గొని నడు, నెత్తిపగుల సార్వభౌమునిఁ మొత్తినచోఁ
దుత్తుమురై వాఁడిలఁ బడె, నత్తఱిఁ బఱపెత్తె నచటియక్షగణంబుల్. 26

—— మాణిభద్రుఁడు పోరి వ్రేటుపడి పార్శ్వమౌళి యని పేరు వడయుట ——

క. అలబలము లిటుల పఱచిన, నలబల మెసఁగఁ దశాస్యుఁ డసురావళితో
నలకఁ గలఁపంగ నది గని, పలికె ధనేశుండు మాణిభద్రునితోడన్. 27

క. నొచ్చిరి మనయక్షులు పుఱిఁ, జొచ్చిరి రాక్షసులు బాలిశుని దశముఖునిఁ
జెచ్చెర నెదిర్చి నీవా, రిచ్చ నలర విక్రమింప నిది దఱి నీకున్. 28

తే. అనిన సామి పనాదని యమితసమర, దోహళంబున నతఁడు చతుస్సహస్ర
యక్షవీరులు దనతోడ నడుగుదేరఁ, గల్పకాలాంతకునిలీలఁ గదలి వచ్చె. 29

ఉ. వచ్చినమాణిభద్రుబడి వచ్చినసైనికకోటి గోటలోఁ
జొచ్చినరాక్షసోత్తములు స్రుక్క గదల్ గొని మోఁది తూపులన్
గ్రుచ్చి కటారులన్ నఱికి కుంతములం బడగ్రుమ్మి యార్చినన్
విచ్చిరి నొచ్చి యప్పురము వెల్వడి దిక్కులు నక్కి రక్కసుల్. 30

వ. ఇవ్విధంబున. 31

ఉ. నాలుగువేలయక్షులును నల్గడఁ గొల్వఁగ మాణిభద్రుఁ డ
వ్వేళ దశాస్యసైన్యముల వెన్కొని నొంపఁగఁ దద్వరూథినీ
పాలకుఁ డాప్రహస్తుఁ డురుబాహుబలంబున యక్షవాహినీ
పాలుని బిట్టదిర్చె మును పాఱెడుసేనల కుబ్బొనర్చుచున్. 32

క. దశకర్త లిరువు రిటువలెఁ, దలపడి పోరాడ రెండుదళములఁ గలయో
ధులు నుద్భటు లగుభటులును, గలయంబడి పోరి రుత్సుకత వెలయంగన్. 33

శా. కైలాసాద్రిగుహాల్ ప్రతిధ్వను లొసంగన్ దివ్యనందాలకా
కూలక్ష్మారుహపాళి మూలములతోఁ గూలన్ భుజాస్ఫాలనో
ద్వేలధ్వానము లంఘ్రిఘట్టనము లెంతే మీఱఁగాఁ బోరి ర
ప్పౌలస్త్యద్వయసైనికప్రవరు లభ్యామర్దబద్ధస్పృహన్. 34

వ. తత్సమయంబున. 35

చ. కరము చలంబు మీఱ దశకంఠునిమంత్రి ప్రహస్తుఁ డుగ్రుఁడై
కరముసలంబునం గడపె గ్రక్కున వేవురుయక్షులన్ మహో
దరుఁడు మహోదరుం డయి గదాహతి వేవుర నొంచెఁ దాటకా
వరతనయుండు ద్రుంచె గరవాలమునన్ ద్విసహస్రయక్షులన్. 36

వ. ఇవ్విధంబున నిజపార్శ్వచరు లయిన చతుస్సహస్రయక్షప్రవరులం బరిమార్చి

పేర్చిన ప్రహస్తాదులఁ గనుంగొని నిర్నిద్రరౌద్రంబున మాణిభద్రుండు వానిపై నురవడించిన. 37

శా. ధూమ్రాక్షుం డెడ చొచ్చి శాతశరవిద్ధుం జేసి పెల్లార్చినన్
దామ్రాక్షుం డయి యక్షుఁ డారిపు గదన్ దాటించినన్ వాతధూ
తామ్రంబున్ బలె వాఁడు మూర్ఛిల స్వకీయాంఘ్రిస్ఫురద్ఘట్టనన్
నమ్రత్వం బహిరాజు సెఁద ఘటకర్ణజ్యేష్ఠుఁ డత్యుగ్రుఁడై. 38

క. ఆమాణిభద్రుఁ గదిసి శి, తామితశరవృష్టి గురియ నతఁ డతికుపితుం
డై మూఁడుతూపు లసుర, గ్రామణి పేరురము నాటఁగా నేయుటయున్. 39

ఉ. అందున నొచ్చి పంక్తిముఖుఁ డల్గి గదాహతి మాణిభద్రువా
ళిం దిలకించి కొట్టినఁ జలించి యతం డలవాలి యోరపా
టొందెఁ దదాదిగా రఘుకులోత్తమ యాయన పార్శ్వవాలి నాఁ
జెందె నభిఖ్య యంత వెఱచేఁ బఱచెన్ బరసేన లార్వఁగన్. 40

వ. ఇత్తెఱంగున దళవాయి తొలంగి పోయినన్ గనుంగొని. 41

ధనదుఁడు యుద్ధరంగమునకు వచ్చి దశగ్రీవునకు బుద్ధులు సెప్పుట

సీ. పిడుగుఁజప్పుడులతో బెడిదంపుటడిదముల్ జళిపించుచును భటావళులు గొలువ
జయజయ నవనిధీశ్వర మహేశ్వరమిత్త్ర యనుచుఁ జారణకోటు లభినుతింప
జవనకంఖాణరాజము లెక్కి కిన్నరగ్రామణు లుభయభాగములఁ గొలువ
నుద్భటాహంపూర్వికోక్తులు వెలయఁ గింపురుష యోధులు గ్రిక్కిఱిసి కొలువఁ

తే. బద్మశంఖాద్యనిధులు రూపంబు లూని, కొలువ బంగారుఁ దేరెక్కి గురుగదాది
సాధనములొప్పఁ గిన్నరేశ్వరుఁడు వచ్చి, చుఱుకుఁజూపుల దశకంఠుఁ జూచి పలికె.

ఉ. తమ్ముఁడవంచు నీ కొకహితం బెఱిఁగింపఁగ దూతఁ బంచినన్
వమ్మొనరించి నాపలుకు వానిని జంపి ననున్ జయింప రే
ద్రిమ్మరిగుంపుతోడ నరు దెంచితి నిన్నన నేల నీకు డెం
దమ్మున మేలు గాఁ దలఁచు నన్నె యనన్ దగుఁగాక దుర్మతీ. 43

ఉ. రోగికి భక్ష్యభోజ్యముల రోగము హెచ్చుగతిన్ బటుక్రుధా
యోగికి నీకు మాదృశహితోక్తులఁ గ్రోధము మించు మాటికిన్
నీగుణచర్య లేటి కివి నింద యొనర్పఁగ నీకె తెల్లవా
రాఁగలమృత్యువుం బొరసి రౌరవబాధలఁ బొందుచున్నెడన్. 44

ఉ. ఆపద లావహించుదురహంకృతి నీగతి మూర్ఖుఁడు గ్రవుం
బాపము లాచరించి విషపాన మొనర్చి శరీర మంతయున్
వ్యాపక మైనఁ జింతిలుజడాత్మువలెన్ యమపాశబద్ధుఁడై
పాపఫలంబుఁ జెందు నెడఁ బాపముఁ జేసితి నంచు వందురున్. 45

ఉ. అన్నకుఁ దండ్రికిన్ గురున కాపద యెవ్వఁ డొనర్చు వానిఁగ
న్గొన్న మహోగ్రపాతక మగున్ దను వస్థిర మృత్యు వెప్పుడున్
సన్నిహితస్థితిన్ మెలఁగు సంపద పుణ్యవశం బటంచు లో
నిన్నియు నెంచి ధర్మము వహించుజనుండు కృతార్థుఁ డెయ్యెడన్. 46

చ. కలఁగక బుద్ధిపూర్వకముగా జనుఁ డేక్రియఁ జేయుఁ దత్క్రియా
ఫల మనుభూతిగా నిది శుభం బశుభం బిది యంచు రెంటినిన్
దెలిసి సుకర్మమున్ సలుప దేవత లందఱు మెత్తు రందునన్
గలిమియు బల్మి యిచ్చటనె కల్గు సుఖంబె లభించు నచ్చటన్. 47

చ. ధనమణివస్తువాహవనితాజనతాదులు బల్మి సంతరిం
చిన యవి యంచు ధర్మములు సేయక యుండిన నేమి యంచు న
య్యనిమిషు లందఱున్ బగతు రంచు మహాపద లొంద నున్నని
న్ననుజుఁడ నన్నఁ గల్గు నిరయంబు రయంబున రమ్ము పోరికిన్. 48

దశకంఠుఁడు ధనదుని మాయాయుద్ధమున గెల్చి యతనిపుష్పకంబుఁ గొనుట

క. అని తమదార దూఱెడు ధనదుని మారీచప్రహస్తధూమ్రాక్షశుకా
ద్యనిమిషరిపుమంత్రులు మార్కొని నిలువఁగ లేక చనిరి శోఁచతనమునన్. 49

చ. అని యిటులాత్మమంత్రులు ధనాధిపుకోల్తల కోర్వలేమి న
ద్దనుజవరేణ్యుఁ డుగ్రనిశితప్రదరంబుల వాని ముంచినన్
గనలుచు డాసి కిన్నరశిఖామణి వానికిరీటపంక్తి ఖం
గున రొద సేయ భూరిగదఁ గైకొని బెట్టుగ మోఁది యార్చినన్. 50

మ. కడుఁ గోపించి దశాననుం డతనివక్షఃపీఠమున్ జొచ్చి పో
యెడు నట్లుగ్రశరంబు వేయుటయు యక్షేశుండు ధీరత్వ మే
ర్పడఁ గోదండగుణారవం బఖిలదిగ్భాగంబులన్ నిండ న
ప్పుడు వహ్న్యస్త్రము వైవ వాఁ డడఁచె నంభోబాణవేగంబునన్. 51

మ. శరసంధానదృఢాపకర్షణకృతుల్ జ్యాఘోషణంబుల్ పర
స్పరధిక్కారము లొక్కచందమున మించన్ విశ్రవసపుత్రు లి
ర్వురుఁ గ్రొన్నెత్తుటఁ దోఁగుచున్ గెరలుచున్ రోషించుచున్ డాయుచున్
హరియుగ్మం బన నిద్ద ఱిద్దఱయి శౌర్యస్ఫూర్తిఁ బోరాడఁగన్. 52

క. రణమున వివిధాయుధధా, రణమున సరి పోరుయక్షరాక్షసవరులన్
బ్రణుతించిరమరులసురా, గ్రణియున్ మాయఁగొని న్యాయ్యరణవిముఖుండై. 53

సీ. ఒకసారి మేఘమై యుడువీథిఁ గనుపించుఁ గనుపించి పిడుగు లుగ్రముగఁ గురియు
నొకతేప సింహమై యుద్వృత్తిఁ బఱతెంచుఁ బఱతెంచి కహకహార్భటి వహించు
నొకతూరి కొండయై యురలీల నెదిరించు నెదిరించి యెగసి బిట్టదరఁ జేయు
నొకమాటు వార్ధియై యూర్ములతో మించు మించి రోదసియెల్ల ముంచివైచు

తే. నొక్కపరివ్యాఘ్రమైవచ్చు నొక్కసారి, దంష్ట్రియై మొఱఁచు నొకమరి దారుణాహి
కరణి గనిపించు నొకమాఱు గానిపింప, కడఁగు మాయానిరూఢినయ్యసురవ

చ. ఇటువలెఁ బెక్కుమాయల ధనేశ్వరుని౯ భ్రమియించి విక్రమో [రుఁడు.
ద్భటగతి మించి నిష్ఠురగద౯ దల మోఁదినఁ గ్రొత్తనెత్తురుల్
జొటజొటఁ గాఱఁ బూచినయశోకము గాలికిఁ గూలుచాడ్పున౯
దటుకున వ్రాలెఁ దేరిపయి దానవసైన్యము లుల్లసిల్లఁగన్. 55

మ. ధనదుం డీగతి మూర్ఛఁ జెంది పడ నంత౯ సూతుఁ డత్తేరు గ్ర
క్కున నందాతటినీసమీపమునకు౯ గొంపోయె యక్షుల్ భయం
బున వృక్షంబులు వ్రాఁకియు౯ గిరిబిలంబుల్ సొచ్చియు౯ విచ్చి కా
ననముల్ దూఱియుఁ గోనల౯ బడియు దైన్యం బొంది రెంతేనియున్. 56

తే. మూర్ఛమునిఁగినధనదుసమ్ముఖముఁ జేరి, శంఖపద్మాదినిధులు విశ్రాంతి మాన్చె
నంత దశకంధరుఁడు నిట్టులన్నఁ గెలిచి, సొలయ కాతనినగరంబుసొచ్చియచట.

సీ. శాతకుంభస్తంభసాహస్రములు గల్గి వైడూర్యతోరణావళులు గల్గి
నవ్యమౌక్తికవితానవితానములు గల్గి శశికాంత వేదికాచయము గల్గి
సొగసైనమగజాలసోపానములు గల్గి కప్పుటాలోవలయొప్పు గల్గి
కామితార్థము లిచ్చుఘనవృక్షములు గల్గి వికచకల్హారదీర్ఘికలు గల్గి

తే. మానసజవంబు గల్గి కామగతి గల్గి
కామరూపంబులు వహించుగరిమ గల్గి
ప్రబలు పరమేష్ఠిరజతపుష్పకముఁ గాంచి
యందుపై నెక్కి యతఁడు తారాద్రి కరిగె. 58

మ. తరళోత్తుంగతరంగఘుంఘుమరవోద్యద్దివ్యనందారవిం
దరజోబృందమరందతుందిలమిళిందధ్వానసంబంధగం
ధరమాబంధురమంథరానిలునిచేత౯ శ్రాంతి వాయ౯ ధనే
శ్వరుఁడు౯ దెప్పిఱి భీతి సేనఁగొని లజ్జ౯ జేరె వీడయ్యెడన్. 59

దశవదనుఁడు సపరివారంబుగాఁ గైలాసంబున కేఁగుట

ఉ. ఆజతనూజ వింటివె దశాననుఁ డిట్టులఁ బుష్పకంబుతో
నాజి జయంబున౯ బొదసి యావలఁ బోవుచుఁ జూచె ముందట౯
రాజతశైలము౯ దపనరథ్యనిరోధకృదత్యుదగ్రతా
రాజితసాలము౯ దటచరత్కరిసింహతరక్షుకోలమున్. 60

తే. చూచియచ్చోటివింతలుచూడవలసి, బలసియుఁడువంకలనుదైత్యభటులుగొలువఁ
జెలువ మొలికెడునమ్మహాశిఖర మెక్కి, యక్కడఁజరింప మారీచుఁ డతనికనియె.

మ. కలధౌతాచలదీధితిప్రచయమో గంగాప్రవాహాంతరో
జ్జ్వలడిండీరనికాయమో .శబరయోషాధన్వముక్తాస్త్రని
ర్దళితప్రాంచితచామరవ్రజమొ నా రంజిల్లు రెండాఱుచే

తులఁ జేఁ డుండిన తెల్లుటిల్లుఁ గనుమా దోషాచరగ్రామణీ. 62

సీ. శైలజాసహచరోజ్జ్వలరుద్రకన్యకాచరణలాక్షాపంక మొరసినదియొ
యిది నగం బనుపేర నింపొందుఁ గావున విపులంబుగాఁ బల్లవించినదియొ
తనగిరీశత్వ మందఱకుఁ దోఁప నభంబు మించు పెంజడలు వహించినదియొ
సానుభాగచరద్భుజంగభోగమణీసమంచితప్రభ నాక్రమించినదియొ
తే. లేక ధననాథు గెలిచి త్రిలోకవిజయ, వాంఛ నరుదెంచు దేవరవారిదోఃప్ర
తాప మిట నుండినదియొనాఁ దరుణతరణి, కిరణగతి గైరికముల నిగ్గి వెలిఁగె.

చ. తిరముగ జైత్రయాత్ర చనుదెంచిన నిన్ గని యీకుభృత్తు ని
ర్ఝరములఁ బాద్య మిచ్చి రవిసంజ్వలితార్కమణీవిభాపరం
పరల నివాళి సేసి వనభవ్యశుకాదివిహంగమోక్తివై
ఖరి నుతి సల్పెడిన్ రజతకాంతుల నెల్లదనంబుఁ జూపుచున్. 64

సీ. చిగురుజొంపముల రంజిల్లె నీయెలదోఁట చెలువ పర్ణకు వేడ్కసేయు నేమొ
విరిగల్వవిరులచే వెలసె నిక్కొలను నిందుఁ జంద్రజూటుఁడు గేళి సల్పు నేమొ
సంతానకుసుమవాసన లూనె నిక్కోన దేవకన్యకలు వర్తింతు రేమొ
పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదలె నిప్పొదలలో విద్యాళు లెపుడు వసించు నేమొ
తే. తనరె బహుబిల్వరుద్రాక్షతరువు లిచటఁ
బ్రమథవర్యుల కివి రచ్చపట్టు లేమొ
యనుచు మారీచుఁ డెఱిఁగింప నచట నచట
నయ్యసురభర్త విహరించునవసరమున. 65

సీ. చిమ్మచీఁకటి గ్రమ్ము క్రొమ్మావిగుమి నల్లిబిల్లి రుద్రాక్షపందిళ్లనడుమ
వడిఁ బాఱువిరితేనెవాఁకలదరుల వెంబడి ఘుమ్ము మనుమృగమదముతావిఁ
బొలుపొందువిరవారిపొదలలోఁ గుప్పలు వడుసురపొన్నపుప్పొడిదుమార
మొలసిన క్రేఁదెమ్మెరలయెమ్మె గనుకమ్మ బంగరుఁబూఁదోఁటపజ్జ నమరు
తే. మరకతనిబద్ధభూముల మలయురేవె, లుంగుజాతిన్నియలఁ జెన్నెసంగుపొగడ
మ్రానినీడలఁ దగునొక్కకోనలోనఁ, బుష్పకవిమాన మటు సాగి పోక నిలిచె.

చ. నిలిచినఁ బంక్తికంధరుఁడు నివ్వెఱఁ గంది యిదేల యిచ్చటన్
నిలిచెను శక్తుఁడే యొకఁడు నిల్పఁగ దీనికి దుర్గమస్థలం
బులు గలవోటు చూడుఁ డటఁ బొండని మంత్రులఁ బంప వార ల
క్కలఁకుల సంచరించి పరికించియు హేతువు గాన కయ్యెడన్. 67

మ. అలమారీచుఁడు దేవ వింటె యిది యత్యాధ్యక్షునిన్ గాని య
న్యులఁ బైనూని చరింపదో యతఁడు క్రోధోద్రేకి యై నిల్పెనో
తెలియం డంచనునంతలో వికటుఁడై దీప్తాస్యుఁడై కుబ్జుఁడై
బలధుర్యుం డగునంది యందుఁ గని యప్పౌలస్త్యుతో నిట్లనున్. 68

చ. నిలిచె విమాన మంచు రజనీచర నివ్వెఱఁ గంద నేల యీ

నెలవున దేవితో హరుఁడు నేఁడు విహారము సేయుచున్నవాఁ
డలగరుడోరగామరవియచ్చరు లోడుదు రీడఁ జూడ నిం
దుల కరుదెంచి నీబలముతోఁ జెడి పోక తొలంగు నావుడున్. 69

చ. పటపట పండ్లు గీటుకొని పఙ్క్తిముఖాసురభర్త పుష్పకం
బటు డిగి శంభుఁ డెవ్వఁ డహహా నను నిల్పెడునంత వచ్చె నే
యిట నిను నీశివున్ నిలువ నిచ్చిన నట్టుల కాదె యంచుఁ ద
త్తటముననుండి యగ్గిరివతంసముక్రిందికి వచ్చి చెచ్చెరన్. 70

క. ఉరుశూలముఁ గొని రెండవ, హరునివలెను దీప్తవిగ్రహము మీఱఁగ వా
నరముఖు మొందిననందిని, బరికించి దశాననుండు పకపక నగియెన్. 71

తే. ఇవ్విధంబునఁ దనుఁజూచి నవ్వుచున్న, యతివిమూఢుని దశకంఠు నట్టె చూచి
యపరశివుఁ డైననందీశుఁ డాగ్రహమువ,హించి కటకటమదరఁగా నిట్టులనియె.

## నందికేశ్వరుఁడు దశగ్రీవుని శపించుట

చ. కపివదనుండ నైన ననుఁ గన్గొని నీవవమానదృష్టితో
నిపుడు హసించినాఁడ విట నీదృశవక్త్రముఖుల్ నఖాయుధుల్
కపు లిఁక నీకులఁ బడపఁ గల్గెద రంతటఁ గండగర్వమున్
దపమునఁ బుట్టుబెట్టిదముఁ దామె యడంగెడు రాక్షసాధమా. 73

శా. శాపోక్తుల్ పచరింప కున్న నెదిరించన్ రాదె యంటేని నిం
దాపారంపరి మున్నుగా మృతుఁడవే నా కిట్టిపీనుంగుపై
నేపున్ జూపఁగ నర్హ మౌనె యిదిగా నీచేయుపాపంబుచే
నాపద్వార్ధి మునింగి పోవఁ గల వేలా యింక నిన్ నొంచఁగన్. 74

క. అని యానంది శపించిన, విని యానందించి సురలు విరులు గురిసి ర
వ్వినువీథి దేవదుందుభు,లును మొరసెన్ బెరసె సుఖము లోకము లెల్లన్. 75

ఉ. అంత దశాననుండును మదాంధుఁడు గావున శప్తుఁ డయ్యు నొ
క్కింతయుఁ జింత లేక మఱి హెచ్చినభీషణరోషవహ్ని నే
త్రాంతరశోణకాంతులు బయల్పడుచున్ గలధౌతశైలరా
డంతికవర్తి యై పలికె నగ్రమునన్ నిలుచున్ననందితోన్. 76

ఉ. పెక్కులు ప్రేల నిచ్చినను ప్రేలవె నీపశుబుద్ధి మాటలన్
దక్కనె చక్కఁగా నెదిరిఁ దన్ను నెఱుంగ వటుండు పుష్పకం
బిక్కడ నాఁగి మాయధిపుఁ డింక సుఖంబున నుండుఁ గాని లే
యెక్కిన వెండికొండ నిదె యేఁ బెకలించి రజంబు సేసెదన్. 77

## దశగ్రీవుఁడు కైలాసము నెత్తఁగా శివుఁడు పాదాంగుష్ఠముచే నదుముట

వ. అని దురాగ్రహంబునన్ బలికి యద్దశగ్రీవుండు రవిగ్రహంబు నోరయు నుదగ్ర
విగ్రహంబుతో నమ్మహాగ్రావంబు శిఖరాగ్రం బనర్గళలీలన్ బట్టి యిట్టట్టుఁ గద

లించి బెట్టు గదలిన యగ్గట్టుచుట్టుఁ గనుపట్టు నెఱియ విరియన్ బదఘట్టనంబు గావించి గీర్వాణగణప్రాణనిర్వాణప్రవీణతాధూర్వహ దుర్వార గర్వాకర దర్వీకరభీకరంబు లైన వింశతికరంబులు సారించి హుంకరించి యహంకరించి పదిమొగంబులు జేగుఱింప వేగుఱించుసాహసోత్సాహసంపదలతో నిజభుజాంగదంబు లొండొంటితో నొరయ నిజాట్టహాసంబున గుహాకుహరంబులు మార్మోరయ నిజవిలోకనంబుల మిడుంగుఱులు గురియ నిజదంతసంఘర్షణంబున దిగ్గజంబులు సెవుడు వోరయ నిజప్రతాపంబు మెఱయ నిన్నిమిత్త మీమహీభృత్తు హత్తి మత్తవృత్తిన్ జూప నేల యని తద్బలంబులు తనపై నురవడించెనో యన శరభసింహశార్దూలమదేభ ప్రముఖవనజంతువులు క్రేళ్లుఱక మహోరగంబులు సరగ నరుగఁ గూడక చూడ గొప్పలగు పిప్పలాదితరువులన్ జుట్టుకొని బుసకొట్టుచు నవియునన్ జాఁపకట్టు వడ నొడళ్లు నలఁగి పడగలవిసి సమసినఁ దదగ్రజాగ్రన్మణులు ఫణిభూషణున కద్దురవస్థ నుడువన్ బరువులిడుచున్న వడువున దవ్వుల మిడిసిపడ గడగడ వడంకుచు నుసుగనిజడువునన్ దముఁ గౌఁగిలించు చెంచుమించుఁ బోఁడులకౌగిళ్ల ననంగి పెనంగి వాఱియనుఁగు మగ లడుగు నోపఁ గూడక డబ్బునం గూలి నెత్తంబుపట్టులఁ బొర్లి గింతలు వెట్ట నట్టివింతలుగని మొట్టివింతలుపుట్టెనని రచ్చపట్టుచెట్టుల క్రీఁసీడలన్ గ్రీడలు సాలించి యన్నెలవున నిలువ లేక వేల్పుఁగలువకంటులు క్రొమ్ముడులు వీడఁ గీలుగంటు లంసంబులపై జీరులాడఁ దళుకుజెక్కులు సెమరింపఁ గులుకు గుబ్బలు పులకింప నెన్నొసళ్ల ముంగురులు నెఱయఁ జిగురుఁగెమ్మోవుల నిట్టూర్పులు దొరయ నిజాధిపభుజాస్తంభంబు లూఁతఁ గొని తద్భయంబునన్ జెంగటి విమానంబు లెక్కికొని తమ్ముఁ గ్రమ్మఱన్ బుట్టినవారిఁగాఁ దలంప నిలింప హృదయంబు గలంపన్ జాలునారభటులతో వీరభటు లిరువంకల నిలిచి పెక్కుచందంబుల నభినందింప నందికేశ్వర గణేశ్వర చండికేశ్వరప్రముఖమహాప్రమథ గణేశ్వరులు శరశరాసనపట్టిసప్రాసకరవాలభిందిపాలతోమరముద్గరగదాకుంత క్షురికాదిసాధనంబులు గైకొని సర్వజ్ఞునియనుజ్ఞ వడయుటకై యతనియగ్రభాగంబున సలబలంబులు సేయుచు నిలువుఁ గొలువు సేయఁ బార్వతీపరమేశ్వర క్రీడోచిత మణిఖచిత సౌధప్రాకార గృహకుడ్య గోపురతోరణస్తంభాదులు బ్రద్దలు వాఱి తద్దయుఁ బ్రకంపనంబు వహింప సహింప రానిదరంబునన్ గరంబులు పిసికికొనుచుఁ బదకంజమంజీరసంజాతశింజారవంబులు సెలంగ నలుగడలన్ దిరుగుచు రుద్రకన్యక లనన్యశరణ్య లయి దైన్యంబు నొంద నరవింద బాంధవాదిగ్రహంబులు త్రోవలు దొలంగ నింద్రాదిలోకపాలకలోకంబులు హాహాకారంబులతో బట్టబయల నిలిచి చూచుటకు బెట్టులికి యిట్టలం బగు మొగుళ్ల తెట్టువలలో మఱుఁగుపడి యాకట్టిడిపొట్టక్రొవ్వున నిట్టిబెట్టిదంబు గావింప

గట్టువిల్లు వట్టినదిట్ట యెట్టు మట్టుపెట్ట కున్నవాఁడో యని యొక ళ్లొకళ్లతోఁ బలుకుచుఁ గనుంగొనఁ బ్రత్యంతపర్వతంబు లున్మూలంబులై పొడవడంగఁ బెద్దపెద్దగండోపలంబులు పైపైనుండి పెళపెళమనుచప్పుళ్లతో డుల్లిచఱుల నురలి పడఁ బడలు వడక బాహాళంబు-గోఁతుగనుపాఁ తగలించి పుండరీకంబుఁ బెకలించు మదవేదండప్రకాండంబుకంబున ఝరీమండలహారిపరంపరలు నలు వంకలఁ దొరంగ ఖనిస్థలీవినిర్గతనీలమణీరమణీయసుధుకరంబులు నలుగడలఁ జెదరఁ గనకవకుళకేతకీకురంటకాశోకమధూక కేసరప్రముఖభాసురకుసుమవిస్తృమరపరాగవిసరంబు నలుదెసల నొరసికొన నవ్వెండికొండ పెకలించి కందుకక్రీడ గావింపఁగఁ గడంగె నయ్యవసరంబున. 78

మ. అసురాధీశకరావధూతకలధౌతాద్రిన్ బదం బూన లే
క సఖుల్ గొల్వ వనంబులో మెలఁగునగ్గౌరీసరోజాక్షి మే
ను సెమర్పన్ దనుమధ్యముల్ వడఁక నాందోళింప నేత్రప్రభల్
వెస నేతెంచి కవుంగిలించుకొనియెన్ విభ్రాంతయై శంభునిన్. 79

వ. ఇవ్విధంబున. 80

ఉ. బంగరుఁదళ్కుఁజెక్కులను బంజులకమ్మలడాలు చిందుద్రొ
క్కంగ మెఱుంగు జన్నుఁగవకంచుకపున్ముడి పీడఁగా హఠా
లింగసుఖం బొసంగినచెలిం గవుఁగింటనె యుంచి యల్లఁ డ
య్యెం గఱకంఠుఁ డద్రి నతఁ డెత్తఁగఁ గాముకు లెగ్గు లెంతురే. 81

శా. శంభుం డద్రికుమారికాస్ఫురదురోజద్వంద్వశుంభత్పరీ
రంభం బెట్టుడుపంగ వచ్చు నయినన్ గ్రౌర్యంబు దీఱన్ భుజా
రంభం బీగతిఁ జెంది యెంతసుఖ మారా నెమ్మదిన్ వీనియా
స్తంభోజ్జృంభ మొకింత మాన్పి పిదపన్ సౌహార్దముల్ జూపెదన్. 82

క. అని తలఁచి లేఁతనగవా,ననమునఁ దగ శంభుఁ డాసనము డిగ్గక మున్
దనవామపదాంగుష్ఠం, బున నదిమె దశాస్యహస్తములు క్రిందుపడన్. 83

తే. ఇటుల యదిమినభుజశౌర్యమెడలిబడలి,యడలియొడలిమదోద్వృత్తిసడలిశూలి
కాలివెనువ్రేలు దెమలించి కరము లెత్తు,కొన సమర్థత లేక రక్షోవిభుండు. 84

మ. కులశైలంబులపెన్బిలంబులు బముల్ ఘోషింప శేషాహి మూ
ర్ఛిల భూచక్రము దిర్దిరన్ దిరుగ జేజేపెద్ద భీతిల్లఁ జు
క్కలు రాలన్ దివి పెల్లగిల్ల సుర లాకంపింప నంభోనిధు
ల్గలఁగన్ దిక్కటు లొడ్డగిల్లఁ బదినోళ్లన్ బెట్టు వాపోవఁగన్. 85

క. తలఁచిరి మనుజు లకాండ, ప్రళయం బిది యనుచు దిగులుపడి రమరేంద్రా
దులు యక్షసిద్ధసాధ్యులు, కలఁగిరి తొలఁగిరి పదంబు గ్రహారాణ్ముఖ్యుల్. 86

శా. ఈరీతిన్ జగముల్ దలంకఁగను వేయేం డ్లార్తుఁడై కూయుఁగా

నారక్షోవిభుదైన్యపాటుఁ గని దైత్యశ్రేణి కన్నీరు ము
న్నీరై పాఱఁగ నేమొనర్తు మనుచున్ నిర్విణ్ణతన్ జెందన
మ్మారీచాదికు లాతనిన్ గని యసామాన్యప్రబోధంబునన్. 87

తే. పలికి రవధారు దైతేయపట్టభద్ర, భద్రగజచర్మధారిపై భక్తి యుంచి
యంచితోక్తుల నతని నుతించితేని, నీవిరోధంబు నెడఁబాపు నీక్షణమున. 88

క. హరుఁ డున్నతకరుణానిధి, శర ణన్నఁ బరిగ్రహించు జగతి నతనికిన్
బరుఁ డున్నదె యజకనకాం,బరు లెన్నఁగ లేరు తత్ప్రభావం బనినన్. 89

దశగ్రీవుండు శివుని నుతించి యతనివలన వరములు లోనైనవి పడయుట

శా. ఆపన్నుం డగు పంక్తికంఠుఁ డిది యౌనంచున్ లలాటేక్షణ
శ్రీపాదాంబుజముల్ మనోంబుజమునన్ జింతింపుచున్ వేదవి
ద్యాపాండిత్యము సర్వశాస్త్రకుశలత్వంబున్ మహాసాహితీ
నైపుణ్యంబును గానుపింపఁ బొగడెన్ గంగోర్మితుంగార్భటిన్. 90

శా. ఆస్తోత్రంబున కామనోద్రథిమ కాధ్యానాప్తి కాయీశ్వరుం
డస్తోకప్రియ మావహించి పెనుప్రేలావేళఁ బైనెత్తినన్
హస్తంబుల్ వెడలంగఁ బాపికొని దైత్యస్వామి ఫాలస్థల
న్యస్తప్రాంజలి యై నుతింపఁ దొడఁగెన్ గంభీరవాగ్గుంభనన్. 91

రగడ. జయజయ శంకర సాధువశంకర, జయజయ రిపుభటచయనాశంకర
శరణు నిరంజన సజ్జనరంజన, శరణు ప్రభంజనజవగజభంజన
పాహి పురాహవబంధురవిక్రమ, పాహి యవిద్యాపంకరవిక్రమ
యచ్చుగ నినుఁ దెలియవు తొలిచదువులు, మెచ్చిననిత్తువు మేలగుపదవులు
నీ కెవ్వరిపై నిలువదు కోపము, లోకుల కెంచఁ దెలుపుదు ప్రతాపము
పరుఁడు స్వజనుఁ డనుభావవిభేదముఁ, బొరయదు నీమది పూర్ణామోదం
బభవుని భవు నిన్నమితదయాపరు, నభినుతింప బ్రహ్మాదులు నోపరు
ఖలుఁడ మదాంధుఁడఁ గలుషోత్కృష్టుఁడ, జలచిత్తుఁడ గడుజడుఁడ నికృష్టుఁడ
నే మిముఁ బొగడఁగ నెంతటివాఁడను, స్వామీ మద మఱి శర ణన్నాఁడను
నీదాసుఁడ నిఁక నేరము లెంచకు, నాదుర్వృత్తి మనంబున నుంచకు
మెఱుఁగక చేసితి నిపు డపచారము, శరణన్నను గడ సనదె విచారము
వలసితి నీసేవకులమహత్త్వము, దెలిసితి నియ్యెడ దేవరసత్త్వము
నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు
యిట్టినీకు సరి యే నని హెచ్చితిఁ, బొట్టకొవ్వు ననఁ బొగడఁగ వచ్చితి
నాగుణ మెంచకు ననుఁ బాలింపుము, నీగుణ మెంచెద నీ వాలింపుము. 92

చ. అని తనుఁ బ్రస్తుతించినదశాననుఁ జూచి పురారి నవ్వుచున్
దనుజవరేణ్య నీస్తుతికిఁ దద్దయు మెచ్చితి ధైర్యశాలి వౌ

దనుమతి యిచ్చితిన్ జను ప్రియం బగుచోటికి నీభుజాబలం
బనితరసాధ్య మంచు విని యారయ నిల్పితి నింతె యియ్యెడన్. 93

తే. మత్పదాంగుష్ఠపరిపీడ్యమానరజత, పర్వతము క్రిందఁ జేతులు పడినయపుడు
జగము లద్రువ విరావంబు సలిపి తందు,వలన రావణుఁడను పేర వెలయు మనిన.

ఉ. ఆదశకంఠుఁ డీశ్వరున కానతుఁడై శివ నన్నుఁ బ్రోవ నా
హ్లాదము గల్గనేని నిసుమంతకొఱంతయు లేనియాయువున్
నీ దగుచంద్రహాసమును నెమ్మి నొసంగు మటన్న శంభుఁ డ
క్కైదువు నిచ్చి పిమ్మట నఖండతరాయువు నిచ్చి యిట్లనున్. 95

మ. దితిజాధీశ్వర నీవు గోరినక్రియన్ దీర్ఘాయువున్ నీకు ని
చ్చితి నీ క్రొవ్వున నీతిఁ జేకొనక దుశ్శీలుండవై మ మ్మనా
దృతినొందించితివేని మావరము వమ్మై చేరుఁ బొమ్మన్నచో
నతఁ డాశూలికి మ్రొక్కి వీడ్కొని విమానారూఢుడై యుబ్బుచున్. 96

క. తనపరివారము గొల్వఁగఁ, జనియెన్ రజతాద్రి డిగ్గి స్వచ్ఛందగతిన్
మనుజేశ్వర యని కుంభజుఁ, డినకులునకుఁ దెల్పి మఱియు నిట్లని పలికెన్. 97

## రావణుని చర్యలు

మ. ఇనవంశోత్తమ వింటె పంక్తివదనుం డీలాగు కైలాసవా
సునిచే మన్ననఁ గాంచి పొంగుచుఁ బ్రహస్తుండాది యాసైనికుల్
దనుఁ గొల్వన్ జని హేమకూటహిమవత్ప్రాంతంబులన్ గంధమా
దననీలాచలపారియాత్రములమీఁదన్ గ్రీడ సల్పెన్ రహిన్. 98

వ. మఱియును. 99

సీ. చరియించు నొకవేళఁ జంబూనదీతీరసౌవర్ణవాలుకాస్థలములందు ।
విహరించు నొకపూఁట వేల్పురాతోఁటల బొదలుగొజ్జెఁగపూవుఁబొదలయందుఁ
గ్రీడించు నొకతఱిఁ గేసరశ్వేతాంజనాద్యద్రిరాడధిత్యకలయందు
నలరు నొక్కెడఁ గేళి నరుణోదమానసప్రముఖదివ్యసరోవరములయందు

తే. నన్నెలవులందు మెలఁగెడునమరఖచర, యక్షకిన్నరసిద్ధవిద్యాధరాప్స
రోభుజంగాదికులు మహాక్షోభ మొంది, తన్నుఁగనుఁగొని పాఱ నద్దశముఖుండు.

సీ. పట్టణం బన రాదు కట్టాయితంబుగా నట్టె ముట్టడి చేసి చుట్టు విడియు
బలవంతుఁ డనరాదు బలియుఁడై యెంతదవ్వుల నున్న వడి నేఁగి గెలిచి వచ్చు
సురజాతి యన రాదు కరమల్లి యెట్టు సన్నఁ జననీక శస్త్రాస్త్రసమితి నొంచు
ధరణీశుఁ డన రాదు తనకు నోడితి నన్నఁ దాఁక నీరసమున వీఁకఁ జూపుఁ

తే. బాయపు నెలంత యనరాదు పాపమునకు, భయపడక యెట్టులైనను బట్టికలయు
నర్హవస్తువు లటఁ గల వనఁగ రాదు, దుడుకుమైఁ జొచ్చికొని తెచ్చు దుష్టుఁ డతఁడు.

### వేదవతిని జూచి రావణుండు మోహించుట

వ. ఇచ్చెలువునకు దనయిచ్చకు వచ్చినమచ్చున నచ్చటచ్చట నచ్చపలుండు నిచ్చలు
మెలంగుచు నొక్కనాఁడు హిమవత్పర్వతంబునకు నుత్తరదిగ్భాగంబున నొక్క
సుందరోద్యానంబు సందర్శించి యచ్చట. 102

సీ. ఘనమండలము సుధాకరమండలము నిండునటుల మోమున జటాచ్ఛటలు నెఱయ
వలఁజక్కవలు చిక్కువల నొప్ప మృదువల్కలంబునఁ గుచలికుచంబు లొరయ
బెళుకుఁజూపుల లేడి గెలిచి కైకొనియెనో నాఁ గ్రిందఁ గృష్ణాజినంబు వెలయ
నఖపాళిబెడఁగుమాన్పకు మంచు నుదుటు గై వ్రాలెనా స్ఫటికాక్షమాలిక దగఁ

తే. గౌసుమరజంబు దొరసినకల్పలతిక, బాగున విభూతిచేత మైతీఁగ వెలుఁగ
నొంటి గిరికన్యవలెఁ దపం బున్నతపసి, కన్ననొక్కతెఁ జూచి రాక్షసవిభుండు.

తే. చూచి యాచెల్వచెల్వంబులోచనముల, కబ్బురంబును గాంక్షయు నుబ్బునర్పఁ
బుష్పకము డిగ్గి సరభసంబుగఁ దదగ్ర, భాగమున నిల్చి పలికెనప్పంక్తిముఖుడు.

సీ. నీకులం బెయ్యది నీనామ మేమందు రెవ్వరి దానవే యిందువదన
కలికి లేఁబ్రాయంబుఁ గానపాల్ గావించి యేల కృశించెదే యిగురుఁబోఁడి
నీప్రాణనాథుఁ డై నిను నేలుభాగ్య మెవ్వానికిఁ గల్గెనే వన్నెలాఁడి
యేతపం బొనరించి యీచెల్వుఁ గంటివో యింకఁ దపం బేల యేణనయన

తే. కాఁకఁ జెందినపసిఁడిసలాకవంటి, తనువు వెండియుఁ గళఁ గాంచు నని తలంచి
చూపఱులయిచ్చ వేమఱుఁదాప ముంచె, దేమి నీచర్య లెఱిఁగింపవే లతాంగి.

ఉ. నీబిగిగుబ్బచన్నులకు నీనెఱిపెన్నెఱు లున్నతీవికిన్
నీబటువుంబిఱుందులకు నీయెలప్రాయపుఁగల్మి కింతిరో
యీబసుమంబు కప్పురమె యీతి వేణియె పట్టుజీర లే
యీబిఱుసైనవల్కలము లీతప మిష్టమనోజభోగమే. 106

సీ. అణుమధ్య నీమధ్య మణిమంబు వహియించు మహికటి నీకటి మహిమ గాంచు
గిరికుచ నీకుచగిరు లొందు గరిమంబు సలినాక్షి నీఱెప్పలరు లఘిమ
ఘనవేణి నీవేణి మను ఘనశ్రీప్రాప్తి నతివ నీమొయి ప్రాకామ్యతకు నెక్క
నంగన నీభర్త యఖిలేశతకుఁ దగుఁ జెలి నీకు వశి యగుఁ జెఱకువిల్తు

తే. డిన్నివైభవములు గల్గి యిగురుఁబోఁడి, బేలతనమున నీతపం బేలచేయఁ
గోదవయొదవిన దిది యంచు మృదులఫణితిఁ, జెవులకీయెడఁ బండువు సేయుమనిన.

క. ఆనెలతయు నప్పలుకులు, వీనుల కెడఁ జేసి వాని విశ్రవసుతుఁ గాఁ
దా నెఱిఁగి హీనుఁడనక య, హీనత నాతిథ్య మొసఁగి యిట్లని పలికెన్. 108

మ. దనుజాధీశ కుశధ్వజుం డనుతపోధన్యుండు మున్నొప్పు నా
యన వేదంబు పఠించువేళ నుదయం బై నేను వాపోవఁగా
ననుఁ బ్రేమంబునఁ జూచి వేదవతి యన్నామంబుఁ గావించి పెం

చిన లేజవ్వన ముప్పతిల్లుటయు జేజేలుక్ మునుల్ రాజులున్. 109

క. నను వలచినధిషణసుతుం, గని వేఁడిన హారికి నిత్తుఁ గాని యొరున కి
వ్వనితామణి నీ వని యె, వ్వని కైన నొసంగఁ డడుగవచ్చినవేళన్. 110

వ. ఇవ్విధంబున. 111

శా. ప్రత్యాఖ్యానముఁ జెంది యందఱుఁ జనన్ బాపాత్ముఁ డౌదంభుఁ డన్
దైత్యుం డొక్కఁడు వచ్చి మజ్జనకునిన్ దా వేఁడి యీ నన్న చో
నత్యంతక్రుద్ధుఁ బూని ఖడ్గమున నిద్రాసక్తు ఖండించి యా
హాత్యన్ వాఁడు నశించె న త్తపసియిల్లా లగ్నిఁ జొచ్చెన్ వెతన్. 112

తే. తల్లియును దండ్రియును జన్నఁ దనయభాగ్య
మునకుఁ గలఁగియుఁ గలఁగక పూర్ణనిష్ఠ
జనకుని ప్రతిజ్ఞఁ గడతేర్తునని తలంచి
వెన్నునిగుఱించి యిటఁ దప మున్నదాన. 113

క. కంటివ యిచ్చటివింతలు, వింటివ నాపూర్వకథ సవిస్తరముగఁ జే
కొంటివ యాతిథ్యము దడ, వుంటివ యిటఁ జనుము రాక్షసోత్తమ యనినన్.

చ. తన కిది దక్కె నంచు బ్రమదంబునఁ బంక్తిముఖుండు మీనకే
తునిచిగురాకుబాఁకు మదిఁ దూఱినఁ దాలిమి మారి చేరఁగాఁ
జని యిది యేమి వెఱ్ఱి యెలజవ్వనముల్ బాలివోవ విష్ణుఁ డం
చున కలకాలముల్ దపసిచొప్పున దాఁటెదు వృద్ధకాంతవై. 115

ఉ. వెన్నున కిత్తునంచు బలువేఁదుఱు సేకొని తండ్రి యీల్గుటన్
గన్నులఁ జూచియున్ హరియె కావలె నంచుఁ దపించె దూరకే
కన్నెఱికంబు కాఱడవిఁ గాచినవెన్నెల సేసి యయ్యయో
నిన్నును ముంచె నీజనకునిన్ గుదియించినవెఱ్ఱి యిమ్మెడన్. 116

మ. హరి తానే బలవంతుఁ డైన మును మీ యయ్యన్ విరోధించి యొ
క్కరుఁ డుగ్రాసి వధింప నడ్డపడి దోర్గర్వంబు గాన్పించెనే
హరియన్నామము గప్పకన్ బెరయు నేలా యీవృథాభ్రాంతి యిం
తిరో యింకన్ ననుఁ బొందు మేలగు వయస్తేజఃప్రభావాఢ్యుడన్. 117

చ. అన విని కర్ణముల్ చిగురుటాకులఁ గేరెడుకేలుదోయిన
వ్వనజదళాక్షి మూసికొని వాని ననాదరదృష్టి జూచి యీ
చెనఁటివివాదముల్ విడువు శ్రీహరి నేఖలుఁ డైన నింద స
ల్పునె తగు బ్రహ్మవంశమునఁ బుట్టియు మూర్ఖత మాన వక్కటా. 118

సీ. అన్వయంబుల కెల్ల నాదికారణభూతుఁ డగుతాతఁ గనినాతఁ డతఁడె కాఁడె
జపతపోమఖముఖాచారసారఫలం బు లరసి యిచ్చుప్రదాత యతఁడె కాఁడె
నీయందు నాయందు నిఖిలాత్మలం దంతరాత్మయై కనునాత్మ యతఁడె కాఁడె
సముఁడయ్యు దుష్టశిక్షయు శిష్టరక్షయుఁ బ్రతియుగంబునఁ జేయునతఁడె కాఁడె

తే. యాగమాంతరహస్యార్థ మతఁడె కాఁడె
యన్నిజగముల కధినాథుఁ డతఁడె కాఁడె
యట్టిహరి నెంచ నేరక హంకరించి
నిర్నిమిత్తంబ నిందింప నీకుఁ దగునె. 119

మ. పలుకుల్ వేయును నేల లెస్స వినుమా పౌలస్త్య నామేను నా
యెలప్రాయంబును నామనోగతులు నాయిచ్ఛాభిమానంబు లా
జలరుడ్ధారికె ధారవోసినవి దుష్కాంక్షల్ విసర్జించి పె
ద్దలు వర్తించు పథంబునన్ మెలఁగు మద్దైవంబుతో డయ్యెదున్. 120

తే. అనిపలికి యందు నిలక భయంబు దొలఁకఁ, గలఁకఁ బిల్లికిఁ దొలఁగురాచిలుకపగిది
నావలికిఁ బోవఁ దేఁటులయావళికిని, నతనునిశరావళికిఁ దాళ కసుర గదిసి. 121

చ. చెలి నునుమోవిపానకముచే వడ దేఱక మోము మోమునన్
బలుమఱుఁ జేర్చి ము ద్దిడక బాహులతాపరిబద్ధుఁ జేసి న
న్నలమియుఁ గాఁగిలింపక రహస్యముగా బహుబంధవైఖరుల్
దెలుపక పోవ నేల యని తెంపున వేణికఁ బట్టియీడ్చినన్. 122

చ. కలఁక దొలంగ వేదవతి గ్రక్కున బెత్తిలి మొత్తి వ్రేయుచున్
మలచపువేణి నట్టనడుమన్ దెగి చేతికిఁ దున్క చిక్క నం
దుల కళు కొంది కైకసిసుతుం డిది దీనితపఃప్రభావ మం
చలవడి యున్న నచ్చెలియు నవ్వలికిన్ జని క్రోధమూర్తియై. 123

మ. ప్రళయాగ్నిజ్వాలితేక్షణప్రభల నప్పౌలస్త్యునిన్ గాల్చున
ట్టుల వీక్షించి దురాత్మ నిన్నపుడె దుష్టుం డంచుఁ జింతించియున్
దెలివిన్ విశ్రవసుం దలంచుకొని యాతిథ్యంబు గావించి మా
ర్పలుకుల్ పల్కిన నింతయున్ గలిగె నోర్వన్ గూడునే యింకిటన్. 124

శా. ఘోరస్ఫారమదీయకోపదహన క్రూరార్చులన్ నీఱుగా
నీరూపంబు దహింప కోర్చితిఁ దపోనిష్ఠార్థలోభంబు చే
నోరీ నీ విపు డంటుకొన్న మెయి నే నోల్లన్ జ్వాలద్వహ్నిలో
నీ త్రైనిన్ దునిమించుపూనికను జన్మింతున్ ధరన్ గ్రమ్మఱన్. 125

తే. అని మహోగ్రతఁ బలికి క్రోధాగ్నితోడ
నచట యోగాగ్నియును మండునటుల చేసి
యయ్యెదుట నిల్చి శ్రీహరి నాత్మ నునిచి
యేపు సెడి దైత్యుఁడును విన నిట్టు లనియె. 126

ఉ. ఏను నిజంబుగా హరిపయిన్ మది గల్గినదాన నేని నా
పై నలినాక్షుఁ డాత్మ యిడి పత్నిఁగఁ జేకొనుమాట తథ్య మా
నేని నయోనిజత్వమున నిద్ధర బుట్టి దశాస్యుఁ బుత్త్రమి
త్త్రానుజయుక్తిఁ ద్రుంప నెప మయ్యెదఁ గాకని వహ్నిఁ జొచ్చినన్. 127

క. వేదవతిమాట నిజ మగు, వేదమువలె ననుచు మ్రోసె వినువీథి మహా
మోదమునఁ గుసుమవర్షము, లాదిత్యులు గురిసి రప్పు డవనీనాథా. 128

తే. యతిసుతయు నిట్లు కైకసీసుతకృతావ,మానపవమానజాజ్వల్యమానకోప
దహనసంయోగయోగాగ్నిదగ్ధ యై వి,దగ్ధతాస్నిగ్ధదైవయత్నంబుకతన. 129

వేదవతియే సీత యైనదని రామున కగస్త్యుఁడు చెప్పుట

సీ. తనపద్మవాసినీత్వముఁ జూపువహిఁ లంకఁ దోయజాంతరమునఁ దొల్తఁ బుట్టె
నిదె నీకు మిత్తి నై యేఁగుదెంచితి నన్నగతిఁ బంక్తిముఖునకే కానఁబడియె
నతఁడు పెట్టియఁ బెట్టి యబ్ధి వేయుంచిన నబ్ధికిఁ బుత్త్రి యా టచటఁ దెల్పె
బహుళోర్మివశమున బయలు దేఱి విదేహరత్నగర్భాగర్భరత్న మయ్యె

తే. జనకజననాయకుఁడు యాగశాలఁ గట్టు,చోట దున్నింపఁ నాఁగేటిసరసఁ దోఁచి
సీత యనుపేరు వహియించి చెలువుగాంచి, ప్రేమ శ్రీహరివగు నిన్నుఁ బెండ్లియాడె

తే. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గగరుడ,వాహనాదులు మాని యిక్ష్వాకుకులము
ఖ్యాతి గైకొన మానవాకార మూని, నట్టి నిన్నాశ్రయించెఁ బట్టాభిరామ.

క. సాకేతనగరరాజము, వైకుంఠము నీవె హరివి వైదేహి రమా
లోకస్తని యీలోకపు లా, నాకపులు యథార్థ మిది ఘృణాగుణజలధీ. 132

క. కృతయుగమున వేదవతీ, సతి యై తప మొంది త్రేత జనకజ యై తా
మతిఁ దలఁచినటుల పట్టిన, ప్రతినయు నెఱవేర్చెఁ దత్ప్రభావం బనదే. 133

ఉ. నా విని రాముఁ డద్భుతమునన్ గలశోద్భవుఁ జూచి యీసతిన్
రావణుఁ డట్లు దొల్లియును రాయిడి వెట్టెనె క్రోధమూర్తి యై
పావకులోపలన్ బడిన బాలికఁ గన్గొని చేష్ట దక్కి వాఁ
డావల నెందుఁ బోయెఁ దెలియన్ వలయున్ వినిపింపుఁ డింపునన్. 134

మ. అనినన్ గ్రమ్మఱఁ గుంభజుం డనియె రామా యెయ్యెడన్ నీ వెఱుం
గని దే మున్నది యైన మాఘనత లోకంబుల్ ప్రశంసింప న
జ్ఞునిచందంబున నాలకించెదవు ప్రాజ్ఞుల్ నిచ్చ లోచూపులన్
గనునానందము నీవె కావె విను రక్షశ్చర్య లామీఁదటన్. 135

తే. అటుల వేదవతీకన్య యనలశిఖలఁ
జొచ్చి మ్రగ్గుటఁ జూచి యచ్చోటు వాసి
చపలుఁ డప్పంక్తిముఖుఁడు పుష్పకవిమాన
మెక్కికొని భూమిఁ దిరుగుచు నొక్కనాఁడు. 136

మరుత్తుని యజ్ఞశాలకు వచ్చి రావణుఁడు యుద్ధము సేయుట

క. ఒకచో స్వాహాస్వరపూ,ర్వకవివిధాజ్యాహుతిప్రవర్ధితకీలా
ప్రకరానలధూమవ్యా,పక మగునొకసవనమండపము గనుఁగొనియెన్. 137

క. కని యెవ్వరిమఖమో కన్గొని రమ్మని శుకుని సారణునిఁ బనుప హాసా
దని పోయి తెలిసి క్రమ్మఱి, వినిపించిరి యిట్టు లనుచు వింశతిభుజుతోన్. 138

సీ. అవధారు జయరమాయత్తుఁడై సమరుత్తసర్వంసహాభర్త సవనకర్త
యమరేజ్యునసుజుఁ డుగ్రమహత్త్వశాలి సంవర్తకుండు క్రతుప్రవర్తకుండు
బలభేదిశమనాంబుపతిముఖ్యు లసువేల్పు మన్నె వారు వహించుకొన్నవారు
కశ్యపాత్రివసిష్ఠకౌశికాదులు పుణ్యభాజనమ్ములు తత్సభాజనములు

తే. హైమమణికాంతిఁ దగుశాల యజ్ఞశాల
మెచ్చినాఁడు హరుం డర్థ మిచ్చినాఁడు
విప్రయోగంబు మునులచే సుప్రయోగ
మైన దని వారు దెల్పఁగా నాలకించి. 139

శా. ఆహా నాయెదుటన్ మఖం బొకటి సేయన్ బూనెనే సెట్టి యా
బాహాజన్ముఁడు విఘ్న మెట్లాదవదో భాగంబు లెట్లుండఁ గా
నూహన్ సేసిరొ చూత మీసుర లటంచు గ్రాహావక్రీడనో
త్సాహశ్రీ వహియించి యచ్చటికి దైత్యస్వామి యేతేరఁగన్. 140

సీ. నమ్మియున్నను గ్రమ్మి దొమ్మి సేయు నటంచు నెమ్మిరూపు సురాధినేత దాల్చె
నాఁకొన్నహరిధాక చేకొన్నవాఁ డంచుఁ గాకవైఖరి దండకరుఁడు పూనె
మించినాఁ డితఁ డాక్రమించి యే మెంచునో యంచు నంచవిధంబుఁ గాంచె వరుణుఁ
డొండుచూడంగ మూర్ఖుండు మండు నటంచుఁ దొండమైగండాటియుండె ధనదుఁ

తే. డితరు లాతురులై జాతిహీనరూప, ధారులై పాసి రంత నద్దశముఖుండు
దారుణాకారుఁడై మరుత్తక్షితీంద్రు, కట్టెదుట వచ్చి నిలుచుండి యిట్టు లనియె.

క. ఓయి మరుత్తక్షితివర, యే యుద్ధాపేక్ష నిచటి కేతెంచితినా
తో యుద్ధమైనఁ జేయుము, వే యేటికి వెఱచితేని వెఱచితి ననుమా. 142

మ. నను నీరాజులలీలఁ జూడవల దన్నన్ నవ్వహో నమ్మరు
త్తనృపాలాగ్రణి శత్రుకోటికులగోత్రప్రాభవాచారముల్
వినకే యుద్ధము సేయ నెవ్వఁడవు నీవృత్తాంత మాద్యంతమున్
వినఁ గాంక్షించెదఁ దెల్పు నాప్రభు మరుద్విద్వేషి గర్వంబునన్. 143

మ. విను మూర్వీశ్వర నేఁ బులస్త్యకులుఁడన్ వేధోవరోద్యత్ప్రతా
పనిరూఢుండ దశాస్యనామకుఁడ మద్భ్రాతన్ ధనాధీశు ము
న్ననిలో గెల్చి విమానమున్ గొని త్రిలోకాతీతమాహాత్మ్య మొం
దినవాఁడన్ రణభిక్ష యి మ్మనినఁ బృథ్వీనాయకుం డిట్లనున్. 144

చ. అవుర మ తేమి నీమహిమ యన్నను గెల్చితి నన్నమాట వి
న్న విశద మయ్యె నాయనధనం బగుపుష్పకమున్ గ్రహించినాఁ
డవు భళి యింట గెల్చికద డయ్యక రచ్చల గెల్వఁ బోవలెన్
భువనములందుఁ గీర్తియును బుణ్యము దీన సమృద్ధిఁ జెందవే. 145

ఉ. ఇంతటి ధైర్యశాలి నిఁక నెవ్వ రెదుర్కొని గెల్చువారు ర
మ్మంత ప్రియంబు గల్గినటులైన రణం బొనరింప నేనె ని
న్నంతకుచెంతకుం బనుతు నంతకు నేఁ దగువాఁడ నంచు నం
తంతకు రోస మీను బెరయన్ ధరణీశుఁడు లేచె చెచ్చెరన్. 146

మ. శరచాపంబులు పూని వజ్రకవచస్ఫార ప్రభల్ భూనభో
ంతరముల్ నిండ నజాండఖండనసముద్యచ్ఛింజినీనిస్వన
స్ఫురణన్ రాజు దశాస్యుపైఁ జనఁగ నచ్చో సిద్ధమై ధారుణీ
శ్వరచూడామణి పోకు పోకు మని సంవర్తుం డుదాత్తధ్వనిన్. 147

చ. పలికె బళా మఱేమి మది భాసిల దీక్ష వహించి శత్రుపై
నలుగుట న్యాయమే యిది మహాక్రతు వించుక విఘ్నమైనచో
గులము నశించు నద్దశముఖుం డను దుర్జయుఁ డేల వీనితోఁ
జల ముపసంహరింపు పరమత్వము నా విని యమ్మరుత్తుఁడున్. 148

శా. ఆసంవర్తునిమాటఁ జేకొని పరిత్యక్తాస్త్రకోదండుఁడై
యీసున్ రోసము నుజ్జగించి చన దైత్యేంద్రుండు వీక్షించి నా
తో సంగ్రామము సేయ నోపక మరుత్తుం డోడెఁ జుండీ యటం
చాసన్నాద్రిగుహావళుల్ బదులు మ్రోయన్ బెట్టు చాటింపుచున్. 149

ఉ. అమ్మఖశాలఁ జొచ్చి కుపితాత్మకుఁడై మునికోటిఁ ద్రుంచి యూ
పమ్ములు పెల్లగించి పశుపంక్తి హరించి ఘృతంబు వహ్నికుం
డమ్ముల నించి హోతల నడంచి యహో తల మంచు యాజకుం
డమ్మెయిఁ బల్క నొక్కగతి నక్కడఁ బాసి చనెన్ బలంబుతోన్. 150

క. హరిహయముఖ్యులు భయములు, గిటికొన శిఖికాకహంసకృకలాసగతుల్
ధరియించి యమ్మహాపదఁ, దరియించి తదీయహితము దలఁచి ప్రియోక్తిన్. 151

సీ. కన్నులీకలచంద్రకములుగా ఘనవేళ నెమ్మిగా బలవైరి నెమ్మి కొసఁగెఁ
బెద్దకాలము మన్కి ప్రేతాత్మకతభుక్తి గలుగఁగా జముఁడు కాకమున కొసఁగెఁ
బాలును నీరు నేర్పఱుచు నేర్పుఁ బయోవిహారంబు నుదధీశుఁ డంచ కొసఁగెఁ
దల వెండివలెనుండఁ దనువు బంగరుఁజాయఁ దులకించ ధనరాజు తొండ కొసఁగె

తే. నివ్విధంబునఁ దమతమయొలమికిఁ దగు
వరము లజ్జంతువుల కిచ్చి వారు సవన
భాగముల్ గొనిపోయి రప్పార్థివుఁడును
మఖము నెఱవేర్చె సంవర్తమౌనికరుణ. 152

చ. అటుల మరుత్తభూవిభునియజ్ఞధరాస్థలిఁ బాసి యార్చుచున్
బటహమహార్భటుల్ దిశలు బ్రద్దలు సేయ నజయ్యుఁడై ధరా
విటులఁ బరాక్రమోద్భటుల వీఁక నెదుర్చుచు నోప మన్నచో
నటఁ దనగెల్పుఁ దెల్పుచు దశాస్యుఁడు ద్రిమ్మరె భూమి యంతయున్. 153

సీ. పరిపంథిమదతమఃపంకజిన్వధిభూవిభుం డైనదుష్యంతభూవిభుండు
వైరిరాజప్రాణవాయుభుగ్భుజభుజంగాధిరా జై మించుగాధిరాజు
హరిశౌర్యఘటితాఖిలారివీరమృగాపహరణాజిమృగయుఁ డై యలరుగయుఁడు
శత్రుహృచ్ఛేదనక్షమచక్రదీర్ఘఘుర్ఘరఘోషసురథుఁ డై క్రాలుసురథుఁ
తే. డహితనుతచారుగౌరవుం డగుపురూర
వుండు మొద లైననృపపుంగవులు మహోగ్రుఁ
డౌదశాస్యునితోడఁ బోరాడలేక
నోడితి మటంచు వచియించి రోహటించి. 154

## రావణుం డనరణ్యమహారాజుతోఁ బోరుట

తే. ఏమి దెలిపెద నింక శ్రీరామచంద్ర, యొక్కనృపుఁ డైన నెదిరింప నోపఁడయ్యె
రావణాసురుపై ననరణ్యనృపవ, రేణ్యుఁ డొకరుండు దాఁకె నిర్భీకుఁ డగుచు.

ఉ. ఆవివరంబుఁ దెల్పెద దశాననుఁ డిట్టుల నెల్లరాజులన్
లావు దొరంగఁజేయు చొకనాఁడు బలాన్వితుఁ డై యయోధ్య కెం
తేవడి నేఁగుదెంచి పలికె న్ననరణ్యనృపాల పోరికిన్
నీవిపులప్రతాపము గణింతురు దిక్కుల శూరు లందఱున్. 156

క. అనుమాన మేల వెఱచిన, ననుమా నోడితి నటంచు ననుమాట చుఱు
క్కున మానవపతిచెవి సార, ఘనమానము రోస మీసుఁ గనఁబడ ననియెన్.

ఉ. ఏల దురుక్తులాడె దనురేశ్వర మ మ్మెదిరించి పోరఁగాఁ
జాలుదు వేని ద్వంద్వమునఁ జక్కఁగ నిల్వుము పిల్కుమార్చెదన్
బేలతనంబుతో ఘనులు పెద్దఱికంబు గణించుకొందురే
యాలములోపలన్ దెలియు నందఱబీరము లంచుఁ బల్కుచున్. 158

సీ. పృథ్వీస్థలం బెల్లఁ బెల్లగింపఁగఁ జాలఁ బెం పొందునరదముల్ పెక్కువేలు
ఘనగాత్రమహిమ నాకాశ మెత్తెడుభంగి బెడఁగైనయేనుఁగుల్ పెక్కువేలు
చక్రవాళము నైనఁ జక్కదాఁటెడుధాటి బెరయుగుఱ్ఱమ్ములు పెక్కువేలు
కల్పాంతభైరవాకారులై శూరులై బిరుదు లందినభటుల్ పెక్కువేలు
తే. మిక్కుటపువీఁక దిక్కులఁ బిక్కటిల్ల
నొక్కమొగిఁ దన్నుఁ గొల్వఁగా నుక్కుమీఱి
కదనమున కాయితం బయి కదలిపోయె
రావణునిమీఁద మనయనరణ్యనృపతి. 159

క. ఆవిభునిసైన్యపతులకు, రావణుసైనికుల కుగ్రరణ మయ్యెఁ ద్రిలో
కీవిస్మయావహోద్ధతి, దేవాసురయుద్ధ మైన తెఱఁగున నధిపా. 160

మ. దనుజుల్ నీలశిలోచ్చయోచ్ఛ్రితను లుద్యద్బాహు లుగ్రాశని
ధ్వను లొక్కుమ్మడిఁ జుట్టు ముట్టి భటమ స్తంబుల్ రథాంగంబు ల

శ్వనికాయోదరపార్శ్వముల్ కరటిహస్తంబుల్ విదారించి య
య్యనరణ్యాధిపుసేన గాడుపు లరణ్యానిన్ బలెన్ గూల్చినన్. 161

సీ. పడగలు గొడుగులు పావడల్ పీచోపు లొండొంటిపైఁ వ్రాలి యుండు నెడలుఁ
దొడలును మెడలుచేతులుగాళ్లువ్రేళ్లుప్రక్కలుడొక్కలొకప్రోఁగుగన్నయెడలు
నరము లెమ్ములు క్రొవ్వునంజుడుమెదడు ప్రేవులు నెత్తురొక్కటై కనయు నెడలు
హారకుండలకిరీటాంగుళీయకకంకణాంగదాదులు చూర్ణమైనయెడలు

తే. బహువిధాయుధశకలముల్ పడినయెడలుఁ, గలిగిపలలాశనోత్సవకారియగుచుఁ
దనబలము నేలపాలైనయునికిఁ జూచి, యలిగియనరణ్యభూపాలుఁ డౌడుగఱచి.

చ. కరమున విల్లు పూని లయకాలకృతాంతునిలీల హూర్విటం
కరణము దిక్కరిశ్రవణఘట్టనముల్ ఘటియింపఁ దేరు స
త్వరముగ సూతుఁడున్ నడుపఁ డన్నెదిరించినఁ జూచి పంక్తికం
ధరుఁ డనరణ్యునిన్ బెలుచ నవ్వుచు నీసు వహించి యిట్లనున్. 163

తే. ఆఁకలియు డప్పి గొన్న నరాదు లాహా, యింత నరసేన దెచ్చి యర్పించినటుల
చటులమామకశరశిఖిజ్వాలికలకు, నిన్నొసఁగ వచ్చితే యన్న నృపుడు గదిసి.

చ. దనుజుఁ గిరీటముల్ పదియుఁ దాఁక ననేకశరంబు లేసి యా
ర్చిన శతశాతబాణములచే దశకంఠుఁడు రాజు నొంచి యా
తనివిలు ద్రుంచి సారథివధం బొనరించి హయాంగముల్ దళిం
చిన రథహీనుఁడయ్యు గదఁ జేకొని శత్రుని మోఁదె మోఁదినన్. 165

తే. దండతాడితఫణిరీతి దశముఖుండు, పుడమి కుద్ధతి లంఘించి పిడుగుఁబోలు
కఱకుటఱచేతఁ దనమస్తకంబు వ్రేయ, వాయుహతసాలలీల భూవరుఁడు గూలె.

ఉ. అగ్గతి నేలఁ గూలిన ధరాధిపుఁ గన్గొని పంక్తికంఠుడున్
బెగ్గిల నేక వేసి నగి బీరము లాడితి విప్పు డింతలో
దగ్గఱె నోటు మృత్యు వెచటన్ నను గెల్వఁగ నెవ్వఁ డోపు నీ
సిగ్గిటు సేసె నోటమి వచించిన నీదురవస్థ వచ్చునే. 167

చ. అని తనుఁ దూల నాడిన జనాగ్రణి కన్నులు విచ్చి దైత్యునిం
గనుఁగొని నన్ను నీవిపుడు గాఱియఁ బెట్టిన నేమి మీఁదటన్
నిను వధియించు నొక్క మహాసీయచరిత్రుఁడు మత్కులంబునన్
జననము నొందు నిట్టిపరుషంబులు వల్కకు పొమ్ము రావణా. 168

చ. పురుషుఁడు కర్మసంగమునఁ బొందు సుఖంబును దుఃఖ మెవ్వ రె
వ్వారికి విరోధముల్ సలుపు వా రిది దైవవశంబు దీనఁగా
తరత వహింప నేఁ గనకదానమఖాధ్యయనాదికర్మముల్
వారసితి నేనిఁ బల్కు పొలి వోవక నట్లగుఁ గాక యం చనన్. 169

క. మించినతమిని సురల్ గురి, యించిరి మందారవృష్టి యిది నిజ మని మ్రో

యించిరి పణవాదులు నుతి, యించిరి యనరణ్యనృపతిధృతివిభవంబుల్. 170

చ. అది సహియింప కచ్చెడు గహంకృతితో నిటువంటిసత్త్వమే
కద నిను నింత సేసెఁ దుది గాంచియు వైరము మాన వంచు బ
ల్లిదఁ గొని మస్తకంబు వగులన్ వడి నొంచి జయంబుఁ గాంచి స
మ్మదము వహించి యేఁగె నన మానికి నవ్వుచు రాముఁ డిట్లనున్. 171

క. అరి నోర్వఁ జాలువీరులు, ధర నెక్కడ లేరో వీరధర్మము సెడెనో
నరపతులశౌర్యధైర్య, స్ఫురణ లిటుల నేల గలసి పో నేమిటికిన్. 172

వ. వని పలికి యంత నిలువక. 173

మ. అకటా సూర్యశశాంకవంశ్యు లగుబాహాసంభవుల్ నొచ్చిరే
స్వకరాస్త్రంబులు హానిఁ జెందెనె మనస్సంపన్నతల్ గుందెనే
యొకఁ డైనన్ రిపు నొంప కున్నకత మేమో విన్న వింతయ్యెడిన్
సకలస్తుత్యతపఃప్రభావనిధి యీసందేహముం దీర్పవే. 174

క. నా విని లోపాముద్రా, జీవితనాయకుఁడు నగుచు క్షితికన్యాదృ
గ్జీవంజీవహితానన, జైవాతృకుఁ డైన రామచంద్రున కనియెన్. 175

మ. తనచే నిర్జితుఁ డైనశాత్రవునిదోర్దర్పంబుఁ గీర్తించినన్
విని సంతోషముఁ జెందు నెట్టిఘనుఁడున్ విశ్వావనీశాగ్రణీ
హననం బోర్వక వానియోటము లెనీవాలింపఁ గాంక్షించె దెం
తని వర్ణింతును నీగుణస్ఫురణ రామా రాజచూడామణీ. 176

అగస్త్యమహర్షి కార్తవీర్యార్జునిప్రతాపము రామునకుఁ దెలుపుట

క. అశ్రమమున ధరఁ దిరుగుచు, విశ్రవసుసుతుండు కార్తవీర్యార్జునవా
ర్థశ్రవసాదుల కోడిన, విశ్రుతకథలు గల వవియు విను మని పల్కెన్. 177

శా. ఆహాంసోన్నతవజ్రసౌధరుచిసౌధాంభోధిదివ్యాపగో
ద్వాహోపక్రమసూచకోపరిచరత్పాండుచ్ఛదగ్రామణీ
సాహస్రచ్ఛదనిష్ప్రతాంబుకణచంచన్మౌక్తికస్తోమ మై
మాహిష్మత్యభిధానపత్తనలలామం బొప్పు భూమీశ్వరా. 178

శా. ఆప్రో లర్జునచక్రవర్తి కృతవీర్యక్షోణిభృత్క్షీరవా
ర్ధిప్రత్యక్షశశాంకమూర్తి నతదారిద్ర్యార్తివిచ్ఛేదన
ద్వీపక్షిప్రదయానువర్తి ద్విచతుర్దిగ్దంతిరాడ్దంతకాం
తిప్రద్యోతితకీర్తి యేలు నెపుడున్ దేవేశ్వరస్ఫూర్తితోన్. 179

సీ. అనవద్యబాహాసహస్రముల్ దనచక్రభావ మంతయు బట్టబయలు సేయ
నణిమాదివిభవంబు లల్లదత్తాత్రేయగురుకృప దనుముంచుకొనుటఁ దెలుప
సంతతౌదార్య మష్టాదశద్వీపంబు లేలెడితనకల్మి నెఱుకపఱుప
దక్షిణనాయకత్వ మనేకసతులతో విహరించుతననేర్పు విస్తరింప

తే. సార్వభౌమలలాముఁ డై జగతి యేలె, నప్రతిహతప్రతాపశాఖాప్రదీప్త
దావపావకకీలికాదగ్ధదుర్జ,నార్జునుం డగుకార్తవీర్యార్జునుండు. 180

క. ఆసార్వభౌముఁ డమితవ, శాసంగతసార్వభౌముచందమున బహు
స్త్రీసంయుతుఁ డై యొకనాఁ, డాసన్నసరిద్విలోకనాదృతిఁ జనియెన్. 181

మ. చని వింధ్యాచలసార్వభౌమనికటాంచన్నర్మదాతీరభా
గ్యనసౌభాగ్యము మెచ్చి హైహయధరావజ్రాయుధుం డంగనా
జనతానేకవిధాంగసంపదలతో సామ్యంబు లౌ వస్తువుల్
గనుఁగొంచున్ లతకూనలన్ దొరసి వేడ్కన్ సెందెఁ జైత్రుల్ బలెన్. 182

శా. తత్కాలంబున రావణాసురుఁడు దైత్యగ్రామణుల్ గొల్వ ను
ద్యత్కౌబేరవిమాన మెక్కికొని యుద్ధాపేక్ష రా సర్వభూ
భృత్కోటీరకిరీటరత్ననికరాభీలద్యుతి ప్రస్ఫుర
త్పత్కంజద్వయుఁ డర్జునుం డనెడివార్తల్ భూమిలో మించినన్. 183

క. అతిరోషంబున మాహిష్మతికిన్ జని రావణుండు సమరస్పృహ వ
చ్చితి నాయాగతి మీయధిపతికిన్ దెల్పుఁ డన సార్వభౌమునిమంత్రుల్. 184

వ. అతనితో ని ట్లనిరి. 185

సీ. బలువేసడములపై బండ్లపై బ్రబలోష్ట్రపంక్తిపై ముందుగా బరువు లేగఁ
దదనువర్తనలీల దారుణాయుధరుచుల్ దిలకింప సుభటముఖ్యులు సనంగ
రథకహస్తిపకతౌరంగికుల్ వలగొని మేడ మై కనుఁజూపు మేర నడవఁ
జెంతల నెవ్వారిఁ జేర రానీయక బహుకంచుకులు బరాబరులు సేయ

తే. నవ్యపల్యంకికారోహణము లొనర్చి, రాణివాసంపుసతులు పార్శ్వములఁ గొలువ
భద్రగజమెక్కి మారాజు ప్రాభవమున, నర్మదాతీరవని కేఁగినాఁడు నేఁడు. 186

శా. నేఁడే వచ్చునొ రేపె వచ్చునొ వనిన్ స్త్రీయుక్తిఁ గ్రీడించుచున్
రాఁడో రాజులచిత్తముల్ దెలియునే రక్షకులాధ్యక్ష యె
వ్వాఁడున్ మాపురిఁ జేరి నీకరణి గర్వస్ఫూర్తి ని ట్లాడఁగా
లేఁ డుగ్రుండ వతండు వచ్చినను బాళిన్ రమ్ము మే లౌ ననన్. 187

శా. ఆమాటల్ విని నవ్వి పంక్తివదనుం డౌరౌర యీబూమె లే
లా మీయేలిక నాప్రయాణకథ లెల్లన్ విన్నవాఁడై వధూ
స్తోమంబుం గొని డాఁగ నేగె రణభీతిన్ జేరి పోనాడు నే
భూమిన్ రావణుఁ డంచు వారి నగుచున్ బోయెన్ మదోద్రేకియై. 188

తే. ఇటుల మాహిష్మతీపురాధీశుఁ గాన
కసుర యుచ్చోటు వాసి సైన్యముల డాసి
యలప్రహస్తుండు మొదలైన యఖిలమంత్రి
పుంగవులు గొల్వ నవ్వలఁ బోయి పోయి. 189

దశగ్రీవుండు వింధ్యాచలంబున కేఁగుట

మ. అవలోకించె దశాననుం డెదుట దివ్యస్త్రైణవీణారవ
శ్రవణోల్లాసరసోన్నమత్ఫణిఫణారత్నప్రభావాప్తభీ
తవిధానత్తటకుంభిఘీంకృతికటద్దీవ్యద్గుహాయాతమా
నివరారక్తజటాంశుకింశుకఘృణిన్ వింధ్యాచలగ్రామణిన్. 190

వ. కని యక్కొండచక్కటికిఁ జక్కనరిగి సురగరుడగంధర్వాదిదేవతామిథునం
బుల నిధువనంబులకుఁ దగుపృథువనంబులోఁ దరలనియిరుల కిరవగుతోరంపు
టీరంపుగుంపులఁ బెంపు గనుమవ్వంపుదివ్వెలవలె నివ్వటిల్లుగనగనని మణులకై
కెరలుమధుకరనికరంబులగతులు తెమ్మరలవలనఁ జలనంబు నొందునలరుల
యందుండియుఁ దొరంగుమరందధారాబృందంబు వాఁకలం గలసి ప్రవహించు
సెలయేటినీటితుంపరలఁ దొరసి మందగతులం దిరుగు మందపవనంబులఁ
దార్కొని యావటించుసానుచరద్భుజంగసంఘంబులఫూత్కారంబుల్ బెగ
డువడి వడి నిగుడఁ బసవు లిడుతమపడుచులజడుపుదీర్చుట కెదురువచ్చుతపసి
పెద్దలకటితటీరమణీయతరవ్యాఘ్రచర్మంబులడంబులఁ గని తల్లడంబునఁ గ్రేళ్లు
ఱుకుకన్నెలేళ్లకు మొల్లంపుఁబచ్చికలనుమచ్చికలెచ్చరించుపచ్చఱాగనులచెం
గటఁ గనుపట్టుపేలరత్నాకరంబులవిభాకదంబంబు లంబుదనికురుంబంబు లని
యుఁ దదుపరిప్రద్యోతితజ్యోతిర్లయవితానంబులు తటిల్లతాప్రతానంబు లని
యు నెంచి యౌఁ గా దని పన్నిదంబులు సఱచి పఱతెంచి పరికించి మృష
యైన నోడినవారిఁ గేరడంబు లాడుచెంచుమించుఁబోడులకరాంచలశరాసనో
న్ముక్తదురాసదశరాసారంబులఁ బగిలిన వేణువులనుండి రాలు మెఱుంగుముత్తి
యంపుఱాలు దందశూకాండంబు లని ఖండింపఁ దివురుశిఖండిప్రకాండంబుల
విప్పుగలకప్పుఁబించెంబుల నొప్పుసాంద్రతరచంద్రకద్యోతము లింద్రచాపద్యుతు
లని చరించురాయంచలచంచూపుటచరణారుణప్రభాస్ఫురణంబులఁ గ్రొంగి
లించుజేఁకుఱులతోఁ గరంబు మీఱఁ టగుకూటఝూటంబులఁ గ్రీడించుచు
నప్పంక్తికంధరుండు. 191

రావణుఁడు నర్మదయొద్దన జేరి శివపూజ సేయుట

మ. అచలోపాంతమునం గనుంగొనియెఁ దుంగాభంగభంగానిలా
భ్రచరత్ఖేచరబాలికాతిలకభాస్వాలస్థలీఘర్మదన్
బ్రచురస్నాతకశర్మదన్ స్వమహిమప్రధ్వస్తనానాసరి
త్ప్రచయాంతర్మద నర్మదన్ జలగళద్దంతావళోచ్చైర్మదన్. 192

మ. కని కోయష్టికచక్రసారసబకక్రౌంచాదినానాఖగ
ధ్వనులన్ వీనులఁ జంచదూర్మిలులితావర్తేషులం గన్నులన్
వనజాతోత్పలసారసౌరభములన్ నాసల్ తదీయానిలం
బున మేనుల్ సఫలత్వ మొంద దితిభూమూర్ధన్యుఁ డుత్సాహి యై. 193

క. ఆ త్తటినిఁ జేరఁ బోయి వి,య త్తటినికి సాటి యైన దారా యనుచున్
బోరిత్తుంగం బగుతటమున, హ త్తివలె వసింపఁ గని ప్రహస్తుఁడు పలికెన్. 194

చ. జలశకునాకులచ్ఛకులజాలవిలోలవిలోకనంబులన్
జళు కెటఁగింపుచున్ గమలమండచలత్కలహంసికాగరు
చ్చలవసనాంచలంబునఁ గుచాయితకోరకపాళిఁ గప్పుచున్
బలియుఁడ వైన నీయెదుట నర్మద సాధ్వి తెఱంగు పూనెడిన్. 195

చ. తనవిమలోదకంబుల సుధామధురత్వము ఫేనయుక్త పా
తనసికతాతలంబున సితప్రభయున్ దను నాశ్రయించుచా
ష్పున ననవద్యశైత్యమును బోల్పఁగ నిన్నది తండ్రి పోలికల్
గనియు నడంచెఁ గ్రిందనె కళంకము కర్దమకైతవంబునన్. 196

మ. జలపానాగతసింహభీతసలిలస్తంబేరమస్తోమసం
చలనోపద్రవధావదుగ్రకమఠీశంక్వాదికేతస్తతో
వలనానచ్ఛఘనప్రవాహ యగు రేవన్ దోఁచుమాలిన్య మీ
జలజాప్తప్రతిబింబ మొందెఁ జనునే సంసర్గదోషం బిలన్. 197

మ. అరుణాబ్జద్యుతి నీముఖద్యుతులచే నత్యున్నతోర్మిచ్ఛటా
గరిమన్ నీకరపంక్తిచే శకునరేఖల్ నీయశశ్ఛాయచే
హరియింపం బడె నంచు నిన్నుఁ బొగడెన్ హంసార్భటిన్ వార్ధిరా
ట్తరుణీరత్నము వింటివే యసురచంద్రా యన్న లేనవ్వనన్. 198

చ. అవు నని మంత్రితోఁ బలికి యందఱఁ జూచి యహస్కరుండు నా
యవిరళకాంతికిన్ వెఱచి యంబరమధ్యగుఁ డయ్యెఁ జల్లనై
కువలయబంధుపోల్కిఁ గనుఁగొంటిరె యున్నదిఁ గ్రుంకి యందఱున్
బువు లిఁకఁ గోసి తెండు శివపూజ కటంచు దశాస్యుఁ డంచినన్. 199

ఉ. స్వామి హసా దటంచు శుకసారణముఖ్యసమస్తసైనిక
గ్రామణు లమ్మహానదితరంగము లుద్దరు లావరింపఁగా
సామజపుంగవస్ఫురణస్నానము లాడి దుకూలధారులై
యామహనీయవన్యల సుమాపచయం బొనరించి రందఱున్. 200

సీ. తొగలు గెందమ్ములు దుమ్మిపూ లబ్బెండపువ్వులు పొన్నలు పొగడవిరులు
సన్నజాజులు సురపొన్నలు గలిగొట్లు మల్లెలు సంపఁగెల్ మొల్లవిరులు
బొండుమల్లె లశోకములు మంకెనలు నందివర్ధనంబులు విరవాదివిరులు
గోరంటలును గొండగోఁగులు దేవకాంచనకుసుమములు గొజ్జంగవిరులు

తే. మాచిపత్త్రియుఁ గురువేరు మరువకంబు, దవనమును గగ్గెరయు బిల్వదళములాది
యైన పూజార్హవస్తువు లపుడు దెచ్చి వం,తులకుఁ గొండపొడవుగా వైచుటయును.

మ. పరితోషించి శివార్చనాకుతుకసంబద్ధాత్ముఁ డై లేచి యా
శరమూర్ధన్యుఁడు నర్మదాతటినిలో సంకల్పపూర్వంబు గా

స్మరవైరిన్ స్మరియింపుచున్ మునిఁగి తన్మంత్రంబు వేమాఱు భం
గురనిష్ఠన్ జపియించి వెల్వడి మడుంగుల్ గట్టి సేమంబునన్. 202

క. ఏకతమున శుచియగునొక, సైకతమున నధివసించి స్మరణప్రాప్తం
బౌ కాంచనమయలింగముఁ, జేకొని ప్రాణప్రతిష్ఠ సేసి సునిష్ఠన్. 203

సీ. ఆవాహనము వృషభాధివాహనునకు నాసనం బద్రిశరాసనునకు
నర్ఘ్యంబు విషధరానర్ఘ్యభూషణునకుఁ బాద్య మాగమశిఖావేద్యునకును
గలితామృతాభిషేకం బమృతాత్మున కంబరం బతులదిశాంబరునకు
యజ్ఞోపవీతంబు యజ్ఞాభియాత్రికి గంధంబు విషగమ్యగంధునకును

తే. హారిధవళాక్షతులు సంగరాక్షతునకు, నర్పణ మొనర్చి తత్సహస్రాభిధాన
ములను బంజాక్షరీమంత్రమునను నవక, మునను దద్రియమునవిరుల్ పూజచేసె.

తే. అమ్మహాపూజ గొనసాగి నట్టులైన, సంగరంబున గెల్చు నేశత్రునైన
విఘ్న మొందిన నోడు నవ్విధముమత్త, చిత్తుఁ డౌట గణింపక చేయఁ దొడఁగె.

క. ఇరువదిచేతుల శంభునిఁ, బరిపూజన సేయుచుండి పంక్తిముఖుం డోం
హరహర హరహర హర ఓం, హర యని పదినోళ్లఁ బలుకు నంబర మద్రువన్.

క. కదలనిగాత్ర మొకించుక, వదలనిపద్మాసనము శివానాథునిపైఁ
జెదరనితలఁపును జలనము, గదురనిచూడ్కులును బంక్తికంఠుని కెతగున్. 207

తే. ఈవిధంబున నమ్మహాశైవతిలక, మలికనయనుని నయ్యేటికెలన నుంచి
యంచితప్రీతిఁ బూజ గావించుచుండె, నంత నక్కడఁ గార్తవీర్యార్జునుండు.

కార్తవీర్యార్జునుఁడు స్త్రీలతో వనవిహారము సల్పి జలక్రీడ సేయుట

సీ. చిగురులు గిల్లుచోఁ జిగురులు దమకేలుఁ జిగురులరక్తిచేఁ జెలిమి సలుపఁ
బువ్వులు గోయుచోఁ బువ్వులు దమనవ్వుఁ బువ్వుల తెలివితోఁ బొత్తు సేయ
లతికలు సేరుచో లతికలు దముతనూలతికలమృదురీతులను బెనంగఁ
దేనియల్ వడియుచోఁ దేనియల్ దమమోవి తేనెలరుచులపొందికలఁ జెంద

తే. మాటలాడుచుఁ బాడుచు మందమంద, గమనములఁ గామినీమణుల్ గలిసిమెలసి
వనవిహారంబు గావింప వారిఁ గూడి, యలరె నవమన్మథునిలీల నర్జునుండు.

మ. పరితస్స్రస్తలతాప్రతానము బృథగ్భగ్నప్రవాళచ్ఛదో
త్కర ఘూర్ణన్నిపతత్సుమంబు యుగపద్ధావత్ఖగం బంజసా
చరదిందీవర మగ్రతగప్రవిచలచ్ఛాఖానికాయంబునై
ధరణీనాథవధూవిహారముల నుద్యానంబు గాసింబడెన్. 210

వ. అట్టిసమయంబున. 211

మ. శ్రమతోయార్ద్రకపోల మంసగళదంచన్మాల్య మామ్లానగా
త్ర మసహ్యావృతకంచుకం బలికమధరీస్థాలకం బానతా
స్య ముదారోచ్ఛ్వసనాకులంబు నగుస్వస్త్రీగణంబుతో హైహయుం

డమరీయుక్తబలారియ ట్లరిగె రేవాంభోవిహారస్పృహన్. 212

తే. అరిగి పశ్చిమవాహినియైనయమ్మ, హాతరంగిణి బాహుసహస్రమునను
గార్తవీర్యార్జునుం డడ్డకట్టి శశిము, ఖీసహస్రంబుతో జలక్రీడలాడె. 213

లయగ్రాహి. పొంచుచు వయస్యల గ్రహించుచుఁ దదంగముల
వంచుచు దరంగముల ముంచుచు జలంబుల్
వెంచుచు నొకళ్ళొకరి మించుచు సరోజములు
ద్రుంచుచు ముఖాబ్జముల నించుచుఁ దొగల్ ప్రా
పించుచు రథాంగులఁ గలంచుచు మరాళముల
గాంచుచుఁ దమింబొదువ నెంచుచుఁ బత్రిన్ బ్రా
ర్థించుచు జలేభులకుఁ గొంచుచు ఖగాళి బెద
రించుచుఁ జెలంగిరి హసించుచు లతాంగుల్. 214

సీ. సార్వభౌముని నొక్కసతి పద్మముల వైచి పద్మముల్ దగు నని పరిహసించెఁ
జక్రవర్తి నొకర్తు సక్కనికువలయంబుల ముంచి యవి నీకుఁ బోలు ననియె
రాజుపై నొకతె కైరవిణీముఖోదారమధుధారఁ జిలికి నర్మంబు లాడె
నర్జును మే నొక్కయతివ బాహావల్లికలఁ జుట్టి యౌచిత్యగరిమ దెల్పె

తే. గట్టివా యొక్కతె సహస్రకరుని మీఁదఁ
దఱచు గార్కొనుశైవాలతమము నించి
తలఁప నిది యొక్కటియె యయుక్తం బటంచు
విభుఁడు చిఱునవ్వు నవ్వి నవ్వించె సఖుల. 215

క. మాహిష్మత్యధినాయకు, బాహాసేతువునఁ జిక్కువడి కరతోయా
వాహిని కడు సుడివడియెన్, సాహసిచేఁ బట్టువడినసతిచందమునన్. 216

మ. పతదభ్రంకషతీరభూమిరుహమై ప్రాదుర్భవత్ఫేనమై
హతనాళీకమృణాళనాళ యయి భీతాంభశ్చరవ్రాతమై
కృతవీర్యాత్మజబాహురోధమునఁ బైకిం బొంగి రేవాసర
స్వతి ప్రాగ్వారిధిచాయకున్ మరలెఁ జంచత్తుంగభంగార్భటిన్. 217

మ. గిరినైనం దెగఁ గోసి మత్తహరిమాడ్కిం బాఱునయ్యేఱు భూ
వరదోస్తంభవిజృంభముం గడచి పోవన్ బల్మి లేకట్టె స
త్వరమై క్రమ్మఱ వచ్చి పంక్తిముఖక్లృప్తస్వర్ణలింగార్చనా
స్ఫురితద్రవ్యము లెల్ల ముంచుకొనియెన్ బ్రోద్యత్ప్రవాహోద్ధతిన్. 218

మ. తను రోధించె నృపాలకుం డతనిపై దం డెత్తి పొమ్మేటి పూ
జన లిచ్చో నని చంచదూర్మి నినదచ్ఛద్మంబునం బల్కుచున్
విన కున్నన్ నది మించి ముంచెనొ యనన్ విఘ్నంబు పూజావిధిన్
మొనయన్ దానవచంద్రుఁ డద్భుతరసాంభోరాశిమగ్నాత్ముఁ డై. 219

మ. చరమాంభోనిధిచెల్మి, యేల యనుచున్ జాలించి పూర్వాంబుధిన్
దొరయం బోయెడినో తరంగిణి యిదెందున్ గాన మంచున్ మహే
శ్వరపూజానియమంబు మానక కరధ్యానంబునన్ జెంతమం
తురులన్ బిల్చి ప్రవాహకారణముఁ దోడ్తో నారయం బంచినన్. 220

క. వారలలోఁ జతురులు శుక, సారణు లభ్రగతు లగుచుఁ జరమదిశకుఁ ద
త్తీరమున నరయ నామడ, దూరము సన వినిరి మదవతులకలకలముల్. 221

మ. విని యక్కాంతల చెంతఁ గన్గొనిరి ప్రావృట్కాలకాలాంబుము
గ్ఘనలీలాలకవిస్తృతాళికు నురగ్రస్వ్యగ్రబాహాసహ
స్రనిరుద్ధాబ్ధికళత్రు నిద్ధమదసంరక్తాంతనేత్రున్ సుమో
హనగాత్రున్ గృతవీర్యపుత్రుజలఖేలాయత్తచిత్తాబ్జునిన్. 222

క. కనుఁగొని నివ్వెఱపడి చ, య్యన మగుడి దశాస్యుఁ జేరి మంజలిబంధం
బొనరించి నిలిచి దేవర, వినుఁ డొకవింత యని యనిరి వేగరు లంతన్. 223

మ. ఘనసాలోన్నతిఁ గాంచినాఁడు నురు సింగారంబునన్ మించినాఁ
డు నిదిన్ స్వీయభుజాసహస్రముల నాటోపించి బంధించినాఁ
డు నదీనాంబువిహారతత్పరతి నాండ్రున్ దా విజృంభించినాఁ
డు నరగ్రామణి యెవ్వఁడో యొకబలిష్ఠుం డాసుధగ్రామణీ. 224

క. తనకరములవలె నివ్వా, హినితరఁగలు నుంచె ననెడి యీసునఁ గాఁబో
లు నతండు గట్టినాఁ డం, బున బడమర సనక తటిని దూరుపున కెట్టెన్. 225

క. దేవరకంటెను మించునొ, దేవరకు సమానుఁ డౌనొ తెలియఁబడదు మే
మీవటి కావిభుఁ బోలిన, భూవరుఁ గని యెఱుఁగ మనిన బుద్ధి చలింపన్. 226

మ. శివపూజానియమంబు మాని తొలిజేజేపెద్ద మాహిష్మతీ
ధవుఁ డాతఁడు బళీ కనంబడెను యుద్ధక్షోణిమాతారత
మ్యవిశేషంబులు గానుపింతుఁ జనుదెం డంచున్ వడిన్ లేచి దా
నవయోధుల్ రథదంతివాహముఖనానాసేనలున్ గొల్వఁగన్. 227

వ. కదలిమదాధికపదాతిపదాఘాతధూతధరాతలపరాగపటలంబుతోఁ గలిసి మలసి ప్రతికూల మారుతంబు లెదురుకొన సరకుగొనక పశ్చిమోన్ముఖుం డై పంక్తిముఖుండు తత్తటినీతటంబున్ జని చని. 228

శా. రంభోరూశతగీతనృత్యరసనిర్మగ్నాత్ముఁ డై యాత్తదో
స్తంభస్తంభితనర్మదాహ్వయసరిత్కల్లోలజాలంబులోఁ
గుంభీంద్రున్ బలెఁ గేళిసల్పు నృపముఖ్యున్ దవ్వులన్ జూచి ర
క్తాంభోరుట్ప్రతిమానవింశతిదృశుం డై రావణుం డిట్లనున్. 229

శా. చేరన్ బోవఁ బ్రథాను లడ్డమయి యాక్షేపించి యిట్లేఁగఁగా

మేరా నీ వెటఁ బోయె దెవ్వఁడవు నెమ్మిన్ గొమ్మలన్ గూడి నేఁ
డీరా జున్నరహస్య మెన్న విది యేమీ యన్న మీరాజుతోఁ
బోరన్ వచ్చితి రావణుండఁ బిలువన్ బొం డాతనిన్ జెచ్చెరన్. 230

క. ఊరకఁ బోవఁడు చూచినఁ, బోరక దశకంఠుఁ డనిన భూరికృపాణ
స్ఫారప్రభ లినుఁ బొదువఁగ, వార లతని కనిరి ధైర్యవైభవ మెసఁగన్. 231

క. సమరమున కనుచు నొప్పని, సమయంబున వచ్చి పిలువఁ జను నే నీమా
త్రమున కతిఁ జేల యే మో, పమె రమ్మెదిరింపఁ బంపు బలముల ననినన్. 232

చ. విని సహియింప కద్దనుజవీరునిమంత్రులు రాజమంత్రులన్
గినుక నెదిర్చి శస్త్రచయకీలితగాత్రులఁ జేసి వారిఁ గొ
ల్చినభటకోటి భక్షణము సేయుచు రక్తము లానుచున్ ముదం
బునఁ జెలరేఁగి యార్వ నుడివోవక హైహయసైనికాగ్రణుల్. 233

మ. బహునారాచపరంపరల్ గురియుచున్ బైపైఁ బ్రహాస్త్రాది దు
స్సహులన్ మించిన రావణుం డలిగి హస్తన్యస్తశస్త్రచ్ఛటా
ప్రహతిన్ సేనలఁ జెక్కుచున్ నఱకుచున్ భంజించుచున్ ద్రుంచుచున్
గహనం బగ్నిసఖుండు గూల్చుక్రియ మ్రగ్గన్ జేసె నొక్కుమ్మడిన్. 234

వ. ఇవ్విధంబున. 235

చ. హాళహళ్ళిక్కో నెదిర్చి దనుజాగ్రణిచే బహుసైనికోత్తముల్
గలన నడంగఁ జూచి చని కంచుకు లప్పుడె రాజుముందటన్
నిలిచి పరాకు స్వామి రజనీచరుఁ డొక్కఁడు పెక్కురక్కసుల్
గెలఁకులఁ గొల్వ నొండు పరికింపక మీకడ కేఁగుదేరఁగన్. 236

క. అడ్డము వోయిన మంత్రుల, జడ్డిగములుఁ ద్రుంచె భటులసందడి మాన్పెన్
దొడ్డచలంబున నీ కెదు, రొడ్డి విజృంభించె యవలియొడ్డున నధిపా. 237

తే. పేరు రావణుఁడట యేమొ వీరివారిఁ, గొందఱఁ జయించినాఁ డట యందఱుఁ బలె
మిమ్మును జయించుట కుపక్రమించినాఁడు, మించినాఁ డిప్పు డదె విక్రమించినాఁడు.

మ. అనుమాటల్ వెనుగాడ్పులై నిగిడి రోషాగ్నిన్ బ్రవృద్ధం బొన
ర్చిన ధూమం బన భ్రూకుటిస్ఫురణ మించెన్ దంతఘర్షంబునన్
గనుపించెన్ విపులస్ఫులింగములు దృక్కంజంబులన్ జ్వాలలున్
జనియించెన్ నృపుఁ డంత నన్యబలవన్యాప్లోషసంరంభియై. 239

తే. ఒదవుపరవాహినీరోధ ముజ్జగించి, యిటు వృథావాహినీరోధ మేల చేయ
ననుచు నవరోధకాంతలయళుకు మాన్చి, తటినిరోధంబు వాపి రోధంబు సేరి.

ఉ. భూధవహాళి ధౌతపటముల్ ధరియించి విశేషదివ్యభూ
షాధవళానులేపముల స్రక్కుల మిక్కిలి పెక్కుఁ జెందియున్
గ్రోధము మూర్తిఁ గైకొనినకోపునఁ గాంచనవేష్టనోజ్జ్వలో

త్స్వధగదాధరుం డగుచుఁ జెచ్చెర రావణుమీఁది కేఁగఁగన్. 241

ఆ. ఆసహస్రకరుని సడ్డగించెఁ బ్రహస్తుఁ, డతనితోడ మూఁక లావరించె
ఖరకరాయుధాంశుకలన నమ్మూఁక పెం, జీఁకటులను విరియఁ జేసె నతఁడు.

చ. అలిగి ప్రహస్తుఁ డుద్ధవడి హైహయుపై ముసలంబు వైచినన్
బలువడిఁ దప్పఁ ద్రోచి గదపై కెగ నెత్తి పలాశి నెత్తి సం
చలనము నొంద వ్రేయఁ గులిశప్రహతాచలరాజశృంగమున్
బలె నతఁ డొల్లఁబోయి యిలపైఁ బడియెం జడియ న్నిశాచరుల్. 243

ఆ. వానిపాటుఁ జూచి వడి గలతన మెల్ల, మంటఁ గలియ నున్న మంత్రివర్య
లొకఁడు ననినత్రోవ నొక్కఁడు వోవక, బీఱువోయి పదరి పాఱుటయును. 244

రావణకార్తవీర్యార్జునుల గదాయుద్ధము

శా. మోముల్ జేగుఱుఁజాయ మించ దితిభూమూర్ధన్యుఁ డత్యుగ్రుఁడై
యామూర్ధన్యు నెదిర్చి భూరిగదబాహాగ్రంబునన్ బూసి యు
ద్యామర్షస్పృహ సింహమున్ గదియుసింహంబున్ బలెన్ విక్రమో
ద్దామక్రీడనతత్పరుండు నృపునిన్ దాఁకెన్ సురల్ మేలనన్. 245

వ. ఇత్తెఱంగున నక్కార్తవీర్యదైత్యవర్యు లుదాత్తధైర్యస్థైర్యధుర్యు లయి
యహార్యయుగళంబుడంబున నుత్తుంగమాతంగపుంగవద్వయంబుభంగి నభం
గురప్రళయకాలమార్తాండమండలద్వితయంబు మెండున నుద్దండలయదండధర
ద్వంద్వంబుగండున నఖండకాండప్రచండచండీశ్వరయమళంబుభాతి (విలయ
సమయసమున్నిద్రసముద్రయుగంబు నుద్రేకంబున నొండొరుల నెదుర్కొని
మండలాకృతిం బెఱయ బిఱబిఱ గదాదండంబుల ద్రిప్పుచు మండలభ్రమణం
బులఁ బరిభ్రమించుచు దిట్టతనంబు నెట్టుకొన మండె వెట్టుచు బెట్టుగా వ్రేయు
వ్రేటుల క్రొగ్గినటువలె నుండి మొక్కలంత యోసరించుచు బదులు వ్రేయం గమ
కించుచుఁ దప్పింపుకొనునేర్పునన్ దర్పించి పైపడన్ గుప్పించుచు మర్మంబు
లెఱిఁగి నొప్పించుచు నుప్పరంబున కెగసి యన్యోన్యగదాప్రహారంబుల మేఘ
మాలికలఁ జీలికలు సేయుచు దిగ్గజంబులు మ్రొగ్గ నగ్గలికతో నుర్వికి లం
ఘించుచు నాలీఢాదిపదవిన్యాసంబుల బిత్తరంబుతో నొత్తరించుకొని యొర
యుచు నొకరొకరిన్ జూచుకోపంబు చూపుల నిప్పులు గురియుచు నొండొరుల
నొప్పిదప్పులకు మురియుచుఁ బ్రతిహతులకున్ బాయుచు నప్రతిగతులఁ డాయుచు
నుప్పతిల్లు గొప్పనెత్తురు వరదలఁ దొప్పదోఁగుచు నొండొరులగదాహతు
లాఁగుచు నొడ్డారంబున మడ్డులు వెట్టి యొండు దెసం జూచి యొండు దెస
మసలం గొట్టి బడలికలు పుట్టించుచుఁ గట్టల్కతో మట్టుమీఱి దట్టించుచు
సకలభూతంబులు భయాద్భుతరసోపేతంబు లయి నలుదెసలకున్ బఱవ నార్చుచు

బెట్టిదంపుసాదనపెనఁకువలన్ బేర్చుచు హుంకారంబు లొనర్చుచు సహం
కారంబున నెదుర్చుచు నొల్లంబోయి యొక్కింతతడ వూరక నిల్చుచు నొకళ్లొ
కళ్లఁ బేరుకొని పిల్చుచు నిదిగో వ్రేసెదఁ దప్పించుకొనుమని హెచ్చరించుచు
నితరేతర బాహుబలంబులు సహింపక మచ్చరించుచుఁ బెల్లుమించినన్ బొగడుచుఁ
దల్లడించినన్ దెగడుచుఁ గాలసర్పంబులవలె బుసగొట్టుచు నేటిదరిచెట్టులు
నగ్గుసూచంబుగా మెట్టుచు భుజాస్ఫాలనంబు లాచరించుచుఁ గార్చిచ్చుల
హెచ్చునన్ గోచరించుచు ఖేచరులు మెచ్చ గ్రద్దజితనంబులన్ బెద్దతడవు గదా
యుద్ధంబు సేసి రయ్యవసరంబున. 246

తే. అలుక వహియించి కార్తవీర్యార్జునుండు
బాహుగదఁ బూన్చి గర్జించుపంక్తిముఖుని
యుర మొరయ నేయ నది యొప్పె నుఱుముకాల
మేఘమున మించుఁ గనిపించుమించుఁబోలె. 247

క. దనుజుఁడును గార్తవీర్యార్జును నురమున గద మిడుఁగుఱులు సెదరగ వై
చిన నది పర్వతమధ్యంబున నూల్కొనునుజ్జ్వలోల్కపోల్కి వెలింగెన్. 248

వ. ఇవ్విధంబున. 249

ఉ. కొమ్ములగ్రుమ్ములాడుమదఘోరవృషంబులమాడ్కిఁ బోరుచో
నమ్మనుజేంద్రుఁ డుద్ధతి మహాగద వైచినఁ బంక్తికంఠువ
క్షమ్మది తాఁకి త్రుంగె వరశక్తి నడంగక వింటిబెట్టుదూ
రమ్మతఁ డేగి మూర్ఛ యడరన్ బుడమిన్ బడె వీతచేష్టుఁడై. 250

వ. అప్పుడు. 251

చ. గరుడుఁడు సర్పమున్ బొదువుకైవడి రావణు రాజు డాసి మున్
హరి బలిఁ గట్టివైచినక్రియన్ బటుపాశనిబద్ధుఁ జేసి ఖే
చరులు సుమావళుల్ గురియ సైన్యముతోఁ బురి కేఁగె నంత న
య్యరదముచుట్టు ముట్టిరి ప్రహస్తముఖాసురరాజసైనికుల్. 252

చ. ఇటువలెఁ జుట్టు ముట్టుకొని యెక్కడి కేగెదు రాజ నిల్వు మెం
తటిపని కైనఁ బద్మభవునాలవవాని గ్రహింపఁ గూడునే
తటుకున నితనిన్ విడుము దర్పమునన్ విడవేని నేఁడు నీ
పటుభుజముల్ శరావళుల బ్రద్దలుసేయక రిత్త వోదుమే. 253

మ. అని కాలాభ్రము లభ్రమున్ బొదువున ట్లయ్యర్జునున్ గ్రమ్మి యు
క్కున నొక్కుమ్మడిఁ బ్రాసపట్టిసగదాకుంతాదిశస్త్రంబు లే
సిన నాతం డవి యెల్లఁ జే నొడిసి సుస్మేరాస్యుఁడై వారిమీఁ
దనె వైవన్ గడు నొచ్చి విచ్చి చని రాత్మస్వామి చింతిల్లఁగన్. 254

కార్తవీర్యార్జునుఁడు చెఱఁబెట్టినరావణునిం బులస్త్యుఁడు విడిపించుట

వ. అప్పుడు. 255

సీ. దశకంఠదర్పవేదండకంఠీరవ జయ జయ యని వందిజనులు వొగడ
రోదసీకుహరంబు భేదిల్ల సేనాముఖంబునఁ దూర్యఘోషంబు లెసఁగ
జంభారిమ్రోల నచ్చరలట్లు గణికాంబుజాస్యలు దండలాస్యములు సలుప
ఫలముఖోపాయనంబులు దీవనలు నిచ్చి యెడనెడ బ్రాహ్మణు లెదురుకొనఁగ
తే. నఖిలశృంగారములు మించు నాత్మనగర, మంచితైశ్వర్యమునఁ బ్రవేశించి సౌధ
చారణస్త్రీలు ముత్యాలఁ జల్లుచుండఁ, గొలువునకు నేగె జననాథకుంజరుండు.

తే. ఏఁగి పేరోలగమున దేవేంద్రవిభవ, మెసకమెసఁగంగ వసియించి యెల్లజనులు
వెఱఁగుపడ దైత్యుఁ జెఱసాల వేయఁబంచి, యంతిపురము ప్రవేశించె నర్జునుండు.

క. చెట్టతనంబునఁ బెద్దలఁ, బట్టి చెఱన్ బట్టినట్టిపాపంబున నే
డిట్టైతి వనుచుఁ బౌరులు, దిట్టఁగఁ జెఱ నుండె నతఁడు దీనముఖుండై. 258

ఉ. అంతటఁ గొన్నినాళ్లకు వియచ్చరు లంతయుఁ దెల్పఁ బౌత్త్రు వృ
త్తాంతము లెస్సగా విని దయాబ్ధి పులస్త్యమహర్షి సంయముల్
చెంతల గొల్వ నింద్రుపురి జేరెడుధాతవిధాన నద్ధరా
కాంతుని వీటి కేఁగి కుతుకం బెసఁగన్ మొగసాల నిల్చినన్. 259

మ. జనపాలున్ గని ద్వారపాలురు పులస్త్యబ్రహ్మ విచ్చేసినాఁ
డని విజ్ఞాపనమాచరించుటయు నర్ఘ్యాద్యంచితద్రవ్యమున్
గొని ప్రాగ్భాగమునన్ బురోధ నడువన్ గోధిస్ఫురత్పాణియై
చని యమ్మానికి మ్రొక్కి యర్హ్వగతిఁ బూజల్ సేసి భక్త్యున్నతిన్. 260

శా. ధన్యంమన్యహృదబ్జుఁడై యతని నాస్థానస్థలిన్ జేర్చి మూ
ర్ధన్యుం డున్నతభద్రపీఠి నిడి యుద్యత్ప్రీతిమన్ బల్కె స
మ్మాన్యం బయ్యెఁ గులంబు శ్రీలు వెలసెన్ మాహిష్మతిన్ నేనసా
మాన్యప్రాభవశాలి నైతి మిము సంభావించి సేవించుటన్. 261

ఉ. వీడ తనూభవుల్ హితులు వీర లమాత్యులు వీరు బాంధవుల్
వీరలు వీరు సద్భటులు వీరలు నేనును నిక్కనంబుగా
మీరు గణించినట్టి పను లెల్లను జేసెద మానతియ్యరే
కారుణికాగ్రగణ్య యని గౌరవ మేర్పడ విన్నవించినన్. 262

పంచచామరము—

పులస్త్యమౌని సంతసిల్లి భూతలేంద్రుతో ననున్
బలీ నృపాల నీప్రియోక్తి భక్తియుక్తిశక్తియున్
దలంప నద్భుతంబు లత్యుదాత్తభోగసంపదన్
నిలింప నాథు మించి తీవు నీకు సామ్య మున్నదే. 263

చ. బలియునిఁ బంక్తికంధరునిఁ బట్టితి వం చొకవింత గాఁగ నీ
బలము నుతింప నేల ప్రతిపక్షుఁడు నిన్నదిరించి క్రమ్మఱన్
గలఁడె మహానుభావుఁడ వగణ్యగుణాకర మాకుఁ బ్రీతిగాఁ
బలికినయట్ల యిద్దనుజు బంధవిముక్తునిఁ జేయవే యనన్. 264

క. జనపతి యలరుచు మీపని, చినపని గావించుకంటె శ్రేయము గలదే
యని దశముఖు విడిచి ప్రియం, బున నాతని సత్కరించె భూషాదులచేన్. 265

ఆ. సత్కరించి వహ్నిసాక్షికం బగుసఖ్య, మాచరించి పనుపు నధిపు నెంచి
పౌత్త్రు నూఱడించి పరమేష్ఠిసుతుఁ డేఁగెఁ, బంక్తిముఖుఁడు నెలవుఁ బాసి చనియె.

క. చని తనసేనల మున్నిడు, కొని యెదురుగ వచ్చుమంత్రికోటుల హర్షం
బున నాదరించి వారి, చ్చినపుష్పక మెక్కి దనుజశేఖరుఁ డవలన్. 267

వాలి రావణాసురునిగర్వం బణంచి పరిభవించుట

శా. దుష్కాంతుల్ వివరింపఁ గ్రమ్మఱ మదాంధుం డై నృపాలచ్ఛటా
శుష్కారణ్యదవాగ్ని తేజమున నెచ్చో నైనఁ గ్రీడించుచున్
నిష్కారుణ్యమునన్ ధరాజనుల హానిన్ జెందఁగాఁ జేయుచున్
గిష్కింధాపురి కొక్కనాఁడు వడి నేఁగెన్ వాలితోఁ బోరఁగన్. 268

క. ఏఁగి పురద్వారము బి, ట్టాఁగి నిలిచి తన్నుఁ జూడ నడవిదిరుగుడుల్
మూఁగికొన గగన మట్టిటు, గాఁగ లయాంబుదములీల గర్జించుటయున్. 269

క. ఆరవము విని యశోజిత, తారుఁడు తారుఁ డరుదెంచి దశముఖుఁ గని యే
మీ రావణ నీవచ్చిన, కారణ మెఱిఁగింపు మనిన గర్వమున ననున్, 270

క. వాలి మహాభుజవిక్రమ, శాలి యనఁగ నాలకించి సమరక్రీడా
భీలతఁ జూపఁగ వచ్చితి, నాలస్యం బేల పనుపు మగచర యతనిన్. 271

ఉ. నా విని తారుఁ డిట్లనియె నవ్వుచు నీ విది యేమి వెఱ్ఱి వే
రావణ వాలితోడ బవరం బొనరింపఁగ నెవ్వఁ డోపుఁ బో
మ్మీవొకరుండ వేల పరమేశ్వరుఁ డైన నెదిర్చి నిల్వ లేఁ
డీవల నాతనిన్ దొడరి యెందఱు నొచ్చిరొ నీ వెఱుంగుదే. 272

చ. వనచరనాథునిన్ దొడర వచ్చినశూరులకీకసావళుల్
గను మదె ప్రోవులై గిరులకైవడి నున్నవి దానవేంద్ర నీ
వును జనువాలిమీఁద నసువుల్ భరియింపఁగ నొల్ల వేని నా
యన యిపు డేఁగినాఁడు చతురబ్ధుల స్నానము లాచరింపఁగన్. 273

వ. అని యంత నిలువక. 274

సీ. మహితాహిగుణవేష్ట్యమానోరుమంథానమహీధరోన్మథితోర్మిమాలి వాలి
మాయావిముఖదైత్యమాయాననప్లోష కేళిభీషణదావకేలి వాలి
పదఘట్టనోద్భగ్న పాదపాదపశిలోజ్జ్వలశృంగశతసప్తశైలి వాలి

వజ్రధ్వజోత్తాలవాలవిక్షేపణోత్పాతితనక్షత్రపాలి వాలి

ఆ. యట్టివాలిఁ దొడరి యమృతంబు ద్రావిన,వారికైన బ్రతుకవచ్చునోటు
కాదు కూడ దతనికయ్యంబు వలెనన్న, నిపుడె దక్షిణాబ్ధి కేఁగు మనిన. 275

క. అత్తారుని భర్జించుచుఁ, గ్రొత్తలు వింటిమి మతేమి క్రోతులపురి నం
చెత్తినమదమున దనుజకు,లోత్తముఁ డాక్షణమ దక్షిణోదధి కరిగెన్. 276

వ. అరిగి తత్ప్రదేశంబున. 277

సీ. అతులితానంతపథాక్రాంతిశాంతుఁడై ధరణికి దిగినమార్తాండుఁ డనఁగ
నుత్తరదిశ మాని యొకవేడుకకు దక్షిణాశఁ జేరినకాంచనాద్రి యనఁగ
ననవరతాంబుపానాయాసమునఁ దీర మాశ్రయించినబాడబాగ్ని యనఁగఁ
గరచరణాదికాంగములతోఁ గపిరూపు దాల్చినయామ్యప్రతాప మనఁగ

తే. దుర్నిరీక్ష్యప్రభావంబుతో నుదగ్ర,తనువుతోఁగీలికాభీలతరలవాల
వల్లితోఁ శోణముఖవైభవంబుతో న,వంధ్యగతి సంధ్యవార్చునవ్వాలిఁ గనియె.

మ. కని శాఖామృగమాత్రుఁ గాఁ దలఁచి రక్షస్స్వామి యయ్యింద్రపు
త్రుని వంచించి గ్రహింప నెంచి తమమంత్రుల్ దవ్వునన్ నిల్చి క
న్గొనఁ దా నొక్కఁడ పుష్పకంబు డిగి యందున్ సద్దు గాకుండ నొ
య్యన పాదంబులు వెట్టుచున్ వెనుకయై యంతంత నేతేరఁగన్. 279

చ. పదముల చప్పుడింత చెవిఁ బాటినఁ గన్నులు విచ్చి వాలి గన్
తుదలనె వానిఁ గన్గొని ననుం గపటంబునఁ బొంచి పొంచి ప
ట్టెద నని రావణుండు నిగిడెన్ వడి వీనిభుజాంతరంబునన్
బొదివి చతుఃపయోధులను ముంచెద నంచు జపించు చున్నెడన్. 280

మ. చరణాగ్రంబుల దిన్నగా నడిచి పశ్చాద్భాగమున్ జేరి యా
శరుఁడున్ మస్తము లోరఁ జేసికొని హస్తంబుల్ పయిన్ జాఁచినన్
హరి దంతిన్ గ్రహియించునట్లు ప్రబలుం డవ్వాలి బల్సందిటన్
శిరముల్ ప్రక్కలు బాహుపంక్తు లిటికించెన్ జండసత్త్వంబునన్. 281

ఉ. ప్రక్కలఁ జక్కఁగా నదిమి బాహుశిరఃప్రముఖాఖిలాంగముల్
మిక్కిలి నొవ్వఁ జేయుచు నమేయబలంబున వాలి మింటికిన్
గ్రక్కున నుద్గమించెఁ దనుఁ గన్గొని వేల్పులు సిద్ధసాధ్యు ల
మ్మక్క మహాపరాక్రమసమగ్రుఁ డితం డని సంస్తుతింపఁగన్. 282

ఆ. ఇటుల యుద్గమించి యింద్రుని గారాబు,పట్టి చిలువ నొడిసి పట్టి పఱచు
పన్నగారిదారిఁ బశ్చిమాంబుధిఁ జేర, నరుగ నంతలోన నద్భుతముగ. 283

శా. ఆకాశంబున కడ్డ మేఁగిన ప్రహస్తాద్యాసురామాత్యు ల
ప్పాకారిప్రియసూతివాలజనితప్రత్యగ్రఘుంఘుంఘానిలో
ద్రేకం బోర్వక తూలికల్ చెదరురీతిన్ మేఘముల్ విచ్చి చీ

కాకై పోయెడుజోక నొచ్చి చని రాకంపింప సర్వాంగముల్. 284

క. తోయదముఁ గొనిపోయెడు, వాయువువలె వాలి పంక్తివదను నిటుల కొం
పోయి వడిఁ బశ్చిమాంబుధి, తోయముల మునింగి నియమధూర్వహమతి యై.

చ. ఇరవుగ నిప్పయోధి ఘటియింపఁ గలట్టిక్రియల్ ఘటించి యు
త్తరజలరాశికిన్ జని యథావిధిఁ దానముఁ జేసి పంక్తికం
ధరు నలవోక సందిటను దాల్చియె తూరుపువార్ధిఁ జేరి యం
దురుజపనిష్ఠ లెల్ల నియమోన్నతిఁ దీర్చి యివ్విధంబునన్. 286

మ. కృతకృత్యుం డయి యింద్రనందనుఁడు కిష్కింధాపురోద్యానప
ద్ధతిఁ బ్రాపించి భుజాంతరంబున మహాదైన్యంబుతో వ్రేలున
ద్దితిజాధీశ్వరు నందు వైచి నగుచున్ దేవారి హా యెప్పు డం
చతనిన్ జూడనివానియట్లడుగ వీతాహంక్రియాద్ధత్యుఁ డై. 287

మ. తను వాద్యంతము చెమ్మరింప భయగాద్గద్యంబు గాన్పింపఁగ
న్గానలన్ బాష్పము లావరింప వడఁకున్ దోడ్తోఁ బ్రవర్తింప బో
రున నిట్టూర్పులు మించ లేచి దనుజేంద్రుం డంతఁ దాఁ గ్రమ్మఱన్
జననం బొందితి నంచు నెంచి యనియెన్ శాఖామృగస్వామితోన్. 288

చ. బలియుఁడ వైన నీవె నిరపాయదయాఢ్యుఁడ వైన నీవె ని
శ్చలమతి వైన నీవె విలసద్ధృతి వైనను నీవె కాక నీ
కిల నొకరుండు సాటి యగునే సురనాథకుమార నిన్ను నేఁ
డెలిసితి నేఁడు నిక్కముగఁ దీఱె మదీయమదాంధకారముల్. 289

శా. కైలాసం బగలించి శంకరునిచే ఖడ్గంబుఁ బ్రాపించిది
క్పాలశ్రేణిఁ గలంచి మించిన ననున్ గక్షాంతరాళంబునన్
దూలంబున్ బలె వ్రేలఁ జేసితివి నీదోశ్శక్తిమ్రోలన్ వృథా
స్థూలం బయ్యె మదీయశౌర్య మఖిలస్తుత్యప్రభావోదయా. 290

చ. గరుడురయంబు మానసము గాంచినవేగము చండమారుత
త్వరయు భవజ్జవంబున లవంబున కైనను సాటి వచ్చునే
సురగరుడోరగాసురులఁ జూచితి నీదృశ బాహువిక్రమ
స్ఫురణ లెఱుంగ సత్య మిది స్తోత్రము గాదు ప్లవంగపుంగవా. 291

ఉ. అన్నవు నీవు భానుసుతు నట్టుల నేనును గూర్మితమ్ముఁడన్
నన్నుఁ గృపన్ గనుంగొనుము సాధన మంతయు నీది నీవు నే
నెన్నఁటికిట్లు చెల్మి వహియించియె యుండుద మన్న నింద్రజుం
డన్నరభోజితోడ నవు డట్టులె సఖ్యము సేసి వేడుకన్. 292

క. బాంధవుఁ డగునాతనిఁ గిష్కింధకుఁ, దోడుకొని పోయి స్నేహమున జగ
ద్బాంధవసుతుఁ జూచినగతి, బంధురమతిఁ జూచి మిగుల బహుమతిసేసెన్.

క. మాసముదారత నచ్చట, మాసము వసియించి మిగుల మైత్రియుఁ గని య
య్యాసురపతి సత్కృతుఁడై, యాసురపతిసుతుఁడు వనుప నరిగె నృపాలా. 294

వ. అని పలికి యగస్త్యమునిశేఖరుండు రఘువీరశేఖరునకు వెండియు నిట్లనియె.

మ. చతురంభోధుల దైత్యు ముంచిన భుజాశౌర్యాఢ్యు నవ్వాలిన్
హతుఁ గావించితి వొక్కతూపున సమిత్రామాత్యపుత్త్రంబుగాఁ
గృతవీర్యాత్మజుఁ ద్రుంచివైచిన త్రిలోకీవర్ణితున్ రేణుకా
సుతు నిర్జించితి వెంచ శక్యమె నినున్ క్షోణీసుతాధీశ్వరా. 296

క. విను మవ్వాలికథ యిటువలె, దనుజుఁడు కిష్కింధ వెడలి తనసహజమదం
బున మునుపటివలె నృపతుల, నని నెంచుచు ధరఁ జరించు నక్కాలమునన్.

## రావణునకు నారదసందర్శనం బగుట

శా. సర్వాంగీణవిభూతికాంతులు శరచ్చంద్రస్ఫురచ్చంద్రికా
నిర్వాహంబుఁ గనన్ జటల్ భుజగమాణిక్యచ్ఛటల్ నాటఁగా
సర్వజ్ఞత్వము సార్వకాలము రహించన్ మించు దేవర్షి యం
తర్వాణిస్తవనార్హకీర్తి యెదురైనన్ దైత్యుఁ డుప్పొంగుచున్. 298

ఉ. దండము వెట్టి సేమమె కదా యనిమేషపరియ్యవారి కెం
దుం డిపు డెందుఁ బోయెదరొ యోజన లేమి విశేష మెద్ది బ్ర
హ్మాండమునందు మీకుఁ దెలియన్ బడకుండునె సర్వమున్ ధరా
మండలనాథులన్ గెలుచు మద్భుజశౌర్యము మెచ్చవచ్చునే. 299

వ. అనినఁ జతురవచనరచనావిశారదుండగు నారదుండు నీరదపథంబునన్ జను
పుష్పకంబు నిలుపు మని నియమించి యతనితో నిట్లనియె. 300

మ. యశమున్ దేజము బాంధవప్రియము ధైర్యస్థైర్యముల్ గన్న నీ
కుశలం బేదలఁతున్ శుభంబె కద నీకున్ రాక్షసాధీశ యీ
దృశశౌర్యాఢ్యుఁడ వీవు మానవులతో నేవేళఁ బోరాడఁ గాఁ
గృశతన్ బొందె మదీయకౌతుక మ దేమీ యన్న వాక్రుచ్చెదన్. 301

క. పిచ్చుక పయి బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతెకదా
మచ్చరము మనుజతతిపైఁ, దెచ్చుక పాలియింప నీవు దిరుగుటలెల్లన్. 302

మ. అకటా విష్ణుని గెల్చుటో జమునిపాశశక్తి మాయించుటో
సకలాదిత్యవినాశముల్ సలుపుటో శక్రున్ నివారించుటో
వికటవ్యాధిజరావికారకృశులన్ విభ్రాంతులన్ మర్త్యులన్
బ్రకటక్రోధమునన్ జయించిన వికారం బందరే మాదృశుల్. 303

క. సామజరాజము దోమల, తో మార్కొని పోరునటుల తోఁచెన్ మనుజ
స్తోమముతోఁ దార్కొని సం, గ్రామము నీ వాచరింపఁగా గనుఁగొన్నన్. 304

మ. వర మజ్జాసను వేఁడినప్పుడును దేవశ్రేణులన్ గాని నే
నరులన్ వానరులన్ గణింప ననవే నాయంబె భీతాత్ములన్
బరివేధించుట మార్కొనన్ వలసినన్ బాతాళవాసుల్ ఫణా
ధరులున్ దైత్యులు లేరె వా రసదులే దైతేయవంశాగ్రణీ. 305

వ. అని మనుజహితార్థియై రావణునకు రసాతల జయోద్యోగంబునందు బుద్ధి
పుట్టించి యన్నలువపట్టి యంత నిలువక. 306

తే. ఇది హితంబుగ సూహించి యింక మనుజ, కోటిపై ధాటి చూపక నేఁటినుండి
చనుము పాతాళవాసుల సంహరింప, నీగెలుపు గెల్పు గాదు దైత్యేంద్రయనిన.

ఉ. నారదుమోముఁ జూచి యెలనవ్వునఁ బంక్తిముఖాసురుం డనున్
మీరు మనుష్యకోటులకు మేలు దలంచితి రేమొ మంచిదే
శూరులు భీరులన్ దొడరి శూరతఁ జూపిన శూరుఁ డందురే
భూరిగుణాభిరామ తగుబుద్ధి గణించిన మాన వచ్చునే. 308

మ. బలిసద్మంబున కేఁగి తొల్త బలిశుంభద్గర్వమున్ మాన్చి దై
త్యులయౌద్ధత్య మడంచి భోగివరులన్ దూలించి వత్తున్ రసా
తలయాత్రానుమతిప్రదానము మునీంద్రా యిచ్చితే యన్న నం
దుల కానందముఁ బొంది పద్మజునిపుత్త్రుం డిట్లనున్ గ్రమ్మఱన్. 309

మ. అల వృహ్వాంగ రసాతలాధిపుల శాహాటోపముల్ మాన్పఁగా
వల తేనిన్ దొలుతొల్త సంయమని త్రోవన్ బొమ్ము నీ రాక కు
మ్మలికన్ జెంది జముండు మార్కొనిన సమ్మర్దంబుగా నచ్చటన్
గలుగున్ బోరతనిన్ జయించి యశమున్ గైకొమ్ము నా మెచ్చుచున్. 310

ఉ. దేవమునీంద్ర మంచియుపదేశ మొసంగితి రంతకాది ది
గ్దేవతలన్ దురంబునను గెల్వఁ బ్రతిజ్ఞ యొనర్చినాఁడ ము
న్నావిధ ముచ్చరింప హిత మయ్యె జయింతు నవశ్య మాతనిన్
దీవన లిచ్చి మీ రిపు డతిప్రమదంబున వీడుకొల్పుటన్. 311

క. పనివినియెద నని నారద,మునికిన్ వినయోక్తియుక్తి మ్రొక్కి దశాస్యుం
డనుమతిఁ గొని జము గెల్వఁగఁ, జనియెన్ బలకలకలంబు చదలన్ బొదలన్.

నారదుండు యమునిం జూడఁ బోవుట

ఉ. నారదుఁ డంత నిట్లని మనంబున నెంచె దశాస్యుఁ డెంతయున్
గ్రూరుఁడు మూఁడులోకములకున్ వెత సేయఁగ బూనుకొన్నవాఁ
డీరస మెక్కుడంతకుఁడు నింతట నంతట రిత్త వోవునే
వీరలు పోరు పోరు గని వేడ్క యొనర్చెదఁ గన్నుదోయికిన్. 313

చ. యమునకుఁ దానె పెద్దయముఁడై భయ మొందక రావణుండు సం
యమనికిఁ బోయె నింక నెటులైనను మంచిది మర్త్యకోటిబ

స్నము గడతేఱె నింతటఁ గనాఁడిలి వేల్పులమీఁదఁ జూపువి
క్రమ మది మేలు గా దయినఁ గన్గొని మెచ్చక పోవ వచ్చునే. 314

ఉ. ఇచ్చట దాఁ వసింపఁ దగ దిప్పుడె యాతని కివ్విధంబు వా
క్రుచ్చెద నంచు నారదుఁడు గొబ్బున సంయమనీమహాపురిన్
జొచ్చి చిరత్న రత్నమయశోభితదివ్యసభాంతరంబులో
నొచ్చెము లేనికల్మిఁ గొలు వున్నజమున్ గని చేరఁ బోవఁగన్. 315

సీ. కణ్వగార్గ్యమార్కండేయ లోకవంక సముచితస్మృతి వివాదములు సలుపఁ
దమరు దెచ్చిన ప్రాణితతుల ముందట నుంచి యెడనెడఁ గింకరుల్ హెచ్చరింప
నెవ్వరెవ్వరి నొంతు మెందెందుఁ బోదు మంచాకృతుల్ గనియామయములువ
గవితెలో నున్నప్రకారానఁ బ్రజపాపపుణ్యముల్ చిత్రగుప్తుండు దెలుప [లుకఁ

తే. ధర్మపీఠంబునను గాలదండమృత్యు
సహితుఁ డై నింపుకొలు వుండి సకలలోక
వంద్యుఁ డాతండు సురమౌని వచ్చురాకఁ
గాంచి యెదు రేఁగి మ్రొక్కి యర్ఘ్యం బొసంగి. 316

ఆ. ఉన్నతాసనమున నునిచి పూజలుసేసి, కుశల మడిగి ప్రియముఁ గూర్చి యిచట
కేఁగుదేర నేమి హేతువు మునినాథ, తెలుప వలయుననినఁ బలికె నతఁడు. 317

మ. నిఖిలస్తుత్యభుజప్రతాపనిధివౌ నీమీఁద దండెత్తి వ
చ్చె ఖలుం డైన దశాననుం డతనితో సిద్ధంబు యుద్ధం బగున్
శిఖరిన్ మేషము దాఁకి కుంభగతి నీచే వందురన్ సంగరో
న్ముఖభావంబు వహింపు మన్న నగి యంభోజాప్తపుత్త్రుం డనున్. 318

ఉ. మేలు మఱేమి మాపురముమీఁదికి రావణుఁ డేఁగుదెంచినన్
జాలు భవత్ప్రసాదమున శౌర్యగుణంబు ఫలింపఁ జేసెదన్
గాలుని కాలదండ మెఱుఁగండొకొ మృత్యువుఁ జెంద వానికిన్
గాలము దగ్గఱించె నది గానియెడన్ మది నిట్టు లెంచునే. 319

క. మంచిది రాఁ సం డంతయుఁ, గాంచెద రీమునులు మీరు గర్వోక్తులు భా
షించఁ బనియేమి యంచు స,మంచితధైర్యమున నుండె నట దశముఖుఁడున్.

రావణుఁడు సంయమనిపై దండెత్తుట

చ. హాలహాలతీక్ష్ణభంగులు లయాంబుధరప్రతిబింబరూపముల్
ప్రళయసముద్రఘోషములు బాడబకీలల నేలు తేజముల్
వెలయ మహోగ్రరౌద్రములు వింతలుఁ గాఁ దగువీరరాక్షసుల్
గొలువఁ బరేతరాజపురగోపుర ముద్ధతిఁ జూచి వేడుకన్. 321

ఉ. ఆయతదివ్యపుష్పకమహాప్రభ లానిరయాంధకారమున్
ద్రోయ దశాస్యుఁ డయ్యెడఁ గనుంగొనియెన్ భటకోటి గత్తులన్

గోయఁగ వ్రేయఁగాఁ గళలఁ గొట్టఁగఁ దిట్టగ బెట్టు వేదనల్
సేయఁగ జిక్కి స్రుక్కి వెతఁ జేష్టలు దక్కి తపించు పేర్తలన్. 322

సీ. ఉక్కుకోఱల కుక్క లొక్కింతమర్మముల్ పట్టి తీయఁగ మొఱల్ వెట్టువారి
గొప్పనిప్పులయేటఁ గూల్చి పోనీయక పొదివి యమ్ముల నేయఁ బొరలువారి
నెత్తురు చీము నిండినకూపముల వ్రాలి పురుగు లంగముఁ దొల్వఁ బొగులువారి
గత్తులఁ గోసినకాయముల్ క్షారవాహినుల ముంపఁగ బెట్టు పనవువారి

తే. బిట్టుగాలిన పెనములఁ బెట్టి వేఁప, మిట్టిపడి యట్టె మూర్ఛిల్లునట్టివారిఁ
దప్తతైలకటాహపాతమున శోక, తప్తు లగువారిఁ జూచె నద్దశముఖుండు. 323

సీ. పక్షపాతులుఁ గూటసాక్షులు నన్నృతోక్తిపరులు రౌరవబాధ పడెడువిధము
కులహంతలును భ్రూణఘ్నులు నుచ్ఛ్వాసనిరోధకంబునఁ బడి రోఁజువిధము
బ్రహ్మహంతయు సురాపాని స్వర్ణస్తేయి సూకరంబునఁ బడి స్రుక్కువిధము
స్వగురుతల్పగుడును స్వసృగామి నృపహంత తప్తకుంభికఁ బడి తలఁకువిధము

తే. కూఁతునుం గోడలిని బట్టుకొన్న చెడుగు
లురు మహాజ్వాల వ్రాలి బిట్టొఱలువిధము
దగనిమగువలఁ గవయుపాతకులు లవన
యాతనలఁ గూలువిధ మతఁడచటఁ జూచె. 324

సీ. భృతికి వేదంబు సెప్పెడి దూబ వేదనిందకుఁడు విమోహపాతంబు గనుట
నతిథుల వృద్ధుల నరయ కన్నముఁ దిన్న పాపకర్ముఁడు కృమిభక్షి యగుటఁ
గ్రతువు సేయఁగ నాసకతన నసద్గ్రాహి యగువాఁ డధోముఖుఁడై యొఱలుట
బ్రాహ్మణుం డయ్యు బేరము లాడుదుర్జాతి యంధకూపంబున నవశుఁ డగుటఁ

తే. బర్వగామియు గృహదాహి బంధురోధి
వైతరణిఁ గూలి కాలుట వనము నఱికి
వైచినదురాత్ముఁ డసిపత్త్ర వనిఁ దొరఁగుటఁ
జూచి దశకంధరుఁడు దల లూఁచి మఱియు. 325

సీ. నవరత్నమయభూషణములఁ బూనినవారి దివ్యయానము లెక్కి తిరుగువారి
వికచమందారమాలికలు చుట్టినవారిఁ దెలిగొడుగులనీడ నెలయువారి
మృగమదశ్రీగంధమిళితాంగు లగువారి వీణాదిగానముల్ వినెడివారి
నచ్చరల్ గొలువఁ గొల్వై చెల్వుగనువారి మేలిమచ్చులమీఁద మెలఁగువారిఁ

తే. జంద్రు సౌమ్యంబు తపను తేజంబు మరుని, చెలువ మింద్రునిభోగంబు శివుని విభవ
మూని భద్రాసనస్థులై యున్నవారి, ధార్మికులఁ జూచె నొకవంక దశముఖుండు.

ఆ. చూచి నేను మొదటఁ జూచినవారి క, య్యెడ లొనర్చి వీరి కధికసౌఖ్య
యుక్తి మెలఁగఁ జేసె నోహో జముఁడు పక్ష, పాతియనుచుఁ బలికి పంక్తిముఖుఁడు.

చ. పురుషుఁడు కర్తయే దురితముల్ సుకృతంబు నొనర్పఁ గర్త యొ

క్రూరుఁ డది నీవు సేయు మనఁగా గద కర్తకుఁ డౌ స్వతంత్రతా
విరహితులన్ వృథా పరిభవించెద రీఖలు లంచు యామ్యకిం
కరుల నదల్చి రావణుఁడు గాఢకృపన్ విడిపించెఁ బ్రేతలన్. 328

క. భయపటునిరయస్థులఁ గని, దయ యనుపే రెఱుఁగనట్టి దశకంఠునకే
దయ పుట్టె నన్న వారల, దయినవిపద్దశఁ దలంప నలవియె యధిపా. 329

రావణుఁడు యమునిభటులఁ బరిభవించుట

ఆ. ఇటుల నిరయగతుల నెల్లవిముక్తులఁ, జేసి వారు హాయి సెంది పొగడ
విక్రమింపఁ గడఁగువింశతిభుజుఁ జూచి, శమనభటులు నీరసమునఁ గెరలి .330

మ. పరిఘాసిక్షురికాపరశ్వధగదాప్రాసాదినానాయుధో
త్కరముల్ పూని దశాస్యపుష్పకముమీఁదన్ బెల్లు గావించి హుం
కరణంబుల్ కఠినాట్టహాసములు టంకారధ్వనుల్ మీఱ భీ
కరులై యొక్కటఁ జుట్టు ముట్టుకొని మార్గంబున్ నిరోధించినన్. 331

మ. దనుజాధీశుని మంత్రు లజ్జమునిభృత్యశ్రేష్ఠులన్ బిట్టు నూ
ర్కొని తత్సాధనముల్ దళించుటయు సక్రోధాత్ములై శూలముల్
గొని వారున్ బ్రతిపక్షసైనికులవక్షోదేశముల్ గ్రుమ్మి యా
ర్చిన నీలాచలనిర్ఝరంబులనఁ బాఱెన్ గ్రొత్తపెన్నెత్తురుల్. 332

క. నెత్తుట జొత్తిల్లియుఁ బలు, మొత్తము లై రాక్షసులు జమునిభృత్యులకున్
జిత్తమ్ముల నుత్తలమున్, దత్తఱమును హత్తుకొన రణంబులు సేయన్. 333

చ. సమముగఁ బోరునద్దనుజసైనికులన్ దెరలించి కింకరో
త్తములు పయోదముల్ సలిలధారలఁ గాటుకకొండఁ గప్పుచం
దమున దశాస్యుమేను శరధారలఁ గప్పిన ఫుల్లకింశుక
క్రమమున రక్తసిక్తుఁ డయి క్రౌర్యము శౌర్యము ధైర్యమున్ దగన్. 334

చ. ఇరువదిచేతులన్ వివిధహేతితతుల్ గొని యొక్క పెట్టు కిం
కరులపయిన్ నిగిడ్చినఁ గకావికలై రొకకొంద ఱందు నొ
చ్చిరి యొకకొంద ఱంత హతశేషులు క్రమ్మర డాసి పంక్తికం
ధరుమెయి ముంచి రస్త్రములఁ దమ్మతఁ డద్భుత మంది చూడఁగన్. 335

క. ఇక్కైవడి రక్కసునకు, వెక్కసమునఁ దొడరు జమునివీరభటులతో
నుక్కున మార్కొని పోరఁగ, నొక్కరుఁడున్ గలుఁగఁ డసురయోధులలోనన్.

ఉ. అప్పుడు రావణాసురుఁడు యామ్యభటాస్త్రపరంపరల్ దనున్
గప్పినఁ గంకటం బవిసి గాత్రము ఛేదిల నొచ్చి కన్నులన్
నిప్పులు కుప్పలై తొరఁగ నేలకు డిగ్గి తదీయశౌర్యముల్
దెప్పర మైన సైఁపక వడిన్ విలు పూని గుణంబు దీటుచున్. 337

మ. తపనాదిగ్రహముల్ కదశ్వగతిఁ జెందన్ వేలుపుంబెద్ద మి

ట్టిపడఁ భోగివరుండు డీలుపడ దంష్ట్రిస్వామియుఁ ద్రెళ్ల స
ప్తపయోధుల్ గలఁగఁ గులాద్రులు చలింపఁ నాకుల్ దుల్లఁ బా
శుపతాస్త్రం బరివోసి యంతకభటుల్ స్రుక్కఁ బ్రయోగించినన్. 338

మ. బహుశక్తుల్ బహుతోమరంబులు బహుప్రాసాదిశస్త్రంబు ల
స్మహనీయాస్త్రమునన్ జనించి పొగలున్ మంటల్ సెలంగన్ మహా
గహనంబున్ దహియించుదావశిఖరేఖన్ మిత్రభూభృత్యులన్
దహియించెన్ నిమిషంబులో భువన మత్యాశ్చర్యమున్ బొందఁగన్. 339

తే. ఇటుల యమభటకోటుల నే పడంచి
చటుల మగు తచ్ఛరం బుపసంహరించి
పురము లేర్చినఫాలాక్షుఁ బోలి యట్ట
హాస మొనరించె నతఁడు సంయమని బెదర. 340

ఉ. ఇంతయుఁ జూచుచున్న భటు లేఁగి కృతాంతునితోఁ బరాకు దు
ర్దాంతపరాక్రమక్రమధురంధరుఁ డద్దశకంధరుండు నేఁ
డెంతయు మించి పాతకుల నెల్ల విముక్తులఁ జేసి యుద్ధవి
భ్రాంతులు గానికింకరులఁ బాశుపతంబునఁ ద్రుంచినాఁ డనన్. 341

క. కటతటు లదరఁ బటుభ్రూ, కుటి నిటలస్థలి నటింప గొప్పమిడుఁగుఱుల్
చిటచిటఁ గన్నులఁ జెదరఁగ, గిటగిట రదనములు బెట్టు గీటుకొని క్రుధన్. 342

క. క్రూరుండై శమనుఁ డుఱక, తేరకు మద్వీరభటులఁ దెగటార్చిన య
వ్వైరి నిఁకన్ దెగఁ జూచెద, సారథి మనరథముఁ దెమ్ము చయ్యన ననఁగన్.

యముఁడు రావణునిపై యుద్ధమునకుఁ బోవుట

క. తోరపులత్తుకచాయల, వారువములు గట్టి మహిషపరకేతువు సె
ల్వార సమకట్టి తేరా, సారథి గొని తేర నెక్క సంరంభమునన్. 344

సీ. క్రోధపావకుఁ డుండుకుండంబు లన నేత్రగోళముల్ మంటలఁ గ్రుమ్మరింపఁ
గులిశంబుచతురాకృతులఁ గాంచె నా మించుదంష్ట్రలఁ గలిసి వక్త్రంబు వెలుఁగ
ద్వాదశద్వాదశాత్మకతేజ మొకటైనగతి దుర్నిరీక్ష్యప్రకాశ మెసఁగఁ
బ్రళయకాలాభీలపాథోధరములీలఁ దాళమహోత్తాలతనువు గ్రాలఁ

తే. గాలదండంబు పాశంబుఁ గాలమృత్యు
వగ్నిమయముద్గరముఁ దక్కునాయుధములు
మూర్తులు ధరించి నిజరథంబున వెలుంగ
దశముఖునిమీఁది కరుదెంచె దండధరుఁడు. 345

వ. అప్పుడు. 346

సీ. ప్రళయార్కబింబంబుపగిది భూరిప్రభారాజితం బగు దివ్యరథముఁ జూచి
సంవర్తసమయప్రచండానలజ్వాలలం బూను కాలదండంబుఁ జూచి
కాలపాశంబు ముద్గరముఁ గైకొని ప్రేలఁ దులకించు కాలమృత్యువును జూచి

కల్పాంతభైరవక్రౌర్యంబు కాలంబునం దెచూపఁగఁ బూనుయమునిఁ జూచి
తే. యతనియాకారమును జూచి యదరి బెదరి, చెదరి పదములుఁ దడబడ నుదరిపాటు
గదురఁ బదరుచు నెదఁదాల్మి గదల వఱుపఁ, జాల కసురులు పఱచి రిక్ష్వాకుతిలక.

చ. సహచరహుంక్రియోగ్రమహిషప్రవరోత్కటకంఠఘంటికా
బహుళఘణంఘణధ్వనులు పార్శ్వసమాగతకింకరాగ్రణీ
కహకహఘోషముల్ తురగకల్పితహేషలు చండమారుతో
పహతపతాకికాస్ఫుటు లభంగురచక్రరవంబు లొప్పఁగన్. 348

రావణుండు యమునితో యుద్ధము సేయుట

చ. నిమిషములోన నిట్లు రజనీచరముఖ్యునిఁ జేరవచ్చి సం
యమనివిభుండు శూలముసలాసిగదాప్రముఖాయుధంబులొ
క్కమొగి నిగిడ్చి పేరలుక గన్పడ నార్చిన రావణుండు ధై
ర్యమహిమ నోర్చి వజ్రనిశితాశుగకోటుల ముంచె నాతనిన్. 349

శా. ఆయస్త్రాంధతమిస్రమర్కజుఁడు మధ్యాహ్నార్కచండంబునన్
బాయన్ ద్రోచి సహస్రబాణముల నప్పౌలస్త్యు నొప్పించినన్
గాయం బంతయు నెత్తుటన్ దడియ నాకంపించియున్ గిన్కదై
తేయస్వామి పిఱిందికిన్ జనక యుద్వృత్తిన్ జమున్ జూచుచున్. 350

శా. బాహాస్ఫాలన మాచరించి దశచాపజ్యాళి మ్రోయించి శౌ
ర్యాహంకారత మించి హుంకృతుల బ్రహ్మాండంబు భేదించి యు
త్సాహశ్రీ వహియించి తూపు లరిమీఁదన్ నించి నొప్పించి స
ప్తాహోరాత్రము లొక్కచందమునఁ బోరాడెన్ సమానోద్ధతిన్. 351

వ. ఇవ్విధంబున. 352

మ. తనతో జోడయి పోరురాక్షసుని దోర్దర్పంబు సైరింప క
య్యనజుం డేకశరాసుఁ డయ్యుఁ బదివేలేసెన్ శితాస్త్రంబు లం
దున మే నంతయుఁ గ్రంతలైన దశవక్త్రుం డంత మూర్ఛిల్లి యం
తనె తెప్పిర్లి యుగాంతకంతుహరదుర్దాంతక్రుధావంతుఁడై. 353

చ. శమనుఁడ వౌదు వీ నిశితసాయకముల్ శమియింపు మంచు న
య్యమరవిరోధి యాతనిహయంబుల సూతుని నాలుగేడుబా
ణములఁ గలంచి వేయిబలునారసముల్ మెయి నాట నేసి వి
క్రమమున నార్వఁగా జముఁడు గన్నుల మంట గ్రమ్మఁ జూచినన్. 345

చ. దనుజబలంబుపై నడరి తచ్ఛిఖి వేఁడిన కాన నేర్చుచె
న్నున నలిరేఁగి కాల్పఁగఁ గనుంగొని యంతకు మున్నె వచ్చి య
య్యని తెఱఁ గెల్లఁ జూచుచతురాస్యగిరీశసురేశముఖ్యుల
య్యనుపమరోషశక్తి నుతియించిరి మెచ్చిరి రాక్షసేంద్రునిన్. 355

ఉ. అయ్యెడ మృత్యు విట్లనియె నర్కజుతో ననిఁ బూని యేఁడునా

ళ్లమ్యో సురాభియాత్రియెదు రై నిను గొంచుచు నున్నఁ జూడ సి
గ్గమ్యేడు నింత యేల నను నంపు మొకించుకలోన వీని ను
గ్గమ్యేడునట్లు సేసెద సురాసుర లింపును ఖేద మొందఁగన్. 356

మ. నను దాఁటన్ వశమే విధాత కయినన్ నాచేతఁగా శంబసా
దనదై తేయుఁడు జంభపాకమధువృత్రవ్యాఘ్రనాగాసురుల్
కనకాక్షుండు హిరణ్యుఁ డాదియగురక్షశ్శేఖరుల్ ప్రగ్గుటల్
చన దాలస్యము పంపు మన్న జముఁడున్ సైరింపు మం చాత్మలోన్. 357

ఉ. మృత్యువుఁ బంపినన్ దనయహీనబలంబు తొలంగు ముద్గరా
ద్యత్యము పాశమున్ రిపువధం బొనరింపఁగ లేవు సర్వలో
కాత్యయహేతుపావకమహోర్చిరఖండము కాలదండమున్
దైత్యునిమీఁద వైవ నుచితం బిపు డంచుఁ దలంచి శూరతన్. 358

—బ్రహ్మయాజ్ఞచే యముఁడు రావణునితోడియుద్ధంబు మానుకొనుట—

చ. బ్రతుకుదు గాని లేర యిఁకఁ బంక్తిముఖా యని కాలమేఘుని
ప్రతిదమితాశనిస్ఫురణ శాంభవఫాలదృగగ్నికీలకా
ప్రతినిధికీలలన్ భువనపంక్తిఁ గలంచెడుకాలదండ ము
ద్ధతిఁ గొని వైవఁ బూనినఁ బితామహుఁ డడ్డము సొచ్చి యిట్లనున్. 359

చ. నిలునిలు కాలదండ మతినిష్ఠుర మీతనిమీఁద వైవఁగా
వలవదు సంహరింపు మనవద్యవివేకతపం బొనర్చి న
న్నలరఁగఁ జేసి యందున సురాసురకోటి కజయ్యుఁ డై ప్రవ
ర్తిల వర మొందినాఁ డిపుడు ద్రెళ్లిన నావచనంబు దప్పదే. 360

తే. కాలదండం బమోఘంబు గాఁగ నేన
యాచరించితి దీన దశాననుండు
నొచ్చినను నొవ్వకున్న నానొడువు బొంకుఁ
జెందు నటువలెఁ గా కుండఁ జేయు మనిన. 361

శా. ఆవైవస్వతుఁ డబ్జగర్భవచనం బాలించి సద్భక్తితో
దేవా దేవరయాజ్ఞఁ గాదె జగముల్ దీపించు మీపల్కు న
ద్భావం బొందెడు నట్టులైన నసురన్ బ్రాణంబుతోఁ గాచితిన్
లావున్ జేవయుఁ గల్గియున్ విముఖులీలన్ బోయెదన్ వీటికిన్. 362

క. మాటికి మీయానతి జవ, దాఁటక నడచుటయె గెలుపు దనుజునిచే నా
కోటమి గలిగెఁ గదా యన, నేటి కని రథంబుతో నదృశ్యుం డయ్యెన్. 363

శా. కీనాశుం డిటు లేఁగఁ బద్మభవుఁడున్ గీర్వాణసంఘంబుతోఁ
దా నంతర్ధివహించె నారదుఁడు యుద్ధం బెంచుచున్ బోయె లం
కానాథుండును శత్రుఁ డోడె ననుచున్ గౌతూహలం బొంది దై
త్యానీకాన్వితుఁ డై రసాతలజయేచ్ఛాయత్తచిత్తంబునన్. 364

రావణుఁడు భోగవతీపురంబునకుఁ బోవుట

చ. చని చని చూచె ముందట నిశాచరచంద్రుఁడు తోయబాలికా
జనఘనడోలికాయితవిశాలవిలోలతరంగకేళికా
కనదహిచూళికామణిశిఖాసఖవిద్రుమపాలికావినూ
తనరుచిమాలికాపిహితతాపనసారథి ఘోరనీరధిన్. 365

క. కని గాంభీర్యము సంశో,ధన సేయఁగఁ బోవునటుల తద్గర్భముఁ జొ
చ్చి నిశాటవరాళి యాలోఁ, జనియెన్ నిజయానకాంతి సరణి గణింపన్. 366

వ. ఇవ్విధంబునం జని చని. 367

మ. దివిషద్ద్వేషణచక్రవర్తి గనియెన్ దేవేంద్రలోకాగ్రభో
గవతిన్ గైరవపద్మసద్మపరిఖాకారాధికాగాధభో
గవతిన్ రాజితసాలభోగివరశృంగప్రోజ్జ్వలాభోగభో
గవతిన్ వాసుకి యేలుభోగవతి నాగస్త్రైణలీలావతిన్. 368

క. కనుగొని యప్పురిచుట్టును, దనబలములు విడియఁ బంచి దారుణభేరీ
ధ్వను లడరఁ దాను ద్వారం,బున నెలకొని యనికి భుజగముఖ్యులఁ బిలువన్.

ఉ. వారిది విన్నవింప విని వాసుకి బంధులఁ గూడి వచ్చి బల్
వారణముల్ రథాశ్వము లవారణఁ గానుక లిచ్చి మేము మీ
వారము మాపయిన్ జనదు వైర మటంచు హితోక్తు లాడ దే
వారియు వారి వీడుకొని యప్పురిఁ బాసి చమూసమేతుఁ డై. 370

రావణుండు నివాతకవచులపైకిఁ బోవుట

చ. మణిమయసౌధసాలగృహమండపశిల్పములన్ యథార్థ మ
మణిమతి యన్పురంబున కమర్త్యవిరోధి జయస్పృహాపరా
యణతఁ జనన్ నివాతకవచాభిధు లక్కడివారు రాక్షసా
గ్రణులు పయోజగర్భవరగర్వితు లాతనిరాక కుబ్బుచున్. 371

చ. రణమున కేఁగుదెంచె బళిరా దశకంఠుఁ డటంచు శత్రుభీ
షణపరుషోపలోచ్చకవచప్రభలున్ శితదంష్ట్రికాప్రభల్
ఫణినిభహస్తనిస్తులకృపాణమహాప్రభలున్ జెలంగ రా
వణుని యమాత్యులన్ దొడరి వారొనరించిరి పోరు క్రూరతన్. 372

వ. ఇవ్విధంబున. 373

శా. ఖడ్గాఖడ్గి భుజాభుజిన్ దొడరి రక్షస్సైనికుల్ వాహినీ
రాడ్గంభీరరవం బడంచుఘనగర్జల్ మీఱఁ గాలానల
త్విడ్గాఢప్రకటప్రతాపములు వర్ధిల్లన్ మరుత్వత్సరో
రుడ్గర్భాదిమనోభయంకరముగా రోషించి పోరాడఁగన్. 374

ఉ. ఆలమునన్ నివాతకవచాసురవీరులవీఁక కోర్వఁగాఁ
జాలనిమంత్రిపుంగవుల సైన్యములన్ గని పంక్తికంఠుఁ డా
భీలభుజాప్రతాపమును బెంపును మీఱఁగఁ బోరె వారితోఁ
రేలుఁ బగల్లు నాక నలి రేఁగి మొగిన్ బది రెండుమాసముల్. 375

శా. బద్ధస్పర్ధలతో నివాతకవచుల్ పౌలస్త్యుఁడున్ గాఢస
న్నద్ధత్వంబున నిట్లు వోరఁగ శతానందుండు వేంచేసి యా
యుద్ధం బేటికి మీర లిందఱు నజయ్యుల్ పంక్తికంఠుం డతి
క్రుద్ధుం డెవ్వనిచే సనాధ్యుఁ డీఁక మీకున్ సంధి సేయన్ దగున్. 376

చ. సమబలుఁతోడఁ జేయఁదగు సంధి బలాఢ్యునితోడ సంధియున్
సమరముఁ గాదు హీనునెడ సంధికి నియ్యకొనంగఁ జెల్ల దీ
యమరవిరోధి మీకు సముఁ డౌట సఖిత్వము మే లటంచుఁ గ్రొ
ర్వ్య మడఁచి పద్మజుం డరిగె నట్ల యొనర్చిన వార లయ్యెడన్. 377

ఆ. ఆనివాతకవచు లధికసఖ్యంబుతోఁ
దను బహూకరింప దశముఖుండు
గొంతకాల మచటఁ గూర్మిమై వసియించి
వలయుమాయ లెఱిఁగి వారివలన. 378

రావణుండు కాలకేయులతో యుద్ధము సేయఁబోవుట

క. వారల వీడ్కొని వరుణజ, యారంభముతోడఁ గదలి యప్పథమున దే
వారివరుఁ డశ్మపుర మను, పేరిటి దొకపురము సూచి పృథుశౌర్యమునన్.

ఉ. అప్పురివాకిటన్ నిలిచి యార్పు లొనర్పఁగఁ గాలకేయు లా
చప్పుడు లాలకించి రభసంబున వెల్వడి పంక్తికంఠుపై
నప్పుడు దారసిల్లి తమయగ్గలికల్ గనిపింప మీకుఁ గా
నిప్పతి గత్తి వట్టునె హీహీ యిటు రం డని మంత్రు లాఁగినన్. 380

శా. కల్పాంతాంబుదగర్జితంబు లెసఁగంగాఁ గాలకేయాసురుల్
కల్పాగ్నిప్రథమానతేజములతోఁ గల్పక్షయాక్షయ్యసం
కల్పప్రోద్భవవిద్విషద్భయదవీక్షాకీలికీలచ్ఛటా
కల్పానల్పశరాళి వృష్టి గురియన్ గంపించి రాసైనికుల్. 381

మ. తనసేనాధిపు లొందుదీనదశయున్ దత్కాలకేయుల్ వహిం
చినబీరంబునుఁ జూచి పంక్తిముఖుఁ డాక్షేపించి రోషాగ్నిక
ణానలన్ జ్వాలలు మించ నద్దనుజులన్ గ్రూరాస్త్రజాలంబునన్
దునుమన్ సేనలు విచ్చి పోవఁ గని విద్యుజ్జిహ్వుఁ డత్యుగ్రుఁ డై. 382

ఉ. ఏఁ గలుగంగ మీకుఁ దగునే బెగడొందఁగ నంచు సంగరో
ద్యోగనిరూఢి నందఱను నొక్కటఁ గొల్తలఁ జేసి యొండు ది

క్కేఁగఁగ వారిలోఁ గలిసి యేడ్తెఱ సూపఁగఁ బంక్తికంఠు బి
ట్టాఁగిరి నీలశైలము ఘనావలి యొక్కటఁ గప్పుచాడ్పునన్. 383

క. ఆసందడిజగడంబున, నాసురపతి మఱఁది యనుచు నరయక తనపై
డాసిన నీసునఁ గత్తిన్, వ్రేసె నడుమ రెండు గాఁగ విద్యుజ్జిహ్వున్. 384

ఉ. ఉద్ధతి రావణుండు దన యోధులు మెచ్చఁ జతుశ్శతాసురుల్
బద్ధవిరోధులై కదియఁ బట్టిసముల్ గొని బెట్టు ద్రుంచినన్
యుద్ధధరాతలంబు చరణోదరబాహుగళాదియుక్తమై
బుద్ధికిఁ జూడ్కికిన్ వెఱఁగుఁ బూన్చెఁ గృతాంతునివంటయిల్లనన్. 386

క. శరనిధితరఁగల తెఱఁగున, గిఱికొని పఱతెంచుగాలకేయుల నెల్లన్
గరచంద్రహాసధారా,స్ఫురణన్ బరిమార్చి యార్చి భుజబల మలరన్. 386

చ. తనవిజయంబుఁ బేర్కొని ముదంబున నెంచు ప్రహస్తముఖ్యులన్
గని యిది యేటిమెప్పు గడఁకన్ జలధీశుని గెల్చినన్ గదా
ననుఁ గొనియాడఁ జెల్లు నని నవ్యవిమానవరాధిరూఢుఁడై
చనియె విరోధిపట్టణము చక్కటి కుత్కటగర్వసంపదన్. 387

రావణుఁడు మణిమత్యశ్మపురంబుల గెల్చుట

మ. చని కైలాసనగాధిరాజతులితస్వచ్ఛప్రభాదీప్రమై
ఘనవప్రంబు వెలుంగఁ జూచి యిదియే గాఁబోలుఁ గాండాధినా
థుని ప్రోలంచుఁ దదీయగోపురమునందున్ జేరి తద్రక్షకుల్
వినలంకాపురనాయకుం డనియెఁ బ్రావృట్కాలమేఘార్భటిన్. 388

ఉ. ఏ దశకంఠనామదనుజేంద్రుఁడ సంగరకాంక్ష వచ్చితిన్
మీదొరతోఁ గణింపుఁ డిది మీరలె మమ్మెదిరింప నోపినన్
గా దన నేఁగు డెం డనుచు గ్రక్కున లోపలి కేఁగి యందు క్షీ
రోదధిఁబోలు వెల్లమొద వొక్కటి గన్పడఁ జూచి మ్రొక్కుచున్. 389

సీ. కల్పకసురరత్నకమలాసుధాకరాదికులతోఁ బొడమినదివ్యమూర్తి
వాఁకలి గొన్నదేవాళికిఁ దృప్తిగా నమృతంబు గురియుసౌహార్దమతివి
స్తనవిస్రవత్పయోధారఁ బుట్టినయిల్లు పాలవెల్లిగఁ జేయుభాగ్యవతివి
కోరినవారికిఁ గోర్కు లవ్వారిగా దయ నిచ్చునసమానదానవతివి

తే. ఇన్నిట జనించుకీర్తి పైకొన్నలీల
ధవళరుచి మించు మొదవులతల్లి విట్టి
నిన్నుఁ గనుఁగొంటి శుభములు నేను గంటి
ననుచు సురభికి వలగొని యసురవిభుఁడు. 390

ఉ. అచ్చటిద్వారపాలకుల నందఱ మ్రందఁగ జేసి వీటిలోఁ
జొచ్చి రణేచ్ఛ రా వరుణసూను లెఱింగి యభంగురక్రుధన్

వచ్చి విరోధిసైనికుల వాలికతూపుల ఖడ్గధారలన్
వ్రచ్చి రథాశ్వదంతిభటవర్గముతో వెసఁ బేర్చి యార్చినన్. 391

శా. అధూమ్రాక్షమహోదరప్రముఖదైత్యామాత్యు లత్యుగ్రబా
హాధిన్యస్తకృపాణముద్గరకుఠారాద్యాయుధశ్రేణిఁ బా
థోధిశాత్రవదంతివాహభటులన్ దున్మాడి కాలాభ్రగ
ర్జాధిక్కారఘనాట్టహాసముల దిక్చక్రంబు భేదించినన్. 392

— రావణుండు వరుణసుతులతో సమరంబు సేసి గెల్చుట —

మ. ఉపలక్షించి పయోధినాథసుతు లోహో నిల్వుఁ డంచాసురా
ధిపసేనానుల నిల్వరించి యసిపంక్తిన్ నొంచి తేరుల్ పయో
దపథం బంటి చరింపఁ జేసి బహుమార్తాండప్రభల్ మీఱఁ దో
రపుఁగోపంబునఁ బంక్తికంఠునిశరీరం బమ్ములన్ ముంచినన్. 393

శా. ఆశౌర్యంబు మహోదరుండు గని యీర్ష్యన్ మించి విస్ఫీతికెం
తే శీఘ్రంబున నుద్గమించి పటుశక్తిన్ స్ఫారసర్పోగ్రబా
హాశుంభత్పరిఘప్రహారపరుషవ్యాపారముల్ సూపె న
ప్పాశిప్రోద్భవసూతిరథ్యరథముల్ భగ్నంబులై కూలఁగన్. 394

చ. అరదములన్ హయంబులు నియంతలుఁ గూలఁగ బీఱు వోవ క
వ్వరుణసుతుల్ ప్రభావమున వాయుపథంబున నిల్చి భూనభోం
తరములు మ్రోయఁ గార్ముకగుణంబులు దీటుచు నమ్మహోదరున్
శరముల నొవ్వ సేసి వివశత్వము నొందఁగఁ జేసి రీసునన్. 395

వ. మఱియును. 396

చ. అశనిసమూహముల్ గురియునంబుదసంఘములో మహోష్ణక
ర్కశకరముల్ నిగుడ్చులయకాలవిభాకరమూర్తులో యనన్
నిశితతరప్రకాండము లనేకము లొక్కట నించి నొంచి ర
ద్దశముఖు నాతఁడున్ బ్రకటితభ్రుకుటీకుటిలేక్షణోగ్రుఁడై. 397

శా. జ్యాభూరిధ్వని లోకసంబుఁ బగిలింపన్ బాణహస్తప్రజల్
క్షోభింపన్ శరశూలముద్గరగదాకుంతాదిశస్త్రోత్కరం
బాభీలోద్ధతిఁ బైపయిన్ నిగుడఁ జేయన్ మర్మముల్ గాడ నెం
తో భీతిల్లి పదాతులై ధరణి కావ్యోమాధ్వగుల్ డిగ్గినన్. 398

మ. అవలోకించి హసించుచున్ దశముఖుం డాహా ననున్ మించి పో
వ వశంబే సుతహీనుఁ జేసెద నిఁకన్ వార్ధీశుఁ గల్పాంతవా
యువుబారిన్ బడినట్టులై తిరిగదా యొం డేల ప్రాణంబులా
స విసర్జింపుఁ డటంచు వారలపయిన్ సైన్యంబులన్ బంచినన్. 399

తే. ఆబలంబులు శస్త్రాస్త్రహతుల నొంప
బడలి వరుణునికొడుకులు పుడమిఁ బడిరి
అనుచరుల్ గొనిపోవ గేహములు సేరఁ
జూచి యార్చుచు రావణాసురుఁడు పలికె. 400

క. శరధులు గలిగియుఁ గాండ, స్ఫురణకు దూరమైనవానిపుత్త్రకు లయ్యుఁ
బఁ సేనలు వెనుచఱచుచుఁ, బఱతేరఁగఁ జాఱిపోవఁ బాడియె మీకున్. 401

క. బలము చెడి నీళ్లకంజెను, బలుచన మైతి రిఁక మిమ్ము బాధింపఁగ రా
దిలు సేరి తండ్రి నైనఁ, గలనికిఁ బనుపుఁ డని బెట్టుగా నతఁ డనఁగన్. 402

క. ఆమాటలఁ బఱచుచు వరు, ణామాత్యుం డగు ప్రభాసుఁ డాలించి పటు
స్థేమమున నిలిచి దనుజ,గ్రామణి విన నిట్టు లనియె ఘనవాక్స్ఫూర్తిన్. 403

మ. అసురాధీశ్వర యీడ లేఁడు వరుణుం డబ్జాసనుఁ గొల్వఁ బో
యె సమానుండగు నేనియుఁ దొడరు నీవీ రేడులోకంబులం
దసమానుండవు నీప్రతాపమున కీయంభోధిరాట్పుత్త్రపౌ
త్త్రసుహృత్పుంగవు లోడి రాతఁ డిఁక వేఱ బుద్ధి సూహింపుమా. 404

క. వరుణసహస్రము వచ్చిన, దరమే నిను గెల్వ ననిన దశముఖుఁ డుత్సా
హరసోన్నతి నార్చుచు న,ప్పురి వెలువడి చనియెఁ దూర్యములరొద లెసఁగన్.

క. అని కలశజుఁ డెఱిఁగించిన, విని రామస్వామి యవల వింశతిబాహుం
డని గోరి యెచటి కరిగెనొ, యనఘా నే వినఁగ వలతు నని యడుగుటయున్.

ఆ శ్వా సాం త ము

చ. అనఘజనావనైకచతురా చతురాననచంద్రశేఖరా
ద్యనిమిషరాజమానసచరా సచరాచరవిశ్వలోకవ
ర్తనమహనీయరూపమధురా మధురాపురకామినీవిలో
చనకువలాబ్జదాస్యవనజా వనజాతవహాంబుదోపమా. 407

క. భద్రాహృదయేశ్వర బల,భద్రావరజాగ్రగణ్య భక్తశరణ్యా
భద్రార్తిహరణకరణ సు,భద్రాధిపభద్రకరణపారీణమతీ. 408

సుగంధివృత్తము.—

పన్నగాధిరాజతల్పపాదసేవనాపరా
పన్నగామరేంద్రచంద్రపారదాభకీర్తిసం
పన్నగాలవాదివంద్యమాన బాణధోరణీ
పన్నగాథదేవశత్త్రుపార్శ్వహ స్తమస్తకా. 409

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన
పద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ
వితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర
ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన
వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర
కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన
నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన
నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామా
యణం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## చతుర్థాశ్వాసము

—:o:—

శ్రీరమణీరమణీయ
ద్వారవతీనర్మహర్మ్యవాసివధూహృ
త్సారంగనివహమోహన
నీరదసంకాశ రుక్మిణీతరుణీశా. 1

రావణుండు బలిచక్రవర్తిని జయించునిచ్ఛచే సుతలంబున కరుగుట

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁడిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
రఘుకులాధీశ యారీతి రావణుఁడు జయంబు సేకొని వరుణాలయంబు వెడలి. 2

క. అతులనుతుల్ సలుపుచు దితిసుతులు గొలువ నవల నరిగి సురుచిరవిభవో
న్నతుల సురధానిఁ బోలిన, సుతలము గని మెచ్చి సొచ్చి సొంపున నచటన్. 3

సీ. కలకంఠశుకశారికారవంబులచేత వలనొప్పునుద్యానవనులచేతఁ
బద్మకైరవచారుపరిఖాంబువులచేత భాసిల్లుకనకవప్రములచేత
మంజులోజ్జ్వలసాలభంజికావళిచేత రాణించుమణిగోపురములచేత
గారుడోపలబద్ధతోరణంబులచేత గనుపట్టువిపణిమార్గములచేత

తే. నవ్యమౌక్తికమయవితానములచేత, ధవళమగు తుంగసౌధయూథంబుచేత
భవ్యశశికాంతసోపానపంక్తిచేతఁ, బొలుపుమీఱెడునొకదివ్యపురముఁ గాంచె. 4

తే. కాంచి యచ్చోటిబహుశిల్పకల్పనలకు, నద్భుతంబంది నగరబాహ్యమున నిలిచి
దనుజవిభుఁ డీనివాస మెవ్వనిదొ వేగ, మరసి రమ్మని సేనాని నంపుటయును. 5

చ. అతఁడు మహాప్రవాద మని యత్తొలివాకిలి సొచ్చి యచ్చటన్
వెతకి మఱెవ్వరిన్ గనక వేఱొకవాకిటి కేఁగి నిర్జన
స్థితి నదియున్ గనంబడినఁ జెచ్చెర నవ్వలికొన్ని వాకిళుల్
జతనము మీఱ దాఁటి చని సప్తమసంఖ్య వహించువాకిటన్. 6

మ. అరుణున్ బోలినకాంతితో నవపయోదానీలగాత్రంబుతో
నరవిందంబులఁ గేరునేత్రములతో నాజానులంబోన్నతో
ద్ధురబాహాద్వయితోఁ గటీతటలసద్రుక్మాంబరస్ఫూర్తితో
నరుదై చూడ్కుల కొక్కదివ్యపురుషుం డచ్చోటఁ గాన్పించినన్. 7

ఉ. ఆసురమంత్రి సేరఁ జని యంతటిలో నతఁ డట్టహాసముం
జేసిన గాసిఁ జెంది వెఱచేఁ బరువెత్తి దశాస్యు డాసినం
ద్రాసముఁ బొంది వచ్చినవిధం బిది యేమి ప్రహస్త యన్నచో
నాసురవైరిశేఖరున కక్కడిచోద్యము వాఁడు దెల్పినన్. 8

ఉ. ఔర విచిత్రమైనది మహాపురుషుం డతఁ డెవ్వఁ డొక్కొ క
న్నారఁగ నేను జూచెద నటంచు విమానము డిగ్గి నిల్వక
వీరుఁడు ద్వారపట్కు మతివేగమునన్ గ్రమియించి సప్తమ
ద్వారము సేరఁగాఁ జని ప్రధానుఁడు దెల్పినయట్ల యచ్చటన్. 9

సీ. కీలికీలారుణాభీలజిహ్వికవాని దంష్ట్రాకరాళవక్త్రంబువాని
బభ్రుబర్బరకేశపాశంబు గలవాని సముదీర్ణశంఖకర్ణములవానిఁ
గుప్పగా నిప్పుకల్ గురియుకన్నులవానిఁ జటులబింబారుణోష్ఠంబువాని
సంరక్తకర్కశశ్మశ్రుజాలమువాని మసృణారుణోర్ధ్వరోమములవాని
తే. భూరిరోషాభిసూచకభ్రుకుటివాని
నున్నతోన్నతఘనబాహుయుగళివాని
నుక్కుగద యూనుకొని నిలుచున్నవాని
నొక్కపురుషునిఁ జూచి దైత్యోత్తముండు. [వెఱచి

తే. చూచి యాదివ్యపురుషుండు సూచువేఁడి, చూపులకు జంకెలకుఁ జెంత సుడియ
నెఱఁగుపడి యట్టె నిలుచున్న వింశతిభుజుఁ, బలికె నమ్మేటి గంభీరభాషణముల.

చ. కదనము సేయ వచ్చి భయకంపితగాత్రుఁడవై వితాకుఁ జే
సెద విది యేమి రాత్రిచరశేఖర ధీరులు ధీరవృత్తిఁ ద
ప్పుదురె బలీంద్రునిన్ దొడరి పోరఁగ వచ్చితొ నన్ను మార్కొనం
గఁ దలఁచి వచ్చితో సమరకాంక్షితశూరునిఁ దెల్పు నావుడున్. 12

క. తలఁగినధైర్యము గ్రమ్మఱ, నిలుపుకొని దశాననుండు నిర్భయుఁ డగుచున్
బలిఁ దొడరఁగ వచ్చితి నని, పలికిన నప్పురుషవరుఁడు పకపక నగుచున్. 13

సీ. త్రైలోక్యవర్ణితౌధార్యశౌర్యోదితోజ్జ్వలకీర్తి బలిదైత్యచక్రవర్తి
ఖలజనానీకనిగ్రహావిగ్రహాత్యుగ్రసమవర్తి బలిదైత్యచక్రవర్తి
యవలోకమాత్రనేత్రానందకరనిరంజనమూర్తి బలిదైత్యచక్రవర్తి
జగదీశ్వరార్పణేచ్ఛాప్రకల్పితయజ్ఞశతపూర్తి బలిదైత్యచక్రవర్తి
తే. స్వవశచక్రపరిచ్ఛిన్నసకలశత్రు, చక్రవిస్ఫూర్తి బలిదైత్యచక్రవర్తి
యమ్మహాత్మునిఁ దొడర నీ కలవి యగునె, యైనఁ బోవలతేనిఁ బొమ్మసురనాథ.

రావణుఁడు బలిచక్రవర్తికడకుఁ బోఁగా నతఁడు వానికి విష్ణుప్రభావంబు దెలుపుట

క. అని యవరోధము మానినఁ, జని యవరోధమున నసురచంద్రున్ గనియెన్
వినయాదికగుణసాంద్రున్, బనితవిభోగామరేంద్రు బలిదైత్యేంద్రున్. 15

చ. కనుఁగొని యట్టహాస మెసఁగన్ జని బాహువు లప్పళించి ని
ల్చిన దశకంఠునిన్ గని బలిత్రిదశారి పులస్త్యవంశవ
ర్ధన యిటు రమ్ము రమ్మని కరమ్మునఁ జెంతకుఁ జేరఁ దీసి చ
య్యనఁ దొడమీఁద నుంచుకొని యాదరపూర్వము గాఁగ నిట్లనున్. 16

ఉ. సేమమె నీకు బంధులకు శ్రేయమె పుత్త్రులకున్ శుభంబె నీ
వేమిటి కిందు వచ్చి తసురేశ్వర కోరినకార్య మంతయున్
బ్రేముడి నేనొనర్తు వినిపింపుము నాకఁ దదంకవర్తియై
యామనుజాశియున్ బలికె నక్కడిమాట మఱుంగు వెట్టుచున్. 17

చ. హరి నినుఁ గట్టివేసె నని యందఱుఁ జెల్పఁగ నాలకించి నే
హరి నెదిరించి నొంచి భువనైకవదాన్యు హతాన్యసైన్యునిన్
స్థిరమతి బంధముక్తునిఁగఁ జేసెద నంచుఁ దలంచి వచ్చితిన్
హరి యిపు డేడ నుండు నన నల్లన నవ్వి బలీంద్రుఁ డిట్లనున్. 18

క. కడపటివాకిట నీ వి,ప్పుడు గని మాటాడినట్టిపురుషుఁడె విష్ణుం
డుడుగక యొకచో నుండియు, నడఁగక యెల్లెడలఁ దోఁచు నతఁ డసురేంద్రా.

మ. మును నారాయణుఁ డేడ నుండు నని మాముత్త్రాత యాత్మీయపు
త్త్రుని వేధింపఁగ నాతఁ డెల్లయెడలందున్ బూర్ణుఁడై యుండు నం
చన నాతీరున నుండఁ గోరినఁ దదీయాస్థానగ స్తంభసీ
మ నృసింహాకృతి నుద్భవించి విమతున్ మర్దింపఁడే రావణా. 20

మ. విను మవ్విష్ణునిచేతఁ గాదె శుకుఁడున్ వృత్రుండు సంహ్లాదుఁడున్
దనువున్ శుంభనిశుంభశంఖముచుకుందవ్యోమధూమామళా
ర్జునవైరోచనకాలనేమి కనకాక్షుల్ గూలుటల్ కాలకే
యనిశాటుల్ మధుకైటభాదికులు ను గ్గాటల్ సురారీశ్వరా. 21

క. మనవంటిదైత్యు లెందఱు, వనజాక్షునితోడ నిటుల వైరము గావిం
చిన వా రవ్విభుచే నొ,చ్చినవారును బలియుఁ దొడరి చెడ మన కేలా. 22

తే. నన్నొకనిశౌరి బంధించినాఁ డటంచు, నెంచెదవు గాని తెలియలే వెల్లజనులఁ
జటులసంసారమోహపాశమునఁ గట్టి, ప్రాభవంబున వెలయుటఁ బంక్తివదన. 23

సీ. చెలఁగి ప్రపంచంబు సృజియించు నొకవేళ నొకవేళ సృజియింప కూరకుండు
విభుఁడు దానై ప్రోచు విశ్వంబు నొకవేళ నొకవేళ సాక్షియై యూరకుండు
నామరూపములతో నటియించు నొకవేళ నొకవేళ నవి మాని యూరకుండు
దుష్టరాక్షసశిక్ష దొరకొను నొకవేళ నొకవేళ సమబుద్ధి నూరకుండు

తే. నెటుల తోఁచిన స్వేచ్ఛతో నటుల యుండు
నెఱిఁగి భజియించు వారల నెఱిఁగి యుండు
నమ్మహాత్ముఁడు గట్టిన యట్టికట్టు
లన్న విడిపింప నీకు నా కలవి యగునె. 24

చ. అని బలి దెల్పఁ బఙ్క్తిముఖుఁ డౌర భయంకరమృత్యుయుక్తుఁ డై
ఘనతరకాలదండమును గైకొనివచ్చుకృతాంతునంతవీ
రుని నొగిలించి పెండిమల రుద్రునితోఁ బెకలించి మించునన్
జెనకఁ గలండె విష్ణుఁడు వచింపు మతం డెటువంటివాఁ డనన్. 25

మ. బలిదైత్యేంద్రుఁడు గ్రమ్మఱన్ బలికె నోపౌలస్త్య వేదాంతవే
త్తలకున్ గానఁబడం డనాదిలయుఁ డేతద్విశ్వసృష్టిస్థితి
ప్రళయాపాదకుఁ డవ్విభుం డతఁడె పో బ్రహ్మాదిరూపంబులన్
వెలయున్ దన్మహిమంబు లిట్టి వని వర్ణింపన్ సమర్థుండనే. 26

సీ. యాగంబు యజ్వయు యాగైకఫలము నయ్యాగార్థమంత్రంబు లతఁడెసుమ్ము
దానంబు దాతయు దానసాధనము లద్దానార్హకాలం బతండె సుమ్ము
యోగంబు యోగియు యోగోపదేష్ట యోగానందమహిమంబు లతఁడె సుమ్ము
ధ్యానంబుధ్యాతయుధ్యాననైశ్చల్య మాధ్యానార్హమూర్తియు నతఁడె సుమ్ము

తే. తన్ను వినఁ దన్నుఁ బేర్కొన్నఁ దను నెఱిఁగిన
వారియఘములు గడతేర్చి వాంఛితములఁ
గరుణ నొనగూర్చు బంధమోక్షముల కతఁడె
కర్త సుమ్మని బలిదైత్యభర్త యనిన. 27

క. వైరోచనుమాటలు సెవిఁ, దూఱక యదఱించి మున్ను తోఁచినయలదా
వారికి నచ్చోఁ గానక, యారా హరి యోడిపోయె నని గర్వమునన్. 28

ఆ. అట్టహాసంబు సేయుచు నచట నిలక
పర్వతగుహాంతరము లెడఁబాసి వచ్చు
కేసరివిధాన నవలివాకిళ్లు గడచి
పుష్పకం బెక్కి దైతేయపుంగవుండు. 29

మ. బలి నిర్జించితి విష్ణుఁడున్ వెఱచె మద్బాహాబలస్ఫూర్తికిన్
బలియున్ గన్గొన మీస్థలంబున నికన్ బద్మాప్తపద్మాదులన్
గెలువన్ బోవలె నేగుదెం డనుచు మంత్రిశ్రేణితోఁ బల్కుచున్
బలుమాఱున్ దన వారు ప్రస్తుతు లొనర్పన్ సంతసం బొందుచున్. 30

వ. చని యుదగ్దిశాభిముఖుండై యద్దశముఖుండు హిమవద్గంధమాదనకైలాసాది పర్వతంబు లతిక్రమించి యవ్వల. 31

### రావణుఁడు బంగరుకొండ కేఁగుట

సీ. వీచోపుగుమిపీచువిధమున నునువెల్ల జల్లులమొకములు సఱులఁ దిరుగఁ
జావడ లిడునట్లు పతులచెమ్మటఁ బయ్యెదలమాన్చుసతులు నెత్తముల మెలఁగ
దీపికావళి మించుతెఱఁగున జ్యోతిర్లతావితానము లుపత్యకల వెలుఁగఁ
జూపఁ జెంగట నిల్పుసొబగున హరులును గరులును బాదాంతికముల నొలయ

తే. భవ్యమందాకినీక్షౌమపటము గట్టి, గైరికద్యుతికుంకుమగంధ మలఁది
వేడ్కఁ గంధర్వగానముల్ వించు మించు, కాంచనావనిభృన్మౌళిఁ గాంచె నతఁడు.

తే. కాంచి రజతాద్రిఁ బెఱికినకరణిఁ దన్నుఁ
బెఱుక వలదని గిరి కాన్కఁ బెట్టె నీకుఁ
దటచరత్కరిశిక్షకఁ డ్రత్నపాళిఁ
గొన్న మనుచు మంత్రి యన నవ్వికొనుచు నచట. 33

శా. ఆనాఁ డెల్ల వసించి తద్గిరివినోదారామలీలావిలో
కానందామృతవార్ధిమగ్నుఁ డయి దైత్యస్వామి కల్యంబునన్
స్నానాదిక్రియ లాచరించి మణిచంచత్పుష్పకం బెక్కి ఛా
యానీరేజదళేక్షణాధిపజిగీషాయత్తుఁ డై యయ్యెడన్. 34

రావణుఁడు సూర్యునిపోఁదికి యుద్ధమునకై పోవుట

మ. అమరక్ష్మాధరతుంగశృంగగతదివ్యాధ్వంబునన్ వారివా
హామరుద్భూతనివాసముల్ గడిచి సాధ్యస్థానగంధర్వలో
కములున్ సిద్ధపదంబు మున్నుగ నెడల్ గన్గొంచుఁ దల్లోకులన్
సమరక్రీడకుఁ బిల్చుచున్ వెఱతు మన్నన్ వారి మన్నించుచున్. 35

మ. దనుజగ్రామణి భీతి లే కిటుల యుద్యద్వేగి యై లక్షయో
జనముల్ వోయి ప్రభాకరార్చకులకున్ ఛాయాధినాథావలో
కనదీక్షాఢ్యుల కర్యమానతులకున్ గాలోచితార్ఘ్యాంబువ
ర్జనసంసక్తులకున్ నివాస మగుభాస్వల్లోకమున్ గన్గొనెన్. 36

వ. కనుంగొని నిరవధికాలోకదురవలోకం బగునాలోకలోచనులోకంబు దఱియన్
జొచ్చి యచ్చట. 37

సీ. అరుణచోదితఫణాధరబంధబంధురచ్ఛందోమయాశ్వహేషలు సెలంగఁ
గనకదండోద్దండకరదండమాఠరప్రముఖసాహోనినాదము లెసంగ
వాలఖిల్యాదికప్రతిముఖ్యపఠితఋగ్యజుషోక్తసౌరమంత్రార్భటి దగఁ
జామరగ్రాహిణీఛాయాసఖీమణీకరమణీకంకణక్వాణన మడర

తే. నేకచక్రరథారూఢుఁ డై కిరీట
హారకుండలకటకకేయూరముద్రి
కాద్యభూషణఘృణులతో నమరునుగ్ర
భానుఁ గనుఁగొని పౌలస్త్యసూనుఁ డపుడు. 38

శా. ఆరక్తాంబరగంధమాల్యములతో నత్యుష్ణతేజంబుతో
హైరణ్యాంగముచెల్వుతో యుగపదూర్ధ్వాధోఖిలాశాస్ఫుర
ద్ఘోరస్ఫారసహస్రభానువులతోఁ దోతెంచునబ్భానునిన్
ధీరత్వంబున నింత గైకొనక పంక్తిగ్రీవుఁ డుగ్రాకృతిన్. 39

మ. తనసేనాపతిమోముఁ గన్గొని ప్రహస్తా నీవు శీఘ్రంబె యీ
యనఁ జేరన్ జని పంక్తికంఠుఁ డని సేయెన్ వచ్చెఁ బోరాడ ర
మ్మనుచున్ బిల్వము భీతిఁ జెందిన 'జితో ఽహం నూన' మిత్యుక్తియై
నను వాక్రువ్వఁగఁ జేసి ర మ్మనిన యన్నాకారివాక్పద్ధతిన్. 40

చ. అతఁడును బేర్చి చండకిరణావళివేఁడిమి కోర్చి పద్మినీ
పతినికటంబు చేరనెడఁ బార్శ్వగు లడ్డము సొచ్చి యేల వ
చ్చితి విట కన్న రావణుఁడు సెప్పినవాక్యము లెల్లఁ జెప్పి మీ
పతి నిఁక మాపతిన్ దొడరఁ బంపుఁడు నా విని వాడు సెచ్చెరన్. 41

చ. తపనునిఁ జేరి మ్రొక్కి యవధారు త్రయీమయదివ్యమూర్తి శౌ
ర్యపరుఁడు రావణుండు సమరం బొనరింపఁగ వచ్చినాఁడు తో
రపుభుజశక్తి యొప్పసమరంబె యొనర్చెదవో యి దేల యం
చిపుడు 'జితోఽస్మి' యంచు వచియించెదవో యిది యేమి నావుడున్. 42

ఉ. ఆహరిదశ్వుఁ డిట్లను దశాస్యునితో మన కేటి పోరు మం
దేహనిశాటులన్ దొడరి నిత్యముఁ బోరెడిపోరు చాలదే
యూహలిఁ గేల యిప్పటికి నోడితి మన్నను దప్పు గాదు పొం
డాహవకేళి నోడె రవి యం చనుఁ డాయనతోడ నావుడున్. 43

తే. వారిలో దండుఁ డనువాఁడు వచ్చి పంక్తి
కంఠుఁ గని యయ్య నిను డాసి కయ్య మీయఁ
జాల కోడితి నన్నాఁడు చండభానుఁ
డిచట నందఱ గెల్చితి వేఁగు మనిన. 44

శా. ఆదైతేయకులేశ్వరుం డవుడు బాహాస్ఫాలనధ్వాన మ
య్యాదిత్యానుచరాళి గుండియలు వ్రయ్యన్ జేయఁ గాలాభ్రమో
నా దిక్కుల్ వగులంగ నార్చుచుఁ బ్రధానశ్రేణి యాత్మప్రతా
పాదుల్ పేర్కొని యెంచఁ బుష్పకవిమానారూఢుఁ డై యవ్వలన్. 45

క. తుహినాంశుని గెల్చెద నని, మిహిరోపరిలోకములు క్రమించి రయమునన్
బహుయోజనములపొడ వగు, మహిమలక్షుదఁ జేరి విశ్రమించినయంతన్. 46

క. అచటికి వీణామానిస,హచరుం డగుపర్వతాఖ్యుఁ డరుదెంచిన రా
త్రిచరేంద్రుఁ డుపచరించి స,ముచితస్థితి మాట లాడుచుండెడివేళన్. 47

{ తపస్సు మొదలగు పుణ్యకర్మములచే భోగంబు లనుభవించువారిని రావణుఁడు పర్వతువలనఁ దెలిసికొనుట }

సీ. తిలకంబు దిద్దుముద్దులగుమ్మ యద్దంపు నిద్దంపుఁ జెక్కులనీడఁ గనుచు
నలరుదండలఁ జుట్టు చెలిలేనగవుఁ జూచి యీవింతపూదండ యేడ దనుచుఁ
గలపంబుపూయుతొయ్యాలిమేనికమ్మవాసనలు పైఁబొలయ మూర్కొనియలరుచుఁ
గపురంపువిడె మిచ్చుకలికిముచ్చట విన వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు

తే. నింద్రభోగంబు పరిపూర్ణ చంద్రకాంతి, వెలయ బంగారుఁ దేరెక్కి వేలసంఖ్య
లచ్చరలుగొల్వఁ దనమ్రోలనరుగు నొక్క, దివ్యపురుషునిఁ జూచె దైతేయవిభుఁడు.

తే. చూచి తనులెక్కసేయక సొగసు మీఱి
పొలఁతులనుగూడి పోవునిప్పురుషుఁ డెవ్వఁ
డసురమునిచంద్ర వివరింపు మనిన దనుజ
పట్టభద్రున కనియె నప్పర్వతుండు. 49

సీ. ఒకనాఁడు జలపాన మొనరించి బహుకాల ముపవసించిన మేటితపసి యితఁడు
దళ మొకించుక మెక్కి తలఁకక పెక్కేండ్లు జపము సేసినక్షమాశాలి యితఁడు
దిగువ రాలినపండ్లు దిని యనేకాబ్దముల్ ధ్యానంబు సేసినధన్యుఁ డీతఁ
డనిలభక్షణ సేసి యమితవత్సరము లుగ్రసమాధిఁ బూనినఘనుఁ డితండు

తే. దనుజవర యీతఁ డమృతంబు ద్రావి కల్ప
వృక్షములనీడ నీవేల్పువెలఁదిమంది
యధరములు నొక్కికొనుచుఁ జిరాయు వంది
వెలయఁ బోయెడు నితనిపై నలుగ వలదు. 50

మ. అని యమ్మౌని గణింపఁగా వినుచు నున్నంతన్ మణిస్యందనం
బునఁ జండాంశుసమప్రచండరుచి వేల్పుంగొమ్మలున్ గొల్వఁగా
జను వేఱొక్కనిఁ జూచి యెవ్వఁ డితఁ డో సన్మౌని నా సంగరో
ర్విని స్వామిప్రియకాంతుఁ గూలినమహావీరుండు దైత్యాగ్రణీ. 51

వ. అని కొండపేరిపాటుండు నుడివిన నూకొనుచు నయ్యసురమండలాఖండలుండు
వెండియు నిజాగ్రభాగంబున. 52

సీ. ఉభయభాగంబులయం దుండి కొమ్మలు వీచు వెలిచామరములు వెన్నెలలు గాయఁ
బద్మరాగవిమానభాసమానద్యుతుల్ కపటసంధ్యారాగకాంతి నింప
వీణెలు వాయించువెలఁదులు గాంధర్వకలనఁ జట్టుల నెల్లఁ గరఁగఁజేయ
హైమకుండలకిరీటాదిభూషణరుచుల్ నింగికి బంగారునీరు వోయఁ

తే. దనువుదాల్చిన మరునిచందమున నంద
మొంది యుడువీథిఁ జనుచున్నయొక్కపురుషుఁ
గాంచి వీఁ డెవ్వఁ డనఁ బాత్రకనకదాత
యితఁ డని తపస్వి దెలుప దైత్యేశ్వరుండు. 53

క. ఆఋషిఁ గని యతిశేఖర, వీరలలో నెవ్వ రైన విసువక నాతోఁ
బోరాడఁగఁ గలవారు గ,లారె తెలుపు మనఁగ నతఁడు లలితోక్తి ననున్. 54

ఉ. ఆయతధర్మకర్మజనితాంచితసౌఖ్యరసానుభూతికై
పోయెడువారు వీరసురపుంగవ వీరల డాసి కయ్యముల్
సేయఁగ రాదు వీరు నని సేయఁగ రారు కృతార్థు లౌట నీ
కీయెడఁ బోరఁగా వలసెనేని గణించెద నొక్కశూరునిన్. 55

మ. అతఁ డెవ్వాఁ డని యంటివే విను మయోధ్యాపట్టణాధ్యాసియై
చతురంభోధిపరీతభూభరణదీక్షాదక్షబాహాబలో
న్నతి మించున్ యువనాశ్వనందనుఁడు మాంధాతృక్షితీశుండు నీ
ప్రతి యావీరుఁడు నిక్క మిప్పటినరేంద్రశ్రేణిలో రావణా. 56

క. నా విని రావణుఁ డౌనా, నీ వెఱిఁగించినటు లంద తెంచెద రక్తనిన్
దేవర్షీశ్వర యిపు డప్పాపరుఁ డెం దుండు నిపుడ పోయెద ననినన్. 57

దశగ్రీవుండు మాంధాతతోఁ బోరి సంధి సేయుట

మ. అజభూమిత్రుఁడు వల్కె నీవు సన నేలా రాక్షసాధీశ ది
గ్విజయారంభముఁ బూని నేఁ డిదె యుదగ్రేశంబుమీఁదన్ బహు
ధ్వజినీసంగతి నేఁగుదెంచు క్షణమాత్రం బోర్చినన్ దద్ధరా
భుజుతో నీకు రణంబు గల్గు నన నుప్పొంగెన్ దశగ్రీవుఁడున్. 58

ఉ. అంతట గొంతసేపటికి నచ్చటికిన్ వినవచ్చె ధారుణీ
కాంతురథాంతరస్ఫురితకాంచననిర్మితఘంటికాధ్వనుల్
స్వాంతమరుజ్జవప్రథితసైంధవమేదురకింకిణీధ్వనుల్
దంతిఘటాపరిప్రకటితధ్వజచిత్రపటీపటుధ్వనుల్. 59

క. ఆరవములు విని దశముఖుఁ, డీరసమున నట్టె లేచి యిదె చనుదెంచెన్
ధీరుం డగుయువనాశ్వకుమారుం డని వడి నెదిర్చె మంత్రులతోడన్. 60

చ. ఎదురుగఁ బోయి పంక్తిముఖుఁ డింపును సొంపును దెంపుఁ బెంపుఁ జ
క్కఁదనము రాజసంబు భుజగర్వము గల్గినయాన్నృపాలునిన్
గదిసి నరేంద్ర నేను దశకంఠుఁడ సంగరకాంక్ష వచ్చితిన్
బెదరక నన్ను మార్కొనుము భీతుఁడ వైనఁ దొలంగు నావుడున్. 61

సీ. నిడుదకన్నులక్రేవ నడరుకెంజిగి కర్ణసాంకవమతముతో సంధి సేయఁ [మెనయఁ
గనుబొమల్ ముడి నొందుకంటె ముందుగఁ గరంబున నున్నచాపంబు గొనయ
బెనుగాడ్పు సోఁకఁ గంపించుకెంజిగురు నాబెట్టుహుంక్రియ లాని పెదవి యదర
రమణీయరత్నహారచ్ఛలంబున మనగప్రకటరోమజ్వాల బయలు పడఁగఁ

తే. జలుకుచులుకున దశకంఠుఁ జూచి యార
యోరి పౌలస్త్య నాతోడనారణంబు
సేయ వచ్చితి మంచి దేమాయె నెదుటఁ
జక్కఁగా నిల్వరా యంచు జనవిభుండు. 62

క. పిడుగులకుఁ దోడు వోయిన, కడిఁదిశరము లసురతొమ్ము గాడఁగ నేయన్
జడియక యాయుధములకా, పడె నివుడీచినను లచుచుఁ బంక్తిముఖుండున్. 63

మ. పదికోదండము లొక్కసారి గొని దర్పం బొప్ప మాంధాతపైఁ
బ్రదరాసారము నింపఁ దద్విశిఖవర్షంబున్ నివారించి తన్

గదియన్ వచ్చు నిశాటమంత్రిమణులన్ గారించి భూభర్త బె
ట్టిదపుందూపుల నొంప నంతకునిమాడ్కిన్ రావణుం డుగ్రుఁ డై. 64

మ. తనబల్గోదుల నెల్ల నొక్కట నయోధ్యానాథుఁ డోధింపఁ బం
చిన వా రందఱుఁ జుట్టుముట్టుకొని యాక్షేపించి కోపించి మిం
చి నిశాతాస్త్రపరంపరల్ గురిసినన్ సింగంబు మాతంగభం
జనమున్ జేయఁ గడంగినట్లు నృపుఁ డుత్సాహంబు రెట్టింపఁగన్. 65

సీ. శుకునిఁ బండ్రెండుసాయకముల నొప్పించి సారణు నేడింట జడియ నేసి
ధూమ్రాక్షు నెనిమిదితూఁపుల నొగిలించి మారీచునిఁ బదింట మద మడంచి
జంబుమాలిని మూఁడుశరముల బడలించి యూపాక్షు నాల్గింట నుదుటుమాన్చి
త్రిశరునిఁ బదియేను తీవ్రాస్త్రముల నొంచి దుర్ముఖు నైదింటఁ దూల నేసి

తే. వెండియుఁ బ్రహస్తముఖుల నుద్దండచండ
కాండముల ఖండనము సేయ కుంఠఁ దఱిమి
తరమె నను గెల్వ నీ కని దశముఖాసు
రాగ్రగణ్యుని మాంధాత యప్పుడు పొదివి. 66

ఉ. క్రౌంచవిభేదశాలి యగుస్కందునిచందముఁ జెంది ముందె న
క్తంచరరాజుపేరురము గాడఁగ ముద్గర మెత్తి వ్రేసి నొ
ప్పించిన సొమ్మసిల్లి ధృతిపెంపునఁ దెప్పిఱి వాఁడు రాజని
న్నంచెద నేఁడు దండికడ కంచతిరోషకషాయితాక్షుఁ డై. 67

ఉ. అక్కనకాద్రి బిట్టదర నంటి యదల్చి యెదిర్చి యవ్విభుం
డెక్కిన తేరు సెక్కలుగ నేసి హయంబులఁ ద్రుంచి సారథిన్
దక్కక నొంచి కేతనము ధారుణిఁ గూల్చిన నాగ్రహించి వే
ఱొక్కరథంబుపై రవికులోత్తముఁ డెక్కె లయాంతకాకృతిన్. 68

చ. పటుతరఘంటికాక్వణనబంధుర మౌ మహనీయశక్తి యొ
క్కటి గొని పంక్తికంఠ తుదిఁ గంటివి పొమ్మని యేసి యార్చినన్
దటుకునఁ గేలిశూలమున దాని నడంచి దశాననుండు భూ
కుటు లెసఁగన్ నృపాలుపయిఁ గుంతము లిర్వది పూన్చి వైచినన్. 69

మ. అవి ఖండించి యఖండకాండములు చండాంశుప్రభోచ్చండముల్
యువనాశ్వప్రియసూనుఁ డేయ దనుజవ్యూహంబు భేదిల్లె నం
త వివస్వత్సుతదత్తదివ్యశర మాదైత్యేశ్వరుం డేసినన్
వివశుం డయ్యె నరేశ్వరుండు దివిజుల్ విభ్రాంతిఁ జింతింపఁగన్. 70

వ. తదనంతరంబున. 71

చ. నిమిషములోపలన్ దెలిసి నీరజబంధుకులాగ్రగణ్యుఁ డ
య్యమరవిరోధిమీఁద జలదాశుగ మేసిన వాఁడు మూర్ఛతో

స్త్రమున నడఁచె భూపతి కృశానుశరం బఁపోసి వైచినన్
విమతుఁడు రౌద్రబాణమున నిల్పెఁ దదీయశిఖాపరంపరల్. 72

శా. మాంధాతృక్షితినాథుఁడున్ గెరలి భీమస్ఫూర్తి బ్రహ్మాస్త్రమున్
సంధించెన్ దనవింట రాక్షసభటుల్ సంత్రాసమున్ జెంద గ
ర్వాంధుం డద్దివిజారి పాశుపత మేయన్ బూనె నయ్యుద్ధతిన్
గంధశ్రేణి గలంగెఁ గ్రుంగెఁ ధర యాకంపించె స్వర్ణాద్రియున్. 73

శా. ఆయుత్పాతి మెఱింగి యూడకుఁ బులస్త్యబ్రహ్మ వేంచేసి యే
లా యీయుద్ధము దీన లోకముల కెల్లన్ భీతి వాటిల్లె మీ
రాయుష్మంతులరై చెలంగఁ గల రుగ్రాస్త్రోపసంహారముల్
సేయుం డన్నఁ దదాజ్ఞఁ జేసి రటులే చిత్తంబు లుప్పొంగఁగన్. 74

దశవదనుండు చంద్రునిమీఁదికి దండెత్తి పోవుట

క. మునిపతి లోకహితంబుగ, మునుకొని తమకిటుల సఖ్యమున్ జేసి చనన్
జననాయకుఁడు యథేచ్ఛన్, జనియె దశాస్యుఁడును జనియెఁ జంద్రునిమీఁదన్.

వ. ఈచందంబున దశకంధరుండు మాంధాతృవసుంధరావరునితో సంధి గావించి సౌగంధికబంధుమదనిర్గ్రంధనోత్సాహంబు వహించి మహనీయ పుష్పకారూఢుండయి యమ్మహాగిరివరోపరిభాగంబున కుద్గమించి యవల విడంబితాడంబరంబునన్ బోయి పోయి పదివేల యోజనంబులపొడవునన్ బ్రథమభూమిక యనన్ దగి యగణితాఘర చరణారుణ ప్రభాపహసితాభినవహంసమండలం బగు హంసమండలములోఁ జని మరుత్పథంబు గడచి యవతల నంతదూరంబు నడిచి పుష్కలజలావిష్కృతపుష్కలావర్తకాది బహువిధజలధరప్రకాండంబులకు నుండ నిర వగు రెండవమండలంబు నతిక్రమించి యవక్రవిక్రమాసాధ్యులగు సిద్ధచారణసాధ్యులకు వీడుపట్టగు మూఁడవచోటు దాఁటి యమ్మీఁదట నవనాయకధీరతోదగ్రవినాయక భూతప్రేతపిశాచ నిశాచరగోచరంబగు నాలవ కక్ష్యాంతరంబు దరలి తరలీకృతవిస్తృతపాథోనికరశీకరంబుల నధోగతవలాహకగర్భంబుల నించుచు నుదంచితామరతరంగిణీ తుంగతరంగరంగత్కమల కుముదాపహృతులన్ బొలుపు మీఱుకుముదాది వేదండకాండంబుల విలాసంబులకు సదేశం బగుపంచమప్రదేశంబు వాసి వాసవాసిధారానివారణోదాం దారుణ కఠోరగరుజ్జాతసంచలన సముజ్జాతవాతావధూత సకలగ్రహమండలుం డగు నండజమండలాఖండలునకు బిడారగు నాఱవతావున వెడలి కడలిన్ బోలినగంభీరత్వంబు ధరించి నిత్యసత్యసంపదలన్ బెంపుగని నిర్దోషలీల గ్రాలుజమదగ్ని ప్రముఖమునిరత్నంబులకు నిదానం బగు సప్తమస్థానంబునన్ బయలుదేఱి యవారితమందారకోరకామందమందాకినీసరిజ్జలబిందుబృందంబున జెలువంది చలువల కెల్ల నెల్ల యగునెనిమిదవ నెల వొరసికొని తదూర్ధ్వ

మార్గంబున బడలువడక దశసహస్ర యోజనంబు లరిగి యవ్వల నయుతయోజ
నాయతం బగు సుధాకరలోకంబు విలోకించి తన్మధ్యభాగంబున. 76

సీ. తనమనోహరమూర్తి ధరణి జక్కని వారి కుపమేయపాత్రమై యొప్పు మిగులఁ
దనయంచితశ్లాఘ్యాభ్యుదయ మాశ్రయించిన విబుధుల కుత్కంఠ వెలయఁజేయఁ
దనవిలాసములు చెంతల నున్నరోహిణీప్రముఖకాంతల వింతబాళి ముంపఁ
దనచంద్రికామహత్త్వంబు బ్రహ్మాండకరండంబునకు గప్పురంబు గాఁగ

తే. దనరుహిమధామము సౌజన్యధామము సోముఁ, జేరబోయినయంతట శిశిరకిరణ
పాళి పైపైన మెలసినఁ బంక్తిముఖుని, మంతురుల మేను లెల్లఁ గంపంబు నొందె.

క. చలిఁ జనఁగాక వడంకుచు, నలజడిఁ బడి మంత్రులెల్ల నయ్యా యిచటన్
నిల లేము దొలఁగి చనుటకు, సెలవీ వలె ననుడు దనుజశేఖరుఁ డలుకన్. 78

శా. ఆహా తావకదేహముల్ వడఁకఁ జేయన్ జొచ్చె నీమూర్ఖుఁ డీ
నీహారాంశుఁడు దాఘఁ డించు కని యాగ్నేయాస్త్రరౌద్రాస్త్రసం
దోహంబుల్ శశిమీఁద నించుటకు నుద్యోగించినన్ బౌత్త్రభూ
గాహాశౌర్య మెఱింగి వచ్చె నటకున్ బద్మాసనుం డయ్యెడన్. 79

—— చతురాననుండు చంద్రునిపై దండెత్తిన రావణుని వారించుట ——

తే. వచ్చి యిది యేమి వత్స భవత్సమగ్ర, బాహువిక్రమ మీసితభానుమీఁదఁ
జెల్లునే చూప నీతఁడు చల్లనిదొర, వీవ వల దగ్నిబాణముల్ విడువు మలుక.

మ. అని వారించి విధాత వెండియును వత్సా నీమహానాహసం
బునకే మెచ్చితి మంత్రి మొక్కటి దయాపూర్వంబుగా నిచ్చెదన్
గొను మమ్మంత్రజపంబు సాంగ మయినన్ ఘోరాహవక్రీడ ని
న్నెనయన్ గెల్పది విఘ్నమైన నశుభం బేతెంచు శీఘ్రంబునన్. 81

మ. అది మృత్యుంజయ మాపదల్ వొడమి త్రోయన్ రానివేళం జపిం
చఁ దగున్ నీ కని శక్తికీలకఋషిచ్ఛందోధిదైవంబులున్
దుది హోమంబును దర్పణంబు విధియున్ దోడ్తో నెఱింగించి పూ
ర్ణదయన్ మంత్ర మొసంగి వెండియును గీర్వాభమాధవుం డిట్లనున్. 82

తే. అసురవల్లభ ప్రాణాత్యయంబునందు
నీశివాష్టోత్తరశతాఖ్య మేకతమున
నేజనుఁ డవిఘ్నముగ జపియించు వాని
కొదవు విజయంబు హాని యొకఁ గొదవ యైన. 83

సీ. దేవదేవుఁడు మహాదేవుఁ డీశుఁడు భూపభావనుఁ డభవుఁడు భవుఁడు శివుఁడు
భుజగభూషణుఁడు శంభుఁడు నీలలోహితుఁ డక్షరుఁ డజుఁడు వైయాఘ్రచర్మ
ధరుఁడు జగత్కర్త హరుఁడు లలాటాక్షుఁ డంతకాంతకుఁడు యుగాంతకరుఁడు
పశుపతి శూలి కపాలి కాలగ్రీవుఁ డుగ్రుండు భీముఁ డాద్యుఁడు గిరీశుఁ

తే. డతులుఁ డవ్యయుఁ డకలంకుఁ డష్టమూర్తి
యచ్యుతుఁ డనాదిలయుఁడు బ్రహ్మణ్యుఁ డచలుఁ
డస్థిహారుఁడు హారిసఖు డభ్రకేశుఁ
డాశ్రితులఁ బ్రోచు నని చెప్పి యజుఁడు సనిన. 84

మ. శశి నిర్జించితి నంచు నన్నెలవునన్ జాటింపఁగాఁ బుచ్చి నల్
దిశలన్ ఘూర్ణిలఁ జేయుతూర్యములతో దేవాచలాధిత్యకా
విశదేందూపలభూమికిన్ దిగి కడున్ విభ్రాంతితో నచ్చటన్
దశకంఠుండు వసించె నంబరసరిద్వాతంబు పై జాఱఁగన్. 85

వ. ఇవ్విధంబున నాఁటిరేయి యెల్ల నచ్చోట విశ్రమించి మఱునాఁ డరుణోద
యంబునఁ గాలోచితకృత్యంబులు నిర్వర్తించి. 86

క. అలరుచు లంకకు నిఁకఁ బో,వలయు నని యమాత్యభృత్యవర్గము వినఁగాఁ
బలికి నలుగడల విడిసిన, బలముల దివియించి దైత్యపతి పయనం బై. 87

చ. మణిమయదివ్యపుష్పకవిమానరుచుల్ దివి నిండ సైనికా
గ్రణు లిరువంకలన్ భటపరంపరతో నడువన్ శుకుండు సా
రణుఁడు ననేకభంగులను బ్రస్తుతి సేయఁగఁ బోవుచుండి రా
వణుఁ డొకఁడున్ విహార మొదవన్ దనవారలఁ జూచి యిట్లనున్. 88

మ. ఎలప్రాయంబును జెల్వమున్ జతురతల్ హేలావిశేషంబులున్
గలకన్యామణు లెవ్వరొక్కొ బలిమిన్ గాంతానుకూలంబుగాఁ
బలుమందిన్ జెఱఁ దెత్తు నా విని మహాపార్శ్వప్రహస్తాదిము
ఖ్యులు మోముల్ వికసిల్ల నిట్లనిరి రక్షోనాథుఁ డింపొందఁగన్. 89

సీ. ముదిమి యెన్నఁడు లేనికొదమప్రాయపుఁ జెల్వనేర్పులు వేల్పుఁగన్నియల కమరు
సొలపులబెళుకు జూపులతళ్కుఁ జెక్కులొయ్యారముల్ మనుజకన్యకల కమరు
నిడువాలుజడలు పెందొడ లంచనడలు నెన్నడుములు నాగకన్యకల కమరు
బాటలమేలిమి మాటలతియ్యఁదనంబు గంధర్వకన్యకల కమరుఁ [వగల

తే. మఱియుఁ దక్కినజాతులమందయాన, లొఱపులు వహించియుండు రొక్కొక్క
వీరిలో మెచ్చు వచ్చినవారిఁ బట్టి, తే వలయు నన్న నిందఱఁ దెత్తు ననుచు. 90

మహాస్రగ్ధర. కరుణాలేశంబు ధర్మక్రమము కలుషశంకాకలంకంబు లాత్మన్
జొరనీ కమ్మూర్ఖు దేవాసురనరవరచతుశ్శ్రీవస్సాధ్యవిద్యా
ధరసిద్ధాదిత్యరక్షోదనుజగరుడగంధర్వయక్షాదికాంతిగ
పురకాంతాశ్రేణి బల్మిన్ బొదివి బెదరి వాపోవఁగా బట్టి తెచ్చెన్. 91

స్రగ్ధర. చొచ్చున్ గేహాంతరంబుల్ సుడిసినమగలన్ జుట్టలన్ బిట్టు పొట్టల్
వ్రచ్చున్ శాతాసిధారన్ వనిత లతల లవ్యగ్రుఁ డై పట్టి యీడ్చున్
దెచ్చున్ యానంబుఁ జేరన్ దెస చెడి తను నిందించినన్ బీరముల్ వా
క్రుచ్చున్ సైరించి నన్నున్ గొలువుఁ డెటకుఁ బోఁగూడు మీకంచు నవ్వున్.

సీ. సీమంతమౌక్తికశ్రేణి జల్లన రాల దట్టించి ముందలల్ వట్టి యీడ్చి
వలుఁదచన్నులహారవల్లికల్ దెగిపోవఁ బయ్యెదల్ బలిమిమైఁ బట్టి తివిచి
కమ్మక్రొవ్విరిసరుల్ గాసి యై యసియాడ బలుకీలుఁ గొప్పులఁ బట్టి యీడ్చి
కడియముల్ గాజు లుంగరములు బిట్టూడఁ బల్లవహస్తముల్ వట్టి తిగిచి

తే. మూలమూలల నొదిఁగిన మ్రొక్కి వేఁడు,కొనిన మాయన్న కావవే యనినవృద్ధ
జనులమాటుల కేఁగిన సకియ లెంత, పొరలి యేడ్చినఁ బోనీక చెఱలు వట్టె. 93

వ. మఱియు సద్గుణహీనుండు గుఱి మేర యెఱుంగక తల్లిదండ్రులమఱుంగున నున్న మెఱుంగుఁబోఁడుల నత్తమామలక్రింద నున్నయుత్తమాంగనల మగలతోఁ గలిసి కాఁపురంబులు సేయుమహాపురంధ్రులఁ బురోపవనంబులఁ దోడి చేడియలతోడఁ గూడి క్రీడించుకాంచనాంగుల జలకేళిఁ దేలుబాలికల ద్యూతాదివినోదక్రియలఁ జిక్కిన చక్కెరబొమ్మలఁ బెక్కువగల నలంకరించుకొనుచంచలాక్షుల విమానంబు లెక్కి హరిపదమధ్యంబున విహరించు హరిమధ్యల గిరికందరంబులయందు వేడుకలఁ జెందుకుందరదనల సౌధమందిరాళిందంబులఁ దిరుగుమందగమనలఁ బరాంగన లనక బాలిక లనక నానాజాతులమానవతులఁ బలాత్కారంబునఁ బట్టి తెచ్చి పుష్పకంబుపై నుంచు నప్పుడు హాహాకారంబుతో విలపించువారును బలికినది వలుకుచుఁ దపించువారును నేమి సేయుద మని పలవించువారును నింత దురవస్థ వచ్చెనే యని తల్లడించువారును నుఱుమని పిడుగువలె నిచ్చెడు గెక్కడనుండి వచ్చె ననువారును నిట్టికష్టునకు సృష్టికర్త యెట్టివరంబు లిచ్చె ననువారును నింక నెక్కడ ధర్మంబు లోకంబు లన్నియు నధర్మోపహతంబు లయి చెడుకాలం బరుదెంచె ననువారు నయ్యో యింత యరాజకం బై దిక్కు లేక పోవునే యనువారును నోహో యింద్రచంద్రాదిదేవతలారా మీ రైన మా యాపద నివారింపరే యనువారును నీక్రూరునిచేతులు వెండికొండక్రిందఁ జిక్కిననాఁ డక్కై యడంగఁ ద్రొక్కి నుగ్గునూచంబు సేయక మరల వరంబు లిచ్చి హరుండు దమగోడుఁ బోసికొనె ననువారును హరుఁ డేమి సేయుఁ దొలిపుట్టువుల నేమి పాపంబు సేసితిమో యది యనుభవింపక పోవునే యనువారును జననీజనకగురుబాంధవప్రాణేశ్వరసఖీప్రముఖ సుహృజ్జనంబులఁ దలంచుకొని కన్నీరు నించువారును నిట్టూర్పులు నిగిడించువారును రావణా యింతదురాగతంబు గొఱ గాదు మదిమది నుండి యిట్టిపాపంబుల కేల యొడిగట్టెద వనువారును దమవారి నందఱం బట్ట పట్టిసంబునం దెగఁ గొట్టినట్టు మమ్ముం దెగఁగొట్టి పుణ్యంబు గట్టుకొమ్మనువారును నాఁడువారియుసురు గొంచెంబు గాదు నిన్నును నీవారిని నీఱుగావించుఁజుమీ యనువారును నిన్నివగలం బొగులు మగువలం బట్టి తెచ్చి వీరివలన నేమి సుఖం బనుభవించె దనువారును

బహుసంసారచ్ఛేదనంబులు సేసి యీసడియును దోసం బెన్నినాళ్లకు వీడు
కొనం గలవాఁడ వని వేమఱు వినక దిట్టువారును నై వానిచుట్టును నెఱసిన
యపయశంబు గనిపింపఁ జేయుకై వడి వీడిన కేశపాశంబులతో వానికీర్తిప్రతా
పంబులు విరూపంబు లయి పొడ వడంగువడువునఁ దెగిపడుముక్తికహారమణి
హారంబులతో వానిపాలిటిరాక్షససామ్రాజ్యలక్ష్మి సౌమనస్యంబు వాడిన తెఱం
గెఱింగించుభంగిన్ దుదిముట్ట వాడినప్రసవదామంబులతో వాని మించు
కలుష జలరాశి యిట్టి దని తెల్పునట్టుల యిట్టలంబుగఁ బుట్టి ప్రవహించు
నేత్రకజ్జలప్రవాహంబుతో వాఁ డెక్కిన విమానంబుతో వాని భస్మంబు
సేయం జాలు రోషజ్వాలికాభీలకటాక్షజాలంబులతో గడగడ వడంకుకొను
లతోఁ జడుపుఁ జెమ్మటలు దొలంగు మేనులతో నిట్టూర్పు సెగలన్ బొగులు
వాతెరలతో నశ్రుజలధారలన్ దేలుకన్నుఁ దామరలతో ముంగురులమొగిలు
తెగల మఱుంగుపడి మెఱుంగు దొఱంగు మోముఁ జందురులతో డెందంబుల
సందడించుచింతాపరంపరలతోఁ ( బొరలుచున్ దెరలుచు నలఁత నొందుచు
వ్రాలుచు సోలుచు మూర్ఛిల్లుచుఁ గార్చిచ్చు సుట్టు ముట్టిన నొల్లంబోవులేళ్ల
వలె నప్పల్లవపాణులు వెల్ల వెల్లనై ధైర్యంబు పెల్లున నుల్లంబు లొక్కింత సేసి
కొని తమయంతవట్టుం గూడుకొని యేకవాక్యంబుగా రావణు నుద్దేశించి
యి ట్లని శపించిరి. 94

దేవాదిస్త్రీలు రావణుని శపించుట

ఉ. ఏము పతివ్రతాత్వము వహించిన వారల మేని నిన్నినా
ళ్లేమి కొఱంత లేక చరియించితి మేని మదీయమానముల్
కామవశాత్ముఁడై చెఱుపఁ గాఁ బనిఁ బూనినయీదశాస్యుఁడున్
గామినివంక నే యడఁగుఁ గాక సుతానుజబంధుకోటితోన్. 95

వ. అని శపించి యంత నిలువక. 96

సీ. మనవారి వీఁడు ద్రుంచినచందమున వీని వారి వైరులు పట్టి చీఱ వలదె
యనదల నై చిక్కి మనము గుందెడులీల వీని యాండ్రును బలవింప వలదె
మనవంటిసతుల బల్మిని బట్టి యీడ్చు నీతులువహస్తము లెల్ల దునియ వలదె
వనితలు సుట్టు నేడ్వఁగ నవ్వుచున్నాఁడు వీనితలల్ గొట్టివేయ వలదె [య

తే. యనుచుఁ బ్రాణేచ్ఛలుడిగి యయ్యలరుఁబోండ్లు, తన్నుఁదిట్టుచుబిట్టురోదనము సే
నాలకించుచు నిస్తేజుఁ డయ్యు నెగ్గు, సిగ్గు లెంచక తనప్రోలు సేరె నతఁడు. 97

వ. ఇవ్విధంబున. 98

తనభర్తం జంపిన రావణుని శూర్పణఖ దూఱుట

చ. విమతజయంబు గాంచి చని వీడు సొరంగనె పుష్పకస్థిత
ప్రమదలయార్తనాదములు వాటిలె వారికిఁ దోడు వంత డ

య్యుమనముతోడ శూర్పణఖయున్ విలపించుచు వచ్చి యన్న పా
దములఁ బడెన్ దృగశ్రుజలధారలు గాల్వలు గట్టి పాఱఁగన్. 99

ఆ. పడినయనుజ నెత్తి బాష్పాంబుధారలఁ, దుడిచి యాదరణ దోఁప మాట
లాడఁ దొడఁగు నద్దశాస్య కర్కశచిత్త, మెఱిఁగి చెలియ లలికి యిట్టు లనియె.

ఉ. వీరులు లేరె యెందు బ్రతివీరులపైఁ జనరో జయింపరో
యీరస మెత్తి నీవలె నికృష్టత జెంది మఱంది నొంచిరో
ఘోరత నీకుఁ జూపఁ దగుచోటులు లేవె మహోగ్రపాపముల్
దూఱును సైఁచి నా బ్రతుకు ద్రుంగఁగఁ జేసితి వేమి సేయుదున్. 101

చ. పఱలొనరించుపాపములఁ బాపి హితాశ్రితబంధుకోటిఁ ద
త్పరమతి బ్రోవ నోపు దని బాంధవు లందఱు నమ్మియున్నచోఁ
గరుణ దొఱంగి నీతియును గాంచక వారల నీవ త్రుంప నె
వ్వరు నిను నాను గాదనెడువారు నిశాచరచంద్ర యీయెడన్. 102

క. 'బలియు రగుదొరలు తమగా, దిలిచెల్లెండ్రకు ధనంబుఁ దెత్తురు నాకి
ట్టుల మఱఁదిం బొరిగొని నీ,వలె వైధవ్యంబుఁ దెచ్చువారలు గలరే. 103

క. అనిదూఱెడుచెలియలిఁగనుఁ,గొని యతఁడనుఁదుములమునను గుఱుతెఱుఁగక డా
సిన నీపెనిమిటిఁ దునిమితి, వెనుక నెఱిఁగి పొక్కి పడితి వెలదిరొ యచటన్.

క. చేదప్పినకార్యములకు, వేదనఁ బొందుదురె జాలి విడువు మిఁక మనగ
ఖేదము విధి దప్పింపం,గా దరమే నీకు నాకుఁ గామిని చెపుమా. 105

రావణుండు వగచుశూర్పణఖను ఖరాదులతో జనస్థానమున కంపుట

ఉ. ఏమి కొఱంత నీకు జలజేక్షణ కోరినయెల్లవస్తువుల్
ప్రేముడి నే నొసంగెద దపింపకు నాయనుజాత వైనని
న్నీ మహిఁ దేఱి చూడఁ గలరే సురమానవదైత్యదానవ
గ్రామణు లిచ్చ వచ్చినప్రకారమునన్ జరియింపు మెయ్యెడన్. 106

చ. మనపినతల్లిపట్టి ఖరమానవభోజివరుండు దండకా
వనమున దూషణాద్యనుజవర్గముతో వసియింపఁ బోయెడిన్
జను మతఁ డాదరించు నిను సర్వధనంబును నేను బంచెదన్
వనజదళాక్షి నాకడకు వచ్చుచు బోవుచు నుండు మెప్పుడున్. 107

క. నేనొకటియు నతఁడొకటియు, నే నీకు మృగాక్షి యని యనేకగతుల స
మ్మానించి ఖరుని రక్ష, స్సేనాన్వితుఁ బిలిచి దనుజశేఖరుఁ డనియెన్. 108

చ. కవి వచియించె రాక్షసనికాయ్యము గాఁ గల దంచు దండకా
టవి యటు గాన నిల్వు మచటన్ బదునాలుగువేలరక్కసుల్
భవదనుజన్ములన్ గొలువఁ బాళెముపట్టొకచో రహింప నీ
యవరజ దీని శూర్పణఖ నారసికొంచు సమాదరంబునన్. 109

చ. త్రిశిరుఁడు మంత్రి దూషణుఁడు ధీరుఁడు నీదళవాయి యంచు న
ద్దశముఖుఁ డాతనిన్ బనుప వారును నేఁగి బలంబుతోఁ జతు
ర్దశభువనంబులున్ దలఁక దారుణవృత్తి ఖరుండు దండకా
ప్రశమములపాలిమృత్యు వయి రాజ్యము సేయుచు నుండె నయ్యెడన్. 110

ఉ. ఆదశకంఠుఁ డంత దనయంతిపురం బొకయింత సొచ్చెనో
లేదొ నిజాగ్రపుత్త్రుఁ డట లేమి నికుంభిల నధ్వరక్రియో
త్పాదనకాంక్ష నున్కి విని తానును నేఁగెఁ దదానసేక్షణా
హ్లాదపరీతబుద్ధి యయి యచ్చటి కందఱు వెంబడింపఁగన్. 111

ఇంద్రజిత్తు మాహేశ్వరక్రతు వొనర్చుట

మ. దశకంఠుం డిటుల న్నికుంభిల కుదాత్తప్రీతితో నేఁగి యం
దు శుచిప్రోద్ధతహోమధూమకలితాస్తోకార్చిరుద్దీప్తయూ
పశతాకీర్ణమఖాగ్రమండపగతున్ బ్రత్యగ్రయజ్ఞోపవీ
తశిఖాకృష్ణమృగాజినాన్వితు సుతున్ దర్శించి ప్రేమంబునన్. 112

మ. అవలోకంబున కుత్సవం బడర డాయన్ బోవునాలోన భా
ర్గవక్లృప్తాహుతివర్ధమానదమునగక్రాంతిన్ బ్రకాశించునా
హవదీక్షానిధి మేఘనాదుఁ డనుమోదాయత్తునిన్ తండ్రిఁ జూ
చి వినీతిన్ బ్రణతోత్తమాంగుఁ డయి మోడ్చెన్ రెండుహస్తంబులున్. 113

వ. అప్పుడు. 114

చ. ఇరువదిచేతులన్ గొడుకు నెంతయుఁ గూర్మిని గౌఁగిలించి వే
మఱు నడునెత్తి మూర్కొనుచు మై పులకింప ముదశ్రువర్షముల్
గురియుచు మోము సారెఁ గనుఁగొంచు సెగన్ దను వెల్ల గాసిగాఁ
జిరముగ నీడ నేమిపని సేసెదు వత్స గణింపు నావుడున్. 115

మ. దితిజాచార్యుఁడు వల్కె నాతనికిఁ బంక్తిగ్రీవ నీపట్టి దీ
క్షితుఁడై మానముఁ దాల్చినాఁడు మును పగ్నిష్టోమముఖ్యంబు లౌ
క్రతువుల్ పెక్కొనరించె నీశ్వరుని నారాధించి మాహేశ్వర
క్రతువున్ జేసిన శంభుఁ డీతనికి సాక్షాత్కార మయ్యెన్ దుదిన్. 116

మ. తన కీరీతిఁ బ్రసన్నుఁడై నశివుచే దంభూతవామాంగుచేఁ
గనియెన్ గామగ మానదృశ్యరథ మక్షయ్యాస్త్రతూణీరముల్
ధనువున్ దామసిపేరిమాయయుఁ దదస్త్రంబున్ రణాజయ్యన
ర్తనమున్ నీసుతుఁ డీముఖం బయిన నిన్ దర్శించి మాటాడెడిన్. 117

ఉ. ఈతరుణాగ్నిహోత్రి కృతకృత్యతఁ జెంది సమస్తశత్రుసం
ఘాతము నుగ్గు సేయు దశకంఠ యదృశ్యరథాధిరూఢుఁడై
శాతశిలీముఖంబు లురుచాపముఁ జేకొని మింట నిల్చినన్
నీతనయాగ్రణిన్ బొదువ నేరఁడు శూలియు నంచుఁ దెల్పినన్. 118

చ. అరుసముఁ జెందియున్ హృదయ మచ్చటివారి కెఱుంగ నీక యా
సురవిభుఁ డాభృగూద్వహునిఁ జూచి యిడెల్లను మంచి దైన న
ధ్వరములు సేసి శత్రు లగువాసవముఖ్యుల గెల్చె నాసుతుం
డరిభజనంబు సల్పఁ దగునయ్యు సురారుల కంచుఁ బల్కుచున్. 119

విభీషణుండు రావణునకుఁ బరాంగనాపహరణము గూడదని నీతి సెప్పుట

ఉ. అచ్చటఁ బాసి సానుచరుఁ డై దశకంఠుఁడు మున్ను తాఁ జెఱల్
దెచ్చిన కామినీమణుల దివ్యవిమానము డించునంతలో
వచ్చి విభీషణుండు దగవా పరకాంతల బల్మిఁ బట్టఁగా
హెచ్చెనె దీన శౌర్య మిది యేల యొనర్చితి రాక్షసేశ్వరా. 120

ఉ. అంగన లిందుఁ నీకుఁ గొదవా త్రిదివాంగన లేమిభాతి పు
ణ్యాంగనలన్ బతివ్రతల నార్యులభార్యలఁ దెచ్చి గాసి సే
యంగ నఘంబు వాటిలు మహాపయశంబును నగ్గలించు దా
నం గడతేఱు నాయువు ఘనద్యుతియున్ సిరియున్ బ్రతాపమున్. 121

ఉ. అంటిన మండుచుండుట మహానలకీలలు సేరఁ బోయినన్
గంటు వహించి యూఁపుసెగల్ నిగిడించుటఁ గాలభోగినుల్
జంట వహింప నాయువు వెసన్ గొనుటన్ గనిపించుమృత్యువుల్
గంటికి లెస్స యున్నఁ బరకాంతలు మేలని కోర వచ్చునే. 122

ఉ. ఏనరుఁ డెప్పు డేమి ఘటియించును దత్ఫల మప్పుడే కదా
వానికిఁ బ్రాప్త మౌ ననెడివార్త యథార్థతఁ జెందె నియ్యెడన్
దాని వచింతు దృష్టముగ దానవనాయక విన్ము సీమలోఁ
జానల నెల్ల బట్టి రభసంబున నీ విటఁ దెచ్చునంతలోన్. 123

ఉ. మానక మాల్యవంతుని కుమారికకూరిమిపట్టి యైనకుం
భీనస బల్మిఁ గైకొని యభీతిమెయిన్ మధుఁ డేఁగె నిప్పురిన్
దానవు లడ్డమైన నసిధార నడంచి పరాంగనేచ్ఛ నా
త్మానుజఁ గోలు పోయితి గదన్న విరోధులు చుల్క సేయఁగన్. 124

ఉ. అమ్మధుఁ డేగుదెంచునపు డబ్ధి మునింగి సమాధి నుండి నే
నమ్మెయి మేఘనాదుఁడును యజ్ఞవిధిన్ జలియింపకుండె నీ
తమ్ముఁడు సుప్తుఁ డై యెదిరిఁ దన్ను నెఱుంగఁడు గాన వానికిన్
గ్రమ్మఱ పోవఁ గల్గె నలుగన్ దగ దాతనిమీఁద నింకిటన్. 125

తే. ఏల యని యంటి వేని దైత్యేంద్ర మించి
మనసహోదరిఁ గొని పోయి మధుఁడు వానిఁ
బట్టి చంపిన నపకీర్తి బంధుహాని
యగు నుపశమింత మని తెల్పుననుజుఁ గినిసి. 126

ఉ. మంచివివేకి వెంతనయమార్గము దెల్పెద వే వసించుప్రో
లించుక డైన భీతి వహియింపక యొక్కఁడు సొచ్చి దైత్యులన్
ద్రుంచి సహోదరిన్ బలిమితోఁ గొని పోయి చెలంగుచున్కి యా
లించి సహింప వచ్చునె బళీ మధుదానవుఁ డింత హెచ్చునే. 127

ఉ. చిచ్చొడిఁ గట్టినట్టు చెడుసింహసటాచ్ఛట లూచ్చుపూన్కికిన్
జొచ్చుమదాంధుపోల్కి తనశూరత రావణుఁమీఁద జూపఁగా
వచ్చెఁ గదా మధుండు బహువాక్యులకున్ బని యేమి యిప్పుడే
యచ్చెడు గున్న చోటికి రయంబునఁ నేఁగి మదం బడంచెదన్. 128

వ. అని దురాగ్రహగ్రహావేశంబున నోడ లెఱుంగక కనుఁగొనల మిడుంగుఱులు సెదర నదరిపడి యప్పదిమొగంబుల పొలదిండిమన్నెవాఁడు తనసన్నిధి నలిక స్థలన్యస్తహస్తుం డగుప్రహస్తునిన్ గనుంగొని యిట్లనియె. 129

రావణుఁడు మధుం డనురాక్షసునిమీఁద దండెత్తుట

సీ. సంగరోచితగజస్యందనాశ్వపదాతివితతి సన్నద్ధమై వెడలఁ జేయు
హితమంత్రిసైన్యాధిపతులు మున్నుగఁ గలవారిఁ బిల్వఁగఁబడవాళ్లఁబనుపు
నేఁ డింత దెలిసి యున్నాఁడఁట మనకుంభకర్ణు రప్పింపు మిక్కార్య మెంచి
యావిభీషణుఁ గొల్చి యేమఱ కీలంక గావఁగాఁ దగుసేన గాపుఁ బెట్టు
తే. మనకుఁ దోడుగ మయపుత్త్రితనయుఁ డేఁగు
దేర నీ వేఁగి పయనంబు దెల్పు మాజి
మధుఁ దొలుత గెల్చి మఱి మీఁద మఘవుగెల్వ
స్వర్గమున కేఁగ వలె నన్న సరగ నతఁడు. 130

క. దొర సెలవిచ్చిన క్రమమునఁ, బరివారము నెల్లఁగూర్చి పణవహుడుక్కా
మురజజయానకఢక్కా, ద్యురువాద్యరవంబుతో మహోద్ధతి వెడలెన్. 131

వ. అప్పుడు. 132

సీ. వెసఁ బేర్చి నలువదివేలయక్షౌహిణుల్ నడచువేగంబున బుడమివడఁకఁ
గరిహరిరథభుజంగఖరాదిగతయోధజనులహుంకృతి నాకసంబు వగుల
ఛత్ర చామరకేతుసంతతచ్ఛాయల మార్తాండబింబు మఱుఁగుపడఁగ
సైన్యరజోజాతసాంద్రాంధకారంబు భటకృపాణప్రభాపటలి నడఁగ
తే. నగ్రమున నుగ్రబలశాలి యగ్రసుతుఁడు, కుంభకర్ణుండు నడుమ నుజ్జృంభలీల
నేఁగు దేరఁగ దశకంఠుఁ డేఁగి మధుని, పట్టణముమీఁద విడిసెఁ దత్పౌరు లదర.

క. మధుదైత్యునిపురమున కి,వ్విధమునఁ జని కోటచుట్టు విడిసి మహోగ్ర
క్రుధ యోధు లదర దశముఖుఁ, డధికోద్ధతి వానివీటి కరిగెన్ బెలుచన్. 134

ఆ. అరిగి మధుని నంతిపురమునఁ బొడగాన, కచట నిచట నరయు నంతలోన
నావిధంబు విని భయభ్రాంతయై తమ, యన్న కోప మడఁతు నని తలంచి. 135

క. మానితవేణీజితకుం, భీనస యనలాభిధానప్రియనందన కుం
భీనస యెదురుగ వచ్చి ద, శాననుచరణముల వ్రాలి యార్తి నడలినన్. 136

క. అడలార్చి పంక్తిముఖుఁ డ, ప్పడఁతుక వడి లేవ నెత్తి బాలా నీకున్
జడు పేల వేఁడి మధుఁ డె, క్కడ నున్నాఁ డనఁ బలుచు గళవళపడుచున్.

ఉ. కన్నుల శోకబాష్పములు గ్రమ్మఁగఁ బల్కె మధుండు బల్మిమై
నన్నిటఁ దెచ్చుకొన్నపుడు నావిభుఁ డయ్యె నతండు క్రూరుఁ డై
నన్నునుఁ జూచి తాళుటయె నాయముగా దని త్రుంచితేని నో
యన్న సహింప నేర్తునటె యన్న మహావిధవాత్వదుఃఖమున్. 138

ఉ. ఏదొక కార్యముం బదర కించుక తాల్మి వహించి చేసినన్
ఖేదము నొంద దా నృపతికిన్ నను సోదరి గారవించి ము
త్తైదువ జేయ నిం పొదవి నట్లయినన్ మధుఁ గావు మంచు నా
గాదిలితోడు వేఁడ దశకంఠుఁడు నవ్వుచుఁ బల్కెఁ గ్రమ్మఱన్. 139

ఉ. నెమ్మది వంత మాను తరుణీ మధుఁ గాచితి నిన్నుఁ గూర్చి నీ
కమ్మల కెగ్గు నేఁ దలఁప గ్రక్కున నారజనీచరాగ్రణిన్
రమ్మను మింద్రుమీఁద బవరం బొనరింపఁగ నేఁడె పోవలెన్
నమ్ము మదీయభాష లనినన్ వనితామణి సంతసించుచున్. 140

మ. చని యభ్యంతరకేళికాగృహమహాశయ్యాస్థలిన్ నిద్రపో
వు నిజాధీశు వినిద్రుఁ జేసి పటుసత్త్వుం డైన మాయన్న యిం
ద్రునిపైఁ బోవుచు నుండి నిన్నుఁ దన కెంతే కూర్మిమైఁ దోడు ర
మ్మని ప్రార్థింపఁగ వచ్చె నా విని మధుం డానందముం బొందుచున్. 141

ఉ. ఆదశకంఠుఁ జేరఁ జని యర్చన లిచ్చి యథోచితంబుగా
సాదరభాషలన్ బడసి యందఱకున్ తగ విందుఁ జేసి యా
మోదము నెయ్యమున్ వినయమున్ గనిపించిన హృష్టచిత్తుఁ డై
యాదినశేష మాతనిగృహంబున నిల్చి క్రమించి వేకువన్. 142

మ. మధురాలాపములన్ సహోదరిని సమ్మానంబు గావించి ప్రే
మధురాంచన్మతి నామె వీడుకొని సమ్యగ్బాహుశౌర్యంబునన్
మధునిన్ బోలుమఱందిఁ దోడ్కొని మహామాత్యుల్ భటుల్ బంధు ల
మ్మధునిన్ గూడి పలాశు లాదటఁ జనం బౌలస్త్యుఁ డుప్పొంగుచున్. 143

రావణుఁడు మధుసహితుం డై యింద్రునిమీఁదికి యుద్ధమునకు వెడలుట

మ. వెడలెన్ వాజిఖురాగ్రఘట్టనల నుర్విన్ దాల్చు శేషాహియున్
బడగల్ వంపఁ జమూసమూహజరజఃపారంపరిన్ వేల్పు లే
అడుసున్ జెంద భటార్భటీపటహశంఖాభీలఘోషంబులన్
జడదిధ్వాన మడంగ స్వర్గపురజిగీషాబద్ధచేతస్కుఁ డై. 144

వ. ఇవ్విధమున వెడలి యక్కడిందిరక్కసిపిక్కలజోడు ద్రొక్కుడులేనినిడుదపయ
నంబులన్ జని చని. 145

సీ. పూరియుఁ గట్టెయుల్ నీరును గలపథంబున సేన నడిపించుభూరిశక్తి
పాళెంబు డించుచోఁ బయనంబు సేయుచో నెందులఁ గ్రందు గానినినేర్పు
పనికిరాఁ గలవీరభటులకు నాడాడ బహుమానము లొలంగు ప్రాభవంబు
వలసినవస్తు లవ్వారిగా శిబిరంబునందె కల్పించుమహావిభూతి

తే. యడుపు లేఱులు పల్లంబు లనక నుద్ద,విడి రథాములతోఁ జొచ్చువిపులధాటి
దనకె చెల్లు ననంగ నద్దశముఖుండు, వెండిమలదండ కవు డేఁగి దండు విడిసె.

క. ఈలీల వెండిమలకడఁ, బాళెము డిగి వేల ముడిగి పరిసరవరకం
కేళీపనసాళీఘన, కేళీవనదర్శనేచ్ఛ గిటికొన మెలఁగెన్. 147

ఉ. వాసవుమీఁదఁ బోవు దశవక్త్రుఁడు గెల్పు వహింప విక్రమో
ల్లాసిపలాశిసంగతిఁ జెలంగు లతాంగన లింపొసంగఁభృం
గీసముదారగానములఁ గ్రేవలఁ దెమ్మెర రాల్చుక్రొవ్విరుల్
సేసలు వెట్ట రొక్క మొగి శ్రీకరపల్లవరాగముల్ దగన్. 148

సూర్యాస్తమయవర్ణనము

మ. తరుణాదిత్యుల నిగ్రహించుటకుఁ గా దండెత్తె నాదిత్యభీ
కరుఁ డిప్పంక్తిముఖాసురుం డితనిరంగద్దోర్గ్రపతాపంబు నే
జరతాదిత్యుఁడ నోర్వ నేర్తునె వృథాచండత్వ మింకేల యన్
కరణిన్ భానుఁడు మందరశ్మియగుచున్ గాన్పించెఁ దోఁచ్తోడుతన్. 149

సీ. హంసాఖ్యఁ గనుట దివ్యస్త్రైణఘుసృణపంకిలనభోనదిఁ గ్రీడ సలిపె నేమొ
యాకాశమణి యాట నాత్మారుణప్రభాశ్రేణి గన్పడఁ బ్రకాశించెనేమొ
ప్రతిసంధ్యల నెదుర్చుప్రబలమందేహదైత్యులఁ దాఁకి నెత్తుటఁ దోఁగెనేమొ
యపరదిక్పతి మిత్త్రుఁ డనుమైత్త్రిఁ గెంబట్టు దనకొసంగినఁ గప్పుకొనియెనేమొ

తే. సప్తసప్తిఖురాఘాతచరమశైల, కటకగైరికధాతురాగముల నెరసి
తనువునిండినరక్తిగ్రక్కొనియెనేమొ, యనఁగ నరుణిమజరఠార్కుఁడపుడు మెఱసె.

మ. అపరత్మాధర మెక్క వచ్చుసంసీజా ప్తున్ విలోకించి భీ
తిపరీతం బయి దద్గుహాకుహరవర్తిష్ణుత్వముల్ మాని తూ
రుపు గట్టెక్కఁగఁ బోవుచీఁకటులభాతిన్ బోలి నీడల్ సుదూ
రపథాక్రాంతి వహించె భానుతనయాప్రస్ఫీతకుల్యారుచిన్. 151

సీ. అబ్జసికాంతశోకాంధకారము నిజోదరసంగిభృంగకైతవ మనంగఁ
జక్రవాకీజాతిస్మరశాతశరహేతిశోణప్రతిప్రభాశ్రేణిఁ దెల్ప
ఖగపంక్తి దనవియోగమునఁ గాంచువిరాగ మహీఘోరతరుకోటరాప్తి నడువ
దినలక్ష్మి తుదను జెందినవివర్ణత్వంబు వికచకైరవకాంతి విస్తరింప

తే. నచలసంఖ్యాశ్వములె కాని యమితవాజి
వితతి లే దని కాండాధిపతిని వేఁడు
కొనెడుతలఁపున నరిగెనో యనఁగఁ బశ్చి
మాంబునిధి వ్రాలె రుచిమాలి యంశుమాలి. 152

మ. ఇనుఁ డస్తంగతుఁ డైనఁ బాంథజనులన్ హింసింప మారుండు గూ
ర్చినకెందామరమొగ్గగుంపులొ జగాచెంగల్వపూములుకులో
యనఁ జండాంశునిపాతనిస్సహనతావ్యాసంగబాహ్యాప్రవ
ర్తనభాగ్యాఢ్యబకీలికీలరుచి సంధ్యారాగముల్ రాజిలెన్. 153

## తమోవర్ణనము

చ. అలసి పతంగదేవుఁ డపరాంబుధి వ్రాలిన వేడ్కతో రసా
తలముననుండియున్ వెడలి దారుణకాలభుజంగసంఘముల్
గలయఁగ నెల్లదిక్కులను గ్రమ్మెనొ శత్రుఁ డనంగ రాహు వ
గ్గలికఁ దమోగతిన్ జగముఁ గైకొనెనో యన మించెఁ జీఁకటుల్. 154

తే. ఉప్పరము పేర నొప్పెడుకప్పుటనఁటి, నుప్పతిలి చుట్టు రావున కప్పురంపుఁ
గప్పులో యన మందారకోరకాభఁ, దారకావళు లంబరస్థలిని నెరసె. 155

సీ. రతిచన్నుమిట్టల రాణించుకస్తూరికాపంకమునఁ దిలకంబు దిద్ది
కేళినీభ్రూయుగశ్రీలఁ బోలెడునల్ల చెఱకుసింగిణివిల్లు చే ధరించి
మోహంపురాణిక్రొమ్ముడుమెమ్మె కెన యైనబలునారి పలుమాఱుఁ బట్టి దీటి
లచ్చికోడలికన్నులకు దీటు వచ్చునీలోత్పలశరపంక్తి లోనరఁ దాల్చి

తే. లలితకలకంఠకోలాహలంబు లెసఁగఁ, దళముకొని రెండుగెడలఁ గాడంబకోటి
గొల్వ రాచిల్కసాంబ్రాణిగుఱ్ఱ మెక్కి, దర్పకుఁడు పాంథజనులపై దండువెడలె.

ఉ. కోరినమంచితేనియలు గ్రోలఁగ నిచ్చి సుగంధసంపదల్
చూఱలు గొన్న నోరిట రజోగుణయుక్తి దళంబు లొందఁగా
జేరిక సేయుపద్మినుల శ్రీ దొలఁగన్ గుముదిన్యుపాంతముల్
సేరె మదాళు లాశ్రయవిశేష మెఱుంగుదురే మలీమసుల్. 157

మ. తొలియిక్కల్ పఠికించుఁ గన్నొలుకులందున్ నీరు నించున్ జలిం
చు లసత్పంకజకోరకాగ్రముల నస్తోకార్తిఁ బ్రాపించు తె
క్కలు ముక్కుల్ దుద నప్పళించు సరసిన్ గాన్పించు నాత్మాంగమే
తిలకించున్ బతి యంచుఁ గోకి యొక తెంతేఁ గంతుసంతప్తయై. 158

## చంద్రోదయవర్ణనము

క. కలువలకు మేలు దెలుపఁగ, నలయుచు కోరికలవనట లడఁపఁగఁ దొలుతన్
నెల పనిచిననెచ్చెలి యనఁ, దొలిదిక్కున ధవళకాంతి తోరం బయ్యెన్. 159

సీ. యామినీ ప్రాణనాయకురాక విని వానియడుగుల కిడినట్టిమడుఁగనంగ
శ్రీసహోదరుని గర్భీకరించిన పూర్వదిక్కాంత నెమ్మోము తెలుపనంగఁ
దాలినెలదాల్పు కేదార విడియింప నిర్మించినమగఱాలమేడ యనఁగఁ
గొడుకురాఁగలఁడంచుఁగడు బొంగువాహినీవరుని యూర్మ్యులమించునురుఁగనంగఁ

తే. దూర్పుదిక్కునఁ బాండిమ దోఁచె నంత, లోనదోడ్తోడ సమయాభిధానమాని
విష్ణుపదము నివాళింపవేడ్కనెత్తు, కప్పురపుదివ్వె యన సుధాకరుఁడు వొడమె.

భుజంగప్రయాతము—

క్రమించెన్ బ్రగాఢాంధకారంబు వెల్గా
క్రమించెన్ దివిన్ జంద్రికల్ దారకాభల్
శమించెన్ భ్రమించెన్ వెసన్ గోకి పేరా
శ మించెన్ జకోరద్విజశ్రేణి యాత్మన్. 161

చంద్రికావర్ణనము

మ. నవచంద్రాతపకాంతిలక్ష్మి దొలుతన్ రాణించె దిక్కుడ్యభా
గవిరాజన్మృదుశోణమృత్కలనరంగచ్చక్రచక్రచ్ఛద
చ్ఛవిదాయాదసమేధమానరుచిఁ జంచత్ఫుల్లసౌగంధికా
టవిసంబంధివిభాధురంధరపటిష్ఠత్వంబు వాటిల్లఁగన్. 162

వ. ఈక్రమంబునఁ గ్రమక్రమప్రవర్ధమానంబై నెగడునియ్యగణితసాంద్రచంద్రి
కానికరంబు హరిహరిదంత దంతావళ చతుర్దంత దంతుర ప్రభాసముల్లాసంబున
నుల్లసించి యుల్లసితగిరిమల్లికాప్రసవవల్లికామతల్లికల మొల్లంపుఁగాంతు లెల్లం
గొల్లలాడి ప్రథమకుధరాధిత్యకాస్థలచరత్సటీశ్వరసటాచ్ఛటాస్వచ్ఛతరవిభాగు
ఛుచ్ఛంబుల నాచ్ఛాదించి జల్లిమెకంబుల వెల్లజల్లులతో నల్లిబిల్లియై భిల్ల
పల్లవాధరలు భల్లపరంపరలన్ బగిలించిన ముదురువెదుళ్ల నుండి జల్లున రాలి
నలుదెసల నెరసిన క్రొత్తముత్తెంపుముత్తంబుపై నత్తమిల్లి చిత్తజక్రీడాయత్త
చిత్తంబుతో నెత్తంబుపట్టుల హత్తి మరులెత్తి వేడుకకాండ్రతోఁగూడి క్రీడిం
చుఖచరమత్తకాశినుల బిత్తరంపుగుత్తంపుగబ్బిచన్నులపైఁ జిక్కువడువెల
యెక్కుడుమగఱాలసరులనిగన్నిగల కగపడి విమానంబులెక్కి యుప్పరంబునఁ
దమయిచ్చఁగాఁదిరుగునచ్చరయొప్పులాఁడుల కప్పుఁగొప్పులం జుట్టినవేల్పుఁజెట్టుఁ
బూదండలదండితనంబున మెండుకొని పురోపవనసరోవరపరిసరంబుల నొప్పెడి
పుష్పాడిదుమారంపుఁదిప్పల కుపనాథులన్ దెచ్చుకొని మచ్చికలఁ గలిసి విహ
రించునెడఁ జీమ చిటుక్కుమనన్ గళవళించి మోములు వెలవెలంబారన్ బెదరి
పడరెడివారిం జూచి కిలకిలనవ్వుజవ్వనంపుజవ్వలాఁడుల మవ్వంపు నవ్వులతోఁ
జివ్వలకునివ్వటిల్లి యింటిముంగిళ్లం దెల్లనిచల్వపాన్పులపైఁ బవ్వళించి పెందల
కడనె వచ్చెద మని వాక్రుచ్చి ప్రొద్దువోయి వచ్చిన ననుపుకాండ్రఁ గటా
క్షింపక మొగంబు లవలం బెట్టుకొని నిట్టూర్పులు నిగుడించి మించిన వలపున

నిట్టట్టన నేరక యూరక యున్న నీ నేరంబు కావఁ దగు నని తమయనుఁగులపై వ్రాలినఁ గెరలి పదతాడనంబు గావించుకించువెలయాండ్రచరణనఖకాంతులపై దొంతరలు గొని యింతలింతలబుడుతలతో నింతులతోఁ బంతులు సాఁగి పరమాన్నాదిపదార్థంబులు భుజియించుకలవారివెండిపళ్లెరంబులకునించకనించిన సమంచితక్షీరధారాపూరంబయికలధౌతమయసౌధోపరిపరిచితమృదులశయ్యా తలంబులం జేరలు విరహిణీజనంబుల విరహపాండురశరీరంబులకుఁ బూయక పూసిన ఘనసారంబై యుబుసుపోకలకు నెలదోఁటలో మెలంగుమెఱుంగుఁ బోఁడులు చిన్నిపొన్నగున్నలం గని పూవక పూచె నన ననవింటి మన్నెవాని కీర్తిమూర్తిభవించి భువనంబుల వ్యాపించె నన ముజ్జగంబులం బ్రవహించు గంగాతరంగిణీజలకంబులకెల్లఁ బావనత్వంబు సంఘటిల్ల నొక్కటియై యిటువలె వెల్లివిరిసిన దన నక్షరనిరూపణక్రియాధురీణం బై ప్రజ్ఞానందకరం బగు సుజ్ఞా నంబు తెఱంగునం జెలంగి యిల్లటపుటల్లుం డై యెల్లప్పుడు రమావల్లభుండు దనలో నుల్లసిల్ల నతని సర్వవ్యాపకత్వంబు సత్త్వసమగ్రం బగుటఁ దానును వహించి పాలవెల్లి ప్రపంచంబునం దెల్ల వ్యాపించెనో యనఁ జకోరికానికతృష్ణా తరంగంబుల కాకరంబై కరంబు మెఱసి సితసరసీరుహముకుళంబులవికల త్వంబు పరిహసించులీలఁ దొరసి మరాళకులాధ్యక్షవలక్షపక్షంబులకు వన్నియ పుట్టించి గుహాకుహరంబులు వెడలి నిలువం దగుకోనలలోఁ జెలువగుచలువ జాతిన్నియల నెలకొన్నతమవెనుకదిక్కుల కొదిగి యేమఱించి కన్నులమూసి పలుకకున్న నెచ్చెలులపేరులు నొడివి తము మెచ్చి చేమూఁతలు సడలించువారిం బెఱమఱలిచూచి కెరలి నవ్వుచిలువరాచపడుచులక్రేగన్నులతళుకులం దులకించి కిలికించితవతులగు యువతులం గలిసి యలసిన కాముకులఘర్మకణజాలవిలా సంబుల నపహరించి హాలారసపానలీలామదలోలాత్మకత్వంబునం బరిత్యక్తచేల లై బయలు దేఱి బహువికారంబులం బొదలుశబరాభీరమ్లేచ్ఛాదిజాతులనెల తలభ్రాంతిపరిధానధారణంబునకుఁ గారణం బగు వైఖరి ధరించి శరధితరంగ మాలికాడోలికాకేళికాలోలజలబాలికాపాలికలతనురుచులదండ నిండికొని పాండురడిండీరఖండంబుల మెండునఁ గండుమీఱి గండుమీలజఠరవిశాల ధాళధళ్యప్రకాశంబులకు సంకాశం బగువిధం బావహించి వేలావన నవైలా లతామందిరాళిందంబుల నింపొందెడి గంధర్వమిథునంబు లొంపారులకుఁ మొనపంటసగంబు గొఱికి యిచ్చు తెల్లనియాకుమడుపుల కనుంగువలె ననంగి పెనంగి సంక్రందనచందనగంధ్యలికఫలకంబునం గులుకుకర్పూరతిలకంబుతోఁ దులఁదూఁగి వేఁడివేల్పువెలందిమిన్న వేనలి నలవరించుకొన్న సన్నజాజి విరులసరులసిరులం గడలుకొని యంత కాంతగపురకాంతామణి సీమంత ముక్తామణీసంతతులకు వింతకాంతులు సంతరించి పుణ్యజనాగ్రగణ్యాలావణ్య

పతీకరముకురదీధితిప్రకరంబువలె సుకరం బగు తెఱంగు గైకొని రత్నాకరాధీశ్వర వధూభయపార్శ్వప్రద్యోతమాన ధవళచామరద్యుతులకుఁ బెన్నుద్దిపద్దునం బెద్దయు రహించి గంధవహగంధసింధురగమనావతంసశ్రవణావతంసకైరవశ్రీలం గీలుకొని ధననాయకనాయికాంగుళీకలితవజ్రమణిముద్రికానుకారిత్వంబున డంబు మీఱి కుమారజనకప్రియకామినీవక్షోరుహ క్షౌమపటాంచితకంచుకచ్ఛాయలచాయల మెలంగి యంగజభసితాంగరాగసంగతగంగాధరాంగరంగద్విభావిభవంబులో రవణంబు గని శరవణస్ఫురణంబునం బొంపిరివోవు కైలాసశైలంబుపై దండు విడిసిన దశముఖునివీరభటుల చేతివిచ్చుకత్తులతళతళల హత్తుకొని యతనివెలిగొడుగులపడగలబెడంగులనుడుగనికడిమిం బొడరి ఘనసారవిభాసితంబు గా కుండియు ఘనసారవిభాసితం బై తారకాభిఖ్యాభిరామంబుఁ గాకుండియుఁ దారకాభిఖ్యాభిరామం బై చక్రరంజనకరంబు గా కుండియుఁ జక్రరంజనకరం బై హంసప్రకాశదూరంబు గా కుండియు హంసప్రకాశదూరం బై వదాన్యవదనంబువలె సుప్రసన్నతాసన్నం బై కౌముది గావున సకలపదార్థపరిజ్ఞానంబునకు నిదానం బయి యసూనం బయ్యె నయ్యెడ. 163

దశగ్రీవుండు కైలాసోద్యానమందు విహరించుట

తే. అట్టివెన్నెలబైట దశాననుండు, తనబలంబుల కెడ గాఁగ దలఁగి వెండి
కొండపై నొక్కసెలయేటిదండనలరు, నలరుఁదోఁట బ్రవేశించి యన్నెలవున.

మ. అవలోకంబులకుం బ్రియం బడరఁ జేయన్ మల్లికామాధవీ
లవలీముఖ్యలతాగృహోజ్జ్వలరసాలప్లక్షజంబీరనిం
బవటాశ్వత్థకపిత్థహేమకదళీపాటల్యశోకాదిభూ
జవిశేషంబులడంబు మెచ్చుచు యథేచ్ఛన్ గ్రీడఁ గావింపుచున్. 165

శా. ఆకప్రంపుటనంటిమూఁకఁ నడిచాయన్ మించుపన్నీటికే
ళాకూళిన్ దిలకించి యాదరిని జెల్వం బైనచెంగల్వరా
జాకట్టుం దెలిచల్వదిన్నెఁ గని యారా యెంతసౌఖ్యప్రదం
బై కన్పట్టిన దీస్థలం బనుచు దైత్యస్వామి యం దుండఁగన్. 166

సీ. గేదంగివాసనల్ గిలుబాడి నునుసురపొన్నపువ్వులవలపులు గ్రహించి
పొగడలపరిమళంబులు గొన్ని లంకించి మొల్లలనెత్తావికొల్లలాడి
పాటలీసుమసౌరభము చూఱగొని మల్లియలసుగంధశ్రీలనపహరించి
విరవాదుల నెసంగుసురభిళత్వము గాంచి చంపకామోదతస్కరతఁ మించి

తే. పరిసరసరశ్చరమరాళపక్షచలిత, లలితజలబిందుబృందతుందిలతఁ జెంది
మెట్టచెంగల్వపుష్పాదుల్ మెట్టిమెలఁగు, చలువతెమ్మెరయమ్మేటిశ్రమముమాన్చె.

శా. ఆమందానిలువెంబడిన్ స్మరధనుర్జ్యాబంధవుష్పంధయ
స్తోమధ్వానము మించె నంచితశుకీసూక్తుల్ రహించెన్ బిక

శ్యామాగానము మించె నంత నలకాసౌధాంతరస్త్రైణవీ
ణామాధుర్యసువాద్యముల్ దశముఖానందం బొనర్చెం దగన్. 168

వ. ఇవ్విధంబున. 169

మ. పలుతావుల్ వెదచల్లు తెమ్మెరలు పైపై డాయ రేరాజు వె
న్నెలగాయన్ మధుపాళిమ్రోయఁ గలకంఠీపాళి గూయన్ మరు
ల్లలనల్ గానము సేయ నొంటి నిశివేళన్ దోఁటలో నైందవో
పలవేదిన్ వసియించుపాంథుని స్మరాపస్మారముల్ సేరవే. 170

ఉ. చక్కెరతిండితత్తడి వెసన్ దుమికించుచు బంతికంతుఁడా
చిక్కతి వంచు నించువిలు చేకొని యెక్కడి కల్వతూపుచా
లెక్కుడుకిన్కతోఁ దొడిగి యేసి మనోభవుఁ డార్చె నందునన్
జిక్కనితాల్మి కత్తిళము చిన్గిన స్రుక్కి సురారి యాత్మలోన్. 171

సీ. చక్కనిచెలి చెక్కు నొక్కునప్పుడు గదా యీచందురాతిన్నె యింపొనర్చుఁ
గలికిబొక్కిలిసొరు గాంచునప్పుడు గదా యీపొన్నపూఁదోఁట యింపొనర్చుఁ
జానవాతెఱతేనె లానునప్పుడు గదా యీతేనెసెల యేఱు లింపొనర్చుఁ
సుదతి ముచ్చట చెవి సోఁకునప్పుడు గదా యీచిల్కగుమిపల్కు లింపొనర్చు

తే. నతివచిఱునవ్వు వీక్షించునప్పుడు కద, యీశరచ్చంద్రచంద్రిక యింపొనర్చుఁ
బెక్కులేటికి నిందొక్కటక్కులాఁడి, యిపుడుదొరకినఁగద యిన్నియింపొనర్చు.

తే. అనితలంచుచు నుస్సురుమనుచుఁ బట్ట, పగలుగా వెన్నెలలుగాయఁ దొగలతేని
నట్టెచూచుచువిరహార్తుఁడగుచుముద్దు, గుమ్మయొక్క తెరాగోరుకొనుచునుండె.

వ. అయ్యవసరంబున. 174

సీ. కులిశాయుధునినిండుకొలువులో గుజరాతిమేలుఁ గోవులఁ గొంత మెప్పు వడసి
యనిమొనఁ దెగివచ్చినట్టివీరుల నెదుర్కొనఁ దోడచేడెలఁ గూర్చిపనిచి
యిదుగో మీవిడిదల కేను వచ్చెద నంచుఁ దమకించుయజ్వలఁ దాళఁ బలికి
చెలిమిచే వెంటవచ్చిన మేనకాదిపూర్ణేందుబింబాస్యల నింద్ల కనిచి

తే. ప్రాణపదమైనఘనరాజు పట్టిమీఁది, శాలి త్వర సేయ రంభ లోపలికిఁ బోయి
కాసె చనుకట్టు బంగరుగజ్జె లాది, గా వదలి శీఘ్రమున జలకంబు లాడి. 175

సీ. ఎలమాదళపుమేలిజిలుగుపావడ చూచి వల దని చలువపావడ ధరించి
చంద్రికపనివన్నెచేల యే లని హొన్ను జిగిబురుసాపనిచీరఁ గట్టి
కస్తూరికాచర్చ సిస్తు గా దని సీటుగాఁ దావికుంకుమగంధ మలఁది
జంటము త్రెపుకట్టుజంటరవిక మాని రహియించు మొగ్గలరైక దొడిగి

తే. కపురతిలకంబు ముత్యాలకమ్మదోయి, తారహారము మగతాలదండ రెంట
పేట పాపటబొట్టును సీటు గులుక, నాత్మ కింపైనసింగార మవధరించి. 176

క. ఎడ లేక కపురవాసన, లడరెడిబాగాలు కొన్ని యాకుమడుపులున్
బడఁతుక వడి నిడుకొని వెం, బడిఁ బడి రా రంభ సంభ్రమంబున వెడలెన్. 177

వ. ఇవ్వడువున నిల్లు వెలువడి యప్పల్లవాధర నలకూబరోపగూహనోల్లాసంబునన్
బయలుదేఱి మేలివలిపెసరిగంచువలువపై శాణిశాలువ మేలిముసుంగిడి శర
ద్ఘనంబులో వెలింగెడు నెలరేఖం దృణీకరించి మగఱాలపంజరంబునఁ జెలరేఁగు
వలరాయనిపట్టంపురాచిల్క కనుంగు చుట్టంబై దిట్టతనంబుతో నవనిధిపట్ట
భద్రునిపట్టణపథంబు వట్టి పదంబులం బెట్టినమెట్టియలు కిటకటంబులతో బిట్టు
గా మొరయ రజతగిరి కరుగుదెంచె నట్టిసమయంబున. 178

క. అరుదెంచి తోడిచేడియఁ, బరికించి సమీప మయ్యెఁ బడఁతిరో యలకా
పుర మిదె యదె యాచక్కని, దొరబంగరుమేడ యనుచుఁ దొయ్యలి యవలన్.

మ. కనియెన్ మత్తగజోత్కరోత్కరజపూత్కారోత్కటాంభఃకణా
ర్ద్రనభఃప్రాంచితతారమున్ సురనదీరంగత్తరంగాబ్దరం
గనటద్ధాతృతురంగసంఘుఘనశంకాకృద్విపిలాంశుకే
తనదివ్యద్రథఘోరమున్ దశముఖోద్యద్వాహినీవారమున్. 180

క. కని యివి రావణసైన్యము, లని తెలిసి వయస్యఁ జూచి యసురులు మూర్ఖుల్
చనరా దీ తెరువున నిఁకఁ, జనఁ దగు గిరిమీఁద మనకు సకియరో యనుచున్.

క. ఆలలనామణి యసురుల, పాళెమునకుఁ గొంత తొలఁగి పావననందా
కూలంకషయవ్వలిదరి, కేళీవనిఁ జొచ్చె నిజసఖీరత్నముతోన్. 182

రంభ నలకూబరునికడకుం బోవుచు రావణుం డున్నయుద్యానవనంబునకు వచ్చుట

తే. ఇవ్విధంబున దశకంఠుఁ డేకతమున, నున్నయెలదోఁటయే దైవయోగమునను
లేమ పులియున్న పొదసొచ్చు లేడిపగిది, జొచ్చియచ్చోటు మెచ్చుచువచ్చునపుడు.

సీ. అప్పద్మనయనకీల్కొప్పునఁ జుట్టినవిరిమల్లెసరములపరిమళంబు
లక్కొమ్మనుదుట సోయగముగా దిద్దినగర్పూరతిలకంబుకమ్మతావి
యబ్బోటిబిగిగబ్బిగుబ్బల నలఁదినకుంకుమగంధంబు క్రొత్తవలపు
లచ్చెల్వచెవినంది నమరుసంపెగపువ్వుచాయలజవ్వాదిసౌరభంబు [పంక్తి

తే. లమ్మెఱుఁగుఁబోఁడి పుక్కిటతమ్ములమున, బుగులుకొనువాసనయుఁ గొనిపోయి
ముఖునియాసలు సఫలత మొనయ నెదురఁ, బెట్టెఁ జలపాదితెమ్మెరపిన్నవాఁడు.

శా. అయ్యామోదము నాసికాపుటగతం బైనన్ దశాస్యుండుం
డయ్యా రే పరమాద్భుతం బయినదివ్యామోద మే తెంచె నే
యొయ్యారంపుమిటారి చేరినది యీయుద్యానభూభాగమున్
వెయ్యేలా యటు లైన ధాత నిపుడే వేనోళ్లఁ గీర్తింపనే. 185

వ. అని తలంచుచు నిజాగ్రభాగంబున. 186

క. కరకంకణపదమంజీ,రరవంబులు దిశల నొరయ రశనయు మొరయన్
మరుగజ్జెలగుత్తులువలె, సరభసమున వచ్చువేల్పుసానిం గాంచెన్. 187

క. కని నివ్వెఱపడి భ్రమఁ గొని, తనువు మఱచి కొంతవడికిఁ దనుఁ దెలిసి దశా
ననుఁ డవ్వనితరూపవిల,సనములు పలుమాఱుఁ బొగడసాగెన్ దనలోన్. 188

సీ. మించు దృష్టికి మిఱుమిట్లు గొల్పెడునిది తెలియఁ గారుమెఱుంగుఁదీఁగయేమొ
కారుమెఱుంగున కిట్టికళ గలదే యిది సొబగైనవెన్నెలసోగ యేమొ
వెన్నెలసోఁగ కీచిన్నె లున్నవె యిది మరునిరాచిల్కసాంబ్రాణి యేమొ
చిలుకసాంబ్రాణికిఁ జెలువంపునడ లుండునా యిది కలికిరాయంచ యేమొ
తే. కలికిరాయంచ కీసోయగంబు గలదె, యిమ్మెగల దిది జాళువాబొమ్మ యేమొ
జాళువాబొమ్మ కీవిలాసములు గలవె, మెచ్చ నగునచ్చరనెలందిమిన్న యేమొ.

మ. మదనుండే సృజియించె దీని నజుపై మాఱొడ్డి లేకున్న నీ
యుదుటుంగుబ్బలపొంక మీమొగములో నొయ్యార మీమేనిలో
కుదు రీకన్నులబెళ్కు లీతళుకుకీల్గొప్పున్నశృంగార మీ
పదియార్వన్నెపసిండిచాయ మఱి యేపద్మాక్షికిం గల్గునే. 190

సీ. కలువ లీ డనవచ్చుఁ గలువల కిటువంటిసొగసుడాలు మెఱుంగుచూపు లున్న
జక్కవల్ సాటి నాఁ జను జక్కవల కిట్టియెడ లేనిపొందిక లెపుడు నున్నఁ
దేంట్లు దీ టనఁ దగుఁ దేఁటు లీకిటున గుంపుఁ బాయక జత గూడి యున్న
జిందంబు సరిపోల్పఁ జెల్లుఁ జిందమున కీయందంపుటెలుఁగుచె ల్వంది యున్న
తే. నెటుల సాధర్మ్య మించుక యేని లేని, వాని నెటువలెఁ బ్రతిసేయ వచ్చుదీని
జళుకువాల్గన్నులకు గుబ్బచన్నులకును, గప్పుకీల్గొప్పునకు మెడయొప్పునకును.

ఉ. పచ్చలకంకణమ్ములును భాసిలుదాపలికేల జాళువా
కుచ్చులకొంగు దాల్చి తళుకుం దెలిచెక్కులు చెమ్మరింపఁగా
హెచ్చుపిఱుందుభారము సహింపక నెన్నడ లింత కొంచఁగా
నెచ్చటనుండి యెచ్చటికి నేఁగెడునో యిది యొంటిపాటునన్. 192

మ. నునువాల్చూపుల బెళ్కునెమ్మొగమునందుం దెల్ల మాతెల్విగు
ల్కునడల్ గీల్కొనుతత్తరంబు పలుకోర్కుల్ సంతసంబుం బెనం
గొనుభావంబు సఖీహితోక్తులపరాకున్ మీఱ నిక్కొమ్మ యొ
క్కనిపై మేల్పడి యేఁగుచున్నపొలపుం గాన్పించె నాచూడ్కికిన్. 193

సీ. ఏమోహనాంగుఁ డీయెలనాగముచ్చటల్ వించుఁ గౌఁగిట గారవించునొక్కొ
యేయెమ్మెకాని కీయింతి వాతెఱతేనె లిచ్చి పైకొని రమియించునొక్కొ
యేమనోహరుఁ డీవధూమణీమణితంబుచేఁ బారవశ్యంబుఁ జెందునొక్కొ
యేవన్నెకాని కీలావణ్యవతిగోటిచెనకులు కళ లూరఁ జేయునొక్కొ
తే. యీవెలఁదిజన్మనామంబు లేమియొక్కొ, మేలుగొని నన్నురతికేళి నేలదొక్కొ
యేలకుండిన దీని నే నేల విడుతు, నని దశాననుఁ డుద్వృత్తి నట్టె లేచి. 194

ఉ. బావురుగానిఁ జూచి నెఱ పైకొనఁ దల్లడ మందుమాఁదుతే
జీవలె గుండె జల్లు మనఁ జేడ్పడి వేల్పు వెలంది పోవ నా
త్రోవకు నడ్డమై నిలిచి తొయ్యలి కేల్గవఁ బట్టి నిల్పి సోఁ
పావహిలంగ దాని మొగ మట్టె కనుంగొని రావణుం డనున్. 195

రంభారావణసంవాదము

ఉ. ఎవ్వరిదానవే జలరుహేక్షణ యెయ్యది పేరు దెల్పవే
జవ్వని యెవ్వనిం దలఁచి చయ్యనఁ బోయెదవే మిటారి నీ
జవ్వనమున్ విలాసమును జక్కఁదనంబును నీటుఁ జూచినన్
బువ్విలుకానికైన భ్రమ పుట్టు గదే భువనైకమోహినీ. 196

సీ. కురులు నున్నఁగ దువ్వి కొప్పుఁ బెట్టిననీటుఁ గనుఁగొన్న మోహాంధకార మొదవు
రైకలోఁ గుల్కుతోరంపుగుబ్బలకుంకుమపుఁబూఁతఁ గనుఁగొన్న మలయు రక్తి
చెవిసంది హొయలుగాఁ జేర్చినతొగరేకుఁ దిలకింప నామోదములు జనించు
సొగసుకుచ్చెలముడి జోక శోభిలునాభిఁ జూచిన మురువడి సుళ్లు వొడముఁ
తే. కప్పురపురేఖ దగు నెమ్మొగంబు చందు, రహిం విలోకింప మదిచందురా గరంగు
నింతసింగార మూని యీయింతిఁ గూడి, యెందుఁబోయెద వీవేళయందు బాల.

సీ. దినము ఫలాహారమునఁ దపింపఁగఁ గదా చిలుకలు నీలాగు పలుక నేర్చెఁ
దలిరుటాకులు దిని తప మూనఁగాఁ గదా పైకంబు నీపాటి పాడ నేర్చె
నలరుతేనియ లాని యడవి నుండఁగఁ గదా యళులు నీచూపుల ట్లలర నేర్చె
జలము గ్రోలి తటాకముల వసింపఁగఁ గదా యంచ నీనడలసోయగము నేర్చె
తే. నెలఁత యిటువంటి నీమాట నీదుపాట, నీసొలపుచూపు నీనడల్ నెమ్మి వినఁగఁ
గనఁగఁ దొరకునె సామాన్యకాముకులకుఁ, బలుతపంబులు గావించి బడలకున్న.

ఉ. కొప్పాకచేతఁ బట్టి మదిఁ గోరిక లీరిక లెత్తఁ దేనియల్
చిప్పిలుమోవిఁ గ్రోలి నునుచెక్కిలి నొక్కుచు గుబ్బ లంటుచుం
గప్పురవీడె మిచ్చి తమకంబున నీవి వదల్చి యంత ని
గ్గొప్పపిఱుందుపై నొలసి కూడిన మేటికి స్వర్గ మేటికిన్. 199

చ. పలుకులు వేయు నేల నిను బాల కనుంగొనినంతనుండియుం
జిలుకపటాణిరౌతు త్వర సేసె నిఁకం దమి నిల్పఁ జాల నీ
మొలకమిటారి తేటనగుముద్దుమొగం బొకయింత యెత్తి తోం
గలి నను తెప్ప లార్చి కడకంటఁ గనుంగొని కౌఁగిలింపవే. 200

ఉ. లోకము లేలు వేల్పుదొరలున్ సురలున్ నరులున్ భయస్థులై
చేకొను మంచు నన్ను నుతి సేయుచు మ్రొక్కుదు రట్టివాఁడ నే
నీకు నిజంబుగా వలచి నేఁ డిదె యంజలి చేసి మ్రొక్కెదం
జేకొని మోవితేనె దయ సేయఁ గదే తగదే కలంపఁగాన్. 201

మ. అనుమానింపకు నన్నువంటిపురుషుం డాశించినం ద్రోచిరా
జని వేఱొక్కని డాయ నాయమఁట నాయందున్ విమర్శించి చూ
చిన గోరంత కొఱంతయుం గలదె నీచెల్వంబు సాఫల్యముం
గన నాముచ్చట దీర్పవే యని బలాత్కారంబు గావించినన్. 202

క. గడగడ వడఁకుచు నుడువులు, తడఁబడ సి గ్గడర నెడఁద దడదడ మనఁగా
జడుపుం జెమ్మట నొడలుం, దడియ దశాస్యుఁ గని రంభ తడయక పలికెన్. 203

ఉ. వేడుకకాండ్రకై తిరుగువేశ్యల నాడినజాడ నన్ను ని
ట్లాడఁగఁ బాడి యౌనె దనుజాధిప మామవు నీవు నీకు నేఁ
గోడల వావి దప్పుదురె కోవిదు లన్యులు మోహదృష్టిపై
నాడిన మాన్చు నీవె కలియం దమకించెద వేమి సేయుదున్. 204

చ. పొలు పగు బ్రహ్మవంశమునఁ బుట్టి శ్రుతుల్ పఠియించి ఘోరని
ష్ఠలఁ దపముల్ ఘటించి బహుసత్క్రియ లూఁదినమిమ్మువంటి పె
ద్దలె తగువావియున్ వరుస దప్పి చరించిన నమ్మ చెల్లగా
ఖలు లిఁకఁ బాయ నేరుతురె కాపథముల్ దనుజేంద్ర నావుడున్. 205

క. పకపక నగి దశకంఠుఁడు, సకి నాతనుజునకు నీవు సతివై కోడం
డ్రిక మెప్పుడు చేసితివి నీ, వొకమే నే నెఱుఁగఁ దెల్పుము నిజం బనినన్. 206

శా. అంభోజానన పల్కెఁ దావకసుతుం డౌనేకదా యుంచితా
రంభుం డానలకూబరుం డతఁడు భార్యం గా ననుం జేకొనెన్
రంభానామముదానఁ గోడలిని గానా నీకు నీపట్టితో
సంభోగించినయప్పుడే తెలియు మీచందంబు దైత్యేశ్వరా. 207

ఉ. నీకొమరుండు మెచ్చుటకె నేఁ డిటువంటిమనోజ్ఞ వేషమున్
జేకొనిపోయెదన్ విడువు శీఘ్రమె పోవలె వేచియుండు నా
రాక కతండు విక్రమధురంధరుఁ డించుక యల్గెనేని చీ
కాకువడున్ జగంబు లదిగాక తపోధనవంతుఁ డారయన్. 208

క. నన్నుఁ గని కోడ లనుచును, గన్నులఁ గప్పుకొని ప్రియము గావింతురు మీ
యన్నయు వదినెయు నటువలె, మన్నింపఁగఁ దగదె నీవు మామవు గావే. 209

చ. కొమిరెలు నీకు లేరె పదికోటులు వత్తురు కోరితేని నీ
తమకము మేర గాదు సుతుదారను బట్టి దశాస్యుఁ డెంత య
క్రమ మొనరించెఁ జూడు మనరా సరివా రపకీర్తి హేతువౌ
నిమిషసుఖంబుఁ గోరి జననిందలఁ బొందుదురే భవాదృశుల్. 210

మ. తగదయ్యా దశకంఠ వంశగుణవిద్యాశ్రీలఁ బోకార్చుచేఁ
త గదయ్యా యిది తాల్మి నన్ విడిచి పెద్దల్ సన్న త్రోవన్ మెలం
గి గురుత్వంబు వహింపవయ్య యని యగ్గీర్వాణి ప్రార్థింపఁగా
నగుచున్ దైత్యుఁడు రంభవా తెలిసెఁ గాంతా నీ తొడల్ చూచినన్. 311

సీ. పౌండరీకనిరూఢిఁ బరఁగువారికిఁ గాక కలికి నీకనుదోయిఁ గాంచఁ దరమె
హరిమేధకలనఁ బాయనిధన్యులకుఁ గాక పడఁతి నీలేఁగౌను పట్టఁ దరమె
తెలిక్రైదువ్రులఁ దారసిలుశూరులకుఁ గాక చెలి నీకటాక్షంబుఁ జెందఁ దరమె
ధర్మసంగతి మీఱఁ దగుధీరులకుఁ గాక చెలియ నీకనుబొమల్ తెలియఁ దరమె

తే. రాజసూయక్రియాలీల రహి వహించు
సుగుణులకుఁ గాక నీముద్దు మొగము దొరయఁ
దరమె యితరుల కతెనుండు తజీమె నన్నుఁ
దర మెఱిఁగి చన్నుఁగవఁ జేర్చి తరుణి ప్రోవు. 212

చ. కులిశముచేతఁ గానిపని కోమలి నీనునుసోగకల్కివాల్
తళుకుమిటారిచూపులె కదా నెఱవేర్చు బలారికొల్వులోఁ
గలవెలయాండ్రకెల్లను శిఖామణి వీవె కదా మఖక్రియల్
సలిపెడివారి కంచితఫలంబు గదా నినుఁ గూడి యుండుటల్. 213

చ. పెడవిలుకాఁడు నల్ బరిభవించె నిఁకల్ నిను మానఁ జాల నె
క్కడిపెడవావు లెన్నెదవు కామిని యెక్కడ నేను మామ నె
క్కడికోడు కేటి కోడలవు కంటిమె యచ్చరముచ్చెకంటి కె
క్కడ నొకరుండె భర్త యనఁగా విని యుంటిమె తక్కు లేటికిన్. 214

మ. అలివేణీ పదిలోపలం బదునొకం డై యుండెనో లేదొ జ
క్కులరేరాయలపట్టి యంతటనె నీకుల్ వాఁడు నిక్కంబుగాఁ
జెలువుండే కద నీకు మామ నగుదుల్ జేజేలకుల్ నీకునుం
గలవే వావులు నన్ను మాత్రము వితా కారింతురే మాటలన్. 215

సీ. జనకుండు సుతుఁడును జన్నంబు సేసిన వనిత వా రేమి కావలయు నీకు
నన్నదమ్ములు సోమయాజులై వెలసిన వనిత వా రేమి కావలయు నీకు
బావయు మఱఁదియు బవరానఁ గూలిన వనిత వా రేమి కావలయు నీకు
నల్లుఁడు మామయు ననిఁ ద్రెళ్లి వచ్చిన వనిత వా రేమి కావలయు నీకు

తే. వావి వరుసలు గణియింప వచ్చితేని, వనిత మాతోడ మాటాడ వశమె నీకు
జాలు నిఁక నేల రమ్మని కేలు వట్టి, బాలఁ గొనిపోయి చెంగల్వపాన్పుఁ జేరి.

సీ. తమకించి యొడినుంచి తమ్మిఁబోలినమోము జిగి దక్కు మోములు చేర్చిచేర్చి
యెలతూండ్లనగుబాహువులుగుండ బెడిదంబు లగుసందిళులసందినదిమి యదిమి
లవలీదళములట్ల సవరైన చెక్కులు వాఁడువాఱఁగ ముద్దులాడియాడి
చిగురుఁ గేరెడుమోవి నొగిలించి పలుగెంపు లడరఁ జేయుచుఁ దేనె లానియాని

తే. కుసుమమంజరు లన మించుగుబ్బచన్ను,లగడుపడ బెట్టు కరముల నలమియలమి
నీవి సడలించి బడలించి నెలఁత నపుడు, కఠినరతుల నలంచె రాక్షసవిభుండు.

మ. అకృతాశ్లేష మవీక్షితానన మయుక్తాలాప మవ్యంజిత
భ్రుకుటీకప్రణయం బకల్పితసకృత్సంభావ మవ్యక్తబం
ధకళామర్శ మలబ్ధకూజిత మసందష్టాధరం బయ్యె దై
త్యకులేంద్రుం గరఁగించె దానిరతి మాహా వానిమే లిట్టిదో. 218

మ. కటిచక్రంబు చలించె హారగతముక్తాతారకల్ రాలె నం
తట మోముం దాఁగె వేణిఁ గుంతలవిభాధ్వాంతంబు వ్యాపించె ను
త్కటవక్షోజగిరుల్ వడంకె నవలగ్నవ్యోమముం మేఖలా
ర్భటి మ్రోసెం దనుజుండు బల్మి మెయి రంభం బట్టి భోగింపఁగన్. 219

సీ. రాజహంసవిహారరమణీయతా[illegible] గొలని యులాయంబు కలఁచినటులు
సింధురాయకుపొందు సేయఁ బోయెడితరంగిణి మదేభము గలఁగించినటులు
పున్నాగసంశ్లేషమున కెక్కు నెలతీఁగెఁ జెనకి గాడ్పు చలింపఁ జేసినటులు
వలరాజుచేమించువహిఁ గాంచి దులకించు నలయంచఁగిటి నొంచి యలఁచినటులు

తే. ధనవిభుని పట్టి గనుసట్టితలఁపు పుట్టి, యాసురంభను బలిమిమ్మై నిటుల పట్టి
బెట్టిదపుకేళి నలమటఁ బెట్టి విడిచి, పెట్టె దశకంఠుఁ డామేలు కట్టె వెట్టి. 220

వ. ఇక్కైక్కవడి నమ్మొక్కలివగరక్కసిచుక్కలరాజుచేత నొక్కవడువున విడువంబడి
వెంబడిం బడి నిబ్బరంబుగాఁ దలుముగబ్బి బెబ్బులివాతికిం జిక్కియుం జిక్కక
మగుడినహరిణికరిణి రాహుముఖగహ్వరంబునం బడి బయలు దేఱిన చంద్రకళ
చందంబున నుద్దండగృధ్రతుండాగ్రనిహతిఁ దప్పి వెలువడు చిలువ చెలువ చెలువునఁ
జెదరినముంగురులతోఁ బెదరినబెళుకుచూపులతోఁ బ్రిదిలిన నివీబంధంబుతో
వదలిన కేశపాశంబుతోఁ బగిలినబింబాధరంబుతో నొగిలిన చెక్కుటద్దంబులతోఁ
గరఁగినకపురంబుతిలకంబుతోఁ బెరిగిన తారహారములతో బడలిన నెమ్మొగంబుతో
వెడలినయశ్రుజలధారలతో సొలసినకన్నుఁదామరలతో నలసినకోమలాంగ
కంబులతో వాడినవిరిసరులతో వీడినభూషణంబులతో నసియాడుచిన్నయడు
గులతో వసివాడు నెన్నడుముతో నలఁగిన గబ్బిగుబ్బలతోఁ గలఁగిన నెమ్మనం
బుతో గాసివడినజఘనంబుతో వాసిచెడినతనుకాంతితో వ్రీలినకంచుకంబుతో
రాలిన చేర్చుక్కముత్యములతోఁ బొలుపులేని యంగరాగంబులతోఁ దలఁప
రానిదీనభావంబుతోఁ గసిగందిన బాహులతలతో వెసఁ గుందిన పిందొడ
లతో నెడలేనిగోటిచెనకులతోఁ గడలేనిచింతాభరంబుతో నాకారంబుఁ దాల్చి
వచ్చినశోకరసాధిదేవతవలె నద్దైవతయువతీమణి త్రోవ కెదురువచ్చి యూఱడించి
మచ్చికమాట లాడు నెచ్చెలికై దండ గొని యులయుచు సొలయుచు నిట్టూర్పు
నిగుడించుచుం జని చని. 221

మ. అలకాపట్టణరాజమధ్యమున నీ కాసీలపుంగోటలో
పలిబంగారుబజారముం గడచి నుం బ్రాఁగెంపుజామేడలో

నలుకఁ గీల్జడ గొట్టుకేళికిని జోహారిడ్డ కెందమ్మిఁ బోం
దళపుఁ గౌతుకను వ్రాసినట్టిపడకింటఁ మించుపూఁబాన్పునన్. 222

సీ. హెచ్చువాసనవక్కలిచ్చి చుట్టినయాకుమడుపు లీఁ దివిరెడునడపదాని
వినికివేళ యిదంచు వీణె మెచ్చుగ మేళవించి తెచ్చినగానవిద్యదానిఁ
బాలివోని నేర్పుతోఁ బూవుటెత్తులుగట్టి వేడ్కఁ గానుక లిచ్చువిరులదానిఁ
బరిహాసకులు నటుల్ బయకాంత్రు మొగసాలఁ గాచినా రని తెల్పుకటికదాని

తే. నించుకయుఁ దేఱి చూడక నెంచుమీఁది
హాళియును లేక యింత ప్రొద్దాయె రంభ
రాక యున్న దదేమికారణమొ యనుచు
దలఁచు నలకూబరునిఁ జేరి తలిరుబోఁడి. 223

క. అడలుచుఁ గాటుకకన్నీ, రుడుగక జడివట్టి కురియ నొడలు గడగడన్
వడకఁగ నిట్టూర్పులసెగ, లడరఁగ దీనగతి నతనియడుగుల వ్రాలెన్. 224

వ. ఇవ్విధంబున. 225

చ. అడుగుల వ్రాలి యేడ్చుజవరాలి విరాళియు వింతతత్తఱం
బడరఁగ లేవ నెత్తి యొడియం దిడి చేలకొనం గనుంగవన్
జడిగొనునశ్రువుల్ దుడిచి జాఱెడి క్రొమ్ముడి చక్కఁ బెట్టి యా
బిడ మొగ మట్టె గన్గొని కుబేరునికూరిమిపట్టి యిట్లనున్. 226

సీ. కవజక్కవల టెక్కుఁ గాంచునీచనుదోయి కలికి యేకతినుండు గాసిపఱిచె
గోదమతుమ్మెదలబ్బుహొదలునీ నెఱికురుల్ చెలియ యేమలినుండు చిక్కుపఱిచె
వెలలేనికళలతో వెలయు నీనెమ్మోము వనిత యేవికలుండు వాడుపఱిచె
నంటినఁ గందుపూవంటి నీనును మేను మగువ యేదుర్జాతి యగడుపఱిచె

తే. నెలఁత యేచలచిత్తుండు నీపిసాళి, కలికివాల్గన్నులను నీరు గ్రమ్మఁ జేసె
దరుణి వివరింపు మేనీచతముఁడు మీఁది, చేటెఱుంగక నిశ్చింతఁ జేసె ననిన.

ఉ. కోమలి వంత నున్న రని కుందుచు మేను సెమర్పఁ గేలుకెం
దామరదోయి మోడ్చి ధననాయకనందనుఁ జూచి పల్కె నో
స్వామి నినుం గనుంగొనెడివాంఛ దివంబుననుండి యీవయ
స్యామణితోడఁ గూడుకొని చయ్యన నే నిట కేఁగుదేరఁగన్. 228

మ. ననుఁ ద్రోవం దిలకించి పంక్తిముఖుఁ డన్యాయంబునం గేలుప
ట్టినచోఁ బట్టి రమించినట్టి తెలిగంటిం బట్టి భోగింప వ
చ్చునె మామా తగ దంచుఁ గోడల నటంచున్ జాలఁ బ్రార్థించినన్
వినఁ డద్దుష్టుఁడు బల్మిఁ బట్టి చెఱచెన్ వేమాట లిం కేటికిన్. 229

చ. తగవును ధర్మ మూఁకొనని దైత్యునికిం బలుకాన దిక్కులే
కగపడి గాసిఁ బొందు మని యంబుజగర్భుఁడు వ్రాసి యుండఁగా

వగ లిఁక నేల నైన బలవంతుఁ డొకం డిటు చేసె నంచు నీ
మొగమునఁ దెల్పి నీహృదయముఁ గౌఁగిలించుట కార్తిఁ జెందెదన్. 230

చ. అగములవ్రక్కలించుకులిశాయుధునంతటివానినీటిపై
జగడము సేయఁ బోవునెఱసాహసి పట్టిన నాఁడు దాన నే
వగ విడిపించుకోఁ గల నవారణ మానము పోకముందరన్
దెగువకుఁ జొత్తు నన్నుఁ గువిధిన్ విధి చేసె నమర్త్యకాంతగాన్. 231

నలకూబరుండు రావణుని శపించుట

క. నలకూబరుబిగికౌఁగిట, నలరుచు సుఖయించు రంభయఁట యిరువదిచే
తులరక్కసిబలుసందిటఁ, గళవళ మందునఁట దైవగతి కే మందున్. 232

మ. అనుమాటల్ విని గుండె దిగ్గు మనఁగా నాస్యంబు కెందమ్మితో
నెన గాఁ గన్నుల మంట లంటికొనఁగాఁ నీర్ష్యాభిమానంబులన్
బెనుగాయంబుల నాత్మ నొప్పికొనఁగాఁ బేరల్క శాంతిక్షమల్
సనఁగా నన్నలకూబరుండు దనుజున్ శాపింప నుద్యుక్తుఁ డై. 233

మ. తనలో నొక్కముహూర్త మయ్యసురకృత్యం బెల్లఁ జింతించి వీ
ని నిరోధించుట మంచికార్య మనుచున్ నిష్కర్ష గావించి ది
గ్గనఁ బూఁబానుపు డిగ్గి దోయిటను గంగాతోయముం బూని బు
ద్ధి నిరూఢస్థితి మించి రావణుని నుద్దేశించి సక్రోధుఁ డై. 234

ఉ. ఈదనుజుండు కోరిక వహింపనిరంభను బల్మిఁ బట్టిన
ట్టాదట నింక నొప్పనిమృగాక్షుల బల్మిని బట్టెనేని స
మ్మోదము దీఱ నంత శిరముల్ పదియుం బదినూఱువ్రక్కలై
మేదిని గూలుఁ గావుత నిమేషములో భువనంబు మెచ్చఁగన్. 235

మ. అని శాపోదకముల్ విసర్జనము సేయన్ దేవతల్ మెచ్చి బో
రన వర్షించిరి పుష్పవర్షము లవార్యస్ఫారధారాధర
స్వనగంభీరమృదంగఘోషముల దిక్చక్రంబు భేదిల్లె నం
దునఁ గాబేరి నుతించుచున్ సతులు సంతోషించి రెంతేనియున్. 236

క. ఆపౌలస్త్యకుమారుని, శాపము విని పంక్తిముఖుఁడు సంతాపించెన్
బ్రాపించె నాఁటనుండియుఁ, గోపనలమనోంబుజానుకూలత్వంబున్. 237

వ. తత్సమయంబున. 238

శా. అన్నాళీకభవప్రదత్తవరమాహాత్మ్యంబునం గ్రూరుఁ డై
యెన్నం డెవ్వరి రావణుం డతనిదుష్టేచ్ఛల్ నివారించె నేఁ
డన్నన్నా నలకూబరుండె ప్రబలుం డంచున్ సుధాంధుల్ నుతుల్
పన్నన్ సాగిరి తారలం బడినబాలల్ వొంది రానందమున్. 239

క. అలప్రియురాలికి నిటువలె, నలకూబరుఁ డుత్సవం బొనర్చి తదీయా
విలభావ మడఁచి యిచ్చెను, వలసినటుల మెలఁగె రామ వసుధాధీశా. 240

## ప్రభాతవర్ణనము

వ. అని పల్కి యగస్త్యమహామునిచంద్రుండు వెండియు రామచంద్రున కిట్లనియె.

సీ. పౌండరీకసమృద్ధిఁ బాపఁగా శశికీర్తి మలఁగె నానెన్నెలల్ కలఁక బాఱెఁ
బతివివర్ణత సుక్కుసతుల కన్నులపోల్కి రాజు చెన్నఱఁ జకోరములు బడలెఁ
బద్మినుల్ వెతఁజెందఁ బరిహసించినదోషమున నాఁగఁ గుముదినుల్ మురువుదొఱఁగెఁ
బాంథసంహారపాపమున మూర్ఛిలె మారుఁ డన రతికుచముల నలసి తూఁగె

తే. నిదుర లుడిగి పునారతి కెదల వ్రాలు, వాలుగంటులయాణిముత్యాలసరుల
శైత్యమున నుల్కిపడి రభసమున లేచు, తత్పతులనవ్వ దీపికల్ ధవళరుచుల.

ఉ. కంతురణాంతతాంతవిటఘర్మకణాపనయప్రవీణసా
ధాంతరభామినీవ్యజనతాంచితవృత్తకుచోత్తరీయచే
లాంతమృగీమదాగురుసితాభ్రపటీర విశేషవాసనా
క్రాంతములై దిగంతములఁ గ్రమ్మె నిశాంతమరుత్కిశోరముల్. 243

క. మునుకొని వేకువఁ దనగిరి, దినమణిఁ గన దివురుపూర్వదిశకుం గొనఁజూ
పిన ముంగరముత్తెమువలెఁ, గనఁబడియెన్ వేగుచుక్క కలధౌతరుచిన్. 244

ఉ. కాయజుగారి కోడి మును గౌతమికై తమకోడిజాతివాఁ
డాయె సురేంద్రుఁ డట్టిదొర నాఁగి జయింప దశాస్యుఁ డీయెడం
బోయెడు నిత్తెఱంగు వినుప్రోలికిఁ దెల్పెద మంచు బెట్టుగాఁ
గూయిడుచున్నవో యనఁగఁ గుక్కుటముల్ రొద సేసె దిక్కులన్. 245

క. తమి విధుఁ గలసినయంబర, రమపులకాంకురపరంపరలు దోడ్తోఁ ద
త్సమయశిశిరానిలునిచే, సమసెనొ యనఁ దారకావ్రజంబు లడంగెన్. 246

క. చెలిమికి నినుండు బలుకర,ములతోఁ జను దేర మిన్నుముట్టినయుదయా
చలపతికి వేళ వీచిన, తెలివీచోపుజిగిఁ దూర్పు తెలతెల నయ్యెన్. 247

తే. ఎందు ద్విజరాజునామించుచందమామ, మనలనిద్రాంధకారాబ్ధి మునుఁగఁజేసె
మేలుకొలిపె నినుం డెంతమిత్త్రుఁ డనెడి, భాతిఁ బులుఁగులు కలకల పలికె దిశల.

చ. లలితమరందకాంక్ష ముకుళంబులఁ జిక్కిన కైతవంబునం
బిలుకల నాండ్రనున్ విడిచిపెట్టి నిశం బ్రతిపక్షబంధులౌ
కలువల కొద్దికై యవియుఁ గందినఁ గ్రమ్మఱఁ జేరు తేటులన్
గలకల నవ్వెఁ బద్మినులు కమ్రతరాచ్ఛవిభాచ్ఛలంబునన్. 249

మ. గిరిభృద్వక్షముఁ బాసి తావి కిర పౌ కెందమ్మి పూమించుటు
ప్పురిగన్ శ్రీ వెలయన్ సరోవరసభాభాగంబునన్ మించె బం

భరభామామృదుగానముల్ కవివరప్రత్యగ్రపద్యార్భటుల్
తరళోత్తుంగతరంగరంగవిలసత్కాదంబినీలాస్యముల్. 250

చ. అలయక యెల్లెడన్ మెలఁగి యుం డొకచో నితరేతరాననం
బులు దిలకించి యొండొకటి ముక్కునఁ జుర్కుఁ దమిఁ జేరి చంచువుల్
గళముల నుంచి నిల్చి యెఱకల్ తనువుల్ గదియించి చొక్కుచూ
డ్కులు నిగుడం బయోరుహకుడుంగములన్ విహరించె జక్కవల్. 251

శా. ఆందోళింపఁగఁ జేసె ముందు రజతాహార్యంబు లంకేశ్వరుం
డెందుం దుర్జయుఁడింద్రుఁడీ డొరయుచో నే మెంచునో వాఁడు పొం
దొందం గానుకయిత్తు నంచుఁ దొలిగట్లుత్కంఠతో నెత్తుమేల్
చందా కెంపు తెఱంగునన్ దనరె భాస్వద్బింబముం దూర్పునన్. 252

శా. పగ్గంబులన్ బలుచిల్వరాపడగనున్ బ్రాఁగెంపుటాచాయలన్
డిగ్గం ద్రావి నవారుణాబ్జగృహవాటీభాగ్రమాసంచల
ద్దృగ్గాఢస్తనకుంకుమద్యుతులతో రెట్టించి భాసిల్లెఁ ద
త్ప్రాగ్గిర్యాతతధాతురాగరుచులన్ బాలార్కశోణాంశువుల్. 253

ఉ. అంతకు మున్నె రావణనిశాటకులేంద్రుఁడు వీతనిద్రుఁడై
యంతికవాహినిన్ వెలయ నాహ్నికకృత్యము లాచరించి దు
ర్దాంతరణోత్సవంబునఁ బ్రధానసహోదరపుత్త్రమిత్త్ర సా
మంతసుహృద్భటోత్తములమన్ననఁ దోకొని సేన లుబ్బగన్. 254

స్రగ్ధర. కదలెం గంఖాణరింఖాగ్రనిహతి రజతగ్రావపాదాళి నుగ్గై
చెదరన్ హస్తీంద్రహస్తాంచితవమథుల జేజేలపెంద్రోవ లెల్లన్
జొదు గొందన్ స్యందనప్రస్ఫురితగతులచే క్షోణి ప్రీలం బతాకల్
గదియన్ వ్యాపించుబల్ చీఁకటుల రవిరథక్షత్త యంధత్వ మూనన్. 255

రావణుం డమరావతీపట్టణము ముట్టడివేయుట

చ. కదలి దశాననుండు లయకాలఘనాఘనగర్జితభ్రమ
ప్రదభటసింహగర్జన లపారగుహాకుహరంబు లానినన్
బదులుగ మ్రోయ వేల్పుమలపజ్జకుఁ బోయె దదీయపాదముల్
చిదురుపలై ధరం గలయఁ జేయుచు సేనలు గొల్వ నుద్ధతిన్. 256

ఆ. పోయి తత్సమీపమునకుఁ గాన వచ్చు, వేల్పుపురము చూచి విస్మయపడి
చేర యుపవనముల సేనలు విడియించి, యలప్రహస్తుఁ గని దశాస్యుఁ డనియె.

మ. కనుగొంటే యమరావతీపురము గంగాఖేయతోయావగా
హనసక్తామరరాజితామరసపత్త్రాక్షీవిహారోత్థిత ప
త్కనదంభఃకణమాలికాతులితముక్తారత్నశిల్పప్రక
ల్పనభాగ్యప్రవిభావలక్షితనభోభాగంబు భాసిల్లెడిన్. 258

సీ. ఈపట్టణలలామమే కదా శతమన్యు రాజసం బొందించురాజధాని
యీనగరీరత్న మే కదా బహుపుణ్యములు సేయుప్రజ చేరుపుణ్యలోక
మీపుటభేదనం బే కదా యెల్ల సౌఖ్యము లిచ్చు ననుఖ్యాతిఁ గన్నపదవి
యీపురగ్రామణియే కదా రణరంగహతులు ప్రాపించు ప్రాస్యస్థలంబు
తే. కల్పవృక్షము లున్నశృంగారవనము, లీనివాసంబునసె కదా యెసక మెసఁగుఁ
గామగవిఁ గట్ట నిది గదా గాడిపట్టు, దీని వర్ణింపఁ బరమేష్ఠికైనఁ దరమె. 259

సీ. ఏచాయఁ గన్న రేరాచజావాకిళ్లఁ గొమరు మీఁజినదివ్యగోపురములె
యేవీథిఁ గనుఁగొన్నఁ హీరవారప్రభాసాధారణోత్సేదసౌధమణులె
యేతోఁట లరసినఁ గేతకీపున్నాగసుమనోమనోహరసురభిళములె
యేయిండ్లు చూచిన హీరతారచిరత్నరత్నసంపన్నతారాజితములె
తే. యెందుఁ జూచినఁ బలుకోర్కు లిచ్చుతరులె
యేడఁ జూచిన వేడుక లిడుకొలఁకులె
యెచటఁ జూచినఁ బ్రతి లేనికృతకగిరులె
యిటులఁ గాకున్నఁ బ్రఖ్యాతి యెటుల గాంచు. 260

మ. పరిఖాకారసురాపగాలహరికాపాంసుద్యుతుల్ వజ్రభా
స్వరవప్రాచ్ఛతరప్రభల్ విధుశిలాసౌధాంశుయూథంబు లి
ప్పురిపైఁ గప్పినఁ జూడ నొప్పెఁ ద్రిజగత్పూర్వైభవంబుల్ జయిం
ప రహిం బైకొనుకీర్తివైఖరిఁ బ్రహాస్తా చూచితే నాపుడున్. 261

చ. అది విని మంత్రి యి ట్లను సురారికులేశ్వర కీర్తి గాదు గా
యిది భవదీయవిక్రమసమృద్ధి నిజేశ్వరు నేమి సేయునో
త్రిదశుల కేమిచేటో యని దీనత వెల్వెల నొ పురీందిరా
సుదతివివర్ణ భావ మనుచుం గన నయ్యెడు నాదుచూడ్కికిన్. 262

మ. అసురాధీశ భవత్ప్రతాపశిఖి పై వ్యాపించె నాఁ బద్మరా
గసముజ్జృంభితగోపురప్రభ యుదగ్రం బయ్యెఁ దద్ధామజా
లసమశ్రీల విశాలనీలవలభుల్ గాన్పించెఁ దజ్జ్వాలల
క్లైసఁగెన్ ద్వారకవాటవిద్రుమరుచుల్ వీక్షింపు మీప్రోలునన్. 263

మ. తను రోధింపఁగ నేఁగు దెంచినమిముల్ దర్శించి ఖేదంబుఁ జెం
దినస్వర్లక్ష్మిదృగశ్రుతోయకణపంక్తిం బోలెఁ గేళీసరగ్
కనదాభీలమరాళపక్షయుగరుక్చంద్రాతపశ్రీద్రవ
ద్ఘనచంద్రాశ్మ సువేశ్మజాలకగళద్వ్యాగపూర మొప్పారెడిన్. 264

ఉ. ఈవఱ కిప్పురిన్ దివిజు లేలఁగఁ జూచినయట్టితెప్పు చా
ల్దేవర నన్నుఁ బంపు మవలీలఁ ద్రివిష్టప మాక్రమించి యై
రావణదంతితోడ సురరాజును బల్విడిఁ బట్టి తెచ్చెదన్
నా విని రావణుండు చిఱునవ్వున నాతనిఁ జూచి యిట్లనున్. 265

ఉ. అంతటివాఁడ వౌదువె కదా యయినన్ మధుమేఘనాదదే
వాంతకకుంభకర్ణుల నరాంతకముఖ్యులఁ గూడి యిప్పురం
బంతయు నాక్రమించి చతురధ్వము లానుక నిల్వఁ డంత జం
భాంతకుఁ జేమి సేయునో యటన్న హసా దని యాప్రహస్తుఁడున్. 266

సీ. కుంభనికుంభముఖ్యులతోడ నలకుంభకర్ణుండు దూరుపుగవనియందు
మాల్యవంతుండు సుమాలియు బలయుక్తిఁ దగ మేఘనాదుఁ డుత్తరమునందు
ధూమ్రాక్షరుధిరాక్షదుర్ముఖాదులఁ గూడి మధునిశాటుఁడు పశ్చిమంబునందు
మారీచముఖులతో నారావణాసురాగ్రణిఁ గొల్చి తాను దక్షిణమునందు

తే. నిలుచునట్లుగ నియమించి నిఖిలబలము
పంచి యందందు విడియంగఁ బంచి నాల్గు
గడల నాల్గుసముద్రముల్ గ్రమ్మినటులఁ
జెలఁగి పటువాద్యముల్ మ్రోయఁ జేయుటయును. 267

వ. అప్పుడు. 268

మాలిని—

మురజపటహఢక్కాముఖ్యవాద్యస్వనంబుల్
పరదితిసుతసేనాపాలిఁ బల్మాఱు మించెన్
సురలు చెవులు సోఁకన్ స్రుక్కి భీతిల్లి రాస్వర్గ
పురి నలుదిశలందుం బుట్టె నుత్పాతకోటుల్. 269

సీ. నిండినగేహముల్ నిండినట్లనె యుంచి బలువిమానము లెక్కి పఱచువారు
దగినవస్తువులతోఁ దమవారిఁ గొని భీతి నెగిరి మహర్లోక మెక్కువారు
నొకరితో నొకరు దెల్పక యథాయథ లయి యేడ కేడకుఁ బరువెత్తువారు
నెందుఁబోఁ గాల్లాడ కిండ్లలో మూలమూలలఁ జొచ్చివడఁకుతో నలయువారు

తే. నెచటఁ జొచ్చినఁ బోనిత్తురే నిశాటు, లదిగో లగ్గలువట్టి రిం కేటిస్వర్గ
మనుచుస్వర్లోకమునసారెకఱచువారు, నగుచునడలొందిరమరాలయంబువారు.

సీ. రణశూరులకు నప్సరఃస్త్రీలతోఁ గూడి వీథి సరాళంబు వెడలఁ బాసె
సోమయాజులకు రంభామేనకలఁ గూడి శృంగారవనము వీక్షింపఁ బాసెఁ
బరమధార్మికులకు బసిఁడిమేడలచుండి వెలఁదులగానముల్ వినఁగఁ బాసె
సకలదివ్యోపపాదకులకు సఖులతో నలదేవనది నీఁదులాడఁ బాసె

తే. నున్న సురలకు నిండ్లలో నుండి యైన, సొరిది నటు నిక్కి తలయెత్తిచూడఁబాసె
నలబలంబులతోఁ గూడి యలబలంబు, లమరపురిఁ జుట్టుకొనునట్టియవసరమున.

చ. తలఁకునఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూసి డాసి కొ
త్తళములపై నలంగములఁ దార్కొని మార్కొని విక్రమింపఁగాఁ
గలరణశూరు లైనయువికారుల వీరుల హెచ్చరించి పై
బలముల రాకఁ దెల్ప సురపాలకుపాలికిఁ బోయి యయ్యెడన్. 272

సీ. శచిముద్దుమోముఁ జూచుచు నాగకన్యానవీనగానము విను వింతహొయలు
వేల్పులమనవులు వినుచు నచ్చరమచ్చెకంటులనటనంబుఁ గాంచుమురువు
ధనదాదిహితమంత్రిజనులతోఁ బల్కుచు మునులవాదులకు నవ్వెనయుహరువు
మ్రొక్కువారలకుఁ గేల్ మోడ్చుచు గురుఁడానతిచ్చుయుక్తులెఱుంగు హెచ్చరిక [యుఁ

తే. దనకుఁ జెల్లు ననంగ సంతస మెసంగ
వైజయంతంబుపైఁ గొలు వైజయంత
ముఖులు బర్హిర్ముఖులు చంద్రముఖులు గొల్వ
నిండుకొలు వున్న దేవతానేతఁ గని. 273

మ. కని జోహారిడఁ గోటసల్లవనులం గాపున్నవారేఁగుదెం
చినవారిం దవధారు దేవ యనుచుం జేమోడ్పుతోఁ గంచుకుల్
వినిపింపం దొలునాఁడె వేగరులచే విన్నట్టివృత్తాంతముల్
దనలోఁ దోఁచి బలారి మీర లిటకున్ రాఁగార్య మేమో యనన్. 274

ఉ. వారు వినీతులై యనిరి స్వామి దశాస్యుఁడుఁ గుంభకర్ణదే
వారియు మేఘనాదుఁడుఁ బ్రహస్తమధుప్రముఖుల్ మహాచమూ
వారము గొల్వ వచ్చి యిదె స్వర్గమునల్గడ లావరించి యు
న్నా రని విన్నవింప సురనాథుఁడు రోషకషాయితాత్ముఁడై. 275

శా. ఔరా రావణుఁ డబ్జగర్భవరగర్వాయత్తుఁడై నాపురిం
గారింపం జనుదెంచెనే తనభుజాగర్వంబు నాచెంత నా
వారిన్ వీరిఁ దలంచినట్లనె ననున్ వాఁ డెంచెఁ గాఁబోలుఁ గా
నీ రక్షోబలవార్ధి నస్త్రబడబాగ్నిన్ నేఁడె యింకించెదన్. 276

వ. అని పలికి కొలువు గలయం గనుంగొని. 277

సీ. కోటవాకిళ్లు బల్కొత్తళంబు లలంగములు నేమఱక కాచి మోహరింప
దారుశిలాయంత్రతతి కొమ్మకొమ్మలఁ దోరంబుగా నించి దురుసు సేయఁ
దలబొమిడికము కత్తళము కేడెము కత్తి యాదిగాఁ గలవి ముస్తీ దొనర్ప
నరదముల్ ద్విరదంబు లశ్వముల్ మొదలైన సకలవాహనముల సంఘటింపఁ

తే. దగినవారి నియోగించి తనసమీప,మున వసించుపులోమజాముఖ్యసతుల
మఱియుఁ జనువారిఁ బ్రచ్ఛన్నమార్గమునను,స్వర్ణగిరిశృంగమునకంపి శతముఖుండు.

ఉ. కామగవీసుధాకలశకల్పకదివ్యమణీవిభూషణ
స్తోమము మాటు చేసి తనతోడిదె లోకముగాఁ జరించుసి
ద్ధామరసాధ్యరుద్రతుషితానిలభాస్వరముఖ్యదేవతా
గ్రామణులన్ రణోత్సుకులుగా సెల విచ్చి యొకండు చెచ్చెరన్. 279

కమలవిలసితవృత్తము—

వనజనయనుఁ గరివరదునిఁ జేరం, జని ముకుళితకరజలజయుగుండై
తనువునఁ బులకలు తఱుచుగ మించన్, వినయముగను సురవిభుఁ డిటులెంచెన్.

కవిరాజవిరాజితము—

జలజదళేక్షణ శాత్రవశిక్షణ శౌర్యవిచక్షణ చక్రధరా
కలితరవిగ్రహ కాంతిసువిగ్రహ కల్మషనిగ్రహ కంబుకరా
విలసితకేతన విశ్వనికేతన విస్మితచేతన వేషయుతా
సలిలభవాసన సమ్యగుపాసన శార్ఙ్గశరాసన సాధునుతా. 281

మ. అవధారయ్య దశాననుండు సబలుండై నేడు నాట్టణం
బవరోధించినవాఁడు తమ్ముఁడును దోడైనాఁడు తత్పుత్రకుం
డు వృషాంకప్రియహోమనిష్ఠల బలిష్ఠుండై విజృంభించినాఁ
డు విశేషించి మధుఁడు బంధుఁ డయి వాఁడుం గూడినాఁ డియ్యెడన్. 282

ఉ. ఇందుల కేమి బుద్ధి గణియించెదొ వైరుల నెట్లడంచెదో
ముందును వెన్కఁ దోఁచక యమోఘదయానిధి వంచుఁ జేరితిన్
ముందు బలాదిశత్రుజయముల్ భవదుక్తిన కాదె కల్గె గో
విందముకుంద నీవె కదవే గతి వేగతులన్ దలంచినన్. 283

ఉ. ఆరయ సర్వభూతముల కాప్తుఁడ వయ్యును మమ్ముఁగూర్చి దై
త్యారిసమాఖ్యఁ గాంచితి తదాఖ్య యథార్థము సేయు మోదయా
నీరధి పాల ముంచినను నీళ్లను ముంచిన నీవ దిక్కు నీ
వారము నీదుచిత్త మనువాసవుఁ జూచి జనార్దనుండనున్. 284

చ. అమరవరేణ్య యిట్టిసమయంబున రావణకుంభకర్ణులన్
సమరములోపలన్ గెలువ శక్యము గాదు తదీయనందనుం
డమితపరాక్రమక్రమసమగ్రుఁ డజయ్యుఁడు మీఁద గొంతకా
లమునకు మానుషాకృతిఁ జెలంగి వధించెద వారి నందఱన్. 285

చ. హరి యరుదెంచి యూరక దశాస్యునిఁ దాఁకి వధింప లేక క్రు
మ్మరె ననునట్టిలాఘవముమాత్రమె నేనిపు డేఁగుదెంచినన్
హరిహయ నీవె పోయి పలలాదుల మార్కొని తోఁచినట్టులన్
దుం మొనరింపు మిప్పటికిఁ దోడ్పడి మీఁద శుభం బొసంగెదన్. 286

శా. దేవత్వంబున నుండియే యరిని మర్దింపంగ లే నంటివే
నీ వేలాగు నరత్వ మొంది పగవానిన్ గెల్చెదం టేని రా
జీవప్రోద్భవుమాట నిల్పుటకుఁ గాఁ జేకొంటి శాంతం బిఁకన్
భావిప్రాంచితరామరూపమున నిప్పౌలస్త్యుఁ బోనిత్తునే. 287

### దేవదానవుల యుద్ధము

మ. అని పేర్కొల్పిన వజ్రివచ్చి రణవాంఛాకల్పులన్ వేల్పులన్
గని హర్షించి జయానకార్భటుల ఢక్కాశంఖఘోషంబులన్
దనుజస్తోమము గుండె దిగ్గుమన రత్నప్రస్ఫురచ్చక్రశం
ఖనిజాశ్వధ్వజఘంటికాఘణఘణోగ్రస్యందనారూఢుఁ డై. 288

సీ. ద్వాదశద్వాదశాత్ములతోడ వడిఁ బదుముగ్గుర విశ్వులు ముందు నడువ
నురులీల ముప్పదార్గురుతుషితులతోడ నెనమండ్రువసువులు నెనసి కొలువ
మెఱయు నర్వదినలుగురుభాస్వరులతోడ నలువదితొమ్మండ్రనిలులు గొలువ
రూఢి నేకాదశరుద్రులతోఁ బదునిద్దఱుసాధ్యు లుద్వృత్తి నడువ

తే. గరుడగంధర్వచారణఖచరసిద్ధ, యక్షకిన్నరకింపురుషాహిగుహ్య
కాదితేయమహారాజికాదిదేవ, సమితి నలుగడఁ గొలువ వాసవుఁడు వెడలె. 289

చ. వెలువడి యొప్పు డెప్పు డరివీరులఁ దాఁకుద మంచు విచ్చుక
త్తులబెడ గుందళత్తళలతోఁ దనముందట వచ్చు దేవవీ
రులకును జేయి వీచుటయు రోసముతోఁ జని దైత్యవీరులన్
దలపడి రాసురాసురులు దార్కొని యుగ్రతరాగ్రహంబునన్. 290

వ. అప్పుడు గొప్పచప్పుడుప్పతిల్ల బాహువు లప్పళించుచు ధరారేణువు లుప్ప
రంబునన్ బోరయఁ గప్పించుచుఁ దమచేతిహేతుల నరాతుల నొప్పించుచుఁ
దమదొరల మెప్పించువేల్పులును రోషారుణితలోచనముల నిప్పు లురులన్
బరుల నిలు నిలుం డని యెలుంగెత్తి పిలిచి నిలిచి యెదిరించియు ధిక్కరించియు
ఖడ్గాఖడ్గిన్ దలపడి యడిదంబును వాడి వాడి యై పుడమిన్ బడినఁ జిడిముడివడి
వడి నడరుపడి మగుడన్ గచాకచిన్ బెనంగురక్కసులు ననుంగుచెలికాండ్రకు
సహాయు లై యీరసంబునన్ దారసం బైనబోరునన్ బేరువాఁడి మెఱసి
మున్ను తమవారల నొప్పించిన పరవీరులన్ గడచి పోనీక డయ్యన్ జేసి
కయ్యంపుటురవడి గనంబడఁ జేయుదేవతలును బంతంబు మెఱసి కుంతంబులఁ
బడఁ గ్రుమ్మిన నెమ్మేనినొప్పి దప్పు లెంచక కరాంచితపట్టిసంబులఁ దత్ప్రతి
పక్షహస్తప్రసారితకుంతంబు లానుకొని యట్టె నట్టనడిమికిన్ దెగఁగొట్టి కట్ట
లుక బిట్టగసి జగజట్టితనంబున నెదుటివారియుదుటుమాన్చుదానవులును గఱ
కత్తిన్ బెరయ మెఱయ సురియ లురంబునఁ గ్రుచ్చి వీఁపున నుచ్చి పాఱునం
తలో మరలమరలన్ దివియువారల లావెఱింగి యాఁకు గఱచి సురియతోడి
కరంబు కరంబు చలంబుతో బిగఁబట్టి వలకేలికరవాలంబునన్ దలలు కఱు
క్కున దెగ నఱుకుసురవీరులును బెడిదంపుకటారులన్ మెడిచినఁ గడుపుల
నుండి బొసబొస వెడలుప్రేవులప్రోవు లదిమి దిట్టతనంబుతో నడుమఁ జుట్టినట్టి
బట్టిచెఱంగుల నడంచి కట్టుకొని తము నొంచినవారిన్ బట్టికొని యట్టిబెట్టిదం

బులే యాచరించునిశాచరులును నిష్ఠురగదాఘాతంబులన్ దలలు వగిలి నొగిలి
బుడబుడ నెత్తురు గ్రక్కుచుండియుఁ బెండువడక కడిందిరిపులవక్షస్స్థలంబులు
శూలంబులన్ గ్రుచ్చి పడఁ ద్రోచి యేత్తెఱన్ జూపు వినువీటిపోటుబంట్లును
గఠోరకుఠారధారల భుజశాఖలు నఱికివైచినన్ గఱకు చెడక యురులన్ జు
ఱుకు చుఱుక్కునన్ గనుంగొనుచు మొఱకుతనంబున మీఁది కెఱికి బెట్టుగాఁ
బదఘట్టనంబులు బరఁగించుట్ట దనుజులు నెదురుగ నుండి చూచు తమయేలి
కలతో మార్తుర నిదె యిందఱ ముందించి వచ్చెద మని నొడివిన వడుపునన్
గడిమి మెఱసి ప్రతిజ్ఞ లీడేర్చుకొని సొంపు లొందునిలింపులును బెడబొబ్బ
లిడుచు నెదురుగా నడచు పెక్కుమందిపగతుఱపై రోషంబునఁ దార్కొని
తోమరముద్గర భిండిపాలశూలక్షురికాది వివిధాయుధంబులసాధనంపు మెరవళ్లె
ఱింగించు నక్తంచరులును నడికలన నింటివారిన్ దలంచుకొని కేడించి వచ్చి
యచ్చటచ్చట మచ్చరంబుల నెదిరిబలంబు సొచ్చి వ్రచ్చి నొచ్చువారిన్ జచ్చు
వారిన్ జూచి నిజకులస్థానపౌరుషంబులు దలంచుకొని మునుకొనునభి
మానంబుతోఁ గ్రమ్మఱన్ దొడర వచ్చు వియచ్చరులును జనకాగ్రజానుజతనూ
జాదిబాంధవులును ముందినన్ బోలివోనిబంటుతనంబునన్ గంటకులపై సుర
వడించి యొంటిపాటునన్ దమయింటిప్రతిష్ఠలు నిలుపుకొను తొలివేల్పు
లును నూటాఱుగాయంబులన్ బడియుఁ గాయంబులనొప్పిఁ దలఁపక నేలినవాని
కార్యంబునకుఁ బాటుపడునమర్త్యభటకోటులున్ గలిగి యుభయబలంబుల
వీరభటు లారభటులతో నుబ్బి గబ్బిబెబ్బులులవలె నుదుటుగల బొబ్బమెకం
బులవలె నుఱుమనిపిడుగులవలె నుడుగనికార్చిచ్చులవలె నుడివోనికాలసర్పం
బులవలె నురవడింపనిమదహస్తులవలె నోలమాస గొనక యొక్కచందంబునన్
బోరుచుండి రట్టియెడ. 291

క. పడుతలలు తెఱచు నఱుకుడు, పడు చేతులు జడిసి బెండుపడుగుండెలు చే
డ్పడు మేనులుఁగడుత్రొక్కుడు, పడునడుగులుఁబంక్తిముఖునిభటులకుఁగలిగెన్.

సీ. అప్పుడు రావణుఁ డంప యజ్ఞకోపసుపార్శ్వ ధూమ్రాక్షయూపాక్షధూమకేతు
జంబుమాలిసుమాలిశతమాయరుధిరాక్షఖరమహోదరమహాకాయదూష
ణత్రిశిరోనరాంతకసురాంతక మహాపార్శ్వమారీచసుప్తఘ్న సూర్య
శత్రువృశ్చికరోమసర్పరోమాభేద్యకవచవిరూపాక్షకాలనేమి

తే. దుర్ముఖశుకాదివీరదైత్యులు ప్రహస్త
సహితులై తీవ్రహస్తప్రశస్తశస్త్ర
ధాళధళ్యంబు లఖిలదిక్తటుల మెఱయ
నామరచమూజిగీషులై యడరుటయును. 293

చ. అసురుల మార్కొనన్ మఘవుఁ డంపిన సిద్ధులు సాధ్యు లశ్వులున్
వసువులు భాస్వరుల్ దుషితవర్యులు రుద్రులు విశ్వు లుగ్రసా

హాసమున నొక్కఁడై యలప్రహస్తుఁడు మున్నగుసైన్యనాథులన్
మసలక తాఁకి రుద్రులను మార్కొను రుద్రులపోల్కి నయ్యెడన్. 294

ప. అఱచుచు హుంకరించుచు నహంకృతి జూపుచు నస్త్రధారలన్
సుడివడఁ జేయుచున్ దెగడుచున్ బెగడించుచు నిల్వరించుచున్
గడఁగుచు నోసరించుచు ముఖాముఖి నిల్చుచు బిట్టదల్చుచున్
జడియక పోరి రయ్యుభయసైన్యములన్ గలయోధు లుద్ధతిన్. 295

చ. హరులు మదేభయూథముల నాఁగినకైవడి దేవవీరు ల
య్యసురుల నెదిర్చి శస్త్రముల నస్త్రములన్ నిగిడింప రక్తని
ర్ఝరముల శోడిజంగమధరాధరపంక్తులఁ బోలి వార లం
దఱు వెనుతియ్యఁ గాంచి యెలనవ్వు వహించి సుమాలి యీసునన్. 296

చ. నిలగడహోయి దేవరథినీవరులార యటంచు నుజ్జ్వల
జ్జ్వలనరుచిప్రకాశ మగు స్యందన మెక్కి గుణంబు దీటుచున్
బలరిపుసైన్యపాలకులపైఁ బ్రళయాశనితుల్యసాయకం
బులు నిగుడించి యార్చి పొలివోనిపరాక్రమవైభవంబునన్. 297

చ. వసువుల బిట్టదల్చి పితృవర్గములన్ బెగడించి విశ్వులన్
వసమఱఁ జేసి సాధ్యులజవం బడరించి శరాళి రుద్రులన్
దొసఁగులఁ బెట్టి చారణులదోర్హాళముల్ సడలించి యమ్మరు
ద్విసరము నొంచి భాస్వరులబీరము మాన్చి పరాక్రమించినన్. 298

ఆ. ఈసుమాలి సురల నిటులఁ జిక్కులఁ బెట్ట, నీసుమాలి చూడ నేల యనుచు
వసువు డాయుపేదవలెను సావిత్రాఖ్య, వసువు విక్రమించి వానిఁ దాఁకి. 299

శా. నీవీరత్వము గానిపించితివి మేల్ నేఁ డింక నాశౌర్యమున్
నీవున్ గన్గొన వల్వదే యనుచు నిర్ణిద్రాస్త్రధారాహతిన్
సావిత్రుండు సుమాలి నొంచుటయు రోషభ్రూకుటీరాజితుం
డై వాఁ డేసినబాణముల్ నఱకి పూర్వాదిత్యుఁ డత్యుగ్రతన్. 300

శా. ఆకాశం బవియింపునార్పు లెసఁగన్ జ్యావల్లి మ్రోయించుచున్
శాకారిప్రముఖామరుల్ బెగడ శుంభద్వజ్రశాతాశుగా
నీకం బవ్వసుగాత్రపంజరమునన్ నించెన్ సటోత్పాటన
వ్యాకీర్ణక్రుధ మైన కేసరివలెన్ వాఁ డల్గి దేవారిపైన్. 301

మ. పదినారాచము లేసి మైమఱువు నిర్భగ్నంబు గావించి యి
ర్వదిబాణంబుల ఱొమ్మగల్చి కరరారాజచ్ఛరాసంబు ము
ప్పదివాల్తూపులఁ ద్రుంచి సారథిశిరఃపాతంబు రథ్యధ్వజ
చ్ఛిదనున్ నల్వదిసాయకంబుల నొనర్చెన్ వేల్పు లుప్పొంగఁగన్. 302

వ. ఇవ్విధంబున. 303

మ. విరథుం డైన సుమాలిపై నడరి సావిత్రుండు వృత్రారి భూ
ధరశృంగంబు శతారపాతమున విధ్వస్తంబు గావించుపై
ఖరి నుద్దండభుజాగ్రమండితగదాఘాతంబునన్ వానిబల్
శిరముం గాత్రము నుగ్గుః జేసె దివిజశ్రేణుల్ ప్రహర్షింపఁగన్. 304

ఆ. అతనిపాటుఁ జూచి యశ్రుధారావృూరె, తాఘ్ను లగుచు నెల్లరాక్షసులును
దలలు వీడ నాయుధంబులఁ బడవైచి, రణము విడిచి గనిరి రఘువరేణ్య. 305

చ. ముదిపోలదిండిచేటు తమమామఁకల కొండలపాటు వేల్పుచు
న్నదొరలగెల్పునీటుఁ గని నెమ్మది నీసును రోస మెచ్చఁ గెం
పొదవెడిచూడ్కితో దనుజయోధుల నిల్పుచు మేఘనాదుఁ డా
త్రిదశులఁ బిట్టదిర్చి దన తేజః శిఖిద్యుతి నుల్లసిల్లఁగన్. 306

క. ఎదిరించి శిఖశిఖాభ, ప్రదరపరంపరల నమరబలవనము దహిం
పఁ దొడఁగె జగతీస్థలి గ్ర,క్కదల రథము దుర్నిరీక్షగతిఁ జరియింపన్. 307

క. అక్కడిఁదిజోదుముందరఁ, జక్క నిలిచి తేఱి చూడఁ జాలక దివిజుల్
దిక్కొకంబులవలె నలు,దిక్కులకుం బఱచి రేమిదెలిపెద నధిపా. 308

తే. ఇక్కరణి దేవతలలోన నొక్కఁడేని, రావణాత్మజు నెదిరించి రణము సేయఁ
జాల కళిభీతిఁ జనఁ జూచి శతమఖుండు, పేరెలుంగెత్తి వారలఁ బిలిచి పలికె.

ఉ. ఆమరశూరులార తగవా పగవారలు సూచి నవ్వ సం
గ్రామము డించి పోవ భుజగర్వము ఖర్వము సేసి యూరకే
యేమిటి కిట్లు పాఱెద రొకించుక నిల్వుఁడు మేఘనాదుశా
హామహిమం బిఁకం మనజయంతుఁడు మాన్చు నటంచుఁ బల్కఁగన్. 310

ఉ. అంతటఁ మున్నె రావణి రణావనిఁ గెల్వఁగ నుత్సహించి కా
లాంతకశౌర్యవంతుఁడు జయంతుఁడు సారథిఁ జూచి దేవతా
సంతతి నొంచు రావణనిశాచరసూతి నెదిర్చి పోర నే
డెంతయు వేడ్క యయ్యెఁ జన నిమ్ము రథంబు రయంబుతో ననన్. 311

## జయంత మేఘనాదుల యుద్ధము

చ. స్వామి మహాప్రసాద మని చయ్యన నాతని తేరిసూతుఁ డా
గోముఖుఁ డాగతిం బఱప గోముఖనాదము లుల్లసిల్లు సు
త్రామసుతుండు రావణి నుదగ్రత మార్కొని భూరిబాణధా
రామయగాత్రుఁ జేసె నమరప్రకరం బది చూచి క్రమ్మఱెన్. 312

ఉ. పకపక నవ్వి రావణి సెబాసుర యోరి జయంత దేవతా
నికరములో బలాఢ్యుఁడవు నీవె యొకించుక నేపు పాఱి పో
వక నిలు నిల్చినం బొగడవచ్చును నిన్నని పల్కి శాతసా
యకముల సారథిం హయచలంబుల నొంచి యహంకరించినన్. 313

చ. శతమఖనందనుం డతని సారథి నొంచి నిశాతసాయక
ప్రతతుల నించి మేను రుధిరంబున ముంచిన నొచ్చి దండతా
డితభుజగంబుమాడ్కి భ్రుకుటీప్రకటీకృతరోషుఁడై దశా
స్యతనయుఁ డాజయంతునిసహాయుల నొవ్వఁగ నేసెఁ దూపులన్. 314

వ. ఇచ్చెలువున జయంతునికిఁ దోడుపడ వచ్చినవిమచ్చరులమేను లుచ్చిపాఱ శరో
చ్చయంబులు నిగుడించి యచ్చిఱుత రక్కసుండు వెండియు. 315

చ. అరదమువీఁద నుండియు బయల్పడ కుగ్రతమంబు పన్ని యం
బరగతుఁడై శరాసనకృపాణపరశ్వథభిండివాలము
ద్గరపరిఘాస్త్రశక్తితోమరగదాముసలచ్ఛురికాదిసాధనో
త్కరములు శైలశృంగములు గాటముగాఁ గురియించె నొక్కటన్. 316

ఉ. అందున భీతిఁ బొంది సుర లందఱు నిల్చినచోట నిల్వ కెం
దెందొ చనంగ నాత్మభటు లెంతయు వంత గనంగఁ జూచి సం
క్రందననందనుండు దశకంఠసుతోత్థతమఃపరంపరన్
గుందియు దేవసైన్యములఁ గోల్తలఁ జేయఁ గడంగుచున్నెడన్. 317

తే. ఆమహేంద్రకుమారుమాతామహుండు
మనుమఁ డలయుట గని తన మాయ వలన
నెత్తికొనిపోయె జలరాశి కెవ్వ రతని
పోక తెలియక యద్భుతాంబుధి మునుఁగ. 318

క. పతిలేనిచానవలె దై,వతసేన గలంగి దానవప్రభుసుతుచే
నతిదైన్య మొందఁ గని సుర,పతి మాతలిదిక్కు చూచి పటుమతిఁ బలికెన్,

చ. అలజడిఁ జెందెఁ సేనలు జయంతుని నెక్కడఁ గాన నైతి వే
ల్పులకు నజయ్యుఁడై సమరభూస్థలి రావణి మించె వీనితో
గలహ మొనర్ప కున్న నిఁకఁ గార్యము గాదు రథంబు వేగ మా
తలి యటు పోవ నిమ్మరివధం బొనరించెద నేఁడు నావుడున్. 320

సీ. కమనీయశతకోటిఘంటికాఘణఘణారవముచే దిక్కరుల్ సెవుడు వోవ
దశసహస్రోదగ్రతరమణీమయచక్రచంక్రమణస్థితి జగతి వడఁక
సకలలక్షణవిచక్షణలక్షహయఖురోత్థరజోహతుల సముద్రములు గలఁగ
శరదభ్రవిభ్రమస్ఫురదదభ్రధ్వజోద్భటభటార్భటి నభస్తటము వగులఁ
తే. జక్రచాపగదాఖడ్గశక్తిశూల, కుంతతోమరపరిఘాదిఘోరసాధ
నాంశువులు శత్రుదృక్కాంతులపహరింప, నమరవిభుతేరుమాతలియపుడునడిపె.

చ. నలుగడలన్ మరుద్వసుగణంబులు సాధ్యులు రుద్రు లశ్వులున్
గొలువ వరాప్సరోయువతికోటులు ముందు నటింప శంఖమ
ర్దళమురజాదివాద్యనినదంబులు బోరుకొనంగఁ జారణుల్
పలుమఱు నెంచఁ గా ననికిఁ బాకహరుం డరుదెంచుచున్నెడన్. 322

చ. అభిముఖుఁ డై దశాననుఁ డుదంచితకాంచనకింకిణీక్వణ
క్షుభితదిశాకరిశ్రవణకోటర మౌ రథ మెక్కి వాహినీ
ప్రభు లిరువంకలన్ గొలువ బంధురతూర్యరవంబు లొప్ప స్వ
ర్విభు నెదిరింప మాన్చి రణవీరుఁడు రావణి తా నెదుర్కొనెన్. 323

ఉ. అత్తఱిఁ గ్రొత్తగా బవర మయ్యె సురాసురయోధకోటికిన్
గత్తులబల్తళత్తళలు కత్తళపుల్ మగటాతళత్తళల్
మొత్తము లై నభోమణిని ముంచె నభస్తటినీమహోర్ములన్
జొత్తిలఁ జేసె సైన్యయుగశోణరజఃపటలంబు లొక్కటన్. 324

ఉ. అందును నిందుఁ జేరు గలయట్టిదొరల్ నెఱయోధు లుగ్రు లై
యందఱు నంద ఱై పెలుచ నార్చుచు నొండొరుఁ దాఁకి పోరి రా
క్రందునఁ గుంభకర్ణుఁ డధికత్వర ముందుగ నన్నడెంద మా
నందముఁ జెందఁగా రణ మొనర్చె మహోన్నతశూలహస్తుఁ డై. 325

మ. పదఘాతంబుల జానుఘట్టనములన్ బార్ష్ణిప్రహారంబులన్
త్రిదశానీకిని నొంచుచున్ గలఁచుచున్ దీనత్వ మొందించుచున్
రథసంఘర్షములన్ నభంబు వగులన్ రౌద్రాకృతిన్ మించఁగా
నెదిరింపన్ వసపోక భీతిలిరి దేవేంద్రాదు లుర్వీశ్వరా. 326

ఉ. అద్రి తెఱంగునన్ సురబలార్ణవమున్ మథియించు శాత్రవో
పద్రవకారి నయ్యసురభర్తఁ గనుంగొని రౌద్రమూర్తు లౌ
రుద్రులు వచ్చి తాఁకిరి మరుత్తులు బిట్టెదిరించి యద్రిశృం
గద్రుమసంఘముల్ గురిసి కాఱియ పెట్టిరి యొక్కపెట్టునన్. 327

శా. ఆదిత్యుల్ చెలరేఁగి యయ్యసురమే నస్త్రప్రవర్షంబులన్
భేదింపన్ గిరినిర్ఝరంబులరహిన్ బెన్నెత్తురుల్ వాఱె యా
చ్ఛాదింపన్ రణభూమియెల్ల నవు డీర్ష్యాగ్రస్తు లై యాప్రహ
స్తాదుల్ సేనల నెల్లఁ గోల్తలను జేయన్ మీఱెఁ బో రయ్యెడన్. 328

చ. కరిమకరాహికర్కటకకచ్ఛపమీనవరాహఖడ్గకా
సరచమరీతరక్షుహరిశల్యకురంగతురంగగండకా
ద్యురుతరనైకవాహనము లుద్ధతి నెక్కి సురారివీరు లా
సురల నెదిర్చి రొక్కమొగిఁ జూపరు లచ్చెరువంది చూడఁగన్. 329

క. ఆసంకులసమరంబున, వాసవుఁ డౌ మే లనంగ వసువులు తుషితుల్
డాసిరి యసిధారలఁ దెగవ్రేసిరి రోసమున నసురవీరులశిరముల్, 330

వ. అప్పుడు. 331

సీ. తెగుభుజంబులు తుమురగు ధ్వజంబులు కూలఁబడుగజములనడరెడు రజములు
వ్రీలునెమ్ములు నేల రాలుసొమ్ములు చిక్కులొందు కాళ్లురవడి ద్రుందుజోళ్లు

సడలుఛత్త్రములు కీలెడలుగాత్రములు మ్రగ్గెడుకరములు దునిఁగెడుశిరములు
హారలురాతులు భీతిఁదెరలుసూతులు వ్రస్సియొఱఁగుబండ్లును బెట్టువిఱుఁగువిండ్లు

తే. పాఱునెత్తురు టేఱులుఁ దీఱుశస్త్ర, ధారలును మీఱుగాములబారు గల్గి
పేదగలవేల్పుదొరలచేఁ దీఱునాత్మ, బలము వీక్షించి రోషించి పంక్తిముఖుఁడు.

మ. అమరాధీశచమూసమూహముల దివ్యాస్త్రానలజ్వాలలన్
సమరక్షోణిఁ గలంచినన్ దెరలి యాసైన్యంబు దైన్యంబుతో
నముచిధ్వంసిరథంబుమాటునకుఁ జన్నన్ గిన్క నేత్రారవిం
దము లారక్తసరోజహృద్యుతులఁ జెందన్ జిష్ణుఁ డత్యుగ్రతన్. 333

క. అరదము దశముఖుమీఁదన్, బరువడి నడిపింపు వేగ మాతలి యనుచున్
గురుకార్ముకమార్వీ టం, కరణముతో వచ్చునింద్రుఁ గనుఁగొని యతఁడున్. 334

ఉ. సారథి నెచ్చరించి రభసంబున నిర్జరరాజు తేరికిన్
జేరువ యై తనున్ బొదువుచిల్లరవేల్పుల వాఁడితూపులన్
భీరులఁ జేసి మాతలి ననేకశరంబుల నొవ్వ నేసినన్
బేరలుకన్ శతక్రతుఁడు పేర్చి దశాస్యు నెదిర్చి శూరతన్. 335

మ. శతకోటిప్రతికోటిశాతవిశిఖాసారంబులన్ సైంధవ
ప్రతతిన్ నొంచి ధ్వజంబు ముంచి మకుటీభాగంబులన్ నించి సూ
తతనుత్రాణముఁ జించి మించిన సురాధ్యక్షున్ నిరీక్షించి యు
ద్ధతి మై రావణుఁ డాగ్రహించి దశకోదండీకరోద్దండుఁ డై. 336

మ. పదిహస్తంబుల నస్త్రముల్ దొడి నభోభాగంబు భేదిల్ల వే
ల్పుదొరల్ నొవ్వఁగ నేసి యార్చిన మరుల్లోకేశ్వరుండున్ శిత
ప్రదరాసారము నించె నింద్రధనుజేంద్రస్ఫారబాణావళుల్
గదిసెన్ భానుని దానఁ గ్రమ్మె దిశలన్ గాఢాంధకారచ్ఛటల్. 337

శా. ఆ పెంజీఁకటిలో స్వకీయపరకీయానీకినీభేదదృ
గ్వ్యాపారేతరు లై సురాసురులు తారన్యోన్యమున్ బోరుచో
దీపించెన్ భుజఖడ్గకాంతు లపు డుద్రేకించి పౌలస్త్య సే
నాపంక్తిన్ దశమాంశమున్ బొదివి మ్రందన్ జేసి రద్దేవతల్. 338

శా. ఆసేనాక్షపణంబు గన్గొని దశాస్యాదిత్యవిద్వేషి రో
షాసూయావిలమానసుం డగుచు సింహస్ఫూర్తి గర్జించి వీ
క్షాసంఘంబుల నిప్పు లుప్పతిల నుగ్రభ్రూకుటుల్ మోములన్
భాసిల్లన్ దనసారథిన్ గని యనున్ బ్రావృట్పయోదార్భటిన్. 339

క. ఇదె నందనమున నుండియు, నుదయశిఖరిదాఁక నిండి యుండెడు నైక
త్రిదశానీకినినడుమన్, బదరక మనరథము నడుపు ప్రావీణ్యమునన్. 340

మ. వసురుద్రానిలభాస్వరప్రముఖదేవశ్రేణితో నేఁడు జి
ష్ణుసమీపంబున సంహరింతుఁ బొలియింతుం దోడుగా వచ్చురా

క్షుసపాశాయుధయుక్తరాజశమనస్వాహావధూనాథులన్
వెసఁ గైకొందుఁ దదీయలోకములు దోర్వీర్యంబుతో నావుడున్. 341

మ. అతఁ డాలాగె రథంబు దోలఁగ సహస్రాక్షుండు వీక్షించి య
ద్దితిజాధీశ్వరునిశ్చయం బెఱిఁగి యాదిత్యాదులన్ బల్కె నేఁ
డతిశౌర్యంబున బ్రహ్మదత్తవరగర్వాయత్తుఁ డౌ రావణున్
మృతిఁ బొందింపఁ దరంబు గాదు గద బల్మిన్ బట్టి తెత్తున్ జుఁడీ. 442

మ. అవలోకింపుఁడు మీర లిందఱు మదీయం బైనశౌర్యం బటం
చు విజృంభించి బలారి దక్షిణపదస్థుం డై చరించెన్ సురా
రివరుం డుత్తరభాగవర్తి యయి మీఱెన్ గొంతసే పంత న
ద్దివిజేంద్రుం డెదిరించి దైత్యు నతఁ డద్దేవేంద్రుఁ దాఁకెన్ వడిన్. 343

వ. ఇవ్విధంబున. 344

క. కుడియెడమలుగాఁదిరుగుచు, నెడనెడమాఱ్కొనుచుఁ దలఁగియేఁగుచు శరముల్
జడిగొన నిగుడించుచు బడి, బడి నడరుచుఁ దొడరి తెంపుపనికిఁ దివురుచున్.

మ. పలుచందంబులఁ బోరుచున్నయెడ జంభద్వేషి యాదిత్యరు
ద్రులతో ముప్పదిమూఁడుకోటుల సురల్ దోడ్తో విజృంభించి కో
త్రలు సేయన్ దశకంఠునిన్ దొడరి రథ్యవ్రాతమున్ నొంచి చే
తుల విండ్లన్ దెగ వ్రేసి పట్టికొన నుద్యోగించి ధైర్యంబునన్. 346

చ. అరదముచుట్టు ముట్టుకొని యాఁగి దశాస్యుని బిట్టదల్చి పై
కుఱికి తెమల్చి పట్టుకొని యుద్ధవిడిం దన తేరిమీఁదికిన్
సురపతి గొంచుఁ బోవుటలు సూచి నిశాటులు స్రుక్కి దానవే
శ్వరుఁ డదె చిక్కె దైత్యులకు వచ్చె నుపద్రవ మంచుఁ గూయిడన్. 347

ఉ. ఆరొద లాలకించి తమయయ్యయుపాధియుఁ గాంచి సంగర
క్రూరుఁడు మేఘనాదుఁ డతికోపముతో శిఖిఁ బుట్టినట్టిబల్
తేరును గేతువున్ హరులు దివ్యధనుశ్శరధుల్ వెలుంగ గౌ
రీరమణీమనోహరవరిష్ఠవరాగతశౌర్యధుర్యుఁ డై. 348

చ. కడువడి నేఁగుదెంచి దశకంఠునిచుట్టును నిండి యాఁగి యుం
డెడి తెఱగంటిమూఁకలఁ గడిందిబలంబున డాసి యంపవెం
జడి నిగుడించి వర్మములుఁ జర్మములున్ బగిలించి నెత్తురుల్
మడువులు గట్టఁ జేసి బలుమచ్చర మెచ్చగ నుచ్చరింపఁగన్. 349

సీ. అరదంబు లెగలించి ద్విరదంబుల నడంచి దరదమ్ములగునాయుధములఁ ద్రుంచి
పడగలగుమిఁ జీల్చి గొడుగులగమిఁ గూల్చి వడి గల తేజీలఁ బుడమి వ్రాల్చి
శిరములఁ బగిలించి కరముల నొగిలించి నరముల విశిఖసంతతులఁ ద్రుంచి
హనువులు నొప్పించి ధనువులు దప్పించి తనువులు నిశితశస్త్రముల ముంచి

తే. భటులఁ బడలించి యాశ్వికార్చటులమాన్చి, సారథుల నేసి రథికులఁ జదియఁ జేసి
హస్తిపకకోటి నలయించి యభవదత్త, తామసీవిద్యఁ దాల్చి యద్దనుజసుతుఁడు.

— మేఘనాదుం డింద్రజిత్తగుట —

మ. అలుకన్ దేరును దా నదృశ్యుఁ డయి మాయాధ్వాంతమున్ దిక్కులన్
బలియన్ జేయుచు నింద్రునిన్ బొదివి తత్ప్రాక్స్వస్థులౌ దిక్పతుల్
తలఁకన్ మాతలిపైఁ బతాకపయి రథ్యశ్రేణిపైఁ దేరిపై
బలుతూపుల్ నిగుడించి యార్చిన బలప్రత్యర్థి విభ్రాంతుఁ డై. 351

మ. అరదం బయ్యెడ డిగ్గి యగ్గలికతో నైరావతారూఢుఁ డై
పఱనిన్ గానక నాల్గుదిక్కు లరయన్ బౌలస్త్యపుత్రుం డగో
చరుఁ డై గోచరచక్రవర్తి నొలయన్ శస్త్రాస్త్రముల్ నించి బం
ధురమాయాతిమిరాంధుఁ డౌనతని బద్ధున్ జేసెఁ బాశావళిన్. 352

మ. తనమాయాబలలీల నీగతి సుధాంధస్స్వామిఁ బంధించి య
ద్దనుజాధీశసుతుండు నవ్వుచు రథస్తంభంబుతో నంటఁ గ
ట్టె ననున్ గన్నదశాననున్ ద్రిదశకోటిన్ గూడి బంధింప నెం
చిననీవే యిటఁ జిక్కితింద్ర యనుచున్ జింతంబుఁ బూరించినన్. 353

ఉ. అత్తఱిఁ గెల్లఁ దెల్లముగ నారసి యుబ్బుచు దైత్యసత్తముల్
మత్తిలి మేఘనాదుఁ బలుమాఱు నుతించుచుఁ గేక ప్రేయుచున్
నృత్తము సేయుచున్ జెలఁగి రింద్రునికొండలపాటు చూడ లే
కత్తఱి రుద్రసాధ్యమరుదశ్విను లార్చుచు ధీరచిత్తు లై. 354

చ. చలమున రావణున్ బొదివి సాయకజర్జరితాంగుఁ జేసి త
ద్బలముల నొవ్వ నేసి గుమిఁ బాయక పైపయిఁ గ్రమ్ముకొన్న బి
ట్టలసి దశాననుండును బ్రయత్నముతో నని సేయ నంబర
స్థలమున నుండి చూచి రభసంబున రావణి వచ్చి యార్చుచున్. 355

మ. ప్రళయాభ్రం బమితాశనుల్ గురియుదర్పం బేర్పడన్ వారిపై
శిలలున్ బర్వతశృంగముల్ శరములున్ జీమూత వర్షించి ద
వ్వులకున్ బాఱఁగఁ దోలి తండ్రిఁ గని దివ్యుల్ పాఱె రింద్రుండు దు
ర్బలుఁ డై నాచెయిఁ జిక్కె నేల యిఁక సంగ్రామంబు దైత్యేశ్వరా. 356

చ. మగఁటిమి నీడు గానిసురమండలితో నని సేయ నేల ము
జ్జగముల కీవు నాథుఁడవు సైన్యముల్ మరలింపఁ బంపు నీ
కగపడె వీఁడె వాసవుఁ డటంచును జూపిన మేఘనాదునిన్
బిగియఁ గవుంగిలించి కడుఁ బ్రీతి వహించి దశాస్యుఁ డిట్లనున్. 357

చ. వెలసెఁ గులంబు నీవలన విక్రమధైర్యనిధాన పోరిలో
బలరిపునంతవానిఁ జెఱఁ బట్టఁగ నెవ్వరి కైన శక్యమే

తెలిసి నీప్రతాప మదితిప్రియపుత్త్రులు ముజ్జగంబులన్
వలసినయట్లు గొంటి నినువంటికుమారుఁడు గల్గి యుండుటన్. 358

ఉ. అందఱిలోనఁ బెంపును జయంబును జెందితి గాన ముందు నీ
స్యందన మేఁగనిమ్ము వెనుచక్కిన వచ్చెద నేను సేనతో
నిందఱుజోదులున్ గొలువ నివ్వెడ నంచుఁ గుమారుఁ బంచి మి
న్నంది బలంబుతో వెనుక నై దశకంధరుఁ డేఁగె వేడుకన్. 359

వ. ఇవ్విధంబున. 360

చ. సుతుని బురస్కరించుకొని సూరెల మంత్రులు సంస్తుతింపఁగా
శతమఖుగుండె దిగ్గుమన సర్వనిశాచరసేన గొల్వఁగా
నతులమహావిభూతి మెఱయన్ దనప్రోలికిఁ బోయి సోదరా
న్వితుఁ డయి పౌరు లుల్లసిల వేడుక నొందుచునుండె రాఘవా. 361

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని యింద్రుం డెటుల మర్కల విడిపించుకొనెన్
వినిపింపుఁ డవలికథ యని, మనువంశనృపాలమౌళిమణి యడుగుటయున్. 362

ఆశ్వాసాంతము

మ. నతరక్షాభరణా రణార్థిరిపుసేనావారణా వారణా
ర్తితమోహృత్తపనా పనాయితగుణ శ్రీధారణాధారణా
న్వితచేతోభ్యుదయా దయాముదితకుంతీనందనా నందనా
యతధాత్రీజహరా హరాదికసపర్యాభాసితా భాసితా. 363

క. అమరార్చితపదకమలా, కమలారమణీసమీపగత హారమణీ
రమణీయదమైకమనా, కమనాకృతిముషితగోపికామానధనా. 364

పృథ్వీవృత్తము. ఫణాభృదరుణాధరాప్రణుతికర్ణసంతర్పణా
రణాయితఘృణారసప్రవిలసత్కటాక్షేక్షణా
క్షణాధ్వశరణాగతోచ్ఛ్రయగృహార్చనాకారణా
రణాశనకణాదపర్వతముఖార్యసంరక్షణా. 365

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన
వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ
వితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర
ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన
వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర
కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన
నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన
నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామా
యణం బనుమహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## పంచమాశ్వాసము

—:o:—

శ్రీమత్సత్రాజిత్తన
యామంజులచరణతలసమాసాదితలా
క్షామోహాకరణచణ వ
క్షోమధ్యస్ఫురితరత్నశుభకాంతినిధీ. 1

దేవతలు బ్రహ్మయొద్దకుఁ బోయి యింద్రునిపరాజయము సెప్పుట

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
రఘుకులాధీశ యీరీతి రావణాత్మజుండు సురపతిఁగొని లంకఁజొచ్చుటయును. 2

శా. ఆశ్చర్యార్తిభయాత్ములయ్యు వసురుద్రాదుల్ సుధాశిద్విష
త్పశ్చాద్భాగముఁ జేరి కొంతవడి బద్ధస్పర్ధఁ బోరాడి త
ద్దోశ్చక్రాసిగదాపరశ్వథముఖాస్తోకాయుధస్తోమముల్
నిశ్చేష్టత్వముఁ జెందఁ జేయుటయు శ్రాంతిన్ బొంది వారందఱున్. 3

మ. ఒకచో గుంపులు గూడి దీనముఖులై యుచ్ఛ్వాసముల్ నించుచున్
వికలత్వంబున వైరిఁ గాంచుచు నయో వృత్రాదిదైత్యచ్ఛిదా
ధికతేజోనిధి కింతవంత వొడమెన్ దేవత్వమున్ రాక్షస
ప్రకరాధఃకృత మయ్యెఁ గాలగతి మాన్పన్ గూడ దెవ్వారికిన్. 4

తే. ఏమిసేయుద మింతకు హేతు వలవి, ధాతగద యమ్మహాత్మున కీతెఱంగు
విన్నపము సేసి తద్వచోవృత్తిమెలఁగ, నన్నిటికి మేలని తలంచి యపుడ కదలి. 5

సీ. ఎదురుగా వచ్చి దేవేంద్రునిఁ బొడగాన కల్లస్వర్గమువారు తల్లడిల్ల
నింద్రునంతటివాని కెంత వచ్చె నటంచు వనట సువర్లోకవాసు లడర
జేజేలు తండ్రిఁ శాసినప్రజ లైరయో యని చూచి జనలోకజనులు వగవ
శతమన్యుఁ డెఱఁ బట్టఁ జాలిరే బగవార లని తపోలోకంబుమునులు బెగడ

తే. వాసవుం డెందుఁ జనెనొ వివర్ణు లగుచు, నమరు లేటికి వచ్చిరో యనుచు సత్య
లోకమునఁ గాపురంబున్నలోకు లరయ, జలజగర్భునిసభఁ జేరఁ జనిరి సురలు. 6

మ. చని నానావిధదివ్యరత్నమయభాస్వన్నవ్యశిల్పంబులన్
గన నై నైకవిధావతారకమలాక్షశ్లాఘ్యచిత్రాతిచి
త్రనవస్ఫాటికకుడ్యహారిరుచులన్ దళ్కొందు యాత్మప్రకా
శనిరూఢోన్నతి దివ్య మానౌకమహాసౌధాగ్రభాగంబునన్. 7

సీ. కపిలమార్కండేయకణ్వాదిమునిశిఖామణులతో నొకమోము మాటలాడ
నీకఁ జేయఁదగుసృష్టి యిదిసేయుఁ డని యుపబ్రహ్మలకొకమోము బదులువలుక
భావగర్భము లాడు భాషావధూటితో నొకమోము నగుచు నర్మోక్తి నుడువ
నప్సరఃకమలాస్యలాడులాస్యము లొక్క మొగముసూచుటకాభిముఖ్య మొంద

తే. సర్వతోముఖచాతుర్యధూర్వహత్వ, మొంది డెందంబు చెలువొంద నున్నతాబ్జ
రాగసింహాసనస్థుఁ డై రాజసమునఁ, బెద్దకొలు వున్న జేజేలపెద్ద గనిరి. 8

మ. కని యాదిత్యమరుద్వసుప్రముఖలేఖశ్రేష్ఠు లా పెద్ద వే
ల్పునకున్ జాఁగిలి మ్రొక్కి మోడ్చినకరాంభోజాతయుగ్మంబు లా
త్మనిటాలంబులఁ జేర్చి నిల్చిన దయాధారేయుఁ డై మీరు వ
చ్చినకార్యం బది యేమి తెల్పుఁ డని రాజీవాననుం డాడినన్. 9

మ. అమరుల్ స్వామి పరాకు నేఁడమరలోకారాధ్యుఁ డౌనింద్రునిన్
సమరక్షోణి నెదిర్చి రావణతనూజాతుండు బంధించి దు
ర్దమశౌర్యంబునఁ గొంచుఁ బోయె బురికిన్ దద్ఘోరమాయామహ
త్త్వమునన్ మేమును దూలి వచ్చితిమి మా తాపంబు వారింపవే. 10

ఉ. గట్టుల మట్టుపెట్టుబలుకైదువుఁ బట్టినయట్టిదిట్టఁడున్
దిట్టతనంబు వాసి పొలదిండికి లోఁబడి గాసిఁ జెందఁగా
నెట్టు సహింప వచ్చు జగదీశ యశక్తునిచంద మొంది చూ
పెట్టుక యుండ నేల విడిపింపఁ గదయ్య యమర్త్యవల్లభున్. 11

మ. అని ప్రార్థించుదివాటకోటిఁ గని యాహా యెంతకార్యంబు వ
చ్చె నిలింపాగ్రణి కంచు ధాత కరుణాస్ఫీతాత్ముఁ డై లేచి కొ
ల్వున నున్నందఱుఁ గొల్వ నెల్లజిగిపుల్గుందేజిపై నెక్కి గ్ర
క్కున లంకాపురి కేఁగెఁ జారణముఖుల్ గైవారముల్ సేయఁగన్. 12

బ్రహ్మదేవుఁ డింద్రజిత్తునకు వరం బొసంగి యింద్రుని విడిపించుట

ఆ. ఏఁగి తనకుఁ బూజ లిచ్చుమిత్త్రాత్మజ, భారిత్రయుక్తుఁ డైన పంక్తిముఖుని
నాదరించి మింట నధివసించి విరించి, యంచితోక్తి దనుజు లలరఁ బలికె, 13

ఉ. వత్స దశాస్య యెందు నినువంటిబలాఢ్యుసిఁ గాన వేల్పులన్
మత్సర మొప్ప గెల్చితివి మార్కొని జిష్ణునిఁ బట్టి తెచ్చె యు
ష్మత్సుతుఁ డింతకంటె భుజశౌర్యము లున్నవె యింక దేవతా
హృత్సరసీజముల్ పొగుల నీతఁడు మే టగు నింద్రజిత్తనన్. 14

చ. అమరులఁ బ్రోవ ముజ్జగము లారయ నింద్రుఁ బ్రతిష్ఠ సేసి నా

డ మొదల వాఁడు వారలఁ బడక దగఁ డిం కిట నానిమిత్త మ
య్యమరవరేణ్యునిన్ విడువు మంచు బయోరుహగర్భుఁ డాడువా
క్యములు దశాస్యసూతి విని యంజలిఁ జేసి వినీతి ని ట్లనున్. 15

మ. జగదారాధ్యపదాబ్జ మీరు లిపు డాజ్ఞాపించినట్లే జయం
తగురున్ వీడెద నా కొసంగు మమరత్వం బన్న వాణీశుఁడున్
నగి యక్షాసురకిన్నరప్రముఖనానాప్రాణిరింఛోళికిన్
జగతిన్ లే దమరత్వ మిం కొకటి గాంతున్ వేఁడుమా యిచ్చెదన్. 16

చ. అన విని మేఘనాదుఁ డను నట్టిదయేని మహాత్మ వైరిం
నని యొనరింపఁగా వలసినప్పుడు వ్రేల్మి యొనర్చి హోమవ
హ్నిని జనియించుదివ్యరథ మెక్కినచో నమరత్వ మొంద ని
మ్మనుపమహోమవిఘ్న మయినప్పుడు నాశము సమ్మతించితిన్. 17

చ. తపములు పెక్కు సేసి కద తాత యమర్త్యత గందు రందఱున్
విపులపరాక్రమంబునను వేఁడెద నీయభిలాష మియ్య వే
కృప నని పౌత్రజుం డడుగ నిచ్చితి నట్లగు నంచుఁ బద్మజుం
డపుడు విముక్తుఁ డైన దివిజాధిపుఁ దోడ్కొని వేడ్క మీఱఁగన్. 18

క. వారల నట వీడ్కొని తన, వారలతో గగనమార్గవర్తి యయినచో
గౌరవహానిజలజ్జా, భారంబున శిరము వంచి బలరిపుఁ డంతన్. 19

సీ. వీడినసిగ జాఱువిరిపువ్వుసరులతోడ ముఱువు డించినవాడుమోముతోడ
దండడిఁ దెగి రాలుతారహారములతోడ వదలినభూషణవ్రజముతోడ
బలుకట్లదద్దు తేర్పడుభుజార్గలలతోడ నలఁగినచలువదువ్వలువతోడ
నరిశరజర్జరితావయవములతో బడలికఁ బాడముచేడ్పాటుతోడ

తే. నడుగు లెడనెడఁ దడఁబడ నశ్రుజలము, లడర నడలుననడతెంచి యంఘ్రికమల
యుగళి వ్రాలిన బలవైరి నూఱడించి, యంచిత ప్రేమ మించి విరించి యనియె.

దోదకవృత్తము. ఖాలిశునైనను బండితునైనన్, గాలవశంబునఁ గర్మఫలంబుల్
మే లయి కీడయి మేకొన కున్నే, యేల మనోవ్యథ నింకద వింద్రా. 21

మ. తొలిజన్మంబునఁ జేయుకర్మములు చెందుం గొందఱుం గొందఱుం
గలఁచుం దప్పక నాశరీరమున నాకర్మంబె కర్మస్థితుల్
తెలియన్ శక్యము గావు మాదృశులకున్ దేవేంద్ర నీకర్మ మే
కలఁగించెన్ నిను నిట్లు పూర్వకథ యాకర్ణింపుమా తెల్పెదన్. 22

వ. అని పల్కి శతానందుండు పురందరున కి ట్లనియె. 23

ఇంద్రున కహల్యాప్రాణనాథుండు శాపమిచ్చిన విధంబు

శా. నే నిర్మించిన కామినీమణులలో నీ టొందు నీలాలకన్
నే నింకొక్కరితన్ సృజింతు ననియున్ నిష్కర్ష గావించి యీ

నానాదివ్యవిశేషవస్తువులసౌందర్యాంశముల్ గూర్చి లో
కానందాకృతిగా సృజించితి నహల్యానామభామామణిన్. 24

తే. హలమునాఁగలిరూపమాహలముభావ,మరయ హల్యంబు నాఁజను నట్టిహల్య
మన్నెలంతకు లేమి నహల్య యనుచు, నేను బలికితి నెఱుఁగవే యింద్ర నీవు.

సీ. కమలవైఖరిసుధాకరకళావిభవంబు లొకటి యై చెలువొంది యుండుటకును
భ్రమరసంపదలు సంపఁగెపువ్వువిలసనం బొకటియై చెలువొంది యుండుటకును
దాడిమీబీజసంతతి శుకమణిముఖం బొకటి యై చెలువొంది యుండుటకును
శంఖసౌభాగ్యంబుఁ జారువీణాస్వనం బొకటియై చెలువొంది యుండుటకును

తే. నేఁ బ్రయత్నంబు సేసి యన్నెలఁతకన్నుఁ
గవ మొగము చూపుగుమి నాసికయు రదములు
మోవి కంఠంబు సుస్వరమును సృజించి
కాంచితి సురేంద్ర యఘటనాఘటనపటిమ. 26

సీ. పూర్ణేందుబింబ మెప్పుడు నిల్వలేదాయె నసుదూఱు దీనియాననమువలనఁ
గవజక్కవలఁ బాయఁగాఁ జేసె నౌ నసుసడి దీనికుచలికుచములవలనఁ
బగలు కల్వలచెల్వు ప్రబల నీయం డనుదూషణ దీనికందోయివలన
మించు నించుకసేపు మించ నిర్మించ లేఁ డనురట్టు దీనిదేహంబువలనఁ

తే. బాపుకొని లెస్స సృజియించె బ్రహ్మ యనుచుఁ, గొలువవచ్చినదేవతాకోటిదలఁప
నీవెలఁది నిమ్మనుచు నన్ను నీవు వచ్చి, వచ్చి యడుగుదు మఱచితే వజ్రపాణి.27

చ. పలుమఱు నీవు వేఁడిన నభశ్చరు లెందఱు వచ్చి వేఁడినన్
గలికి నొసంగ కెవ్వరికి గౌతమమౌనికి దాని నిచ్చినన్
గళవళ మంది నీవు రతికాంతకృతాంతలతాంతకుంతముల్
బలువిడి మానసాంబుజము బ్రద్దలు సేసిన దైన్యమూర్తి వై. 28

క. నను దూఱుచు గౌతమముని, వనిఁ దూఱుచుఁ గుసుమలసితవల్లీవిలస
ద్వనిఁ దారుచు నచ్చెలిఁ బెనఁ, గొనఁగోరుచుఁ బొంచి ప్రొద్దు గ్రుంకినయంతన్.29

ఉ. ఆనడిరేయి కోడివలె నార్భటి సేసి మునీంద్రునిన్ నదీ
స్నానము సేయఁ బంచి కుహనాముని వై చని గౌతమాంగనా
నూనరతోత్సవాంబుధి మునుంగుచు నుండితి వంతలోన న
మ్మౌనియు వచ్చి నిన్నుఁ గని మచ్చర మల్కయు నిచ్చ హెచ్చఁగన్. 30

మ. కపటాకారముఁ బూని మానిసతులన్ గాంక్షించి యీలాగు గా
నిపనుల్ సేయఁ గడంగినాఁడవె బళా నీకండగర్వంబు దే
వపతీశత్రుఁడు పట్టి కట్టికొని పోవన్ దీఱుఁ బొమ్మంచు నిన్
శపియించెన్ దగ నాఁటిశాప మిదిగో సంధిల్లె నీనాఁటికిన్. 31

క. నినుఁ గలసిననిజకాంతకుఁ, బెనుఁజప్పై యుండు మని శపించి జగతిఁ జ
క్కనిసతులు తఱుచు గలిగెద,రని ముని యనె నటుల కలిగి రదిమొదలు ప్రజల్. 33

వ. కావున.

చ. వగవకు మీయఘంబు చన వాసవ వైష్ణవయాగ మంచితం
బున నొనరింపు నీయనుఁగుఁబుత్త్రుఁ బులోముఁడు వార్ధి వైచె చే
నగపడకుండ దాఁచె వల దాతనికై వెతఁ జెంద నంచు న
న్నగరిపు నూఱడించి నలినప్రభవుం డపు డేఁగె వీటికిన్. 34

చ. కమలజుఁ డానతిచ్చిన ప్రకారమునన్ గ్రతు వాచరించి ఖే
ద ముడిగి వాసవుండు నిజధామము సేరె నృపాల రావణ
ప్రముఖులకంటె రావణిపరాక్రమ మెక్కుడ యన్నమాట ని
క్క మవుఁ గదా యటం చల యగస్త్యమహాముని యానతిచ్చినన్. 35

తే. ఆపురావృత్తమున రావణాత్మజన్ము, విక్రమము పెద్ద యనుమాట విని రఘుప్ర
వీరుఁ డరుదందె సభ నున్నవార లెల్ల, నింద్రజిద్వైరి లక్ష్మణు నెంచి రపుడు. 36

ఉ. శ్రీరఘురాముచెంగట వసించి విభీషణుఁ డగ్రజక్రమం
బాఋషి దెల్పఁగా విని ప్రహర్షముతో నృపుఁ జూచి మున్ను క
న్నారఁగఁ జూచినట్లు ముని యానతి యియ్యఁగ నేఁడు వింటి న
య్యారె యగస్త్యుఁ డెంతమహిమాధికుఁ డంచు నుతించె నయ్యెడన్. 37

క. మైత్రావరుణి ధరిత్రీ, పుత్త్రీవరునిఁ గని యనియెఁ బుంభావకళా
ధాత్రానందకరోక్తిని,గాత్రీపదపుటితకటకఘటితార్భటులన్. 38

చ. జడధిమదాంధకారహరశౌర్యదినేశ్వర రామ మున్ను నీ
వడిగినమాట కింక నొకయద్భుత మున్నది యాలకింపు మి
వ్వడువున రావణుండు బలవంతుల మార్కొను వేడ్క నొక్కనాఁ
డెడపక పశ్చిమాబ్ధిదరి కేఁగి తదంతిక కాననంబునన్. 39

రావణుండు కపిలమహామునిచే భంగపడుట

చ. పరిచరు లూడిగంబు సలుపన్ సచివుల్ హితభాష లాడఁగా
శరధితరంగరంగదురుసైకతసీమల సంచరించుచున్
బరిసర ధారుణిన్ దుహినపర్వతమో యన మించునొక్కభూ
ధరమణిఁ జూచి చేరఁ జని దానవుఁ డం దొకకోనలోపలన్. 40

సీ. నికటావనీజసంక్తికిఁ గడారజటాంశు లామ్రేడితదళంబు లై వెలుఁగ
నాసన్నఝరములం దాననశోణాబ్జ మమితారుణాంభోరుహముల నింప
సవిధకుంజాలిపుంజముల గ్రీవాలగ్నపద్మమాలిక సౌరభములఁ బిల్వఁ
బరిసరపల్లవప్రతతిఁ బల్లవమంజుపాదముల్ నఖకాంతిఁ బరిహసింప

తే. బద్ధపద్మాసనస్థుఁడై పరమనిష్ఠఁ, గన్నుఁగవ మూసికొని పాణికమలసముది
తాక్షమాలిక చెవి వ్రేల నాత్మయోగ, పూర్ణసుఖమొందునొకమహాపురుషుఁ [గాంచె.

ఉ. కాంచి సమీపభూమి దశకంఠుఁడు సేరఁగఁ దత్పిశంగనే
త్రాంచలవీథి నుప్పతిలె నగ్నిశిఖల్ భ్రుకుటీకరాళమై
మించె ముఖంబు బాహుల నమేయశితాయుధయూథముల్ విజృం
భించెఁ దనూరుహాళిఁ గనిపించె మరుద్వసురుద్రసంఘముల్. 42

చ. గ్రహముల భానుఁడున్ గిరులఁ గాంచనశైలము వేల్పులందు వృ
త్రహుఁడు నిభంబులందుఁ జవుదంతియుఁ జెట్టులఁ గల్పధారుణీ
రుహము వెలుంగునట్టు లజరుద్రముఖామరమూర్తులందు దు
స్సహ మగు మూర్తిఁ జేకొని యెసంగెడునాథునుఁ జూచుచున్నెడన్. 43

సీ. ఉరమున శ్రీదేవి యూరుల ధర్మంబు తలఁపున మదనుండుఁ దపము దమము
మూఁపునఁ బితృసంఘమును శల్యముల మరుద్గణములుఁ గుక్షి సాగరచయమ్ము
వసువులునడుమఁ బార్శ్వములదిక్కులుకన్నుఁగవసూర్యచంద్రుల గ్రమునరుద్రు
లాశ్వినుల్ సెవుల శాపోదండములను ధాతయు విధాతయు నను దైవతములు

తే. రమ్యమణిబంధమున భిదురంబు పాణి
తలములను భగపూషులు తగ నఖముల
భుజగతతి రోమముల దానవులు తనువున
వివిధదివ్యులు దివములు వెలయుటయును. 44

శా. ఆవింతల్ గని యూర నాయెదుట మాయల్ సేయఁగాఁ జొచ్చినాఁ
డీవాచంయమి యంచు రావణుఁడు వహ్నిజ్వాలికాభీలలీ
లావేళాస్త్రచయంబు నాఘునునిపై నందంద వర్షించి వీ
రావేశంబునఁ బేర్చి యార్చిన నతం డాటోప మేపారఁగన్. 45

క. బెడఁగుంజూపుల నిప్పులు, జడిగొన వడి లేచి నన్ను సాధింపఁగ ని
క్కడకున్ వచ్చితె యోరీ, చెడుగా యని యలఁతిముష్టిచేఁ దాటించెన్. 46

ఉ. ఆయనముష్టిఘాతము మహాకులిశాయుధలీల మించినన్
వాయుమహోద్ధతిన్ ధరణి వ్రాలుమహాకుజమో యనంగ దై
తేయుఁడు గూలెఁ గూలినపతిన్ గని మంత్రులు దాఁక వచ్చినన్
బాయఁగఁ జేసె హుంక్రియనె బల్లిదుఁ డప్పురుషుండు భూవరా. 47

ఆ. అలఁతిముష్టిఁ బొడిచి యమరారి నొగిలించి, యతనివారి హుంక్రియనె కలంచి
యమ్మహానుభావుఁ డంతికగిరిగుహాభ్యంతరంబు సొచ్చె నతిరయమున. 48

ఉ. ఆయెడ మూర్ఛ దేఱి దనుజాగ్రణియున్ దనవారిఁ జూచి న
న్నీయెడ ముష్టినొంచినతఁ డెక్కడ కేఁగె నటన్న వార ల
య్యా యిఁక నేటి కాతఁడు భయంపడి యగ్గుహ సొచ్చి చెచ్చెరన్
బోయెఁ బరాఙ్ముఖున్ దొడరఁ బోవుదురే మిమువంటిబల్లిదుల్. 49

క. అది గాక బాహువిక్రమ, మదనం బితనికి మహాత్ముఁడని తోఁచుచు ను
న్నది పాతెఱుబండ్లకు వల,వదు పదములు నాఁప దనుజవల్లభయనినన్. 50

చ. అలిగి బళా యతండు ప్రళయాంతకుఁ డైనను బోవ నిత్తునే
నిలువుఁడు మీఱ లేడ నని నిశ్చయుఁ డై నిబిడాంధకారముల్
శళముకొనంగ మాధుమదిలాగున నున్నగుహాంతరంబులో
పలికి దశాననుం డరిగె బాణకృపాణరుచుల్ వెలుంగఁగన్. 51

వ. అరిగి తత్ప్రదేశంబున. 52

సీ. అతిభీషణాకారులై ఘోరశస్త్రాస్త్రధారులై విలసిల్లువీరవరుల
నఖిలలోకైకమోహనవిలాసాగణ్యలావణ్యవతులైన దేవసతుల
నవలోకములనె బ్రహ్మాండంబు భస్మంబు సేయఁ జాలినమహాసిద్ధవరుల
శంఖచక్రగదాసిశార్ఙ్గముల్ గలచతుర్భుజములఁ దాల్చినపురుషవరులఁ

తే. జూచి వారలతేజంబు సొంపు పెంపు, గరువతనమును దను భీతుఁగా నొనర్ప
నప్పతిలుత త్తఱమున నందుండ వెఱచి,పఱచి దశకంఠుఁ డగ్గుహాభ్యంతరమున.

సీ. దివ్యచందనమాల్యభవ్యసౌరభములు ఘుమ్మని గుహయెల్లఁ గ్రమ్ముకొనఁగ
మహాసీయకోటీరమకరకుండలమణిద్యుతు లంధకారంబు తోలఁగ ద్రోయ
గగనభాగమున నక్షత్రపంక్తులఁ బోలి యురమున మౌక్తికసరములలరఁ
చామరగ్రాహిణీచటులకంకణనిస్వనంబులు సెవుల కానంద మొసఁగ

తే. దగుశరచ్చంద్రచంద్రికాధవళశయ్యఁ
బవ్వళించి పదాబ్జముల్ బాల యొకతె
దొడల నిడుకొని యొత్తఁ గందోయి మోడ్చి
నిదుర వోయెడియొకసౌఖ్యనిధినిఁ జూచి. 54

తే. చూచి యాయనచెంగట సొబగువాలు, బెళుకుఁజూపుల వెలయునచ్చెలియనట్టె
తెప్ప వేయక కనుచు దుర్వృత్తుఁ డగుచుఁ, జెంతకొకయింతఁ జేరినయంతలోన.

తే. ఎఱిఁగి యమ్మేటి తా మునుంగిడినజిలుఁగుఁ, జలువవెలిపట్టు దొలగించి సరగ లేచి
సరభసంబున నట్టహాసంబు సేయ, వింశతిభుజుండు భీతిల్లి వివశుఁ డయ్యె. 56

క. వివశుఁ డయి కొంతవడి క, ద్దివిజారిప్రభుఁ డొకింత తెప్పిఱి యతనిన్
సవినయముగఁ గని యెవ్వం,డవు నీవు మహాత్మ యేర్పడఁగఁ దెల్పఁ గదే. 57

సీ. రుద్రునిఁ గనుగొంటి రుద్రున కిటువంటిదారుణోన్నిద్రరౌద్రంబుఁ గాన
జమునితో మార్కొంటి జమునకు నిటువంటి కర్కశోదగ్రవిగ్రహముఁ గాన
దపనునిఁ బొడగంటిఁ దపనున కిటువంటి ప్రతిమాతిగప్రతాపంబుఁ గానఁ
గనకాద్రిపై నుంటిఁ గనకాద్రి కిటువంటియతిదుర్నివారధైర్యంబుఁ గాన

తే. నింద్రచంద్రాదిదివ్యుల నెల్లఁ గంటి, వారియం దీప్రభావ మెవ్వారికిఁ గాన
నిగురులోనిప్పతీరున నీచరిత్ర, మెఱుఁగఁబడ దన్న నగి యతఁ డిట్టు లనియె. 58

తే. ఇప్పుడెల్లను నన్ను నీ కెఱుఁగవచ్చు, నే దశానన యింకమీఁద నీవ యెఱిఁగె
దింతలోపలఁ బదరి నే నింతవాఁడ, ననుచు వివరింపఁ బో నది యట్టులుండె. 59

శా. బ్రహ్మేశానవరంబులన్ భువనముల్ బాధించి బ్రహ్మణ్యు ల
బ్రహ్మణ్యంబులు వెట్టఁగా మెలఁగినన్ బ్రహ్మోక్తి సైరించితిన్
బ్రహ్మఘ్నున్ నిను నింకమీఁద ననిలో బాహాబలం బేర్పడన్
బ్రహ్మేశాదిసురేంద్రు లడ్డపడినన్ భంజింపుదున్ రావణా. 60

కపిలముని యైన నారాయణుండు రావణునకు స్వస్వరూపంబుఁ జూపుట

క. నే నెవ్వఁ డని తలంచితొ, నానిజరూపంబుఁ జూచి నామహిమంబున్
నానామ మెఱిఁగికొమ్మని, యానన మొకయింత దెఱచినంతటిలోనన్. 61

సీ. జ్వాలనకీలాసహస్రము లర్కకరలక్ష లైందవరుచికోటు లచటఁ దోఁచె
నరసురాసురవియచ్చరసిద్ధసాధ్యరుద్రాహిగుహ్యకతతు లచటఁ దోఁచె
నఖిలసముద్రంబు నఖిలాంతరీపంబు లఖిలసరిద్వన్య లచటఁ దోఁచె
నభము భూమియు గాడ్పునక్షత్రములు గిరులామ్నాయముఖవిద్యలచటఁ దోఁచె

తే. నట్టిముఖములు పెక్కవే లమితకర్ణ
నయననాసాపుటంబు లనంతపదము
లమితబాహువు లమితభూషాంబరాదు
లమితశస్త్రంబు లమ్మూర్తియందుఁ దోఁచె. 62

క. ఆయద్భుతతేజోనిధి, చాయన్ గరియొద్దిదోమచందంబున దై
తేయుండు హీనుఁడై తన, కాయము గంపింప వెఱచి కన్నుల మొగిచెన్. 63

వ. ఇవ్విధంబున. 64

తే. కన్ను లన్నియు మొగిచి నక్తంచరేంద్రుఁ, డమ్మహామూర్తికానతు లాచరించి
యంజలు లొనర్చి దేవ నీవని వధించు, నంతకంటె శుభం బేది యనుచుఁ బలికె.

క. ఆదట గిరితో గుహతో, నా దేవుఁ డదృశ్యుఁ డయ్యె నద్భుతభయస
మ్మోదములు వెలయ మారీ,చాదులతో నచటు వాసి యతఁ డరిగె నృపా. 66

తే. రామ గుహతోన గిరిచెంత రావణునకుఁ, గనఁబడిన దేవుఁ డెవ్వఁడో యనఁగ నేల
యతఁడె కపిలావతారుఁ డౌ నాదివిష్ణుఁ, డాయనకు నీకు భేద మింతైనఁ గలదె.

వ. అని పల్కి యగస్త్యమునిచంద్రుండు వెండియు రామచంద్రున కిట్లనియె. 68

సీ. స్నానసంధ్యాజపస్వాధ్యాయమఖముల నెవ్వాని స్మరియింతు రెల్లఋషులు
జగదుద్భవస్థితిసంహారకృత్యంబు లెవ్వానిక్రీడలై నివ్వటిల్లు
బ్రాఁబల్కుకల్కిపాపటకు సిందూరమై యెవ్వానిపదకాంతి యెసకమెసఁగు
దేశికోచ్చరితోపదేశమంత్రంబులై యెవ్వారినామంబు లింపొనర్చుఁ

తే. బద్మజేంద్రాదిదేవతాప్రభువు లేమ, మహామహునమేయమాయాబ్ధిలో మునింగి
దరియుఁ దాపును గానక తల్లడింతు, రిట్టిహరి నీవె కావె పట్టాభిరామ. 69

సీ. పదపంకజరజఃప్రభావంబుచే రాతి నతివఁగా నొనరించినందువలన
సాక్షాన్నిటాలకటాక్షుండు దాల్చువి ల్లవలీల విఱిచినయందువలన
ధనువు గైకొను నెపంబున జామదగ్న్యబాహాశక్తి హరియించినందువలన
దినజుతోఁ బ్రతిన చేసినలీల నొకకోల నమరేంద్రసుతుఁ గూల్చినందువలన

తే. నబ్ధి శాఖాగ్రమున నిల్పినందువలన, నని నజయ్యాసురులఁ ద్రుంచినందువలన
నాదినారాయణస్వామి వగుట దెలిసె, సరయు నడుఁడవె నీవు పట్టాభిరామ. 70

మ. పదిమోముల్ గలదండిరక్కసు ననిన్ భంజింప నీలాగు నీ
వుదయం బొందిన నీపనుల్ నడుప నుద్యోగించి రుద్రాబ్జగ
ర్భదినేంద్రాబ్జముఖామరుల్ పవనభూభల్లూకరాడ్వానుజాం
గదముఖ్యాగచరత్వముల్ గనిరి గా కాకుత్స్థవంశాగ్రణీ. 71

శ్రీరామాగస్త్యులు హనుమంతుం బ్రశంసించుట

ఉ. అందఱు నంద ఱౌనె కద యందఱిలోఁ బవనాత్మజుండు నీ
యందుఁ బ్రపత్తి గల్గినమహాత్ముఁ డుదాత్తగుణోత్తరుండు సం
క్రందనజిద్దశాస్యముఖరాక్షసముఖ్యుల నొక్కరుండె పో
రం దెగఁ జూడ నోపుబలరాశి నుతింపఁ దరంబె యీతనిన్. 72

మ. అకలంకాత్ముఁ డపాయశూన్యుఁ డఖిలోపాయాధికుం డం చెఱిం
గి కదా యెవ్వరి లెక్క సేయక లతాంగిన్ జూచి రమ్మంచు ము
ద్రిక యీమారుతిచేతి కిచ్చితివి భూరిస్తోత్ర పాత్రంబుగా
సకలజ్ఞుండవు రామ నీ వెఱుఁగవే సామీరిమాహాత్మ్యముల్. 73

సీ. కదలఁ డీతఁడు వజ్రకఠినవిగ్రహుఁ డంచుఁ బోలఁగా మైనాకశైల మెఱుఁగు
నెఱవఁ డీతఁడు మహావీరశేఖరుఁ డంచు శోధింప వచ్చినసురస యెఱుఁగుఁ
గలఁగఁ డీతఁడు భూరిగాంభీర్యనిధి యని వడిఁ ద్రోయ యిచ్చిన వనధి యెఱుఁగు
బలిమి నీతఁడు మహాబలునంతవాఁ డని కెరలి మార్కొనిన లంకిణి యెఱుంగు

తే. జీవదాయకుఁ డితఁ డని సీత యెఱుఁగు, రాక్షసాంతకుఁడితఁడనియక్షు డెఱుఁగు
నధికుఁడితఁడని రావణియస్త్ర మెఱుఁగు, సిద్ధ మిది యని రామ నీచిత్త మెఱుఁగు.

సీ. అవనిజాహృదయశోకాంధకారము మాన్పఁ గపిరూపుఁ గనినభాస్కరుఁ డితండు
దశకంధరోద్యానతరువులు గూల్ప మైఁ దాల్చురఘుంఝామారుతం బితండు
సైన్యేశపంచకసప్తమంత్రిజగిరుల్ వ్రాల్పఁ బ్రాణము లొందువజ్ర మితఁడు
పరపలాశికులంబు భస్మంబు గావింప వాల మూనినదవజ్వాలి యితఁడు

తే. రావణునిధైర్యలతఁ ద్రుంప అంప మితఁడు
దైత్యుల కకాలమునఁ దోఁచుమృత్యు వితఁడు
సకలకపిలోచనచకోరచంద్రుఁ డితఁడు
ఖరకరాన్వయ మీ కేడుగడయు నితఁడు. 75

ఉ. రావణపుత్త్రుకంటె నలరావణుకంటెను వాలికంటె ని
ప్పావని గాఁవువిక్రమవిభాసితుఁ డించుక యట్లెనేని లో
కావళి హావళిం గను మహర్షులశాపముచే స్వకీయ మా
లా వెఱుఁగండు మత్తకరిలాగున నుండు నితండు రాఘవా. 76

తే. అని ప్రసంగవశంబున ననిలసుతుని, బ్రస్తుతించినకుంభసంభవునిమాట
లమృతధారలవలె వీనులార నలరి, యెలమితో జానకీజాని యిట్టు లనియె. 77

మ. కలశీసంభవ నీవు వల్కినది నిక్కం బంజనాపుత్త్రుఁ డ
బలు తెప్పం గొని కాదె దాఁటితి విపత్పాథోధి యీభానుజా
దుల నట్లొ నొనర్చి సీతనిమ్మదూక్తుల్ గావె యిమ్మేటి కే
వలభక్తిన్ ననుఁగూర్చి చేసినపనుల్ వర్ణింపఁగా శక్యమే. 78

సీ. తనవాగమృతధార ధరణిజప్రాణముల్ నిలిపి నామదిలోనినెగులు దీర్చె
శరణుసొచ్చినవిభీషణుఁ గూర్చుకొమ్మని తెలిపి మాకుఁ బ్రతిష్ఠ గలుగఁ జేసె
బవరంబులోఁ జేర్చి పంక్తికంఠునియురస్స్థలి ముష్టిహతి నొంచి సగము సంపెఁ
బరులచే హతులైన ప్లవగోత్తములకు జీవము లిచ్చి మాప్రాభవంబు నిలిపెఁ

తే. బడినలక్ష్మణు బ్రదికించి భానుకులము, నిలిపె నంతటఁ జననీక నిర్వహించె
వేయు నిఁక నేల నాకొఱకై యనేక, దనుజవీరులఁ ద్రుంచె నీయనిలసుతుఁడు.

ఉ. తమ్ముల బంధులన్ గలిసి తల్లులనన్ గని నేను సీతతోఁ
గ్రమ్మఱ నీయయోధ్య కధికారము గాంచి సుఖించుటెల్ల స
త్యమ్ము సమీరసూనునిసహాయతఁ గాదె మునీంద్ర యెన్నిజ
న్మమ్ములకైన నీతనిఋణం బెదఁ బాపుకొనంగ నేర్తునే. 80

చ. అది యటులుండె నీయన మహామహుఁ డర్కజుచెంత నుండి బ
ల్లిదుఁ డగు వాలి నేల విదళింప కుపేక్ష యొనర్చె నాత్మశ
క్తి దెలియ కుండుఁ గాక యని కిన్క వహించి మహర్షు లేటికీ
సదమలమానసాబ్జునకు శాప మొసంగి రెఱుంగఁ దెల్పవే. 81

మ. జననం బాదిగ నీమహాత్మునిభుజాశౌర్యప్రభావోన్నతుల్
వినఁ గాంక్షించెదఁ దెల్పుఁ డంచు హనుమద్వీరావతంసంబుమాఁ
పున నాత్మీయకరంబు సాఁచి జగతీపుత్త్రీమనోభర్త వేఁ
డినఁ బల్కెన్ ముని నానటద్భవజటాటీకాభ్రిగంగార్భటిన్. 82

## హనుమంతుని జననము

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్ర రఘూద్వహ యీసమీరపు
త్త్రుండు మహాత్ముఁ డౌనె కద తొల్లిటిపుట్టుక నేకపాదరు
ద్రుం డితఁ డంచుఁ గొందఱు బుధుల్ గణియింపుదు రారహస్య మే
వ్వాం డెఱుఁగున్ జరాచరభవంబు లెఱింగిన నీవు దక్కఁగన్. 83

శా. సాక్షాచ్ఛంభుఁడు గాక యున్నఁ గలవే చర్చింప నీశౌర్యధై
ర్యక్షాంతిప్రతిభాప్రభావములు రుద్రాంశంబునన్ బార్వతీ
కుక్షిన్ వృద్ధి వహించి పావకునిచేఁ గొన్నాళ్లు వర్తించి యీ
యక్షయ్యద్యుతి పిమ్మటన్ బవనగర్భాంతస్థుఁడై భాసిలెన్. 84

చ. అనిలువరంబుచేఁ బిదప నంజనకున్ జనియించి జన్మ మె
త్తినపుడె భానునిన్ బొదివె దేవత లిచ్చువరంబు లొంది యం
దున శిశు వౌట గర్వవలెఁ దోఁచిన మానులు శాప మిచ్చి రీ
తని కొకరుండు పేర్కొనినదాఁక స్వశక్తి యెఱుంగకుండఁగన్. 85

తే. దానఁ దన లావెఱుంగఁడు గాన నితఁడు
వాలి వధియింపఁ డది గాక వాలిభాను
సుతులఁ గొన్నాళ్లు సరి గాఁగఁ జూచి కొలిచి
యుండెఁ గావునఁ బగఁ బూన నొల్లఁ డయ్యె. 86

క. లేకున్న హనుమ కెదురే, పాకారికుమారుఁ డితఁడు ప్రభవించుట సీ
తాకాంత లెస్స దెలిపెద, నాకర్ణింపు మని మఱియు నమ్ముని యనియెన్. 87

సీ. తనధైర్యరమ కోడి కనకాచలేంద్రంబు సిగ్గుతోఁ దనభర్తఁ జేరికొనఁగఁ
దననామమున కుచితంబుగాఁ దనుఁ దాఁకి శంబసాదనసామజంబు గూలఁ
దనతపోనియమంబు గను భరద్వాజాదివాచంయములకు సేవలు జనింపఁ
దనబాహుశాఖలు దైతేయభీతామరులకును నిలువ నీడలు ఘటింపఁ

తే. దనరుఁ గేసరి యనుపేర వనచరేంద్రుఁ, డతని కంజన యనెడికన్యక నొసంగె
నతనిమాతులుఁ దురువిక్రమాతులుండు, కుంజరుండను వానరకుంజరుండు. 88

క. రంజిల్లఁ జేసెఁ గేసరి, యంజన నిది వింత యనుచు నంద ఱనఁగ న
త్కుంజరసుతతో నక్కపి, కుంజరుఁ డొకకొన్ని యేండ్లు కూడి సుఖించెన్. 89

శా. సంసారోత్సవకారణం బగుతనూజాతోదయం బెంచి యా
హంసీగామినితో బహువ్రతపరుండై దాన నవ్వానరో
త్తంసుం డిష్టముఁ జెంద నేరక మరుద్దైవంబుచే దైన్యవి
ధ్వంసం బౌ నతనిన్ భజింపు మని కాంతారత్నమున్ బంచినన్. 90

క. పతియనుమతి గౌరీసతి, ప్రతి యగునయ్యువతి నియమభవ్యమతి సదా
గతియ సదా గతి యని యుగ్రతపం బొనరించెఁ బెక్కుకాలం బధిపా. 91

ఉ. ఆయమ సేయుఘోరతప మంతట మెచ్చి సదాశివాజ్ఞ న
వ్వాయువు స్వోదరస్థితశివస్థిర తేజముఁ దెచ్చి యిచ్చినన్
దోయజగంధి గర్భ మయి తోరపువేడుక నొక్కవర్ష మి
య్యాయత తేజుఁ దాల్చె మఱి యంచిత మానొకవాసరంబునన్. 92

మ. అమరుల్ దివ్యసుమావళుల్ గురియ రంభాద్యప్సరఃకాంత లా
డ మరుద్వైరుల గుండియల్ బెదర మింటన్ భేరికాగోముఖ
ప్రముఖధ్వానము లుప్పతిల్ల దిశ లొప్పన్ గుంజరీగర్భ వా
సమునం దుండియు నిర్గమించె నితఁ డంచద్బాలభానుప్రభన్. 93

వ. అప్పుడు. 94

సీ. లలితసౌదామనీతులితదేహమువాని నరుణారుణాంబుజాస్యంబువాని
రత్నకుండలభాసురకపోలములవాని పింగత్పిశంగనేత్రములవాని
నాజానుదీర్ఘబాహాదండములవాని ధవళయజ్ఞోపవీతములవాని
హారప్రభామనోహారివక్షమువానిఁ గమనీయకరకంకణములవాని

తే. మంజురుచిపుంజిఁ గనుహొన్నుముంజివాని, బసిమి గనుపట్టు నునుఁబట్టుపంచెవాని
వాసవధ్వజనిభ వాలవల్లివాని, నక్కుమారునిఁ గని తల్లి యాత్మ నలరె. 95

ఆ. అలరి చెక్కు నొక్కి యక్కునఁ జేర్చి ము,ద్దాడి నీకు ఫలము లారగింప
వలసినన్ని దెత్తు వాపోవకుండు నా, యన్న యనుచుఁ దల్లి యడవి కరిగె. 96

హనుమంతుఁడు ఫలభ్రాంతిచే రవిరాహుల మ్రింగ నుద్యోగించుట

ఉ. అంతటిలోన నీతఁ డుదయాద్రిపయిన్ బొడతెంచుపద్మినీ
కాంతు జపాప్రసూనరుచికాంతుఁ గనుంగొని పం డటంచు వి
భ్రాంతి వహించి యాఁకటితొరన్ రవిపై కెగసెన్ సమీరనా
గాంతకబాణవేగపరిహాసిసమిద్ధమహాజవోన్నతిన్. 97

తే. ఎగసి చనుచున్న యీతని తెగువఁ జూచి, గగనచరులైన గంధర్వగరుడయక్ష
సిద్ధసాధ్యులు నివ్వెఱఁ జెంది యిమ్మ,హామహుం డెవ్వఁడో యనునంతలోన. 98

తే. భానుకడ కేఁగునప్పిన్నవానిమేని, కెండ దాఁకక యుండ నుద్దండవృత్తి
నుడిగి మిన్నేటితమ్మిపుప్పొడిదుమార, మెనసి వలిగాడ్పు వెనువెంటఁ జనుచునుండె.

సీ. పదతాడనములచే బ్రద్దలై పాథోధిపాలికల్ తూలికాభంగిఁ జెదర
నూరుఘట్టనలచేఁ నూర్ధ్వగంధర్వాదినగరముల్ ఛిన్నభిన్నములు గాఁగ
బాహువేగంబుచేఁ బఱతెంచు వైమానికుల విమానంబులు కూలఁ బడఁగ
వాలవిక్షేపంబుచే లాజలను బోలి తూలి నక్షత్రముల్ నేల రాల

తే. దేహకాంతులు చక్కఁగాఁ దేఱి చూడ, లేక ఖచరులు బెగడి చీకాకుఁ జెంద
వేదియును జూడ కీజగద్ధితచరిత్రుఁ, డిట్టె చని బాలభానునిఁ బట్టె నపుడు. 100

సీ. ఒద్ద సేవలు సేయుచున్న ఛాయాదేవి భీతిల్లి కరములఁ బిసికికొనఁగ
భయనివారణమంత్రపరతంత్రులై వాలఖిల్యాదిమౌనులు క్రేవ నొదుఁగ
జడుపుతోఁ గైదువుల్ విడిచి మాఠరముఖ్యపారిపార్శ్వకు లెల్లఁ బాఱిపోవ
హతశేషమందేహు లట్లు గావలయుఁ బో యీభానున కటంచు నిచ్చ నలర

తే. నలఘునాపద్మహితుఁ బట్టి యాననమునఁ
బెట్టుకొను బెట్టు వేఁడి గా నట్టె విడుచు
నడచుఁ జేతులు సెగ దైనయది యటంచుఁ
గినిసి యాఁకటి కడిమి నయ్యనిలసుతుఁడు. 101

చ. జగదుపకారి యీప్లవగచంద్రుఁ డటంచుఁ దలంచి భానుఁడున్
దగదగ మండుచుండుకిరణంబులవేఁడిమిఁ జూపఁ డయ్యె రెం
డుగడియ లేఁగ నంతఁ దపనున్ గ్రహియింపఁగ నాఁడు పర్వ మౌ
టఁ గదియ వచ్చె రాహు వచటన్ గలవా రరు దంది చూడఁగన్. 102

ఉ. ఆగ్రహరాజుఁ బట్టిన మహామహు సైంహికిఁ జూచి రాహు వ
త్యాగ్రహవృత్తితోఁ గహకహార్భటిఁ జేయుచు డాయ నంత సూ
ర్యగ్రహణంబు మాని యవురా యిది పిల్లనిపండు వచ్చె నం
చుగ్రలయోగ్రవిగ్రహత నొక్కట నాఁకని మ్రింగఁ బోవఁగన్. 103

చ, జడిసి విధుంతుదుం డితనిఁ జక్కఁ గనుంగొన లేక యయ్యెడన్
వడిఁ బరువెత్తి యుత్తెఱఁగు వాసవుతో నెఱిఁగింప నాతఁడున్
గడు నెఱఁ గంది సిక్రమము గైకొను నంతటివీరుఁ డెవ్వఁ డం
చనుగుచు నాల్గుకొమ్ములమహాకరి నెక్కి శతారహస్తుఁడై. 104

చ. నలుగడలన్ వియచ్చరగణంబులుఁ గొల్వఁగ నేఁగుదెంచి య
జ్జలరుహబంధుచెంతఁ బ్రతిచండకరుం డన దుర్నిరీక్షకాం
తులఁ దులకించుసింహునిఁ గనుంగొని యెవ్వఁడొ వీఁ డటంచుఁ బే
రలుక వహించి మత్తకరి నట్టె పయిన్ గవియించి యార్చుడున్. 105

క. పాండురుచి మించినది యీ, పండు హరింతు నని తీవ్రపడి కడుఁ బసిపా
పం డగుటఁ దెలియ కీతఁడు, చండాంశుని విడిచి యలగజముపై కుఱికెన్. 106

వ. ఇవ్విధంబున, 107

తే. కేసరికిశోర ముద్భటక్రీడ మీఁది, కుఱికినంత భయభ్రాంతు లొంది చండ
పవనహతిఁ దూలుశారదాభ్రంబులీల, నభ్రమువిభుండు దెరల జంభారి గెరలి.

ఉ. భద్రగజంబుపై నుఱుకుపావని నొండొకటన్ జయింప లే
కద్రులవ్రక్కలించు కులిశాయుధ ముద్ధతిఁ బూని వైవ న
య్యద్రిచరుండు వామహనువందున నొచ్చిన మూర్ఛఁ జెంది పూ
ర్వాద్రిపయిన్ బడెన్ గహకహార్భటిఁ జేయుచు రాహు వుబ్బఁగన్. 109

హనుమంతుం డింద్రుని వజ్రహతిచే మూర్ఛిల్లఁగా
వాయుదేవుం డాత్మమూర్తి నుపసంహరించుట

చ. పడినకుమారునిన్ గని ప్రభంజనుఁ డార్తిఁ దపించి యింద్రుపైఁ
నడరెడుకిన్కతో జగము లన్నియు నిండిన యాత్మమూర్తి న

య్యెడ నుపసంహరించి ప్రజలెల్లను జేష్టలు దక్కి మిక్కిలిన్
జడిమ వహింపఁ బుత్త్రుఁ గొని శైలగుహాకుహరంబు సొచ్చినన్. 110

సీ. యాజకుల్ వహ్నిహవ్యములువ్రేల్వఁగఁజాఁచుహస్తముల్ సాఁచినయట్టులనుండె
దివిజులు ప్రేరేప దివి కెగిరినదేవ యానంబు లెగిరిన యట్టుల నుండె
మునులు నదీతోయములఁ దోఁగ ముంచినయంగముల్ ముంచినయట్టుల నుండెఁ
బశుమృగనరముఖప్రాణు లుచ్ఛ్వాసిఁ బెట్టునడుగులు పెట్టినయట్టుల నుండె

తే. భానుమండల మొక్కచోఁ బాదుకొనియెఁ, గాలగతిదప్పెసత్క్రియల్ గడచెవేద
పాఠ ముడివోయె బాహ్యమభ్యంతరంబు, గాడ్పుబంధించి చనిన యక్కాలమునను, [నను,

ఉ. ఆవిపరీతముల్ గని భయంపడి కొందఱు తాపసోత్తముల్
దేవవరేణ్యుఁ డాదియగు దేవతలున్ బరమేష్ఠిచెంతకున్
బోవఁ దలంచి యుబ్బుకడుపుల్ నడువన్ వడి లేనిపాదముల్
లావఱి యున్న మేనులు గలంగిన చిత్తములున్ గనంబడన్. 112

తే. ఒకవిధంబునఁ జతురాస్యునొద్ద కేఁగి
కడుఁ బ్రయత్నంబుతో మ్రొక్కులిడి ప్రయాస
మునఁ గరంబులు ముకుళించుకొని మొగంబు
లెత్తి డగ దొట్టికొన వార లిట్టు లనిరి. 113

శా. వాణీనాథ జరాయుజప్రముఖజీవశ్రేణులన్ దొల్లి ని
ర్మాణం బీ వొనరించి వానికి జగత్ప్రాణున్ గదా సర్వథా
ప్రాణప్రాయునిఁగా సృజించి తతఁ డీపట్లన్ విరోధించి త
త్ప్రాణిక్షోభ మొనర్చె నేమిటికొ యీబన్నంబు వారింపవే. 114

మ. వనజాతాసన దేహనామసదనద్వారావరోధంబు సే
య నితాంతవ్యథ మాయసుప్రతతి శుద్ధాంతాంగనాశ్రేణితో
నెన యై వేదన జెందె నీయడరు నీవెఱ్ఱైన వారించి య
య్యనిలున్ స్వస్థునిఁ జేసి ప్రోవఁ గదవయ్యా లోకముల్ నావుడున్. 115

చ. వనరుహసంభవుం డనియె వారలతో వినుఁ డంజనాఖ్య యా
వనితకు వాయుతేజమున వానరవీరుఁ డొకండు పుట్టి చ
య్యన నినమండలంబుఁ గని యాఁకటిపెల్లునఁ బక్వ మాఫలం
బని కబళింపఁగా నపుడె యాడకు రాహువు వచ్చి యుగ్రతన్. 116

సీ. తనపాలిదాయయై తపనుని గ్రహియింపనాంజనేయునిఁ జూచి యాగ్రహించి
తొలఁగింపఁ బోయి తా వెఱచి శీఘ్రంబునఁ బఱతెంచి యాదివస్పతినిఁ గాంచి
భానునిఁ బొదువ స్వర్భాను వేఱొక్కని నియమింపఁ దగవగునే యటంచు
దూఱిన నీమీఁద నారాహు విదియేమి యద్భుతంబని యింద్రుఁ డలుకవొడమి

తే. యపుడె రాహువుతో వచ్చి యర్కుచెంత
నున్నకపిబాలుఁ గని నిజాయుధము వైవ
హనువు భగ్నంబుగా నతఁ డవశుఁ డైనఁ
బట్టి గని గాడ్పు శోకంబుఁ బట్టలేక. 117

తే. ఈబలారాతి చేసినయెగ్గు దలఁచి, యలిగి యాతఁడు పాలించునఖిలజనులఁ
దనసుతునిలీలఁ జేష్టలు దక్కఁ జేసె, నింక నగ్గాడ్పుఁ బ్రార్థింప నేఁగవలయు.

తే. వాయు వధికుండు సకలదేవతలలోన, వాయువాధార మఖిలజీవంబులకును
వాయువె బలంబు ప్రాణాదివాయులీల, వాయువె చరించుచుండు నిక్కాయములను.

క. ఆయన లేకున్న శవప్రాయం బై యుండు జగము పఱతెం డిఁక న
వ్వాయువుఁ బ్రార్థింపుద మని, తోయజసంభవుఁడు వారితోఁ జనుదెంచెన్. 120

క. చనుదెంచి మారుతాశ్రిత, ఘనశైలగుహాంతరంబుకడ నిల్చిన న
వ్వనజభవురాకఁ గనుఁగొని, యనిలుఁడు గొడుకుఁ గొనివచ్చి యజునకు మ్రొక్కెన్.

తే. మ్రొక్కినసమీరుఁ గని యేల యిక్కడుండి, పని యొనర్చితి వత్స సిపట్టి యేఁడి
వీఁడెకద యని పవిధార వివశుఁ డైన, యక్కుమారునిఁ గనుఁగొని యాదరమున.

తే. పలుకులవెలందితళుకుఁజెక్కుల విచిత్రపత్త్రముల వ్రాయ నేర్చినపాణి ననిల
సుతుని నెమ్మేను నిమిరిన శోష దీఱె, వాఁడు లేఁబైరు వానచేవలెఁ జెలంగె.

తే. మూర్ఛ దెలిసినయంజనముద్దుపట్టి, నంకమునఁ బెట్టి యజుఁడు ముద్దాడుచుండఁ
గాంచి హర్షించి తనవక్రగతి యడంచి, గాడ్పు జగముల కుత్సాహకారి యయ్యె.

చ. అనిలున కింపొనర్చి మది నంబుజసంభవుఁ డెల్ల వేల్పులన్
గని సురలార యీకపిశిఖామణి లోకహితార్థి మీఁదటన్
మనకుఁ బ్రియం బొనర్చు మదమత్తనిశాటుల నుక్కడంచుఁ గా
వున నితఁ డుగ్రశౌర్యవిభవుండుగ మీరు వరంబు లీఁ దగున్. 125

## బ్రహ్మేంద్రాదులు హనుమంతునికి వరంబు లొసంగి పవనుని సంతుష్టుఁ జేయుట

తే. అనిన సుర లెల్ల మే లని రపుడు వజ్రి
తనశతారంబు దాఁకియు హనువు వెలయు
కతన హనుమంతుఁ డనుపేరుఁ గాంచు నతఁడు
వజ్రహతి నొవ్వఁ డిక నని వర మొసంగె. 124

సీ. బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రమున హాని నందనిదీర్ఘాయు వజుఁ డొసంగె
శూలరౌద్రాస్త్రపాశుపతాదికములచేఁ జెడనిప్రభావంబు శివుఁ డొసంగెఁ
దనకాలపాశంబు దండంబు మృత్యు వీయన నొంచ లేవని యముఁడు వలికె
నాత్మతేజమున శతాంశ మిచ్చితి విద్య లిచ్చెద నిఁక నని యినుఁడు వలికెఁ

తే. పాశమున నీటఁ బడఁడని పలికె వరుణుఁ, డగ్ని దనచేత నశియింపఁడనియె ధనదుఁ
డొసఁగెఁ దనగద నొగలనియునికి యెల్ల, కైదువుల నొవ్వఁ డని విశ్వకర్మ వలికె.

క. తక్కిన దేవత లొక్కొక, రొక్కొక్క వరమ్ము నొసఁగి రుత్సాహముతో
నక్కమలగర్భుఁ డనిలుని, దిక్కు గని గణించె నెల్లదివిజులు వినఁగన్. 128

పంచచామరము. సమీర నీకుమారుఁ డుగ్రశౌర్యధైర్యధుర్యుఁ డ
ప్రమేయశక్తి రామకార్యభార మూని రావణా
ద్యమిత్రభీకరప్రతాపుఁ డై చరించు లే దసా
ధ్య మీజగంబులందు వీని కంచుఁ బల్కి పోయినన్. 129

క. సంతసమున నంత నభస్వంతుం డక్కొడుకుఁ గొంచు వచ్చి ప్రచింతా
క్రాంత యయి వగచు కేసరి, కాంత కొసఁగి యతనిమహిమ గణియించి చనెన్.

తే. రామ యీపిమ్మటను గాదె యీమహాత్ముఁ, డింటి శాశ్రమములు సొచ్చి యచటిమునుల
వల్కలాజినములు వ్రచ్చి వారిమాన,సములు గలఁచినఁ గోపించి శాప మిడుట.

క. శాప మొసంగినఁ బశ్చా,త్తాపము ప్రాపించి దోఃప్రతాప ముడిగి య
త్తాపసులకు సేవకుఁ డై, యీపవనజుఁ డుండి పిదప నినజునిఁ జేరెన్. 132

ఉ. కోనను నున్న మత్తహరిపోలిక బ్రాహ్మణశాపయుక్తి నెం
తేనియు శాంతిఁ జెందె నితఁ డీతనిబాహుబలం బెఱింగి స
న్మానము చేయు భానుజుఁడు మంత్రులలోపల నెల్ల వాయువై
శ్వానరులట్లు వీరు రఘువల్లభ పాయక యుందు రెప్పుడున్. 133

చ. విను మిఁక నొక్కవింత రఘువీర ననుంగు వరంబు లిచ్చువే
ళ ననినమాట నెమ్మదిఁ దలంచి శ్రుతుల్ పఠియింప నెంచి యీ
యన యొకనాఁడు భానుకడ కద్భుతవేగముతోడఁ బోయి మ్రొ
క్కినఁ గరుణార్ద్రదృష్టిఁ దిలకించి పయోరుహబాంధుఁ డిట్లనున్. 134

మ. చదువుల్ నేర్చుకొనంగ వచ్చితివొ వత్సా తోడ్త నెట్లభ్యసిం
చెదు నాముందట నిల్వఁగూడదు గదా శీఘ్రంబునన్ బోయినన్
మదియేకాగ్రతఁ జెందునే నుడువు మన్నన్ నవ్వి యవ్వీరుఁ డ
య్యుదయాస్త్రాద్రులఁ నిల్పెఁ బాదయుగళం బుత్సేధదేహోగ్రుఁ డై. 135

క. మును హరి త్రివిక్రమాకృతిఁ, గనిపించినయటుల నూర్ధ్వకర్పర మెల్లన్
దనమయముగ నిండిన నీ, హనుమత్కపిఁ జూచి వెఱచె నఖిలజగంబుల్. 136

హనుమంతుఁడు సూర్యునొద్ద వేదశాస్త్రాదులు చదువుట

శా. భానుం డద్భుత మందె నంత నిజరూపం బూని యీవానరుం
డానీరేరుహబంధు తేరి కెదురై యాకాశమార్గంబునన్
దా నెంతే వడిఁ బోవుచున్ శ్రుతులు శాస్త్రంబుల్ పఠించెన్ బరి
జ్ఞానగ్రాహకలావిశేషములకున్ జండాంశుఁ డుప్పొంగఁగన్. 137

తే. కుడిచి చల్లనినీడలఁ గూరుచుండి, గురువు సెప్పినఁ జదువ రీధర వడుగులు
నిరశనుండయి పఱచుచు నింగిఁగఱకు, టెండకు సహించి చదివె నీతండు ఘనుఁడు.

క. ఈశానామృగశేఖర. తోశతధృతికవిబృహస్పతులు మృదుభాషా
కౌశలి శ్రుతిముఖవిద్యా, వైశారద్యమున సాటి వత్తురె తలఁపన్. 139

సీ. వైరాగ్యమహిమ కీవడుగు నివాసంబు వినయంబునకు సీతఁ డునికిపట్టు
శమదమోన్నతుల కీచతురుఁ డాధారంబు దాక్షిణ్యమునకు నీతండు చోటు
సౌశీల్యమున కీప్రశాంతశాలి బిడారు పరహితక్రియ కీప్రసన్నుఁ డిక్క
విక్రమస్ఫురణ కీవీరవర్యుఁడు తావు గాంభీర్యగరిమ కీఘనుఁడు ప్రాపు
తే. బ్రహ్మవిద్యకు నిమ్మెట్టి పట్టుఁగొమ్మ, ఘనతపోధనమునకు నీయన నిధాన
మతులధైర్యంబునకు నీమహాత్ముఁ డిమ్ము, రామ నీభక్తి కీపుణ్యరాశి నెలవు. 140

సీ. గుటిమిటి రోదసీకుహర మొక్కట ముంప నుప్పొంగు ప్రళయపయోధికంటె
జగము లన్నియు నొక్కసారి భస్మము సేయ నడరెడుకల్పక్షయాగ్నికంటె
బహుపర్వతారణ్యపటలిఁ జూర్ణము సేయఁ గడఁగు సంవర్తాశుగంబుకంటె
బ్రహ్మాండభాండంబుఁ బట్టి బ్రద్దలు సేయఁ దివిరెడు విలయభైరవునికంటె
తే. నధికగాంభీర్య మతులితం బగు ప్రతాప, మనవధికవేగ మద్భుతం బైనరౌద్ర
మియ్యనిలపుత్త్రునకె కల దితనిమ్రోల, వాలి గీలియు నిలుతురే వసుమతీశ. 141

క. ఇనసుతు కడ నితఁ డున్నాఁ, డని యెఱిఁగియె వాలి గొంతయులుకుచునుండున్
దన కేమి యితఁడు గలఁ డని, యినసుతుఁడును వెఱవకుండు నింద్రసుతునకున్.

తే. అని యగస్త్యమహాముని హనుమమహిమ, లద్భుతంబుగఁ దెల్పిన నాలకించి
సభ్యుఁ లనిలజుఁ బదివేలచందములను, బ్రస్తుతింపఁగ శ్రీరామభద్రుఁ డలరి. 143

ఉ. ఆవిపులప్రభావనిధి కంజలి సేసి మునీంద్ర వింటి నీ
చే వివిధేతిహాసములు శ్రీహనుమత్కథ లాలకించితిన్
దైవతనాథుఁడున్ రవియుఁ దండ్రి యనన్ వినినాఁడ వాలి సు
గ్రీవులజన్మ మెట్టు లెఱిఁగింపఁ గదే యన మౌని యి ట్లనున్. 144

## వాలిసుగ్రీవుల జననము

తే. రామభూపాల తొల్లి నారదమహర్షి, యేఁ దపం బున్నవనమున కేఁగుదేర
వాలిసుగ్రీవు లేయింతివలనఁ బుట్టి, రన నతఁడు దెల్పె నవ్విధం బవధరింపు. 145

చ. అమరనివాసమై మణిమయాంచితసానువు లొంది యెల్లలో
కముల ధరించి పర్వతశిఖామణి నాఁ దగు కాంచనాద్రిమ
ధ్యమశిఖరంబునందు నియమాన్వితుఁడై యొకనాఁడు భారతీ
కమలముఖీమనోహరుఁడు గాఢసమాధి వహించి యున్నెడన్. 146

ఉ. తారకయోగనిశ్చలతఁ దాల్చినయప్పరమేష్ఠికన్నులన్
జారె మరందబిందువులు సారసపత్త్రవినిర్గతంబు లా
దారి ముదశ్రుబిందువు లతం డవి హస్తములన్ ధరించినన్
శూరవరుండు ఋక్షవిరజుం డను నందనుఁ డయ్యె నందునన్. 147

క. ఆనందను సజ్జననిచయా, నందనుఁ జూచి బ్రహ్మ హైరణ్యాధరో
ద్యానమ్ముల గలఫలముల, దేనెలఁ దను వోమికొనుచుఁ దిఱుగు మటన్నన్. 148

ఉ. ఆవిధియాజ్ఞ మస్తకమునందు ధరించి యతండు కాంచన
గ్రావవనాంతరంబుల నిరంతరమున్ జరియించుచున్ బ్రసూ
నావళిఁ దెచ్చి తెచ్చి సుర నర్చన సేయుచు నంప గ్రమ్మఱన్
బోవుచుఁ గందమూలఫలముల్ భుజియింపుచు క్షుత్తుమాన్పుచున్. 149

మ. ఒకనాఁ డుత్తరశృంగమున్ గడిసి యయ్యోర్యన్ శతానందపు
త్త్రకుఁడీక్షించెఁ బ్రఫుల్లహల్లకసముద్యద్దీపికన్ షట్పద
ప్రకరప్రాంచితధూపధూమములు మీఱన్ రాజహంసచ్ఛటల్
వికచాంభోరుహసౌధవీథిఁ దగ కేళిన్ జెందు కాసారమున్. 150

క. వీక్షించి యక్షు లలరఁగ, నాక్షణమున ఋషివిరజుఁ డట డిగ్గి తను
ప్రక్షాళన విధిఁ దీరిచి, సాక్షాదమృతంబు బోలుజలములు గ్రోలెన్. 151

తే. క్రోలి తననీడ తేట యాకొలని నీటఁ, గనఁబడినఁ జూచి యమ్మహావనచరుండు
సహజజడబుద్ధిఁ బ్రతివనచరుఁడు వీని, బట్టెద నటంచు సరసిలోపలికి నుఱికె.

తే. ఉఱికి యం దెవ్వరినిఁ గాన కురక నీటఁ, బడితి నని వజ్రఘటితసోపానపంక్తి
జేరినంత సరోవరశ్రీస్వరూప, మిచ్చె నన నొక్క చక్కనియింతి యయ్యె.

సీ. తనశోణకమలాంఘ్రితలరుచుల్ మగఱాల తెలిమెట్లఁ గెంపుమెట్టుల నొనర్పఁ
దనసోయగపువాలునునుబెళ్కుఁ జూపులు కొలనెల్ల గలువలై వెలయఁజేయఁ
దనకుందనపు మేనితళుకులు తటధరారుహఘనావళి గ్రమ్మెఱుంగు నింపఁ
దనగబ్బివలిగుబ్బచనుదోయి చక్రదంపతుల సజాతివిభ్రాంతి ముంపఁ

తే. దనపెదవి సాంధ్యరాగంబు దళముకొలుపఁ
దనకచభరంబు తిమిరసంతతి సృజింపఁ
దననగవు వెన్నెల ఘటింపఁ దరుచరమణి
రమణియై యందు విహరించుసమయమునను. 154

చ. కమలజుఁ గొల్చి యత్తెఱవుగా జనుచున్న సురాధినాథుఁడున్
గమలహితుండు నచ్చెలువఁ గన్గొని దర్పకుఁ డేయుపద్మకో
శముల దలంకి దానిబిగిచన్నులు దానివెడందకన్నులున్
దమి వెలయింప నిర్వురను దత్తఱ మందుచుఁ బోక నిల్చినన్. 155

చ. మఱు లధికంబు గాఁగ శతమన్యుని తేజము నిర్గమించి య
త్తరుణిశిరంబుపై నొలికెఁ దత్సమయంబునఁ బద్మినీమనో
హరునకు నింద్రియస్ఖలనమై యది చయ్యనఁ బోయి తద్గళాం
తరమున వ్రాలె నందువలనన్ దమకంబులు దీఱె వారికిన్. 156

ఆ. శిరముమీఁద బడిన జిష్ణుతేజము జాఱి, వాలమున్నచోట వచ్చి నిలిచె<br>
నట్టిచోటఁ బుట్టినట్టి వాసవపుట్టి, వాలి నాఁ జెలంగె వసుమతీశ. 157

క. ఉగ్రకరుతేజ మక్కం, బుగ్రీవగళాంతరమున ము న్నొలికెఁ గదా<br>
యాగ్రీవ నుద్భవించుట, సుగ్రీవుఁ డనంగ సూర్యసుతుఁడు సెలంగెన్. 158

చ. తనమెడ హేమమాలిక ముదంబున వాలి కొసంగి పాకశా<br>
సనుఁ డరిగెన్ దివంబునకు సప్తహయుండును గూర్మి పుత్రునిన్<br>
గని హనుమత్సఖిత్వ మధికద్యుతియున్ గని వృద్ధిఁ బొందు మం<br>
చని చరమాబ్ధిఁ గ్రుంకెఁ జనె నాత్మజుఁ డుద్భవ మాటనో యనన్. 159

ఉ. ఆదిన శేష మెల్లఁ దనయద్వయితో నచటన్ వసించి సూ<br>
ర్యోదయ మైనఁ గాంత యయి యుండుట మాని వనాటమూర్తి యై<br>
యీదృశపౌరుషంబు సెడి యేటికి భామిని నైతినో యటం<br>
చాదిమవానరుండు వెఱఁ గందుచు నచ్చోటు వాసి యయ్యెడన్. 160

చ. తనవలె వానరాకృతులు దాల్చినపుత్రులు గొల్వఁ బద్మగ<br>
ర్భునికడ కేఁగి మ్రొక్కుటయుఁ బుత్రయుగాన్వితు నాత్మపుత్రునిన్<br>
గని ముద మంది నీవు తెలిగంటితనంబునఁ గన్నవీరిఁ దో<br>
డ్కొని ధర కేఁగి యెల్ల కపికోటులఁ బ్రోవు మటంచుఁ బల్కినన్. 161

తే. విని హసా దని యాఋక్షవిరజుఁ డయ్యు, యలసరస్సు మునింగిన నతివరూప<br>
మేల ప్రాపించె వేగిన నేల యడఁగె, నానతియ్యఁగదే యన్న నజుఁడు పలికె.

ఉ. అచ్చటఁ దొల్లి పార్వతి వయస్యలతోఁ జలకేళిఁ దేలఁగాఁ<br>
గుచ్చితు లైన రక్కసులు గొందఱు కామిను లై జలంబులోఁ<br>
జొచ్చిన నిందుఁ జొచ్చి పురుషుల్ నిజ మిట్టులె యాదు రంచు లో<br>
హెచ్చినకిన్క నట్లు శపియించి తిరోహిత యయ్యె నయ్యెడన్. 163

తే. అవ్విధము నేను వినియుండి యంతఁ గొంత<br>
కాలమున కమ్మహాదేవిఁ గాంచి వేఁడ<br>
నచట మునిఁగినమగవాని కాఁడురూప<br>
మొక్కనాఁ డుండు మఱునాఁటి కుండ దనియె. 164

తే. కావున దినంబు చనిన నీకామినీత్వ<br>
మడఁగె నిఁక నేల తామసం బవని కేఁగి<br>
మించురహిఁ విశ్వకర్మ నిర్మించెఁ జెలువ<br>
మొందఁ గిష్కింధఁ బాలించుచుండు మనుచు. 165

క. నిష్కర్ష చేసి దివ్యపరిష్కారము లొసఁగి పనుప ఋక్షవిరజుఁ డ<br>
ప్పుష్కరభవు వీడ్కొని చని, కిష్కింధను సుతులతో సుఖించెన్ బ్రభువై.

క. జనని యయి తానె కనియెన్, జనకుం డై తానె పిదప సంరక్షించెన్<br>
దనయుల వనచరకులనిధి, యనఁగాఁ జనుఋక్షవిరజుఁ డర్కకులేంద్రా. 167

తే. వృద్ధుఁ డై పిమ్మటను ఋక్షవిరజుఁ డింద్రసుతునిఁ దనరాజ్యమున కధిపతినిఁ జేసి
భానుసూనుని యువరాజుగా నొనర్చి, చనియె నవ్వాలికథ మీరు వినినయదియ.

తే. అధిప యీపుణ్యకథ యెవ్వరైన భక్తి
వినిన వ్రాసినఁ జదివిన విపులభోగ
భాగ్యములు గల్గి బహుపుత్త్రపౌత్త్రయుక్తిఁ
దనరుదురు భూమిఁ దామరితంప రగుచు. 169

మ. అని వింధ్యారి వచించి వెండియును రామాధీశుతో ని ట్లనున్
విను ముర్వీశ్వర దైత్యుఁ డట్లు కపిలున్ వీక్షించి విభ్రాంతుఁ డై
తనలో నాఘనుమూర్తి నే తలఁచుచున్ దైత్యారి గాఁబోలు నీ
యన గాకున్నను నున్నె యన్యులకు నీయంచత్ప్రభావోన్నతుల్. 170

రావణుఁడు బోధార్థియై సనత్కుమారుని యొద్దకుఁ బోవుట

వ. అని తలంచి వెండియు. 171

మ. పగవారై నగధారిచేఁ దొడరి తద్బాహాబలక్షీణు లై
తెగి హేమాక్షముఖాసురాగ్రణులు ముక్తిం జెందరే యగ్గతిన్
బగ గోవిందునియందు నొనర్చి సుగతిన్ బ్రాపింతు నంచున్ గడం
గి గురుప్రజ్ఞ సనత్కుమారుకడ కేఁగెన్ వాఁడు బోధార్థి యై. 172

తే. ఏఁగి చలిగట్టుపై నొక్కయెడ సనత్కు
మారు జితమారు బ్రహ్మకుమారుఁ గాంచి
హర్షపులకితగాత్త్రుఁ డై యతని కెఱఁగి
హస్తములు మోడ్చి యసుర యి ట్లనుచుఁ బలికె. 173

మ. అమలజ్ఞాననిధాన యీజగములం దవ్యక్తనానారహ
స్యములున్ మీకుఁ గరస్థలామలకముల్ సర్వజ్ఞు లౌమిమ్ముఁ బం
టిమహాత్ముల్ నతు లైన శిష్యుల నకౌటిల్యాత్మ వీక్షించి ని
క్కముగాఁ దాఁపక యానతిత్తురు గదా కాంక్షానుకూలార్థముల్. 174

మ. అనఘా యెవ్వఁ డనాదిమధ్యలయుఁ డై యవ్యక్తుఁ డై యుంకు నె
వ్వనిచే నయ్యె నధీశయుక్త మగు విశ్వం బెల్ల నెవ్వానిఁ జే
రొక్కనిన్ బంధవిముక్తి యా విబుధవర్యుల్ బుద్ధి నెవ్వానివ
ర్తన మూహింపఁగఁ జాల రట్టిఘనునిన్ దథ్యంబుగాఁ దెల్పవే. 175

క. నా విని సనత్కుమారుఁడు, రావణునకు ననియె వినుము రక్షోవర స
ద్భావముతో నీ వడిగిన, దేవునిమహిమంబు నీకు దెలిపెదఁ దెలియన్. 176

మ. అనఘుం డవ్యయుఁ డచ్యుతుం డమలుఁ డవ్యక్తుం డనిర్వాచ్యుఁ డం
జనదూరుం డఖిలేశ్వరుం డచలుఁ డక్షయ్యుం డమేయుం డటం
చు ననాదిశ్రుతు లుగ్గడింప నుతి గాంచున్ బ్రహ్మ మా బ్రహ్మమే
విను నారాయణకృష్ణవిష్ణుహరిగోవిందాఖ్యలన్ జెల్వగున్. 177

సీ. అంతటఁ బరిపూర్ణుఁ డై నిండి యుండియు జలధిలో శేషాహిశయ్య నుండు
నఖిలలోకేశ్వరుం డనుఖ్యాతిఁ జెందియు వైకుంఠపతి యనువార్తఁ గాంచు
ధవళనీలాదివర్ణవియుక్తి నొందియు నానీలఘనదేహుఁ డనఁగ వెలయు
సకలజీవులయందు సమబుద్ధి మెలఁగియు ఖలశిక్ష సాధురక్షయు నొనర్చు

తే. నభవుఁ డయ్యు వినోదార్థ మవతరించు
మాయఁ బాసియు మాయచే మహిమఁ గాంచుఁ
బోషకుం డయ్యు నుగ్రుఁ డై పొడ వడంచు
నట్టిహరి నెంచ శక్యమే యసురనాథ. 178

సీ. కన్ను విచ్చినయంతఁ గలుగు బ్రహ్మాండముల్ గన్నుమూసిననవి గాంచు లయము
మదిఁదలంచినమాత్ర నొదవు నేక్రియనైన మదిఁదలంపక యున్నమాయ యడఁగుఁ
జేపట్టిన ఖలుండు శిష్టుఁ డై వెలయుఁ జేపట్టకున్న బుధుండె పామరుఁ డగు
వలసిన నేరూపముల నైన వర్తించు వలవకున్న నభంబువలె వెలుంగు

తే. నాదిమధ్యాంతరహితుఁ డవ్యక్తుఁ డఖిల
భువనసృష్టిక్రియాహేతుభూతుఁ డతని
సంస్మరించిన సకలదోషములు వాయు
హరియ సేవింపఁ దగుదైవ మసురనాథ. 179

సీ. విధుదర్శనంబుచే విబుధబోధానందపాథోధిహృదయాభ్రపథము ముంచు
హరిప్రభావంబుచే నాశ్రితషడ్వర్గభద్రదంతావళప్రతతు లడఁగు
మాధవప్రాప్తిచే మననశీలాంచితప్రజ్ఞావనంబులు పల్లవించుఁ
జక్రిసమ్ముఖముచే జన్మమృతిక్లేశమారుతోద్రేకముల్ మలయు టుడుగుఁ

తే. బాయు నాధ్యాత్మికాదితాపత్రయంబు
తలఁగుఁ గలుషాంధకారముల్ మలఁగు నహిత
జాతిదుర్వృత్తిమూషికసమితి గలఁగు
నరయు మింతయుఁ గ్రమముతో నసురనాథ. 180

చ. అన విని రావణుం డను మహాత్ము ముకుందునిచేత సంగరం
బున హతు లైన శాత్రవులు పొందెడిసద్గతి యానతియ్య వే
యన హరిచేత నొచ్చినసురారులు శ్రీహరిలోక మంది యం
దనయము విష్ణురూపధరు లై విహరింతురు రాక్షసేశ్వరా. 181

వ. అని పల్కి సనత్కుమారుండు వెండియు ని ట్లనియె. 182

సీ. ప్రణవంబు జపియించుఫలము కేశవుఁ జేరి యట్టహాసముఁ జేసినంతలోన
భాగీరథీస్నానఫలము శ్రీధరుఁ డేయు నస్త్రాళి మునిఁగినయంతలోన
బహుకాలచింతనాఫలము నారాయణు నలుకమై వీక్షించినంతలోనఁ
బ్రాఁబల్కుల నుతించుఫలము నందకపాణి నడలించి తిట్టినయంతలోనఁ

తే. దనువు కృశియింప శాంతితోఁ దపముసేయు
ఫలము బహుమత్సరంబుతోఁ బద్మనాభు
నాఁగి మెయి వ్రాఁగ మార్కొన్నయంతలోనఁ
గలదు హరిచేతఁ జావకంటెఁ గలదె మేలు. 183

చ. చపలత లేనిచూడ్కులను సారెకు శౌరిముఖంబు సూచుచున్
విపులరణోత్సవంబులను విష్ణుని బేరులు పెట్టి పిల్చుచున్
గుపితమనస్కులై యొరసికొంచు ముకుందునిమ్రోలఁ గూలుదై
త్యపతులభాగ్య మెంతసుకృతాత్ముల కైనను గల్గ నేర్చునే. 184

ఉ. ఆయుధధార ముంచి రుధిరారుణచందనకర్దమంబునన్
గాయము నించి శాతవిశిఖప్రసవావళి పై నిగిడ్చి దై
తేయులు శౌరిచేత నతితీవ్రముగాఁ గయికొంద్రు ముక్తి స్వా
ధ్యాయతపోమఖక్రియలు దాల్చినధన్యులకంటె ముందఱన్. 185

చ. పలుకులు వేయు నేల మధుభంజనుకిన్క తపఃఫలంబు శ
త్రుల కని యమ్మహామునివరుం డెఱిఁగించినఁ బంక్తికంధరుం
డలరి ముకుందుతో సమర మబ్బునె యవ్విభుచేతఁ జచ్చి ని
శ్చలపద మొందఁగాఁ గలనె శాంతినిధీ వివరింపవే యనన్. 186

క. సనకావరజుం డిట్లను, గనకాచలధీర పంక్తికంధర వినుమా
ఘనకాయునితో నని మార్కొని కాయము విడువఁగలవు కుందకు మదిలోన్.

తే. అనిన ముద మంది దశకంఠుఁడమ్మహాను
భావుఁ గని యెన్నినాళ్లకప్పనియొనర్చు
హరి యన నతండు వెండియు ననియెఁ గృతయు
గాంతమున మానవేంద్రుఁడై హరి జనించు. 188

వ. అత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 189

సీ. వేల్పులు గావించువిన్నపంబులు వించు హరి నిన్ను వధియించు నాత్మ మించు
రవికులాబ్ధిజనించు రామనామము గాంచుఁ దపసిజన్నము బెంచు రిపులనొంచు
శిలఁ జెల్వ నొనరించు శివునిచాపము ద్రుంచు జానకి వరియించు సంతసించు
జామదగ్న్యుఁ గలంచు జనకాజ్ఞఁ బాలించు మునివృత్తి ధరియించు వనిఁ జరించు

తే. నీసహోదరిముక్కు ఖండింపఁ బంచు, సరగ ఖరదూషణాదుల సంహరించు
నవనిసుత నీవు గొనిపోవనాగ్రహించు,నది నిమిత్తంబు నినురాముఁడనివధించు.

సీ. మణి కిరీటమువాఁడు మకరకుండలకాంతి దళుకొత్తుచెక్కుటద్దములవాఁడు
నిడుదకన్నులవాఁడు నీలమేఘచ్ఛాయఁ గర మొప్పుదివ్యవిగ్రహమువాఁడు
కంబుకంఠమువాఁడు కౌస్తుభశ్రీవత్సలక్ష్మీయుతోరస్స్థలంబువాఁడు
కనకాంబరమువాఁడు ఖడ్గాదిపంచాయుధముల మించుచతుర్భుజములవాఁడు

తే. చిలువదిండిపైఁ బవ్వళించువాఁడు మెలఁగువాఁడు, లీలఁ బెనుపాముపైఁ బవ్వళించువాఁడు
నీమనోరథ మీడేర్చు నిక్కముగను, సంశయింపకు మన్న రాక్షసవిభుండు.
ఆ. అతని బెక్కుగతుల నుతు లొనర్చుచు భక్తి, నతు లొనర్చి దేవతతులమతుల
నసలభీతు లొదవ నచ్చోటుఁ బెడఁ బాసి, చనియె స్వైరవృత్తి జనవరేణ్య.
ఉ. రామనృపాల వింటి గద రావణుబుద్ధి సమృద్ధి జానకిన్
గాముకుఁడై హరించె నని కానక పల్కెడు రాము యిందిరా
శ్యాము యటంచు నీవు హరి వంచు నెఱింగియె యుద్ధభూమి నీ
చే మృతిఁ బొందఁగా వలసి సీత నొగిన్ గొనిపోయె లంకకున్. 193
క. అని పల్కి మఱియుఁ గలశజ,మునిధూర్జటి యనియెఁ గుసులముకుళనసమయా
గ్రనటన్నిటలతటీలో, చన రటదంఘ్రిపుటకటకచటులార్భటులన్. 194
మ. రవివంశంబున వెన్నుఁ డెప్పు డవతారం బూనో యమ్మేటితో
బవరం బెప్పుడు గల్గునో యెపుడు తద్బాణాహతిన్ గూలి దు
ర్భవముల్ మృత్యువు లేనిదివ్యపదముల్ బ్రాపింతునో యంచు నెం
చి విరాగస్థితి సంచరించు నసురశ్రేష్ఠుండు సీతాధిపా. 195
చ. నెమకి సనత్కుమారుఁ గని నీమహిమంబులు విన్నదాదిగా
నమరవిరోధి నీమదికి నల్క జనింప సురాలి నొంచు లో
కముల నలంచు జన్మములు గాంచిన విష్ణుము లాచరించు సం
యములఁ గలంచుఁ బుణ్యనతు లన్న గ్రహించు జరించు నెయ్యెడన్. 196
చ. అలయక యిట్లు ద్రిమ్మరుచు నద్దశకంధరుఁ డూర్ధ్వలోకముల్
నలఁకువఁ బెట్ట నెంచి యొకనాఁడు మణీమయపుష్పకద్యుతుల్
నలుదిశ లావరింపఁగఁ జనంగ ననంగహరుం డనంగ ని
ర్మలరుచి నుల్లసిల్లు సురసానివరుం డెదు రయ్యె నయ్యెడన్. 197
క. ఎదురై నపోరుదిండికిఁ, బదిశిరములపొలసుదిండి ప్రణతుండై నా
రద యెచటనుండి యెటఁ జని,యెద వెఱఁగింపుము విశేష మేమి యటన్నన్.
చ. ఎలనగ వంకురింప ముని యిట్లను రావణ యింక నేమివిం
తలు వివరింతు నీవిజయధాటికి భీతిలి యూర్ధ్వలోకముల్
వలసలు దీయసాగె బలవంతుఁడ వన్నను నీవె కాక నీ
కిల నొకరుండు సాటి గలఁడే యన బెట్టుగఁ గేరి నవ్వుచున్. 199
మ. బలుమీసల్ వడిఁ గొల్పుచున్ బిగువుతోఁ బౌలస్త్యుఁ డేమంటి వా
వలసల్ దీసెనె యూర్ధ్వలోకములు దేవక్ష్మీంద్ర యట్లైన నం
దుల కేఁగన్ బని యేమి శౌర్యమున నన్నున్ దాఁకి పోరాడఁగాఁ
గలవాఁ డెక్కడ నుండు నిక్కముగ వక్కాణింపవే నాప్రుడున్. 200
ఉ. ఆముని గొంతసేపు హృదయాబ్జమునన్ దలపోసి యాసుర
గ్రామణిఁ జూచి పల్కె సురకంటక కయ్యము నేయఁ గోరినన్

దీపన ముప్పతిల్లఁ దెలిదీవికి బొమ్మచటన్ జతుర్భుజుల్
తామరసాయతాక్షులు సితప్రభ లుందు రజయ్యఁ లందఱున్. 201

శా. చండాంశుప్రతిమానతేజములతోఁ సౌవర్ణభూభృన్నిభా
ఖండాత్యున్నతదివ్యదేహములతోఁ గౌమోదకీచక్రకో
దండాద్యాయుధపాళితోఁ దనరు శ్వేతద్వీపగుల్ త్వద్భుజా
కండూచండిమఁ బాప నోపుదురు లంకానాథ ఘామ్మంచసన్. 202

క. ఆరావణుండు క్రమ్మఱ, నారదుఁ గని యోతపం బొనర్చిన వారా
వారాశి యోరఁ బుట్టుదు, రారూఢజ్ఞాన తెల్పు మన నతఁ డనియెన్. 203

మ. హరిసేవాపరు లచ్యుతాంఘ్రికమలధ్యానాన్వితుల్ మాధవ
స్మరణాసక్తులు విష్ణుమంత్ర జపితల్ చక్రాయుధార్చారతుల్
గరుడారూఢకథాశ్రుతిప్రియులు రక్షశ్శ్రేష్ఠ యం దుద్భవిం
తురు నారాయణచక్రనిర్దళితగాత్రుల్ మింతు రద్దీవిలోన్. 204

రావణుఁడు నారదప్రేరితుఁడై శ్వేతద్వీపమునకుఁ బోవుట

ఉ. నావిని పంక్తికంధరుఁడు నారదు వీడ్కొని వేడ్క మీఱ న
ద్దీవి గనుంగొనన్ దలఁచి తీవ్రముగాఁ జనుచుండి వార్ధులున్
దీవులుఁ బర్వతంబులు నదీప్రతతుల్ విపినాంతరంబులున్
ద్రోవను జూచుచున్ గడచి దుగ్ధసముద్రముఁ గాంచె ముందటన్. 205

తే. కాంచి చెంగట మంత్రిపుంగవులఁ గాంచి
కాంచితిరె యీ యకూపార కాంచి కాస
మంచితక్షీరనిధిహీరమణివిరచిత
కాంచిరుచిఁ గాంచి చెలువు వహించె నెదుర. 206

సీ. శకులవాలోత్క్షిప్తజలశీకరంబులు మెఱుఁగుముత్యము లేరుపఱుప రాదు
కలికిరాయంచ ఱెక్కలమించు తెలిచాయ తెరల తేటయు గుఱు తెఱుఁగరాదు
జలబాలికాపాలికలపొక్కిళుల వర్తులావర్తములభేద మరయ రాదు
తఱుచుగా గిఱికొన్న నురుఁగులకుప్పల నిసుకతిప్పల నిర్ణయింపరాదు

తే. కనుఁగొనుఁ డుదాత్తదాతృత్వజనితకీర్తి, ముంచుకొనె నన సహజమై మించుధవళ
కాంతి దిక్కుల నెల్లఁ బిక్కటిల వెలయు, పాలమున్నీరు కన్నులపండు వయ్యె.

సీ. వలయు కోరిక లియ్యఁ గలపెయ్య గలిగి ముష్టింపచుల్ పరితుష్టిఁ జెందు టెల్ల
మెడఁగెంపుజూతాళి నిడుకొని వనమాలి లిబ్బిగుబ్బెతఁ బ్రబ్బి యుబ్బు టెల్ల
వింటితెర్వరి మేటి వెల్లగొరును నిక్కుచెవుల నీలని నెక్కి చెలఁగు టెల్ల
గటికచీఁకటికి నగ్గం బైన రేవన్నెలాఁడి వెన్నెలగీము గూడు టెల్లఁ

తే. గూటిచవి వేలుపు లెఱింగికొనుట యెల్ల, నమరవనమీవిమ్రాఁకుల నమరు టెల్ల
హరుఁడు శ్రీకంఠుఁ డనుపేర నలరు టెల్లఁ, దలఁప నీక్షీరవారాశివలనఁ గాదె.

మ. వలమానాంబుకరీంద్రహస్తచలనావర్తభ్రమత్తోయదా
వలి మంథానమహీధరభ్రమణభావం బూన శంఖాబ్జశై
వలకూర్మాదులు తత్తదంగముల తేవల్ గుల్కఁ జెల్వొయ్యె ని
క్కలశాబ్ధిన్ బునరప్సరోజననశంకాహేతువుల్ చంచలల్. 209

చ. అనుపమబాడబానలశిఖావలిపైఁ గనిపించెనో యనన్
దనరెఁ బ్రవాళవల్లికలు దానవులార కనుం డటంచు వ
ర్ణన మొనరించుచున్ దనుజనాయకుఁ డవ్వనరాశి దాఁటి చెం
దిన కుతుకంబుతోడఁ దెలిదీవిఁ గనుంగొని చేరఁ బోవఁగన్. 210

చ. స్థలమహిమంబు పెంపున నిశాచరనాథువిమాన రాజము
వ్వలఁ జన లేక వాయుహతివాఁదమున్ వలెఁ గ్రమ్మఱంగ మం
త్రులు భయ మంది యిన్నెలవు దొడ్డది మేనులు కంప మందెడిన్
నిలిచెద మేము పుష్పకము నిల్పినచో నసురేంద్ర నాథుఁడున్. 211

చ. నగుచు దశాస్యుఁ డట్టు లయినన్ నిలుపుం డని పుష్పకంబు శీ
ఘ్రగతిని డిగ్గి సాహసము గాఢపరాక్రమధైర్యసంపదల్
మగఁటిమియున్ దగన్ దురభిమానముతోఁ దెలిదీవిఁ జొచ్చి పో
యె గరుడకేతుదర్శనసమిద్ధమనోరథదుర్నివారుఁ డై. 212

వ. ఇత్తెఱంగున దైతేయద్వీపంబు శ్వేతద్వీపంబు ప్రవేశించి తత్ప్రదేశంబున. 213

సీ. ఘనసారసితవాలుకాప్రదేశంబులు శశికాంతవేదికాసముదయములు
మరకతప్రవిభాసమానసోపానముల్ పద్మరాగోల్లసత్పర్వతములు
సౌవర్ణకమలభాస్వరసరోవరములు హరిచందనాంచితోద్యానములును
వివిధవిభ్రమలతావృతలతాగృహములు బహువర్ణశుకపికభాషణములు

తే. బంధురానేకవిధదివ్యపరిమళములు, మహితవజ్రోపలనిబద్ధమార్గములును
నిర్మలోదకపరిపూర్ణనిర్ఝరిణులు, గలయెడల్ సూచి దనుజుఁ డక్కజము జెంది.

మ. ఒకశృంగారవనంబులో సఖులతో నొయ్యారముల్ మీఱ ను
త్సుకతన్ గ్రీడయొనర్చు భామినుల రక్షోభర్త వీక్షించి చెం
తకుఁబోవన్ జెలి యొర్తు పట్టి యఱచేతన్ బెట్టి యెవ్వాఁడ వే
టికి నిచ్చోటికి వచ్చి తీవనినఁ గుంఠీభూతగాంభీర్యుఁ డై. 215

క. జడసియు జడియక విశ్రవు,కొడుకన్ దశముఖుఁడ రణము గోరి యిచటికిన్
నడతెంచితి నను మార్కొని,యెదుపీడని నొకనిఁ గాన నేమందు ననన్. 216

చ. కిలకిల నవ్వి యచ్చెలి సఖీమణులన్ గని యమ్మలార విం
తలు గనుఁగొంటిరే యిదిగొ తానఁట యిక్కడ నున్నవారితోఁ
గలహ మొనర్ప వచ్చెనఁట కాదని పట్టిన వీఁడు చేతిలో
పలికిని లేఁడు నేఁడు బహుభంగులఁ బ్రేలెడు నంచుఁ జూపినన్. 217

ఉ. వారలలోన వేఱొకతె వచ్చి రయంబున దానిచేతిలో
బీరము దక్కియున్న యతిభీషణు రావణుఁ బట్టి పాణిపం
కేరుహపీఠిఁ బెట్టుకొని క్రేవలఁ బొర్లిన బొర్లనీక యా
కార విచిత్రమైనపుడు గబ్బె నటంచుఁ జెలంగుచున్నదన్. 218

ఆ. దాని పాణి నున్నవాని వేఱొక్కతె, బలిమిఁ దిగిచి తలలు పదియుఁ జేతు
లిరువదియును గల్గి యీపురు గెంతవిం, తౌర యనుచుఁ బట్టి యాడఁదొడఁగె.

ఆ. ఒకతెచేత నతనినుండనీయక సతు, లొకతెచేతివాని నొకతె యొడిచి
బూచి బూచి యనుచుఁ బోనీక పిడికిళ్లఁ, బట్టి పట్టి గాసి పెట్టుటయును. 220

క. ఆయిందుముఖులచేఁ బడి, రాయిడిఁ బడి నలుఁగుడువడి రావణుఁడు వడిన్
గాయము నొచ్చినఁ దొలఁగు ను, పాయము మఱిలేక యొకతె పాణిఁ గఱచినన్.

ఆ. చేయి గఱచె నమ్మచెల్ల నీచెడుపురు, గేడనుండి వచ్చె నీడ కంచు
జడిసి కెలన నున్న సకియపై వైచిన, నదియు నతనిఁ బట్టి యాగ్రహమున. 222

క. మాచెలిని గఱవ వచ్చితి, వే చెడుపురుగ యని మింటి కెగసి రయమునన్
డాచేతనున్న రక్కసు, నాచక్కటి వార్ధి విసరి యది పడవైచెన్. 223

క. వైచిన బవిధారానిహ, తాచలముఁ బోలి దైత్యుఁ డంబుధిఁ బడినన్
జూచి సురమానిగంతులు, వైచుచుఁ దెలిదీవి నున్న వనితలఁ బొగడెన్.

శా. శ్వేతద్వీపముకొమ్మ లీగతి తనున్ జీకాకు గావించినన్
దైతేయాగ్రణి భీతివిస్మయపరీతస్వాంతుఁడై యింతయున్
జేతోజాతగురుప్రభావ మనుచున్ జింతించుచున్ లేచి ల
జ్జాతాపంబులు ద్రోచి లంక కరిగెన్ సామంతసంఘంబుతోన్. 225

చ. వనితలచేత గాసిపడి వచ్చితి విష్ణునితోడ నెట్టు మా
ర్కొన గలవాఁడ నంచు మదిఁ గొంకఁడు రావణుఁ డెట్టులైన ని
న్నని నెదిరించి నొంచెద నటంచు గణించు వచించు వాక్యముల్
దన కెదు రెవ్వరం చెది మదం బని తోఁచును విన్నవారికిన్. 226

ఉ. కాంచనగర్భదత్తవరగర్వమునన్ గడు మించి యున్న రా
త్రించరరాజు నట్లు తెలిదీవివధూటులచేత గాసి సే
యించినవాఁడ వీ వెఱుఁగవే యది యేల యెఱుంగనట్టు లా
లించెద వబ్జబాంధవకులీనతఁ జెంది సరోరుహేక్షణా. 227

చ. సబలు నశక్తుఁ జేయుదు వశక్తు బలాఢ్యునిఁ జేయు దజ్ఞునిన్
విబుధు నొనర్తు వవ్విబుధునిన్ జడుఁగా నొనరింతు వెల్లెఱుం
గఁబడు భవత్ప్రభావ మజకంతుహరాదు లెఱుంగ లేరు వే
డబములు గాక యైహికజడత్వము లున్నవె నీకు రాఘవా. 228

మ. ధరణీదైవతశాపవాక్యమున నీద్వాఃస్థులే దేవతా
పరులై మూఁడుభవంబులన్ నిను గనన్ బ్రార్థించినన్ ఘోణివై
హరివై తొల్తటిదైత్యరూపములు సంహారంబు గావించి తీ
కరణిన్ రావణకుంభకర్ణు లయినన్ ఖండించి తీఱూఫునన్. 229

క. శాపవశమ్మున నీరిపు, డై పౌలస్త్యుండు కోరినటువలె నీచే
నే పడఁగెను ద్వాపరమున, నీపరిభవ మంది ప్రఁది యెనయు విముక్తిన్. 230

231

వ. అని పలికి కలశజుండు వెండియు.

తే. రాముఁగనుఁగొని శ్రీరఘురామ తపన, ధామ శుభనామ కారుణ్యధామ నృపల
లామ దశకంధరవిరామ నీమహత్త్వ, మెఱిఁగి నుతియింపనేర్తునే యించుకైన.

అగస్త్యాదిమునులు రాముని వీడ్కొని స్వస్వనివాసంబులకుఁ బోవుట

నిరోష్ఠ్యసీసము. జయ దశరథరాజజఠరసాగరచంద్ర జయ తాటకాకరంజక కరీంద్ర
జయ ధరాధికజగజ్జాలరక్షాదక్ష జయ దయారసనిరంజనకటాక్ష
జయ ఘనాహల్యాఘలయదాంఘ్రిసరసిజ జయ సహస్రాదిత్యసదృశతేజ
జయ చంద్రధరశరాసనధరాధరశక్ర జయ నిరీక్షాసక్తజటిలచక్ర

తే. జయఖరాదినిశాటశిక్షానిధాన, జయ కిరాతీకృతార్చనసన్నిధాన
జయ నిశాతశరాహతజలనిధాన, జయ జనకకన్యకాధీశ జయనిధాన. 233

చ. త్రిదశులచింత జాఱె నమరీతతివంతలు తీఱె మౌనిస
మ్మదములు మీఱె నీవలన మార్తురఁ ద్రుంచి జయంబు గాంచి యే
కొదవయు లేనినిన్నుఁ గనుఁగొంటిమి వేడుక యయ్యె బోయి వ
చ్చెద మిఁక మమ్ముఁ బంపు రఘుశేఖర నిన్ను శుభంబు లొందెడున్. 234

తే. అనిన నానందకందళితాంతరంగుఁ
డై రఘుస్వామి కలశజుం డాదియైన
మునులకుఁ గరాంబుజంబులు మొగిచి సూక్తి
వినయము వహింప నిటు లని విన్నవించె. 235

చ. అతులతపోమహత్త్వనిధులార భవత్కరుణాకటాక్షసం
గతుఁకు నెల్లసౌఖ్యములు గల్గుట వింతయె మిమ్ముఁ గన్న దు
ష్కృతములు నిల్చునే తలఁప నేటికి నిష్కృతులైన మీఁదటన్
గ్రతువులు నేనొనర్చునెడ రావలయున్ గృప మీఱ నిందఱున్. 236

శా. వీనుల్ సౌఖ్యముఁ జెందె మీవచనముల్ విన్నందునన్ మిమ్ము స
న్మానం బొప్పఁగఁ జూచి లోచనము లానందించె యుష్మత్పదా
ధీనున్ నన్ గృపఁ జూడుఁ డంచని సభక్తిన్ మ్రొక్క దీవించి య
మ్మౌనుల్ వీడ్కొని పోయి రంత రఘురామస్వామి హృష్టాత్ముఁ డై. 237

ఉ. వారిగుఱించి కొంతవడి వర్ణన సేయుచు నుండి విప్రులన్
బౌరుల నిష్టబాంధవుల భానుకుమారవిభీషణాదులన్

గూరిమితమ్ములన్ సఖులఁ గొల్చినభృత్యుల సాదరాంచితో
దారమృదూక్తులన్ బనిచి తానును లోపలి కేఁగె నయ్యెడన్. 238

చ. చరమదిశానురక్తి రవి జాఱెఁ గుముద్వతి మీఱెఁ బద్మినీ
స్ఫురణలు దాఱెఁ జక్రములభోగము దీఱె ద్విజాళి సంధ్యకున్
సరసులఁ జేరె నీడములచక్కికిఁ బక్షులు వాఱె వేఁటకున్
దురుసుగఁ మాడఁ డస్త్రములు సూఱెఁ దమంబును బేరె దిక్కులన్. 239

ఉ. అంతకు మున్నె రామవసుధాధిపుఁ డంతిపురంబునందు సా
యంతనసత్క్రియానిచయ మంతయుఁ దీఱిచి కేళికాగృహా
భ్యంతరసీమ భూమితనయాకృతసేవల స్వాంత మెంతయున్
సంతస మంద నర్హ మగుచందమునన్ నిదురించె నయ్యెడన్. 240

చ. పులుఁగుల నెచ్చరించి తొగపువ్వుల నిద్దురపుచ్చి తమ్ములన్
గలకల నవ్వఁజేసి నునుగాడ్పుల దిక్కుల నించి తారకా
విలసనవైభవం బడఁచి వేకువవేళ రహింప రాము మే
ల్కొలుపఁగ వందిమాగధముఖుల్ చనుదెంచి యుదంచితార్భటిన్ 241

సీ. చోఱవై వారాశిఁ దూఱి చోరునిఁ జీరి మీఱుచారువిహార మేలుకొనుము
మేటిదాఁబేటిబూమెలు పూని మంథానశైల మెత్తినధీర మేలుకొనుము
ఘోణివై సంభృతక్షోణివై రిపు యుద్ధకేళిఁ గూల్చినశూర మేలుకొనుము
భక్తుమాటలఁబట్టి బలుకంబమునఁ బుట్టి మెఱసిననరసింహ మేలుకొనుము

తే. లీల వటువృత్తిఁ గనుధన్య మేలుకొనుము, మేదినీశ ప్రవర్ధన మేలుకొనుము
శూలికోదండఖండన మేలుకొనుము, నీలనీలాంబుదశ్యామ మేలుకొనుము. 242

చ. మునుకొని దేవనీవు కనుమూసిన లోకము లస్తమించు నీ
కనుఁగవ విచ్చి చూచిన జగత్త్రయి మేల్కను విష్ణుమూర్తి హౌ
నినుఁ గొనియాడఁగాఁ దరమె నిద్దుర మాని జగంబుఁ బ్రోవవే
మనుకులనాథ యంచుఁ బలుమాఱును వారు నుతుల్ ఘటింపఁగన్. 243

క. విని మేల్కని తనకంటెన్, మును మేల్కని చెలువుఁ బూని ముందట నిలుచుం
డినసీతమొగము గని పతి, వెనుకన్ మణిదర్పణంబు వేడుకఁ గనుచున్. 244

సీ. వాడినవిరులతో వాసుధేయీనేత్రకజ్జలకలితాలికంబుతోడఁ
జిటులుమైపూఁతతో సీతాదృఢోరోజకాశ్మీరచారువక్షంబుతోడఁ
జాఱుకైశికముతో జనకజాతాంబూలరసరాగలసితనేత్రములతోడ
బడలునెమ్మొగముతోఁ బంక్తిరథస్నుషాగల్లహారిద్రాంకగళముతోడఁ

తే. కేళిగృహసీమ వెడలి భగీరథార్క, కన్యకాదినదీతోయ కలితకనక
కలశములు సీతసఖు లూని కాచియున్న, యల్లమజ్జనశాలకు నధిపుఁ డరిగి. 245

చ. జలకము లాడి క్రొంజిలుఁగుచల్వలు దాలిచి పుణ్యవేదిపై
నెలకొని సంధ్యవార్చి జపనిష్ఠలు దీర్చి కృతాగ్నిహోత్రుఁడై
వలయుధరామరేంద్రుల కవారిగ దానము లిచ్చి పంచి మా
తలకు నమస్కరించి కులదైవము గాంచి భజించి పిమ్మటన్. 246

రాముండు కొలువుకూటంబునఁ బేరోలగం బుండుట

సీ. మణిసహస్రముల ద్యోమణిసహస్రంబులఁ డంబు మెచ్చనికిరీటంబుఁ దాల్చి
మొగముచంద్రుని గెల్వ మొనయుకీర్తి యనంగ దెలివిగాఁ గపురంపుఁదిలక మూని
నిజగుణావలిలీల నిర్మలశ్రీ మించు తళుకుముత్యాలచౌకలి ధరించి
బలిమికేళికిఁ బూనుబలుబిరుదములు నాఁ గరముల వజ్రాలకటకము లిడి
తే. పూసఁగఁ గుంకుమగంధంబుఁ బూఁతరత్న, హారములుగానరాముత్త్రియంపుటంగి
రహిఁ దొడిగి పెద్దపీతాంబరంబు వెలయఁ, గొలువుసింగారమయ్యె రఘుప్రభుండు.

వ. ఇత్తెఱంగునఁ గొలువుసింగారంబై యప్పతంగకులపుంగవుండు నిజాంగనమె
ఱుంగువాలుఁజూపులతో నివాళించి మేలికపురంపుబాగా లొసంగినఁ గైకొని
సీతయనుంగునెచ్చెలి దెచ్చి యుంచినకాంచనపాదుకాయుగళంబు వెట్టుకొని
తనగండపెండెరంబురవళి ననుసరించుగిలుకుటందియరవళితో వెంట వచ్చి పుడమి
పట్టియిచ్చుమడుపు లందుకొనుచుఁ ద్రిచతుఃకక్ష్యాంతరంబులు గడచి యయ్యెం
తిని మరల ననిచి ముదంబున నెదుర్కొని పవననందనుం డొసంగినకైదండఁ
గొని తనయిరుగెలంకుల నకలంకముకురముఖులు పట్టుహొంబట్టుజిగి గచ్చు
టరిగలనిగనిగలతో నొరయుమణిమకుటప్రభలకు నికటంబు లగుపద్మరాగమణి
ద్వారదేహళీవిటంకంబులఁ బొంకంబై మీఱుహజారంబుఁ జేరి యంతకుమున్నె
యచ్చటికి వచ్చియున్నవసిష్ఠాదిమునిశ్రేష్ఠుల కభివందనంబు లొనరించి తదంచి
తాశీర్వాదపురస్సరంబుగాఁ గాంచనమయోచ్చాసనంబున నెలకొని కాంచన
గిరిశిఖరంబుపై నిండోలగం బున్నయన్నలు మొగంబులయున్నవిన్నాణంబు
వహించి తలంపురామిన్న గద్దియపై నెలకొన్న వేల్పుమన్నెవానిచెన్నున నున్నతి
గని తిన్ననసునడలు నున్ననగు తొడలు మిన్నునగు కౌనులు హొన్నుజిగిమేనులు
బెళుకుతెలిగన్నులుఁ గులుకువలిచన్నులుఁ దలిరునునుమోవులు నలరుపెను
తావులుఁ గలయొప్పులాఁడులు తమకప్పవెన్నెలలకు జోడుగా కివి వెలవెల
నయ్యెఁ జూడుం డని తెలిపెడువడువున వెలిచామరంబులు వైవఁ జెందురు
నగుమొగంబులు గలకొందఱు కుందరదనలు తమ తెలినగవువెన్నెలలచెలువం
బున నలవడుచలువపావడలు వీవఁ జిలుకలవలెఁ బలుక నేర్చినకొందఱు కులుకు
లాఁడులు తమకులుకుగుబ్బలం బోలకున్న నీళ్లు మోయించి రనఁ జాలుజాలు
వాగిండ్లు పూని కెలంకులఁ గొలువుసేయఁ గాయజుదీమంబు లనం గొమ
రగుకొమరుప్రాయంపుముద్దుగుమ్మలు కొందఱు తమతమమేవితావులకుఁ దావ
లంబగు వట్టివేళ్ల సురటులకమ్మనెత్తావులు తాళవృంతానిలంబుల నొలయింప

సంపెంగముక్కులం జెక్కులు గలచక్కరబొమ్మలు కొండఱు కర్పూరవీటికా పేటికాదులు గైకొని యంతంత నిలిచి తమతమయొడిగంబులకు సమయం బరయఁగొఱనెలతో నెదురునుదురులు గలచదురాండ్రు గొందఱంబురుహాకరం బులఁ దంబుఱలు వీణెలు ఢక్కలు బిల్లనఁగ్రోవులు గిన్నరలుఁ జెంగులుపాం గంబులుఁ దాళంబులు మొదలగుజంత్రంబులు గొని తత్తదుచితలయస్వరతాళ మేళనంబులఁ దానంబులు విస్తరించి యనురాగంబుతోఁ గాలోచితరాగంబులు సేయుచు మనంబు లలరం బాడుచు సభారంజనం బొనరింప నిలింపపతికొలువు వెలచెలువలచెలువంబులు మెచ్చనిమెచ్చులాఁడులు గొంత ఱరాళపతాకతామ్ర చూడ సూచీముఖ కటకాముఖ త్రిముఖ సర్పశీర్షార్ధచంద్రముఖ హస్తవిశేషం బులు విలోకనీయంబులుగాఁ గమనీయముఖవిలాసంబులు భాసిల మధ్యమ ద్రుతవిలంబితంబులు డంబు గులుక సూళాదితాళంబులమేళంబుల రంగగురక్తి లెసంగ నభినయించుచు జదురుపదము దేశీయము మొదలగులాస్యవిధంబులు వినిపింప బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదిజనంబు లుచితప్రదేశంబుల వసియింపఁ గురు కరూశ ఘూర్జర సింధు గాంధార సౌవీర కాశ్మీర చేదితుందిర పాండ్యద్రవిడ బర్బరచోళపాంచాలమగధమాళవమత్స్యమళయాళ నేపాళ కొంకణకొంకణయ వనబంగాళకళింగప్రముఖవివిధదేశాధినాథు లలికస్థలవిన్యస్తహస్తులై భజియిం పఁ "గోసలరాజకన్యకాగర్భపయఃపారావారపరిపూర్ణచంద్రోదయ! దయా దాక్షిణ్య తారుణ్య నైపుణ్య లావణ్యప్రముఖనిఖిలగుణగణాలంకార! లంకా రక్షణదక్షరక్షఃకులాధ్యక్షశిక్షాదీక్షాధురంధర! ధరాకుమారికారమణీరమణీయ మనఃకమలకమలాకర విరాజద్రాజహంసోత్తంసవిహార! కేయూరకటకమకుట హారకంకణాంగుళీయకముద్రికాతులాకోటికాదిభూషావిశేషాభిరామ! రామ నృపాలలామ! జయ విజయీ భవ" యని వందిమాగధబృందంబు బహువా రంబులు గైవారంబులు సేయ సౌవిదల్లకసాహోనినాదంబు లెసంగఁ బ్రసంగో చితవచనరచనాపటులగు కవినటగాయకపరిహాసవిదూషకప్రముఖులు భజియింప నింపుసొంపులతో నుబ్బుచు డెబ్బదిరెండువినియోగంబులవారు దూరంబున నుండి సేవింప నిండోలగంబున నుండి విదేహరాజ్యముఖ్యులగు బంధుప్రముఖుల నుపచరించుచు భరతలక్ష్మణశత్రుఘ్నులు వచ్చి సేవించిన నాదరించి యుచితాస నంబుల నుండ నియమించుచుఁ గామరూపంబులు దాల్చినయంగదాదివానర వీరయోధులతోఁ దనవలపలికెలన నుదగ్రమణిపీఠంబుపై నున్న సుగ్రీవు నప్ప టప్పటికి నుచితోక్తుల నలరించుచు మంత్రిచతుష్టయసమేతంబుగాఁ దనడాపలి పార్శ్వంబున నున్న విభీషణు సప్రేమంబుగా నవలోకించుచు నిజచరణపీఠాసన్న వర్తి యగు హనుమత్కపిచక్రవర్తి యుపమాద్యలంకారకలితానవద్యగద్య పద్యాదులఁ దనుఁ బ్రశంసించిన నవధరించి సంతసించుచు విద్వత్ప్రముఖతత్త

జ్ఞనవిద్యాపరిశ్రమంబు లెఱుంగుచు హితపురోహితమంత్రిసామంతమిత్త్రసఖ ప్రముఖుల కర్హభంగిఁ బ్రత్యుత్తరంబు లిచ్చుచుఁ బౌరజానపదాదిప్రకృతిజనం బులవిజ్ఞాపనంబు లవధరించుచు దీనానాథజనంబులు గోరినధనకనకవస్తువాహ నాదు లిప్పించుచు నేర్పు మెఱసి పౌరాణికు లెఱింగించుసముచితపుణ్యపురాణ కథాప్రపంచమున వీనులకు విందు సేయుచు నక్షత్రమధ్యంబునం దేజరిల్లు రాకాచంద్రుచందమున గ్రహసభాంతరంబున విల్లసిల్లుప్రభాకరు భావంబునం జెలంగె నయ్యెడ. 248

శా. ఆరామక్షితినేతచెల్మి వినయం బౌదార్య మైశ్వర్యముం
దారుణ్యంబును జెల్వు మెచ్చి నృపు లాత్మప్రాజ్యసామ్రాజ్యసం
భారంభంబులు మాని దర్శనవిధాయత్తాత్ము లై యుండి ర
ప్పౌరుల్ జానపదాదు లొండొకపనుల్ పాటింప రెప్పట్టునన్. 249

క. ధ్యానములమాత్రమునఁ బర,మానందమొసంగు బ్రహ్మ మాకారముతో
గానంబడినను జూచిన, మానవు లానందవార్ధిమగ్నులు గారే. 250

చ. ఇనకులశేఖరుం డిటుల నెల్లజనంబులు సంతసిల్లఁగా
దినమును శాకశాసనుగతిన్ గొలువై తనపెద్దకొల్వునన్
దనరుచు నొక్కనాఁడు సవిధంబున బంగరుగద్దె నున్న య
జ్జనకనృపాలుఁ జూచి యుపచారపురస్సరభంగి నిట్లనున్. 251

శ్రీరాముండు జనకాదినృపవర్యుల సత్కరించి పంచుట

చ. జనకుని కై వడిన్ బ్రజల సంతతముం దయఁ జూచి ప్రోవఁగా
జనకసమాఖ్య మీ కలరు శాత్రవశిక్ష యొనర్చి సీతతో
ననుపమసౌఖ్య మేఁ గనిన దంతయు మీకృపఁ గాదె మామగా
రనుటయె కాని మమ్ముఁ గనినయ్యకు మీకును భేద మున్నదే. 252

ఉ. పెక్కుదినంబు లాయె మముఁ బ్రీతిఁ గనుంగొన వచ్చి యెన్ని నా
ళ్లిక్కడ మీర లున్న శుభమే యగు నైనఁ బ్రజాభిరక్షణల్
దక్కి వసింపరా దని కదా వివరింతురు పోయి రండు మా
దిక్కు కటాక్ష ముంచుఁ డని దివ్యమణీమయభూష లిచ్చినన్. 253

ఉ. ఆమిథిలాధినాథమణి యల్లుఁ డొసంగిన రత్నభూషణ
స్తోమము పాణి నంది నృపసోమ యి వేటికి మామ యంచు నన్
బ్రేమ బహూకరించుటయె పెక్కుధనంబులు సీత లక్ష్మి నీ
వే మధువైరి నీమహిమ లెంచుచు నూరికిఁ బోయి వచ్చెదన్. 254

క. అని యుచితభంగి వీడ్కొని, జనకమహీభర్త రామచంద్రునసుజ్ఞన్
దనవెంట భరతుఁ డనుపన్, జను దేరఁగ మిథిల కేఁగె సంతస మెసఁగన్. 255

ఉ. అత్తరి రాఘవుండు వినయంబునఁ గేకయముఖ్యుఁ డౌ యుధా
జిత్తునిఁ జూచి పల్కె నృపశేఖర యీవిభవంబు యుష్మదా

యుత్తము మాకు మీరె కద యార్యులు మీరిటఁ దామసించినన్
జిత్తమునందు మీగురుఁడు చింతిలు మీరును బోయి రాఁ దగున్. 256

తే. మిమ్ముఁ బనుపంగవచ్చు సౌమిత్రి యనుచు, నమితరత్నాంబరశ్రేణు లతనికొసఁగఁ
బ్రేమ నన్నియు మరల నర్పించి యర్ఘ్య, ఫణితి నుతియించి యజ్జనపాలుఁ డరిగె.

క. శ్రీరామచంద్రుఁ డంతట వారాణశ్యధిపుఁడగు ప్రవర్ధననామున్
భూరిగుణధాము నిజసఖు, గారవమునఁ జూచి ప్రియము గనఁబడఁ బలికెన్.

ఉ. నీవు గుణాంబురాశివి వినీతుఁడ వెంతయుఁ బెద్దవాఁడవున్
భావనమూర్తి వాదరణఁ బాయవు నే శిశు వైనదాదిగాఁ
గావునఁ బాయఁ జాల నని గద్దియ డిగ్గి కవుంగిలించి సం
భావన సేసి వీడ్కొలిపె భానుకులీనుఁడు సభ్యు లెంచఁగన్. 259

క. తరువాత నిఖిలధరణీ,శ్వరులఁ బ్రియంకరుల రామచంద్రుఁడు వెలిదా
మర రేకులు వెడచల్లిన, కరణిన్ దనచూపులొలయఁ గనుఁగొని పలికెన్. 260

మ. ధరణీనాయకులార మీభుజబలౌద్ధత్యంబునన్ బంక్తికం
ధరుఁ డీల్గెన్ వినుఁ డేను గారణముమాత్రం బింతె మీలోన నొ
క్కరుఁడున్ నాయెడ నెయ్య మించి నయమార్గం బొప్ప మీమీధరల్
పరిపాలింపఁగ నింకఁ బొం డని సుధాప్రాయోక్తులన్ బల్కినన్. 261

క. ఆయుచితోక్తుల నవనీ,నాయకు లానంద మొంది నతరక్షణసం
ధాయకు రఘునాయకు శుభ,దాయకుఁ గని యనిరి ముకుళితకరాంబుజులై.

సీ. అఖిలభూతమయుండ వగుట నీవిజయ మందఱిజయం బనుట తథ్యంబ కాదె
యొకటికి ననేల సకలంబునకు హేతు వై యుండు దదియుఁ దథ్యంబ కాదె
యంతరాత్మకుఁడ వై యందఱిలో నొక్కయాకృతి నునికి తథ్యంబ కాదె
నీయందు నెయ్యముల్ నిలుపుట నయమార్గ మౌ నన్నమాట తథ్యంబ కాదె

తే. విభుఁడ వయ్యును మానుషవిగ్రహంబుఁ
దాల్చి వెలుఁగొందు నీయాజ్ఞఁ దలల మోచి
పోయివచ్చెద మంచుము పూర్ణకరుణ
రాజదేవేంద్ర దశరథరామచంద్ర. 263

తే. అనినుతించిన వస్త్రమాల్యానులేప, వీటికాదులు తద్ధరావిభుల కొసఁగి
వినయమునఁ జిన్నతమ్ముని వెంటఁ బనుప, నారఘూత్తము వీడ్కొని వార లపుడు.

మ. అవనీభాగము కంప మొందఁగ ననేకాక్షౌహిణుల్ గొల్వఁగా
జవనాశ్వద్విరదాదిఘోషముల దిక్చక్రంబు మాఱ్మ్రోయ భూ
ధవు లెల్లం జని రాత్మభూములకు దైత్యచ్ఛేదనం బాదిగా
రవివంశాగ్రణి చేసినట్టిబలుకార్యంబుల్ ప్రశంసింపుచున్. 265

తే. ఇటుల జనకాదిబంధుల నెల్లనృపులఁ, బనుప రామాజ్ఞ నరిగిన భరతలక్ష్మ
ణాదు లాయానృపాలకు లంపినట్టి, కానుకలతోడ వచ్చి రాఘవునిఁ గాంచి.

సీ. పట్టుపేనుంగు లారట్టాశ్వములు హొన్నగట్టుల మెచ్చనిఘనరథములుఁ
బట్టుచుట్ట లనేకపరిమళపేటిక లకలంకరత్నపల్యంకికలును
ధనమణిరాసులు దాసదాసీజనుల్ మణికిరీటంబులు మణిసరములు
జాళువాసొమ్ములు సరిగెదువ్వలువలు హైమమాణిక్యసింహాసనములుఁ
తే. బట్టెమంచంబు లొఱపైన పఱుపులు దిరి, బొమ్మలను బోలుముద్దులగుమ్మలాది
యైనకానుకలు గొలువున్న యధిపుదృష్టి,పథమునందిడి సద్భక్తిఁ బ్రణతులైన.
క. కానుకఁ గొంచు డలరి యర్థము,లా కొన్నివిభూషణంబు లతులాంబరముల్
చేకొని సుగ్రీవాదిమ,హాకపులకు నవ్విభీషణాదుల కొసఁగెన్. 268

తే. ఒసఁగి రఘురాముఁ డొకహార మూని భల్లు
కేంద్రుఁ గని తాత తగును నీ కిది గ్రహింపు
మనిన నన్నేల కొమ్మనె ననుచు ముసలి
కేల యన నవ్వె సభ హార మిచ్చె విభుఁడు. 269

క. ఉరముల మణిహారంబులు, కరములఁ గటకాంగుళీయకప్రముఖములున్
సిరముల మిసిమికుళాయిలు, ధరియించి చెలంగి రఖిలతరుచరముఖ్యుల్. 270

తే. వారిలోన విశేషించి వాలిపుత్త్రు, నమ్మరుత్పుత్త్రుఁ బిలిచి నిజాంకయుగళి [చ్చి.
నిలిపికొనితా నెతొడవులన్నియును దొడిగి, యర్కసుతుఁజూచిపతియిట్టులానతి

క. నినుఁ గొలిచినకపు లందఱు, ఘనకార్యధురీణు లగుచుఁ గడిఁదిపనుల్ సే
సినవారు నీకుమారుం, డనిలసుతుఁడు బూజ కర్హుఁ డన నతఁ డనియెన్. 272

సీ. శాఖశాఖల నెక్కు శాఖామృగములకు హేమాసనములపై నెక్కఁ గలిగె
వల్కలకౌపీనవంతులౌ కపులకుఁ బట్టాంబరమ్ములు కట్టఁ గలిగె
వనభూరజము గప్పికొని మెలంగు వనాటులకుఁ జందనాదు లలందఁ గలిగె
ఫలమూలములు దిని బ్రతుకుమర్కటులకు మేలోగిరంబులు మెక్కఁ గలిగె
తే. నొడల నేపోఁడిమియు లేక యున్నవలిము
ఖులకుఁ గటకాదికము లూనుకొనఁగఁ గలిగె
నటవిచరులకుఁ బురిఁ దిరుగాడఁ గలిగె
శ్రీరఘూత్తమ నినుఁ గొలిచిన కతమున. 273

శ్రీరాముండు సుగ్రీవాదివానరులను విభీషణాదులను బహూకరించుట

క. నీనెయ్యముగల్గినఁ దృణ, మైనను మేరు వగు మేరు వైనను దృణ మా
నీనెయ్యము దఱిగిన నీ, వానరు లెంత యన రామవసుధేశుఁ డనున్. 274

క. నీవారి నీవు సన్నుతి, గావింపవు గాక సహజగాంభీర్యనిధుల్
నీవా రిందఱు రవిసుత, ఖావింపఁగ వీఁపనులు పరమాద్భుతముల్. 275

సీ. ఘనభూమిభృచ్ఛిరోగ్రము లెక్కుఘనులకు నీచిన్నిగద్దియ లెక్కలెంత
బలుకాంతిఁ బరమేశువలువలు గప్పెడి ఘనులకీజిలుగులు గట్టు లెంత

తుల లేనిశుభవాసనల మించుఘనుల కీయలంతితావుల గంధ మలందు టెంత
యమృతాశనులసామ్య మందినఘనులకు నిక్కుడు చవిగొని మెక్కు టెంత
తే. యధికగుణరత్నభూషితు లైనవీరి, కీవిభూషణతతులు వహించు టెంత
యఖిలజగముల నప్రతిహతరయమునఁ, దిరుగువీరల కీప్రోలఁ దిరుగు టెంత. 276

చ. వనవిధు లన్నియుం గలఁచి వైవ వసుంధరఁ బెల్లగింప సూ
ర్యుని దిగమ్రింగ ఘోరలయరుద్రుని నైనను మార్కొనంగ నో
పినఘను లీమహాకపులు భీతి వహింపుదు రేమహాత్ము శా
సనమున కట్టియాజ్ఞ గలశౌర్యనిధిన్ నిను నెంచ శక్యమే. 277

మ. అని మైత్రిం గొనియాడి మంత్రిసహితుం డోపం క్తికంఠానుజ
న్ముని లాలించి వలీముఖాగ్రణుల కెంతే వేడ్కఁ బుట్టించి యొ
క్కనిమేషం బని తోఁప బెక్కుదినముల్ కాకుత్స్థరత్నంబు మ
న్ననలన్ దేలిచె వారు నుండి రమితానందాబ్ధి నోలాడుచున్. 278

హేమంతఋతు వర్ణనము

క. శిశిర మరుదెంచె నంతట, నిశ లాయతగతి వహించె నెత్తమ్మి తెగల్
కుశలత డించె దినంబులు, గృశియించె వడంకు ముంచె నెల్లజనములన్. 279

క. అంబరమణి సాంబరుఁ డయ్యుం, బరువిడుఁ జరమగిరికి నుర్వంశకుఁ డ
య్యుం బవమానసఖుఁడు మం, చంబులక్రిందటనె డాఁగుఁ జలి యల్పంబే. 280

సీ. ముద్దుగుమ్మల మొగంబులుఁ జూడనే కాని మానసింపరు చందమామఁ జూడఁ
జవరాండ్రమందహాసముల చెంతనె కాని నిలువరు పండువెన్నెలలబైట
సకులకెమ్మోవిపానకముఁ గ్రోలనె కాని కాంక్ష సేయరు పానకములు గ్రోలఁ
జెలువలకుచదుర్గములకుఁ బ్రాకనె కాని తలఁపరు కృతకభూధరము లెక్క
తే. జెలులనాభిసరస్సులే చేరఁ గాని, యొల్లరు సరస్సులను జేరి యోలలాడ
మానినులకమ్మయూర్పులే కాని సురఁటి, గాలిరానియ్యరధిపు లక్కాలమునను. 281

సీ. దినముఁ బ్రాతస్స్నాన మొనరించుద్విజులకు నగుకరగ్రాపభయంబుకంటెఁ
బ్రాచి పనుల్ సేయ లేచుకోడండ్రకౌ నత్తలవలనిభయంబుకంటెఁ
గడుపులో దూర మేఁగఁగ నున్నచరులకు నధిపుచే నొదవుభయంబుకంటెఁ
గర్షణంబొనరింపఁ గడఁగుకాఁపుల కారయమిఁ బైరుచెడునన్ భయంబుకంటెఁ
ఆ. గడిఁది యయ్యెసీతు ఖగమృగపశునర, ప్రముఖజంతువులకు భావములను
జాల మించె మిథునసంపర్కసౌఖ్యంబు, శిశిరమహిమ వినుతి సేయ వశమె. 282

క. కాచె నుసిరికలు తఱుచుగఁ, బూచెం జేమంతివిరులు భూమికి బరువై
తోఁచెఁ జణకాదిసస్యము, లేచెన్ బలుమంచు చదల హేమంతమునన్. 283

తే. ఎల్లజనములఁ దలచూపనీక వెలయు, నల్ల హేమంతఋతురాజయశము దిశల
నావరించెనో యనఁగ మంచగ్గలించె, రోదసి నతంద్ర చంద్రికారుచిరరుచులు.

ఆ. కొండ లెల్ల మంచుఁగొండ లై కనిపించె, నడవు లెల్లఁ బూచినటుల మించె
దీవు లెల్లఁ దెల్లదీవు లై రహిఁ గాంచె, మాపు రేపు మించుమంచువలన.

శా. ప్రాతర్వేళల మంచుచిన్కుగుమి జొంపం బై నలేఁబచ్చికల్
శ్వేతశ్రీఁ దుళకించు టెంతయు రహించెన్ సర్వభూతంబులున్
శీతశ్రాంతి వడంకఁ దా నచల మై చెల్వొందుభూదేవికిన్
శీతద్యుప్రభుఁ డిచ్చువజ్రములరాశిం బోలి నల్వంకలన్. 286

వ. తత్కాలంబున. 287

చ. వలపులు గ్రమ్మఁగాఁ బొగచి వండిన కారపుఁగాయగూర ల
ప్పళములు దియ్యచే రొలుపుఁబప్పు రసావళు లింపుటోగిరం
బు లపుడుఁ గాఁచి తెచ్చుఘృతమున్ బలుమాంసము లర్కపుత్త్రము
ఖ్యులు రఘురామబంతిఁ బ్రియ మొప్ప భుజించి సుఖించి రెంతయున్. 288

శ్రీరాముఁడు వానరరాక్షసుల వీడ్కొలుపుట

ఉ. అయ్యెడ నొక్కనాఁ డినకులాగ్రణి భానుజుఁ జూచి నెమ్మదిన్
నెయ్యముఁ జేర్చి నాకొఱ కనేకవిపద్దశ లోర్చి సేయుసా
హాయ్యముచేత నే విజయ మందితి సన్నుతు లేల పెక్కునా
ళ్లయ్యెను నీవు వచ్చి యనఘా యిక నూరికిఁ బోయి రాఁ గదే. 289

సీ. అంగదు నసురోచ్చయాంగదు నలరింపు హనుమంతు గుణవంతు నాదరింపు
జాంబవంతుఁ బరాద్రిశంబవంతు భరింపు నలు మహోర్జిత దవానలుఁ దలంపు
నీలు సేనావనాభీలుఁ బాలనసేయు శతబలి నతబలి నవధరింపు
తారుఁ గీర్తినిరస్తతారుఁ గటాక్షింపు శరభు నాసురసింహశరభుఁ బ్రోవు

తే. గజగవయగంధమాదనక్రథనకుముద, పనసధూమ్రసుషేణాదిబలిముఖేంద్రు
లిందఱు మదర్థముగ మేను లిచ్చినారు, వీరి నెల్లను రక్షింపు వీరవర్య. 290

క. నిష్కంటక మై తనరెడి, కిష్కింధకుఁ బోయి యుంకఁ గేవలకరుణా
విష్కృతమతి వై వాసవి, దుష్కార్యము లెంచ కంగదునిఁ బ్రోవఁ దగున్.

క. అని పౌనఃపున్యముగా, నినకులపతి వాలిసుతుని నేలెడుపని య
య్యినజునకుఁ దెల్పి యుపగూ,హన మొనరిచి యెల్లకపుల నలరించి కృపన్.

తే. ఆవిభీషణుఁ జూచి మహాత్మ నీవు, పుట్టినప్పుడె వెన్నతోఁ బెట్టెఁ దల్లి
వినయధర్మవివేకముల్ వేఱ యేల, బోధ లైనను వినుము నాబుద్ధి యొకటి.

చ. కొలిచినవారు రాక్షసులు క్రూరము మానస మొక్కవై ఖరిన్
నిలువదు కాలపద్ధతి ననేకవికారము లొందు నెందునన్
దలఁకక యన్నపై నెనరు ధర్మముపైఁ బ్రియ ముంచి లంక ని
శ్చలగతిఁ బ్రోవు ధార్మికుఁడు శాశ్వతుఁడై వెలయున్ విభీషణా. 294

క. మఱవకు నీతివినీతులు, మఱవకు మామిత్రాదిప్రేమ మనకపివరులన్
మఱవకు సీతలిదండ్రుల, మఱవకు మని రఘుకులాబ్ధిమణి దెల్పుటయున్. 295

క. ఆరఘుపతివచనామృత,ధారలఁ బరితుష్టిఁ జెంది తరుచరరక్షో
వీరు లిటు లనుచుఁ బొగడిరి, సారెకు బహువార్ధి లోక్కసరిన్మోయురహిన్.

సీ. శతబృహస్పతు లైన సవతుగా రొకబృహస్పతి యీమనీషకు సాటి యగునె
వేమంది యజులైన నేమాత్రమో కాక యొకయజుం డీసూక్తి కుపమ యగునె
లక్షశేషాహి వల్లభు లైన నేమొ కా కొకశేషుఁ డీబల్మి కుద్ది యగునె
కోటిమన్మథు లైన దీటుగా కొకమన్మథుం డీచెలువునకుఁ దుల్యుఁ డగునె

తే. తలఁప శతకోటిమేరుభూధరములైనఁ, బోల్పఁదగుఁగాక యొకమేరుభూధరంబు
పోల్ప నీధైర్యలక్ష్మికిఁ బోల్కి యగునె, రవికులాంభోధిచంద్ర శ్రీరామచంద్ర.

సీ. ఎన్నిదోషములున్న నెంచక యించుక గుణ మున్న మెచ్చి చేకొందు వనుచుఁ
బాటించి పలికినపలుకు బ్రహ్మవరంబుగాఁ బ్రతిష్ఠకుఁ దెచ్చు ఘనుఁడ వనుచు
హీనుఁడైన సమాశ్రయించినఁ దమ్ముని జూచినచందానఁ జూతు వనుచుఁ
గొలిచినవారిని గూర్మి నాచంద్రార్కముగ సౌఖ్యము లొసంగి ప్రోతు వనుచు

ఆ. బరులు స్వజను లనక ప్రజల నందఱఁ గన్న, ప్రజలలీలఁ బోచుప్రభుఁడవనుచుఁ
నీగుణంబు లెంచు నిఖిలలోకంబులు, రమ్యగుణసముద్ర రామభద్ర. 298

చ. అని కొనియాడుచున్న సమయంబున మారుతసూతి స్వామికిన్
వినతు లొనర్చి పల్కె రఘువీర భవత్పదపంకజంబులన్
ఘనతరభక్తి యెల్లప్పుడుఁ గల్గఁగ మీకథ యెంతకాల ము
ర్విని దగు నంతకాలము శరీరము నిల్వ వరం బొసంగవే. 299

ఉ. నీకథ లెప్పుడున్ వినుచు నీపదచింతన మాచరింపుచున్
నీకరుణావలోకములు నీమృదుభాషలు నీవిలాసముల్
నీకలితప్రభావములు నెమ్మది నెంచుచు నున్నఁ గాక యే
లాకపిమూర్తిఁ జేకొని యిలాస్థలిఁ జెంద వృథాయురున్నతుల్. 300

క. శ్రీరామ నీకథామృత,ధారలు కర్ణాంజలులను ద్రావెడిధన్యుల్
కోరుదురే యమరత్వము, తూరుదురే జన్మమరణదారుణరుజలన్. 301

సీ. కౌసలేయ త్వదీయకథ లూఁకొననివాసరంబు కల్మషధూసరంబు గాదె
తాటకాంతక నిన్ను ధ్యానంబు సేయనిక్షణము నివారితక్షణము గాదె
జానకీరమణ నీస్మరణం బొనర్పనిఘటిక విషాపూర్ణఘటిక గాదె
సాకేతనిలయ యుష్మత్పూజ సలుపని జాము మృత్యువు నిల్చుగీము గాదె

తే. శ్రీరఘూత్తమ నిన్ను దర్శింప కురక, కడచుకాలంబు గాలంబుకరణి గాదె
రామ యటుకాన నిన్ననారతము వినుట, దలఁచుట న్మాదృశుల కుచితంబ కాదె.

ఉ. నావిని సంతసించి రఘునాథుఁడు గద్దియ డిగ్గి గ్రక్కునన్
బావనిఁ జేతులన్ గదియఁ బట్టి కవుంగిట నుంచి పల్కె న

స్నివిపు డిచ్ఛయించినవి యిచ్చితి భూమి గలంతకాలముఁ
దావకకీర్తియుఁ నిలుచుఁ దండ్రి చరింపు చిరాయురున్నతిన్. 303

ఉ. ఆపదఁ బాపి ప్రాపయినయన్నకుఁ బ్రత్యుపకార మూనఁగాఁ
గాపురుషుండు గోరుఁ బ్రతికారము సేయఁ దలంపఁ డార్యుఁ డ
య్యాపద రాఁ దలంచి నటులౌ నని ధన్యుఁడ వైననీకు లే
వాపద లేఁ బ్రతిక్రియ యొకప్పుడుఁ జేయఁ దలంపఁ గావనీ. 304

మ. నినుఁ బూజించునతండు నాహితుఁ డగుఁ నీలోన నే నెప్పుడుఁ
గనిపింతుఁ వినిపింతు రచ్చరలు వేడ్కఁ ద్వత్కథల్ ఖ్యాతితో
మను మంచుఁ హనుమంతుఁ బల్కి రఘురామస్వామి స్వగ్రీవఁ బా
యని వైదూర్యపుతాళిఁ గైకొని తదీయగ్రీవ నుంచెఁ గృపన్. 305

క. ఆ హారము లోకైకమ,నోహరము బూనుకొని హనుమ దగె నుడుసం
దోహావృతామృతాహా,రాహార్యమొ యనుచుఁ జూప రగ్గింపంగన్. 306

చ. ఇటువలె రాముఁ డాశ్రితుల నెల్లఁ గ్రమంబున బుజ్జగింపుచుఁ
బటుమణిభూషణావళు లపారముగా దయచేసి వెండియుఁ
భటసహితంబుగా ననుప భానుకుమారవిభీషణాదు లే
మెటువలెఁ బాసి పోదు మవనీశ్వ యంచును ముక్తకంఠులై. 307

చ. వలవలఁ గన్నులఁ దొఱఁగు బాష్పకణంబులతో రఘూత్తముఁ
బలుమఱుఁ జూచుచుఁ నిలిచి పంచితివే రఘురామచంద్ర మా
స్థలముల కంచు మూధులవిధంబున నేడ్చుచుఁ బోయి రెంతయుఁ
గళవళపాటుతోఁ గరుణ గల్గినరాజును బాయఁ గూడునే. 308

ఉ. భానుకులీనుఁ డీకరణి భానుజముఖ్యుల వీడుకొల్పి త
న్మానితశౌర్యధైర్యములు మాటికి నెంచుచు నార్యబంధుమి
త్రానుజమంత్రియుక్తి నపరాహ్ణముదాఁక సభాంతరంబునఁ
దాను వసించి యుండెను జనస్తవనీయకళాభిరాముఁ డై. 309

ధనేశునిపంపునఁ బుష్పకంబు రాముని గొలువ వచ్చుట

చ. తదవసరంబునఁ దశరథప్రియసూతికి నొక్కదివ్యమూ
ర్తి దివి వసించి యిట్లనియె దేవ కుబేరుని పుష్పకంబ మీ
పదములు గొల్వ వచ్చితిఁ గృపఁ ననుఁ జేకొనుఁ డన్న రాఘవుం
డిది తగునే పతిఁ విడిచి యేటికి వచ్చితి విందు నావుడున్. 310

ఆ. ఆవిమానరాజ మనియె దేవరయాజ్ఞ, యత్తుప్రోలిపాలి కరుగ నతఁడు
మీగుణంబు మెచ్చి మీసేవఁ గావింపు, మనుచు మరలఁ బనిచె నను నరేంద్ర.

ఉ. ఆయన పంప కున్న సుగుణాకర యూరక నేను వత్తునే
నాయెడ సంశయం బుడిగి నన్ను గ్రహింపు మటన్న జానకీ

నాయకుఁ డుత్సహించి స్వజనంబులఁ బుష్పకరాజపూజనల్
సేయఁగఁ బంచి మన్ననయుఁ జెల్మియుఁ దోపఁగఁ బల్కెఁ గ్రమ్మఱన్. 312

క. ఓ దేవయానరత్నమ, నేఁ దలఁచియపుడె రమ్ము నీకు నిలువ నిం
పౌదెస కిప్పుడు పొమ్ము స,మాదృతి మము మఱవకుండు మని పనుచుటయున్.

ఆ. అలరి సకలలక్షణాఢ్యుఁ డౌనాకృత, లక్షణునకు నది ప్రదక్షిణం బొ
నర్చి దక్షిణంబునకు నాక్షణంబున, నేఁగె నీక్షణముల కెఱుఁగఁ బడక. 314

మ. రఘువంశాగ్రణి యంత సంతసిలి యర్థస్వామి యారౌర యెం
తఘనుం డాత్మవిమానమే యొసఁగె మత్సఖ్యంబుఁ గాంక్షించి చె
ల్మి ఘటింపన్ దగురాజరాజతఁడు బల్మిన్ గల్మి నత్యున్నతుం
డఘదూరుం డని పల్కుఁ బల్కె భరతుం డావేళ హర్షంబునన్. 315

ఉ. దేవ భవత్ప్రతాపసముదీర్ణత నార్యవిరోధకారి యా
రావణుఁ డీల్గెఁ గాన ధనరాజు ప్రమోదముఁ జెంది మీకు సం
భావనగా విమానమణిఁ బంపె దశాస్య భరించుదోషమున్
బోవునె పుష్పకంబునకుఁ బూని మిమున్ భజియింప కుండినన్. 316

చ. ఉరుమతి మీగుణంబులకు నొక్కఁడు జేకుడె యేల యెల్లది
గ్వరులును జెల్మి సేయుటకె కాంక్ష వహింతురు నైజభోగముల్
నిరుపమశక్తి మీరు కరుణించిన వంచునె యెంతు రెప్పుడే
పరుసున మీకు వేడ్క సలుపన్ గలమో యనుచుందు రాత్మలన్. 317

సీ. నిర్జరాధీశుండు నెలమూఁడువానలు కోరినధర నెల్లఁ గురియసాగె
జ్వలితప్రదక్షిణార్చులతోడ హవ్యంబు నేవేళ వహ్ని వహింపఁ దొడఁగె
మిక్కిలి ముదుసళ్లఁ దక్కఁ దక్కినవారిఁ బొలియింప శమనుండు పూనఁడయ్యె
వీచికాగ్రముల నవీనమణుల్ పూని నీరధి తటముల నిండ నించె

తే. శైత్యసౌరభ్యమాంద్యసంచారి యగుచు, గంధవహుఁ డెల్లప్రాణులగాసి మాన్పెఁ
బడినగింజల ననలెత్తి పండె ధరణి,రఘుకులోత్తంస మీ రేలు రాజ్యమునను. 318

సీ. సుతులు లేక కలంగుసుదతు లెక్కడ లేరు సుతవియోగముఁ జెందుసములు లేరు
పతులఁ బాసినకళావతు లెయ్యెడను లేరు పడఁతులఁ బాసినపతులు లేరు
దారిద్ర్యదుఃఖసంతప్తు లెందును లేరు కలిమి గర్వముఁ జెందుఖలులు లేరు
వ్యాధుల నాధుల వగచువారలు లేరు నింద లొందినవార లెందు లేరు

తే. లేరు జారులు చోరులు లేరు దుర్వి,చారు లగ్నిజలాహితృష్ణాక్షుదాది
వాతదుర్భిక్షభయు లైనవారు లేరు, రఘుకులోత్తంస మీ రేలురాజ్యమునను.

చ. క్రతువులు దానముల్ శ్రుతు లకల్మషచర్యలు దండనీతు లం
చితపశురక్ష పణ్యము కృషిక్రియలున్ ద్విజరాజవైశ్యసం

తతభజనంబునఁ గలిగి నాలుగువర్ణము లుల్లసిల్లుటఁ
గృతయుగముంబలెఁ జెలఁగెఁ ద్రేత రఘూత్తము యంచుఁ బల్కినన్. 320

క. ఆభరితమధురభాషల,చే భావము పల్లవింప సీతాంభోజా
క్షీభర్తకుండలద్యుతి, శోభిలుచెక్కుల స్మితంబుసొబగున నలరెన్. 321

క. ఈభంగి వెలయురాముని, వైభవకథ చదువుకొనిన వ్రాసిన వినినఁ
శోభిల్లుదు రాజను లమి,తాభిమతార్థములు గలిగి యవ్విభుకరుణన్. 322

ఆశ్వాసాంతము

ఉ. సారమహోజ్జ్వలజ్వలనసారవిభాసి విభాసితాంగశ్రీం
గారచరాచరాత్మకజగద్భరణాకరుణాకరాత్మ వం
దారుసుధీసుధీవిహారణక్రమదక్ష మదక్షపాచర
స్ఫారధరాధరాశనినిభా రవిరాజవిరాజవీక్షణా. 323

క. శంబరహారజనక జను, శ్శంబరమ్యగయాపుళింద సతతానందా
శంబరనిధిగృహ రిపుగిరి, శంబ రమాకలితవక్ష జలజదళాక్షా. 324

తోటకవృత్తము—

కురువిందనిభోజ్జ్వలకుందరదా,దర దారుణచక్రగదాభరణా
భరణాదరకీర్తివిభాస్వర భా,స్వర వాక్ప్రథమాంచితవర్ణమయా. 325

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామా యణంబను మహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీ మ దు త్త ర రా మా య ణ ము

## ష ష్ఠా శ్వా స ము

—:౦:—

క. శ్రీమహిళాత్మలలాటత
టీమృగమదసారసంఘటితరేఖావీ
థీముకురాయితజాంబవ
తీమానవతీకపోల ధీజనలోలా. 1

### వసంతకాలవర్ణనము

తే. అవధరింపుము రామచంద్రావనీశ, చంద్రుఁ డీభంగి విభవని స్తంద్రుఁ డగుచుఁ
బ్రజలనందఱఁ దాఁగన్నప్రజలకరణి, నరయుచును భూమిఁబాలించు నవసరమున.

ఉ. భాసిలెఁ జైత్రమాస మతిభాసురపల్లవభక్ష్యతుష్టకోకిల
గ్రాసము లోకజైత్రరతిరాజకరాగ్రవిరాజికింశుక
ప్రాసము కీరవాక్చకితపాంథజనశ్రవణాంతరాంగుళీ
న్యాసము కేసరాదిసుమనస్సముదంచితగంధవాసమై. 3

క. తనకంటె నుగ్రతేజం, బునఁ దనయుఁడు దక్షిణమునఁ బొదల నచట నేఁ
జన దత్యుగ్రత నిలువఁగ, ననినటువలె భానుఁ డుత్తరాశఁ జరించెన్. 4

సీ. తముఁ బ్రోది సేసినధాత్రికి లతకూన లర్పించువివిధవస్త్రాళు లనఁగ
మలయుఁగొమ్మల డాసి మలయానిలవిటుండు రహిఁ వీడ్చి వైచినరవిక లనఁగ
వనదేవతాగాత్రమునకు జైత్రుఁడు నించి కడఁగి రాలిచినచిక్కస మనంగ
సమయవాసవుఁ డగచ్ఛదచయచ్ఛేదనం బొనరింప ధర రాలుతునుక లనఁగఁ

తే. బయనములు వోవుపథికులపానములకుఁ, బరవుగనిపింపఁబఱవనిపఱవు లగుచుఁ
బండితరుశాఖికలనుండిపడినపండు, టాకుగుమి నిండుకొనియె వనాంతరముల. 5

సీ. అలవనీలామహిళలకుఁ జైత్రునియందు రహిఁ జెందురాగాంకురములగుమియొ
ప్రాంచితాగమసమాఖ్యశ్లాఘ్యజటిముఖ్యసమితి ధరించు పెంజడలగుంపొ
వనము దవాభిఖ్య వహియించుఁ గావున జనియించుకీలికాసముదయంబొ
మధువశంబునఁ దేజమాత్సేయ మరుఁ డుంచు సవిరహప్రారక్తశస్త్రచయమొ

తే. యిట్టులంబుగఁ గొమ్మలు గట్టుకొన్న, బెడఁగుచెంగావివలిపపావడలో యనఁగ
నలరుఁబోఁడులకరచరణాధరములఁ, దొగరుపొగడులఁ జిగిరించి చిగురు లలరె. 6

ఆ. అతనుశాస్త్రరీతి నతిశయింపఁగఁ గల, మేలిగుఱుల దొరసి బాళి మెఱసి
యభ్యసించెఁ గోకిలార్భకప్రకరంబు, శ్రుతిమనోహరైకసూక్తు లపుడు. 7

మ. వసుధాజంబు లగంబు లౌటచట శేవల్ గుల్కురత్నాళి నాఁ
గిసలశ్రేణి రహింపఁ గోయిలలు భక్షింపన్ వనీలక్ష్మి యీ
రస మూరన్ మఱియొండురత్నములవర్ణం బుంచె నేమో యనన్
బస రొందెన్ దలిరాకులన్ మరకతప్రత్యగ్రజాగ్రద్ద్యుతిన్. 8

సీ. పాదపంబులపేరిపాథోదములమీఁదఁ గనిపించునక్షత్రగణ మనంగ
నవమల్లికావసంతసమాగమంబున జనియించుపులకల చాలనంగ
వనమహాఖనిఁ బుట్టి యెనలేనిరుచులచేఁ గొమరొందుమగఱాలగుమి యనంగ
వనరాశి గానఁ బ్రవాళముల్ మును గల్గినటులఁ దోఁచినముక్తికాలి యనఁగ

తే. నలరువనదేవతలపల్లవాంఘ్రియుగము, లందుఁ జెలువొందుశితనఖబృందమనఁగ
మీఱె సారెకు మధుపకిశోరకములు, కోరికలు చెందఁ గోరకవారకంబు. 9

క. పద నెఱిఁగి చికిలి చేసిన, మదనునినునుదూపుతెగలు మధుఁ డిగుడులమేల్
పొదల నిడె ననఁగ మొగ్గల, గుదులు తలిరుకొమ్మలందు గుదికొని పొదలెన్.

సీ. నవ్యపరాగచందనచూర్ణపేటికల్ మదనసమ్మోహనమార్గణములు
కొదమతేఁటులు గన్నకోర్కులపంటలు వలిగాడ్పు మెచ్చువల్పులకొటారు
లామనిదొరతేనియలకణఁజంబులు వనలక్ష్మిసౌభాగ్యమునకు నెడలు
సకలదేవసపర్యలకు హేతువులు విరహివధూజనమ్ముల కెదురుచుక్క

తే. లఖిలవిషయాగ్రగణ్యంబు లనఁగఁ దగిన
యలరుగుంపులు గమకంబులై గుళుచ్ఛ
భావము వహించి యెడలేక బటువు లొంది
యలరెఁ గొమ్మలకుచములయందములను. 11

మ. రవముల్ సేయుచు భృంగకోకిలకిశోరశ్రేణి మూఁగన్ వియో
గవతీవారము దూరదూరముల కేఁగన్ గింశుకాదిప్రసూ
నవిశేషాంశుకసంగతిన్ రజ మసూనంబై రహింపంగఁ బు
ష్పవతీత్వంబు వనేందిరారమణికిన్ బ్రాపించె నయ్యామనిన్. 12

చ. సుమసమయాధిపున్ గలసి సొం పెసఁగంగ శలాటుసంతతిన్
గ్రమమునఁ గాంచె గర్భములు గైకొనినట్టుల మంజరీస్తనా
గ్రమిళితభృంగనీలిమ దగన్ దెలిపుప్పొడి నిండఁ దెల్లడా
లమర మరందఘర్మ మొలయన్ వెలసెన్ లతకూన లయ్యెడన్. 13

సీ. మఱున కర్పింప నామని సమకట్టిన పచ్చఱాబరిణెలబాగుఁ గాంచి
ఫలము లాశించి కొమ్మల నాశ్రయించిన రాచిల్కపల్కులరహి వహించి

ధరణిజాత్మజ తరూత్కరము నొక్కటఁ జూడ బహురూపముల నిల్చి భాతిమించి
లతికాంగనల వేడ్కలకుఁ బట్టుపచ్చ మేల్పట్టుబంతులఁగట్టు బైట నుంచి

తే. యసమనాయకజనకాభ నతిశయించి, పసిమి హెచ్చినపచ్చికపస నడంచి [గొ.
మసృణహరిదశ్వహరికాంతిమహిమ నొంచి, పసరుఛాయలకసుగాయ లెసక మొసఁ

క. తా నుద్యానగుఁ డౌటను, భానుఁడు ఛాయానిరూఢిఁ బాటించినయు
ద్యానంబున బహురూపము, లై నిలిచెనొ యనఁగ ఫలము లరుణిమ నలరెన్.

శా. సారంగప్రమదామహోన్నతి రహించన్ బల్లవశ్రేణికా
రారంజల్లతికాతతిద్యుతులు మీఱన్ గీరచంచూదిత
ద్వారస్ఫారఫలస్రవద్రసపయోధారల్ దగన్ శ్యామలా
కారశ్రీదళముల్ దనర్ప ఘనరేఖన్ మించె సాలౌఘముల్. 16

చ. లసితరసాలసాలకిసలగ్రసనవ్యసనానురాగభా
గ్రసనపికస్వరంబులు వికస్వరతన్ విని చొక్కి యింపునన్
మసలుచు ఖత్తులాణము ఘనత్వరఁ బోవక నిల్చినందునన్
శ్వసనుఁడు మందమందగమనంబు వనంబులఁ జెందె నామనిన్. 17

చ. హాళిహాళి నప్పు లిచ్చినక్రియన్ విరితేనియ లాను తేఁటులున్
మలయుచు దాఁచఁ బెట్టినక్రమంబునఁ బండ్లు గ్రసించుచిల్కలున్
దలకొని సంతరించినవిధంబునఁ గెంజిగురుల్ గ్రహించుకో
యిలలును గల్గి యామని రహించె మహీజనరంజనాకృతిన్. 18

తే. అట్టివాసంతవేళ రామావనీశ, మాళి మున్నీటిమొలసూళిమగువచూలి
బాళితోఁ గూడి వనపాళికేళిసలుప, నుల్లము జనింప రహిమించి యొక్కనాఁడు.

శ్రీరాముఁ డుద్యానవనమునకుఁ బోవుట

సీ. కలితాలికన్యస్తకస్తూరికాతిలకము ముఖలావణ్యకాంతిఁ దెలుప
నునుపాలకాయయొంటులు నవశ్రీ గెల్చు శ్రవణయుగ్మము కీర్తి నవధరింప
నవమల్లికాజైత్రనక్షత్రమాలిక హృదయస్థగుణపాలి నెఱుకపఱుప
మకుటకీలితవజ్రమణిరుచుల్ జనవీక్షణాళుల మల్లెల ట్లాసఁ గొల్ప

తే. మిసిమి బంగారుతళుకుల మేలిదుప్ప
టీచెఱంగులు లలితాంజనాచలముల
నలరునరుణాతపచ్ఛాయ నవలఁ ద్రోయ
రాముఁ డఖిలైక నయనాభిరాముఁ డయ్యె. 20

మ. పురకాంతామణు లాత్మరూపవిభవంబుల్ చూచి కందర్పగో
చరతన్ దత్తఱ మంద మందపవనాంచత్స్యందనారూఢుఁ డై
స్మరుఁ డిందిన్నుషఁ గూడి చైత్రుఁ దిలకింపన్ బోవుచందానఁ బు
ష్పరథం బెక్కి నిజావరోధసహితుం డై యంద ముప్పొంగఁగన్. 21

శా. ఘ్రాణానందకరాంగసౌరభము రంగత్కుంజరాగోపల
శ్రేణీధాగధగస్ఫురద్రదన మద్రిస్పర్ధిభూరిస్ఫుటా
రీణోరోజ మెసంగ మోహనకళారేఖామనోహారి యా
గాణిక్యం బిరువంకలన్ గదిసి శృంగారంబునన్ గొల్వఁగన్. 22

క. ఒకచో నటభటపరిహా, సకగాయకవైణికాదిచతురులు సుకవి
ప్రకరంబును గొలువఁగఁ దీ, వ్రకరాన్వయమణిపురోపవనమున కరిగెన్. 23

వ. ఇవ్విధంబునన్ దనవిలాసంబున కుచితంబైనమితపరిజనంబుతో నరిగి పురపరిఖాయితాయతోత్తుంగతరంగరవానుషంగ రంగద్భృంగ యుగయుగపద్విహారణోచిత పరాగవిసర కేసరయూథసరోరుహభాసురసరయూరోధంబునం బొదలు కదళీకరంజకవంజుళ హింజుళసరళవకుళ చందనహరిచందన పిచుమంద మందార మాకందకందరాళసింధువార తమాలతాలసాలహింతాల నారికేళపనసఖర్జూర జంబీర మధూకబంధూక శింశపాశోకకదంబ ప్రముఖతరుకదంబచ్ఛాయల సోయగంబై సాఁగి సొగలగు నేలకీతీఁగలతోఁ గలిసి బాగు మెఱయు మిరియంపుఁబొదల తుదలం బొసంగులవంగలతాకుడుంగంబులతో ననంగి పెనంగి యనుంగుల తెఱంగున రంగైనలుంగవల్లికల నల్లుకొని యల్లిబిల్లి యగు నాగవల్లికలజోకలఁ జేకొని మోకలగు పోఁకమ్రాఁకులతీఁగలబందున బొందినద్రాక్షపందిళ్లసందునన్ గ్రందుకొను రుద్రాక్షతరువుల తెరువులనిండికొన్న బండిగురిగింజదీఁగ చప్పరంబులచొప్పున నుప్పరంబు నంటు కప్పురంపుటనంటి గుప్పుమనన్ గప్పుతావ్రులకుఁ దావలం బగు తావుల తావుకొను గుజ్జులేమావ్రులపజ్జల నుజ్జీవించు గొజ్జంగి యారంబుల నంటు గోరంటలతో జంటఁ బాయని గెంటెనల నంటునంటులతో గెంటని గేదంగుల తెగలతో గుగులుకొను సగలు వాసనల డాసి వాసిఁ గన్న దాసనములయాసన్న సరణిఁ జెన్నుఁ బన్ను సన్నజాజులతో వన్నె కెక్కుహొన్నగన్నేరులన్ దొరలు సురపొన్న పుప్పొడిదుమారంపుఁ దిన్నెల చేరువన్ బొఱుపన్నిటికాలువలదరుల పొంత వంతుమీఱు చేమంతుల చెంతల నండగొన్న బొండుమల్లియలన్ గలిసి మొల్లంబులగు మొల్లలతావులఁ గొల్లలాడు భ్రమరదంపతుల యింపుసొంపులు దింపుసంపెంగలసంపదలకు నిరుగుపొరుగులై పాదుకొను విరవాదులయాదటఁ బ్రోదిగొను జాదులతోఁ దులఁదూఁగి కనుపట్టుకలుగొట్టుచెట్టులపట్టున నిట్టలంబుగాఁ బుట్టుమెట్ట కెందమ్ములకుఁ దోఁబుట్టువు లగు చెంగలువలచలువల నెట్టుకొను వట్టివేళ్ల కడలఁ బొగరుమీఱు కురువేరుసవురున గుభాళించు మరువంపువలవులతోఁ జెలిమి సలుపు నూదిమల్లెతీఁగల నాదుకొని పొగడన్ దగిన పొగడలఁ గడలుకొని ఘుమ్మను వాతపోతంబులచేఁ గదలు పారిజాతంబులకొమ్మల వ్రేలు జాలువాతూఁగుటుయ్యెలలకోళ్లఁ గీలుకొను రతనంబు మెఱుంగుల దుఱుంగ

లించుకృతకాచలకందరంబులఁ దిరమ్ములగు మందిరమ్ముల మెచ్చిచూడ వేడుక హెచ్చి జోడు గూడుకొని వచ్చి వైదూర్యగవాక్షంబులు చొచ్చిపోఁగూడ కళికి వెనుకచిక్కు చక్కనయ్యె చక్కెరదిండి తేజీలముక్కుల నెక్కసక్కెంబు లాడునక్కడిసరోజాతరాగధాతురాగంబులకు సరాగంబు లగు చిగురులపొగరున నెగరుకోయిలలపంచమస్వరంబులఁ గరంగు నెలఱాయరంగులఁ దొఱంగుజలధారాశీకరపరంపరలం గనుంగొని యంతరంగంబు లుప్పొంగ నటించునీలకంఠంబుల పింఛంబులయొప్పు తప్పకచూచి విప్పుగల కప్పుమొగులను దిగులునఁగొలంకులకెలంకుల నిలువఁ దలంకి చంచలించురాయంచలగరుదంచల ధాళధళ్యంబుల సమయచంచలాలతలసొంపు సంపాదింప నిలింపవనసంపదలఁ బొంపిరి వోవు నయ్యెలదోఁటఁ డాయం బోవునవసరంబున. 24

సీ. సవిధపంకజవనీచరమాణకలహంస గరుదంచలాంబు వర్షంబు గాఁగఁ
దనయంతఁ బరిసరంబునఁ దక్షిణమరాలు కమ్మక్రొవ్విరిచాలు కాన్క గాఁగ
నళికుటుంబముల రాయిడిఁ జేరువల జాజు నవపరాగంబు గందవడి గాఁగ
గాడ్పు సోఁకి చలించుకర్పూరకదళికాదళములు తాళవృంతములు గాఁగ
తే. శారికాకీరికాసముచ్చద్రుతంబు, వైదుషీభూషితోరుస్తవంబు గాఁగ
రమణనారామలక్ష్మియారామవిభునిఁ, బూజకావించుచందానఁ బొల్చె నపుడు.

చ. ప్రసవరజంబు గందవడి పైకెగఁ జల్లుచు భృంగఝంకృతిన్
బొసఁగ నుతింపుచున్ జలజపూగమరందకణావలీముద
శ్రుసమితితో నెదుర్కొనియె సొంపున గంధవహార్భకుండు దా
రసహితుఁడై చెలంగురఘురామునియుల్లము పల్లవింపఁగన్. 26

సీ. కలకలఁ బల్కుచిల్కలఁ గొల్కిఁ దమజాతి గాఁబోలు నని చిల్కకదుపు పొదువఁ
జెలికత్తెనెలుఁగెత్తి చీరుతొయ్యలిఁ దమకులమని కోయిలల్ గుంపుగూడ
వెడజాఱుకొప్పుతోఁ గడు మీఱువగలాఁడిఁ దమ వియ్యమని తేంట్లు తారసిల్ల
నటనతో నడచు చందనగంధిఁ దమబంధువని యంచబలగంబు వెనుకొనంగ
తే. శతసహస్రసఖీజనసహిత జనక, దుహిత గణికాసమూహంబు తొడరి గొలువ
ననుచరుల నెల్ల నట నిల్వ నానతిచ్చి, రాముఁ డభ్యంతరవనాంతరంబు సొచ్చె.

వ. అప్పుడు. 28

సీ. కుంభినీసుతగబ్బిగుబ్బపాలిండ్లతోఁ బ్రతియైన గజనిమ్మపండ్లు కొన్ని
జనకకన్యపిసాళిజళుకుకంకోయితో సరియైనమెట్టదామరలు కొన్ని
సీతాంబుజాతాక్షి చిఱునవ్వుచాయతో సవరైన విరిమల్లెసరులు కొన్ని
కోసలాత్మజపెద్దకోడలినెమ్మేని జిగిఁ బోలుమేలు సంపెఁగలు కొన్ని
తే. మైథిలీదేవిదంతసంపదల సొంపు, నకు సమంబైన కుందబృందములు కొన్ని
యేర్చికొని తెచ్చియినకులాధీశ్వరునకు, నెలమివనపాలకులు కాన్క యిచ్చుటయును.

## శ్రీరాముఁడు సీతాదేవితో నర్మోక్తు లాడుట

తే. అవి కటాక్షించియుడిగంపుటలరుబోండ్లు, చేకొనిన రాముఁ డావేళ సీతఁ జూచి
వనిత నీయంగములఁ బోలువస్తుసమితి, చేకొనక మాకు నిల్చునే చిత్తమనిన.

మ. దరహాసద్యుతి జిల్గువెన్నెలలచందం బొంది నెమ్మోముచం
దురునందున్ దులకింపఁగాఁ గలికి కాంతుం డాడునర్మోక్తికిన్
శిరమొక్కించుక వంచి క్రేవలఁ గటాక్షింపన్ దదీయాపరం
పరలే తూపులుగా మరుండు రఘురామస్వామి నేసెన్ వడిన్. 31

చ. అలికులవేణి లేనగ వొయారపుచూపులు ముద్దుమోము క్రొం
దళుకుకడానిబంగరపునక్కులచెక్కులఁ జెక్కుచెక్కులున్
పలుచనిమోవికెంజిగురుఁ బల్మఱుఁ జూడనె కాని తోఁటలోఁ
గలిగినవింత లెవ్వియును గన్గొన నొల్లఁడు రాముఁ డయ్యెడన్. 32

క. తరుణీతరుణాంగుళములు, కరమునఁ దెమలించి యహిమకరకులజశిఖా
భరణము తనువునఁ బులకలు, దొరయఁగ వనవీథిఁ బ్రియముతో విహరించెన్

వ. ఇత్తెఱంగున విహరించుచు నత్తరణికులగ్రామణి జనకకన్యామణితో నిట్లనియె.

సీ. ముదిత నీపదపద్మములఁ బోలనిచిగుళ్ళ పాలిఁ బికశ్రేణిపాలుఁ జేసి
బాల నీయవయవశ్రీలతోఁ బ్రతిగాని ప్రసవాలి యళిపంక్తిపాలుఁ జేసి
పద్మాక్షి నీమోవిపంటితో సరి రానిఫలరాజి శుకకోటిపాలుఁ జేసి
వనిత నీతావితో నెన గానిబహువిధపరిమళంబులు గాడ్పుపాలుఁ జేసి

తే. యుపవనశ్రీవధూటి నీయొప్పిదంబు, చిలుకపలుకుల నభినుతి సేయ సాగ
నవనిజవు గావునను సహజానురాగ, మవనిజావలి చూపెఁ బల్లవమిషమున. 35

మ. జళుకుం గన్నులఁ జెక్కుమున్ మధురభాషన్ గీరతుక్కారమున్
గలితభ్రూయుగళీవిలాసమున సింగాణిన్ గచశ్రేణికాం
తుల మార్వివిభవంబు జూఱగొనియున్ దోడ్తోడ నీబోటు లిం
దులఁ గంటే మరుతూపులన్ జిదుము నుద్యోగించి రబ్జాననా. 36

చ. కనుఁగొని పల్కు యంటి నగి కౌఁగిటఁ జేర్చి మొగంబుఁ జూపి మా
ర్కొని పద ముంచి పాడి ముఖగుంభిత మా రస మొల్కు చెట్టులన్
నన లొదవించి నీచెలు లొనర్చుప్రసూనవిరామ మివ్వనిన్
గనఁబడనీక నించితివి కామిని యెంతప్రవీణురాలివే. 37

సీ. గోరంట నెద నుంచి కొమ్మ యశోకంబు తన్నితి విది యేమి తప్పొనర్చె
సఖి గోఁగుతోడ ముచ్చటలాడి సురపొన్న నవ్వితి విది యేగుణంబు దప్పెఁ
గలికి ప్రేంకణముచెంగటఁ బాడి పొగడపై నుమిసితి విదియేదురుక్తులాడెఁ
జాన మామిడి నంటి సంపెంగకును మోము చక్కఁజూపవదేమి తక్కువయ్యెఁ

తే. దిలకభూజంబు కారుణ్యదృష్టిఁ జూచి, సింధువారంబు చెంగటఁ జేరి యుసురు
మంటి వది యేమియపరాధ మాచరించె,నువిద యీపక్షపాత హేతువుగణింపు.

సీ. ఈద్రాక్షఫలముల కెక్కుడో నీమోవి యీసారి చవిఁజూడనీవె చెలియ
యీమంజరులతోడ నీడేమొ నీచన్ను లింకొకపరి పట్టనీవె సకియ
యీయనఁటులకంటె హెచ్చొనో నీతొడ లీపారిపట్టనీవే లతాంగి
యీకప్పురపుఁజెల్వ కెనయు మిక్కుటమొ నీపల్కు లింకొకసారి పల్కు మతివ

తే. ముదిత యీలవలీదళంబులకు జోడొ, పెద్దయో తళ్కుచెక్కులి ముద్దులాడ
నీయవే యని సమవస్తువీక్షణమున, రాముఁ డవనిజఁ బల్కునారామమునను.

చ. అలవిరి తేనెపానకము లానెడి తేఁటు లదాటు రేపఁ జె
చ్చెర నలి రేఁగి ఝుంకృతులు సేయుచు డాయుచు మీఁద మూఁగినన్
వెఱచి కవుంగిలించుధరణీసుతి నక్కున నుంచి మోమునన్
జిఱునగ వంకురింప రఘుశేఖరుఁ డిష్టఫలాప్తి రంజిలున్. 40

ఉ. నాయక తావకీనశుభనామము నచ్చెలి పల్కఁ గంటినే
కోయిల పల్కకున్న దని కోమలి పల్కినఁ జాన దానఁ గా
దీమఁడ నీమలుంగు విని యీగతిఁ బల్కఁగ లేనిలజ్జ న
క్కోయిల మూకవృత్తిఁ గయికొన్న దనన్ రఘురాముఁ డొప్పఁగన్. 41

చ. భ్రమరసమూహ మల్లపుడు పైకొనినన్ హృదయేశ యేయుపా
యమునను బాఱఁ దోలితి వటంచు ధరాసుత వల్క రాముఁ డో
రమణి యుపాయ మేఁటి కిఁక రంగగునీనునుముక్కు చంపక
భ్రమ మొదవింపఁగా నవియ పాఱె నటంచును బల్కి వెండియున్. 42

చ. పరిసరచంపకప్రసవపంక్తుఁబుట్టిన వెట్టవాసనల్
గరళము లై పయిన్ బొరయఁ గాసిలి వచ్చుమదాళిసీపరం
పరలు భవత్పదాబ్జములపై నొలసెన్ దము నోంచుచంపకో
త్కరముల నీజిగిన్ గెలిచి కావఁగ దే యని మ్రొక్కు కైవడిన్. 43

ఆ. తేఁటు లానుపువ్వు తేనెవాఁగును బక్వ, ఫలరసస్రవంతి పైకగీతిఁ
దొరయుశశిశిలాంబుధునియుఁ ద్రివేణిగా,మగువ యిచట నుండుమాఘవుండు.

తే. ఇట్టలపుఁబువ్వుగుత్తులనట్టనడుమఁ, గలికి దులకించె దాడిమీఫలయుగంబు
కంటె కెంబట్టురవికఁ బిక్కటిల యుబ్బు, నీబలువుగబ్బిగుబ్బలనీటుఁ బూని. 45

తే. తరుణి కన్ వింత నీముఖదర్పణమునఁ
బ్రతిఫలించెను శుకదష్టపక్వబింబ
ఫల మనుచు భర్త భావగర్భముగఁ బల్క
ముదిత ముసిముసినగవుతో మొగము వాంచె. 46

చ. పొనపొన పొన్నగున్నపయిఁ బోటిరొ మల్లిక ప్రాకి మాటికిన్
మనువిరి తేనెఁ జిందుచు మనోహరభృంగరవం బెసంగ గా

లి నోరయుచున్ రతిన్ నినువలెన్ జెలువొందెడి నన్ను నల్గడల్
గనుచు లతాంగి నవ్వుచు మొగం బదిమెన్ బతిపేదురంబునన్. 47

మ. ఎదపై వ్రాలినబాల మై నదిమి పోసి కంగ ముప్పొంగఁగా
సుదతీ చిక్కితి వెందుఁ బోయెద వటంచున్ గంచుకంబున్ వద
ల్పఁ దొడంగన్ నికటంబునన్ జిలుకవల్కన్ గల్కిప ల్కించు జ
ళ్కొదవన్ బోవఁ గడంగుసీత నదె రామోర్వీశ్వరుం డయ్యెడన్. 48

ఉ. కోమలులన్ మనోహరులఁ గూర్పమనోజుని తేజి యయ్యు నా
రామశుకంబు విఘ్న మడరన్ బలికెన్ గలకంఠి దీనినిం
కేమణిముద్రఁ జూపి భ్రమయించెద నంచు స్వరత్నముద్ర శ్రీ
రాముఁడు చూప బింబ మని వ్రాలె శుకం బవనీజ మెచ్చఁగన్. 49

చ. శ్రీరఘువీరశేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కుచిల్క ముం
జే రహియింప సీతఁ గని చెల్వరొ నీయధరంబు బింబికా
శ్రీరస మొల్క రాచిలుక చేరెడు నంచునొ జిల్గునవ్వులన్
వారక మాటు సేసెదవు వంచన సేతురె యాశ్రయించినన్. 50

మ. హరినీలాలక చిల్క నీపలుకుతో డై యుండఁగా ముద్దుచ
క్కెర డైమెన్ దయసేసి పంపఁ గదె నీ కెంగేలఁ గీలించి నీ
సరసాలాపసుధారసం బయినఁ గాంతున్ గ్రోలఁగా నియ్యవే
తరితీ పేల యటంచు రాఘవుఁడు సీతన్ ముంచె రాగాంబుధిన్. 51

మ. తన తేజిన్ గ్రహియించినార మని కందర్పప్రభుం డల్కతో
మనపై నేసినతూపుచా లనఁగఁ గొమ్మా యల్లక్రొమ్మావిచా
యనె రాలెన్ విరిమోదుగుల్ పవనబాలాందోళనక్రీడలన్
గనుఁగొంటే యని తత్సమీపమునకున్ గాకుత్స్థుఁ డేఁగెన్ రహిన్. 52

వ. ఏఁగి తత్ప్రదేశంబున. 53

చ. కరమున మెట్టదమ్మివిరిఁ గైకొని రాఘవుఁ డందుకోవె సుం
దరి యని యాసఁ జూపి వనితామణి యించుక నిక్కి పాణిపం
కరుహము సాఁచినన్ బొడవుగా మఱియున్ గర మెత్తు బాహుమూ
లరుచులు జాఱుపయ్యెదఁ జెలంగుకుచంబులుఁ జూచు వేడుకన్. 54

సీ. నిగిడి నిక్కిన జాఱునీవి గన్గొనువాస వెలఁది కందనితీఁగ విరులఁ జూపు
వలువ యెత్తిన నూరువులు చూచుతమిఁ దలోదరికిఁ బన్ని రేటిదారిఁ జూపు
నళిపంక్తి కళికి కౌఁగిలి యిచ్చు ననుకోర్కెఁ బొలఁతికి విరిపువ్వుఁబొదలఁజూపు
బడలి పై నొఱగు నన్ బాళి నాతికిఁ గప్పురవుదిప్ప లొప్పునరంట్లు చూపు

తే. నధరబింబంబుపైఁ గాంతుఁ డడరుకలికి, చిలుక నదలించఁ జక్కెరల్ చిలుకుపలుకు
వినుప్రియంబున నెలమావివనులఁ జూపు, సీత కవ్వేళ రఘువీరశేఖరుండు. 55

మ. ఎలదీఁగన్ సుమకాంతుఁ జేరకు లతాంగీ తీఁగకున్ మేనికిన్
దెలియన్ రాదు విభేదమంచకొఱ కింతీ పోకుమా రాకపో
కల నీకంచకు వేఱులేదు చిలుకన్ గ్రన్నుంచకే చిల్కప
ల్కులో నీపల్కులో కాంచలేమనుచుఁ బల్కన్ రాముఁ డాయామెడన్. 56

ఉ. అంటితి వేమొ పుష్పవతియౌలతకూన నటైన నంటు న
న్నంటకు ముట్టుదాఁక నని యవ్వలి కేఁగిన సీత నవ్వుచున్
వెంటనె పూపొదల్ దిరిగి వేసర చెమ్మటఁ దొప్పదోఁగినన్
బంటవలంతియల్లుఁడు కృపానిధి కౌఁగిటఁ గ్రుచ్చె నంతటన్. 57

తే. అలరుపుప్పొడిదుమ్ముకుచ్చెలల నెఱయఁ, జెంతఁ దనుడాసి నడయాడుసీతఁజూచి
యధిపుఁ డౌనెరజోవతి వైతివనుచుఁ, బలికి విభ్రాంతి గనునంతఁ బరిహసించె.

వ. ఇవ్విధంబున వివిధవినోదంబులన్ దగిలి విహరించుచు విపులపరిమళమిళిత లలిత ప్రసూనవల్లరులు హరించుచున్ గమ్మవిరితేనియలు గ్రోలుచు రసానుభవోల్లాసంబున సోలుచుఁ జిమ్మచీఁకటులు గ్రమ్ముపువ్వుటీరంబులలోఁ దూఱుచు గొజ్జంగిపువ్వుసెజ్జలన్ జేరుచు డోలికాకేళికలన్ జొక్కుచుఁ గేళిశైలంబు లెక్కుచు నెలమావిక్రేవలనీడల నిలుచుచుఁ గల్కిచిల్కలన్ బిలుచుచుఁ గిసలయకుసుమలసితతరుశాఖ లూఁపుచు భ్రమరసముదయంబులన్ జోపుచు మత్తమయూరంబుల నదలించుచు మరాళదంపతుల బెదరించుచుఁ బన్నీటియేటికెలంకుల మెలంగుచుఁ గ్రొన్నెలజాలతిన్నెలపైఁ జెలంగుచుఁ బ్రణయ కలహంబులు పూనుచుఁ బ్రణతికల్పనలచే మానుచుఁ దరులతాదులకుఁ బరిణయంబు లాచరించుచు విచ్చలవిడిఁ జరించుచు సీతారాములారామకేళిన్ దేలి రయ్యవసరంబున. 59

క. తిలకించుచున్నపతిచూపుల కింపుగ మెలఁగుజనకపుత్త్రిక నెరితో
నలరించుచు నాయముతోఁ, జెలిగుంపు సుమాపచయము సేయుచు వేడ్కన్.

రగడ. అతివ మరుశరములకు నళిభటావళి కాపు
ప్రతి లేనివనసస్యపాళి కామని కాపు
పోఁకముడి వీడఁ జెలి పొగడ కేటికి నిక్కఁ
బోఁక ప్రాకులయొద్దిపొదచీఁకటికి నిక్కఁ
గలిగొట్టుచుట్టుఁ బొడగట్టిరదె చెలు లక్క
నెలచట్టుఁ గెంపయ్యె నీపాదములలక్కఁ
దళుకుజంగరువిరులు దాఁచినావఁటె మూల
నళు కేల బాలరుద్రాక్షతరువులమూల
నలివేణి చంగటనె యలరి కాచెను నిమ్మ

యేలమొల్ల లడుగ నియ్యవె కాని కానిమ్ము
ననలబదు లమ్మ నీనవ్వు లతలను ముంచెఁ
బనిఁ బూని చేమంతిబంతి నది ప్రియ ముంచెఁ
గలికి కను తేనెవాఁకల మించు నియ్యేలలు
తెలిగంటి మన కిచటఁ దీఁగలే యియ్యేలలు
తరుణి యీమల్లికకుఁ దగును సహకారంబు
వఱలుమంకెనవిరులె వని కలంకారంబు
కొమ్మ యిక్కడ బుగుల్కొనియె నేలాలతలు
నెమ్మి విను కలకంఠి నేర్చువాచాలతలు
మారేడుపంటికై మగువ కడుగో రేల
చేర రాఁగదె యిప్పచెంత నదిగో రేల
యింతి దివితో నొఱసె నిదిగొ హింతాళంబు
వింత విరవాది విరికేల కాంతాళంబు
మదవతులతావి గొనె మందవాతూలంబు
సుదతి కంటివె వృథాస్థూలంబు తూలంబు
మగువ పరుగెత్తకుమ మరువంపుతావులకు
ముగుద పోద మశోకములు వెలయుతావులకు
మెట్ట కెందొగవిరుల మెట్టకుమ లతకూన
వట్టివే రన నేల వంచెదవె లతకూన
పొలఁతి యది చన సాగెఁ బొనపొన్ననీడలకుఁ
జిలుకపలుకులు తఱుచు చేరినవి నీడలకుఁ
జెలియ కెంజిగురు కేల్ జిగురుసరి గిల్లకుము
తలఁప బలుమాఁకు గేడఁగికి రాగిల్లకుము
చెలియ దీనికిని దయసేయవే వదనంబు
నెలఁత కురువేరు వేణిని గన్నదవనంబు
పూఁచి మోదుగులీల బోటి దగె వారిజము
నీచరణములఛాయ నెగడె స్థలవారిజము
హారిణాక్షి జాజె నదె యవతంసకువలంబు
పరికించెద వదేమొ పలుమాఱు కువలంబు
వలుదయూడలజడల వఱలె జటిజాలములు
వలదు వెలఁగలకుఁగా వనిత యీజాలములు
లేమ బలువిరులఁ బొడలెడి దేవకాంచనము
నీమేనికాంతి యింతిరొ మించెఁ గాంచనము

మావి మును చేరితిమి మగువ మాదిఫలంబు
కావలసెనేనిఁ గొను కాన్క మాదిఫలంబు
కనకాంగి కనుగొంటె కర్పూరకదళములు
పెనుపొందెఁ గదలుచును బిప్పలై కదళములు
బెడఁగు కెంజాయఁ గనిపించెను గదంబములు
నడలె సఖినడల కివె హంసీకదంబములు
తనుమధ్య దగె నారదమున నీనఖరములు
ఘనకురంటకకంటకములు చాన ఖరములు
వెల్లియై తొఱఁగెఁ గురిసెందల మరందములు
చెల్ల విరులనె కనిరి చెలులు తమ రందములు
హేమాంగి నీకందు నేమొ యీలకుచములు
భూమిజకుఁ జెమరించెఁ బో కపోలకుచములు
తఱచైన విచట సుందరి కందరాళములు
కరవీంముల కేల గైకొనె దరాళములు
పువ్వుఁబోఁడి యేమిటికిఁ బోయె దుత్కళికలకు
నవలా యలరెఁ గేకినర్తనోత్కళికలకుఁ
బాటీరతరు లొరసి పదగదవె గణికలకు
బోటి మిక్కిలి యలఁత పుట్టెఁగదె గణికలకు. 61

క. అని సరసోక్తులఁ గమలాననలు నన ల్చిదిమి బడలి నగునెమ్మొగముల్
నునుఁజెక్కులుఁ జెమరింపఁగ, జనకజకడ నిల్చి రట్టిసమయమునందున్. 62

సీ. చిగురు లన్నియు హరించితి రింతె మీకరశ్రీలచే నైనఁ బోషింపుఁ డనుచుఁ
దతి తేనెలెల్లఁ గ్రోలితి రింతె మీవచోమధువైనఁ గరుణించి మనుపుఁ డనుచు
ఫలము లన్నియుఁ గొల్లఁబట్టితి రింతె మీబింబోష్ఠముల నైనఁ బెనుపుఁ డనుచు
గమ్మక్రొవ్విరులెల్లఁ గైకొంటి రింతె మీతావు లైన నొసంగి ప్రోవుఁ డనుచు
తే. వేఁడుకొనవచ్చుగతిఁ బికవితతి తేంట్లు, చిలుకగుంపులువలికరువలియుఁ గరము
ఖాధరాంగసుగంధాప్తి కనుసరింప, బడలి యాడాడ నిలిచిరి పడఁతు లవుడు.

చ. లలనలు శాఖలన్ బదములన్ బిగిచన్నులఁ గప్పుకొప్పులన్
బలుకులఁ బాటలన్ లతలఁ బల్లవగుచ్ఛమిళిందకీరకో
కిలముల నెప్పటట్ల కలిగించ వసేందిర మించెఁ బూర్వభం
గుల నవనీజయుక్తి మనుకొమ్మలచే వని సెగిఁ జెందునే. 64

చ. చెదరినముంగురుల్ తఱుచు చెమ్మటఁ దోఁగినతళ్కుఁజెక్కులున్
వదలినగప్పుఁగొప్పు వసివాడినమే నొకయింత జాఱుప
య్యెద యసియాడులేఁగవును నిట్టటుఁ దొట్రిలుపద్ద్వయంబుఁ బె
ల్లొదవెడియూర్పులున్ గలతలోదరిఁ గన్గొని రాముఁ డిట్లనున్. 65

చ. అలసితి విందుబింబముఖి యక్కట యంగము చెమ్మరించె గు
బ్బల రవి కేల మాన్పు కటిభార మిఁకన్ గయిదండ గొమ్ము నె
చ్చెలులును మేము నొక్కపరి సేసెద మేపని యైన నాడిగం
బులు గణియింపు మన్న పతి పో మరవంచిన బోఁటి యిట్లనున్. 66

చ. ఘనరసగుంభనంబు లెసఁగన్ భువనాధికరాగ మొప్ప మీ
రనుపమితామృతస్ఫురణ నాడితి రందున వేడ్కఁ జెందె నై
న నురువనౌఘపుష్పహరణంబునఁ బుట్టినశ్రాంతి బాయ నెం
చినయది మేఘపుష్పములు సీతరఘూత్తమ యంచుఁ దెల్పినన్. 67

ఆ. స్వామి నగుచుఁ జెలువ సరసులు గాంక్షింపఁ, బలుక నీవె నేర్తు పద్మనయన
గగనకుసుమమధ్యగామింప మేఘపు,ష్పమ్ము లఁడదె యనుచుఁ బలికికొనుచు. 68

క. వనితాసహస్రములు గొలు,వ నితాంతప్రేమ రామవసుధాపతి జ
వ్వనితో నవ్వనిలోపలఁ, జనియెన్ జలిగాడ్పు సెలఁగుచల్లనితోవన్. 69

క. చని ముందరఁ గనె నిందిర, ఘనమందిరముల కమందకలితమరందా
శనసంగు లైనభృంగుల, స్వనభంగుల రంగెసంగు జలజాకరమున్. 70

చ. కనుఁగొని రాఘవుండు వలిగాడ్పున రేఁగిన తేఁటిగుంపుస
ద్దునఁ దమి నిద్దురల్ విడిచి తోయజమండలి నంచ లార్వఁ బ
ర్వన తెలితెక్కచాలు జిగివెన్నెల లంచుఁ జలించుచక్రపం
క్తి నెగులు మాన్ప భానుఁ డరుదెంచెననన్ దరి నిల్చె వేడుకన్. 71

సీతారాముల జలక్రీడాభివర్ణనము

చ. జనకజఁ జూచి యాసరసి శైవలకేశిని పద్మకోరక
స్తని బిసబాహుకంబుగళ సైకతచారునితంబ మీనలో
చనయును గాన నీసకియచాడ్పున శ్రాంతి హరించె రాజహం
సనికరపక్షచామరజచందనశైత్యమరుత్పరంపరన్. 72

సీ. కలికి జక్కవలు నీవలిగుబ్బలకు నుబ్బి పఱతెంచెఁ బారువపట్టి నేమొ
వెలఁది తుమ్మెదలు నీవేనలి నీక్షించి యరుదెంచె గుఱుతెఱుకాయె నేమొ
చెలువ రాయంచ నీచిన్ని నెన్నడలకై మలసెఁ జుట్టఱికంబు దెలిసె నేమొ
చెలి జలేభములు నీచిలికితొడ ల్గూర్చి చెయ్యెత్తెఁ జెలిమి గాంక్షించె నేమొ

తే. పొలఁతి నీబెళ్కు వాలుచూపులకు మేని
తళుకులకు నోడి నునుబేడిసలు నివాళి
యిచ్చెఁ దమజాతిపెద్దలం జెఱఁగి యేమొ
యువిద సిరు లున్న బాంధవ్య మొదవు టెంత. 73

సీ. ఈయూర్మికలికమీఁద నీవు వినోదింప నామ్రేడితంబు లై యడరఁ గన్నె
యీకల్వలికమీఁద నీవు ద్రుంప గణింప విగళితమధువు లై నొగల కన్నె

యీయంచ లేఁకమీఁద నీవు పట్టఁ దలంపఁ దొలఁగి శైవలములఁ దూఱకున్న
యీతేఁటు లేఁకమీఁద నీవు రాయిడి సేయ సవిధకుంజములకు జరగకున్న

తే. యీరథాంగంబు లేఁకమీఁద నీవు దఱుమ, నెగసి కమలవనంబుల నీఁగకున్న
యీయనుకతిప్ప లేఁకమీఁద నీవుకొలను,సొచ్చినప్పుడె పెంపడి సోఁకకున్న. 74

క. శకులములకు దుమికెడులకు, ముకులగరుత్కలన నలినములపుష్పాడి జా
నకి యిచ్చట నెఱసెఁ దాఁగా, కకమల నీమీఁదఁ జల్లుగందవడి యనన్. 75

చ. సకి యకలంకతోయకణసంగతపద్మపలాశమన్యహ
ల్లకరుచు లొప్పెడిన్ గొలఁకులచ్చి నినున్ గని చెల్మి హెచ్చఁగా
మకరతపాత్రలో విమలముక్తికముల్ జత గూర్చి రత్నదీ
పకలన నిచ్చునారతులభావమునన్ గనుఁగొంటె యిచ్చటన్. 76

మ. చెలి యబ్జంబు భవన్ముఖాకృతి రహించెన్ గానఁ జం దబ్జుఁ డై
యలరె న్నీముఖవైరిన్ గువలయం బై తత్కళంకంబు నీ
తళుకుంగన్నులపోల్కి రేఁబగలు చెందన్ లేక విన్నందనం
బొలయుంగా నపకీర్తి మించె మధుపవ్యాహార్తిఁ గన్గొంటివే. 77

మ. అని వర్ణింపఁగ నంత జానకి వయస్యల్ రత్నపుస్నానముల్
మినుకుంబంగరుజిల్గుప్రాఁతపనుల్ మేలైనవల్వల్ సడ
ల్చి నునుంజంపరు కావిపావడలు బాళిన్ బూని కేల్దమ్ముల్
ఘనవక్షోరుహపాళి మాటుకొనుచున్ గాసారమున్ జొచ్చినన్. 78

సీ. పద్మాయతాక్షుల ప్రపదసంపదలచేఁ గూర్మల కొకవింతకొమరు గలిగెఁ
బడఁతులతళుకుపెందొడలచే జలదంతికరముల కొకవింతగరిమ గలిగెఁ
దరుణీమణులమేలితఱులచేఁ దఱుచైన తరఁగల కొకవింతయొఱపు గలిగెఁ
గిసలయాధరలపొక్కిళ్లచే వర్తులావర్తాళి కొకవింతవన్నె గలిగెఁ

తే. గోమలయూరుల నళులొందెఁ గ్రొత్తసిరులు
సఖులగుబ్బలఁ దులకించె జక్కవకవ
నతివలముఖద్యుతుల మించె నంబుజములు
సుదతులు క్రమంబునఁ గొలంకు సొచ్చునపుడు. 79

సీ. నీవు కొండొక యీఁదనేర్తువో నేరవో పొలఁతి లోఁతటు మించిపోకుమనుచు
నీఁతఁ నేర్తునటంచు నెఱుఁగవా నామీఁద నోలఁ బెట్టిటువో యెదుండుమనుచు
మనయుద్దిముద్దుగుమ్మను గొన్మ యదిముంచె నెందుబోయెడినొపోసికు మనుచు
వలదు రాకుము మించియలనాఁటినాథాటి యెలనాఁగ మఱచితివేమొ యనుచుఁ

తే. జెంతఁ జేరిన నీ వేమి సేయుదాన, వామె నీవట్టిపగ్గె లేలమ్మ యనుచు
సరససల్లాపములఁ గేలి సలిపి రంబు,జాకరంబునఁ బూర్ణచంద్రాస్య లపుడు. 80

సీ. మొగములు గానరా నిగిడి కామినులీఁదఁ గొలనెల్ల జంద్రమండలములయ్యెఁ
గుచములు గానరాఁ గొమ్మ లీఁద సరోవరంబెల్లఁ గిమలకోరకము లయ్యెఁ
గొమ్ముడుల్ గానరాఁ గొమిరె లీఁదఁగఁ దటాకంబెల్ల గాఢాంధకారమయ్యెఁ
బిరుదులు గానరా బిసరుహానన లీఁద దీర్ఘికాంతర మెల్ల దీవులయ్యె

తే. బాహువుల్ గానరాఁ బద్మపాణులీఁద, సరసి యెల్ల మృణాళైకసదనమయ్యె
నంగములు గానరాఁ గాంచనాంగు లీఁద, సారసాకర మెల్ల బంగారమయ్యె.

తే. కుచగిరులునీటితో రాయఁగొమ్మ యొకతె, మునిఁగి లేచిన నెమ్మోముముదము చెందె
శైలమథనంబునను దొల్లి పాలవెల్లి, జననమొందినపరిపూర్ణచంద్రుఁ దెగడి. 82

మ. జవరా లొక్కతె దొల్తఁ దన్ను సరసీజాతంబులన్ నొంచిన
ట్టివధూటిన్ మరలన్ బయోజములఁ దాటించఁగ నంకించి యం
బువులన్ దోఁచు నిజస్తనంబు లరుణాంభోజాతకోశంబులం
చు నెసన్ శాణులు చాఁపఁ జూచి నగి రచ్చో నున్నకన్యామణుల్. 83

మ. సరసిన్ దోఁచినముద్దరాండ్ర మొగముల్ సత్యంబుగా మించుతా
మరలంచున్ బరువెత్తఁ బోయెడు మదోన్మత్తద్విరేఫంబు లా
సరసీజాతములవాలుఁజూపులు సరోజాతాటవిన్ వాలినన్
బరపోలంబకదంబకంబు లనుచున్ బైనెత్తి పోకుండునే. 84

మ. కరియానామణు లూనుసంకుమదముల్ కాశ్మీరమున్ దావిక
స్తూరియున్ గంధము సంగ్రహించి యరిసందోహారుణాంభోజబం
భరహంసాదులగాసి కోరిచె సరగపద్మాఖ్యపద్మాక్షి యి
ద్ధరనాత్మీయధనంబు లెంచరు వినూత్నద్రవ్యవాంఛాపరుల్. 85

ఉ. ఆవనజేక్షణల్ జలవిహార మొనర్చుచు దర్ప మొంది యిం
దీవరపత్త్రభంగము లుదీర్ణత: జేయఁగ లూటి యేల యిం
దీవరపత్త్రభంగము నేఁ గొన నేరనె యంచుఁ దత్సర
శ్రీవిరుతిన్ వచించి యలచేఁ గొనె వారలపత్త్రభంగముల్. 86

వ. తత్సమయంబున. 87

ఉ. వారివిహారముల్ గని యవారితవారివిహారవాంఛ లోఁ
గూరిన సీత వేడ్క కనుకూలుఁడు గాన మెఱుంగుఁ బోలున
వ్వారిజగంధితో మొగలువైఖరిఁ గేళికి నర్హమైన యా
కారముతో ధరావరశిఖామణి గద్దియ డిగ్గ నయ్యెడన్. 88

సీ. ప్రతిలేని తనమోము పరిపూర్ణచంద్రబింబమొ యంచుఁ జక్రదంపతులు గలఁగ
ఘనమైన తనకొప్పు కాదంబినియొ యంచు రాజహంసకుటుంబరాజి బెగడఁ
గనరానితనకౌను కంఠీరవమొ యంచు జలకరేణుకరీంద్రసమితి దెమలఁ
దులకించుతనతనుద్యుతి సంపెఁగయొ యంచుఁ జంచరీకచయంబు చంచలింపఁ

తే. జరణకాంతులు సంజకెంజాయ లనుచుఁ, బద్మవనలక్ష్మి తల్లడపాటుఁ జెంద
హేళికులరాజసూళికెంగేలు వట్టి, కలికితలఁకున్న కొలఁకులోపలికి డిగ్గె. 89

క. డిగ్గినయగ్గజగామిని, నగ్గలికన్ సరసిలోని కధిపుఁడు తివియన్
బెగ్గడిలి కరయుగమ్మున, బిగ్గర మెడ కౌఁగిలించి బెఁగడఁగ నగుచున్. 90

ఉ. జానకిఁ జూచి యొక్కకలశంబు భరించినవార లెంతలోఁ
తైనను జొచ్చి యీఁదఁగ మృగాక్షి యురోరుహకుంభయుగ్మమున్
బూనియు నీటికిన్ వెఱచి పోయెద వంచు రఘూద్వహుండనం
గా నగియెన్ లతాంగి పతికాయమునన్ లతయై పెనంగుచున్. 91

చ. మొగముబిటారమున్ నుదుటిముంగురులున్ దళుకొందు చూపులున్
జిగిచనుదోయి చెమ్మగిలు చెక్కుల తేటలు ముద్దుమాటలున్
బెగడును నవ్వుఁ దత్తఱము వేడుకలున్ గలసీత చెయ్వులన్
దగిలి విభుండు లోఁబడెఁ దత్సరసిన్ విహరింప వచ్చుటల్. 92

సీ. పతిదీర్ఘబాహువుల్ పరికించుఁ బరికించి జలదంతిహస్తముల్ దెలియఁ జూచు
విభునికన్నుల తెల్వి వీక్షించు వీక్షించి తెలిదమ్మిరేకుల తెలివిఁ జూచుఁ
జెలువునిమైచాయఁ దిలకించుఁ దిలకించి నీలోత్పలంబులనీటుఁ జూచుఁ
బ్రాణేశుగళరేఖ భావించు భావించి శంఖసౌభాగ్యంబు సారెఁ జూచు

తే. నధిపుదరహాసచంద్రిక లరయు నరసి, సరసిజమరాళఖగగరుచ్ఛాయఁ జూచు
నపనియవయవములకు జోడౌనొ కాదొ, యనుతలంపునఁ గొలనిలో నవనికన్య.

సీ. తొడలబం టిటు రమ్ము జడియక యని యింత యంతలోతున నడయాడ నేర్పెఁ
జెలు లీఁదులాడఁ జూచితె యంచుఁ జేయిచ్చి యల్లనల్లన నీఁదులాడ నేర్పె
నలయుంచఁ బట్టి తెమ్మని కోర్కి రేచి నిబ్బరపుటీఁతల నీటఁ దిరుగ నేర్పె
బాణి బూనిన తమ్మి బల్మిఁ దాఁ గొనినైచి చనినఁ బోసి కంటిఁ గొనఁగ నేర్పె

తే. తొలుత నెలనాఁగఁ దనకరతోయధార, ముంచి కరవారిధారల ముంచ నేర్పె
శ్రీరఘుస్వామి యంభోవిహారవేళ, ధరణికన్యక కన్నిచందముల నేర్పె. 94

ఉ. అంచల నంచఁ బోలి కమలాటవి నిందిరఁ బోలి నాచుమ
బ్బంచుల మించుఁ బోలి తెర యన్ తెఱలో మణిపుత్త్రిఁ బోలి య
క్కాంచనగాత్రి రాఘవునికన్నుల కిం పొనరించుచున్ జలా
భ్యంచిత కేళిఁ దేలె సరసాళులు సమ్ముఖ మాశ్రయింపఁగన్. 95

తే. దశరథాత్మజుకరవారిధార ధారుణీకుమారికకుచులపై నెఱసి చెక్కు
లొరసి కణలీల మొగమానిమెఱసెముఖసు, ధాకరునిఁ గొల్వవచ్చినతారలనఁగ.

మ. అలివేణీమణి సీత యాత్మకరశోణాంభఃకణాసారపం
క్తులు కౌసుంభరసప్రవాహరుచి నెంతో మించెఁ గాంతల్ హాళా

ఁగాల్లి నెంచన్ బతి పాళి నించ రఘువీరాంచత్కుచశ్రీల న
జ్జలముల్ సేకొనెఁ బాకశాసనశిలాస్పర్ధిద్యుతిస్నిగ్ధతల్. 97

సీ. కొదమజక్కవగోటఁ గ్రుచ్చిన పద్మకోశము రేఖ కనుఁగొంటె సకియ యనుచు
బద్మినిపై నెక్కి భ్రమరంబు మధురసంబానుచందముఁ గంటె చాన యనుచు
జలదంతియావర్తసరణి హస్తాగ్రంబుఁ జొనిపినతెమి గంటె సుదతి యనుచు
నుత్పలిన్యుద్భాసితోర్మిడోలిక నంచ నిదురించువగఁ గంటె నెలఁత యనుచు

తే. ధ్వనులెసఁగఁబల్కుచును ఖగధ్వనులువినుచు, సీతతోఁగూడిరఘువీరశేఖరుండు
బాలలు స్వపక్షమున సీతపక్షమునను, జల్లుపోరాడఁ గనుఁగొంచు సరసిఁ దేలె.

క. తనతెగమగువలు రఘురా, ముని తెగ కామినుల ముంచి మించిన నగున
జ్జనకజసగవుల దీర్ఘిక, యనిమిషదీర్ఘికవిలాస మయ్యెడఁ గాంచెన్. 99

మ. తనకున్ దవ్వగుపద్మినిన్ వలచి సీతాదేవి ప్రార్థించినన్
మనువంశాగ్రణి యన్యకాంతను స్పృశింపన్ మా కనర్హంబు గై
కొను మీవే నినుఁ దెత్తు నాడ కనుచున్ క్షోణీజ బాహాంతరం
బునఁ బూనెన్ గమలావధూటి నెదపై ము న్నుంచుకొన్నట్టులన్. 100

ఉ. కామిని కేలుఁదమ్మికవ కమ్రపదాబ్జయుగంబు మోముకెం
దామర నేత్రపద్మము లుదగ్రకుచాంబుజకోరకంబులున్
రామనృపాలశేఖరు నురంబున మించెఁ బయోజమాలికా
శ్రీమహిమన్ గచద్యుతులు చెల్వెసఁగెన్ మధుపాళిపోలికన్. 101

ఉ. ఓలలు వెట్టి గెల్చినపయోరుహగంధిని బూన కుండినన్
బోల దటంచు నీతి గలభూపతి గావునఁ దానె పూనినాఁ
డే లలితాంగి మీరఘుకులేశ్వరుఁ డంచును సీతనెచ్చెలుల్
గేలి యొనర్ప రాముఁడు సఖీయుతుఁడై విహరించె నవ్వుచున్. 102

చ. కమలమరందబిందు వుదకంబునఁ జింది యమందచంద్రికా
క్రమమున మించె నేమి యిది కాంతుఁడ యంచు ధరాజ వేఁడినన్
రమణి సరోజలక్ష్మి మగడా తెలికమ్మలు నీకొసంగె వే
గమ కొను మంచు రాముఁ డవి గైకొన బోవఁగ నవ్వె బెట్టుగన్. 103

చ. చెలియలలోన నన్నగడు సేసెదవే రఘురామ యంచుఁ జెం
గలువ వధూటి భర్తమొదఁ గ్రమ్మగ వైచినఁ బోటులందఱున్
వలగొని తమ్మిపూవుల నవారణ ముంచిరి రాముఁ డందునన్
దలఁకినయట్లు చేరె వసుధాసుతమాటునకున్ సఖుల్ నగన్. 104

ఉ. తప్పు గణించి కాదొరలు దండన సేయుదు రొద్దివారి వా
తప్పున కల్గి మంది కలదాన నటంచును మారుతూపులన్
గుప్పితి వీవు నీచెలులఁ గూడి బళా యని మోము ద్రిప్పినన్
దప్పు సహింపు మంచు సతి నవ్వుచుఁ గౌఁగిలి యిచ్చె భర్తకున్. 105

ఉ. కోడెమిటారిగుబ్బకవ గుబ్బెత గుమ్మిన మున్ను చల్లుపో
రాడిన శ్రాంతి దీఱఁ బులకాంకురముల్ చెలువారఁ గుంజరీ
క్రీడల నుబ్బుహస్తిపతికిన్ బ్రతియై జలకేళిఁ దేలియున్
వేడుక వెల్లిఁ దేలె రఘువీరుఁడు మారుఁడు కేక వేయఁగన్. 106

వ. అప్పుడు. 107

సీ. అమృతనామము యథార్థముగను భరియించె ననిమిషాలోకాప్తి నధిగమించి
వార్యభిధానంబు వన్నె కెక్కఁగఁ బూనెఁ గరియానలవిలాసగతు లడంచి
క్షీరాహ్వయము సార్థమై రహించ వహించెఁ జెలులమందస్మితశ్రీల నొరసి
వనసమాఖ్యప్రశస్తవాచకంబుగఁ దాల్చెఁ గొమ్మలచిల్కపల్కులఁ జెలంగి

తే. కమలభావంబు నిక్కంబుగా ధరించె, లికుచకుచలకచాళిమేచకరుచి గొని
శరమనెడిపేరు నిజమంద బెరసిమెఱసె, సఖులతనువులనొరసి తత్సరసిజలము.

చ. అడరెడివేడ్కఁ నొండొరుల నంటినయప్పుడు కౌఁగిలించిన
ప్పుడు జనియించు సాత్త్వికపుఁబొల్పు తనూపులకాంకురంబులున్
గడల మెలంగుబోటులకుఁ గానఁగ నియ్యక నోలలాడి యె
క్కుడుతమి భూమికన్యయు రఘుప్రభుఁడున్ దనివొంది రయ్యెడన్. 109

చ. అవనిజచూపులున్ రవికులాగ్రణిపై జిగినల్లకల్వలున్
గువలయనేత్ర నవ్వులు రఘుప్రభుచూపులఁ దెల్లగల్వ లె
క్కువయయి నిండె నీట మును గోసినపువ్వులకంటె రెట్టిగా
నవుర వధూవరుల్ సరసి కర్పణ సేసి రసన్ జెలంగుచున్. 110

చ. సకులు పయోదమున్ గడచుచంచలలో యన వెల్వడంగ మ
ద్వికచపయోజహల్లకతతిన్ గొని కేళి యొనర్చి నీళ్లలో
మకరులఁ జేర్చి పోయెదరు మానిను లంచు సరోవరేందిరా
ముకురముఖీలలామ వెసమ్రోసె సహోర్మ్మిఖగస్వనంబునన్. 111

వ. ఇవ్విధంబున. 112

క. చెలువలు ముందుగ వెల్వడి, చలువలు చెలువలర గట్టి సకలాభరణం
బులు వరుసఁ దొడిగి విరులిడి, బలువుగఁ గ్రొమ్ముడులు పూని బాగొందు నెడన్.

సీ. స్తనగుళుచ్ఛంబుల స్వస్తికాకృతిహస్తకమ్రపల్లవములు గప్పికొనఁగ
వర్షుకాంబుదలీల వహియించుకచపాళి తటతరుస్థిత కేకిపటలిఁ బిలువ
వాఁగు తేఁటులు రాఁగ డాఁగెనా నంసాగ్రభాగంబున నితాస్యపద్మ మొదుఁగఁ
దడిసినజిలుఁగుతోఁ దళుకుతళ్కను మేనిమించు లక్కొలనెల్ల ముంచుకొనఁగ

తే. గానుగడగడవడఁకవ్రేకపుఁబిఱుందు, భారమున నెన్నడలు తొట్రువడఁ దటాక
మవనికన్యక వెలువడి యధిపుఁ గూడి, దరిని నిల్చిన సకియ లందఱును జేరి. 114

క. కొందఱు రఘుకులభర్తకుఁ, గొందఱు మిథిలాధినాథుకూఁతునకఁ త్యా
నందకరంబుగఁ గైసేయం దగి రిర్వురుఁ జతుర్విధాలంకృతులన్. 115

వ. అప్పుడు. 116

చ. తొలకరిమించుకెందొగలతోఁ గలతోయజతారహారకాం
తులఁ దగునవ్వుక్రొన్ననలతో నలతోరపుగుబ్బచన్నులన్
దొలఁకెడికొనుచంచలతతో లతతోఁ దగు మేనితావికిన్
దుల యగుకొప్పుగేదఁగులతోఁ గులతోయదవేణి మించినన్. 117

సీ. ఒప్పులొల్కెడితళ్కుఁగొప్పులోఁ దులకించుకమ్మగేఁదగిరేకు లెమ్మె గుల్క
వలిప పైఁ జాణిపావడమీఁద దగునిండుజిగిబురుసాచీర సొగసు మీఱఁ
బొసఁగుచంద్రపుబిళ్ల లొట్టుపైఁ గనుపట్టుతళుకుఁగస్తురిరేఖ సొలపు దెలుప
అవిశఁ బూన్చినలీల నవరొందు తెలిగంద మలఁదినచందంబు నందమెయ్య

తే. రత్న తాటంకములు బవిరలును బావి, లీలు ముత్యాలసరములు కీలుకడెము
లాదియగుసొమ్ము లంగంబు లాని యలరె, నని విభుఁడుసీతసింగారమభినుతించె.

## సీతారాము లుద్యానవనంబునందలి మేడపై విహరించుట

సీ. మొకమున వ్రాలుజానకివాలుఁజూపులు కస్తూరినామంబు గడలుకొనఁగఁ
బయికొన్నసీతనెమ్మెయిడాలు కటిబద్ధకనకాంశుకశ్రీలఁ గౌఁగిలింపఁ
దులకించుకులకాంతతళుకుఁ జెక్కులకాంతులురముగందపుఁబూఁతనొరసికొనంగఁ
గెలన మించుధరాజకెంపుజాబాగడలజిగి చెవిజవ్వాదిచెల్మి కలరఁ

తే. గదిసి నిలుచున్నసౌమిత్రివదినెగారి, జిలుఁగునవ్వులుమగజాలచిలుకతాళి
ననఁగిపెనఁగఁద్రిలోకమోహనవిలాస, ధాముఁడై మించెసీతాభిరాముఁ డపుడు.

చ. ఒఱపు వహించి జానకియు నున్న చెలుల్ గణికాశిరోమణుల్
పరిసరభూమిఁ గొల్వ నరపాలకుఁ డాసరసీతటంబునన్
గిఱికొనుగుజ్జుమామిడులక్రేవ జగాకురువిందతీఁగచ
ప్పరములనీడఁ జంద్రమణిబద్ధవితర్ది వసించి యున్నెడన్. 120

తే. అంబ కౌసల్యవనుపమహానసంబు, జనులుమానసమలరింపఁజాలుభక్ష్య [యును.
భోజ్యచోష్యాదికములుగవాజ్యదధులు, మెచ్చఁదగుమాంసశాకముల్ దెచ్చుట

సీ. వగవగకూరలు వరుగు లప్పడములు నోలుపుఁబప్పును మించుటోగిరములు
సద్యోఘృతంబులుఁ జక్కెర లుక్కెఱల్ పచ్చళ్లు గిచ్చళ్లు పాయసములుఁ
గలవంటకము లిడ్డెనలు వడ లప్పము లతిరసమ్ములు తేనియలు ఫలములు
గారెలు బూరెలు ఛాయలు మోరులుఁ గమ్మనిమాంసముల్ ఘుమ్ము మనుచు

తే. వలచుపానీయములు చెలుల్ వరుసఁ బసిఁడి, పాత్రలధరించి వడ్డింపఁ బాత్రులైన
సహచరుల బంతి నిడికొని జానకీల, తాంగితోఁగూడి రఘువీరుఁ డారగించె. 122

క. మధురసాసంభవములు గల, మధురపదార్థములచవుల మరగి రసన యా
న్మధురిమ సారెకుఁ బొగడఁగ, నధిపతి మఖలీల నలరె నశనము వేళన్. 123

క. పౌలోమిఁ గూడి యమృతము, గ్రోలెడిసురరాజుఁ బోలి క్షోణీసుతతోఁ,
గ్రోలె సుధారసధారలఁ, బోలినమాధ్వీకరసము భూవిభుఁ డెలమిన్. 124

మ. అవనీకన్యకఁ గూడి యిట్లు చతురాహారంబులన్ దృప్తుఁడై
యవనీశాగ్రణి కామినీకరమణివ్యాసంగభృంగారుకాం
బువులన్ ధౌతకరాననారుణపదాబ్జుండై నచో భూమిపు
త్రి వెసన్ బావడ యిచ్చి పైఁటఁ దడి యొత్తెన్ భర్తపాదాబ్జముల్. 125

ఉ. అట్టియెడన్ నృపాలుఁడు వనాంతరకేళినగాగ్రసీమఁ జూ
పట్టెడుకెంపుటుప్పరిగ శాలి గసుఁగొని చందుచట్టులన్
గట్టినమెట్టు లింతిపదకంజరుచిన్ విడికెంపుగుంపులన్
గట్టినమెట్టులై వెలయఁ గామినికేల్గొని యెక్కి యెక్కెడన్. 126

సీ. నిలువుటద్దములతోఁ దళతళల్ దొలిగ్రమ్ము ముమ్మూలజాముత్తెసుల నెసంగి
బలుగోడలఁ బొసంగునులిపచ్చపగడంపు గారుదూలంబులవార మాను
పులదిండిజాకంబములడాలుగరిమంబు లనుమెఱుంగులరంగు లునుచుపసిఁడి
ప్రతిమలరూప మేర్పడఁ దోఁచుశశికాంత జగతిపేరిటిగాగఘుసముదరికిఁ

తే. బచ్చిక బెడంగు లిడుమేటిపచ్చజాల, చికిలితిన్నెలముంగిళ్లఁ జెలఁగుచలువ
చప్పరముక్రేవ జలయంత్రజలకణంబు, లొలయవింతలుదిలకించి యుత్సహించి.

చ. విరితొగచందువాతెగలవేడుక యానడియంగణంబులోఁ
బరచినరత్నకంబళిని బాగుగ నూరెపుటంపుగద్దియన్
వఱలుమెఱుంగుబంగరపువన్నెజగాబురుసాతివాసిపై
ధరణిజతోఁ వసించెఁ బతి తళ్కుతలాడలఁ జేతు లూచుచున్. 128

129

వ. అప్పుడు.

సీ. నీలవేణి యొకర్తు నిలువుటద్దముఁ జూపెఁ గమలాస్యయొకతె బాగాలొసంగెఁ
గరియాన యొక్కతె కాళంజి ధరియించెఁ గీరవాణి యొకర్తు గిండి బూనెఁ
గలువకంటియొకర్తు చలువపావడవైచె సొగసులాఁడి యొకర్తు సురఁటి విసరెఁ
గలకంఠి యొక్కతె గైవార మొనరించె జవరా లొకర్తు హెచ్చరిక దెలిపె

తే. నతివ యొక్కతె బిరుదుపద్యములు చదివె, భామినియొకర్తు వడిబరాబరులొనర్చె
సీతవామాంకమున నుంచి చెలువుమించి, రవికులస్వామి కొలువున్న యవసరమున.

సీ. జంటముత్తెపు గుట్టుజంటరైకల నంటి బిగిగుబ్బచన్నులు పిక్కటిల్ల
మగరాలచికిలికమ్మలడాలు నిద్దంపుఁజెక్కుటద్దములతోఁ జెలిమి చేయ
ముకుళత్కరాంభోజములు నిటాలము లాని కుంతలాళికులంబు కూడికొనఁగ
దరహాసరుచిగాంగఝరి గీలుకొన వాలు గలలీల బెళ్కువాల్ గన్ను లలరఁ

తే. గోడమప్రాయంపు వెలయూండ్రగుంపు రామ
చంద్రునకుఁ గొల్వు మ్రొక్కులు సంఘటించి
యఖిలవిద్యాధికులతోడ నధివసించి
రధిపునసుమతి నర్తనస్థలాంతరముల. 131

క. మృదుపాకంబు రసస్థితి, పదగుంభన గలస్వక్లప్తపద్యశతంబుల్
చదివి యుపశ్లోకించిరి, మొదలఁ గవుల్ భానువంశముఖ్యుని గుణముల్. 132

మ. అధికాహ్లాదకరప్రభాకలితరాకాబ్జోదయోద్యత్సుధాం
బుధిజంఘాలతరంగఘుంఘుమరవోద్భూతిధ్వనిన్ వందిమా
గధు లత్యుద్భటఘోషవర్ణబిరుదాంకశ్లాఘ్యపద్యావళుల్
బుధు లౌరా యని మెచ్చఁగాఁ జదివి రాభూమీశ్వరాగ్రంబునన్. 133

చ. గవిసెన దీసి హొన్ను జిగికాయలు చన్నులఁ దాఁకఁ దంత్రులొ
క్కవరుస దీటి మెట్లు లొడికంబుగ నొత్తి స్వరంబు లన్నియున్
సవురు వహింపఁ దాళలయసంగతి గీతములున్ బ్రబంధముల్
బ్రవణత నొక్కలేమ నరపాలునకున్ వినిపించె వీణియన్. 134

చ. స్వరము లయారె మేలు శ్రుతి చాఁగురె మూర్ఛన కంపితంబు బా
పురె బళిరయ్య డాల్ మెఱసెఁ బో నెరమీటుకులంబు తాయి య
ద్దిర స్ఫురితంబు లమ్మ యని తేనియ లొల్కెడిజిల్గుపాటతోఁ
దరుణి విపంచి మీటె వసుధాపతి మెచ్చుకొనన్ రసజ్ఞతన్. 135

ఉ. తంబుర మీటి వేఱొకతె తానము లెంతయు విస్తరించి రా
గం బనురక్తి రాలు గరఁగన్ బలుమోటులు పల్లవింప న
య్యంబుజినీమనోహరకులాగ్రణిమీఁదిపదంబు పాడినన్
గ్రొంబులకల్ జనించె సభకున్ దలవాంచిరి వైణికాగ్రణుల్. 136

చ. దడముగ మర్దళధ్వనులుఁ దాళరవంబులుఁ బిక్కటిల్ల న
య్యెడఁ దెలిముత్తియంపుఁదెర యెత్త శరజ్జలదాళి పాసినన్
బడుబలుమించులో గవిసెనల్ దొలఁగించినఁ మించుమంచిపు
త్తడిజిగిబొమ్మలో యనఁగఁ దా రొగి వెల్వడి రంబుజాననల్. 137

ఉ. మంజుతరాంగభూషణసముచితకాంతులు రచ్చనేల మిం
చం జనుకట్టు లోబిగువు జక్కవగుబ్బలయుబ్బుఁ దెల్పఁ బ
త్కంజయుగంబు లుర్వి సమతన్ దులకించి విలాస మొంచఁ బు
ష్పాంజలు లిచ్చి యాడిరి మృగాయతనేత్రలు పెక్కుభంగులన్. 138

సీ. అభినయంబులు కోపు లరుదైనతీరువుల్ వెలయఁగా బదచాళివిధ మొకర్తు
బాగుమై సిరియుఁ బల్లటియు కత్త్రియు బెళ్కు విలసిల్లుజక్కిణివిధ మొకర్తు

బురకఁడు చంక బంగరుబుట్టి తగుజాతి వినికిఁగా గౌరవంజివిధ మెుకర్తు
శీవిఁ దాళము లుగ్గడింపుతోఁ దీరుచో వింతఁగా బేరణివిధ మెుకర్తు

తే. నలరి వినిపింపఁ బతి మెచ్చ నంత నేడ్వు
రుడువు రెనమండ్రుఁ బదియాఱుఁగుటను ముప్ప
దిద్ద ఱువదినలువురు హెచ్చుగాఁగ
బంతు లై వంతు లూని యయ్యింతులెల్ల. 139

సీ. అన్యోన్యహ స్తదండావృత్తు లెసఁగ నొండొరులసామ్ముఖ్యంబు లొంది యొంది
యీవలావల వచ్చి యితరేతరము దొ ల్త నిలిచిన నెలవుల నిలిచి నిలిచి
కంకణమంజీరకాంచికల్ మ్రోయ సవ్యాపసవ్యస్ఫూ ర్తి చూపి చూపి
తాళవాద్యరవానుకూలంబుగా మందద్రుతమృదుగతులను దిరిగి తిరిగి

తే. యనుపమరసోదయంబున నభినవాతి,చిత్రవ ర్తనభంగులఁ జెలఁగి చెలఁగి
విడివడినమన్మథోన్మదద్విరదము లన, సఖులు హాల్లీసకము సల్ప సంతసిల్లి. 140

తే. వారివారికళాగౌరవంబు లెల్ల, ధరణిజకుఁ దెల్పుచును దారతమ్య మెఱిఁగి
వలయుమణిభూషణాదులు వారి కొసఁగి, కొలువు సాలించి రఘువీరకుంజరుండు.

తే. ఇతనియిరుపార్శ్వముల నింక నిరువురొ నెడి
యమితకరదీపికాద్యుతుల్ తిమిర మడఁప
నేల తా నన్నపోలిక హేళి గ్రుంకఁ
జరమసంధ్యాక్రియలు దీర్చి జనవిభుండు. 142

సీ. కుంభస్థలోజ్జృంభికుంకుమారుణదీ ప్తి చరమసంధ్యారాగసామ్య మూన
నింగితో నొఱయునుత్తుంగాంగకముడాలు బలుచీఁకటులజోకఁ బరిఢవిల్ల
భూరిపుష్కరసముద్భూతశీకరపాళి తారాగణశ్రీలఁ జేరఁ బిల్వ
దంతద్వయాత్యంతధవళకాంతిసమృద్ధి వికచకై రవిణితో వియ్యమంద

తే. సమయసముచితమహితచిహ్నములఁ బూనిఁ
యమరుశత్రుంజయము తోడ ననుజమంత్రి
బంధుసామంతు లుపవనప్రాంతమునకు
వచ్చుట యెఱింగి స్త్రీయుక్తి వనము వెడలి. 143

సీతారాము లుద్యానవనంబుననుండి యయోధ్యఁ బ్రవేశించుట

సీ. నలువంకలను నిండి నవనభోమణికాంతి నెడలేక దివ్వటు లెసక మెసఁగ
బటహగోముఖశంఖపణవాదిబహువాద్యరవములు రోదోంతరముల నెఱయ
సకియలు గొల్వఁ బచ్చలపల్లకీ నెక్కి పంటతొయ్యలిపట్టి వెంట రాఁగ
నెలవంకవలె వంక నొలసి వింజామరల్ వేవేలగొడుగులు వేడ్క నెఱప

తే. భద్రకరి నెక్కి శ్రీరామభద్రమూర్తి
కోటిచంద్రులకళ లెల్ల గొల్లలాడి

తమ్ములార్యులు భటులు బాంధవులు హితులుఁ
జేరి కొలువంగఁ బురి బ్రవేశించె నపుడు. 144

చ. పలుమఱుఁ జూచుచుండియును భానుకులేంద్రునిరూపసంపదల్
దెలియఁగఁ జూచుచోఁ దనివి దీఱక పౌరవధూటు లిండ్లలోఁ
గలపను లన్నియున్ విడిచి కాంచనసౌధము లెక్కి తళ్కుఁజె
క్కులఁ జెఱుచెమ్మటల్ దొఱఁగఁ గోరిక మీఱఁగఁ జూచి రవ్విభున్. 145

ఉ. కోమలి యోర్తు మారువిరికోలల నేలెడువాలుఁజూపులన్
రామునిఁ జూడఁగాఁ బరిసరంబున నున్నలతాంగి యయ్యయో
యేమె వధూటి నీవు నెన రించుక యెంచవు వాఁడిచూపులన్
కోమలదేహుఁ డైన రఘుకుంజరుఁ జూతురఁటే యనున్ రహిన్. 146

తే. రాజసము మీఱఁ జనుదెంచి రాముఁజూచి
సాత్వికము నీవు పూనినచంద మేమి
తామసము సేయ కిది దెల్పు భామ యనుచుఁ
బ్రౌఢసఖి యోర్తు దనచెలిఁ బరిహసించె. 147

ఉ. జాఱిన పువ్వుదండ జడఁ జక్కఁగఁ జుట్టుక కొంత పాణిపం
కేరుహసీమఁ బూనుకొని శ్రీరఘురామునిఁ జూచె ముత్తెపున్
సోరణగండ్ల నోర్తు నినుఁ జూచిన నన్ను మరుండు నొంచెద
త్క్రూరసుమాంబకంబు లివిగో నని చూపఁగఁ దెచ్చెనో యనన్. 148

చ. ఒకరమణీశిరోమణి కుచోపరిసీమ వెలుంగుకెంపుఱా
చికిలిమెఱుంగుతాళి రఘుశేఖరురూపము గానుపింప ను
త్సుకమతి సారె గుబ్బచనుదోయినిఁ జేర్చుచునుండి యొద్దిబా
లిక నునుచెక్కులన్ బ్రతిఫలించినరామునిఁ జూచి జంకెనన్. 149

చ. చెలువ యొకర్తు బోటి తనసిబ్బెపుగుబ్బలఁ బత్త్రభంగముల్
వలనుగ వ్రాయుచుండి యిదె వచ్చె రఘూద్వహుఁ డన్న భ్రాంతిమై
బలుమఱు రామనామములె బంతులుగా లిఖియింప నగ్గతిన్
వెలువడెఁ బేరు సీది యని వీథిని భర్తకుఁ దెల్పెనో యనన్. 150

తే. అతివ యొక్కతె యత్తుంగహర్మ్య మెక్కి, రామచంద్రునిశృంగారరససుధాప్ర
వాహ మీఁతపరంపరవలనఁ గ్రోలి, తెప్పలార్పక యచ్చరయొప్పు దాల్చె. 151

ఉ. అందఱు లీలఁ జూడ యొకయంగన తానును వచ్చి రాజసం
క్రందనునంద మంతయు నెగాదిగఁ గన్గొని చొక్కి యట్టియా
నందమె యింద ఱొందెదరు నావలెనే యని యీసుఁ జెంద భూ
నందన కెట్టు లుండు నిఁక నాథుని నందఱుఁ జూచి చొక్కినన్. 152

153

వ. ఇవ్విధంబున.

సీ. రాకాసుధాకరశ్రీకి గీముగుమోము కళ లుట్టిపడ సారెఁ గాంచి కాంచి

యాజానులంబిబాహార్గళంబులు ప్రేమ నిగిడి తీఁగలు సాఁగఁ బొగడి పొగడి
కర్ణాంతదీర్ఘదృక్కంజాతయుగలౌల్య మిచ్చ నిచ్చలు హెచ్చ మెచ్చి మెచ్చి
బలుతల్పు నగునురస్స్థలముపై విఱివియౌ తమినిల్పి యేమేమొ తలఁచి తలఁచి

తే. మెఱుఁగునీలంపుజామన మేనిచాయఁ, గనివిమోహాంతమంబులో మునిఁగి మునిఁగి
కొమలులాజాక్షతోత్ఫుల్లకుసుమరాజిఁ, సేసలొలుకంగ మొగసాల చేరి విభుఁడు.

క. వేదండము డిగ భరతుఁడు, కైదండ యొసంగఁ బాదకమలంబులకున్
బాదుకలు దొడిగె లక్ష్మణుఁ, డాదట జలజాక్షు లిచ్చి రారతులు దగన్. 155

శా. శత్రుఘ్నుం డతిభక్తిఁ బాద్య మొసఁగన్ సౌమిత్రి పార్శ్వంబునన్
ఛత్రగ్రాహకుఁడై వసింప జగతీజామాత సంప్రీతుఁడై
మిత్రామాత్యసుహృద్భటాదికుల నెమ్మిన్ వీళ్లకున్ బుచ్చి భూ
పుత్రీరత్నవిచిత్రసౌధమునకున్ బోయెన్ సహస్తంబుగన్. 156

తే. పోయి యట వింత యనేకభూరిచంద్ర
కాంతగృహమున సోదర్యగణము నర్మ
సఖులు గొలువఁగ నొకజాము సరసగోష్ఠి
నెలమి వసియించి మఱి వారి నిండ్ల కనిచి. 157

వ. అయ్యుదాత్తగుణోత్తరుండు జానకీమత్తహంసగమనారిరంసాపరాయత్తచిత్తం
బునఁ దత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి కిలికించితవతీసమంచితకరాబ్జరార
జ్యల్లామజ్జకవ్యజనోజ్జాతశీతలవాతలహరీనివారితఘర్మవారియై యవారితకస్తూరి
కాసారకర్పూరశకలసముదయోదయభాస్కరప్రముఖప్రశస్తవస్తువులన్ గ్రమ్ము
కొని ఘుమ్మనుతమలంపుఁగమ్మతావుల కనుంగులగు నంగరాగవాసనల డాసిన
కైశికప్రసవమాలికాపరిమళంబులకునిండుకొనుగంటు తేఁటులదీటులనీటుగను మేటి
నీలంపుఱాలనిగనిగల నెగడుచికిలిలోపలిక్రేవల వ్రేలుజాళువాపంజరంబులచిలుక
పలుకులకు మాఱు పలుకుగోడువంకలవంకఁ జెలరేఁగి కవకవలు గొణుగుచుఁ
గెరలుబకదారులయూఁజంపుటెలుఁగుల నెఱుంగనీక మఱుఁగుచేయు మెఱుంగు
కెంపుటాసోరణగంటిచిఱుతతెమ్మెరసోఁకునన్ దనంత మొరయువిపంచికలతాన
ప్రపంచంబునన్ బ్రాణంబులు వచ్చెనో యన మెచ్చు సుప్పాణిముత్తియంపుఁ
గ్రచ్చుటోవరులఁ గ్రచ్చుకొని మచ్చెకంటులు కీలెఱింగి జంత్రంబులు గదలిం
చినన్ దనకు వీచోపులు వీచుకుఁదనంపుగీలుబొమ్మలమెమ్మెలకిమ్మగుచుఁ జూడఁ
జూడ వేడుక యగుచు నెగడుపైఁడిమేడ యెక్కి యక్కడ. 158

సీ. రతిఁ జొక్కి కేళీసీరమణిగుబ్బలమీఁద వ్రాలినవలరాచవానిసొగసు
కినిసి కీల్జడను గొట్టినరోహిణికి మ్రొక్కి మమతఁ జూపెడిచందమామవలపు
పౌరుషంబున మించి పౌలోమి నెద నుంచి యలరెడు వేల్పురాయనివిలాస
మధరంబు గ్రోలనిమ్మని రంభచుబుకంబుఁ బట్టి వేఁడుధనేంద్రుపట్టిహొయలు

తే. కలయవ్రాసినకళుకుగోడలమెఱుంగు
మేలుముత్యంపుఁదలుపులుఁ బూలచందు
వాతెగలు ధూపధూమంబువలపు లుదిరి
గిండ్లు మొదలుగఁ గలకేళిగృహమునందు. 159

సీ. కడవన్నెబొమ్మచెక్కడపుఁజొక్కపుఁ గోళ్లు పగడంపునికరంపుఁబట్టియలును
సరిలేనిమంచిగుజ్జరి నేఁతపట్టయుఁ బఱపైనరాయంచగఱులపఱుపు
పరవిరివిరవాదివిరులఁ బూన్చినపాన్పుపైఁ బఱచినవలిపంపువలువ
కొమరొందునేకరంగుమెఱుంగుతలగడల్ బలితంపుబురుకకాల్పట్టెబటువు

తే. లమరుమగటాలపనిచప్పరము మెఱుంగు
చాయబురుసాతెరయు రహించంగ మించు
పట్టెమంచంబుపై రామభద్రుఁ డున్న
యవసరంబున జనకకన్యాలలామ. 160

చ. తిలకపురంగుతో నలకదీప్తులు నెన్నుదురన్ నటింపఁగాఁ
గలపపుఁదావి నల్లడల గమ్మనఁగన్ సరిగంచు చెల్వకు
చ్చెల లపరంజిమెట్టియలు జీరఁగ నందెలు మ్రోయ సోయగం
బొలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తముచిత్తము తత్తఱింపఁగన్. 161

క. వచ్చి కపురంపుబాగా, లిచ్చి పిదప మడుపు లొసఁగి యింపగుసేవల్
మచ్చిక నొనర్పఁ జెలువుం, డచ్చెలువన్ గలసి మెలసి యానందించెన్. 162

వ. మఱియును. 163

సీ. బంధచాతుర్యసంబంధముల్ పణముగా ద్యూతకేళిప్రౌఢి దొరసి దొరసి
కలరవాదులకల్మి కనుటకు ఫలముగాఁ గడ లేనివేడ్కలఁ గలిసి కలిసి
యలరుపుక్కిటవిడియంబు లుంకువలుగా నధరామృతరసంబు లాని యాని
పరిరంభచుంబనస్ఫురణ లేకములుగా సొలపుతోఁ గళ లంటి చొక్కి చొక్కి

తే. సొగపుఁ జూపుల నొండొరుఁ జూచి చూచి
మెలపు లొలయంగఁ జతురిమల్ మెచ్చి మెచ్చి
పులక లెసఁగంగ మణిత మింపున విని విని
సతియుఁ బతియుఁ జెలంగిరి స్వైరగతుల. 164

చ. వలపులరాజువేడబమొ వారలయద్భుతమోహభార మో
తెలియదు నిచ్చలున్ దనివి దీఱనిముచ్చట లొసఁగెంతె లే
కలరెడికౌఁగిలింత లెడ లన్నది విన్నది లేనికూర్ములున్
గలఁకలు గానికూటములుఁ గల్గి రమించిరి మించి రివ్వపన్. 165

సీ. మరునిసమ్మోహనమంత్రాక్షరము లొండొరుల నొండొరులుపల్కుపలుకులెల్ల
నించువిల్తుఁడు ప్రయోగించు వాల్తూపులు సొలసియొండొరుఁజూచుచూపులెల్ల

నతనుకహ్లారహాస్యంబులయిక్కలు సొగసి యొండొరు లంటుచోటు లెల్ల
రతిమనోహరమనోరమఖేలనము లొండొరులు మేకొని తలంచుతలఁపు లెల్ల
తే. వారిచొక్కులు టెక్కులు వారివగలు, వారివన్నెలు చిన్నెలు వారిసటలు
వారిహారువులు మురువులు వారికళలు, వారివలపులు సొలవులువశమె పొగడ. 167

వ. మఱియును.

సీ. నెరసిననుదుటిముంగురులు చక్కఁగదువ్వి ప్రియముతోఁ గీల్కొప్పుఁ బెట్టునేర్పు
పన్నీట నెమ్మోముప్రక్షాళన మొనర్చి తీరుగాఁ దిలకంబు దిద్దుసొగసు
చిఱుచెమ్మటలు గ్రమ్మమెఱుఁగులేఁజెక్కులవలనుగా మకరికల్ వ్రాయుహొయలు
సరులు చిక్కులు దీర్చి జవ్వాజి కస్తూరి కులుకుగుబ్బలఁ బూయు కోడెతనము
తే. హెచ్చిమగఁటిమిఁ జూపుచో నొచ్చెనేమొ
యొత్తుదునె యంచు నంఘ్రిఁ గే లుంచు నెనరు
వెలఁది కొమ్మని పుక్కిట వీడె మిచ్చు
శాళి జవరాలిఁ గరఁగింప భర్త యలరె. 168

సీ. గళరవంబులు నేర్చి కలరవంబులు వల్కు సిగ్గుతో వెడమోముఁ జేర్చుహొయలు
చరణలాక్షముఖాంబుజమునఁగన్గొని నవ్వుచును మించుటద్దంబుఁజూపుసొగసు
కొసరుమాటలను బైకొన్న చిన్నెగణింపఁ గినుకతో నుదిరి జంకించువగలు
దొడనుంచి యంఘ్రి లొత్తుచుఁ జన్నుదోయిఁ గన్నుల జేర్చుకొని బాళి నలరు [మమత
తే. తమకమున మించి యే మేమి తప్పు లాచ
రించితినొ యన్నియును క్షమించు మనుచు
వినయమునఁ జంద్రముఖి మ్రొక్కి వేఁడుభక్తి
నృపతిచిత్తంబు గరఁగించె నిమిషమునను. 169

చ. చతురత వింతబంధముల సారెకుఁ గల్పన సేయుచున్ బునా
రతులఁ బెనంగుచున్ రతులరాయిడి నోలి నఖచ్ఛిదారద
క్షతములఁ గ్రమ్మఱన్ మెలవు గాంచుచుఁ గంతుఁడు పూనుసూత్రపుం
బ్రతిమలపోలికన్ దనర రాత్రి క్షణం బయి తోఁచె వారికిన్. 170

క. ఈలీల రేలు భూమిజ, నేలుచుఁ బగ లెల్ల భూమి నేలుచు ధర్మ
శ్రీలోలుం డై యేక, స్త్రీలోలుఁ డనఁగఁ బతి ప్రసిద్ధి వహించెన్. 171

172
వ. మఱియును.

సీ. ఘనలతాసుమధూళిఁ గదియు తేఁటులకేళిఁ దనరు కేళాకూళిదరులయందు
శారికాపికకీర సల్లాపములు మీఱ వల నొప్పుశృంగారవనములందుఁ
దెఱగంటిచెలిమంది నెఱచిత్తరులఁ జెంది రహిఁజెందు మణిమందిరములయందు
దపనీయరుచి బాలతపనాంశువుల నేలఁ జాలులీలాశైలసమితియందు
తే. నందమగు చందుఱాతిన్నెలందుఁ జంద్ర
శాలలందును దూఁగుటుయ్యాలలందు

మహితనయహిత యగుమహీదుహితఁ గూడి
యహరహంబును విహరించె మిహికులుఁడు. 173

క. శ్వశ్రూజనగురుభూసుర, శుశ్రూషాస్నిగ్ధగతుల శుద్ధవ్రతబ
ద్ధశ్రద్ధల బరిజనవృద్ధశ్రితరక్షణల సీత దగెఁ బతి యలరన్. 174

సీ. స్నానసంధ్యాహోమదానాదికృత్యంబు లర్హకాలములందె యాచరించి
యంబరాభరణమాల్యానులేపనముల సమయోచితస్ఫూర్తి సంగ్రహించి
భోజనపానతాంబూలాదికములు దేహానుగుణమ్ముగా నవధరించి
వ్యసనంబులందుఁ గేవలశక్తిఁ జెందక నవియును దగురీతి ననుసరించి

తే. జాతిచేష్టాగుణేంగితరీతు లెఱిఁగి
సీత నేలుచుఁ బ్రజల రక్షించుచును స
హోదరులఁ బ్రోచుచును దల్లు లుత్సహింప
వసుధఁ బాలించె రఘువంశవల్లభుండు. 175

క. పదివేలకోట్లయేఁడులు, వదలక ధర రాముఁ డేలవలె నని ప్రజ లె
ల్లఁ దలంప సీతఁ గూడుక, పదివేలేఁడులు సుఖించె బహుసౌఖ్యములన్. 176

చ. జనపతి యిట్లు సీతయెలజవ్వన మంతయుఁ గొల్లలాడుచున్
దినములు గొన్ని దాఁటఁగ రతిప్రియుఁ డస్త్రము పూని మాటఁగా
ననితరగర్భచిహ్న మచలాత్మజ దాలిచె రాజమౌళితో
ననిశముఁ గూడి తొల్లి యచలాత్మజ గర్భముఁ బూనుకైవడిన్. 177

సీతాదేవి గర్భంబుఁ దాల్చుట

సీ. కమ్మలమగజాలకాంతి గ్రమ్మెనో నాఁగఁ దళుకులేఁజెక్కు లఁ దెలుపు మించెఁ
బూసినకస్తూరిపోలుపు మించెనో నాఁగఁ గలికిచూచుకముల నలుపు మించె
రతికాంతు కృశ మహాతెఱుంగు దెల్పెనో నాఁగ నలిసిలవేణిదేహము కృశించె
వ్రేలుసీలపుతాళిడాలు ముంచెనో నాఁగఁ గరియానసూఁగారు గారుకొనియె

తే. బడలిక జనించె నూర్పుసందడి రహించె
నడుము గనిపించె మిగుల నెన్నడలు గాంచెఁ
జడిమ ప్రాపించెఁ జిట్టుముల్ సంభవించె
దౌహృదము జానకీదేవి దాల్చునపుడు. 178

తే. ఇటుల గర్భిణి యైన పూర్ణేందుబింబ
ముఖి యొకానొకనాఁ డాత్మసఖులు వింత
వగలఁ గైసేయ నప్సరోవనితఁ బోలి
పెచ్చి రహిఁ గాంతు చెంతకు వచ్చుటయును. 179

శా. ఆలోకించి దరస్మితం బెనయ రామాధీశుఁ డుప్పొంగి య
చ్చాలాలిన్ దొడమీఁద నుంచుకొని మించుంజెక్కు లేఁజెమ్మటల్

బాళిఁ బల్లవుఁ గోట మీటుచుఁ గుచోపర్యుల్లసత్తారహా
రాళుల్ చిక్కులు దీర్చుచుం బలికెఁ గాంతుం గర్ణనాకాంతుఁ డై. 180

మ. దరహాసద్యుతు లెప్పుడుం దొరయుటన్ దత్కాంతు లింపొందెనో
వరవీటీగతచంద్రఖండరుచిపై వ్యాపించెనో చంద్రకాం
తరమున్ గెల్చినకీర్తి నిల్చెనొ యనన్ దళ్కొందె నీచెక్కులన్
దరుణీ పాండిమ తారహారముకురోదారప్రభల్ మీఱఁగన్, 181

మ. స్తనశృంగారరసంబు చూచుకసముద్యచ్ఛ్రీలిమన్ గానిపిం
చి నవీనంబగు పూఁత కస్తురిరుచిన్ జెల్వొంది పైనిండి జా
ఱినతద్ధారయొ నాఁగఁ దార్కొని మిటారించెన్ భవద్రోమరా
జి నిరూఢాంగకదీప్తిఁ దోఁచుజడ యా సిద్ధంబనన్ జూపరుల్. 182

క. గడుసువలిగబ్బిగుబ్బల, బెడిదపుభారమున జడిసి పేదతనముతోఁ
వడఁకెడినీనడుమున కి, య్యెడ గర్భసమృద్ధి యభయ మిచ్చెఁ గద చెలీ. 183

క. సోముని గెల్చిన నీనగు, మోము ధరాదేవి మెచ్చి ముద్దిడుకొనెనో
కామిని యది కాదేనియు, నీమొగమున మంటితావి యేమిటి కొదవెన్. 184

చ. జడగతిఁ బాదముల్ గనినచాడ్పున వాల్పుమిటారిచూపులన్
బడలిక మబ్బు పైకొనినభాగున మోమునఁ బాండురద్యుతుల్
సుడిసినలీల మంటిచవిచొక్కురసజ్ఞ వహించునట్టు లీ
యెడఁద మతేమి డై యొకటియిచ్చ జనించినఁ దెల్పవే చెలీ. 185

క. పత్నికుల మలర నంత, ర్వత్నియయిన చిన్నె లెఱిఁగి వాంఛిత మేమో
నూత్నముగ నడిగి మగఁ డది, యత్నంబునఁ జేయవలయు నతివరో యనుచున్.

ఉ. మాటలఁ దాటకాంతకుఁడు మాటికిఁ దేనియ లొల్క వేఁడినన్
బాటలగంధి సిగ్గు ప్రతిభాషితచాతురి నడ్డగింపఁగా
గాటపుఁగాంక్ష యన్తరువుకత్తె మదిన్ ద్వరసేయ నల్లనన్
మీటిన మ్రోయువీణవలె మించునెలుంగున భర్తతో ననున్. 187

సీతాదేవి యరణ్యంబున మునిపత్నులతో మెలఁగఁ గోరుట

శా. సారంగీశిశుకోటిదప్పి పులి దీర్పన్ సింహపోతశ్రమం
బాఱన్ దంతికరాంబువుల్ నిగుడఁజేయన్ మించుభాగీరథీ
తీరారణ్యములన్ వసించుమునిపత్నీశ్రేణితోడన్ ఫలా
హారంబుల్ గొని యొక్కనాఁడు మెలఁగన్ బ్రాణేశ వాంఛించెదన్. 188

ఉ. నా విని సమ్మతించి రఘునాయకుఁ డాసతి నాదరింపుచున్
నీవు దలంచినట్ల తరుణీమణి రేపటి రేపటంతటన్
బావనగాంగభూములకుఁ బంపెద నంచు మెఱుంగుఁజెక్కు లిం
పావహిలంగ ముద్దుగొని యాయమ లోపలి కన్పి పిమ్మటన్. 189

సీ. అడపంబుచోటివాఁ డెడఁబాయ కెడనెడ మడిచిన తెలనాకుమడుపు లొసఁగ
జీరాడుదుప్పటిచెఱఁగు చేఁబూని వెంబడి గిండికొనివచ్చు బుడుతఁ డొదుఁగ
ద్వారపాలకులు తత్తఱముతో వడి లేచి ముకుళితహస్తులై మ్రొక్కు లిడఁగ
జనులసందడి నెదుర్పడిన దాసీదాస జనములు జడిసి పార్శ్వముల కొదుఁగఁ

తే. గటికవారును దగునూడిగములవార
లవసరంబున నియ్యోగు లాడనాడఁ
బొడగని యథోచితాకృతుల్ వారసి కొలువ
మధ్యకక్ష్యాంతరము చేరి మనుజవిభుఁడు. 190

తే. లలితనవరత్నపీఠ మలంకరించి
మంత్రిబంధుహితాప్తసామంతవరులు
భద్రమధుమత్తకాశ్యపప్రముఖనర్మ
సఖులు గొలువంగఁ గొలువుండి సంతసమున. 191

సీ. శ్రుతులు శాస్త్రంబులు స్మృతులావరించి విద్వజ్జనుల్ సేయువాదములు వినుచుఁ
బ్రౌఢోక్తు లలరఁ బౌరాణికుల్ వినిపించు వివిధపురాణార్థవితతి వినుచు
నవరసాలంకారనైపుణంబుల మహాకథకులు గణియించు కథలు వినుచు
జాతీయమేర్పడ సరసభంగులఁ బరిహాసకుల్ దెలుపుహాస్యములు వినుచు

ఆ. గొంతప్రొద్దుఁ బుచ్చుకొని కొలిచినవారి, నెల్లఁ బనిచి వలయుహితులు గొల్వఁ
దగినరీతిఁ గొంత తడవుండి హితగోష్ఠి, భద్రుఁ జూచి రామభద్రుఁ డనియె.

ఉ. వింతలు భూమి నేమయిన వింటివె పౌరులు నన్నుఁ గూర్చి నిం
దింతురొ యెంతురో తెలిసితే జననీగురుసోదరాదులే
కాంతమునందు నే మనుచు నాడుదురో వినకుందువోటు వి
న్నంతయు నీవు దాఁపక యథార్థముగా వివరింపు నావుడున్. 193

మ. కరముల్ మోడ్చి వినీతి భద్రుఁ డనియెన్ గాకుత్స్థవంశేంద్ర నీ
చరితంబుల్ పదివేళనోళ్లఁ బ్రజ లెంచన్ వింటి నే నెందులన్
గుహునాజ్ఞన్ వని సంచరించి లవణాకూపారమున్ గట్టి యా
సురులన్ గొట్టినచర్య లెంచ కివి యొచ్చో నైన నిందింతురే. 194

చ. నరులకు శక్యమే యని మొనన్ ఖరదూషణముఖ్యరాక్షసే
శ్వరుల జయింప వాలి నడఁపన్ గపివర్యులచేఁ బనుల్ గొనన్
బరమశరాగ్రబిందువుగ బల్కడలిన్ ఘటియింప నీతఁ డా
హరియొ హరుండొ యంచు జనులాడఁగ విందు నరేంద్ర నావుడున్. 195

చ. ఎలనగ వంకురింప ధరణీశుఁడు గ్రమ్మఱ బల్కె భద్ర నీ
పలు కిది నిక్క మౌ నయినఁ బౌరులు భూమిజనుల్ శుభాశుభో

క్తుల వచియించు చోట ననుఁ గూరిచి జానకిఁ గూర్చి నిందలన్
బలుకకపోవ రత్తె అఁ గబద్ధము లాడక తెల్పుమీ యనన్. 196

భద్రుండు పౌరులాడు నిందావాక్యముల రామభద్రునకుఁ జెల్పుట

శా. ఆభద్రుండు వినమ్రుఁడై పలికె దేవా నీవు పల్మాఱు న
న్నీభంగిన్ నిజమేమొ చెప్పు మనినన్ హీనాత్మకుల్ పల్కుప
ల్కేఁ భావ్యం బని విన్నవింతు నది మీ కేలా వినన్ మూర్ఖులై
యేభూపాలురఁ మెచ్చి రీనరులు వీ రేపాటి పాటింపఁగన్. 197

సీ. కరుణ గల్గినరాజకంఠీరవునిఁ గన్న మెత్తనివాఁ డంచు మెచ్చ రతని
దురుసువందనలకోర్ ధర యేలుదొరఁ గన్న హింసాపరుం డని యెంచ రతని
ధైర్యసంపన్నుఁడౌ ధరణీశ్వరునిఁ గన్న కఠినచిత్తుం డని కదియ రతని
సుజనులఁ బ్రోచు భూభుజునిఁ గన్నను బక్షపాతి యం చలఁతిఁగా జూతు రతని

ఆ. నేవివేకవంతు లే మెఱుంగుదు రట్టి, యెఱుక లేనిజనుల సరకు సేసి
మొఱకుపలుకు వినెడికొఱకు మేకొనఁగ దేవ, వంకుఁ దగునె యాజివరకుమార.

క. ఐన జను లాడుకొనియెడి, నానోక్తులు వినఁ దలంచి నన్నడిగినమీ
యానకు వెఱచి గణించెద, భానుకులాధీశ వినుము పౌరులపలుకుల్. 199

సీ. ఏకళంకము లేని యిక్ష్వాకుకులమున సంభవించియు రామచంద్రుఁ డకట
తొడమీఁద నిడుకొని దోషాచరాగ్రణి యెత్తుక చని లంక నేఁడుకాల
ముంచిన యిల్లాలి నించుక కొంచక మరలఁ దాఁగొనివచ్చి మరులు హెచ్చి
యెబ్బెఱికము లేక యేలుచు నున్నాఁడు చెఱకువిల్కానికిఁ జిక్కినాఁడు

తే. పగతు రేకాంతలను జెఱ పట్టికొన్న, బలిమి విడిపించికొని తెచ్చి కలియవచ్చుఁ
బ్రజకు రాజానుమతమె ధర్మంబుగాదె, యనుచు గుమికూడిపలికెదరవనిజనులు.

చ. విని విని నేను వేసరితి వీథుల వీథుల నిట్టి మాటలే
యనుకొనువార లూరఁ దఱచజ్ఞులనోరులు మూయ వచ్చునే
యినకులనాథ వారి నిఁక నేమనఁ గూడు నటంచుఁ దెల్పినన్
విని శితశూలముల్ చెవుల వ్రేసినలా గయి జాలిఁ జెందుచున్. 201

ఆ. అధిపుఁ డొద్ద నున్న యాప్తులఁ గనుఁగొని, యీవిధంబు మీరు నెఱిఁగియుంటు
దురె యటన్న వారు శిరములు వంచుచు, స్వామి యేమి దెలుపువార మనిరి.

చ. ఎడఁద గలంగ రాముఁ డొకయించుక సేపు మతేమిమాటయున్
నొడువక పాన మూని వెత నూల్కొన నివ్వెఱఁ గంది యంత న
క్కడఁ గలయాప్తులన్ బనిచి కంచుకి నొక్కనిఁ జేరఁ బిల్చి యి
క్కడకు మదీయసోదరుల గ్రక్కునఁ దోడ్కొని రమ్ము పొమ్మనన్. 203

తే. వాఁడునతిశీఘ్రచారియై వారివారి, గృహములకుఁబోయి రామభూమీశ్వరాజ్ఞ
యెఱుక చేసినభరతాదులిపుడు పిల్చు, టేమొ యని యాత్మనంబున నేగుదెంచి.

సీ. ఉస్సని నిగిడించునూర్పులబలువేఁడి నించి కెమ్మోవి వాడించువాని
నడఁగక యడరెడునశ్రుధారల నడ్డగించి చెప్పల నప్పళించువాని
నాశ్చర్యరసమగ్న మగు మానసంబుతో నుడుక చేష్టలు దక్కియున్నవాని
వెలవెలనై చాల వెడనవ్వు వహియించి మిడిపెంబు దఱిగినమోమువాని

తే. దైన్య మాకార మయినచందమున నున్న
వానిఁ దమయన్నఁ గనుఁగొని వారు వెఱఁగు
పడి భయంపడి తొక్కటపడి కటకట
పడి దిగుల్పడి వడఁకుచు భక్తిఁ జేరి. 205

ఉ. ఏమిటి కింతవంత వహియించినవాఁడొ నృపాలుఁ డీవిధం
బేమియొ యెవ్వ రేమి గణియించిరొ యీవెత యెట్లు దీఱునో
స్వామి కటంచుఁ జింతిలుచు సాఁగిలి మ్రొక్కినకూర్మితమ్ములన్
రాముఁడు ప్రేమ మీఱఁగఁ గరంబుల గ్రుచ్చి కవుంగిలించుచున్. 206

తే. చెంత నందఱ నిడుకొని చేరెఁజేసి, కన్నులను గ్రమ్ముకన్నీరు కరతలమున
నప్పళించుచు గాద్గద్యమడంచి యెప్పు, డెలుఁగు నూల్కొల్పి వారల కిట్టులనియె.

—రామభద్రుండు భద్రుండు చెప్పిన పౌరవాక్యంబులఁ దమ్ముల కెఱింగించుట—

మ. అనుజుల్ చూచితివృత్తిఁ బూనియును నాయర్థంబుఁ బ్రాణంబు నా
యనుఁగుంజుట్టము లాప్తులున్ సఖులు మీరై రాజ్యధౌరేయుఁ గా
నను మీరే యొనరించి కొల్తు రటు గానన్ బూనఁ బో నెద్ది యై
నను మీతో నన కిప్పు డజ్ఞ లనునిందావాక్యముల్ వింటిరే. 208

క. అనిన నిది యేమి నిందయొ, మనుకులపతి యెన్నఁ డిట్టిమాటాడఁడు తెం
పున ననియొండొరు మొగములు, గనుచున్ దిగులొందివినఁగఁగాఁకుత్స్థుఁ డనున్.

చ. చెఱగొనిపోయి యాత్మపురిఁ జేర్చి దశాననుఁ డాసరేఁగి గీ
ద్పఱిచిన సీతఁ దెచ్చుకొని భావజుత్రిక్కుల కొగ్గి యెగ్గు సి
గ్గెఱుఁగక కూడినాఁ డినకులేశ్వరుఁ డక్కట క్షత్త్రధర్మముల్
మఱచెనొ యంచు నన్నుఁ బ్రజ మాటికి దూఱెడి నేమి దెల్పుదున్. 210

చ. పరుఁ డిపు డేవధూటిఁ జెఱపట్టిన వాని వధించి సాధ్వి యీ
తరుణి యటంచు జేకొనుట ధర్మువుగా వగ నెంచె రాఘవే
శ్వరుఁ డిఁక నేల శంక యని జ్ఞాజను లాడెడిమాట లమ్ము లై
యురువడి గుండెలో మెఱమెచున్నవి సోదరులార యియ్యెడన్. 211

వ. అని తన్ను నుద్దేశించి బుద్ధిలేనిజను లాడుకొనునుద్దులు గొన్నితద్దయు వగపుతో
నొద్దనున్న తమ్ముల కెఱింగించి యద్దశరథుని పెద్దకొడుకు తుందుడుకుమెండుకొన
వెండియు లక్ష్మణున్ గనుంగొని యి ట్లనియె. 212

మ. అప్పుఁ గా లక్ష్మణ మున్నెలంకనె సమస్తాదిత్యులున్ రుద్రులున్
భవనీశేజభవాదులున్ మునులు దిక్పాలుర్విలోకింపఁగా
నవనీకన్యక నేను నొల్లక మహోగ్రాగ్నిన్ బ్రవేశింపు మ
న్నవిధంబున్ సతి వహ్నిఁ జొచ్చుట రహిన్ త్రైలోక్యమున్ మెచ్చుటల్. 213

ఉ. అప్పుడు వచ్చి వహ్ని తనయాకృతితో ధరణీజఁ దెచ్చి యీ
యొప్పులకుప్ప సాధ్వి సుగుణోన్నత నే సకలాంతరాత్మ నై
యెప్పుడుఁ గాంతు నొచ్చె మొకయింతయు లే దని యప్పగింపఁడే
యప్పలుకుల్ నిజంబు లని యాపెరె యచ్చటి వేల్పు లందఱున్. 214

చ. అని మొనఁ బంక్తికంఠుఁ దుసుమాడిన మేలు దలంచి యిచ్చకం
బునకు ధరాజ మంచి దని బొంకిరొ వేల్పులు సీతభావ మేఁ
గనియును మూఢు లిట్టు లనఁగాఁగల రంచుఁ దలంచి కాదె య
య్యనలము మండఁ జేసి చొరు మంటిని దానిని దప్పరైరిగా. 215

ఉ. పామరు లాడుమాట నొకపాటిగ నెంచి వితాకుఁ జెందఁగా
నేమిటి కంచు మీరు వచియించిన నేజను లైనఁ దిట్టఁగా
భూమిని నిందఁ జెంది మృతిఁ బొందిన యయ్యపకీర్తిభాజనుం
డామిహిరేందుతారముగ నాపదఁ బొందును రౌరవాదులన్. 216

క. వివృతస్వర్గద్వారం, బవరజములార పుణ్యయశ మందులకై
సువివేకు లుత్సహింపుదు, రవివేకులు గాంతు రపయశమునకున్. 217

క. క్షితిమీఁద బ్రతికి యుండియు, మృతిఁ బొందినవారు నింద లెనసినవారల్
మృతిఁ బొందియు బ్రతికినఘను, లతినిర్మలకీర్తిదేహు లవరజులారా. 218

క. కాన నడికోడి ప్రాణము, లైనను బ్రాణముల కెల్ల బ్రాణము లగుమి
మ్మైనను ద్యజింతు ననఁగా, జానకి నెడఁ బాయు టెంతచర్చింపంగన్. 219

ఉ. దీనత పాయ నెల్ల నడి దీఱఁగ నేనిఁక జానకీసతిన్
గానలఁ ద్రోయఁ బంచుట సుఖం బని యెంచితి మంచి దైనఁ గీ
డైనను మంచి దంచు వినుఁ డడ్డము లాడితి రేని మీకు నా
యాన సుఁడీ యటంచు విభుఁ డాడినఁ గొందల మంది అందఱున్. 220

క. జనవిభుఁ డంతట లక్ష్మణుఁ, గనుఁగొని మీవదినె నన్ను గాంగతటతపో
వనులు గన వేడ్క పుట్టెడి, నని వేఁడిన దట్టు గాన నదియె నెపమునన్. 221

శా. పల్మాటల్ దలపెట్ట కర్కుఁ డుదయింపన్ రేపె యాలోకనిం
ద ల్మానంగ సుమంత్రచోదితరథాధ్యాసీనఁ గావించి వ
న్య ల్మోదంబునఁ జూడ రమ్మనుచుఁ గాంతన్ నీవు గొంపోయి యా
వాల్మీకుల్ వసియించు నాశ్రమముచేర్వన్ డించి రమ్మా వెసన్. 222

తే. ఇంతిపై నింతమూర్ఖత్వ మేల యనకు
మవనిజకు నాకుఁ దీఱె ఋణానుబంధ

మఱియు గాదేని జను లిట్లు లాడుకొందు
రయ్యొ యింక నేల పలుమాట లాడుకొనఁగ. 223

క. అని యానతిచ్చి భరతా,ద్యనుజుల గృహములకుఁ బనుప నానతముఖులై
చనఁగవల నశ్రు లొలుకఁగఁ, జని రధిపుఁడు విన్ననగుచు సదనముఁ జేరెన్.

తే. చేరి యవ్వాఁ యగుబాష్పవారిధార, లరుణరుచి కన్నుఁదామర లాని నిదుర
మాన్ప రేయెల్ల వెతఁ జెంద మనుజనాథుఁ, డలఁత నట్టులె వేగించి రనుజులెల్ల.

క. లోకాపవాదమున నా,త్మైకస్యఁ ద్యజింప నెంచఁ గానో యేమో
యాకొంతచనినరాత్రిరి, కాకుత్స్థున కొక్క బ్రహ్మకల్పం బయ్యెన్. 226

ఉ. జానకి నిందఁ జేసినప్రజల్ బలుకాకల ముంప నోపర
త్నాననుఁడై వెలింగె నన నబ్జసఖుం డడఁగారుణాంశుసం
తానముతోఁ గనంబడినఁ దత్సమయోచితకృత్యముల్ వెసన్
దా నొనరించి లక్ష్మణుఁడు ధైర్యముఁ బూని సుమంత్రుతో ననున్. 227

ఉ. శ్రీరఘువంశవారినిధిశీతలధాముఁడు రాముఁ డంపఁగాఁ
గోరిక గాంగతీరవనకోటులు జానకి చూడఁ బోయెడిన్
దేరు సుమంత్ర శీఘ్రమునఁ దెమ్మని పల్క రథం బతండు సిం
గారముచేసి యశ్వములఁ గట్టి రయంబునఁ దెచ్చి నిల్పినన్. 228

శా. ఆసౌమిత్రి దృఢాత్ముఁ డౌట వగ దైన్యంబున్ ముఖాబ్జంబునన్
వీసం బంతయుఁ దోఁపనీక తెగువన్ వే వచ్చి సద్భక్తి సీ
తాసీమంతినికిన్ వినమ్రుఁ డయి మాతా గాంగతీరాశ్రమే
క్షాసక్తిన్ నిను నందుఁ దోడుకొని పొమ్మంచున్ విభుం డంపినన్. 229

క. వచ్చితి రథంబుఁ దెచ్చితి, విచ్చేయు మటన్న సీత వేడుకపడుచున్
బొచ్చెంబు లేనికృప సెల, విచ్చెను పతి యనఘ పోదమె వనములకున్. 230

ఆ. అనిన నేమి యెఱుఁగ దక్కట యీముగ్ధ, యనదఁ జేసి యొంటి నడవిఁ ద్రోచి
యెటుల వత్తు ననుచు నెడఁదఁ దల్లడపడె. లలన యెఱుఁగకుండ లక్ష్మణుండు.

రామాజ్ఞచే లక్ష్మణుండు సీతను వాల్మీకాశ్రమంబునకుఁ దోడ్కొని పోవుట

ఉ. అంబుజగంధి యయ్యెడ మహార్హులపట్టుల కంచుఁ గొన్ని హే
మాంబరరత్నభూషణచయంబులు గైకొని యమ్మ యందియున్
వెంబడి నెక్కఁగా రథము వేడుక నెక్కి చిరత్నరత్నపీ
ఠంబున నుండె వాజుల హుటాహుటిఁ దోలె సుమంత్రుఁ డంతటన్. 232

క. రామాజ్ఞకు వెఱఁగందుచు, సౌమిత్రి భయార్తిదైన్యసంవృతమతి యై
యేమియు నన కేఁగఁగ దో,ష్మో మహీజకు ద్రోవ నయ్యె దుశ్శకునంబుల్. 233

క. ఆదుర్నిమిత్తములు గని, భూదేవికుమారి భీతిఁ బొంది మనస్స
మ్మోదంబు డింద మది నెం,తో దైన్యము మించ లక్ష్మణునితో ననియెన్. 234

సీ. నరియఁడు దెరువాఁగ గరుడియుఁ బాలయు నెడమనుండియు వచ్చి కుడిని నిలిచెఁ
జెవులపో తెదురయ్యెఁ జెమరు డాదెసఁ జూపెఁ బలుమాఱుని దెవీచెఁ బైడికంటి
సుడిగాడ్పు తేరినల్బొట్టు జుట్టలు నెట్టె గడిఁదిచుంటలు వెళ్లఁ గ్రక్కె నక్క
యడ్డమై కాలాహి యదె తుట్టతుది కెక్కెఁ గనుఁగొంటె ధ్వజముపై గ్రద్దలాడెఁ

తే. గావిరి దిగంతముల నెల్లఁ గ్రమ్ముకొనియె
ధరణి దిరదిరఁ దిరుగుచందమునఁ దోఁచె
గగనమణి మాసెఁ బగలె ఘూకములు మ్రోసె
నన్న లక్ష్మణ యిది యేమియాగడంబొ. 235

చ. మునుకొనియిట్లు దుశ్శకునముల్ గనిపించుటకున్ మెఱుంగు వె
ట్టినగతి నామనంబునఁ గడిందిభయంబు జనించె దక్షిణాం
గనికరముల్ చలించె ధృతి గాసిలె మే నవశత్వ మొందె నే
మని వివరించుదాన జగమంతయుఁ శాడయి తోఁచెఁ జూడ్కికిన్. 236

ఉ. నాసఖు నామనోహరుని నాప్రభు నారఘురామదేవునిన్
బాసి వనాళి నున్న మునిపత్నులఁ జూచెద నంచు నేల పే
రాస గణించి వచ్చితి హితాహితచింతలు లేనివారు గా
రే సతు లంచు మాన్ప కతఁ డేమిటికిన్ వర మిచ్చె లక్ష్మణా. 237

చ. నను మదికోర్కి దెల్పు మని నాథుఁ డనన్ బదునాలుగేండ్లు చూ
చినవను లింతె కా యని విశేషము వేఱొక టిచ్ఛగింప కే
మని వనిఁ జూడఁ గోరి తహహా యిటులన్ విపరీతకాంక్షపా
త్తునఁ జనుపాపజాతికిని దుశ్శకునంబులు గాక యుండునే. 238

చ. కుమతి వినాశకాలమునకున్ విపరీతపుబుద్ధిఁ బూని య
క్రమములె కాంక్ష చేసి చెడుఁ గావున నేనును గోరరాని ది
ష్ట మని తలంచి దుర్దశఁ బడం బఱతెంచితి మీఁద దుర్దశా
సమితికి నీనిమిత్తములె సాకిరి గావె నృపాలనందనా. 239

చ. ధవు నెడబాసి వచ్చు తెగుదారికి నా కిఁక వంత యేల ని
య్యవశకునంబులన్ బాడమునాపద లన్నియు మాన్చి రామభూ
ధవునకు నీకు న త్తలకుఁ దక్కినబాంధవపౌరకోటికిన్
వివిధశుభంబు లీవలయు వేల్పు లటంచు నమస్కరించినన్. 240

ఉ. ఆయమచిత్తశుద్ధికి నయంబునకున్ వెఱఁగంది లక్ష్మణుం
డీయఖిలైకమాత పతి నెప్పుడుఁ గూడి సుఖించునట్లుగాఁ
జేయక పాయఁ జేసె విధిచేష్ట గదా యని నింద సేయు నే
మో యనఁ బోవు మాను వగ నుస్సు రనన్ దలవంచు నయ్యెడన్. 241

క. అన్నవలామిన్నయు నతఁ, డున్న తెఱఁగు దుశ్శకునము లుడుగక కన నౌ
చున్న తెఱుంగును గనియును, మిన్నక చనె దైవగతిఁ గ్రమింపఁగఁ దరమే. 242

వ. ఇవ్విధంబున సీతాలక్ష్మణు లడవులు గడచి యేఱులు దాఁటి పర్వతంబులు
క్రమించి పక్కాణాదు లతిక్రమించి చనిన ముందట. 243

క. గోమతి నమృతరసోపమ, గోమతిఁ దరుపుంజమంజుకుంజోదుతటీ
గోమత్రి నుతికలితప్రతి, గోమతిఁ బ్రాపించి ప్రాస్థు గ్రుంకినయంతన్. 244

క. సరిదంతికాశ్రమంబునఁ, జిరముగ నాఁ డుండి వేగ తేరెక్కి మహో
ద్ధురగతి మధ్యాహ్నములో, నరిగిరి భాగీరథీతటాంతరమునకున్. 245

ఉత్సాహ. చెంగటం గనెన్ లతాంగి శీతలానిలాహతో
త్తుంగభంగతీరసంగతుంగనాగరంగనా
రంగరంగదంబుజాంగరంగనృత్తచంగిసా
రంగరంగ గంగ నంతరంగ మంతఁ బొంగఁగాన్. 246

శా. ఈచందంబున గంగఁ జూచి తనలో నింపొంది కీర్తించుసీ
తా చంద్రాస్యను లక్ష్మణుండు గని యాత్మస్వామి యాజ్ఞాపనం
బాచింతాభర మాయపప్రథయు నింతైనన్ వినన్ లేమి నెం
తో చెల్వొందెడి సీమె కావిసపు పల్కాలా గిఁకన్ దెల్పుదున్.247

క. అని నిలుప రానివగపునఁ, గనుఁగవఁ గన్నీరు నించి కన్నీఁ బడెడియా
యనఁ గని వెతయు దిగులుఁ బెనఁగొనఁగా నజ్జనకరాజుకూఁతురు పల్కెన్.

ఉ. విన్నఁదనంబు మించెఁ బురి వెల్వడినప్పటినుండి నీ మొగం
బున్న తెఱుంగుఁ గాంచి దిగు లొందుచు నుందు నిదేమొ యంచు మీ
యన్నకుఁ దత్సహోదరుల కావ్వులకున్ శుభమే కదన్న నీ
కన్నుల నేల నశ్రువులు గ్రమ్మెడిఁ దెల్ప గదన్న లక్ష్మణా. 249

చ. అడవిని దొల్లి శ్రీదొఱఁగి యన్నను గొల్చును వచ్చునప్పుడున్
గడుసరి యింద్రజిత్తునిముఖాముఖిఁ గయ్యము సేయునప్పుడున్
జడుఁడగు రావణాసురునిశక్తి యురంబున నాఁటినప్పుడున్
బొడమదు కంట నీరిపుడు పుట్టిన దేటికొ తండ్రి దెల్పవే. 250

ఉ. మానసికవ్యథల్ రుజలు మాన్పఁగ నోపినపుణ్యరాశి గం
గానదిఁ జేరియుండియును గన్నిపకెన్ దగునయ్య వేడ్కతో
నీనది దాఁటి తాపసులయింతులఁ గన్గొని భూషణావళుల్
కానుకలిచ్చి దీవనలు గైగొని వత్తము రమ్ము చెచ్చెరన్. 251

వ. అని పలికి లక్ష్మణుని దైన్యంబు గని తలంకి మరల నిట్లనియె. 252

క. కనరాని దుశ్శకునములు, గనినప్పటినుండి మనసు గలఁగెడు నాకున్
వను ఖేల మరలి పోదమొ, నినుఁ జూచిన నినుమడించె నెవ్వగ లనినన్. 253

ఉ. కన్నుల నీరు గ్రుక్కుకొని గ్రక్కున లక్ష్మణదేవుఁ డన్న ము
న్నన్నది నెమ్మదిం దలఁచి యార్తి యొకించుక డించి తల్లితో

చిన్నటి దుర్నిమిత్తములె నెవ్వఁగ గూర్చె నయోధ్య కేల మీ
రెన్నికలీల నవ్వలికి నేఁగుద మంచు వచించి ధీరతన్. 254

చ. అరదము డిగ్గి యచ్యుతుఁ డచ్చట సారథి నుంచి యోడపై
ధరణిజ నెక్కఁ బంచి వెత దార్కొనఁ దానును నెక్కి తత్సరి
త్తరణ మొనర్చి వేగ తటధారుణిఁ జేరియు శోకవార్ధిలోఁ
దరళమనస్కుఁడై మునిఁగి ధారగ గన్నుల నశ్రులొల్కఁగన్. 255

చ. జనకజ మోము దీనత యెసంగఁ గనుంగొని యారెలుంగుతో
జననిరొ పాయదీహృదయశల్యము శోకదవాగ్నిఁ గ్రాఁగుకం
టెను మరణంబు మేలు జననిందితకృత్యముఁ బూని వచ్చితిన్
నను శపియించు మంచుఁ జరణంబుల చెంగట వ్రాలి యేడ్వఁగన్. 256

క. ఎదపడి పెదవులు దడఁపుచు, నదవద నెదతాల్మి వదల నంగము గదలన్
దుద మొదలు లేనిదీనత, గదురఁగ జనకసుత యతనిఁ గనుఁగొని యనియెన్.

ఉ. అన్న యనేకదీనదశ లానినవేళల నైన నీవు ము
న్నెన్నఁడు నంతవంత వహియింపవు ధైర్యము డింప వేల నేఁ
డిన్నగు లొంది కుందెద వహీనగుణాంబుధి వంచు నీగుణం
బెన్నుదు రంద ఱెవ్వరికి నెగ్గుదలంచితి పుగ్గడింపవే. 258

చ. పరసతు లెల్లఁ దల్లులుగ భావన సేయుదు వెల్లవేళలన్
బరధన మన్న హాలహలుభంగిగఁ జూతువు బొంక వెన్నఁడున్
బరుషము లాడ వెవ్వరిని బ్రాహ్మణభక్తియు రామసేవయున్
దిర మగు నీకుఁ దండ్రి జననిందితకృత్యము లెవ్వి యియ్యెడన్. 259

క. మన్నన దొలఁగి నిను మీ, యన్న నిరాకరణ చేసి యాడెనొ నీ కా
యన్నపయి భక్తిదొలఁగెనొ, కన్యాయము నేమియైనఁ గావించితివో. 260

క. గురునింద యాచరించితొ, పరదూషణ చేసితివొ కృపారహితుఁడవై
శరణన్న వారిఁద్రోచితొ, యరులకు వెన్నిచ్చి వేగ యరుదెంచితివో. 261

క. రామాజ్ఞ లేకయే నను, దీమసమున నిందుఁ దోడితెచ్చితొ నాపై
స్వామిచుతి యొడసి యున్నదొ, యేమిటికిట్లెదవు తండ్రి యెఱిగింపఁగదే.

శా. సౌమిత్రీ భయ మయ్యెడిన్ నుడువు మాత్మామాదేవిజామాత యా
శ్రీమత్పద్మదళాక్షుఁ డారవికులక్షీరాబ్ధిపూర్ణేందుఁ డా
హేమక్ష్మాధరధీరుఁ డాయసురమత్తేభేంద్రహర్యక్షుఁ డా
శ్యామాంగప్రభుఁ డామహాప్రభుఁడు లెస్సైయున్నవాఁడే పురిన్. 263

క. మనుమార్గనిరతుఁ డనఁగా, మనుమానవపతి దయాబ్ధిమానచ్యుతుఁడై
నిను మానెనొ నను మానెనొ, యనుమానము మాని తెల్పుమన మానినితోన్.

క. తెలుపుటకుఁ గొంత చింతిలి, తెలుపక పోరా దటంచు దృఢనిశ్చయతన్
దలఁచుచు వడి లేచి కృతాంజలి యై యతఁ డశ్రులొలుక జనకజ కనియెన్.

లక్ష్మణుఁడు గంగ దాఁటి రామాజ్ఞను సీతాదేవికిఁ దెల్పుట

ఉ. ఇంతకుఁ బూని వచ్చి వచియింపక పోదునె విన్ము తల్లి దు
శ్చింతులు దైత్యుచేఁ బడినసీతను గ్రమ్మఱ నేలుచున్నవాఁ
డెంతవిమోహి రాముఁ డని యెగ్గులు వల్కిన నాలకించి భూ
కాంతుఁడు నిందఁ జెంది నినుఁ గానలలోపల డించి రమ్మనెన్. 266

క. క్షుల్లకజనదుష్టవచో, భల్లకదంబముల హృదయపద్మ మగల భూ
వల్లభుఁ డోరిచె భవదా, యల్లకభర మేమి వినియె దమ్మరొ యింకన్. 267

చ. మునులు మహాతపోనిధు లమోఘదయాంబుధు లాశ్రయించు కా
ననములు చేరి నీ విఁక దినమ్ములు ద్రోయఁ గదమ్మ యంచు నీ
యునికి కనర్హమైనయెడ నొప్పు గణింపఁగ నొగ్గె నాల్క నీ
యనదతనంబు సైఁచె మది యమ్మరొ యెంతటి క్రౌర్యముఁ జూడుమా. 268

చ. జనపతి లోకనిందఁ బడఁజాలక నిన్ వనిఁ ద్రోయు మన్నచో
విని సహియించి కానలకు వేగమునన్ గొని తెచ్చి నిల్వఁగాఁ
జనునెడ లుగ్గడించి ధృతిసంపదఁ సొంపిరివోవుచున్నవాఁ
డను ననువంటిమూర్ఖు నకటా విధి యేగతి సృష్టి సేసెనో. 269

ఉ. అంచితవామలూరుజవనాంతరభూముల నిన్ను డించి ర
మ్మంచు రఘూద్వహుం డనిచె నక్కట యెక్కడ నిల్చి యెట్లు వే
గించెద వమ్మ యెవ్వరు సఖీజను లయ్యెద రమ్మ యేమి యూ
హించి దినంబు లింకఁ గ్రమియించెద వమ్మ పతివ్రతామణీ. 270

ఉ. నీవిమలప్రభావమును నీవినయాదికసద్గుణంబులున్
దేవ్రుఁ డెఱింగియుండియును నిందలకున్ బయిలోడి యోజగ
త్పావని నిన్ను గోరిననెపంబున నిచ్చటి కంపినాఁడు గా
కీవిరహాబ్ధి నేకరణి నీఁదఁగలాఁ డతఁ డింకమీఁదటన్. 271

ఉ. దాయల కైన నిట్టివెత దార్కొన నేగతిఁ జూడ వచ్చుని
న్నీయటవీస్థలిన్ విడిచి యేనెటు లేగుదు నన్ను నేల భూ
నాయకుఁ డిట్టిబెట్టిద మొనర్పఁగ బొమ్మనె నెద్ది యైనచోఁ
జేయఁగ నోడఁ డీకఠినచిత్తుఁ డటంచు నెఱింగి పంచెనో. 272

సీ. మితి లేనియీమిడిమేలంపుమెకములు సకియలబలఁగమే జనని నీకుఁ
బరికింప రానియీబలుమలల్ నవరత్నమయచంద్రశాలలే మాత నీకుఁ
గడుభీతి ముంచునీగహనముల్ విహరింపఁ దగినపూఁదోఁటలే తల్లి నీకు
ఘోరనక్రభుజంగకోటితో మలయునీహ్రదములు కొలఁకులే యంబ నీకు

తే. బంధురము లైన యీసుహాప్రస్తరంబు, లిందుమణివేదికలె జనయిత్రి నీకుఁ
గటకటా యొంటి నిచ్చోట నెటుల నిలిచె, దమ్మ నీయున్కి కేమందునమ్మ నేను.

మ. జననీ నీవు మహాపతివ్రతవు నీసౌశీల్య మిల్లాండ్రకె
ల్లను మేల్బంతి రఘూద్వహాంఘ్రియుగళీలగ్నాత్మవై యుందు మీ
యని నే నెవ్వఁడ విన్నవింపఁ బతి కాయర్ల జేసి నిన్నొంటి డిం
చినపాపాత్ముఁడ నూరి కేఁగు మనుచున్ సెల్విచ్చెదే నావుడున్. 274

క. అల్లలన యతనివచనము, లెల్లన్ విని మొదలు నఱుక నించుకవడిలోఁ
ద్రెళ్లెడి కదళికవలె హా, తల్లీ యని బెట్టు సారిగి ధరపైఁ బడియెన్.

వ. పడి చేడ్పడి బడిబడిన్ బొడముబడలిక నొడలెఱుంగక రెండుగడియ లుండి
కొండొక దెలిసి వెండియు నలసి యవశయై దీనదశన్ దొరసి యాక్రోశాంగి
మరలఁ గన్నుఁదామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడియశ్రుజలధారాప్రవాహం
బులు చెక్కుటద్దంబులపై జాలు వాఱి జాళువామెఱుంగుపయ్యెదచెఱంగు
మీఁదికి దిగజాఱి యుత్తుంగతరస్తనకనకకలశంబులు నిండుకొన మెండుకొను
నిట్టూర్పుసెగలన్ దగిలి చిగురువాతెఱ తుకతుక నుడుక నుడుగణంబుల
బెడంగు నడంగఁ ద్రొక్కుచేర్చుక్క దెరలఁ దరళతరచికురనికరంబు లలికఫలకం
బునఁ జెరలాడఁ దుఱిమినవిరులసరులతో నొఱవినకొప్పు పెన్నెఱు లంసభాగం
బులం బొరలి పడ జనువుచెమ్మటలన్ గ్రమ్ముకొని నెమ్మేను గడగడ వడంకఁ
గడంక దక్కి చిన్నిమొగంబు విన్నఁదనంబున కిమ్ము జూపఁ బరితాపదవానలం
బునఁ బడి పురపురఁ బొక్కుచు దాల్మి దూలి స్రుక్కుచు లేచి కూర్చుండి శోక
రసం బాకారంబు దాల్చినచందంబునఁ జిత్రంబు గాత్రంబు గైకొన్న చెన్నున
సాధ్వసంబు సాధ్వియైనకరణిన్ గరుణంబు కరణంబు లొందిన తెఱంగున
నూరక వెక్కి వెక్కి యేడ్చుచు నేవు విడిచి మానంబు పూనుచు మానంబు
మాని తనలోఁదా నగుచు నగ వుడిగి తల యూఁచుచుఁ దల యూఁచుట
విడిచి ముక్కుపై వ్రేలు గీలుగొలుపుచు జాలి గొని హాహాకారంబు సలుపుచుఁ
దలఁపనితలఁపు లివిగోఁ జూచితే లక్ష్మణా యని యతని దిక్కు జూడ్కులు
నిగిడించి యిట్లనియె. 276

చ. అడలకు మన్న నీకు వసుధాధిపునానతి దాఁట వచ్చునే
యిడుములఁ జెందు మంచు విధి యీధర నన్ను సృజించి యుండఁగా
గడవఁగ నెవ్వరోపుదురు కానల కేఁగిననాఁడె యాపదల్
గడచితి నంచు నుంటి నెఱుఁగన్ దుది నిట్లగు నంచు నామదిన్. 277

క. ఆదుర్నిమిత్తములఫల, మీసుఖము సేయ కున్నె యీదుఃఖము లా
పాదింప విధి తలంచియె, కాదే యాకోర్కె నాకుఁ గలిగించుటయున్. 278

చ. ఎడపక పూర్వజన్మముల నేమిథునంబులఁ బాయఁ జేసి వా
రడలఁగ నవ్వుచుండితినొ యాయఘ మూరక పోనె నాఁడు కా

అడవుల రామపాదజలజాప్తి వసించితి నేఁడు నాథుఁ బాం
డెడసి యనాథనై యిచట నేగతి మేన భరింతుఁ బ్రాణముల్. 279

ఆ. ఏను సాధ్వి ననుచు నెల్లవారలు నన్ను, సన్నుతింతు రనుచు సంతసింతుఁ
గాని నకుమ నిట్టికటికనిందలు పుట్టి, యడవిఁ ద్రోచె రాముఁ డనుచు నెఱుఁగ.

చ. కటకట లక్ష్మణా పిడుగుకంటెను బెట్టిద మైన మాట నేఁ
డిటు వినియుండియున్ బగుల దింతయు నింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీకటికభావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన నాపద లొందఁగ నున్నదాననో. 281

చ. కళవళ మంది తెల్పితివొ కాక పరాకునఁ దప్ప వింటివో
కల నయినన్ రఘూద్వహుఁడు కానలకున్ నను ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ మతిభ్రమ మైనదొ హా సహింపు మి
ప్పలుకు లెఱుంగ కంటి వెతఁ బాటిలె నీకొకభ్రాంతి యున్నదే. 282

ఉ. ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁ గల్గదొకొ కల్గక యుండినఁ బ్రాణ మేల పో
దన్న రఘుప్రవీరుఁ జెవు లారఁగ నింతయుఁ దెల్పు నాదుమే
నున్నది చెంత గంగమడుఁగున్నది యైనటు లయ్యెఁ జన్ దుదిన్. 283

చ. పతి మతి నెంచ నేమొ తనుఁ బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్లనుచుఁ గ్రమ్మఱఁ దాఁ జనుదెంచి శత్రునిన్
హతునిగఁ జేయు నేలు నను నాస గదా బ్రదికించె నాఁటి కా
గతి నిఁక నేమి యాస గొని కాయము నిల్పుదుఁ దెల్పు లక్ష్మణా. 284

చ. ఎఱుఁగని మూఢులాడుకొను నెగ్గులకున్ భయమంది యప్పుడే
కఱకుమనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁ గాక య
త్తెఱఁ గొకసారి నన్ బిలిచి తెల్పి మనోవ్యథ దీర్చి నన్ను నే
మఱ నని బంపఁడయ్యె నభిమానముఁ గూర్మియు నెందుఁ బోయెనో. 285

క. ఆకరుణ యాప్రసన్నత, యాకూరిమి యాప్రియోక్తి యాగారవమున్
గాకుత్స్థుఁడు మఱచెఁ గదా, యాకస్మికముగ జనించునపవాదమునన్. 286

శా. ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వశో
భాకీర్ణాంచితగల్లమై సురదనంబై సుందరభ్రూయుతం
బై కమ్రస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరాముమో
మీకాయంబునఁ జూచుభాగ్య మిఁక లేదేమో సుమిత్రాత్మజా. 287

సీ. అవని నయోనిజ నయి పుట్టి మిథిలేంద్రుపీట నేఁ బెరిగినవిధము వినరో
యంగరాగము లిచ్చి యనసూయ మొదలైనసతు లెంచుకొన్నది చాల వినరో

దూలంకలోఁ దొల్లి త్రైలోక్యము నుతింప వహ్ని నేఁ జొచ్చిన వార్త వినరొ
యీసీత నిర్దోషి యేలుకొమ్మని రాము బ్రహ్మాదు లవు డన్న పలుకు వినరొ

ఆ. వినియుఁ గనియుఁ బ్రజలు నను నిందసేసిన, యంతమాత్రమునకె యధిపుఁడులికి
యింత తెగువ సేయ నిచ్చగించుట న్యాయ, భాగ్య మింతె యొకరిఁ బల్కనేల.

చ. వనమున కేల వచ్చితివి వల్లభునిన్ బెడఁబాసి యొంటిగా
నని మునిపత్నులెల్ల గుమిగూడి యడుగన్ ధృతి మాలి వారి కే
మని వివరింతు నింత విపదంబుధి నేకరణిన్ దరింతు నే
యనువున నీప్రతీక్షణమహాయుగముల్ క్రమియింతు లక్ష్మణా. 289

వ. అని పెక్కువగల నమ్మగువవాగిలి మగని తెగువకుఁ బరితపించుచు నించుకతగవు
దలంచి తెగువ వహించి బహిర్లిఖితచిత్రంబుకొమ రొందియున్న యమ్మఱిదితో
మఱియు నిట్లనియె. 290

చ. వగపునఁ దోచినన్నియు నవారణఁ బల్కితిఁ గాక భర్తకున్
జగదపవాదమున్ గడువ శక్యమె నేను వియోగమగ్నతన్
దెగువకుఁ జొచ్చి రాము జననిందితుఁ జేయుదునే తదాజ్ఞ యె
ల్లగతులఁ బూని కానల మెలంగెద మేను గలంతకాలమున్. 291

సీ. అన్న లక్ష్మణ యింక నాలస్య మేటికిఁ జను మయోధ్యాపురంబునకు నీవు
మువ్వురత్తలకును మ్రొక్కితి నని తెల్పు మచటి బంధుల నెల్ల నడిగితి నను
మతికృపాళునకు రామావనీంద్రునకు నా మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కుమీవు
తనయాజ్ఞఁ దలఁ దాల్చి జననింద తనుఁ జెందనీక కానల జరియింతు ననుము

తే. భూజనుల బాంధవుల లెస్స ప్రోవు మనుము
తలఁప నా కేడుగడయును దానె యనుము
భావమెప్పుడుఁ దనమూర్తిఁ బాయ దనుము
నమ్మి యొకయింతి నామీఁద నిల్పు మనుము. 292

తే. పోయి రమ్ము శుభంబులు బొందు నిన్ను
నన్ను మఱవక యుండుమా యన్న యనుచుఁ
గన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగ
నన్నెలంతుక దీనయై యడలుచున్న. 293

క. చనఁ గాళ్ళు రాక చన కిఁక, జన దని ధేనువును బాయఁ జాలనివత్సం
బును బోలి జాలిగొని యో, జననీ జననాథుఁ గొలువ జనుదునె యనుచున్.

లక్ష్మణుండు వాల్మీక్యాశ్రమంబున సీతను విడిచి మరల నయోధ్యకు వచ్చుట

ఉ. అల్లన మ్రొక్కి కాళ్ళు వడఁకాడఁ బ్రదక్షిణ మాచరించి మే
నెల్లఁ జలింప హా యని యేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ మా
తల్లిని డించి పోయెదను తాపసకామినులార కూర్మి సం
ధిల్లఁగ బ్రోవరే యనుచు దీనత లక్ష్మణుఁ డేఁగె నయ్యెడన్. 295

ఆ. ఏఁగి నావ యెక్కి యెడఁద దల్లడపడఁ, దిరిగి తిరిగి సీతదిక్కుఁ గనుచు
దిక్కు గలిగి నీకు దిక్కు లే దాయెఁగా, తల్లి యనుచు నవలితటముఁ జేరె. 296

క. తేజనివగ నం దుండెడి, తే రెక్కి సుమంత్రు డెంతదీనత వచ్చెన్
శ్రీరామలీల మీఱెడి, శ్రీరామవధూటి కనుచుఁ జింతిలుకొనుచున్. 297

క. చనుచుండె నిచట సీతా, వనజాక్షియు నతఁడు మరలి వచ్చునొ యని యా
యనచనిన త్రోవ పలుమఱుఁ, గనుచున్ విధిదూఱుకొనుచుఁ గటకటయనుచున్.

తే. రమణి మఱికొంతవడిదాఁక రథముఁ జూచుఁ
దరుణి మఱికొంతసేపు కేతనముఁ జూచు
గాంత మఱిమీఁద రథపరాగంబుఁ జూచు
బడఁతి మఱియంతటను వట్టిబయలు సూచు. 299

ఆ. చూచి చూచి చొక్కి సొక్కి తాలిమి దక్కి
వగలఁ బొగిలి యూర్పుసెగల నొగిలి
దిగులు దగులఁ గుంది వగఁ జెంది బెగడొంది
యలసి సొలసి మూర్ఛ లొలసి తెలిసి. 300

జానకి శోకించుట

వ. అచ్చెలువ తన్ను మున్ను ముచ్చట లడుగునప్పు డప్పుడమిఱేఁడుచేసిన చెయ్వులఁ
దలంచుకొని. 301

సీ. ఒడిమీఁద నిడికొని యురముపైఁ జేర్చుట చేరిక కది కడసారి యేమొ
చెక్కుఁ జెమ్మట చేలచెఱఁగునఁ దుడుచుట చెలిమికి నది తుదిచీటి యేమొ
పుక్కిటి తావికప్పురపీడె మిచ్చుట యనురాగమున కది యవధి యేమొ
కోరినపని కియ్యకొను టది కరుణాప్రబంధమ్మునకు ఫలగ్రంథ మేమొ

తే. మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁబనికిఁ దీఱుదల యేమొ
యెలనగవు దేరఁ జూచి లోపలి కనుచుట
మేలుచిన్నెల కది పొలిమేర యేమొ. 302

మ. అని దుఃఖించు నపప్రథన్ దెలుప కాహా భూవిభుం డింతవం
చనఁ గావించునె యంచు విన్ననగు నేచందంబునన్ దెల్పి పా
ప్మనె మోమోడక యంచు నెంచుఁ బతిఁ బాయన్ జేసితే దైవమా
యను నిం కెవ్వరు దిక్కునన్ దొలఁగ నీప్రాణంబు లోరా యనున్. 303

క. అమ్మా యనుఁ బలుకవు నా, యమ్మా యను జాహ్నవీ దయానిధి ననుఁజే
కొమ్మా యనుఁ గలశాంబుధి, కొమ్మాయను ఖగమృగములు గుమిగొని యడలన్.

సీ. వనవిహారమున భూవరుఁ డాడునర్మముల్ మనసునఁ దలంచి కంపము వహించు
జలకేళిఁ దేలుచోఁ జెలువుఁడు గావించుపరిహాసముల నెంచి పరితపించు

భోజనాదులవేళ రాజేంద్రుఁ డొనరించు బహుమానమూహించి భ్రాంతిమించు
ద్యూతాదికములందు దొరయెఱుఁగనియట్ల కళలంటుట గణించి కళవళించు
తే. నేకళయ్యావిహారంబు లెంచి యెంచి, ప్రణయకలహాంతములవగల్ వలికి పలికి
వలపుముచ్చట లెడఁజేర్చి వనరి వనరి, యింతి విలపించెఁ గలకంఠు లెల్లఁగదియ.

క. కాంతారత్నం బిటు ల,క్కాంతారమునందు వగవఁగా ఫలముల క
చ్చెంతఁ జరియించుమునిసుతు, లంతయు విని వచ్చి చూచి యరుదంది వెసన్.

శా. ఆవాల్మీకులచెంత కేఁగి నతులై యయ్యా విముక్తాబ్జ యా
శ్రీవామాక్షియొ ధాత్రికిన్ దిగిన జేజేరాజుదేవేరియో
నా వెల్గొందులతాంగి యోర్తు వనిలోనన్ దీనయై బెట్టు వా
పోవన్ గన్గొని తెల్ప వచ్చితిమి యప్పూఁబోఁడిఁ గానన్ దగున్. 307

చ. అని మునిబాలకుల్ దెలుప నమ్ముని యాంతరదృష్టి నంతయున్
గని రఘురాముదేవి జనకక్షితిపాత్మజ యంచుఁ బల్కి గ్ర
క్కున నటు లర్ఘ్యపాత్రఁ గొని కొల్చుచు వెంబడి నేఁగుదేరఁ బా
యనిదయ నెమ్మనంబు మొనయన్ జని గాంగతటంబుచెంగటన్. 308

చ. ఉడుగక తేఱు చన్నదెస నూనినచూడ్కులుఁ గన్గలంకులన్
విడువక పాఱునశ్రువుల నెల్లువ లూఱట లేనియూర్పులున్
గడ యిడ రానివంత యెడ గాంచని చెక్కిలి కేలు ధూళి బ్రుం
గుడువడు మేనునున్ గలిగి కుందెడిజానకిఁ గాంచి కూరిమిన్. 309

శా. చేరన్ బోయినఁ జప్పుడింత విని యాసీతాంబుజాతాక్షి య
క్కారుణ్యాంబుధి నత్తపోధనమణిన్ గన్నీరు లేఁజెక్కులన్
జాఱన్ ఱెప్ప లొకింత యెత్తి కని విశ్వాసంబు నిశ్శ్వాసమున్
మీఱన్ బెట్టుగ నేడ్చుచున్ జరణసామీప్యంబునన్ వ్రాలినన్. 310

మ. యతిమూర్ధన్యుఁడు బుజ్జగించి వగ పేలా పుత్త్రి నీసద్గుణో
న్నతి నీభర్త యెఱింగియున్ బ్రజలనిందల్ దాల్మి గుందింపఁగా
ధృతి నీ కెగ్గొనరించె నింతయు మనోదృష్టిన్ విచారించి వ
చ్చితి నన్నున్ మిథిలాధినాథువలె నీచిత్తంబులో నెంచుమా. 311

చ. అఱమఱ యేల నే నిలుచునాశ్రమదేశము నీదె కాదె నీ
కెఱబఱికంబు లేక యిఁక నిచ్చట నున్నతపస్వికాంత లం
దఱు నుచితోపచారము లొనర్పఁగలారు వివేకశాలినుల్
మఱతురె తెల్వి దైవగతి మాన్పఁగ నెవ్వరికైన శక్యమే. 312

చ. జనకుఁడు తండ్రి సద్గుణవిశాలుఁడు పంక్తిరథుండు మామ దు
ర్జనభుజగర్వవైభవవిరాముఁడు రాముఁడు భర్త నీకు నీ
వనుపమధర్మమర్మనిధి వజ్ఞతఁ జెందకు నాథునాజ్ఞఁ జే
కొని చరియింపు మేల వెత గుందెద వర్ఘ్యముఁ గొమ్ము మానినీ. 313

క. అమ్మా యూరక వగవక, లెమ్మా నావనము నీకు లీలావన మ
మ్మా యివె జలములు చే,కొమ్మా నీముఖము గడిగికొమ్మా యనుచున్. 314

వాల్మీకి సీత నూఱడించి తనయాశ్రమంబునకుఁ దోడ్కొనిపోవుట

ఆ. అనునయించి యర్ఘ్య మాయమ కిప్పించి, మౌనిమణి నిజాశ్రమంబునకును
గూర్మిఁ గోడఁ దోడుకొనిపోయె నిర్వ్యాజ,బంధుజనులుగారె బ్రహ్మమునులు.

క. సీతాసతితో నిటుల ప్ర, చేతసునిసుతుండు వనముఁ జేరి తనకు సం
ప్రీతి మెయి నతు లొనర్చు ము,హాతాపససతులఁ జూచి యతులమతి ననున్.

ఉ. రాజకులాభిరాముఁ డగు రాముని దేవి విదేహధారుణీ
రాజకుమారి పంక్తిరథరాజబిడౌజుని పెద్దకోడ లీ
రాజముఖీలలామ యలరాజసహోదరిఁ బోలు నీమెకున్
బూజలు సేయఁగాఁ దగు దపోధనకాంతలు మీర లందఱున్. 317

చ. చెడుగులు రావణాసురునిచేఁ జెఱ వోయిన కాంతఁ దెచ్చి యే
లెదు నని తన్నుఁ బల్కినఁ జలించి రఘూద్వహుఁ డీమె సద్గుణం
బెఱుఁద నెఱింగియున్ నడి సహింపక కానల కంపినాఁడు మీ
రెడపక యీమెఁ బ్రోవుఁ డని యింతిని వారల కప్పగించినన్. 318

ఉ. వారు మహాప్రసాద మని వామవిలోచన గారవించి యొం
తోరహిఁ బర్ణశాలలకుఁ దోడ్కొని పోయి యథోచితంబుగా
సారెకు వంతు లూని యుపచారము సేయుచు నుండి రంత న
క్కారుణికుండు చెందె నతికౌతుక మూఱడిలెన్ వధూటియున్. 319

సీ. రంగారు బంగారు చెంగావులు ధరించు శృంగారవతి నారచీర లూనె
భూజనంబులు మెచ్చు భోజనంబు లొనర్చు కమలాక్షి కందమూలములు నమలెఁ
జంద్రకాంతవిశాలచంద్రశాలల నుండు జవ్వని మునిపర్ణశాల నుండె
మరులుతో శ్రీరాము నురముపైఁ బవళించు శాలికామణి యొంటి పవ్వళించెఁ

తే. గన్నసన్నల శుద్ధాంతకాంత లాచ,రించు సేవలు మెచ్చని కాంచనాంగి
యొగ్గె మునిముగ్ధకాంతాకృతోపచార,విధికి నెంచ నసాధ్యంబు విధికిఁ గలదె.

ఉ. అక్కడ లక్ష్మణుండు నటు లాతురుఁడై చనుచుండి త్రోవలో
స్రుక్కుచు సద్వ్యథితుఁ డగు సూతునిఁ జూచి సుమంత్ర చూచితే
యక్కట నిర్నిమిత్తము ధరాత్మజ కెంతయుపాధి వచ్చెఁ దా
నెక్కటి యైతి నంచు వెత నెక్కడఁ బ్రాణము వీడునో కదే. 321

చ. అడవులఁ బెక్కునాళ్లిడుమ లంది విభుం బెడఁబాసి దైత్యుచేఁ
బడి యట నెవ్వరున్ బడనిపాట్లకు లోనయి ప్రత్యయార్థమై
యడరెడుచిచ్చుఁ జొచ్చి యతియత్నమునన్ సుఖ మింత చెందినన్
గడపట జానకీసతికిఁ గాపురమున్ గడతేఱ దాయెఁగా. 322

మ. శివుకోదండము ద్రుంచె వాలి నడఁచెన్ జేపట్టె సుగ్రీవునిన్
బ్లవగశ్రేణుల నేలె ఘోరజలధిన్ బంధించెఁ బౌలస్త్యునా
హవభూమిన్ దెగటార్చె నీవనితకై యర్కాన్వయస్వామి య
ట్టివధూటిన్ బెడఁబాసి నిల్వఁగఁ గలండే తాల్మి చిత్తంబునన్. 323

క. జను లందఱాడుకొనియెద, రని కద పతి సీత విడిచె నవనిజతాపం
బున నగుపాపము జనులదొ, జననాథునిదో గణింపు సారథి యనుచున్. 324

చ. వగచుచుఁ బల్కులక్ష్మణునివాక్కులు సారథి యాలకించి కేల్
మొగిచి వచించె నేల వెత మోదము ఖేదముఁ గాలపద్ధతిన్
దగులుచు నుండు నెవ్వరికి దైవముముందరఁ బౌరుషంబు పెం
పగునె మహాత్మ తొల్లి బుధు లాడినమాటలు విన్మ తెల్పెదన్. 325

సుమంత్రుండు లక్ష్మణునకు దుర్వాసువాక్యంబులఁ దెలిపి యూఱడించుట

తే. ధర్మనిధి యైనమీతండ్రి దశరథావ,నీశుఁ డొకనాఁడు నిజపురోహితునిఁజూడ
దలఁచిరథ మెక్కిసూతకృత్యంబు నేను,బూనఁగ వసిష్ఠమునివనంబునకుఁబోయి.

శా. ఆసత్రంబున కేకవార్షికమఖవ్యాసక్తిమై వచ్చి దు
ర్వాసుండున్ గురుచెంత నున్కిఁ గని దీవ్యద్వహ్నిభానుద్యుతుల్
భాసిల్లం దగువానిఁ జేరఁ జని సద్భక్తిన్ నతుల్ సేసి త
త్ప్రాసన్న్యంబున కుబ్బుచున్ గొలిచి భూపాలుండు వర్తిల్లఁగన్. 327

తే. అతిథి వైతివి మాయింటి కధిప యనుచుఁ
గంధమాలాదికములు వేడ్కల నొసంగి
తామును భుజించి యమ్మునుల్ తగినమాట
లాడుచు వసింప నవసరం బరసి విభుఁడు. 328

క. అలదుర్వాసోముని కం,జలిఁ జేసి మహాత్మ రామచంద్రుం డెన్నా
ళ్లిల యేలుఁ గొడుకు లెందఱు, గలిగెద రాయుగ్రప్రమాణగతి యెయ్యదియో.

తే. అతనితమ్ముల బ్రతు కెట్టి దర్కవంశ
మవని నెందాఁక వర్తించు ననఘచరిత
యాన తీఁ దగు నింతయు ననినఁ గరుణ
పొడమ మీతండ్రి కయ్యత్రిపుత్త్రుఁ డనియె. 330

క. అనఘా సీతనయాగ్రణి, విను మీధరఁ బదునొకండువేలేం డ్లేలున్
మును లెంచఁ బెక్కుయాగము, లొనరించున్ బిదపఁ బుత్త్రయుగ్మముఁ గాంచున్.

క. అం దగ్రసుతు నయోధ్యకుఁ, బొందుగఁ బతిఁ జేయు నాప్తబుధమంత్రిసుహృ
ద్బృందముతో నానందముఁ, బొందుచుఁ దుది బ్రహ్మలోకమునకున్ బోవున్.

ఆ. కొదువముగురుపుత్త్రకుల కిర్వురిరువురు, పుత్త్రు లొదవి యన్యభూము లేలఁ
గలరు పెద్దకాల మిల నిల్చు నిక్ష్వాకు,వంశ మింకనొక్కవార్త వినుము. 333

మ. ధరణీజన్ బెడఁబాసి రామవసుధాధ్యక్షుండు పెక్కేండ్లు త
ద్విరహంబొందెడి కారణంబు గల దావృత్తాంత మే మంటివా
పరిపాటిన్ వినిపింతు విన్ము దివిజుల్ భంగించినన్ దైత్యులా
తురులై మున్ భృగుపత్ని మద్వసార నెంతోకూర్మి నక్కాంతయున్. 334

ఆ. వారికభయ మిచ్చి వైరుల వారింప, నసురవైరి చేరి యప్పురంధ్రి
శిరము చక్రధార ఛేదించి దైత్యుల, సంహరింప భృగువు చాలఁ గినిసి. 335

ఉ. దేవుఁడ వంచు నిన్ను వినుతింపుదు రందఱు నింత క్రూరతన్
స్త్రీవధ యెట్లు చేసితివి శ్రీధర యీకొల చెంద కుండఁగాఁ
బోవునె మానవత్వమున భూమిని నీ విఁకఁ బుట్టి యాత్మప
త్నీవిరహార్తి వందుదు మనేకదినంబు లటంచుఁ దిట్టినన్. 336

క. హరి కిచ్చినయాశాపము, పొరసె నతని మరల ఋషులబోధల నతఁడా
హరిఁ బొగడి మాన్చె శాపము, హరికథ లెట్లైన మేలె యది యేల నృపా.

క. ఆభృగుశాపము వాఁజ, నాభుఁడు వహియించి నీకు నందనుఁ డయ్యెన్
నీభాగ్య మెంచఁ దగునె క, దా భూవర రాముఁ డొందు దత్ఫలమింకన్. 338

క. హరికైన హరునకైనన్, బరమేష్ఠికి నైన విప్రభాషలు ద్రోయన్
దర మగునే యని లీలా, హరుఁ డమ్ముని దెలుప నృపతి యద్భుతమందెన్. 339

తే. ఈరహస్యంబు పురిఁ జేరునెడ నృపాలుఁ, డానతిచ్చిన నే వింటి నంతె కాని
యెవ్వరు నెఱుంగ రీవార్త నిపుడు పొగుల, ననఘ దెల్పితినిదినిల్పుమాత్మయందు.

చ. కతిపయవర్షముల్ చనినఁ గార్యము లన్నియుఁ దీర్చి రామభూ
పతి మిము మున్నుగాఁ బనిచి బ్రహ్మపదంబున కేఁగు సీతకై
వెత పనిలేదనన్ ధృతియు వేడుకయున్ వహియించి లక్ష్మణుం
డతని నుతించుచున్ జని రయంబున గోమతిఁ జేరె నాటికిన్. 341

క. మఱునాఁ డరుణోదయమున, నరదము సూతుండు వన్న నతఁ డెక్కి మహా
త్వర మధ్యాహ్నములోపల, సురవినుతాయోధ్యయను నయోధ్యకుఁ జనియెన్.

వ. చని దీనాననుండై పురద్వారంబు సొచ్చి యచ్చట నెవ్వరిన్ జూడక తలవంచి
కొని రాజమార్గంబునన్ జనుచున్న తనదైన్యంబును జానకీశూన్యంబైన రథం
బునున్ గనుంగొని పురజనులు గుంపులు గూడుకొని సవసవగా నిన్న మనము
విన్నది నిజంబై తోఁచుచున్నది చూడుఁడు చూడుం డని గుసగుసలన్ బోవు
వారు నింతలేసిసంసారచ్ఛేదంబులు మనయూరిపుణ్యాత్ములవలననేకదా యయ్యె
నింక నేనోరు పెట్టుకొని మాటలాడుద మనువారు నింతమాత్రంబునకే రామ
భూకాంతుఁ డింతసాహసంబు సేయవచ్చునే యనువారు నిట్టిసాహసంబుచేయ
కున్న నిమ్మహాపవాదంబు భూపాలుం డేపగిదిన్ బాపుకొనఁ నోపుననువారు నట్టి
రట్టు వినినప్పుడె చెట్టువడి పుట్టినకోపంబు పట్టఁజాలక పాపపుణ్యంబులు కట్టిఁడి

ప్రజల మీఁదఁ బెట్టి పట్టభద్రుం డిట్టిబెట్టిదంపుఁబని సేసె నతని నట్టిట్లనఁగూడునే
యనువారు నెఱుక మాలి మొఱకుతనంబుతో నట్టిపరమపతివ్రతఁ బలికిన వారు
చల్లగాఁ బ్రతికెద రనువారును వీరి బ్రతుకు బంగారమయ్యె నిప్పుడు బంగారు
వంటికాఁపురంబు విడిచి యీశృంగారవతి కాఱడవులఁ బడి బడలికతో నడలు
చున్నది గదా యనువారును బూచినతంగేడువలె సింగారించిన రథంబువలెఁ
గన్నులపంకువగునిండుచూలాలి నడవులపాలుసేసి తాళవచ్చునే మన జనపాలుం
డేలాగునఁ దాల్మి దాల్చి నిల్చినవాఁడో యనువారును నిందు వేవురు గలిగి
దిక్కులేనిదానివలెఁ గానలఁ బడి తల్లీ యెంత సంతాపించెదవో యని సీతా
కాంతఁ దలంచుకొని దుఃఖించువారును దైవమా యిటువంటియగచాట్లు
పగవారికైనఁ దగవు సుమీ యని కన్నీరు నించువారును నై పలుచందం
బులఁ బలుక నాలకించుచు నేనుంగుమొగసాలకడ రథంబు డిగ్గి సుమంత్రుని
సగౌరవంబుగా నింటికిఁ బనిచి నట్టడవులలో మీపట్టంపుదేవిని విడిచి పెట్టివచ్చితి
నని యీగొట్టుమాట దిట్టతనంబుతో నధిపతికిఁ జేరి యింక నెట్లు విన్నపంబు
సేయుదు దైన్యరసంబునకు సదనం బగుశ్రీరామదేవునివదనంబుఁ జూచి యేచం
దంబునఁ దాళుదు నని తహతహపడుచు విన్ననై కొన్ని కక్ష్యాంతరంబులు
గడచి రాయంచ లేనికొలంకువలె రత్నంబు లేనిపెట్టియవలెఁ బద్మంబు లేనికొలను
వలెఁ జంద్రకళ లేనిగగనంబువలె సరస్వతి లేనిముఖంబువలె రామభక్తి లేని
చిత్తంబువలె నుపకృతిలేనిసంపదవలెఁ గీర్తిలేని బ్రదుకువలె వార్తలేనికవిత్వంబు
వలెఁ గాంతిలేనియద్దంబువలె శాంతి లేనితపంబువలె శాఖ లేనిచెట్టువలె రేఖ
లేనిబొందివలె సకలవైభవంబులు గలిగియు జనకనందన లేనందునఁ జెన్ను
దఱిఁగి విన్ననై యున్న యన్నగరు ప్రవేశించి తదీయగృహాభ్యంతరంబున. 343

సీ. ఏకతంబునఁ దొల్లి యింతి పల్కినకూర్మి పల్కులు వాక్రుచ్చి పనవి పనవి
ప్రజలమిథ్యానిందఁ బాటించి వడి నెంత తెగువ సేసితి నంచుఁ బొగిలి పొగిలి
యీమాట సౌమిత్రి యెఱిఁగింప సతి యేమి యయ్యెనో వని నంచు నడలి యడలి
ప్రాణేశ్వరినిఁ బాసి ప్రాణంబు లిఁక మేన నిలుచునే యని భీతిఁ గలఁగి కలఁగి

తే. యేసుఖము నింక నేలని యెంచి యెంచి
నేత్రముల శోకబాష్పముల్ నించి నించి
పొరిగి పలుమాఱుఁ బాన్పుపై నొఱగి యొఱగి
యలయువిభుఁ జూచి లక్ష్మణుం డార్తుఁ డగుచు. 344

క. చేరి తమయన్నపాదాంభోరుహముల వ్రాలి యశ్రుపూరము లెత్తై
పాఱ నడలంగ ధృతి సెడి, యారఘువరుఁ డతనిమస్తమశ్రుల ముంచెన్. 345

ఉ. ఆయెడ లక్ష్మణుండు హృదయంబున ధైర్యము పెంచి లేచి భూ
నాయకచంద్రుదీనవదనంబున సాశ్రునిరీక్షణావళుల్

డాయఁగఁ జేసి దేవరయలంఘ్యతరాజ్ఞ వహించి సీతఁ గొం
పోయి సురాపగాతటతపోవనభూముల డించి వచ్చితిన్. 346

ఉ. ఆనతు లెన్ని యైన గల వర్కకులాధిప దాఁట వచ్చునే
దైవగతుల్ శరీరికి సదా కలదే సుఖ మార్తిఁ జెందినన్
బోవునె వచ్చునాపదలు పుట్టి లయించుట కూడి పాయుటల్
జీవులకున్ స్వభావములు చిన్మయమూర్తివి నీ వెఱుంగవే. 347

చ. వగచుట పాడి గాదు మిముబోటిమహాత్ముల కాత్మతత్త్వమున్
దగిలి తలంచి చూచినఁ బృథగ్విధ మెయ్యది సచ్చిదాత్మకం
బగుపరమాత్మ నీవు జగ మంతయు నీవు దలంప నయ్యె నా
దిగురుఁడ వైననీకు నుపదేశము నే నొనరించువాఁడనే. 348

చ. అవనిజలాగ్ని వాయుగగనాత్మకమైన ప్రపంచ మంతయున్
వివిధచరాచరావళులు నీ వయి నిండి వెలుంగుచుండఁగా
నవనిజ యెందుఁ బోయినది యయ్య భవద్వ్యతిరిక్తమైనవ
స్తు వొకటి యున్నదే మఱపుఁజూపునఁ జూచి తలంక నేటికిన్. 349

చ. అమలత మిమ్మెఱింగినమహాత్ములె పుత్త్రకళత్రమిత్త్రవ
ర్గముపయి మోహముంచక విరక్తి వహింపఁగ మీకుఁ జెల్లునే
భ్రమ గొని వందుకున్ దరుణిఁ బాసి ధరాపతిపాలనంబు సే
య మఱచె రాముఁ డంచు ననరా ప్రజలాశ్రితరక్షణోత్సుకా. 350

మ. అని బోధింపఁ గలంక దేఱి రఘువంశాంబోధిచంద్రుండు త
మ్ముని నెమ్మోము ప్రసన్నదృష్టిఁ గని సమ్మోదంబు వాటిల్లె నీ
యనవద్యోక్తి హజారమున్ దొరసి యన్నా నాల్గునాళ్లయ్యె భూ
జనసంరక్షణ మెల్లి కైన ఘటియించన్ బోదగున్ వేడుకన్. 351

వ. అని యానతిచ్చి యచ్చండాంశువంశమండనుండు వెండియు ననుంగుఁ దమ్మునిన్ గనుంగొని యిట్లనియె. 352

మ. సుజనానీకముఁ బ్రోచుచున్ కుజనులన్ శోధించి దండించుచున్
బ్రజ లాయాయెడఁ దెల్పువిన్నపము నొప్పన్ వించు భూపాలనం
బు జనాధీశుఁ డొనర్చి కీర్తి వడయున్ భోగప్రమత్తాత్ముఁ డై
న జనుల్ దిట్టుదు రిచ్చటన్ నిరయసంతప్తాంగుఁ డౌ నచ్చటన్. 353

క. ఇల తేఁడు సుకృతి ననుచును, బలుమఱు లోపల నె యుండి ప్రజవిన్నపమున్
దెలియ వినఁడేనిఁ గీడగుఁ, గల దీయర్థమున నొక్క కథ విను మనఘా. 354

రాముఁడు లక్ష్మణునకు నృగుని వృత్తాంతము వచించుట

చ. నృగుఁ డనురాజు తొల్లి యతినిర్మలకీర్తియు బ్రాహ్మణప్రియుం
డగణితవిక్రమోన్నతుఁ డహంకృతి శూన్యుఁడు సత్యవాది నాఁ

బొంగడిత కెక్కు రత్నమయభూషణభూషిత లై సవత్స లై
తగుబహుధేనువుల్ దినము దానము సేయు మహీసురాళికిన్. 355

చ. అతఁ డొకపుణ్యకాలమున నర్బుదసంఖ్యల మించు నైచికీ
ప్రతతి సదక్షిణాకముగ బ్రాహ్మణకోటుల కిచ్చుచోట సు
వ్రతుఁడగు నొక్కవిప్రుని సవత్సకధేను వనేకధేను సం
గతి నట రా నెఱుంగ కొకభూసురుఁ బిల్చి నృపాలుఁ డిచ్చినన్. 356

క. దానముఁ గొని యతఁ డేఁగిన, ధేనువుఁ గలవిప్రుఁ డాత్మధేనువు నెందుల్
గానక బహుదివసంబులు, దీనుం డై వెదకె నెల్లదేశములందున్. 357

తే. గోత్రఁ గలగోత్రలం దెల్ల గోవు వెదకి
గాత్ర మలయంగ నతఁ డంతఁ గనకలాఖ్య
దేశమున కేగి యందొక్క ద్విజునియింట
దూడతో నున్నతన ద్రోణదుఘను గాంచె. 358

క. కాంచి హర్షించి శబలీ, యంచుల్ బిలుచుటయు నొడయఁ డరుదెంచినవాఁ
డంచు నది దూడతోఁ జను,దెంచి తనువు మూర్కొనంగ ద్విజుఁ డింపొదవన్.

క. తనధేనువు తనుఁ జేరెను, బని యే మెవ్వరికి ననుచుఁ బనివడి వెంటన్
జనుదెంచునావుఁ దోకొని, చన దానము వట్టినట్టిభూసురుఁ డలుకన్. 360

మ. తగునే నాయిలు సొచ్చి నామొదవు నుద్దండంబుతోఁ గొంచు బా
ఱఁగఁ జోరత్వము గాక యిత్తెఱఁగు ధీరత్వంబె యం చుద్ధతిన్
సిగ వీడన్ వెనుచక్కిపింజ వదలం జేపట్లకున్ వచ్చినన్
నగి యావిప్రుఁడు వెఱ్ఱి యన్యధన మైనన్ నేను గైకొందునే. 361

క. నామొద విది నిక్కువముగ, నేమందలఁ గలిసి తప్పి యిటఁ జేరెనదో
యీ మొదవుఁ గానకయె యీ, సీమంతయుఁ దిరిగి యలతఁ జెందితి ననినన్.

ఉ. ఇచ్చినయట్టిదాత నృగుఁ డీమొదవున్ గయికొన్నవాడ నే
నిచ్చటనే వచించెదవె యీ యనృతోక్తులు రాజుచెంతకున్
జెచ్చెర రమ్ము చూత మని చేకొని నాతఁడు వల్కఁగా దనన్
వచ్చునె యట్టులైన నని వచ్చె నతండును గోసమేతుఁ డై. 363

ఆ. వచ్చి పెక్కునాళ్లు వసుధేశువాకిలి, గాంచి యతని సమ్ముఖంబు లేమి
రోసి ద్విజులు నృగుని నూసరవెల్లి నై, పుట్టు మనుచుఁ దిట్టి పోయి రనఘ.

శా. ఆశాపంబు నృగావనీశునకు బాహ్యద్వారగుల్ దెల్ప నెం
తే శోకించి నిజాశ్రితాప్తహితమంత్రిశ్రేణికవ్యాజసం
కాశం బౌద్విజశాపమున్ నొడివి వేగన్ బుత్త్రు సర్వక్షమా
ధీశున్ జేసి నయానయంబులు హితోక్తిం దెల్పి ధైర్యంబునన్. 365

చ. వలియును మంచు నెండయును వానయుఁ గాలియుఁ జేర నీనిబ
ల్కులు గటుచేయఁ బంచి యది గన్పడ కుండఁగఁ బుట్టలుం బొదల్
బలువుగ సంఘటింపుఁ డని పల్కి నిజాకృతి డించి చొచ్చి యం
దలయుచు నున్నవాఁ డిపుడు నానృగుఁ డూసరవెల్లిరూపునన్. 366

రాముఁడు లక్ష్మణునకు నిమివృత్తాంతముఁ జెప్పుట

క. కావున మత్తుం డగునృపుఁ, డావిధమునఁ హానిఁ జెందు ననఘా నిమి యన్
భూవరుఁడును గురుశాపము, చే వనరుట మత్తవృత్తిఁ జెందియ కాదే. 367

ఉ. ఆకథ యెట్టు లన్న విను మాదియుగంబున సూర్యవంశజుం
డై కొమరొందుచుండు నిమి యన్ జననాథవరుండు శత్రుశి
క్షాకుశలుం డతండు రహిఁ గౌతమమౌనివనంబు చెంత లో
కైకమనోహరం బగుమహాపురి యొండొనరించి దానికిన్. 368

ఆ. వల్గుసౌధవిజిత వైజయంతము గానఁ, వైజయంత మనెడివరసమాఖ్య
యమరఁ జేసి యచట నమరనాథునిఁ బోలి, యవని నేలుచుండి యాఘనుండు.

క. గురునిభుఁ డనఁ దగుతనకుల, గురునిన్ గని యొక్కనాఁడు గురుమతి నే న
ధ్వర మొకటి సేయఁ బూనితిఁ, గరుణన్ మీ రది వహించి కడ తేర్పుఁ డనన్.

ఉ. ఆర్యశిఖావతంస మతఁ డాతనికి ట్లను నన్ను మున్నె య
ధ్వర్యతకున్ వరించె మఖవంతుఁడు తన్మఖ మైన భూమిభృ
ద్వర్య భవన్మఖంబునకు వచ్చెదఁ దాళు మటంచుఁ బోయినన్
గ్రౌర్యముతో నృపాలకుఁడు గౌతమమౌని వరించి చెచ్చెరన్. 371

శా. భృగ్వత్రిచ్యవనాదు లైనఋషులన్ బిల్పించి ప్రార్థించి ఋ
త్విగ్వర్గంబుగ వారిఁ జేకొని తదాదేశాప్తి శీతాచల
ప్రాగ్విశ్వంభరి యజ్ఞశాలఁ దగ శుంభత్సంపదన్ దద్ధరా
భుగ్వంశాగ్రణి దీర్ఘసత్రము జగంబుల్ మెచ్చఁ జేసెన్ రహిన్. 372

ఆ. అయిదువేలయేఁడు లడిగినవారికి, లేదు నాక వరమణీదుకూల
భూషణాన్నదానములఁ దృప్తిఁ గావించె, నతనికలిమిఁ బొగడ నలవి యగునె.

ఉ. అంతకుమున్నె యింద్రుమఖ మైనఁ దదర్త్విజుఁ డై యరుంధతీ
కాంతుఁడు వచ్చి యంతయును గన్గొని నన్ను గురున్ ద్యజించి దు
శ్చింత మఱొక్కనిన్ గురునిఁ జేసికొనెన్ నిమి వీనికండక్రో
వ్వాంతయు నేఁ డడంతు నని యల్కను వాకిటఁ గాచి యున్నెడన్. 374

ఆ. బడలి పగలు నాక పవళించి నిమి యంతి, పురమునందు నిదుర వోవుచున్కి
నెఱుఁగఁ డవ్వసిష్ఠుఁ డేతెంచి కాచుట,యిలఁ బ్రమత్తజనుల కెఱుక గలదె. 375

చ. ఇటుల ముహూర్తమాత్ర మవనీంద్రునివాకిటఁ గాచి రాక యుం
డుటకు సహింప కాయజతనూజుఁడు కాయజుమే నడంచు ధూ

ర్జటివలె మండి నన్ విడిచి జన్మము సేసియుఁ జెంతఁ జేరఁ డీ
కుటిలుఁడు వీఁ డనంగుఁ డయి క్రుమ్మరుఁ గా కని శాప మిచ్చినన్. 376

ఉ. ఆయన శాప మెట్టిదో నృపాగ్రణికాయము వీడె నప్పుడే
కాయముకంటె ముందు కడగాఁ జనె నిద్రయు నివ్విధంబు భూ
నాయకుఁ డాత్మలోఁ దెలిసి నన్ను వృథా శపియించి నాతఁడున్
గాయముఁ బాసి గాసివడుఁ గా కని క్రమ్మఱ శాప మిచ్చినన్. 377

క. ఇతరేతర శాపోక్తుల, యతియును నృపతియు విదేహులై రప్పుడు దుః
ఖితుఁ డయి వసిష్ఠముని శత,ధృతికడకున్ బోయి తన్నుఁ దెలిపికొని యనున్.

మ. నిమిశాపంబున స్థూలదేహ మడఁగెన్ నే సూక్ష్మదేహంబుతో
నమరారాధ్య భవత్పదాబ్జములు డాయన్ వచ్చితిన్ స్థూలదే
హముఁ బ్రాపించు నుపాయ మేమి యిఁక నెం దావిర్భవింతున్ దయా
సుముఖత్వంబున నానతీయఁ దగు నంచున్ దీనుఁడై వేఁడినన్. 379

క. పరమేష్ఠి వలికె మిత్రా,వరుణుల తేజంబు సొచ్చి వారలవలనన్
ధర నీవయోనిజుఁడవై, భరియింపుము దేహ మనుచుఁ బంచిన నతఁడున్,

ఉ. ఆవిధి యానతిచ్చినక్రియన్ వరుణాలయ మొందె నంత మి
త్రావరుణుల్ పయోధితటధారుణిఁ గ్రుమ్మరుచుండి యొక్కలీ
లావనవీథి నూర్వశి మెలంగుట గన్గొని రందు మిత్రుపై
నావగలాఁడిచూపు లొలయన్ దమి నాతఁడు మన్మథార్తుఁడై. 381

ఆ. చానఁ గదిసినంతఁ జరమధాతువు జాఱ, నది గ్రహించి ఘటమునందు డించి
వరుణుచెంత మెలఁగ వరుణుండు కామించి,సంభ్రమించి కదియ సకియ పలికె,

క. మిత్రుఁడు వరించె దొలుతఁ గ,శత్రముగా నింక మీరు లక్షించుటకున్
బాత్ర మగు నేని మామక, గాత్రము దిలకించి సుఖము గైకొనుఁ డనినన్. 383

తే. దాని తిన్నని నునుఁ బల్కు దానికుల్కు
దానివయ్యారమును మెచ్చి తాల్మి నిలువ
లేక వరుణుండు గూడ స్ఖలించెఁ దేజ
మదియు మునుపటిఘటమందె యతివ యుంచె. 384

ఉ. అందుల కల్గి మిత్రుఁ డతివా నను ముందర సెంది యుండియున్
నిందకుఁ దాళి యవ్వరుణునిన్ గదియన్ జన నీకు ధర్మమే
యిందున భూమియందె వసియించి పురూరవుభార్యవై సడిన్
బొందు మటంచుఁ దిట్టె ఘటిఁ బుట్టి రగస్త్యవసిష్ఠు లిర్వురున్. 385

క. చనియె నగస్త్యుఁడు తపమున, కినవంశాంభోధిచంద్రుఁ డిక్ష్వాకుఁడు దో
డ్కొని వచ్చె నవ్వసిష్ఠునిఁ, దన కెప్పటివలెఁ బురోహితత్వ మొనర్పన్. 386

వ. ఇది వసిష్ఠు జన్మప్రకారం బింక నిమిరాజవృత్తాంతంబుఁ దెల్పెద విను మని రామ
భూకాంతుం డూర్మిళాకాంతున కిట్లనియె. 387

మ. నిమిదేహంబు మణీమయాభరణపంక్తిన్ వస్త్రమాల్యానులే
పములన్ మాను లలంకరించి విధి యొప్పన్ యాగశేషంబు పూ
ర్ణము గావింప నిజాంశముల్ గొనుట నానందించి బృందారకుల్
గుమి యై పల్కిరి ముక్తదేహుఁ డగు నా క్షోణీశమూర్ధన్యునిన్. 388

మ. నిమిరాజేంద్ర నిరంతరాయదశఁ జెందన్ నీమఖం బాత్మ భా
గములన్ దృప్తుల మైతి మందఱము నింకన్ గోరు మేకోర్కి యై
న ముదం బొందఁగ నీ కొసంగెద మటన్నన్ బ్రాణిసంఘంబు నే
త్రములన్ నిచ్చలు నిల్వనిం డనియె నాతం డిచ్చి రద్దేవతల్. 389

క. నిమి నిల్చుటఁ గనుఱెప్పలు, నిమిషము లనుఖ్యాతిఁ జెందె నిమిదేహము సం
యములు సురల్ మథియింపఁగ, నమితగుణాకరుఁడు జనకుఁ డచ్చటఁ బొడమెన్.

ఆ. వీతదేహు ముద్భవించిన నెల వౌట, నితఁడు దగ విదేహుఁ డనెడు పేర
మథనజాతుఁ డగుట మిథి యన వర్తిల్లె, నతని ప్రోలు మిథిల యనఁగఁ దనరె. 391

మ. అనినన్ లక్ష్మణుఁ డద్భుతం బొదవ రామాధీశు వీక్షించి దే
వ నిమిక్ష్మాపతి సత్యధర్మకరుణావర్ధిష్ణుఁ డయ్యున్ వసి
ష్ఠునకున్ గ్రమ్మఱ శాప మిచ్చె క్షమ యచ్చోఁ గన్నఁ బెం పొందఁడే
తనకున్ గోపము చెల్లునే యనిన సీతానాయకుం డిట్లనున్. 392

రాముఁడు లక్ష్మణునకు యయాతి వృత్తాంతము చెప్పుట

ఉ. అంతరవైరి గాదె యనఘా పెనుకోపము తద్విముక్తుఁ డై
క్షాంతి వహింప నొక్కనికి శక్యమె తొల్లి యయాతిధారుణీ
కాంతున కింత చెల్లినది ఖ్యాతి వహించిన యమ్మహాత్మువృ
త్తాంతము కొంత దెల్పెదఁ బ్రియం బెనయన్ విను మంచు నిట్లనున్. 393

ఉ. ఆతతనీతి మించు నహుషాధిపసూతి ప్రభాకరప్రతి
జ్యోతి కృతాధ్వరత్రిదశహూతి నిరీతి గుణాతిమానిత
ఖ్యాతి ధరాభిరక్షణచణాంచితహేతి మహావిభూతి స
ద్వ్రాతవినీతి బంధువశితాతి యయాతి జితాభియాతి యై. 394

క. వృషపర్వాభిధదివిష, ద్ద్విషదగ్రణిపుత్త్రి దైత్యదేశికపుత్త్రిన్
వృషభాన్వతులితుఁ డతులిత, వృషపర్వుఁ డతండు దాఁ బరిణయమ్మయ్యెన్. 395

తే. మేదినీభర్త తొలుత శర్మిష్ఠవలనఁ
బూరు సితకీర్తిగంగాంబుపూరుఁ గనియె
యానకలహంసి యగు దేవయానవలన
నవ్వెనుక శత్రుభయదునిఁ యదునిఁ గనియె. 396

చ. దయ వృషపర్వపుత్త్రియెడఁ దద్దయు నుంచి యయాతి భార్గవ
ప్రియసుత నాదరింపక చరింప యదుం డది చూచి తల్లి కెం
తయు నెగఁబోసి రోస మెదఁ దార్కొనఁ జేసిన నామె మందబు
ద్ధి యయి గురుఁ దలంప నరుదెంచె భృగూద్వహుఁ డుజ్జ్వలద్ద్యుతిన్. 397

క. అరుదెంచి యతఁడు సుత తన, చరణాంబురుహంబు లశ్రుజలములఁ గడుగన్
వెఱఁగంది యేల తల్లీ, పరితాపముఁ జెందె దనుచుఁ బలుమఱు నడుగన్. 398

ఉ. కన్నులనీరు చెక్కులను గాల్వలు గట్టఁగఁ బుత్త్రి వల్కె నో
యన్న మతేమి తెల్పెద యయాతి సదావృషపర్వపుత్త్రికిన్
మన్నన సేయుఁ గాని యొకనాఁడును నన్నుఁ దలంపఁ డింతయున్
విన్నప మాచరించి నిను వీడ్కొని మేను త్యజింప నెంచితిన్. 399

క. పతి సవతిఁ గూడుకొని యవ,మతి సేసిన బ్రతుకుకంటె మగువకు మేలౌ
మతిఁ దలఁప జలవిషానల, గతులన్ మృతిఁ జెందు నుపమ గాంచుటలనినన్.

మ. తనపుత్త్రిన్ గరుణించి మాను మిఁక సంతాపంబు నాతల్లి యౌ
వనగర్వంబున నిన్నుఁ గైకొనని భూవజ్రాయుధుం డింతటన్
గనుఁ గా కెంతయు వృద్ధభావ మనుచున్ గావ్యుండు శపించి పో
యిన జీర్ణించియు మామపై నలుగఁ డయ్యెన్ రాజు సామాన్యుఁడే. 401

మ. జరఠత్వం బటులన్ వహించి శశవంశస్వామి భోగస్పృహా
పరుఁడై జవ్వన మగ్రపుత్త్రుఁ డొసఁగన్ బ్రాపించి పెక్కేఁడు లి
ద్దఱుదేవేరులతో సుఖించి ప్రజలన్ ధర్మస్థితిన్ బ్రోచి య
ధ్వరముల్ సేసి ధనార్థులన్ మనిచి యంతన్ దృప్తి వాటిల్లినన్. 402

క. తనముదిమి తాను గొని జ,వ్వనము కుమారున కొసంగి వానిన్ జనపా
లన ఖేలనలోలునిఁ గాఁ, బొనరిచి యాసుకృతి సనెఁ దపోవనమునకున్. 403

ఆ. యదుఁడు తండ్రిమాట కెదురాడియతని శా,పమున రాజ్యభరణవిముఖుఁ డయ్యెఁ
గ్రూరసంతతులకు గురుఁ డయ్యెఁ బితృనింద, చేయువాఁడు కీడుఁ జెందు టరుదె.

క. పూరుఁడు గురుభక్తిఁ జేకొని, ధీరుండై కీర్తిఁ గని ప్రతిష్ఠానపురా
ధారుం డై యిందుకులో,ద్ధారుం డై భూమి యేలెఁ దండ్రి తెఱఁగునన్. 405

ఉ. గాత్రముఁ బాయు మంచు గురుఁ గ్రమ్మఱ దిట్టి తదుద్భవవ్యథా
పాత్రమనస్కుఁ డయ్యె నిమి భార్గవుఁ గ్రమ్మఱఁ దిట్ట నోపియున్
క్షత్త్రియధర్మ మూని గుణశాలి యయాతి శమించెఁ గ్రమ్మఱన్
ధాత్త్రియు నేలె సౌఖ్యమయతన్ విలసిల్లె నుతింపఁ జెల్లదే. 406

ఆశ్వాసాంతము

క. అని యివి మొదలయిన పురా, తనపుణ్యశ్లోకకథలు తనతమ్మునకున్
వినిపించుచు దినశేషం, బును రాత్రియుఁ గడపి రామభూవరుఁ డెలమిన్. 407

ఉ. నిక్ష్యవతీశవంశ నలినీదినరాజ నరాజయస్పృహా
ద్విడ్వ్యవసచ్ఛటానలదుదీర్ణవిలోకవిశోకభూపరి
వ్రాడ్వ్యమశుద్ధబుద్ధిగృహవర్తనభోగ నభోగధామణీ
రుడ్వ్యత కేళికాదనగుదుక్రమసార మసార విగ్రహా. 408

క. కాళిందీహ్రదకల్లోలుప, కాళియఫణరంగనటనఘటనా వేళా
వేలార్తిమద్భుజంగమ, బాలాసంస్తవనలోల పావనశీలా. 409

మత్తకోకిల—
నారదాదిమునీంద్రచాతకనారదాభశరీర సం
సారసారసగర్వనిర్వృతిసారసారసవైరిబృం
దారకాహితయోధయూథవిదారకాశుగవార నీ
హారపారదశారదాహారహారపాండుయశోనిధీ. 410

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాపాదితచతుర్విధాన
వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ
వితీర్ణవైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర
ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన
వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర
కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన
నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన
నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామా
యణంబను మహాకావ్యంబునందుఁ షష్ఠాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## సప్తమాశ్వాసము

—:o:—

క. శ్రీలలితమిత్రబిందా
బాలామృదులోరునిహితపదపంకజ భ
ద్రాలోలలోచనాకచ
కీలితనవహేమదామ కితవవిరామా. 1

తే. అవధరింపుము రామచంద్రావనీంద్ర, వర్యుఁ డీరీతి నవ్విభావరిఁ గ్రమించి
కల్యమున లేచి సంధ్యాదికములు దీర్చి, కొలువుసింగారమై సభాస్థలికిఁ బోయి. 2

సీ. భరతాదిసోదరుల్ ప్రణతులై యట నిల్చి కనుసన్నఁ బనిచినపను లొనర్పఁ
బ్రేమమీఱ వసిష్ఠవామదేవాదికుల్ మొనసి యాశీర్వాదములు ఘటింప
స్వామి పరాకు హెచ్చరిక హెచ్చరి కంచుసారెఁ గంచుకులు హెచ్చరిక దెలుప
మంత్రులాశ్రితులు సుమంత్రాదు లెడనెడ నెలమిఁతోఁ బొడగని కొలువుసేయ

తే. గములుకొని మన్నెదొరలూడిగములు సలుప
హైమసింహాసనంబుపై నధివసించి
యుదయగిరి నిల్చుప్రొద్దుతో నుద్ది యగుచుఁ
బెద్దకొలువుండె దశరథు పెద్దకొడుకు. 3

తే. ఇవ్విధంబునఁ గొలువుండి యినకులుండు, మ్రోలనిలుచున్న లక్ష్మణు మోముఁజూచి
యీవు మొగసాల కేగి యం దెవ్వ రేని, మనవిగలదన్నఁ దోడి తెమ్మనుచుఁ బనుప.

చ. అతఁడు మహాప్రసాద మని యప్పుడె వాకిటి కేఁగుదెంచి యం
దతినిబిడంబుగా నిలిచినట్టిప్రజల్ గని రామధారుణీ
పతి యపు డానతిచ్చిన సుభాషిత మందఱితోడఁ దెల్పినన్
క్షితిజను లెల్ల నాయనకుఁ జేతులు మోడ్చి వచించి రింపుగన్. 5

తే. చంద్రుఁబోలినశ్రీరామచంద్రుమోము, గన్నులనుజూడఁ గోరుటొక్కటియె కాక
యనఘపరిపూర్ణకాముల మైనమేము, విన్నపము చేయుమనవి యేమున్న దిపుడు. 6

సీ. భద్రేభములయందె పాయనిమదవృత్తి మధుకరావళియందె మలినగుణము
చంచలాలతలందె చంచలభావంబు చెలులవెన్నడలందె యలసగరిమ

మిథునసంగతులందె మించుబంధము లెల్ల నలయర్ధచంద్రునియందె కొఱంత
కడిఁదిపుట్టలయందె ఘనతరాహిభయంబు లపరపక్షపురాత్రులందె తమము

తే. ప్రతిపదాదులయందె తీఁజనిప్రదోష
మాత్రవిదులసమాధులయందె మఱవు
గాని మఱియెందు వెదకియుఁ గానమయ్యె
రఘుకులస్వామి పాలించురాజ్యమునను 7

సీ. కాననంబులయందె కాదుగా సుమనోవిలాసనంపద ప్రజలకును గలదు
గంధసారమునందె కాదుగా సంతతామోదంబు భూజనమునకుఁ గలదు
గగనాంతరమునందె కాదుగా ఘనలక్ష్మి తఱచుగాఁ బౌరసంతతికిఁ గలదు
కనకాంబరమునందె కాదుగా సుగుణసందోహాప్తి జానపదులకుఁ గలదు

తే. కలితవిక్రమధానుష్కకరమునందె, కాదుగా ధర్మ మిలనెల్లఁ గలదు రామ
చంద్రుఁ డెప్పుడుఁ బరిపూర్ణచంద్రులీల, రాజ్యమొనరింప నేమికొఱంత యనిన. 8

శ్రీరామునితో భిక్షుతాడితమైన యొకశునకంబు తనవృత్తాంతంబు దెలిపికొనుట

క. ఆలించుచున్న నచటికిఁ, గాలేయక మొకటి వచ్చి కడువడి నెత్తిన్
గీలాలధార దొరఁగన్ దూలుచు, మొఱ సేయ లక్ష్మణుఁడు కని కరుణన్. 9

తే. చేరఁ జని యేల నీనడి శిరము పగలె, నిచట మొఱసేయుటకు నేమి హేతువనిన
నగతికుల కెల్ల గతి యైన యధిపుతోడఁ, గాని నేఁ దెల్ప నని భషకంబు వలుక.

తే. మంచి దని స్వామికడకు లక్ష్మణుఁడు వోయి
వినయమునఁ దోడ్తొఁ బ్రజమాట విసికిసేసి
వెనుక శునకంబు తెఱఁగును వినఁగ జెప్పి
మనుజపతి దానిఁ దెమ్మన్న మరల నేఁగి. 11

మ. పతి దోడ్తెమ్మనె నిన్ను రమ్మనినఁ గంపం బూని భూదేవతల్
యతులున్ నిల్చుసభాస్థలంబునకు రమ్మంచున్ ననున్ బిల్చు టే
చతురత్వం బని సారమేయ మనినన్ సౌమిత్రి యమ్మాటయున్
క్షితిరాణ్మౌళికిఁ దెల్ప దాని యరుదెంచెన్ రాముఁ డచ్చోటికిన్. 12

క. అరుదెంచి నెత్తి నెత్తుటి, వఱదల జొత్తిల్ల నగరివాకిట వెతతో
నిరవుకొని యున్న శునకముఁ, బరికించి వచింపు మేల పఱతెంచి తనన్. 13

ఉ. ఆమృగదంశకం బనియె నర్కకులేంద్ర యలర్కమేమి యిం
దేమిటి కేఁగుదెంచినది యేటికిఁ గొట్టుము నాక లీల నేఁ
డీమును లీనృపాలమణు లిందఱు గొల్వఁగ నిందు వచ్చినా
వే మని నీదయాదికసమిద్ధగుణంబులు సన్నుతింపుదున్. 14

సీ. జలధిబంధనవేళ బలవత్కపులకన్న మించఁగా నుడుత లాలించ లేదె
శుకవామదేవాదులకు సమానముఁ జేసి యెలమిఁ బక్షికి మోక్ష మియ్య లేదె

హనుమంతుచేక్షేమ మరయుచో భరతుకన్నను మున్నె గుహుఁ డేఁడఁబనుప లేదె
శబరి యిచ్చినపండ్లచవి భరద్వాజుల విం దొక్కరీతి భావింప లేదె

తే. దొడ్డ కొంచెంబు లున్నవే దొరవు నీక, టాతుమున కెవ్వఁడైనచో నాశ్రయింపఁ
గదిసి రక్షించుటయె నీకుఁ గలగుణంబు, రఘుకులక్షీరనిధిచంద్ర రామచంద్ర. 15

చ. హరిహయవహ్నిదండిదనుజాబ్ధిపవాయుకుబేరశంభుభా
స్కరరజనీకరప్రముఖసర్వసుపర్వులుఁ దావకాంశజుల్
హరివి పరాత్పరుండవు కృపాకృతి దుర్జనశిక్ష సేయ ని
ద్ధర నవతార మొందితివి ధన్యతఁ జెందితి నిన్నుఁ జూచుటన్. 16

చ. నృపతికి సాధురక్షణ వహించుట ధర్మువు గాన నాదువి
న్నప మిఁక నాలకింపు జననాయక యెవ్వరి కెగ్గు సేయ కే
నెపుడుఁ జరింతు నీపురి నిదేమియొ నేఁ డొకభిక్షుకుండు నన్
గుపితమతిన్ శిరం బవియఁ గొట్టెఁ బరామరిసింపవే యనన్. 17

ఉ. అక్కరుణాబ్ధి రామవిభుఁ డప్పుడె భిక్షుకుఁ బిల్వఁబంచి యి
క్కుక్కకు నీకు నేమి పగ కోపముతోఁ దల వ్రయ్యఁ గొట్టినా
వక్కట! విప్రవంశజుఁడ వయ్యు దురాగ్రహశత్రు గెల్వ లే
వెక్కడిభిక్షుకత్వ మిది యేటివిరక్తి యటంచు దూఱినన్. 18

తే. అతఁడు కరములు మొగిచి యిట్లనుచుఁ బలికె, దేవభిక్షార్థమింటింటఁదిరిగితిరిగి
యలసి నే రాఁగ నిది వీథి నడ్డమగుచుఁ, దలఁగ కున్నను గొట్టితిఁ దప్పుగలదు. 19

క. దండింపఁ దగుదు నేనున్, దండింపుము నన్ను నీవు దండించినచోఁ
దండింపఁ డింక మీఁదట, దండి యనిన విభుఁడు దగినదండన మరయన్. 20

క. కాలేయక మి ట్లనియెను, గాలాంజన మనెడిగిరిని గలదేవళమున్
బాలింప నితనిఁ బనుపుము, చాలు నదియె దండ మనిన జనపతి నగుచున్. 21

తే. అతని కపుడె తదాధిపత్యం బొసంగి, ప్రభుత కభిషేక మొనరించి భద్రగజము
మీఁద నెక్కించిపంచిన మేదినీంద్రుఁ, గాంచి మంత్రులువల్కిరక్కజముగాఁగ. 22

ఉ. తప్పొనరించి విప్రుఁడు ముదంబున దుర్గవిభుత్వ మొందెనం
చిప్పురి నున్నవిప్రజను లెల్లను జేయుదు రింక నీగతిన్
దప్పులె యంచుఁ బల్కఁ బతి నవ్వుచు నిప్పని కీడొ మంచిదో
చెప్పెడిఁ గుక్కరం బని వచించిన భైరవుతేజి యిట్లనున్. 23

ఉ. ఎంచఁగ నింతకంటెఁ గలదే యవమానము దేవ తొల్లి నే
నంచితవిప్రవంశజుఁడనై యలదేవగృహాధిపత్యమున్
గాంచి తదన్నభుక్తిఁ గొని కాదె వహించితి నిట్టిజన్మమున్
గొంచెమె దేవతార్థహృతి కుక్కతనం బొనరింప కుండునే. 24

క. జనవర దేవబ్రాహ్మణ, ధనహరణమహాఘదావదహనము వంశం
బనువంశాటవిఁ గాల్పక, చనునే యెవ్వానికి దానిఁ జనునె యొనర్పన్. 25

ఉ. కోసలపాలపత్త్రమునకున్ బనిఁ బూనియు నేను సాధుసం
సేవయు దీనపోషణము చేసితిఁ గావున నీభవంబునన్
భూవర జాతిసంస్మరణమున్ నహియించితిఁ గ్రూరుఁ డిద్ధరా
దేవుఁడు సత్క్రియాప్తిఁ గడతేఱఁ గలాఁడె తలంచి చూచినన్. 26

క. అని జాతిస్మృతి గలయా, శునకము రఘురాముఁ బొగడుచున్ వలగొని పి
డ్కొని కాశి కేఁగి యట నిర,శనతన్ గృశియించి పిదప సద్గతిఁ జెందెన్. 27

చ్యవనాదిమునులు రామునితో లవణాసురుని వృత్తాంతంబు జెప్పుట

చ. అవనిపుఁ డంత నెప్పటిక్రియన్ సభ కేఁగి వసించునంతలోఁ
జ్యవనమరీచికశ్యపదళాదవుల స్త్యఋచీకముఖ్యమా
నివహులు వచ్చి వాకిటను నిల్చినఁ జూచి సుమంత్రుఁ డెంతయున్
జవమునఁ బోయి యయ్యసురశత్రుని కంజలిఁ జేసి యిట్లనున్. 28

తే. స్వామి యమునాతటారణ్యవాసులైన
చ్యవనఋచికాదిసంయమీశ్వరులు వచ్చి
వాకిట నిల్చినారన్న వడిగ లేచి
వినయము భయంబు భక్తియుఁ బెనఁగొనంగ. 29

క. జడదారియొడయులకు న,ప్పుడ యెదురుగఁ బోయి పాదములకు వినతుఁడై
తోడితెచ్చి యుచితపీఠము, లిడి పూజ లొనర్చ వార లెల్లను వేడ్కన్. 30

తే. తాము తెచ్చినపుణ్యతీర్థములఁ బావ, నోదకంబులఁ బక్వఫలోత్కరములఁ
జిత్తములరంగ నిచ్చి యాశీర్వదింప, నెంతయు వినీతుఁడై రాముఁ డిట్టు లనియె.

శా. ఆధుల్ దీర్పఁగ నోపుమీచరణతోయంబుల్ శిరం బానె నా
నాధున్యంబువు లింక నేల మిము సందర్శింప నాసత్ఫలం
బే ధన్యాత్మునిఁ జేసెఁ గావలయునే యీపంచు లిట్లైనచో
సాధూత్తంసములార మీరు కరుణించన్ గా దనన్ వచ్చునే. 32

శా. నాసామంతచయంబు నాయనుజసంతానంబు నాదేహమున్
నాసర్వస్వము మీయధీనము కృపన్ నన్నున్ గటాక్షించి నే
దాసేయత్వముతో నొనర్పఁ దగు కృత్యంబుల్ ప్రబోధింపుఁ డం
చాసర్వంకషబుద్ధి వల్కు మును లత్యానందమగ్నాత్ములై. 33

ఉ. ఏనృపులైన నీకరణి నీవినయోక్తులు పల్కనేర్తురే
మానస మున్న వైఖరినె మాటల నాడెద వార్యపోషకుల్
భానుకులీను లందఱును బ్రాహ్మణభక్తియు దుష్టశిక్షయుం
బూనియుఁ గాదె నీవిచటఁ బుట్టుట రామ యటంచు నెంచఁగన్. 34

చ. చ్యవనుఁడు వల్కె రామనృపచంద్ర కృతంబున దైత్యవంశసం
భవుఁడు మధుండు నా నొకఁడు భాసిలు నాతఁడు ధర్మశాలియై
యవనిసురుల్ సురుల్ సుగుణుఁ డంచు నుతించ నుదంచితప్రభన్
భువిఁ జెలువొంది పెక్కుదినముల్ శివుఁ గూర్చి తపం బొనర్చినన్. 35

ఉ. ఆతప మిచ్చ మెచ్చి శివుఁ డాత్మజటాద్యుతి సాంధ్యరాగము
ద్ద్యోతితకాలకంఠరుచి తోరపుఁజీఁకటి దేహకాంతి చం
ద్రాతపముల్ సృజింప జగదద్భుతభంగి దృశింప నమ్మధుం
డాతతభక్తియుక్తినతుఁడై నుతియించె ననేకరీతులన్. 36

ఉ. సోమకళాధరుండు తనశూలముచే మఱియొండుశూల మొం
తే మహిమన్ సృజించి యది దివ్యకృపన్ మధుచేతి కిచ్చి సం
గ్రామమునన్ రిపున్ గెలిచి క్రమ్మఱఁ ని న్నిది చేరునే కదా
నీమది ధర్మ మేమఱిన నిక్కముగా ననుఁ జేరు నావుడున్. 37

చ. మధుఁ డది సమ్మతించి స్మరమర్దికిఁ గ్రమ్మఱ మ్రొక్కి మత్కులం
బు ధర గలంతకాలమును ముమ్మొనకైదువు నిల్పవే దయా
నిధి యన నీసుతుం డొకఁడు నీవెనుకన్ ధరియించి దీనిచే
నధికతఁ జెందు శూలధరుఁడై నపు డాతఁ డజయ్యుఁ డాజులన్. 38

క. శూలంబు మఱచె నేనియు, వాలాయము వైరిచేత వాఁడ హతుఁ డగున్
శూలం బెప్పటివలె మా, శూలములోఁ గలియుననుచు శూలి సనుటయున్.

ఉ. ఆనరభోజి యంతట దశాననుకూరిమిచెల్లెలైన కుం
భీనసి లంకఁ జొచ్చి బలిమిన్ గొనితెచ్చి హితోక్తిఁ బెండ్లియై
యానలినాక్షియందు లవణాసురుఁ డన్కుటిలాత్ముఁ గాంచె నం
భోనిధి కాలకూటవిషమున్ దొలి కాంచినలీల రాఘవా. 40

చ. కొడుకు దురాత్ముఁ డౌటకు జుగుప్స వహించి మధుండు వానికిన్
మృదునివరంబు దెల్పి యతఁ డిచ్చినశూల మొసంగి ధర్మమె
ప్పుడు విడకున్న మంచి దని ప్రోలికిఁ బట్టము గట్టి నెమ్మదిన్
బొడమినతాప మంతయును పోవఁగ వారిధిఁ జొచ్చె నత్తఱిన్. 41

క. అదిమొద లమ్మధుపుత్త్రుఁడు, మదమత్తుండగుచుఁ గలఁచు మాదృశమునులన్
మొదలఁగనియ్యఁడు మనుజులఁ, ద్రిదశుల బాధించు నేమి దెలుపుదు మధిపా. 42

మ. హరుశూలంబు వహించినాఁడనిన ధైర్యంబేది యేధారుణీ
శ్వరులున్ వాని నెదుర్కొనన్ వెఱతు రస్మద్రక్షణార్థంబుగా
ధర మీరుండఁగ నెవ్వరేఁటి కిఁక నేతత్కార్యమున్ నేఁడు దే
వరకున్ దెల్పఁగ వచ్చి రీమునులు ప్రోవన్ జెల్లునాపన్నులన్. 43

చ. లవణపయోధిఁ గట్టి సబలప్రబలానుజపుత్త్రమిత్త్రబాం
ధవముగ రావణాసురు వధం బొనరించిన మీకు లక్ష్యమే
లవణుఁడు వీని ద్రుంచి వికలత్వముఁ జెందినమానసంబు లు
త్సవజలరాశిఁ దేలెడివిధం బొనరింపఁ గదయ్య నావుడున్. 44

ఉ. ఆరఘువీరవర్యుఁడు కృతాంజలి యై మునులారా వాని కా
హారము లెవ్వి యెక్కడ విహారము సల్పుచు నుండు నెట్టియా
చారమునన్ జరించు నది సర్వముఁ దెల్పుఁడు వానిఁ బట్టి సం
హారము సేయు టెంతపని యన్న మహర్షులు వల్కి రందఱున్. 45

ఉ. నూఱుమదావళంబు లిరునూఱుహయుల్ పదివేలుదుష్ట లా
ర్వాఱుపశుల్ సహస్రచమరుల్ కిటిలక్షయు నొక్కపూట కా
హారము వానికిన్ మధువనాంతరమే విహరించుతాన మా
చారముఁ గూర్చి మంచితపిచారము దూర మటంచుఁ దెల్పినన్. 46

క. లవణునిశౌర్యము రఘుపతి, లవమునకున్ గొనక మునులన్ గని యింకన్
లవణు వధింతు నవశ్యము, భవదార్తి హరింతు ననుచుఁ బల్కెఁ బ్రియమునన్.

క. భరతుని మఱి శత్రుఘ్నునిఁ, గరుణాకలితేక్షణములఁ గనుఁగొని మీయి
ద్దఱిలో నెవ్వఁడు లవణునిఁ, బరిమార్పఁ గల రటన్న భరతుఁడు వల్కెన్. 48

రఘువీరుఁడు లవణాసుర సంహరింప శత్రుఘ్నుం బంపుట

శా. ధాత్రీనాయక నన్నుఁ బంపుము మహోద్యద్గాత్రుఁ గుంభీనసీ
పుత్త్రున్ నే వధియించి వచ్చెద యతుల్ భూదేవతల్ దేవతల్
విత్రాసస్థితు లింకఁ జెంద రనినన్ వే లేచి భూభర్తకున్
శత్రుఘ్నుండు కరాబ్జముల్ మొగిచి సంచద్భక్తితో నిట్లనున్. 49

మ. ఇనవంశాధిప మిమ్ముఁ బాసి పదునాల్గేండ్లున్ వెతన్ గూరలే
తిని నారల్ ధరియించి మై బడల నందిగ్రామవాసంబు సే
సినవాఁ డీభరతుండు మీచరణసంసేవాప్తి నిం దుండ నిం
పనిలో నే లవణున్ వధింపఁ గలనన్నంపింపుఁ డంచత్కృపన్. 50

క. తలఁచెద మీపదపద్మము, నిలిచెద మధుపురము చెంత నిమిషములోనన్
గెలిచెద లవణుని మీకృపఁ, బొలిచెద నన ననుజు మెచ్చి భూవరుఁ డనియెన్.

చ. అవిరళధైర్యశాలివి కృతాస్త్రుఁడ వాహవకోవిదుండ వీ
వపుట నిజంబకాఁ దెలిసి యంపెద వైరి వధించి భూరి వై
భవముల నీవు తత్పురముఁ బాలనసేయుము ధాత్రిఁ బ్రోచుధ
ర్మవునకు సాటి లేదనిరి మున్పటి పెద్దలు రాజనీతులన్. 52

ఉ. ఆలములో రిపున్ గెలిచి యారిపురాజ్యము ధర్మసంగతిన్
బాలన సేయకున్న నగుఁ బాపము పూర్వజునాజ్ఞ యెయ్యెడన్

బాలురకుఁ గ్రహింపఁ దగుఁ బల్కుకు మేమియు శత్రుపట్టణ
శ్రీలకు నీవె రాజ వభిషేకమహోత్సవ మందు మంచనన్. 53

చ. అళుకుచు లక్ష్మణావరజుఁ డగ్రజుఁ డుండఁగ రాజ్యవైభవం
బులు వహియింపఁ జిన్నలకుఁ బోలునె యం చనబోయి క్రమ్మఱన్
బలుకక క్రుక్కినన్ ధరణిపాలుఁడు లేనగ వంకురింపఁగా
లలితమనస్కుఁ డౌ భరతలక్ష్మణులన్ గని పల్కె నత్తఱిన్. 54

చ. తగునభిషేకవస్తువు లుదారతఁ దేఁ దగువారిఁ బంపుఁ డా
ర్యగురుపురోహితాప్తసచివాదులఁ బిల్వుఁడు పిన్నతమ్మునిన్
బగతుని పట్టణంబునకుఁ బట్టము గట్టెదు మాట వీటిలో
నెగడఁగఁ జాటఁ బంపుఁ డన నిల్వక వారలు తత్క్షణంబునన్. 55

ఆ. అధిపుఁ డానతిచ్చినట్ల్లియు జతకూర్చి, గురుపురోహితాదికులను బిలిచి
సకలకార్యములను సంఘటించితి మని, విన్నవింప రామవిభుఁడు దనరి. 56

సీ. శ్రీరస్తు రిపుజయశ్రీరస్తు తే యని క్షితిసురశ్రేష్ఠు లాశీర్వదింపఁ
బటహగోముఖశంఖపణవాద్యబహుతూర్యరవములు రోదోంతరముల నెరయ
హృద్యవాగనవద్యగద్యపద్యస్ఫూర్తిగ నిపింప వందిమాగధులు పొగడ
నటనశాస్త్రానుగుణ్యంబుగా గణికాంబుజాస్యలు సరసలాస్యంబు సలుపఁ

తే. దల్లు లందఱు గన్నులు చల్లఁ గాఁగ
జూచి కడు సంతసిల వసిష్ఠుండు మంగ
ళాభిషేకంబు గావింప ననుజునిటల
పట్టికను సువర్ణపట్టంబు గట్టె విభుఁడు. 57

చ. భవదనుజన్ము నేఁడు మధుపట్టణభర్త నొనర్చినప్పుడే
లవణుఁడు పోరిలోఁ బడియె లక్ష్మణపూర్వజ మీఁరు నెమ్మదిన్
దవిలి తలంచినట్టిపని తప్పునె సిద్ధము గాక యంచు నా
చ్యవనుఁడు మున్నుగాఁ గలమహర్షులు రాముని నెంచి రయ్యెడన్. 58

చ. అనుపమరత్నభూషణమహాప్రభ బాలదివాకరుండొ నాఁ
దనరుచుఁ జేర వచ్చి ప్రమదంబున నానతుఁ డైన పిన్నత
మ్ముని దయమీఱ నెత్తుకొని మూర్ధము మూర్కొని యక్కుఁ జేర్చి గ్ర
క్కునఁ దొడమీఁద నుంచుకొని క్షోణిసుతాహృదయేశుఁ డిట్లనున్. 59

మ. అమరజ్యేష్ఠుఁడు తొల్లి యొక్కమహనీయాస్త్రంబు నిర్మించె డెం
దమునన్ దా మధుకైటభాసురులు దానన్ గూలి రయ్యస్త్రరా
జము నాకున్ లభియించె లోకములకున్ సంత్రాస మాఁ దప్పియో
గముచే నం చదిఁ యేయ నెవ్వరిపయిన్ గైకొమ్ము నీకిచ్చెదన్. 60

మ. అనుజా నీకిది గల్గినన్ లవణసంహారంబు దుస్సాధ్యమే
యని శత్రుఘ్ననకున్ బ్రయోగ ముపసంహారంబు మంత్రక్రమం

బును సాంగంబుగ నానతిచ్చి విశిఖంబుం గూర్మితో నిచ్చి రా
మనృపాలాగ్రణి క్రమ్మఱన్ బలికె శుంభత్ప్రౌఢవాగ్గుంభనన్. 61

ఉ. అనిటలాక్షదత్తచటులాయతశూలము కేలఁ బూనినన్
దానవునిన్ జయింపఁ బురదానవభేదికి నైన శక్యమే
దాని గృహంబునం దిడి క్షుధావ్యథఁ గానల సంచరించుచో
వాని నెదిర్చినన్ జయ మవశ్యము నీ కగు లక్ష్మణానుజా. 62

ఉ. ఆలము సేయ వచ్చె రిపుఁ డం చొకయించుక వాఁ డెఱింగినన్
శూలము కేల నేమఱఁడు సు మ్మది నెమ్మది నుంచి దవ్వులన్
బాళెము డించి యొక్కఁడవు బాణకృపాణధనుర్ధరుండ వై
యాలవణుండు ప్రోల్ వెడలినప్పుడె కప్పుము గొప్పతూపులన్. 63

ఉ. ఘోరశరాహతిన్ నొగిలి కుత్సితుఁడై పురిఁ దూఱఁబోయినన్
దూఱఁగ నీక యయ్యసురతో నని సల్పుము నిల్పు మప్పుర
ద్వారముచక్కిఁ గన్మొఱఁగి వాఁడు గృహంబున కేఁగెనేనియున్
బోనఁ దెచ్చు నిచ్చలును బూజ లొనర్చు మహోగ్రశూలమున్. 64

క. అనిమిషమానసశూలం, బన దగుశూలంబు లేని యవసరమున శ
త్రుని గెలువు మనుచుఁ బలుమఱు, ననుజా యెఱింగించినాఁడ నదిమఱవకుమీ.

సీ. క్షణములోపల నద్రిఁ జౌకళించుజవంబునను మించుహయములు నాల్గువేలు
మణిహేమరుచుల రోహణమేరువులు మీఱి దండి యారథములు రెండువేలు
నింగితో నొఱయునుత్తుంగాంగకస్ఫూర్తి సరి లేనిమదసామజములు వేయి
విలయరుద్రుని నైన వెఱపింపఁగాఁజాలు వీరభటుల్ పదివేలమంది

తే. కొలువఁ గవినటగాయకకోటి వంది,మాగధసమూహమూరవ్యమణులదండు
వెంటరా లక్షవరహాలు వెచ్చమునకు, గొని మధునిపట్టణమునకుఁ జనుము నీవు.

క. సేనాధీశుల భటులఁ బ్ర,ధానుల బాంధవుల హితులఁ దగురీతుల స
న్మానింపు మేమఱక తఱి, నైన పనుల్ గొనుము సముచితాదరణములన్. 67

క. వడి గలవా రని భటులను, బడలింపకు మనఘ నిడుదపయనంబుల మం
డెడు వేసవినిన్ విడిసిన, యెడలన్ బ్రజ డప్పినొప్పు లెఱుఁగుము కరుణన్. 68

మ. ధనలోభంబునఁ బ్రోవ కుండెదు సుమీ తండ్రీ భటశ్రేణులన్
ధనమున్ రాజ్యము దుర్గముల్ భటులచేతన్ గాదె సంరక్షఁ జెం
దు నృపాలుండు భటేతరుం డయిన శత్రుల్ చీరికిన్ గొందు రే
జనులున్ మెత్తురె హత్తునే విజయముల్ సంగ్రామరంగంబునన్. 69

ఉ. ఆతపతప్తులై ననుభటాశ్వికహస్తిపకాదికుల్ ప్రమో
దాతిశయంబుఁ గాంచ సముదంచితజహ్నుసుతాతటావనీ
జాతలతాగృహాంతముల చాయల నిల్చిన నిశ్రమంబు త
చ్ఛీతలవాఃపోతములచే నిఁక మీఁదటఁ బాయకుండునే. 70

మ. గగనోద్ఘర్షిదవాగ్నికీలికల స్రుక్కన్ బాఱి వారిస్పృహన్
మృగతృష్ణల్ గని పోయి పోయి మృగముల్ మేనుల్ వడంకన్ దగన్
జగతిన్ వ్రాలెడి జాలిఁ గన్గొనుచు భీష్మగ్రీష్మసంతాప మిం
కఁ గడం ద్రోయఁగలారు నీభటులు గంగాతీరవన్యాస్థితిన్. 71.

మ. భవదీయధ్వజినీవ్రజోత్థితరజోబాహుళ్య మగ్రేసర
చ్యవనాదిప్రతిరాజికెంజడలతోఁ సంధింపఁగాఁ బోయి జా
హ్నవియున్ వేగఁ గ్రమించి యద్దరిని సేనన్ డించి కాళిందిచే
రువ నొక్కండవె పొంచి యుండి లవణున్ రోధించి సాధింపుమా. 72

క. ఎప్పుడు లవణునిఁ గూల్చితి, వప్పుడె నీవిజయలేఖ లనుపు మిచటి కీ
వప్పనికిఁ దామసించినఁ, జెప్పెడి దే మింగకముల జీవము లున్నే. 73

క. అని పలికి పయనమునకున్, దినమును నిశ్చయ మొనర్చి తెలిపిన నతఁ డిం
పున బళి యానతి యిచ్చిన, యనువున సైన్యములఁ గూర్చి యాదివసమునన్.

చ. మునుకొని యవ్వసిష్ఠునకు మ్రొక్కి యతండు 'రిపుక్షయోఽస్తు తే'
యన ముద మంది తల్లులకు నందఱకు న్నతి సేసి వారిదీ
వనలు గ్రహించి స్వామి కభివందనముల్ ఘటియించి భక్తి వీ
డ్కొని మఱి యిద్దఱగ్రజులకున్ బ్రణమిల్లి యథోచితంబుగన్. 75

ఉ. విఘ్నము లేక గెల్వు మరివీరుని నీ వని వారలున్ గృపా
సిఘ్న మనస్కులై పనుప నెట్టన బ్రాహ్మణపూజ చేసి శ
త్రుఘ్నుఁడు పౌరకాంతలు విరుల్ పయిఁ జల్లఁగ తద్విపచ్ఛిరో
దఘ్న మహోజ్జ్వలద్భటకదంబముతోఁ గదలెన్ హుటాహుటిన్. 76

లయవిభాతి. కదలి త్రిదశేంద్రువనకదళికల వంచుకొను
కదళికలహాస్తములు చదలఁ బొదలంగా
మదకరులు ముం దరుగ మది నెదుగు వేగములు
గదుర హయముల్ నడలయుదుటు గనిపింపన్
జదలములు నలుగడలఁ బొదివికొనఁ దేరుగము
లుదిరిమలలో యనఁగఁ జెదర కరుదేరన్
నదులు నిధులున్ వనులు మొదలుగఁ గనుంగొనుచుఁ
ద్రిదినములలో నమరనది నతఁడు సేరెన్. 77

మానిని. చేరి దలత్సరసీజలసద్రసశీకరతుందిలశీతమనో
హారిసమీరవిహారములన్ శ్రమమాఱఁగ నన్నదియవ్వలికిన్
భూరిరయంబునఁ బోయి తదంతికభూమిఁ జమూచయముల్ విడియన్
బోరనఁ బుట్టను బుట్టినమౌనితపోవనమో యన చేరి రహిన్. 78

మాలిని. పరహితమతిలోలున్ బ్రహ్మవిద్యావిశాలున్
బరమమునివరేణ్యున్ భారతీశాభిగణ్యున్

సరసకవనదక్షున్ సత్కృపాంచత్కటాక్షున్
సురుచిరగుణజాతున్ జూచె వల్మీకజాతున్. 79

మత్తకోకిలము. చూచి లక్ష్మణసోదరుండు విశుద్ధబుద్ధివినమ్రుఁడై
యాచతుర్ముఖతుల్యుఁ గన్గొని యయ్య నే లవణాసురున్
ఖేచరాంతకు రామునాజ్ఞను గెల్వ వచ్చితి వేకువన్
లేచి పోయెద నేటి కిచ్చట నిల్తునే యని వేఁడినన్. 80

తరల. నగుచు నమ్ముని వల్కె నో నరనాథనందన నాయమే
బెగడుచున్ బెఱవానిపోలిక భేదవాక్యము లాడఁగాఁ
దగదె నీగృహసీమ నీవు ముదంబుతో వసియింప నం
చగణితాదృతి సేమ మారసి యర్ఘ్యమిచ్చి కృపామతిన్. 81

మ. ఫలమూలాదు లొసంగి తృప్తి యొనరింపన్ బర్ణశాలాంతర
స్థలి నాత్మశ్రమ మాఱ నిల్చి పిదపన్ శత్రుఘ్నుఁ డమ్మౌని కం
జలి గావించి మునీంద్ర యీవనములో జా లొంది యూపాళు ల
గ్గలమై యున్నవి యెవ్వ రిందు మఖముల్ గావించిరో నావుడున్. 82

ఉత్సాహ. ఆమునీంద్రుఁ డానతిచ్చె నయ్య తొల్లి సూర్యవం
శామృతాబ్ధిపూర్ణచంద్రుఁ డై తగున్ సుదాసుఁ డన్
భూమిభర్త యొక్కఁ డవ్విభుండు పుత్త్రకాంక్ష యెం
తే మదిన్ వహించి చేసె నెల్లధర్మకోటులన్. 83

క. మిత్త్రసఖుఁ డనఁగ సంతతిఁ, బుత్త్రుం డొకఁ డుద్భవించెఁ బుణ్యవశమునన్
ధాత్రీశుఁ డక్కుమారుని, ధాత్రికిఁ బతిఁ జేసి తాను దపమున కేఁగెన్. 84

క. ఆమిత్త్రసఖుఁడు శౌర్యజి,తామిత్త్రసఖుం డనంగ నలరుచు మృగయా
ప్రేమ నొకనాఁడు కానన,సీమన్ విహరించెఁ బొలముచెంచులు గొలువన్. 85

వ. మఱియును. 86

లయవిభాతి. హరుల హరియించుచును గిరుల విరియించుచును
గిరుల ముఱియించుచును రురులఁ బొరిగొంచున్
ధరణివరుఁ డెల్లెడలఁ దిరుగునెడ బెబ్బులుల
తెఱఁగునను దైత్యవరు లిరువు రలకానన్
బఱచుమృగయూథముల నఱుగ దిగ మ్రింగుచును
బరుగు లిడఁ జూచి యెట కరిగెద రటం చ
ద్దొర కినిసి వింట నొకశరము దొడి యొక్కపులి
శిరముఁ దెగ నేసె బొలమరులు నుతియింపన్. 87

మ. హతశేషుండు నిజాకృతిన్ నిలిచి రాజా నిన్నమిత్త్రంబు నా
హితునిన్ జంపితివే కదా మఱతునే యిక్కార్య మంచున్ దిరో

హితుఁ డైనన్ వెలఁ గంది క్రమ్మఱి యతం డిచ్చో వసిష్ఠోక్తి స
త్క్రతుశాలల్ ఘటియించి చేసె హరిమేధంబుల్ బుధుల్ మెచ్చఁగన్. 88

క. ఆసమయంబునఁ దొల్లిటి, యాసురుఁడు వసిష్ఠరూప మచ్చుపడఁగ సౌ
దాసుఁ గని సామిషాశన, మాసయ్యెడిఁ గలుగఁ జేయు మని యడుగుటయున్.

ఉ. నిక్కము మాని యంచు ధరణీపతి నెమ్మది నెంచి పాచకున్
గ్రక్కునఁ బిల్వ నంపునెడఁ గన్గొని పాచకవేషధారి యై
యక్కుటిలుండు వచ్చి యతఁ డప్పని దెల్ప మనుష్యమాంసమున్
దక్కక వండి తెచ్చి జననాథునిముందటఁ బెట్టి పోయినన్. 90

మ. మనుజాధీశుఁడు భార్యచేత ముని కమ్మాంసంబుతో నన్న మిం
పునఁ బెట్టింప వసిష్ఠుఁ డల్గి తగునే భూమీశ యస్పృశ్య మా
మనుజక్రవ్యముఁ బెట్ట నీమదికి రమ్యం బైన యీమాంసమే
తినుచున్ గ్రుమ్మరు మన్న రాజు మదయంతీయుక్తుఁ డై దీనతన్. 91

చ. కులగురుఁ జూచి మీరె మును గోరినఁ బాచకుఁ బిల్చి యర్థ మా
పలలము వండి తెమ్మనుచుఁ బంచితి వాఁ డది యెట్లు వండెనో
తెలియదు లెస్స చూడక యిట్టుల యర్థమె యన్న నాతఁడున్
దెలిసె నదంతయున్ బొలసుదిండి యొనర్చినమాయగా మదిన్. 92

క. తెలిసి వసిష్ఠుఁడు భూవర, తలఁకకు నీయసురతనము ద్వాదశవర్షం
బులు సనఁ దొలఁగెడి నన నతఁ,డలిగి గురున్ మరలఁ దిట్ట నంబువులుగొనన్. 93

మ. మదయంతీసతి యడ్డమై విడువు మోక్ష్మామండలాధీశ చె
ల్లదు కోపంబు వసిష్ఠమౌనిపయి నేలా యింతమౌర్ఖ్యం బనన్
బదభాగంబున డించె శాపజలమున్ బాదంబు లవ్వేఁడిమిన్
గదిసెన్ గర్బురభావ మందునఁ దగెన్ గల్మాషపాదుం డనన్. 94

క. ఆసౌదాసుఁడు యాగము, సేసినచో, టిది యటంచుఁ జెప్పిన జటిలా
గ్రేసరు నుతిఁ జేసె సుమిత్త్రా,సతికడగొట్టుకొడుకు తత్సమయమునన్. 95

జానకి వాల్మీక్యాశ్రమంబునఁ గుశలవులం గనుట

మ. ధరణీపుత్త్రియు నాఁటిరాతిరి శుభస్థానంబులన్ సద్గ్రహో
త్కరముల్ నిల్వఁగ వంశదీపకులఁ బుత్త్రశ్రేష్ఠులన్ గాంచె ని
ర్వరఁ దత్సంభవవేళఁ బూలు గురిసెన్ మ్రోసెన్ దివిన్ దుందుభుల్
దొరసెన్ జల్లనిగాడ్పు నల్గడల సంతోషించి రచ్చో ఋషుల్. 96

క. మునిసుతులు వచ్చి రయమున, నినవంశుని దేవి సీత యిద్దఱుసుతులన్
గనియె నని విన్నవించిన, విని వల్మీకోద్భవుండు వేడుకతోడన్. 97

మ. యశమున్ విద్యయు భాగ్యమున్ బలము దీర్ఘాయుష్యముం గాంతు రీ
శిశువుల్ పుట్టినవేళ మంచి దనుచున్ శీఘ్రంబుగాఁ బోయి త

త్కుశలార్థంబుగ నమ్మునీశ్వరుఁడు రక్షోనాశమంత్రస్ఫుర
త్కుశసంఘంబు లవంబు నించి జటిలస్తోమంబుతో నిట్లనున్. 98

క. ఈకుశలవముల మార్జన, మాకొమరుల కాచరింపుఁ డందున రక్షో
నీకాదికభయ మడఁగును, జేకుఱు శుభ మనిన నటులఁ జేసిరి వారల్. 99

క. కుశమార్జితుఁ డగుసుతునకుఁ, గుశనామము లవజలములఁ గుశలియయిన యా
శిశువునకు లవసమాఖ్యయుఁ, బ్రశమనిధి యతం డొనర్చెఁ బ్రఖ్యాతముగన్.

క. చంద్రార్కులగతి నింద్రో, పేంద్రులవలె నాశ్వినులరహిఁ గుశలవు లా
సాంద్రతపోధనశాలిద,యం బ్రాసము లేక వెలసి రత్యుజ్జ్వలు లై. 101

క. పుత్త్రోదయము ధరిత్రీ, పుత్త్రీక్షేమంబు నత్తపోనిధి దెలుపన్
శత్రుఘ్నుఁడు వినియారా, శ్రోత్రములు ఫలించె ననుచు సొంపు వహించెన్.

చ. హరిహయదిగ్వధూమణియు నంత విభాకరుఁ గాంచె లక్ష్మణా
వరజుఁడు నిత్యకృత్యము లవారితనిష్ఠ నొనర్చి యమ్మునీ
శ్వరునకు మ్రొక్కి యాయన యొసంగెడిదీవన లొంది చెచ్చెరన్
జరమదిశాభిముఖ్యవిలసత్పదవిన్ జనియెన్ జయార్థి యై. 103

చ. చని చని యేడునాళ్లకు రసాసతి గట్టెడునీలిపుట్టమో
యన హరినీలశైవలశశాంకకళంకకురంగనాభికా
భినవవిభాప్రభావములఁ బెంపగుభానుజఁ జేరి యన్నదిన్
మునిఁగి కృతార్థుఁడై చ్యవనముఖ్యుల నక్కడఁ గాంచి వేడుకన్. 104

క. వారికి మ్రొక్కి ప్రియంబున, వా రిచ్చుఫలాదికముల వారనిత్తుర్తున్
వారించి గతశ్రముఁడై, యారాత్రిరి చ్యవనుతోడ నతఁ డిట్లనియెన్. 105

మాంధాత లవణాసురునిచే మృతుండైనకథను చ్యవనుండు శత్రుఘ్నునకుఁ జెప్పుట

మ. అనఘా యాలవణుండు మేటి యని మీ రానాఁడు మాస్వామితో
ననఁగా నేనును వింటి నైన శివదత్తాభీలశూలంబుచే
ననిలో నెవ్వరి నైన వీఁ డడఁచెనే యాచందముల్ గల్గినన్
వినిపింపన్ దగు నన్న నాచ్యవనమౌనిశ్రేష్ఠుఁ డి ట్లంచనున్. 106

క. అన్నా యాలవణాసురు, సన్నాహముతోడఁ గదియఁ జని శూలముచే
మున్నాజిఁ బడినరాజుల, నెన్నంగా శక్యమే ఫణీంద్రునకైనన్. 107

క. వచ్చినన్నృపు లీతనిచేఁ, జచ్చినన్నృపు లెందఱో యసంఖ్యు లదేలా
మచ్చరమున లవణునిచే, నొచ్చెన్ మాంధాతయును వినుము వివరింతున్, 108

మ. యువనాశ్వుం డను రాజనందనుఁడు ధైర్యోదాత్తహేమాద్రి శా
త్రవశిక్షాక్షమవిక్రమక్రముఁడు మాంధాతృక్షితీశుండు ము
న్నవనీనాథుల నెల్ల గెల్చి సురలోకాధ్యక్షు నిర్జించి య
ద్దివమున్ జేకొన నెంచి దండు వెడలెన్ దీవ్యత్ప్రతాపంబునన్. 109

క. వెడలి కడవన్నెగుబ్బలి, గడచి దివికి మించి రాఁగఁ గాంచి మొగుల్ త
త్తడిజోఁ డతని జయించుట, కడుభర మని యెఱిఁగి వచ్చి కపటమతి ననున్. 110

ఉ. ఇమ్ముల భూమి శాత్రవుల నెల్ల జయించి కదా సమర్థతన్
మమ్ము జయింప రావలయు మానవనాయక నీ కజయ్యుఁ డై
యమ్మధుపుత్త్రకుండు లవణాసురుఁ డుండఁగ నెట్లు వచ్చినా
విమ్మెయి వాని గెల్వకయె యింద్రునిపై నన రాజు సిగ్గునన్. 111

ఆ. వానిఁ దాఁకి పిదప వచ్చెద నీవీటి, కనిన నటులఁ జేయు మనుచు నింద్రుఁ
డరిగె నాకమునకు నవనీంద్రుఁ డలుకతో, మధువనంబుకడకు మసల కేఁగి. 112

చ. ఉపవనవీథి దండు దిగి యుద్ధతితో నొకదూత నంపినన్
గుపితమనస్కుఁ డౌ లవణుకొల్వునకున్ జని వాఁడు వానిచే
నపహృతకాయుఁ డయ్యె నృపుఁ డంతట నంతకుమాడ్కిఁ బేర్చి య
చ్చపలునిఁ జేరఁ బోయి దనుజాతకులాధమ పోర రమ్మనన్. 113

శా. గంధేభంబు నెదుర్చు కేసరివలెన్ గర్జింపుచున్ వాఁడు గ
ర్వాంధత్వంబున శూల ముద్దవిడి ప్రేయన్ దచ్ఛిఖల్ గప్పినన్
బంధువ్రాతముతో నమాత్యతనుజాప్తశ్రేణితో సేనతో
మాంధాతృక్షితినాయకుం డపుడె భస్మం బయ్యె నొక్కుమ్మడిన్. 114

ఉ. కావున వాఁడు ముమ్మొనలకైదువుఁ బూనినవేళఁ బోరికిన్
బోవకుమీ నృపాలసుత మున్నె సమస్తముఁ దెల్పినాఁడు రా
మావనిభర్త దెల్పవలెనా యిఁక మేమును రేపవశ్యమున్
నీవు జయింతు వాలవణునిన్ నిదురింపుము నేఁడు నావుఁడున్. 115

క. ఆశత్రుఘ్నుఁడు చ్యవనుని, పేశలభాషల ముదంబు బెఱయుచు నిద్రా
వేశము జెందెడి నంతఁ గు, శేశయహితుఁ డుదయశిఖరిశిఖరముఁ జేరెన్. 116

ఉ. అంతకు మున్నె లేచి యతఁ డాహ్నికకృత్యములెల్లఁ దీర్చి య
త్యంతదయాప్రసన్నులగు నచ్చటిమౌనులకెల్ల మ్రొక్కి వా
రెంతయు వేడ్క శత్రుని జయింపు మటం చనుపన్ శరాసదు
ర్దాంతకృపాణతూణములు దాల్చి కళిందజ దాఁటి చెచ్చెరన్. 117

క. మాధవుదేవికి నిర వగు, మాధవుపుర మెదుటఁ జూచి మది ధైర్యంబున్
గ్రోధముఁ బెనఁగొన నుపవని, యోధాగ్రణి యతఁడు వేచి యుండెడివేళన్.

## శత్రుఘ్నుండు లవణునితోఁ బోరుట

మహాస్రగ్ధర. రవి పూర్వగ్రావమున్ జేరకయమునుపు సారంగసింహాశ్వవిద్వ
ద్గవయక్రోడాదిజంతుగ్రసనవిలసనాకాంక్షఁ గేహంబు వాసెన్
వివిధారణ్యాళి డాసెన్ వెలయు మెకములన్ వేనవేల్ హరింపన్
లవణక్రవ్యాదిశాంతిన్ మసలక మరలన్ వచ్చె మధ్యాహ్నమైనన్. 119

సీ. సందిళ్ల నిఱికినసమదేభశార్దూలఘోణులఁ బలుమాఱుఁ గొఱికికొనుచు
బలుపచ్చిపొలనుండి సెలవుల దిగజాఱు నల్ల నాలుక చాఁచి నాకికొనుచు
మదమత్తచిత్తుఁడై పదఘట్టనలచేతఁ జెట్టులఁ బడఁబెట్టి మెట్టుకొనుచు
దేవతల్ డయ్యంగ దిక్కులు వ్రయ్యంగ నప్పటప్పటికిఁ గిలారుచుకొనుచు

ఆ. నెదురులేక యాఁకి కేతెంచుమధుపుత్త్రు, ఘనతిమూనిపద్మకమలమిత్త్రు
నతికరాళవక్త్రు నగ్నిజ్వాలన్నేత్రుఁ, జూచి లక్ష్మణానుజుండు గినిసి. 120

స్రగ్ధర. తాచేతన్ మించుకోదండమున గుణరవాడంబరం బొందఁ జేయన్
నీచుం డాదైత్యుఁ డల్కన్ నెఱకుశిఖిశిఖల్ నేత్రకోణంబు లానన్
జూచెన్ బ్రోద్దీర్ఘబాహున్ శ్రుతిపథగతచక్షుగ్నిపయోజున్ శిఖావ
ద్రోచిస్తుల్యాస్త్రపూర్ణోద్ధురశరధిని శత్రుఘ్ను శత్రుఘ్ను నంతన్. 121

ఉ. చూచి కరాళవక్త్రుఁ డడుగుచున్ గడు బెట్టుగ నవ్వి త్రోవలో
వేచి కరంబునందు నొకవిల్లును దూపులుఁ బూని యున్ననిన్
జూచిన నాజికిన్ దొడరి శూరతఁ జూపఁగ వచ్చినట్లుగాఁ
దోఁచె భవాదృశుండొకొ యెదుర్కొని నన్ను జయించువాఁడనిన్. 122

ఉ. ఈపెడబుద్ధి నీకె జనియించెనొ యేజడుఁడైన దెల్పెనో
హా విధిఁ ద్రోయ నీకు వశమా లవణాసురుబారిఁ బడ్డవా
రీవఱ కెవ్వరైన మనిరే యిఁక నూర్వురు బ్రహ్మ లాఁగినన్
జావక పోదువోటు కొనసాగునె నీవిలువిద్య లిచ్చటన్. 123

క. దివమును మెకములమెఱచిన్, దినినయపుచి వాయ నేఁడు దినఁ గలిగెఁ గదా
మనుజాధమ నీమాంసం, బని పలికెడులవణుఁ జూచి యాఁకు గఱచుచున్.

క. కటతటము లదరఁ గన్నులఁ, జిటచిట నిప్పుకలు చెదరఁ జిలుపచిలుపచె
మ్మట లొడలఁ గడలుకొన న,క్కుటిలునకు సుమిత్రపిన్నకొడు కిట్లనియెన్. 125

ఉ. ఈ వొకపోటుబంటువలె నెన్ని దురుక్తులు వ్రేలె దోర్దు
ర్భావ మదించి మున్నటిన్పాలురయట్లనె నన్ దలంచితో
రావణుఁ బుత్త్రమిత్త్రనికరంబులతో ననిఁ ద్రుంచినట్టి రా
మావనినాథుతమ్ముఁడఁ గృతాంతుఁడ నీ వెటు వోయె దింకిటన్. 126

శా. శత్రుఘ్నాఖ్య యథార్థమై రహి వహించన్ దేవభూదేవతల్
విత్రాసస్థితిఁ జెంద నింక సమరోర్విన్ నేఁడు ఖండించి నీ
గాత్రం బిచ్చటికంకగృధ్రములపాల్ గావింతుఁ గుంభీనసీ
పుత్త్రా దుష్టచరిత్ర నిల్వు మనినన్ భూరిక్రుధావేశుఁడై. 227

శా. ఆరక్షోవిభుఁ డార్చుచున్ బళిర లంకాధీశు మన్నాతులున్
బోరన్ గూల్చిన రాముసోదరుఁడవే పొమ్మైన నాకోర్కి యీ
డేఱెన్ నిన్ భవదగ్రజాప్రహితకోటిన్ గూడ నే డంతకున్
జేరన్ బంచెద నిల్వు మంచుఁ బురికిన్ శీఘ్రంబునన్ బోవఁగన్. 128

మ. అలుకన్ లక్ష్మణతమ్ముఁ డడ్డమయి యారా యోరి దోషాట మా
ర్పలుకుల్ పల్కి జుణింగిపోయెదవు రారా నిన్ను శత్రుఘ్నుఁ డి
క్కలనన్ గూల్పక యేల పోవిడుచు బింకం బాడి భీరుండ వై
తలఁగన్ నవ్వరె లోకు లంచుఁ దెగడన్ దర్పించి వాఁ డుద్ధతిన్. 129

చ. పలికినపల్కు లోఁ జనపాలకులాధమ యాత్మ నిల్పరా
కలిగెడిఁ దత్ఫలం బనుచు గ్రక్కున శాహువులప్పళించుచున్
కిలకిల నార్చుచున్ జెలఁగి కేరుచు నొక్కవిశాలసాల మ
గ్గల మగుబల్మితోఁ బెఱికి కైకొని వక్షము చూచి వైచినన్. 130

క. అదరక శత్రుఘ్నుం డది, పదితునియ లొనర్చెఁ బంచభల్లప్రహతిన్
మద మెత్తినటుల వాఁడును, వదలనిరోషమున వృక్షవర్షము గురిసెన్. 131

చ. కురిసెడువృక్షవర్షమునకున్ వెనుదీయక భానువంశజుం
డురుతరసాయకత్రయము నొక్క మొగిన్ నిగిడించి యార్చినన్
గురిసెడి నార నీవిశిఖకోటులు సాలము లంచు నశ్మముల్
గురిసె విరోధి వజ్రశరకోటి నడంచె నతండు గ్రమ్మఱన్. 132

క. "తేనాభారము ద్రుంచం, గా నీభార" మనినట్లు కంటకుఁడు వడిన్
నానాతరువులు వైచిన, మానక యతఁ డడఁచె నిమిషమాత్రములోనన్. 133

క. తుమురైన శిలలపోళ్లును, గుమిగొని తుత్తునియ లైన కుజశకలంబుల్
సమరోర్వి నిండికొనఁ ద,త్సమయంబున సమసె నచటిసాలములెల్లన్. 134

ఉ. చేరువచెట్టు లెల్ల సరిసేసి నిశాటుఁడు భానుజాసరి
త్తీరమహీరుహావళులు దెచ్చుఁ బయిన్ బడవైచుఁ గ్రమ్మఱన్
దూరము వోవ నేడఁ బురి దూఱునొ వీఁడని యక్కుమారుఁడున్
సారెకు రామదత్తఘనసాయక మేయఁ దలంచుచుండఁగన్. 135

ఉ. అంతట నేమఱించి లవణాసురుఁ డొక్కకుజంబు దెచ్చి దు
ర్దాంతరయంబునన్ శిరము దాఁకఁగ వ్రేయ నతండు నొచ్చి వి
శ్రాంతి వహించి మూర్ఛిలె సురల్ మనుజుల్ బెగడొంది రప్సరః
కాంతలుఁ జాలిఁ జెందిరి జగంబులు కంపముఁ బొందె నయ్యెడన్. 136

చ. అది మృతిగాఁ దలంచి రిపుఁ డార్చుచు నేటికి శూల మింక న
న్నెదిరినవైరి సచ్చె నని యెల్లమృగంబుల భూరిమాంసముల్
ముదమున మెక్కుచున్నయెడ మూర్ఛ దొలంగినఁ గన్ను విచ్చి పే
రుదుటున లేచె లక్ష్మణసహోదరుఁ డుత్సవ మందె లోకముల్. 137

వ. ఇత్తెఱంగున మూర్ఛదేఱి యింద్రజిద్వీరారికూరిమితోఁబుట్టువు దనకట్టెదుట బలుచట్టులు చెట్టులు పట్టుకొని పదఘట్టనల నిలాతలం బిట్టట్టువడఁ బఱ తెంచుచున్న మధుదైత్యపట్టభద్రుపట్టిన్ గనుంగొని వీరరౌద్రరసంబుతోఁ నంగ

మంతంతకు నుప్పొంగఁ బ్రళయగాలాంతకు తెఱంగున నగనించి నిటలతటంబున వికటతరంబుగాఁ గుటిలభ్రూకుటిఘటిల్లఁదటిల్లతాపటులచటులద్యుతులకు దండ యగుకోదండంబు సారించి నిమిషమాత్రంబును సైరించక వైరించనహాయచం చద్గపదంచలచంచలావిభా ప్రపంచవంచనాచుంచు ప్రాంచిత కాంచనసంఘటిత పుంఖ ప్రభాధురీణంబు నరీణ తేజోవిభ వాధిక మధుకైటభ ప్రముఖ నిఖిలబర్హిర్ముఖ కంటకకంఠలుంఠనక్రియా చమత్క్రియాభిమత్య శైత్యసంపత్ప్రఘాణంబును సకలభువనగ్రసనవ్యసనాత్యుదాత్తలీలావిలోల కాలమృత్యు కరాళవక్త్రాభీల దంష్ట్రాంకుర ప్రమాణంబును బ్రమాణప్రభావవైభవాధరీకృత చక్రశూలాదినా నాదేవతాశ్రేణిపాణికృపాణంబు నగు నారాయణాంతక ప్రసాదాసాదిత నవ్యబా ణంబు తూణంబు వెడలఁ దిగిచి లవణాసురుప్రాణంబు లపహరించు గుణంబున గుణంబునఁ గూర్చిన శతకోటిమార్తాండమండలోద్దండతరకిరణస్ఫురణలఁ గ్రేణి సేయుతదఖండితరుఙ్మండలంబు దిఙ్మండలంబు నిండుకొని చూడఁ గూడక చూపు లకు మిఱుమిట్లు గొల్పుటయు ననల్పకల్పక్షయాక్షయ్యతరాశుశుక్షణిజ్వాలి కామాలికలో యని భీతులయి గరుడగంధర్వసిద్ధవిద్యాధరాది దేవతలు దేవతా జ్యేష్ఠుం డగు పరమేష్ఠికడకుం జని వినతులై యి ట్లని విన్నవించిరి. 138

మ. జగముల్ మ్రింగెడిరుద్రుతేజమొ జగత్సంహారఘోరాగ్ని యో
జగదుద్వ్యాపనభాస్కరప్రభయొ నా శత్రుఘ్న బాణార్చి ము
జ్జగముల్ గూల్చు తెఱంగునన్ వెలిఁగెడిన్ సర్వేశ యిం కేవిధం
బగునో లోకము లుద్ధరింపఁ గదవే యన్నన్ విధాత్రుం డనున్. 139

మ. భయ మేలా సురలార తొల్లి హరి యాబాణంబుచే దైత్యరా
డ్జయముల్ పెక్కు వహించె నవ్విశిఖమే శత్రుఘ్నుఁడున్ బూని దు
ర్జయలీలన్ లవణున్ వధించు నిఁక మీసంతాపముల్ మాన్పుఁ డ
ద్దయు సౌఖ్యంబు వహించు నన్నఁ జని రుత్సాహంబుతో దేవతల్. 140

శత్రుఘ్నుండు లవణాసురుని సంహరించి తత్పురంబు నేలుట

మ. అల శత్రుఘ్నుఁడు నివ్విధంబునను దివ్యాస్త్రంబు సంధించి పే
రలుకన్ దైత్యునిఱొమ్ము లక్ష్యముగ సేయన్ జ్వాలికల్ దిక్కులన్
వెలయన్ శత్రుని ఱొమ్ముఁ దూఱి యిలయున్ భేదించి పాతాళవా
సులకున్ భీతి యొనర్చి క్రమ్మఱఁ బొదిన్ జొచ్చెన్ సురల్ మెచ్చఁగన్. 141

క. బాణము వెడలినయప్పుడె, ప్రాణంబులు వెడలి దనుజపతి పవనహత
క్షోణీధ్రమువలెఁ గూలెన్, క్షోణీస్థలి జగము లెల్లఁ జోద్యముఁ జెందన్. 142

తోటకము. ఇలపై లవణాసురుఁ డిట్లొఱుగన్, గలకాలము వానియగారమునన్
వలనొప్పెడు మున్మొనవాల్ శివుచే, నలువొందెడు శూలమునన్ గలసెన్. 143

క్రౌంచపదము. తావులుమీఱన్ బూవులవానల్ దఱచుగఁ గురియఁగఁ దతఘనభేరుల్
గ్రేవలమ్రోయన్ గేవలగీతక్రియలను వనితలు గిఱికొని యాడన్

దేవతలెల్లఁ దీవి ఘటిల్లఁ స్థిరమతిఁ గొలువఁగ దివిజవిభుండుఁ
బావకముఖ్యాశావిభుయుక్తిఁ బగతుని నడఁచిన ప్రభుఁ గనవచ్చెన్. 144

తే. అపుడు బ్రహ్మర్షి దేవర్షు లాది యైన, ఘనులు శత్రుఘ్ను దీవించి కౌతుకమున
రావణుని సంహరించినరాముఁ బొగడి, నటులఁ బొగడిరి దేవేంద్రుఁ డతనిఁ కనిమె.

పణవవృత్తము. తీర్చెఁ బ్రాపులదిగు లివ్వేళన్. జేర్చెఁ మాకును జిరసౌఖ్యంబుల్
దేర్చెఁ లోకుల దినగండంబుల్, మీరెఁ నీబలిమి యమేయం బై. 146

క. నచ్చితిమి నీప్రతాపము, హెచ్చితిమి భవద్దయాసమృద్ధిని నిన్నుఁ
మెచ్చితి మొకవరమియ్యఁగ, వచ్చితి మనఘాత్మ యడుగవలయు నటన్నన్.

మ. అల శత్రుఘ్నుఁడు శక్రముఖ్యులకు సాష్టాంగంబు లర్పించి యం
జలి గావించి మహాత్ములార భవదంచత్పాదముల్ గొల్వఁగాఁ
గలిగెఁ జాలదె యైన నిమ్మధునిపోల్ గన్గొన్నఁ దొల్లింటికం
టె లసత్సంపద మీఱఁ జేయుతమి పుట్టెన్ గల్గ నిం డట్టులన్. 148

మ. అనినన్ నీవు దలంచినట్టు లతిరమ్యం బై ధరాస్వర్గమో
యన నింపొందెడు నిప్పురం బనుచు వా రంతర్ధిఁ జెందన్ ముదం
బున శత్రుఘ్నుఁడు శత్రుసంహరణ మాప్రొద్దే రఘుస్వామికిన్
వినిపించన్ దగువారిఁ బంచి హితమంత్రిశ్రేష్ఠు లేతెంచినన్. 149

ఆ. వారి నాదరించి వచ్చినసేనల, గలయ విజయసూచకంబు లైన
పటహగోముఖాది బహుళవాద్యంబులు, బోరుగలఁగ మధునిపురము సొచ్చె.

తే. చొచ్చి యచ్చోటిప్రజలకు సొంపెసంగ, నిర్జనం బైన మధునిమందిరముఁ జేరి
ధనమణిసువర్ణవస్తువాహనములెల్లఁ, జేకొని సునీతి రాజ్యంబు సేయుచుండె.

వ. అప్పుడు. 152

సీ. దివసప్రభుశతప్రథితభాప్రచయదీప్రకనక ప్రచురవప్రగణము గలిగి
ఘనయూథపథరోధకలనాధరితభూధరవిధాధవళసౌధరాజి గలిగి
వరఖేచరవిలోచనముదాచరణసూచకమణీచయకృతాచలములు గలిగి
సుపచేళిమఫలాశిశుకశారిసముదాళిఘనకేళివనపాళికలును గలిగి

తే. రంగదుత్తుంగతరగోపురములు గలిగి, కలితగృహవర్గవిపణిమార్గములు గలిగి
వికచకల్హారహారిదీర్ఘికలు గలిగి, పొలిచె శత్రుఘ్ను వలన నప్పురవరంబు. 153

క. బేహారులు మితసత్య, వ్యాహారులు వచ్చి నిలిచి వలసినవస్తు
వ్యూహములు నించి రప్పురి, నాహారిదశ్వాన్వవాయునాదృతివలనన్. 154

మ. తనప్రోల్ స్వర్గమె యంచు నందఱును సందర్శింప ధర్మస్థితిన్
జనులన్ బ్రోచుచు లేమియున్ దెవులు హృత్సంతాపమున్ దాన మె
వ్వనియందున్ గనిపింప కెల్లప్రజలున్ వర్ధిల్లఁ బండ్రెండు హా
యనంబుల్ రాజ్యముసేసి రామపదవీక్షాకాంక్షి యై యంతటన్. 155

—శత్రుఘ్నుండు శ్రీరామపాదసేవార్థి యై యయోధ్య కరుగుచు మరల చనుట—

మ. సుగుణాంభోధుల మంత్రిపుంగవుల నచ్చో నుంచి యంచన్మతిన్
దగువారిన్ దనవెంటఁ బెట్టుకొని రత్నస్యందనారూఢుఁ డై
నగరావాసుల నెల్ల వీడ్కొని ప్రయాణవ్యాప్తిఁ గొన్నాళ్లకున్
మిగులన్ వేడుకఁ జేరె నాఘనుఁడు వాల్మీకాశ్రమస్థానమున్. 156

తే. చేరి వాల్మీకులకు నతుల్ సేసి యాతఁ, డంచితాశీర్వచస్ఫూర్తి నాదరించి
యిచ్చు నర్ఘ్యాదికములుఁ గ్రహించి శ్రాంతి,దొఱఁగి పరిజనయుక్తి శత్రుఘ్నుఁడలరె.

ఉ. అమ్మునిచంద్రుఁ డంత దయ నాతనిఁ గన్గొని పల్కె నెల్లలో
కమ్ములయుక్కు మల్లయిన కంటకునిన్ దృణలీల నొక్క బా
ణమ్మునఁ గూల నేసితి వనంతభుజాబలశాలి వెంచఁగా
నిమ్మహి నీకు సాటి గలరే శరకౌశలి లక్ష్మణానుజా. 158

ఉ. ఇం కొకనాఁటికిన్ లవణుఁ డీల్గునె లోకులబాధ దీఱునే
శంక దొఱంగి వీని ననిఁ జంపెడిశూరుఁడు భూమిఁ బుట్టు నే
యంకిలి లేక యుండుదురె యంచుఁ దలంపుదు మాతలంపు నీ
వంక ఫలించె నేఁడు బుధవత్సల నిన్ను నుతింప శక్యమే. 159

ఉ. రావణుఁ ద్రుంచునాఁడు రఘురామునకున్ బహుళప్రయత్నముల్
గావలసెన్ దశాననునికంటె మహోద్ధతుఁ డై యనేకులన్
భూవరులన్ హరించినరిపున్ నిమిషంబునఁ ద్రుంచె నంచు న
ద్దేవసభన్ సురేంద్రుఁడె నుతింపఁగ వింటిమి నీప్రభావముల్. 160

చ. లవణునితోడ నీ వవికలస్థితిఁ బోరెడువేళ మేము వా
సవుకడ నుండి చూచితిమి సర్వము నీధృతి యంత యొప్పునే
యవునవు నీకె చెల్లు నని యక్కునఁ జేర్చి శిరంబు మూర్కొనెన్
బ్రవిమలచిత్తుఁ డత్తపసి పంక్తిముఖాంతకుపిన్నతమ్మునిన్. 161

చ. ఇటువలె నాదరించి జటిలేశ్వరుఁ డాప్తబలాధిభూసుహృ
ద్భటయుతుఁ డైనయాతనికిఁ బక్వఫలాదులఁ దృప్తి చేసి చెం
గటియుటజంబునన్ నిలువఁగా సెలవిచ్చిన నక్కుమారుఁ డ
చ్చట వసియించె భృత్యు లుపచారములన్ శ్రమముల్ హరింపఁగన్. 162

వ. అయ్యవసరంబున. 163

సీ. ఉరుసుధారసధార లొలికెడుచందాన సరసస్వరస్ఫూర్తి సంఘటిల్లఁ
దిన్నగాఁ దావిపూఁదేనె సోనలు మించువిధమునఁ దానముల్ విస్తరిల్లఁ
గండచక్కెరపానకమ్ములు ప్రవహించురహి ఘనరాగముల్ రక్తి గుల్క
విరివి యై చెఱకుపాల్ వెల్లువ వాఱెడిక్రమమున నాలాపగతులు వెలయఁ

తే. గవలు కవవీణె లూని ద్రాక్షాఘనోప, మానమానితవాల్మీకికవిరచిత
చారురామాయణశ్లోకసమితి గాన, లీలఁ బఠియింప శత్రుఘ్నుఁ డాలకించి. 164

క. అనుఘరార్థవిగుంభన, లామృదువర్ణానువృత్తు లాపదసంద
ర్భాభిమతికౌశలి యావా,క్ప్రామాణ్యము నెంచి యతఁడు పరవశుఁ డయ్యెన్.

క. పరవశుఁ డగుఁ దెలియక గ్రా,మ్యులు విని తల యూఁచు నింతమాత్రము సీతా
వరపుత్త్రు లి త్తపోనిధి, కరుణఁ గనిరి గద యనుచుఁ గౌతుక మొందున్. 166

చ. అతని నిజాప్తు లద్భుతరసాబ్ధి మునింగి నిజంబొ స్వప్నమో
క్షితి నిటువంటిగానములు సేయఁగ వింటిమె వీర లెవ్వరో
యతివరుఁ జేరి వేఁడ దగు నయ్య యనన్ బరమాద్భుతంబు లి
య్యతివరుపాల నున్నయవి యారయ నెంతటివార మంచనెన్. 167

క. శత్రుఘ్నుఁ డిటుల సీతా, పుత్రులగానమును వేడ్కఁ బొంది వినుచు నా
రాత్రి గడపె నర్థక్షణ, మాత్రముగా నంత భానుమంతుఁడు వొడిచెన్. 168

చ. దివసముఖోచితక్రియలు దీర్చి మునీంద్రుఁ డనుజ్ఞ యియ్యఁగా
సవినయవృత్తి వీడుకొని సైన్యముతోఁ జని లక్ష్మణానుజుం
డవిరళవేగలీల రవి యంబరమధ్యముఁ జేరునంతకున్
రవికులనాథుఁ డేలెడిపురంబు గనెన్ నయనోత్సవంబుగన్. 169

వ. ఇత్తెఱంగునం గనుంగొని యభంగహర్షతరంగితాంతరంగంబునం బురలక్ష్మికిఁ గరాంబుజంబులు ముకుళించి సముచితప్రకారంబునం బ్రవేశించి. 170

సీ. సామజహయభటస్యందనావళులతో నెడనెడ సామంతు లెదురుకొనఁగ
భూసురాశీర్వాదపుణ్యనాదములతో వందిమాగధులకై వార మొలయఁ
గమనీయఘృణిమణికంకణక్వాణనలై చెలులు మేడలనుండి సేస లొలుక
నబ్జమండలపాండురాతపత్రములతో ముందర బలుటెక్కెములు రహింపఁ

తే. బౌరు లాడాడఁ బొడగని ప్రస్తుతింపఁ
బటహబహువాద్యరవముతోఁ బ్రజలయులివు
మీఱ మొగసాలముందరఁ దేరు డిగ్గి
శిరముపై నంజలి ఘటించి సరగ నతఁడు. 171

చ. కొలువున కేఁగి రామనృపకుంజరుపాదయుగంబు మస్తకం
బొలయఁగ మ్రొక్కి శత్రుపురినుండియుఁ దెచ్చినదివ్యరత్న రా
సులఁ దగుకాన్క సేసి పరిశుద్ధమతిన్ గరముల్ మొగిడ్చి చూ
పులు ఫలియింప స్వామి మొగమున్ గనుగొం చట నిల్చి యిట్లనున్. 172

ఉ. దేవరయాజ్ఞ శత్రుని వధించి తదీయపురం బుదంచిత
శ్రీ విలసిల్లఁ జేసి పదిరెండుశరత్తులు వాసి యుండితిన్
గావున మీపదాబ్జములు గన్గొన వచ్చితిఁ దాళ శక్యమే
యావును బాయుక్రేపువలె నచ్చట నొంటిగ నిల్చి నావుడున్. 173

సీ. నగుచుఁ దమ్మునిఁ జేరఁ దిగిచి కౌఁగిటఁ జేర్చి వసుధేశుఁ డను నేల వగవు వత్స
యరిశిక్షయును ధరాపరిరక్షయును జేయ కూరకుండఁగ క్షత్త్రియునకుఁ దగునె
యుచితకృత్యము మాన్ప నోడియుంటుటగాక నినుఁ బాసి మేమైన నిలువఁగలమె
వలసినయపు డిందు వచ్చి తల్లుల మమ్ముఁ జుట్టల మిత్త్రులఁ జూడ రాదె

తే. తామసింపక సప్తరాత్రములు మాత్ర, మిచట వసియించి పురి కేఁగు మింతతడవు
రాజు లేకున్న రాజ్య మరాజక మగు, ననినఁ బతియాజ్ఞ శిరమున నతఁడు పూని.

చ. భరతుని లక్ష్మణుం గదిసి భక్తి నతుల్ ఘటియించి వారియా
దరణము గాంచి ప్రేమమునఁ దల్లుల కెల్ల నమస్కరించి త
త్పరమహితోక్తులన్ దనరి బంధుల నాప్తుల మంత్రులన్ ధరా
మరుల యథోచితక్రియల మన్ననఁ జేసి యనంతరంబునన్. 175

చ. ఇనకులుఁ డానతిచ్చినటు లేడుదినంబులు నిల్చి యవ్విభుం
డనుమతి సేయఁగాఁ బయన మై జననీబుధబంధుకోటి వీ
డ్కొని భరతుండు లక్ష్మణుఁడుఁ గూర్మిని వెంబడి వచ్చి పంపఁ జ
య్యన నతఁ డయ్యెడన్ సబలుఁ డై చనియెన్ నిజరాజధానికిన్. 176

క. ఈశత్త్రుఘ్నునికథ యే, ధీశాలులు వినిన హితమతిన్ జదివిన స
త్కౌశలి వ్రాసిన శత్త్రువి, నాశన మగు రాజ్యమును ధనమ్ములుఁ గలుగున్. 177

ఉ. అల్లవణారి యిట్లు చని యాత్మపురీజను లుల్లసిల్ల సం
ఫుల్లమనస్కతన్ ధరణిఁ బ్రోచుచు విశ్రుతకీర్తియుక్తి రా
గిల్లియు నర్మభంగి శ్రుతకీర్తిమనోరథపూర్తి సేయుచున్
క్షుల్లకు లార్తిఁ బెంచుభయజూర్తిపదన్ దగు ధర్మమూర్తి యై. 178

ఉ. అక్కడ నక్కడానిమలయంతటిధైర్యముఁ బూని రామభూ
భుక్కులచక్రవర్తి క్రతుభుక్కుల సర్వసుదృక్కులన్ సుమ
స్రుక్కుల సాధువాక్కులఁ బ్రసన్నతతో నిగిడించి సత్క్రియా
భాక్కులుగా ధరాజనులఁ బాలన సేసె సదృక్కులౌ ననన్. 179

సీ. శ్రుతిమర్మము లెఱింగి సుస్థిరాంతర్యాగవిమలు లై బ్రహ్మభావమున మించి
యధిగతధర్ము లై యరినాశ మొనరించి యాశలు గెలిచి బ్రాహ్మణులఁ గొలిచి
పరమార్థవంతు లై సురుచిరాష్టాంగసంగతి గాంచి రాజయోగము వహించి
తగుశాస్త్రములు నేర్చి ద్వంద్వసహిష్ణు లై తెలిసి మహార్యసేవలు ఘటించి

తే. బ్రాహ్మణక్షత్త్రియోరవ్యభటులు యోగి
జనులవలె మించ జగతి ప్రశస్తసస్య
వతి యయి ఫలింప నెలమూఁడువాన లెచ్చ
రాజ్య మొనరించుచుండె శ్రీరామవిభుఁడు. 180

వృద్ధవిప్రమిథునంబు మృతుఁ డగుకుమారుని రామునివాకిట వైచి విలపించుట

చ. కతిపయమాసముల్ చన నొకానొకనాఁ డసకృద్విలాపవి
స్మితజన మశ్రువారిపరిషిక్తకపోల మురువ్యథాభరా
నత మొకవృద్ధవిప్రమిథునంబు మృతుం డగుపిన్నపాపనిన్
వితమతిఁ గొంచు వచ్చి రఘువీరునివాకిట వైచి దీనతన్. 181

క. హా సుకుమార కుమారక, హా సుగుణనిధాన నీకు నర్హంబఁటరా
గాసిపడఁ జేసి మమ్మున్, బాసి చనఁగ నేమితప్పు పాటిలెఁ జెపుమా. 182

చ. మతి గలనిన్నువంటిసుకుమారశిరోమణి మమ్మువంటిదు
ర్గతులకు నేల దక్కు బహుమాత్రసపర్య లొనర్చి యెల్లదే
వతలను గొల్చి నిన్నుఁ గని వంశము నిల్చె నటంచు నేము న
మ్మితి మెద నిన్నకాలమున మృత్యువు మ్రింగు టెఱుంగమే సుతా. 183

ఉ. ఎక్కడఁ జొత్తు మేది తెరు వెవ్వరు దిక్కగువార లింకనో
చక్కనితండ్రి పాదజలజంబుల గజ్జెలు మ్రోయ ముందు మా
చక్కి నటింతు విప్పు డొకసారియు నాడవు మాటలాడ వా
మక్కువ యెందుఁ బోయె క్షణమాత్రములో నెట కేఁగి తివ్యోడన్. 184

ఉ. అక్కట యైదువర్షములయర్భకుఁ డెక్కడ మృత్యు వెక్కడే
దిక్కున నిట్టివింత గలదే తలిదండ్రుల కొర్ధ్వదైహికం
బెక్కడఁ బుత్త్రు లుండి ఘటియింపుదు రాత్మజశోకవహ్ని చేఁ
బొక్కుచుఁ దండ్రి సేయునొకొ పుత్త్రునకున్ దహనాదికృత్యముల్. 185

క. శిష్టనుతధర్మనిధి జన, తుష్టికరుఁడు రాముఁ డచ్యుతున కెన యండ్రా
దృష్టాంతము పుత్రక నీ, దిష్టాంతమువలనఁ దెలిసితిమి నృప యనుచున్. 186

మ. ధర వర్ణాశ్రమధర్మరక్షణము వేదప్రోక్తమార్గంబునన్
ధరణీనాథుఁ డొనర్పఁడేని యతఁ డాధర్మచ్యుతిన్ బుట్టుని
ష్ఠురపాపంబుల కెల్ల నెల్ల యగు నచ్చో రాజదోషంబునన్
దొరయున్ భూజనకోటి కిట్టు లపమృత్యువ్యాధిబాధావళుల్. 187

వ. అని సతీయుతుండై పరాసుం డగుసుతునిమీఁదం బడి ధరాసురుండు విలపించి
ఖరాసురాంతకు నుద్దేశించి మఱియు ని ట్లనియె. 188

ఉ. ఆసురభీకరుం డినకులాగ్రణి రాముఁడు రాజ్య మేలఁగా
భూసురబాలకుండు మృతిఁ బొందె నటం చనుమాట వాసితో
నీసహజన్ము లాశ్రితులు నిన్ను భజింపఁ జిరాయురున్నత
శ్రీసుఖయుక్తి రాజ్య మొనరింపుము సొంపున రామభూవరా. 189

క. ఇక్ష్వాకువంశజులు శౌ, ర్యక్ష్వేళగ్రీవు లవని నరయఁగ శిశుమృ
త్యుక్ష్వేళ విన రమోఘ, ప్రక్ష్వేళన నీతరమునఁ బాటిలె నదియున్. 190

ఉ. సత్యము ధర్మముం దయయు క్ష్మాపతి దాల్చిన నిట్లు బాలురం
మృత్యువు చెందునే యిఁక నదేటికి బాలుని కగ్నికృత్య మా
చిత్యమె మేము సేయుట త్యజించెద మీ వెత దీఱఁ బ్రాణముల్
హత్యలు మూఁడునుం బొరసి యయ్యసుఖంపు మటంచు నాడఁగన్. 191

క. ఆపలుకులు విని భయపరి, తాపపరీతాత్ముఁ డగుచు దాశరథి కృపా
కూపారుం డాపాఱుని, పాపని బ్రతికించుతమి సభకు వచ్చె వెసన్. 192

క. హితుల బురోహితుల మహీ, పతుల మహామతులఁ గృతుల భ్రాతృసుహృత్సం
తతుల గుణాన్వితుల నిజా, శ్రితులం బిలిపించి చింతఁ జేయుచు నున్నన్. 193

సీ. సంవర్తజలరాశి జానుదఘ్నంబుగా మనినమార్కండేయమునివరుండు
ఫాలలోచనునితోఁ బ్రతిఘటించి బదాంబుజమునఁ గన్గొన్న గౌతమతపస్వి
నిస్సంశయజ్ఞాననిధులలోఁ దొలుతఁ గీర్తింపఁగా దగువామదేవమౌని
భక్తిప్రపత్తిసంపత్తియు గానవైశారద్యమును గన్ననారదుండు

తే. మఱియు జాబాలికాశ్యపమండపాల, కణ్వకాత్యాయనాత్రిమౌద్గల్యభృగువ
సిష్ఠముఖ్యులు శిష్యప్రశిష్యసహితు, లగుచు వచ్చిరి రఘువరు నాత్మ నెఱిఁగి.

క. సభయు లయి లేచి రప్పుడు, సభఁ గలవారెల్ల రామచంద్రుండును ద
త్సభ సన్మునిరాట్పదముల, కభివందన మాచరించి యానందమునన్. 195

క. ఉచితాసనముల నునిచి స, ముచితార్ఘ్యవిధు లొసంగి యుచితజ్ఞుండై
రుచిరాననశశిబింబ, ప్రచురతరసుధాయమాన భాషల ననియెన్. 196

చ. అరుదుగ గోచరింపనిపదార్థము లైన మనఃప్రబోధవి
స్ఫురణల మీ రెఱుంగుదురు పుణ్యతపోనిధులార యీధరా
మరునికుమారుఁ డేమిటికి మ్రందె నధర్మము లెట్లు చెందె ని
ద్ధరణి ననం యథాతథసుధామధురోక్తుల నారదుం డనున్. 197

మ. అవనీదేవత లెల్ల నంచితతపస్వ్యాసక్తియుం సత్త్వమా
త్మవివేకంబు వహింపఁగాఁ గృతము ధర్మస్ఫూర్తి మించుం జిరా
యువు నారోగ్యము నెప్పుడుం గలిగి భూయోధైర్యగాంభీర్యవై
భవయుక్తిం బ్రజ యొప్పు నయ్యుగమునం బాణౌకృతోర్వీసుతా. 198

సీ. ఆకృతయుగమున నలరుఁ జతుష్పాదచారి యై ధర్మంబు జనవరేణ్య
త్రేత సత్యపదంబు తెగి పదత్రయగామి యగుఁ క్షత్రియులతపం బపుడు తఱచు
తమతపోమహిమల ధరణీజనులఁ బ్రోతు రాయురారోగ్యభాగ్యములు గలుగు
ననృతముల్పల్కుదు రచ్చటచ్చటజనుల్బుధులుమాత్రము బొంకు బొరయరందు

తే. ద్వాపరంబున సగబాలు ధర్మ మేఁగు, నందు ద్విజరాజశుశ్రూష లాచరించి
వైశ్యులు తపం బొనర్తు రకార్యనిష్ఠ, నది విపర్యాసమై తోఁచ దయ్యుగమున.

క. కలియుగమునఁ బాదత్రయి, తలఁగును ధర్మంబు శూద్రతపములు తఱుచౌఁ
గల వెన్నియైన వింతలు, తలఁప ననర్థంబు లా యధర్మము లధిపా. 200

శా. ఆలా గిప్పుడు శూద్రుఁ డొక్కఁడు తపోవ్యాసక్తి నీభూమిలోఁ
జాలన్ నిష్ఠ వహించె నందువలనన్ జచ్చెన్ ధరాదేవతా
బాలుం డాకుటిలాత్ముఁ జంపి శిశువున్ బ్రాణాన్వితున్ జేయు మిం
కేలా కాలవిలంబ మీక్షణమె యెమ్మిక్ష్వాకువంశాగ్రణీ. 201

క. పాపాత్ముల దండింపని, క్ష్మాపతి కాపాపమునను షడ్భాగము సం
ప్రాపించుఁ గాన ధరలోఁ, బాపము లేకుండ నరసి ప్రజఁ బ్రోవఁ దగున్. 202

ఉ. ఈయెడ రాజనీతి వచియించితి నింతియ యొక్కసారి రా
మా యని నిన్నుఁ బేర్కొనిన యంత ననంతము లైన పాపముల్
పాయఁగ నీకుఁ జేకుఱు నె పాపము లీద్విజపుత్త్రుఁ జీవితున్
జేయుట యెంత తొల్లి కపిసేన ననిన్ బ్రతికింపవే కృపన్. 203

రఘువీరుండు శంబుకుఁ డనుశూద్రతపస్విం జంపి బ్రాహ్మణకుమారుఁ బ్రతికించుట

వ. అని పల్కు నారదుపల్కు లాకర్ణించి యాకర్ణాంతలోచనుం డగునయ్యహల్యా
శాపవిమోచనుండు మనంబున నప్పని యొప్పికొని తనచెంగట నున్నలక్ష్మణు
నుపలక్షించి నీవు పోయి యీక్షణంబ క్షోణీసురునిమనఃక్షోభంబు నివారించి
తత్పుత్త్రదేహంబు సుగంధతైలకటాహంబుకుక్షి నిక్షేపించి సురక్షితంబు
గావించునది యని నియోగించి కించిన్మీలితనయనుం డయి హృదయబిస
పుష్పంబునఁ బుష్పకంబు దలంచినంత ననంతానంతమణిప్రభారమణీయపద్మ
రాగమణిచ్ఛవిచ్ఛటాచ్ఛాదితదశదిశావకాశంబై గగనతారకాయమానప్రసూన
కాయమానఘుమఘుమాయమానం బగు నవ్విమానంబు సాక్షాత్కరించినం
గటాక్షించి ప్రహర్షించి మహర్షిజనంబులకు నమస్కరించి విరించిసము
లగువారియవారితాశీర్వాదవచనవైభవంబు నొంది తదామంత్రణంబు గావించి
పురరక్షణంబునకు భరతలక్ష్మణుల నియమించి సముచిత తపఃక్రియాసమున్ని
ద్రశూద్రశీర్షచ్ఛిదాచికీర్షాదురాధర్షామర్షహర్షోత్కర్షం బవధరించి కవచంబు
ధరియించి కవదొనలు బిగియించి ఖడ్గంబు సంగ్రహించి కార్ముకం బవలంబించి
జాతిమగజాతిమొత్తంపుఁగ్రొత్తముత్తెంపుఁజెక్కడంపుఁబనిడంబునన్ బ్రకటం
బగుమకుటంబు తళత్తళలు వియత్తలంబు హత్తుకొన నుత్తుంగతరదివ్యయాన
లలామంబు సుమంత్రాదిమంత్రిజనసమేతంబుగా నధిరోహించి ధరావరారోహా
భరావహామహాంజనాచలసదృశాంగసమంజసాంజనాభిధ కుంజరేంద్రసాంద్ర
మదధారాధోరణీరణద్భ్రమరఝంకారరవాభోగం బగు పశ్చిమదిగ్భాగంబు పరి
శోధించిసురావరోధవధూనివహావిహారణోచితరచితాఖర్వసార్వభౌమాత్యఖండ
గండకండూతిమన్మత్తవేదండఘర్షితోద్దండగండోపల ప్రకాండమండిత హిమవ
త్పర్వతసార్వభౌమభౌమహైమప్రభామండలపిచండిలం బగు నుదగ్ధరామండ

లంబు దొరసి యవరవణ్ణనక్కడ నెల్లనరసి దిక్కూలముద్రుజసముల్లోలకల్లోల
మాలికాకీర్ణకలశార్ణవకర్ణేజపవర్ణవర్ణితై రావణదంతావళచతుర్దంత తంతన్య
మానకాంతకాంతిరమాసమాక్రాంతం బగుశచీకాంతదిగంతంబు డాసి దృగంతవీ
క్షాపరంపర వెదచల్లి యచ్చోట విపర్యాసతపశ్చర్యాధుర్యునిం బొడగానక
గానకళాచతురోపరిభాగచరద్వైమానిక శ్రేణికాహ్రియమాణ వీణారవంబు
లాలించుచు నిజవిమానరాజ విరాజమాన రాజమణిఘృణిమతల్లి కావల్లిక లెల్ల
కడల నల్లికొన నబ్బల్లిదుండు సర్వంకషశేముషీధురీణసర్వోర్వరాగీర్వాణసర్వ
దాప్రకల్పిత నదీస్నానసంధ్యాజపానుష్ఠాన నిష్ఠురతపోనిష్ఠాగరిష్ఠతా శ్రేష్ఠతరా
శ్వత్థతరుప్రణామపురస్సరప్రదక్షిణంబగు దక్షిణంబునకుం బఱతెంచి గిరిప్రాం
తంబులు పరికించి సరిత్తటంబులు విమర్శించి సరోవరంబులు పరీక్షించి యర
ణ్యంబు లవలోకించి గోకులంబులు తిలకించి కోవెలలు వెదకి పక్కణంబులు
నెమకి పానీయశాలలు చూచి మఠంబు లరయఁ బంచి మఖశాలలు దర్శించి
యగ్రహారంబులు గనుంగొని యన్నిదేశంబులఁ బొడగని యలయక మఱియు
నందంద మెలంగుచు నమందసిందూరచారుశోణప్రభాస్తోమధురీణతావామవా
మనసింధురంబుడంబున బంధురంబై కన్నులపండు వగునిండుజేగుఱుచాయల
దండిని మెండుకొను నొకకొండదండఁ బుండరీకషండరోచిగకాండ పాండుర త
రంగమాలికాడోలికావిహారమాణమరాళికాపాళికా కేళిసారం బగుకాసారం
బొకటి కనుంగొని తన్మధ్యప్రదేశంబున. 204

శా. శ్రీరామక్షితినాయకాగ్రణి నిరీక్షించెన్ గృశాంగున్ నిరా
హారున్ శోణజటాఛటాధరు మహోగ్రాచారు నేకాగ్రతా
పారీణాత్ము నధోముఖున్ భసితశుంభత్పాండుర శ్రీనిధిన్
ధీరత్వాకరుఁ జీరధారు నొకనిన్ దీప్యత్తపస్యాన్వితున్. 205

క. వీక్షించి నివ్వెఱఁగువడి, యాక్షితికిన్ డిగ్గి వాని కపరోక్షగతిన్
సాక్షాత్కరించె సాక్షా, దక్షరతత్వంబు శూద్రుఁ డల్పుడె తలఁపన్. 206

చ. ఇటువలె నత్తపోధికునిదృష్టిపథంబున నిల్చి రాముఁ డో
పటునియమాఢ్య యేశుభము పాటిలఁ జేసెద వీతపంబు దు
ర్ఘట మిది నీవు విప్రుఁడవొ రాజవొ వైశ్యుఁడవో వివేకవి
స్ఫుటమతి మించు శూద్రుఁడవొ బొంకక తెల్పుము కల్గినంతయున్. 207

క. నాపేరు రాముఁ డందురు, భూపాలుఁడ దశరథేంద్రపుత్త్రకుఁడను నీ
తాపసనిష్ఠ గనుంగొన, నీపాలికి వచ్చినాఁడ నినుఁ దెల్పు మనన్. 208

చ. కరము వినీతి వాఁడను నగణ్యగుణాబ్ధివి నీవె వేఁడఁగాఁ
హరిహరి యెట్లు బొంకుదు యథార్థము శూద్రుఁడ శంభుకాఖ్యుఁడన్

నరవర బొందితోనె సురనాయకులోకముఁ జెందు కాంక్ష దు
ష్కర మగునిట్టిబల్తపము గైకొని చేసెద నంచుఁ దెల్పినన్. 209

క. విని యంత వినయవంతుని, జనునే హింసింప రాజజన్మము నింద్యం
బని రోసి వెన్క భూసుర,తనయుమృతిఁ దలంచి కినుక దయఁ బెడఁబాపన్.

చ. కలకల నవ్వుచున్ నృపశిఖామణి హొన్నగనీబులోనియి
ట్టలపుమెఱుంగుచాయలబెడంగుఁగటారి జరీన దూసి మం
త్రులు గన శూద్రుమస్తము కఱుక్కునఁ ద్రుంచెఁ దదీయరక్తమ
జ్జలజవనంబు ముంచె దివిషత్సుమవర్షము భూమి మించఁగన్. 211

మ. అమరేంద్రాగ్నియమాదిదిక్పతులు సిద్ధాదిత్యగంధర్వసా
ధ్యమరుత్కింపురుషుల్ ఋషుల్ రఘుకులాధ్యక్షాగ్రభాగంబునన్
బ్రమదం బొప్పఁగ వచ్చి నిల్చి పటువాక్ప్రౌఢిన్ బ్రశంసించి రం
త మరుద్వంతుఁ డనేన్ బురాహృతసుధాధారానుసార్యుక్తులన్. 212

ఉ. విప్లవముల్ హరించి పృథివీభర మీవు భరింప శోకసా
రిప్లవతావికారములు రీణము లయ్యె భవత్కృపాణధా
రాప్లవపూతుఁడై వృషలుఁ డంగముతో దివి కేఁగెడిన్ సురా
నుప్లవవృత్తి వాఁ డదె కనుంగొను మయ్య దశాననాంతకా. 213

ఉ. క్షుల్లకులన్ వధించి పరిశుద్ధుల నేలెడుమిమ్ము మెచ్చి నేఁ
డెల్లసురల్ వరం బొకటి యిచ్చెద మంచుఁ దలంచి వచ్చినా
రుల్లమునందుఁ గావలసియున్నయభీష్టము దెల్పు మన్న భూ
వల్లభుఁ డుత్సహించి సురవర్యుల కంజలిఁ జేసి యిట్లనున్. 214

చ. కరుణ వరం బొసంగుమది గల్గిన దేవతలార తద్ధరా
మరసుతుప్రాణ మిందు మహిమం బలరన్ బ్రతికింతు నంచు నే
భరపడి మున్ను పల్కితి సభాస్థలి బాలకుఁ డట్టు లౌట నా
యరయమిఁ జేసి కాదె యను నాయనతో నని రెల్ల వేల్పులున్. 215

చ. శిఖి కడుఁ జల్లనైన నుడుశేఖరుఁ డుష్ణగుణంబుఁ బొందినన్
నిఖిలశరణ్య మీ రనెడు నిశ్చయవాక్కుల బొంకు సెందునే
స్వఖరకరాసి శంబుకునిఁ జంపినయప్పుడె ప్రాణవంతుఁడై
సుఖమున నున్నవాఁడు ద్విజసూనుఁ డనూనుఁడు గాక భూవరా. 216

ఉ. ఊహ కలంగి చింతిలక యూఱడు మప్పని కాశ్రితావనో
త్సాహజలాశి వై కలశజన్ముఁడు ద్వాదశవర్షయాగదీ
క్షాహితనిష్ఠ నుండెఁగద సాంగముగా నెఱవేర్చి నేఁడు పూ
ర్ణాహుతి సేయఁబూనె మన మందఱ మమ్మునిఁ జూడఁ బోఁ దగున్. 217

క. క్రతుకర్తవు క్రతుభోక్తవు, క్రతుఫలదుఁడ వీవు నీకుఁ గలగుణము కదా
క్రతువవలోకించుట యని, క్రతుభోక్తలు వలుక నటులె కానిం డనుచున్. 218

శా. కుంభీసంభవుఁ గాంచువాంఛఁ దగఁ గాకుత్స్థాన్వయస్వామి య
జ్జంభారిప్రముఖామరేశ్వరులు పజ్జ బుష్పకారూఢులై
యంభోజాప్తనిజప్రభావిభవమారా నాఁగ నాగేఁ దటి
న్యంభోజాకరపట్టణోపవనశైలారణ్యముల్ సూచుచున్. 219

వ. ఈగతి నేఁగి యాగుణసాగరుండు తెనపురోభాగంబున. 220

సీ. ప్రాగద్రితటభాగభాగహారపరాగరాగధూతఘనాఘనాగకులము
దారితాభ్రశతారతారదంష్ట్రాదారదారియుగ్ఘ్రాదారదారకంబు
మాలూరహింతాలతాలతూలరసాలసాలకేసరసాలసాలయుతము
శబరయోషాచండచండరుక్కరకాండఖాండఖండితగండగండకంబు

తే. పిండితాజాండగండభేరుండనినద
సంశ్రవణమాత్రవిత్రస్తశరభసరభ
సాగమనదర్శనోద్భ్రాంతిహారివర్ణ్య
మవుమహారణ్య మొకటి రాఘవుఁడు గనియె. 221

క. కని యయ్యరణ్యపథమున, ఘనయానముమీఁద శతమఖప్రముఖులతోఁ
జనపతి సంభాషించుచుఁ, జనునప్పుడు గృధ్ర మొకటి చనుదెంచి వెసన్, 222

ఆ. మ్రొక్కి నిలిచె నంత నొక్కయులూకంబు, వచ్చి బహుపరాకుస్వామి యనుచు
వినుతి యాచరించె వెఱఁగందె రఘురాముఁ, డందు గ్రద్దవలికె ముందుగాఁగ.

గృధ్రఘూకములు రామునితోఁ దమవివాదముఁ జెప్పుకొనుట

క. శిక్షింతువు దుర్మార్గుల, రక్షింతువు దేవతలను బ్రాహ్మణులఁ గృపన్
వీక్షింతు వార్తజనులను, సాక్షాద్విష్ణుఁడవు నిన్ను శక్యమె పొగడన్. 224

సీ. పరమవిద్యాప్రౌఢి బ్రహ్మదేవునికంటె రౌద్రసంపన్నత రుద్రుకంటె
గాంభీర్యధుర్యతఁ గలశాంబునిధికంటెఁ దిరమైన తాల్మి భూదేవికంటె
మతిచమత్కృతిసమున్నతి బృహస్పతికంటె నధికధైర్యమున హేమాద్రికంటె
ననుపమానవితీర్ణి ధననాయకునికంటె ధర్మవైఖరి దండధరునికంటెఁ

తే. దేజమున భాస్కరునికంటె దీప్తకీర్తి, శశధరునికంటె ఘనుఁడవు సకలభూత
సంభవస్థితికరుఁడవు సర్వసాక్షి, వఖిలరక్షక యొకవాక్య మవధరింపు. 225

క. ఈకౌశికంబు నాయిలు, సేకొని తనగృహ మటంచుఁ జేరఁగ నీ దా
వాకిలి నిడుకొని పోరెడి, నోకౌశికయాగరక్షణోత్సుక యెపుడున్. 226

క. నాయనదతనము మాన్పి కు,లాయము విడిపించి "దుర్బలస్య బలం రా
జా" యనువాక్యము నిక్కము, సేయఁగదే యనిన గూబ క్షితిపతి కనియెన్.

సీ. ఇంద్రునంశంబున నెల్లభోగము లంది వహ్నియంశమునఁ బావనతఁ జెంది
యమునియంశమున ధర్మాభిరతి యొనర్చి నిర్ఋతియంశమున దుర్నీతి మాన్చి

వరుణాంశమునఁ బ్రజావళికి సేమ మొనర్చి పవనునంశమున నాబలిమి హెచ్చి
ధననాయకునియంశమున వితీర్ణి వహించి శివునంశమున భూతు లవధరించి

తే. భాస్కరునియంశమునఁ బ్రతాపంబుఁ బూని
చంద్రునంశంబునను మహాసౌమ్య మూని
యఖిలకల్యాణగుణరాశివైన నిన్నుఁ
బ్రస్తుతియొనర్ప శక్యమే బ్రహ్మకైన. 228

సీ. లక్ష్మీవిహారాబ్జలక్షణేక్షణములఁ గరుణయు రోషంబుఁ గడలుకొనఁగ
తెల్లధర్మములకు నెల్ల యామనమున శాంతిదోర్లభ్యముల్ సందడింప
నుచితమై చిత్రిఁ బెంపొందినమాటల వినయపారుష్యముల్ విస్తరిల్ల
దరహాసచంద్రికాస్ఫురితాస్యమున నాభిముఖ్యమును రహింప

తే. శిష్టజనరక్షణము దుష్టశిక్షణంబు, నాచరింపుదు వొక్కట నఖిలభూత
సముఁడవయ్యును ధర్మసంస్థాపనార్థ, మిన్నిగుణములు వహియించి యాశ్వరేశ.

ఉ. అద్దమ రేయి భూమి నశనార్థము గ్రుమ్మరి తెల్లవాఱినన్
నిద్దురఁ జెందవచ్చు నని నేను బ్రయత్నము సేసి కట్టితిన్
దద్దయు వేడ్కని ల్లొకటి తద్గృహసీమ వసింప నియ్య దీ
గద్దఱిగద్ద చేరి కలకాలము పోరెడిఁ బోరు మాన్పవే. 230

క. ధర్మగతి 'రామ ఏవ గతిర్మమ' యని యిఁక సుఖస్థితిని బ్రతికెద నే
నిర్మించికొన్నసదనము, కూర్మిని విడిపింపవే రఘుప్రవర యనన్. 231

సీ. విలసితాంతరవైరివిజయుఁ డౌవిజయుని నతులరూపజయంతుఁడగు జయంతు
సకలైకధర్మపాలకు ధర్మపాలకు నధిపస్తుతసుమంత్రు డగుసుమంత్రు
నరిరాష్ట్రసాధకుం డగు రాష్ట్ర సాధకుఁ గితవకార్యతమోర్క ఘృష్టిఘృష్టి
యాచకసిద్ధార్థుఁడనఁదగుసిద్ధార్థు ననవరత మశోకుఁ డగునశోకుఁ

తే. గాంచివింటిరెగృధ్రిమూకములవాక్కు, లనివిమానంబుడిగిరాముఁడచట నిలిచి
పులుఁగులనుబిల్చియే పక్షితోలుతఁ గట్టె, నీగృహముదెల్పుఁ డనగృధ్రి మిట్టు

క. ఏనాఁడు బ్రహ్మ పుట్టెనొ, యేనాడు ప్రజాసమృద్ధి యిద్ధరఁ గనెనో [లనియె.
యానాఁడె నిలువ నీ డని, యీనీడము గట్టితిని నరేశ్వర యనినన్. 233

క. పేచక మనె ఘనసూచక, మేచక మీచెంత వెఱతు మృష లాడంగా
భూచక్రంబున నజుచే, నీచెట్టె నపుడ యయ్యె నీయిలు నాకున్. 234

చ. అన విని మంత్రిపుంగవుల నందఱఁ గన్గొని రామచంద్రుఁ డో
యనితరధర్మమర్మనిధులార దివాంధము భూజముల్ జనిం
చినపుడె గూడు తా నిచటఁ జేసితి నం చనె గృధ్రి మూర్వి పు
ట్టినయపుడే నివాసము ఘటించితి నం చనె నిక్క మెద్ది యో. 235

క. దాక్షిణ్యంబును బక్షా,పక్షంబులు దలఁప కుభయపక్షము లెనఁగా
నీక్షించి తగవు దీర్చువి,చక్షణులకు నిహపరముల సౌఖ్యము గల్గున్. 236

చ. తగవును బథ్యమున్ హితవుఁ దప్పక ధర్మము పేర్మి విన్నవా
రగునని సంతసింప వ్యవహారము లొప్పఁగఁ దీర్చి సజ్జనుల్
జగతిఁ బ్రసిద్ధి కెక్కుదురు సత్యము ధర్మ మెఱింగి యుండియున్
దెగమొగమోడియున్న జననిందితు లొందుదు రెం దధోగతుల్. 237

ఉ. ఊరక రానిపోని పెఱయుక్తులు గొన్ని గణించి వాక్చమ
త్కారము చూపి రచ్చలను ధర్మము దీర్పని దుర్విచారుఁ డ
వ్వారుణపాశబద్ధుఁ డయి వందురుఁ గావున మీరు గృధ్రికా
కారులవాదు దీర్పుఁడు యథార్థముగా నని యానతిచ్చినన్. 238

ఉ. ఆ యెనమండ్రుమంత్రులుఁ దదాజ్ఞ వహించి ముహూర్తమాత్రమే
కాయనతాప్రసక్తమతులై తలపోసి నరేంద్రుఁ జూచి భూ
నాయక గూబ గెల్చె సదనంబునకై మృష లాడె గ్రద్ద య
న్యాయపథానువర్తి యిది యర్హము దండన కంచుఁ దెల్పినన్. 239

చ. అలరి రఘూద్వహుం డనియె నా నిది నామదినున్నలాగునన్
దెలిపితి రయ్యులూకము గణించిన దే నిజ ముర్వి వృక్షముల్
గలుగక మున్నె యీగృహము గట్టితి నంచు నబద్ధ మిక్కడన్
బలికెడి గృధ్రి మిచ్చెదుగుఁ బట్టి వధింపక మాన వచ్చునే 240

మ. వినుఁ డేకార్ణవమైన కాలమున మున్ విష్ణుండు నీటన్ శయిం
చిన యద్దేవుని యాత్మఁ బుట్టి దివిషజ్జ్యేష్ఠుండు తత్కుక్షి హో
యనకోటుల్ వసియించి నిర్గమనమార్గాన్వేషి యై యున్నెడన్
జనియించెన్ గనకారవిందము తదంచన్నాభికాదీర్ఘికన్. 241

శా. ఆనాళీకమృణాళనాళగతిఁ బద్మాగ్రంబుఁ బ్రాపించుభా
షానాథున్ మధుకైటభాఖ్యు లదలించన్ నిద్ర మేల్కాంచి డెం
దానన్ గోపము మించ నుగ్రుఁ డగుచున్ నాభాసరోజంబు దు
ర్మానోదగ్రుల వారిఁ ద్రుంచె నతిశీఘ్రప్రాప్తచక్రాహతిన్. 242

క. ఆదానవమూర్ధన్యుల, మేదఃపంకమున నయ్యె మేదిని యవు దు
త్పాదించె శైలతరుస,స్యాదుల నజుఁ డందు వెన్క నఖిలము గలిగెన్. 243

ఉ. కావునఁ గౌశికంబు నరికట్టిన గ్రద్దను బట్టి గట్టిగా
నే వధియింతు నేఁ డనుచు హేతి ధరింప నభస్సరస్వతీ
దేవి వచించె నో నృప వధింపకు మిప్పను గ్రద్ద తొల్లి ధా
త్రీవరుఁ డాశరీర మతి గృధ్రితఁ జెందుట విన్ము తెల్పెదన్. 244

ఉ. పూర్వము బ్రహ్మదత్తుఁ డను భూవరుఁ డై యితఁ డొప్పు సత్యమున్
సర్వవిరోధిజైత్రభుజశౌర్యము ధైర్యము గల్గి కీర్తుల

పూర్వమునాఁటివెన్నెలలభాగున దిక్కుల నెల్లఁ బర్వఁగా
నుర్విర యేలుచుండె బుధయూథచకోరము లుత్సహింపఁగన్. 245

క. ఈతనికడ కొకదినమున, గౌతమముని వచ్చి యన్నకాంతుఁ నతిథి నిం
దే తెంచితిఁ బెట్టుదె యన, నాతిథ్య మొనర్చి యాతఁ డడిగినభంగిన్. 246

క. ఇష్టపదార్థంబులలోఁ, బుష్టికరంబుగను వాఁడు భోజన మిడి యా
ముష్టింపచునకు నటువలె, నిష్టాన్నము నూటయిరువదేనేం డ్లిడఁగన్. 247

చ. ఇటువలెఁ బెక్కునాళ్లు భుజియింపఁగఁ బెట్టిన యాతనింట న
జ్జటి వసియించి యొక్కదివసంబున నన్నము లోనఁ గండ యొ
క్కటి గని కూటిలో బలలఖండముఁ బెట్టితి గాన దీన నీ
వటవిని గృధ్రమై మెలఁగు మంచు శపించె దయావిహీనుఁడై. 248

క. శపియించిన భయపడి యా, నృపతి యతని కెఱఁగి యెఱుఁగ నిది దప్పైనన్
గృప శాప ముడుపవే యని, కృపణతఁ బ్రార్థింప మరల ఋషి యిట్లనియెన్.

సీ. వెడఁదకన్నులవాఁడు విగ్రహాయుతకోటివిగ్రహాయుతకాంతి వెలుఁగువాఁడు
రామనామమువాఁడు శ్యామలాంభోధరశ్యామలాంగకలీల నమరువాఁడు
మునులపాలిటివాఁడు వనజాతహితకులావనజాతహితకీర్తి దనరువాఁడు
పల్కి బొంకనివాఁడు పంక్తికంధరశిరఃపంక్తికంధరమరుత్పటిమవాఁడు

తే. దశరథునిఁ బోలునొకరాజు దశరథునికిఁ
దనయుఁడై పుట్టఁగలఁ డాజితనయుఁ డెలమి
మించి నీదేహమున హస్త ముంచినపుడె
యతివిభుఁడ పోదు వని యేఁగె యతివిభుండు. 250

క. ఆశాప మడఁగఁ జేయుము, కౌశికహితకాంతుఁ నేల గృద్ధను జంపన్
శైశవమున నొనరింపవె, కౌశికహితకార్య మని గగనవాణి యనన్. 251

ఉ. ఆరఘువీరమౌళి చతురంబుధివేష్టితవిశ్వధారుణీ
దారుణభారనిర్వహణదక్షిణదక్షిణపాణిపద్మముస్
గారుణికత్వ మేర్పడఁగ గృద్ధశిరంబున నుంచె శాపసం
హార మొనర్ప నం చభయహస్త మొసంగు తెఱంగు దోఁపఁగన్. 252

వ. ఇత్తెఱంగున నత్తరణికులపుంగవుండు బంగరుమించుటుంగరములమెఱుంగులం
గరంబు మెఱయుతనకరంబు విహంగమోత్తమాంగంబునం గదియించిన. 253

సీ. మార్తాండఘృణి నేలుమణికిరీటముడాలు మొనసి దిక్కులఁ గీలుకొని వెలుంగ
నుదుజాలములలీల బెడఁగొందు మగతాలసరుల పొందునఁజాల నురము మెఱయ
జగములన్నియుగెల్చు తెగువనెమ్మదిఁ దాల్చువలరాజువలెఁ బొల్చు చెలువుగులుక
మంచిపున్నమచందమామవెన్నెలచంద మొందుకప్పురగంధమొఱపు నెఱప

తే. మఱియుఁ దగుభూషణంబులు మహితచిత్ర
వస్త్రమాల్యాదులు రహింప వాసవాదు
లవుర యద్భుత మని యెంచ నాక్షణమున
గ్రద్ద యొకపుణ్యపురుషుఁడై కానిపించె. 254

వ. ఇవ్విధంబున. 255

తే. పురుషుఁడై నిల్చి యమ్మహాపురుషుపాద, పద్మయుగళంబున నవీనపద్మరాగ
మకుటరుచు లావరింప నమస్కరించి, హస్తములుమోడ్చి యిట్లని యభినుతించె.

సీ. జ్ఞానమార్గహరాయ శరణార్థిహృద్వాన్తాజ్ఞానమార్గహరాయ తే నమోస్తు
దీనజీవనదాయ ఫేనభంగాంచన్నదీనజీవనదాయ తే నమోస్తు
మానసత్త్వపరాయ మానవాళివిభాసమానసత్త్వపరాయ తే నమోస్తు
దానవారిధరాయ ధైర్యసంపద్ధూతదానవారిధరాయ తే నమోస్తు

తే. భానుజాదికసేవ్యాయ తే నమోస్తు, భానుగోత్రపవిత్రాయ తే నమోస్తు
మానితదయాసముద్రాయ తే నమోస్తు, జానకీప్రాణనాథాయ తే నమోస్తు.257

మ. చరణాంభోజరజంబు సోఁక శిల యోషాత్వంబు మున్ గాంచె మీ
కరపంకేజము దాఁకఁ బక్షి నరుఁడై కాన్పించు టాశ్చర్యమే
దురితంబుల్ దొలఁగెన్ శుభంబుగలిగెన్ దొల్లింటిచందాన నా
పురికిన్ బోయెద సెల్వొసంగు మిఁక నోభూరిప్రభావోదయా. 258

క. అని యెంచి బ్రహ్మదత్తుఁడు, మనువంశనృపాలమౌళిమణి సముచితభం
గిని గారవించి పనిచినఁ, దనదేశంబునకుఁ జనియెఁ దద్దయు వేడ్కన్. 259

చ. అమరులు క్రొవ్విరుల్ గురిసి రంతట రాముఁడు పాకశాసన
ప్రముఖులు పెక్కుచందములఁ బ్రస్తుతి సేయ విమాన మెక్కి మం
త్రిమణులఁ గూడి కుంభభవునిన్ గన నేఁగెఁ గవేరకన్యకా
కమలరజోధురంధరసుగంధసమీరము సేద దీర్పఁగన్. 260

మ. శతమన్యుం డటు లేఁగురాఘవునిపజ్జన్ బోవుచున్ రామ చూ
చితె యాద్రావిడభూమి నేఁ డయిన యీచిత్రంబు సామాన్యప
ర్వతమున్ గానము తావకీనఘనధైర్యస్ఫూర్తిచే గాసి యై
క్షితితోఁ జొచ్చి యడంగెనో గిరు లనన్ సీతావిభుం డిట్లనున్. 261

ఉ. సర్వసుపర్వమౌళిమణిసంగతదివ్యపదాబ్జ సర్వతో
గర్వితపర్వతప్రకరఖండనచండకృపాణి మించఁగాఁ
జేర్వకు మీరు రాఁగ నివసింపక యిచ్చటికొండ లెల్ల నీ
యుర్వి నడంగు నన్నుఁ దగు నొప్పనె యాగతి నానతీయఁగన్. 262

వ. అని యిట్లు శ్రీరామచంద్రుండు వలికిన. 263

చ. నగుచు బలారి వల్కె రఘునాయక చెంగటఁ గంటివే యభం
గగురుతరప్రభావమణికర్ణిక నాఁ దగు తామ్రపర్ణి కన్
బొంగడితకెక్కె క్రొత్త తెలిముత్తెపుఁ జిప్పలు సేతుబంధనా
ద్యగణితతావకీనచరితార్జితకీర్తిరుచిన్ వెలింగెడిన్. 264

క. మలయముఁ గను మలయజతరు, నిలయము శాదాగ్రభరితనిర్భరఫణభృ
ద్వలయము గృతపథికశ్రాం,తిలయము నతభావధృతమణికిసలయమున్. 265

మ. అదె కుంభీభవునాశ్రమం బదె సముద్యత్పర్ణశాలోత్కరం
బదె పాథోధరయూథవృద్ధికరదీవ్యద్ధోమధూమవ్రజం
బదె శాలాగతమంత్రతంత్రపరహోత్రధ్వర్యుఋత్విగ్గణం
బదె యూపప్రముఖార్హసాధనచయం బంచున్ సురేంద్రుం డనన్. 266

క. విని యతఁడు దెల్పినన్నియుఁ, గని రఘువీరుండు పుష్పకము డిగ్గి ముదం
బునఁ దత్రత్యతపోధన, జనములకును వినతుఁ డగుచుఁ జనుదెంచె వెసన్. 267

రాముఁ డగస్త్యాశ్రమమునకుఁ బోవుట

చ. అజరులు దెల్పఁగా విని నిజాగమనంబున కుల్లసిల్లుకుం
భజునిపదాంబుజాతములు ఫాలము సోఁక నమస్కరించి భూ
భుజుఁ డతఁ డిచ్చునర్ఘ్యబహుపూజలఁ దృప్తి వహించె నంత యా
గజనితహవ్యభాగములు గైకొని యేఁగిరి వేల్పు లందఱున్. 268

చ. సముచితభంగి యాగవిధి సర్వముఁ దీర్చి యగస్త్యమౌని భూ
రమణుని నాఁటి రాత్రి నిల రమ్యనివాసమమర్చి కందమూ
లములను దేనెలన్ దగుఫలంబులఁ దృప్తి యొనర్చి తత్ప్రస
న్నముఖసరోరుహంబునను నైజదృగాళులఁ జేర్చి యిట్లనున్. 269

ఉ. నాదెస నెయ్య ముంచి రఘునాయక మీ రరుదెంచినందునన్
గాదె చెలంగె మన్మఖము గల్గెఁ దపఃఫల మాత్మ యున్ మహా
హ్లాదముఁ జెందె విప్రతనయార్థము శూద్రుని సంహరించి యిం
ద్రాదుల కిం పొనర్చుట సమస్తము వింటిమి వారు దెల్పఁగన్. 270

క. ఐదంయుగీనేనృపతుల, కీదాక్షిణ్యప్రసక్తి యీకరుణయు నీ
యౌదార్యశౌర్యగాంభీ,ర్యాదులు గలవే నుతింప నలవియె నిన్నున్. 271

చ. నిను ఘనుఁ డంచు మెచ్చి ధరణీవర యేమి యొసంగువాఁడ నై
న నిదె విచిత్రరత్నమయనవ్యవిభూషణ మొక్కఁ టిచ్చెదన్
గొను మనినన్ రఘూద్వహుఁడు కుంభజ మౌనిఁ బ్రతిగ్రహింప వ
చ్చునె ద్విజరాజ ధర్మములు చూచి యొసంగుఁడు నా నతం డనున్. 272

చ. ఎలమిఁ గుబేరునంశమున నియ్యఁగఁ బుచ్చుకొనంగవచ్చు రా
జుల కది యెట్టు లన్న మును క్షోణిజనంబులు రాజశూన్యతన్

తలఁకి బలారి నిర్జరగణంబుల నేలెడులీలఁ దమ్మునే
ర్పెలరఁగఁ బ్రోచురాజుఁ బడయంగఁ దలంచి విధాతపాలికిన్. 273

చ. అరిగి నమస్కరించి చతురానన రాజొకరుండు లేక యీ
ధరణి వసింప లేము కులధర్మపథంబుల సంచరింప దు
ష్కర మయియున్న దొండొరులఁ గైకొన కుండెడిచెయ్వు పుట్టెడిన్
దిరముగఁ జింత సేసి యొకధీరు నిఁకన్ సృజియింపవే యనన్. 274

చ. నలువ సురేంద్రదండిజలనాథకుబేరులఁ బిల్చి పల్కె మీ
బలముల నాలుగింట నొకపా లొసఁగుండు త్వదంశజాతుఁ డై
యిల భరియింప నొక్కనృపు నేను సృజించెద నన్న నిచ్చి ర
చ్చెలువున వార లందున సృజించె విభాజితయుక్తుపుర్ క్షుపున్. 275

మ. క్షుపుఁ డిక్ష్వాకువడిఁ బుట్టి బ్రహ్మ వనుపన్ క్షోణీతలాధ్యక్షుఁ డై
యపు డైశ్వర్యముఁ దృప్తి దాతృతయు నింద్రాంభోధిపాంశంబులన్
రిపునాశంబు కృతాంతునంశమున దారిద్ర్యార్తిసంహార మ
ర్థపరత్వంబు ధనేశునంశమున నిత్యం బూని ప్రోచెన్ బ్రజన్. 276

ఉ. కావున నెవ్వ రిచ్చినను గైకొనవచ్చు నృపాలమౌళికిన్
నీవు నృపాలమాత్రుఁడవె నిర్మలకీర్తివి విష్ణుమూర్తి వి
ప్పావనభూషణం బిఁకఁ గృపన్ గొనుమంచు నగస్త్యుఁ డిచ్చినన్
భూవరశాసనుండు ప్రియపూర్వముగా గ్రహియించి వేడుకన్. 277

చ. అది ధరియించి మౌనిఁ గని యయ్య సమస్తరహస్యధర్మసం
పదలఁ బొసంగు మీరు ప్రతిభాషలు వల్కననేరముల్ క్షమిం
పఁ దగుదు రంచు నేమిటికిఁ బల్మఱు వేఁడఁగ సైఁచినారె కా
యిది హృదయంగమం బయిన దెక్కడి దీమణిభూష దెల్పరే. 278

సీ. అవివర్ణవాళి వింధ్యనగంబు మీరు డాయ వివర్ణగతిఁ బూనదా మొదట నె
యహితాతిభయదుఁ డౌనహుషావనీభర్త యహితాప్తిమీఁకిన్కనడవిఁబడఁడె
ధర్మాశయమున నెంతయు వార్తకెక్కియు ధర్మాశయందె సంతతము మనరె
దానవద్విపసముద్ధతి వృద్ధి వహియించి దానవద్విపుఁ గుక్షిలో నడఁపరె

తే. యలసముద్రంబు ప్రాగభివ్యక్తసత్త్వ,మై నశింపఁగఁ గొనరె యాపోశనంబు
మిమ్మెఱింగియు నెటుల నీసొమ్ముగలిగె,ననుట యనుచిత మదియోర్చి యానతిండు

అగస్త్యుఁడు రామునకు శ్వేతుఁ డనురాజర్షి వృత్తాంతము సెప్పుట

క. అనిన నగస్త్యుం డిటు లను, ననఘాత్మక తెలియవలసి యడిగినఁ దప్పా
విను మీయాభరణము వచ్చినవిధ మాద్యంత మెఱుక సేసెద నీకున్. 280

చ. ప్రథమయుగాంతరంబునఁ దపం బొనరింపఁగ నేఁ దలంచి యీ
పృథివి నివాసయోగ్యవన మెక్కడఁ గల్గునొ యంచు నైకది

క్పథపథికుండ నై సమధికత్వరఁ ద్రిమ్మరియొక్కదిక్కునన్
బ్రథితబహుద్రుకుంజనికరస్ఫురితాటవిఁ గంటి రాఘవా. 281

చ. అలశతయోజనాయతమహాటవి యీగతిఁ గాంచి చొచ్చి య
న్నెలవు విహంగశూన్యమును నిర్జనముం మృగవర్జితంబు నై
యలుకొనరింపఁ జాలుటకు నచ్చెరువొందుచుఁ బోయి పోయి చెం
తల నయనోత్సవస్ఫురణ దారొక్కన నొక్కకొలంకు సూచితిన్. 282

సీ. అలల నుయ్యెలలూఁగు చలరెడియంచలు నంచలకును లగ్నాంబకములు
బకములు విహరించుభంగి సారసములు సారసములు చేరుజక్కవకవ
కవకవఁ బలికెడికరణి నారవ మొంచ మించినందున నిద్రడించెఁ గాన
గానముల్ సేయుభృంగంబులవేడ్క గనంగ నాద్భుతకాంతి నలరుతొగలఁ

తే. గలమనోహరవాసనల్ గలయునాఁచు
నాఁచుజలదంతికరముల నతిశయమున
యమునరహిఁ గాంచునత్తోయజాకరమునఁ
గరము నయమొప్పఁ దీర్చితిఁ గాల్యవిధులు. 283

క. ఓజనవర యాకొల నొక, యోజనవిస్తార మొంది యొరపైనది యం
దేజనునిఁ గాన నద్దరి, భూజావలి మించునొకతపోవనిఁ గంటిన్. 284

తే. కనియయోయిట్టివన మేమికారణమున, నార్యమునిశూన్యమయ్యెనోయనితలంచి
కందమూలాదికముల నాఁకలి యడంచి, యే వసించితి నాఁటిరేయెల్ల నచట.

క. మఱునాఁ డరుణోదయమున, సంసికి స్నానంబు సేయఁ జనుచుం జగతీ
శ్వర నేఁ దెరువ్రునఁ జూచితిఁ, బరిపూర్ణాంగంబు నొక్కప్రాయపుశవమున్. 286

ఉ. చూచి మనోహరాంగ మగుచుం జెలువొందుశరీర మిచ్చటన్
వైచి శరీరి యెన్నఁడు దివంబున కేఁగెనొ యీశరీర మిం
దేచెద లైన నంటి నశియింపక మించుట కేమి హేతువో
యీచతురంగభూమిఁ గన నిట్టివిచిత్ర మటంచు నెంచుచున్. 287

ఉ. అంత నొకింతసేపటికి నంబరవీథిని నేను గంటి దు
ర్దాంతమణీధగద్ధగితరమ్యసువర్ణసువర్ణఘంటికా
క్రాంతము చంద్రచందనశరచ్చరదామరదంతికాంతిసా
మంతసితచ్ఛదైకలసమానము నొక్కమహావిమానమున్. 288

ఉ. అందొకదివ్యుఁ డుజ్జ్వలతరాభరణద్యుతు లుల్లసిల్లఁగాఁ
జందనలిప్తదివ్యతనుసౌరభముల్ దిశ లావరింపఁగాఁ
జందురుకాంతియుం గుసుమసాయకు గేరెడిసోయగంబు సం
క్రందనభోగముం గలిగి కన్నులపండువుగాఁ గనంబడెన్. 289

వ. అప్పుడు. 290

సీ. వింజామరలు వైచు వేల్పుఁబూఁబోఁడుల కంకణక్రేంకారకలనకంబె
వివిధగీతావళుల్ వినిపించు గంధర్వవనితలవీణారవమ్ముకంబె
నటియించు నప్సరఃకుటిలాలకలపాదకటకఝుళంఝుళార్భటులకంబె
సౌవర్ణవేత్రభృత్సాధ్యకన్యాసముత్కలితసాహోనినాదమ్ముకంబె
తే. సరసంగీతవాద్యఘోషమ్ముకంబె, సోపవాహ్యామరాళిసాహస్రపక్ష
ఝుంకృతులుమించ వెలయునాస్వర్గదివ్య, యానమణిడిగ్గి వనభూమికరుగుదెంచె.

క. అరుదెంచి యల్లశవముం, గర మర్థిని డాసి కోసి కండలు దిని త
త్సరసీజలపానంబునఁ, బరితుష్టిఁ బొంది యతఁడు పటువేగమునన్. 292

ఉ. క్రమ్మఱ నవ్విమానమణిఁ గౌతుక మొప్పఁగ నెక్కి క్రేవలం
గొమ్మలు గొల్వ నేఁగఁగ జుఁకప్ప జనించిననూరకుండె కే
నమ్మహనీయమూర్తిఁ గని యక్కట దివ్యుఁడవయ్యు రోఁత లే
కిమ్మనుజామిషంబు దిన నేమిటి కెవ్వఁడ వీవు తెల్పుమా. 293

క. హేయ మగుమనుజమాంసము, రోయక భక్షింప నాశరులకుఁ దగుఁ గా
కోయి మహాత్మక యిప్పని, సేయఁగ నీ కగునె యనిన సిగ్గున నతఁడున్, 294

చ. శిర మొకయింత వంచి నుతి సేసి కరంబులు మోడ్చి నాపయిన్
బరమవినీతిఁ జూడ్కు లిడి పల్కె మునీంద్ర విదర్భధారుణీ
శ్వరుఁడు సుదేవుఁడన్ నృపతివర్యుఁడు దొల్లి సతీద్వయంబునం
దరుసముఁ బూని శ్వేతసురథాఖ్యుల నిద్వరఁ గాంచెఁ బుత్త్రులన్. 295

తే. వారిలో శ్వేతుఁ డనియెడువాఁడ నేను, మజ్జనకుఁ డార్యవినుతధర్మప్రసక్తి
జగతిఁ బాలించెఁ దత్పరోక్షమున నన్నుఁ, గడఁగి మంత్రులు పట్టంబుగట్టిరనఘ.

ఉ. పట్టము నేను గట్టుకొని బాహుజనీతిమె పట్టె శత్రులన్
గొట్టి యనేకకాలమును గుంభిని నంతయు నేలి యంతఁ దోఁ
బుట్టినయట్టియాసురథు భూవరుఁ గా నొనరించి నెమ్మదిన్
బుట్టినశాంతి నీఘనతపోవనభూమికి వచ్చి యిచ్చటన్. 297

క. ఈసరసీకటసీమనె, వేసరక వసించి మూడువేలేండ్లు తపం
బే సల్పి పిదపఁ గాయముఁ, బాసి తపోమహిమ దేవభావము గంటిన్. 298

శా. దేవత్వంబు వహించి యీఘనమణీదివ్యద్విమానంబు పై
నీవేల్పుం జవరాండ్రతో మెలఁగఁగా నింతంతనన్ రానిక్షు
త్తేవేళన్ నను గాసి సేయ నిది నన్నేలాగు ప్రాప్తించె నీ
దేవావాసముఁ జెందువారలకు క్షుత్తృష్ణావ్యథల్ సెందునే. 299

మ. ఇది యేమో యని చింతఁ జేసి యొకనాఁ డేఁ బద్మజుం జేరి త
త్పదముల్ ఫాలము సోఁక మ్రొక్కి కరుణాపాథోధి యోభారతీ
హృదయాధీశ్వర నిన్నుఁ జేరియును నేనీలాగు క్షుద్బాధఁ జి
క్కి దినంబున్ దపియించు టేమి యనఁ బల్కెన్ ధాత నాతోఁ గృపన్. 300

మ. నృపభావంబున రాజ్యమేలునపుడున్ నీ వన్నదానంబు దా
నపరత్వంబునఁ జేయవంబుకణమైనన్ దప్పి గొన్నట్టివా
రిపయిన్ గోట విదుర్ప వొక్కరుఁడ వుర్వీనాథ సాధుస్థితిన్
దపముల్ సల్పుచుఁ బ్రోవవే యతిథి దానన్ క్షుత్తు నిన్నే చెడిన్. 301

క. ఆఁకొన్నవారి రమ్మని, తేఁకువ నన్న మిడువాఁడె దేవుఁడు దేవ
త్వాకాంక్షఁ జేయుతపములు, ప్రాకటముగ నన్నదానఫలమున కెనయే. 302

చ. అలసి శ్రమంబుతో నతిథి యాత్మగృహంబున కేఁగుదెంచినన్
గలిగినమాత్ర మన్న ముదకంబు నొసంగక సేద దీర్ప కా
యిలు సొరనీక యేమిటికి నీడకు వచ్చితి వంచుఁ గ్రూరుఁడై
చలమున బల్కు దుష్టగృహి చచ్చిన నేమగు నున్న నేమగున్. 303

చ. వలసినయన్న మర్థుల కవారణఁ బెట్టెడిపాటిసంపదల్
గలిగియుఁ బెట్టవైతి వటుగావున నార్తి వహించె దీక్షుధన్
నిలువక యేఁగి మున్ను ధరణీస్థలి వీడినమేనిమాంస మాఁ
కలి సెడ మెక్కి తత్సరసిఁ గల్గినతోయము ద్రావి రమ్మికన్. 304

చ. దినమును మాంస మీవు దిని తృప్తివహించెదు మాంసనష్టి న
త్తనువు నశింప కెప్పటివిధంబునఁ బూర్ణతఁ జెందుఁ బెక్కుహా
యనములు పోవఁ గుంభజమహాముని రాఁగలఁ డాడ కమ్మునిన్
గనుఁగొని మాటలాడిననుఁ గష్టశవామిషభుక్తి దీఱెడిన్. 305

ఉ. తానొనరించినంతయును దా ననుభూతి వహింపకుండినన్
బోనె తపింప నేమిటికిఁ బొమ్మని బ్రహ్మ వచింప నిగ్గతిన్
బీనుఁగుమాంసమున్ దినుచుఁ బెక్కుదినంబులనుండి పూనెదన్
హీనత నా తెఱం గిది మునీశ్వర యెవ్వరు మీరు దెల్పరే. 306

చ. కమలజుఁ డానతిచ్చినయగస్త్యులె కావలెఁ గాక యున్న నీ
సమధికచిత్తశుద్ధియును శాంతియు దాంతియు భూమి నన్యసం
యములకుఁ గల్గ నేర్చునె కృతార్థతఁ జెందితి మిమ్ముఁ జూచి యో
విమలతపఃప్రభావనిధి విన్నప మొక్కటి యాలకింపవే. 307

ఉ. పాత్రులకున్ జలాన్నములు భక్తి నొసంగమిఁ జేసి కాదె మ
ద్గాత్రము కోసి కోసి తినఁగా వలసెన్ ననుఁ బ్రోవుఁ డీమణీ
చిత్రవిభూషణం బయినఁ జేకొని యంచు నొసంగునంతలోఁ
జిత్రముగా నగోచరతఁ జెందె శవం బతఁ డుత్సహింపఁగన్. 308

శా. శ్వేతుం డంతట నచ్చరల్ గొలువఁగా శీఘ్రంబునన్ వచ్చి సం
ప్రీతిన్ నాకు నమస్కరించి కరుణాబ్ధీ మీకటాక్షంబునన్

ఖ్యాతిఁ జెందితి దుర్దశల్ గడచితిన్ గైకొంటి సౌఖ్యంబు శం
కాతంకంబులు దీఱె నం చరిగె నే నంపన్ రఘుగ్రామణీ. 309

ఉ. ఈతపనీయభూప ధరణీశ్వర మీరు ధరించినందునన్
శ్వేతుఁ డుదారసౌఖ్యములఁ జేకొని శాశ్వతదాతృలోకసం
స్థాతృతఁ జెందు నంచుఁ గలశప్రభువుం డెఱిఁగింప జానకీ
నేత మహాద్భుతాంబుధి మునింగి యగస్త్యునిఁ జూచి క్రమ్మఱన్. 310

ఉ. ఓమునిసార్వభౌమ శతయోజనవిస్తృతి గన్నయీవనం
బేమికతంబునన్ ఖగమృగేతర మర్త్య జనుల్ చరింపఁగా
నేమని యోర్వలేక శపియించె వచింపుఁ డటన్న నమ్ముని
గ్రామణి వల్కెఁ దామరసగర్భవధూపదనూపురార్భటిన్. 311

అగస్త్యుఁడు రామునకు దండకారణ్యవృత్తాంతముఁ జెప్పుట

క. మనువంశరాజశేఖర, మను వసుధార తొల్లి గగనమణికులమణి యై
మను నతనికి నిక్ష్వాకుఁడు, మనుజస్తుతుఁ డుద్భవించె మహనీయరుచిన్. 312

శా. ఆయిక్ష్వాకుఁడు శైశవంబున సమస్తామ్నాయశాస్త్రార్థధా
రేయుండై శ్రుతులన్నియుం గని ధనుర్విద్యాదిమాద్యత్కళా
వైయాత్యంబును బూని శౌర్యమహిమన్ వర్ధిల్ల సామ్రాజ్య ర
క్షాయత్తాత్మునిఁ జేసి తండ్రి మిగులన్ హర్షంబుతో నిట్లనున్. 313

చ. చదివితి వెల్లవేదములు శాస్త్రములున్ స్మృతు లభ్యసించి త
భ్యుదయకరంబులై జగతి నొప్పినయాగమముల్ పఠించితే
కద తొలి ధర్మ ముత్తమముగాఁ గను మర్థముమధ్యమంబుగా
మదిని దలంపు కామ మధమంబుగఁ జూడుము పుత్ర యెప్పుడున్. 314

క. అది యేమి యంటి వేనియు, మొదటను ధర్మంబు లేక మొనయదు ద్రవ్యం
బది లేక కాదు తలఁచిన, యది యది గావునను ధర్మ మధికం బంటిన్. 315

ఉ. ధర్మమునన్ బ్రజాహితము దార్కొను వేల్పులు మెత్తు రార్యులున్
గూర్మి వహింతు రర్థమును గూర్పక యే యభివృద్ధిఁ బొందు దు
ష్కర్ములు భీతిఁ జెందుదురు శత్రు లడంగుదు రిష్టసిద్ధి యౌ
నిర్మలకీర్తియున్ ధరణి నిల్చు దివంబును గల్గుఁ బుత్రకా. 316

చ. పరహిత మాచరించుటయె భవ్యతపం బని రాదిసంయముల్
పరులకుఁ గీడు సేయు టొకపాప మటంచు వచింప నేల యి
ప్పరమహితోక్తిఁ బట్టి పరబాధ గదా యని మాన రాదు భూ
వరులకుఁ బాపకర్మ లగువారల దండన సేయఁగాఁ దగున్. 317

క. దండింప దగని సుజనుల, దండించిన దండమునకుఁ దగుదుర్జనులన్
దండింప కున్న ధరణీ, మండలపతి నరకకూపమగ్నుఁడు గాఁడే. 318

చ. ఎడపక దండసేతి వహింయించియె కీర్తియు స్వర్గముర్ నృపుల్
వడయుదు రాదిరాజనయపద్ధతు లట్టివిగావె యగ్రతిర్
నడవుము సౌఖ్య మొందెదవు నందన యంచు ననేకనీతు ల
క్కొడుకున కానతిచ్చి నయకోవిదుఁ డాయన యేఁగెఁ గానకున్. 319

చ. మనుసుతుఁడుం దదుక్త మనుమార్గమునం బ్రజనెల్లఁ బ్రోచుచుర్
దనమతి పుత్రకాంక్షులకుఁ దావల మాటయు దానధర్మముల్
మునుకొని యాచరించి మఖముల్ సతతంబును సంఘటించి యం
దునఁ గనియెర్ గుమారకుల నూర్జర బాంధవు లుత్సహింపఁగన్. 320

తే. వారికెల్లను గడగొట్టువాఁడు దండుఁ, డనెడు దుర్మార్గుఁ డన్నలయటులుగాక
శ్రుతులుసదువక సాధుసంగతులమనక, హితులమాటలువినక యథేచ్ఛమెలఁగు. 322

వ. మఱియును.

సీ. వీథిలోఁ బోడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై పలుమాఱు వెక్కిరించు
నాడఁబోయినచోటఁ దోడిబాలురఁబట్టి మూర్ఖుడై యంగముల్మఱియఁగొట్టుఁ
జదువరా యేల దౌర్జన్య మూనెద వన్న కన్నతల్లిని బిట్టు కడఁగి తిట్టు
నూరివారిండ్లలో నున్నవస్తువులెత్తి బలియుఁడై యెందైన బాఱవైచు

తే. నార్యులు పురోహితులు నన్న లరుగుదేర
నూరకయె బిట్టుబిగుసుక కూరుచుండు
సహజధార్త్యముఁ బూని శైశవమునందె
తండ్రి వెతఁ జెంద దండుఁ డుద్దండుఁ డగుచు. 323

ఉ. బాలకుఁ డెంత లే దనుచుఁ బక్షముతో నొకకొన్నినాళ్లు భూ
పాలకుఁ డోర్చి వానియెలప్రాయమునందలిచిన్నెలుర్ బర
స్త్రీలకుఁ గా మెలంగుటలు శిష్టుల నెంచక నింద సేయుదు
శ్శీలములుర్ గనుంగొని యిసీ యని రోసె మనంబులోపలన్. 324

ఉ. రోసి ప్రధానులుర్ బుధవరుల్ దనధర్మమనీష మెచ్చఁగా
నాసుతు నీసుతో నినకులాధిపుఁ డాతఁడు వచ్చి వింధ్యసం
వాసము నీకు మే లచట వర్తిలు పొమ్మని దూర దేశగుర్
జేసెఁ గుమారుఁ డంచు నృపశేఖరు లోర్వరు మేరమీఱినన్. 325

మ. మధుమత్తుం డగుదండుఁ డిట్లు గురుఁ డంపర్ వింధ్యశైలంబునర్
మధుమంతం బనుపట్టణం బొకటి నిర్మాణంబు గావించి యం
దధికైశ్వర్యసమేధమానుఁ డయి శుక్రాచార్యు లాచార్యవృ
త్తి ధరింపర్ ధర యేలె వర్షశతముల్ దేవాహితుల్ దోడుగన్. 326

చ. అతఁ డొకచైత్రమాసమున హర్షముతోఁ జని భార్గవాశ్రమ
క్షితి నొకచోఁ గనుంగొనియెఁ జిత్తజనూతనరాజ్యలక్ష్మితోఁ

బ్రతి యగుదాని లేఁగొమరుప్రాయమునం జెలువొందుదాని నే
కతమున నున్నదాని నొకకామిని మత్తమరాళగామినిన్. 327

చ. కనుఁగొని మావిలేఁజిగురుఁగ్రైదువుజోము పద్దైదుమాలు లే
సిన నునువాఁడితూపు లెదఁ జిక్కిన స్రుక్కి యతండు సేరి యో
వనితరొ యొంటి నేటి కిటు వచ్చితి వెవ్వరిదాన వేమి నీ
యనుపమనామ మేను శరణాగతుఁడన్ వినిపింపవే యనన్. 328

చ. కరము భయంబుఁ బొంది యలకన్నియ యిట్లను నోయిరాజ నీ
గురుఁ డన మించు శుక్రుతొలికూఁతుర నయ్యనఘుండు కూర్మి న
న్నరజ యటంచుఁ బిల్చు నతఁ డంపఁగఁ దాపసనిష్ఠ నివ్వనాం
తరమున నున్నదానఁ దగుధర్మము దప్పఁ దలంప నేటికిన్. 329

చ. అన విని దండుఁ డిట్లనియె నంగన భార్గవి యైన నేమి నీ
ఘనకటిసీమ నీయసదుకౌను నీబిగిచన్నుదోయి నీ
కనుఁగవబెళ్కులున్ గనినఁ గాముఁడు తాళఁగనీఁడు కౌఁగి లి
మ్మనుచుఁ బయింటఁ బట్టిన భయంపడి యమ్మదిరాక్షి గ్రమ్మఱన్. 330

ఉ. అక్కట ధర్మమే గురునియాత్మజఁ బట్టి రమింప నెంచ నీ
కెక్కడఁ బుట్టె నీమమత యిప్పని శుక్రుఁడు విన్న సైచునే
నిక్కము మోహ మున్న నతనిన్ గని వేఁడి పరిగ్రహింపు మీ
కక్కసవృందనంబు కొఱగా దని సారెకు బుద్ధి సెప్పినన్. 331

చ. వినక యతండు గిన్క నిఁక వెన్క భృగూద్వహుఁ డేమి పల్కినన్
విని యెదఁ గాక యిప్పు డలివేణిరొ మాఱునిబారి కోర్వరా
దనుచు బలాత్కృతిన్ గదిసి యగ్గురుపుత్త్రినిఁ బట్టి కూడు నే
మని వినుపించువాఁడ మదనార్తులు మీఱదటిపాని యెంతురే. 332

క. ఆక్రోశింపఁగ నిటువలె, శుక్రాత్మజ బలిమిఁ బట్టి సురతవిలాసో
పక్రమముఁ జూపి యాపాపక్రీడాపరుఁడు సనియెఁ బట్టణమునకున్. 333

చ. అరజయు నానతాస్య యయి యశ్రుజలావృతనేత్ర యై కుచో
పరిపరిషిక్తఘర్మ యయి పాణినిరుద్ధకపోల యై నఖాం
కురమృదితాంగి యై నిటలకుంచితకుంతల యై మనోవ్యథన్
గరము దలంచుచున్న యెడఁ గావ్యుఁడు వచ్చి సవిస్మయాత్ముఁ డై. 334

ఉ. కూఁతుర యేల యింత వెతఁ గుందెద వెవ్వరు నిన్నుఁ దిట్టి రీ
లేఁతశరీర మిట్లు బడలింపుదురే యనఁ దండ్రిపాదముల్
నాతి నిజాశ్రులన్ గడిగి నాయభిమానము వీటిఁబుచ్చి యీ
రోఁతలు సేసె దండుఁ డని రోదన మాతుర యై యొనర్పఁగన్. 335

ఉ. ఉడుగక యెల్లలోకములు నొక్కట మ్రింగెడురుద్రుపోలికన్
బడిబడిఁ గోప ముప్పతిలఁ బండులు దీటుచు శుక్రుఁ డుగ్రుఁ డై

చిడిముడిపాటుతోఁ బెదుటిశిష్యులఁ గన్గొని వింటిరే భయం
పడక మదీయపుత్త్రిఁ గని బల్మి రమించినక్రించుచెయ్దముల్. 336

ఉ. మంటకుఁ జేరికొమ్మిసుతమాడ్కి నశింపక మత్కుమారి మే
నంటియు నింటి కేఁగి చద లంటినదుర్గతి సేనతోడఁ గ్రిం
దంటఁగ మంటిపాన గుఱియుఁ గల దేడుదినంబు లింక నే
మంటిరొ యంచు నెంచ వల దప్పుడె యప్పురి నేలపాలుగన్. 337

ఉ. మామకశాపయుక్తి మధుమంతము నాలుగు దిక్కులందు నూ
ఱామడదాఁక నున్నవన మంతయు నిర్జన మౌ నటంచు న
య్యామివరుండు వల్క నది యాదిగ నేడుదినంబు లింద్రుఁ డా
సీమను మంటిపాన గురిసెన్ నశియించెను దండుఁ డంతటన్. 338

అగస్త్యుఁడు రామునకు జనస్థానవృత్తాంతము సెప్పుట

తే. అప్పురంబు రజోవృష్టి నడఁగి యడవి
యగుట నది దండకారణ్య మనఁగఁ బరఁగెఁ
గావ్యునిమహోగ్రశాపంబుకతన నాఁట
నుండియును బ్రాణిశూన్య మై యుండు నధిప. 339

ఉ. తాను గురూక్తి నయ్యరజ దారుణ మైనతపం బొనర్చె న
క్కాననమధ్యసీమ మును గల్గ రజోమయదృష్టి కోర్వక
మ్మానినిఁ జేరి రల్ల మధుమంతముపౌరులు దానిచే జన
స్థాన మనంగ నన్నెలవు ధాత్రి బ్రసిద్ధి వహించె రాఘవా. 340

మ. అరజాసంగతయోజనాయతసరస్ప్రాంతంబుఁ బ్రాపించువా
రు రజోవృష్టికిఁ దప్పిపోదు రనె శుక్రుం డాదటన్ గొంద ఱా
సరసీతీరముకానలన్ బ్రతికి స్వేచ్ఛన్ బోయి రంచున్ ఖరా
సురవిధ్వంసి కగస్త్యమౌని దెలిపెన్ శ్రోత్రంబు లింపొందఁగన్. 341

క. తెలిపినకథ విని రఘుపతి, కలశజునిన్ బెక్కుగతుల గణియించుచు సొం
పలరఁ దథావిధభాషణ,ముల నానిసి గడపె నంతఁ బ్రొద్దుదయించెన్. 342

ఆ. ప్రొద్దు పుట్టినపుడె పుడమితేఁ డతిభక్తి, నప్పు డాచరింప నర్హ మైన
కృత్యమెల్లఁ దీర్చి యేతెంచి యమ్మహా,ఋషికి నతి యొనర్చి యిట్టు లనియె.

చ. ధరఁ గలతీర్థకోటులకుఁ దానక మై విలసిల్లు మీపదాం
బురుహము లాశ్రయించితి మిముఁ గని కొల్చితి మాటలాడితిన్
బొరసితి మీయనుగ్రహము పుణ్యుఁడ నైతి ననుజ్ఞ యిచ్చినన్
బురి కిఁకఁ బోయి వచ్చెదఁ దపోధనశేఖర యంచుఁ బల్కినన్. 344

మ. పరితోషించి యగస్త్యుఁ డి ట్లనియె నోభక్తాననాంభోజభా
స్కర సాధారణధారుణీంద్రువలె నజ్ఞత్వంబు పైఁ బూని యి

క్కరణిన్ నన్ను నుతింప నేమిటికి సాక్షాత్తారకం బైన య
క్షరతత్త్వంబవు నీవు నిన్నుఁ దెలియంగా శక్తులే మాదృశుల్. 345

సీ. మొదట నెవ్వనిపాదమునఁ బుట్టి నదులలో ఘనకీర్తి గాంచె గంగాస్రవంతి
మునిముఖ్యు లెవ్వానిమూర్తిఁ గానఁగలేక తపియింపుదురు మహాతపముఁ బూని
యెవ్వానివాక్యంబు లీయేడుజగముల శిక్షించు గౌరవశ్రీ వహించి
మహిమ నెవ్వనియనుగ్రహము కించిదజ్ఞుల సర్వజ్ఞులుగఁ జేసి నవదరించు

తే. నట్టిహరి వైననీకు నర్ఘ్యం బొసంగి
కన్ను లలరంగఁ జూచితిఁ గాంక్షదీఱఁ
బలుకులును వింటి నీకృపఁ బడయఁ గంటి
'నద్య ధన్యోఽస్మి' యనుకొంటి నాత్మయందు. 346

సీ. నియతి రామా యంచు నీనామము జపించుభాగ్యశాలికి వేదపాఠ మేల
నిను నొక్కపరి యైన గనుఁగొన్నసుజ్ఞాననిధికి బ్రహ్మజ్ఞాననిష్ఠ లేల
నీభక్తి యొనరించునిపుణుఁ జేరి భజించు స్థిరబుద్ధికిఁ దపంబు సేయ నేల
నీకటాక్షముదారి నిమిషమాత్రము చేరి చెలఁగుమేటికిఁ దీర్ఘసేవ యేల

తే. నీవినుతి సేయువానికి నిక్కవముగఁ, జింత సేయంగ నణిమాదిసిద్ధు లేల
జానకీనాథ మీపాదజలము గ్రోలు, ఘనగుణాబ్ధికి దేవత్వకాంక్ష యేల. 347

శ్రీరాముఁ డగస్త్యుని వీడ్కొని యయోధ్యకు వచ్చుట

ఉ. దృష్టిపథంబునన్ బడిన దేవవిరోధుల నైనఁ బిమ్మటన్
శిష్టులు చేయుతావునకుఁ జేర్చుదయాబ్ధివి గాన నీవు నా
యిష్టికి వచ్చి నేను ఘటియించుసపర్యలు మెచ్చినావు నీ
తుష్టియ సర్వలోకములతుష్టి రఘూద్వహ పోయి రమ్మికన్. 348

మ. అని గంభీరవచోనిగుంభనల వింధ్యారాతి కీర్తించి పం
చిన నచ్చోటితపస్విచంద్రులశుభాశీర్వాదముల్ గాంచి వీ
డ్కొని కౌబేరవిమాన మెక్కి సచివుల్ గొల్వంగ మధ్యందినం
బునకున్ రాముఁ డయోధ్యఁ జేరఁ జనియెన్ బూర్ణానురాగంబునన్. 349

తే. చేరఁ జని డిండిమధ్వనుల్ చెలఁగఁ బెద్ద, నగరిమొగసాలకడ విమానంబు డిగ్గి
దాని వీడ్కొనునంతలోఁ దమ్ము లెఱిఁగి, యేఁగుదెంచిపదంబులకెఱఁగుటయును.

చ. ఇరువుర లేవ నెత్తి ప్రియ మేర్పడఁ గౌఁగిటఁ జేర్చి రాఘవే
శ్వరుఁ డనుజన్ములార మిమువంటిగుణాఢ్యులు గల్గఁగాఁ జుమీ
మఱణము మాని బ్రాహ్మణకుమారుఁడు ప్రాణము లొందె నావెతల్
దొరఁగె నటంచు వారలను దోకొని లోపలి కేఁగి యచ్చటన్. 351

చ. జననులఁ గాంచి మ్రొక్కి యురుసంబున వార లొసంగుదీవనల్
గొని సమయోచితం బగుటఁ గోరిక మీఱఁగ మజ్జనంబు భో

జనము నొనర్చి యొక్కమణిసౌధతలంబున విశ్రమించి య
జ్జనపతి చెంత నున్న యనుజన్ముల నిర్వురఁ జూచి యిట్లనున్. 352

చ. వదలక మీసహాయతఁ బ్రవర్తిలి బల్మి వహించి యజ్వన
య్యెద ననువాంఛ పుట్టె నమరేంద్రుఁడు చంద్రుఁడు మున్ను కామిత
ప్రద మని రాజసూయమఖరాజ మొనర్చిరి తన్మఖంబు సే
యుదునొ తదన్యమైన మఖ మొక్కటి సేయుదునో గణింపుఁడా. 353

క. మీ రెయ్యది దెలిపిన నది, గౌరవమున నాచరింపఁ గలవాఁడ హిత
ప్రారంభులార యను రఘు,వీరునకున్ భరతుఁ డనియె వినయం బెనయన్.

మ. ధర యాధారము సర్వభూతములకున్ ధాత్రీశ యీభూమి కా
దరువై యుండెడివారె మీరు సురసంతానంబు వాణీమనో
హరుచే రక్షిత సాగరిణ జనసమూహంబెల్ల యుష్మత్కృపా
స్ఫురణన్ వర్ధిలు నట్టిప్రాణులు శుభంబుల్ పాయరే యందునన్. 355

సీ. అమరనాథుఁడు తొల్లి యాయాగ మొనరింప నుగ్రదేవాసురయుద్ధ మయ్యె
మనహరిశ్చంద్రుఁ డామఖము మున్ను ఘటింప రణములోఁ బొలిసిరి రాజులెల్లఁ
గలువలరాయఁ డాక్రతువు పూర్వమునందు సవరింప నక్షత్రసమర మొదవె
నబ్ధీంద్రుఁ డాది నయ్యజ్ఞంబు గావింప భూరియాదగపాళి పోరి మడిసె

తే. నాహవకరంబు గావున నాహవంబు, తఱచుగాఁ జేయ రెవ్వరు ధరణినాథ
యింతయును మీ రెఱుంగరే యిష్టగోష్ఠి, కిపుడు మముఁ జూచి యడిగితి రింతె కాక.

ఉ. అంచితధర్మసత్త్వముల కాస్పద మై చెలువొందు మిమ్ము బో
ధించఁగ నేర్తురే యొరులు దేవర యానతి యిచ్చినట్లు గా
వించ నొకింత నేర్తు మనువిన్నపమున్ విని రాజసూయ మీ
వెంచినయట్టిదా నని మహీపతి తమ్ముని మెచ్చె నెమ్మదిన్. 357

ఇంద్రుఁడు వృత్రవధవలనఁ గలిగిన బ్రహ్మహత్య నశ్వమేధముచేఁ బాపికొన్నకథ

క. సౌమిత్రి యపుడు రామ,స్వామికి హస్తములు మొగిచి జనవర సవన
ప్రేమము జనించెనేనియు, మీమది నిడరాదె యశ్వమేధ మొనర్పన్. 858

మ. సకలాభీష్టఫలైకసాధనము దుష్టబ్రహ్మహత్యాదిపా
తకవిధ్వంసనకారణంబు హయమేధం బమ్మఖం బాచరిం
చి కదా యింద్రుఁడు బ్రహ్మహత్య యెడఁబాసెన్ దొల్లి తత్పూర్వపు
ణ్యకథాసంశ్రవణంబు సేయఁ దగు నం చాలక్ష్మణుం డిట్లనున్. 359

ఉ. వృత్రుఁడు భాస్కరోపమసమిద్ధమహోద్ధతవిద్విషన్మహా
వృత్రుఁడు బ్రహ్మవర్చసపవిత్రుఁడు నాఁ దగునొక్క దేవతా
పుత్రుఁడు యోజనాయతసముద్ధతగాత్రుఁ డతండు మున్ బహి
శ్శత్రులతోడ నాత్మగతశత్రుల గెల్చి జగంబు లేలఁగన్. 360

చ. పలుమఱు భూమిదున్నకయె పండు నభస్థలి భూజనావళిన్
వలసినవస్తువుల్ గురియు వారిధి యూర్ములు రత్నమాలికా
వళిఁ గొని చైటనైచు నవవర్షములున్ నెల మూఁడు వానలున్
వెలయఁగ నెల్లచోఁ దనదు వృత్రునిధర్మము లెంచ శక్యమే. 361

ఉ. లోకములెల్ల గెల్చి యతిలోకుఁ డనంగ నతండు మించియున్
శాకవిరోధికిన్ భయము వాటిల శంబరు డన్యమాదనిన్
స్వీకృతరాజ్యలక్ష్మి కభిషిక్తునిఁ జేసి తపం బొనర్చె ర
త్నాకరతీరధారుణి నుదంచితవైష్ణవభక్తి మీఱఁగన్. 362

ఉ. వానితపోవిజృంభణము వాసవముఖ్యులు సూచి భీతులై
దానవవైరిఁ జేరఁ జని తత్పదకంజము లాత్మఫాలిసం
దానితరత్నదీధితులు దార్కొన వందనముల్ ఘటించి యో
దీనశరణ్య వృత్రు వగఁ దీర్చి జగంబులవంత మాన్పవే. 363

చ. తపమున ముజ్జగంబులకుఁ దానె యధీశుఁడ నై సుధాంధులన్
గృపణులఁ జేసి దాసులుగ నేలెద నంచుఁ దలంచినాఁడు త
త్తపము ఫలించెనేని నడదా యది యట్టులు గాక ముందరన్
దపము భవన్మహాతపమునన్ హరియించి విరోధిఁ ద్రుంపవే. 364

ఉ. నావిని పద్మనాభుఁ డెలనవ్వుల వేల్పులఁ జూచి పల్కె నో
దేవతలార వృత్రుని వధింపఁగ నాకుచితంబు గాదు నే
నే వరమిచ్చితిన్ దొలుత నింద్రశతారధరిత్రులందు మ
త్పావనతేజ ముంచెద విపక్షునిపై జనుఁ డంచుఁ బంచినన్. 365

మ. అమరుల్ జిష్ణునిఁ గూడి శాత్రవుని డాయన్ బోవఁగా నంతలోఁ
గమలానాథుని తేజమున్ గనెఁ ద్రిభాగస్ఫూర్తినం దాద్యభా
గము శక్రున్ నడిపాల్ పవిన్ గొదువభాగం బుర్విఁ బ్రాపించినన్
నముచిధ్వంసి వధించె ధైర్యవిహతాంతశ్శత్రునిన్ వృత్రునిన్. 366

ఉ. వృత్రునిఁ జంపినప్పుడె సురేంద్రుని మేకొని బ్రహ్మహత్య త
ద్గాత్రము కంప మొందె మది గాడ్పడియెన్ సుర లార్తిచే బహి
శ్చిత్రము లట్టులైరి వెతఁ జెందిరి విప్రులు వర్ణహీనతన్
ధాత్రి ప్రశస్యసస్యఫలధాత్రి యనం దగ దయ్యె నయ్యెడన్. 367

క. ఆహత్యవలన గలఁగి సు,ధాహారస్వామి విగతయశుఁ డై తొలఁగన్
స్వాహాధిపముఖదివిజులు, హాహాకారములతోడ హరిఁ జేరి వెసన్. 368

ఉ. ఓహరి యోకృపాజలధి యోపరమేశ్వర మీరె పంపఁగా
నాహరి వృత్రుఁ జంపఁగనె హత్య ఘటిల్లెఁ దొలంగె నాతఁడున్
గేహముఁ బాసి లోకములు కిల్బిషవృత్తిఁ గలంగె నింక మా
కేహిత మానతిచ్చెదో కదే యన నాయన పల్కె వారికిన్. 369

మ. హయమేధంబు మదర్పణంబుగ సురాధ్యక్షుండు గావించె నే
నియు నాశం బగు బ్రహ్మహత్య యనినన్ నిగ్రహేదులై వేల్పు లా
క్రియ దేవేంద్రునిఁ గానఁబోయి మధువైరివ్యాహృతుల్ దెల్ప ని
శ్చయబుద్ధిన్ మునికోటిఁ గూడి యత డాజన్మం బొనర్చెన్ రహిన్. 370

క. సవనంబు సేసి వాసవుఁ, డవభృథ మొనరించునంత నలహత్యయు ఘో
రవికారాకారముతో, దివిజేంద్రునితనువు దొరఁగి దివిజుల కనియెన్. 371

తే. ఈబిడౌజునితనువున నెప్పటివలె, విశ్రమింపఁగ గూడదు వేల్పులార
యొందువసియింతు నింక నాకిరవుఁజూపుఁ, డనిననాదిత్యులా బ్రహ్మహత్యఁజూచి.

క. పాపముల కెల్ల బలువగు, పాపంబసు సీక్ర సిస్సు భరియింప నోకం
బోవున నాలుగుచోటులఁ. [illegible] మటంచు వారు వనిచిరి దానిన్. 373

చ. జలముల ఫేనరూపమున నాలనులన్ బలుబంకచంద మై
చెలులయెడన్ రజోమహిమఁ జేకొని వర్తిలె హత్య యారజ
స్వలల రమించు దుష్టజనసంతతిఁ జెందుట కుర్వి నొక్కపాల్
నెలకొనియెన్ సురేంద్రుఁడును నెమ్మి దివంబున కేఁగి రంజిలెన్. 374

ఉ. కావున నశ్వమేధ మధికంబ మఖంబులలో నవశ్యమున్
దేవర యాచరింపుఁ డది దేవహితం బని లక్ష్మణుం డనన్
భూవరుఁ డుత్సహించి గుణభూషణ యీయితిహాస మింపుగా
నీవలనన్ వినన్ గలిగె నేఁ డని ప్రస్తుతి సేసి నెండియున్. 375

శ్రీరాముఁడు తమ్ముల కిలోపాఖ్యానముఁ జెప్పుట

చ. అనఘ తురంగమేధ మఖిలాఘవినాశద మిష్టసౌఖ్యదం
బని యిపు డీవు దెల్పితి యథార్థమ తొల్లి యిలాభిధానుఁ డో
జనవరుఁ డమ్మఖంబు పురుషత్వముఁ గ్రమ్మఱఁ జెందు కాంక్ష మై
నొనరిచి కామినీత్వ మఱి యుర్వర యేలె నటంచు బల్కినన్. 376

క. ఆమాటకు వెఱఁ గందుచు, రాముని గని తమ్ము లనిరి రాజేంద్ర యిలుం
డేమిటికి మగతనము చెడి, భామిని యై యుండె దెలియబల్కుఁ డటన్నన్.

క. అంభోజబంధుకులకల, శాంభోనిధిచంద్రుఁ డాదయాంబుధి వలికెన్
శంభుజటోజ్జ్వలభిసరి,త్సంభృతగంభీరఘోషసంగతఫణితిన్. 378

క. అనుజన్ములార యిలుఁ డను, జననాథునికథ పురాణసంహితలందున్
వినఁబడు నత్తెఱఁ గంతయు, వినుపించెద వినుఁడు చెవులు వేడుకఁ బొరయన్.

తే. కర్దముఁడు దివ్యతేజఃప్రఘటితాఘు, కర్దముఁడు నాఁగ మున్నొకఘనతపస్వి
వెలయు నతనికి బలజితానిలుఁడు వితర, ణైలబిలుఁడొప్పనిలుఁడను నాత్మజుండు.

క. ఆయిలుఁ డఖిలకళాఢ్యా, కేయుండై చారురూపరేఖాజితరా
జేయుండై శత్రుజనా, జేయుండై భూమిలోఁ బ్రసిద్ధి వహించెన్. 381

382
వ. మఱియును,

సీ. పరమధర్మాసక్తిఁ బాటించుఁ గావున సకలమార్గణకోటి సంచరించి
సార్వభౌమస్ఫూర్తి నుర్వీభరముఁ బూనెఁ గావున ఘనదానకలన మించి
యంచితానంతవిద్యాశాలి గావున నాభోగభోగాప్తి నతిశయించి
జిష్ణువైభవలీలఁ జెలువొందుఁ గావునఁ బరగోత్రసంపదల్ పరిహరించి

తే. గరుడగంధర్వయక్షరాక్షసనరాధి
పతులు తనవిక్రమమునకు భయము నొంది
యగతికుల మంచు నశ్రాంత మాశ్రయింపఁ
బ్రాజ్యసామ్రాజ్య మేలె నప్పార్థివుండు, 383

క. ఈలీల రాజ్యపాలన, లోలుండై వెలసి యయ్యిలుం డొకప్రాతగ
కాలముఁ నిత్యవిధులను, శీలంబునఁ దీర్చి గొల్వుసింగారం బై. 384

సీ. అరినేత్రదరచిత్రకరవేత్రకరకోటి బలసి ముందర బరాబరు లొనర్ప
శరదంబుధరకంబుశరభంబుల హసించు జిగిమించుచామరల్ చెలులు వీవఁ
గరలోల నరపాలవరఫాలములఁ గప్పురములీలఁ బదనఖప్రభలు నిగుడ
స్థిరగాంగఝరరంగదురుభంగరవభంగి వెలయ మాగధపాళి వినుతి సేయ

తే. నచ్చరలచెల్వు మెచ్చనిమచ్చెకంటు
లచ్చెరువు హెచ్చ దండలాస్యములు సలుప
నన్యగంధర్వయువతిగానములు వినుచు
నిండు కొలువుండె నిల ధరాఖండలుండు. 385

386
వ. అప్పుడు.

మ. తడవిండ్లున్ గఱిమేనులున్ బికిలిపూదండల్ మిటారించు పెక్
విడెముల్ జేగుఱునామముల్ బదనికల్ పెంపొందు లేఁదీఁగలున్
గడియంబుల్ పులితోలుచల్లడములున్ గాసెల్ పిసాళింపఁగా
దుడుముల్ గూడుక వచ్చి చెంచులు నరేంద్రున్ గాంచి హర్షంబునన్. 387

చ. వెదురులము త్తెముల్ సెలలవిండ్లు జవాదిపునుంగుచట్టముల్
పెదపెదదంతముల్ పునుఁగుఁబిల్లులు జల్లులు జుంటితేనియల్
బదనికచాలుఁ గాఱెనుముపాలు ననంటుల నంటుకప్రముల్
మొద లగుకానుకల్ నృపతిముంగట నుంచి జొహా రొనర్చుచున్. 388

తే. పలికి రోనేలమొకిమీాలకొలముసామి
చేతఁ గుత్తుకకలపెద్ద చెంచువాని
యింటిచెంచెత చెలి మించు గుంటికెలని
పొలములోపలఁ జెలఁగు చెంచులము మేము. 389

సీ. తొలుపంది బలుచందములు చెంగుననుధాక బెరయుపందుల లెక్క పెట్టరాదు
కడిఁదిగొరులమూఁక కసిమసంగెడివీఁక నెసఁగుసింగపుజాతి నెంచ రాదు

జంటనల్ హాజ్జలదంటబల్ మెకముల బలఁగంబుమితి యేఱుపఱుప రాదు
పొలములో లేడిదూడల నేడ మననీని పులులసంఖ్య లెఱిఁగి పలుకరాదు
తే. కటికిమేదుల నెలుఁగులఁ గాఱెనుములఁ, గత్తిపేరిమెకంబుల గణనసేయ
రాదు మాయన్న కాన నోరాజులయ్య, సోదె మాసాయ వేఁటాడి సూడరాదె.
తే. వానకందువమలలపై వ్రాలుమొగులు, చాలు సరికట్టఁ జాల్ చెంచుజవ్వనులకు
నిబ్బరపుఁదూపుతడవింటఁ బ్రబ్బఁ జేసి, మబ్బుపైఁ బాఱుమెకముల గెబ్బు లెంత.
సీ. డాసియేనుఁగులతొండముమీఁదనుండి యుయ్యేలలూఁగునీచిన్ని యెఱుకవాఁడు
లేఁదీఁగఁ బులికిఁ గళ్లెము బెట్టి వయ్యాళి దోలుఁ గాఱడవి నీదుండగీఁడు
కరిఁ జంపి పోవుసింగము వెంటఁ జని గోళ్లముత్యముల్ దెచ్చు నీముగుదశిశువు
గండభేరుండంబు రెండుతలల్ రెంపుచేతుల వించు నీచిన్నివాఁడు
తే. వేడుకలఁ జేరి యఱకాల వీడఁ దన్ను, నడవిపందులకోఱలీపడుచువాఁడు
తక్కు నెలుఁగులగిలుగుల లెక్క సేయ, నేఁటి కిఁక నీవె చూచెదు వేఁటలందు.
క. తలఁకక మెలఁగెడిమెకముల, నలుఁగులపాల్ సేసి మృగయు లగునని పొగడన్
బులుఁగులవేఁటలు గని మెప్పులు గులుకఁగ మరలుఁ డనుచు బోయలు దెలుపన్.

ఇలుఁడు సపరివారంబుగా వేఁటకుఁ బోవుట

మ. మృగయాక్రీడనతత్పరత్వమున ధాత్రీనాయకుం డిక్కిరా
తగణంబుల్ బహుమానరీతి ముదమందన్ జేసి యవ్వేఁటమా
ట గరిష్ఠార్భటి రాణులెల్ల వినఁ జాటన్ బంచి చాలించి యో
లగ మభ్యంతర మొంది యర్హవిధు లెల్లన్ దీర్చి శీఘ్రంబునన్. 394
సీ. సగపాలుకపురవాసనలమించుకురంగనాభిఁ దీర్చినగీఱునామ మమర
విరిసరుల్ పైపైని మెఱయఁగట్టినబురుసారుమాల్ చెఱఁగులంసమునఁ బొదలఁ
దావికుంకుమపుగందపుఁబూఁత దగుపేరురంబున రత్నహారములు వెలయ
నునుపాలకాయయొంటులనంటు తెలిచాయ లొలసి చెక్కులను వెన్నెలలుగాయ
తే. జిలుగుచెంగావిదట్టిపైఁ జెక్కికొన్న, వంకి దులకించఁ బసిఁడిదువ్వలువ వల్లె
వాటు నెఱనీటు గులుకఁ బావాలుమెట్టి, రాజదేవేంద్రుఁ డంతగపురంబు వెడలె. 396
వ. అప్పుడు.
సీ. వినుకెంపు నడకింపు నునుకెంపుపల్లంబు దీపించు పచ్చఱాదృష్టిదండ
కళుకునీలంపుసింగంపుఁదలాడంబు దండివైదూర్యంబు నిండువాగె
నిగరంపుఁబగడంపు జిగిదొట్టుమొగముట్టు రంగారుమదిరిణి సింగిణీలు
గోమేధికంబులఁ గొమరొందుకళ్లెంబు వజ్రాలమేలంకవన్నియలును
తే. గ్రొత్తముత్తెంపుఁదెఱల దళ్కొత్తుజాన
ముసుమరకతాళి మెఱుఁగొందుతరకసములుఁ
బసిఁడితఱటును గలిగి సొం పెసకమెసఁగు
నుత్తమాశ్వంబుఁ గొని తెచ్చె నొక్కసాది. 397

క. తెచ్చిన తేజికి వలగొని, వచ్చి తగన్ మ్రొక్కి యెక్కి వాగె గొని యహో
యెచ్చటికి సామి యనురవ, మెచ్చఁగఁ గంచుకులు వెంట నేతేరంగన్. 398

క. జోడనలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱయ రాజు వేడుకతోడన్
గోడా దుమికింపఁగ జత,గూడిరి దొర లెల్ల భటులగుమి వెనుకొనియెన్. 399

ఉ. మట్టికుళాయులున్ బిగువుమాటలుఁ గుంకుమతావిగందపున్
బట్టలుఁ జల్లడంబులును బంగరుకాసెలయోరఁ జెక్కుకో
న్నట్టిబెడంగుచాయపిడియంబులుఁ దళ్కులదుప్పటుల్ దగన్
జుట్టుపురాకుమారకులు సొంపున నేఁగిరి రాజుముందరన్. 400

ఉ. గాటపుబోనులున్ జిగురుఁగండెలు సివ్వఁగిబండ్లు వాగురా
కోటులుఁ జిక్కముల్ దెఱలుఁ గుంతములున్ దడవిండ్లుఁ దూపులన్
మీటగుదీమముల్ మఱలు మేలిమిమూలిక లీఁటె లూని యా
ఖేటకు లానృపాలకుని క్రేవల నేఁగిరి కేవలత్వరన్. 401

తే. కణుజు సాళువమును జలకట్టె లగుడు
జాలిడేగయు మొదలైన మేలిడేగ
తెగలఁ దగ నేర్పరించి యత్తెముల నుంచి
కదలె నృపువెంబడిన యాడిగముల గములు. 402

ఉ. చోరులగుండెలన్ దిగువసుల్ కిటకోటులపాలిమృత్యువుల్
క్రూరమృగోత్తమాంగములఁ గూల్చెడిపెన్పిడుగుల్ గభీరభాం
కారనినాదముల్ ప్రళయకాలసదృఙ్మృగయాప్రధానముల్
భైరవవాహముల్ భటులపజ్జల నేఁగె మరుజ్జవోద్ధతిన్. 403

సీ. ఎదిరించుసింగంబు బెదరించి వడి మించి సటల నుయ్యేలలూఁగుభటుఁడ నేను
గవి నున్నపులిఁ గన్నఁ గద్దించి గొబ్బున నీడిచి తే నోపు ప్రోడ నేను
గరమూఁది పైఁ జివుక్కున నెక్కి కరికుంభ మగలించుపరమసాహసుఁడ నేను
శరభంబుకాళ్లు కొంచకపట్టి నేలతోఁ గొట్టజాలిన మహోగ్రుఁడను నేను

తే. గడిఁదికిటికోటిపాలిటిపిడుగు నేను, సకలమృగముల నడఁచునంతకుఁడ నేను
దేవ యిఁకమమ్ముఁ దెలిసెదవీవ యనుచు, వేఁటకాండ్రాడుమాటలు వేడ్కవినుచు. 405

వ. చనిచని.

మహాస్రగ్ధర.—
కని యెన్ భూపాలలోకాగ్రణి తనయెదురన్ గాఢవల్మీకనిర్భే
దనమాద్యద్భల్లహస్తస్థలగతఫణరత్నస్ఫురత్పన్నగాలో
కనజాతాలాతశంకాకలితగమనభాగ్గంధకుంభిచ్ఛటాధా
వనభీతక్షుద్రనానాధ్వగమృగనినదవ్యాకులం బైన కాననన్. 406

మ. కని యక్కాననదేశమున్ సుభటసంఘాతంబుతోఁ జొచ్చి య
ల్లన నానామృగసంఘముల్ మెలఁగుపట్లం బోగువారించి చు

ట్టును ధానుష్కులుఁ గుంతధారు లగుబంటుల్ సిల్వ నేమించి శం
ఖనినాదంబులు దుందుభిస్వనము ఢక్కానాదముల్ మించఁగన్. 407

తే. కలయఁ జోపులు వెట్టింపఁ గరియుఁ గిరియుఁ
గాసరముఁ గేసరియు దుప్పి కడిఁదియెలుఁగుఁ
బులియు మొదలగుమెకములు గలఁక దోలుకఁ
జెదరి నలుదిక్కులకుఁ బాఱె నదరి బెదరి. 408

వ. మఱియును. 409

సీ. అగ్నియంత్రములు పెల్లాకాశ మవియింప భయమంది నెలవులఁ బాయునవియుఁ
బటహశంఖధ్వనుల్ బ్రహ్మాండ మగలింప నులికి నల్దిక్కుల కుఱుకునవియు
భటులకోలాహలార్భటు లన్నికడ లాన బెదరి జంటలు వాసి చెదరునవియు
ధానుష్కశింజినీధ్వానముల్ చెవిఁ బాఱ నులికిపాటున నిద్ర లుడుగునవియు

తే. నగుచుఁ బఱచుమృగంబుల నాఁగి మూఁగి
యడరి వెన్నాడి మున్నాడి యాక్రమించి
విక్రమించిరి ముంచిరి విశిఖవృష్టి
విభుఁడు గదియింపఁ బెక్కండ్రు వేఁటకాండ్రు. 410

చ. విలయఘనాఘనంబు లటవీస్థలి డిగ్గెనొ యంధకాసురుం
డిల జనియించి క్రమ్మఱ ననేకశరీరము లెత్తెనో విషా
నలము మహేశ్వరుం డుమిసినన్ బలురూపులఁ జెందెనో యనన్
వెలసినసూకరప్రతతి వెల్వడె దిక్కుల నిర్లు నిండఁగన్. 411

ఉ. అప్పుడు చెంచులున్ సుభటు లడ్డమువోయి లకోరికోలలన్
గప్పఁగ నంతకంటె మునుగలఁ బఱిన్ బడె జాగిలంబులున్
జెప్పెడి దేమి కోలములు చేకొని శస్త్రచయంబు లీఁటెలున్
గుప్పలుగాఁ బడన్ విఱుచుఁ గోఱలఁ జిమ్ముచు జాగిలంబులున్. 412

ఉ. సారెకుఁ బాలచేరు బలుజాగిలముల్ గబళించి యీడ్వఁగా
నీరస మొప్పఁ దారసిలి యీఁటెల వీరభటాళి నొంచఁగాఁ
దారక కొప్పరింపుచును దంష్ట్రల నిప్పుక లుప్పతిల్లఁగాఁ
బోరుకడిందిపంది నొకబోయ పిఱెంబునఁ గ్రుమ్మెఁ గూలఁగన్. 413

చ. ఇరవులు వాసి తారసిలు నిన్నిటి కిందఱు మేఁగి యొక్కరొ
క్కర యొకపందిఁ జంపి యిదె కైకొనువారము సామి చూడు హె
చ్చరిక యటంచుఁ బల్కి పఱపధ్వని నొంటరికాండ్ర నేకసూ
కరముల గుప్పగుప్ప మనఁగాఁ బడఁ గ్రుమ్మిరి కుంతపంక్తులన్. 414

చ. తెలివగవెండిగుండ్లవలెఁ దేజము మీఱినభైరవాశ్వపం
క్తులు పదియైదు లొక్క మొగిఁ దూఱినఁ గోఱలఁ జీల్చి వైచుచున్

బెళపెళ బల్లెముల్ విఱిచి భిల్లులు తల్లడ మంద నుద్ధతిన్
వలలను ద్రెంచి తేజిపయి వచ్చుకిరిన్ దొర నొంచెఁ దూపునన్. 415

చ. గిరిగుహనుండి యొక్కహరి క్రేవల రాజహయంబు మించినన్
హరి యనుపేర నేను జెలువందఁగ నీవును బూనినావె నా
స్థిర మగుపేరటన్నపగచేఁ బలెఁ బై కరుదేర భర్తయున్
శర మొకఁ డేయఁ ద్రెళ్లక వెసన్ నిగుడన్ నఱికెన్ గటారునన్. 416

చ. అలయక లేడిదూడఁగమి నాఁగెడు క్రోల్పులులన్ వధించు దం
తుల వెఱపించుసింగములఁ ద్రుంచుఁ దదార్తికరోగ్రశౌర్యముల్
గలశరభాళి నొంచు గమకంబున వానిఁ గలంచు జంట పెం
డలలకడిందిజంతువుల ధర్మరతిం బఱిచించు నొక్కటన్. 417

క. కిరికరిహరశరభాదుల, హరియింపుచు సుభటు లలర నట్టిపనులకున్
బోరలేనిపిఱికియయ్యలు, చరియింతురు శశకములకు జంబుకములకున్. 418

క. ఒకతూపున బలుమెకముల, నొకమెకము ననేకసాయకోత్కరముల నొ
క్కొకచో నడఁచుచు రాజ, న్యకులాగ్రణి యపుడు వేఁటలాడె యథేచ్ఛన్. 419

క. కడువడిఁ బఱచెడు మెకమును, జెడు మెకమున్ బడు మెకంబుఁ జేడ్పడు మెకమున్
బడలుమెక మడలుమెకమును, నెడయుమెకం బయ్యె నటవి నిలునిభటులచేన్.

ఉ. కండలు గుండెలున్ మెదడుఁ గాటవుఁబ్రేవులు నెత్తురేక మై
నిండె నరణ్యమంత మృగనిర్హరణోద్ధతి మాని యుండియున్
వెండియు భూవరుం డనుప వేఁటకు మీటకుడేగ వేఁటయున్
గొండొకసేపు చూచి తగుకోరిక లిచ్చెఁ బులిందకోటికిన్. 421

ఇలుఁడు కైలాసప్రాంతవనంబుఁ జొచ్చి సపరివారుం డై స్త్రీత్వము నొందుట

వ. ఇవ్విధంబున మృగయావినోదంబునన్ దనివిఁ జెంది పంది కుందేలు కదలీమృ
గంబు మొదలగు మెకంబులపలలంబు పంచికొనుటకున్ దమలోఁ దమరు పలు
చందంబులసందడిం బొందుపుళిందబృందంబులన్ దిలకించి కించిద్దరహాసకంద
ళితవదనారవిందుం డై యన్నరేంద్రసంక్రందనుండు కొండొకవిశ్రమించుతలం
పున నపరిమితచమూసమూహసమన్వితంబుగా నక్కాఱడవి గడచి యక్కడకుఁ
జక్కనియుత్తరపుదిక్కునఁ బెక్కునిండుచందురులపండువెన్నెలలొక్కట మెండు
కొన్న చెన్నునఁ గన్నులపండు వై యుండువెండికొండదండకుం బోయి కొం
డలఁ జెందుమన్నీనిచేతిచికిలిఖండాచాయలఁ గ్రేణిసేయుశరవణంబు విలోకించి
త్రిలోకమోహనం బగు నవ్వనంబు దఱియన్ జొచ్చి యచ్చట. 422

సీ. తనకీర్తివిలసనత్వము లేనగవునందుఁ దనచంద్రసౌమ్య మాననమునందుఁ
దనఖడ్గవిభవ మంతయుఁ గీలుజడయందుఁ దనప్రతాపము సుధాధరమునందుఁ

దనకువలయహితత్వము నేత్రములయందుఁ దనగబ్బితన మురస్స్థలమునందుఁ
దనధర్మసురుచిరత్వము కన్నుబొమలందుఁ దనకాంచనసమృద్ధి తనువునందుఁ

తే. దనగభీరత నాభిహ్రదంబునందుఁ
దనమనోవిస్తృతి నితంబతలమునందు
నెలయ నిలుపఁ డంతలోఁ దుంటవిలుతు చెలువ
భంగి దులకించు నొక మోహనాంగి యయ్యె. 423

వ. ఇత్తెఱంగున. 424

ఉ. కోడెమిటారిగబ్బిచనుగుబ్బల నుబ్బెడునిండుప్రాయపుం
జేడియ యై యతం డరుదుఁ జెంది యమాత్యసుహృద్భటాదులం
జూడఁగ నందఱుం దనకు జోడుగఁ గైకొని రాఁడుపోఁడుముల్
గోడిగచంద మొందె నిలఘోటకరత్నముఁ దత్క్షణంబునన్. 425

క. అన్నలినంబు వహించిన, తన్నుం దనవారిఁ జూచి తద్దయు వగతో
నున్నంత నటకుఁ గొందఱు, కన్నియ లేతెంచి కరము కనికర మమరన్. 426

తే. పలికి రోవెఱ్ఱి యిఁక నేల పరితపింప, గిరిజతోఁ గూడి శివుఁ డీడఁ గ్రీడ సేయ
వచ్చినాఁ డింతలో నిందుఁ జొచ్చు పురుషుఁ, డింతియౌఁ గాక యని శాపమిచ్చినాఁడు.

చ. నగజకుఁ బ్రీతిగా నిజగణంబులతోఁ దరుణేందుమౌళియుం
మగువతనంబుఁ బూనికొనినాఁ డటుగావునఁ జూడు మివ్వనిం
ఖరమృగపన్నగంబులు నగంబులు మున్నుగ స్త్రీలవైఖరిం
దగినవి యీశ్వరాజ్ఞ జవ దాఁటఁగ నెవ్వరికైన శక్యమే. 428

శా. ఏసర్వేశ్వరునాజ్ఞ యాడలల బ్రహ్మేంద్రాదికుల్ పూనికొం
డ్రాసర్వేశ్వరుఁ డాకుమారగురుఁ డాయర్ధేందుకోటీరుఁ డు
ల్లాసం బొప్ప వసించినాఁ డదిగో బాలాపాణిభృచ్చామర
వ్యాసంగానిలలోలకుంతలచయుం డై పొమ్ము ప్రార్థింపఁగన్. 429

క. అని రుద్రకన్య లెఱిఁగించిన పడఁతుక యైనరాజశేఖరుఁ డెలమిం
దనవారుఁ దాను గ్రక్కునఁ, జని గిరిజాసహితుఁ డైన శంభునిఁ గాంచెన్. 430

తే. కాంచి బిగిచన్నులిల మోవఁ గాంచనాద్రి
ధన్వపాదాబ్జములకు వందన మొనర్చి
యంజలి ఘటించి యభినతు లాచరించి
వినయ మెనయంగ నిట్లని విన్నవించె. 431

చ. పరమదయానిధాన శివ పశ్యలలాట సహస్రకోటిభా
స్కరనిభతేజ మీ రిడిన శాప మెఱుంగక వచ్చి యీవనాం
తరమున సేనతోడ వనితాత్వముఁ జెందితి నివ్వికారముం
భరణము సేయఁ జాల నిఁకఁ బౌరుషముం గృపసేయవే యనన్. 432

చ. కలకల నవ్వి శంభుఁ డనుఁ గర్దమనందన యాఁడుచందముల్
దలఁగఁగఁ జేయు టొక్కటియ తక్క మఱొక్కవరం బొసంగెదన్
వలసిన దేమి తెల్పుమనినన్ బరమేశ్వర యన్యకాంక్షయున్
వలయునె నంచు నయ్యల శివాసతి చెంగటి కేఁగి దీనయన్. 433

చ. కళుకుమెఱుంగుఁజెక్కులను గాటుకకన్నులనీరు జాఱఁగా
నలఁతి జనించునూర్పుసెగ లాని ముఖాబ్జము వాడుదేఱఁగా
వలుఁదపిఱుందు భారమున వారనితొక్కటపాటు మీఱఁగా
నిలపము నాఁగి మ్రొక్కి యిల యీశ్వరి నిట్లని యెంచె ధీరతన్. 434

దండకము. శ్రీమద్రమాభద్రమాతంగయానామణీముఖ్యనానామరగ్రామణీ కామినీ
కల్పితానల్పకల్పప్రసూనాది పుష్పజాతిరాజత్పదాంభోజదీవ్యన్నఖశ్రేణికాసాం
ద్రచంద్రాతపశ్రీసముత్ఫుల్లభక్తిప్రియశ్రేణినేత్రోత్పలా, ఖండితాశ్వద్విషద్దాన
వోద్యత్ఫలా, యుత్పలామిత్ర మిత్రాగ్నిహోత్రాఖ్య నేత్రత్రయాలోకలోకైక
నిర్మాతృతా నేతృతా జేతృతా రీణచాతుర్యపారీణఖేలావతీ, చారులావణ్యలీలావతీ
దేవతిర్యఙ్మనుష్యాదికప్రాణిబాహ్యాంతరవ్యాప్తిసుప్త్యాద్యవస్థా త్రిగజ్ఞప్తిరూపా
నురూపక్రియాకారణాకారరేఖావిలోకాతిలోక ప్రమోదాబ్ధినిర్మగ్నభాలేక్ష
ణా, పద్మగర్భాండకోట్యర్బుదాయత్తసంరక్షణా, సూక్ష్మవీక్షాతితిక్షాపరాక్షీణ
హృద్గ్రంథినిర్గ్రంథనాత్మానుసంధానసంబంధభృత్స్థూలబంధానుభూతిప్రభూతాత్మ
సౌఖ్యాత్మకశ్లాఘ్యనిష్ఠైకసంధాయినీ, బంధురాష్టాంగయోగాంచితధ్యాయినీ,
కాయజాఖర్వగర్వాపహారవ్రతాచారచంచత్తపశ్చర్మసంచారిణీ, బాలచంద్రైక
రేఖాసముద్ధారిణీ, ధారుణీతోయతేజోమరుద్వ్యోమతన్మాత్రతత్త్వాదృశప్రాణనా
దేంద్రియస్థానషట్చక్రనాడీవిశేషాకృతీ, హృద్యవీణానువాద్యాదివిద్యాకృతీ,
ప్రాకృతుల్ నిన్ను సర్వేశ్వరిన్ మూలశక్తిన్ బరంజ్యోతి నాద్యంతశూన్యన్
ద్రయీరూపిణిన్ గాంచి భావించఁగా లేక దాక్షాయణీదేవి వంచున్ హిమక్షోణి
భృత్పుత్రి వంచున్ విలోకింతు రస్మాదృశాజ్ఞత్వ మాత్మన్ క్షమింపంగ ఖేదం
బు మాన్పంగ నీకే తగున్ దండ్రికంటెన్ బ్రజాకోటిపైఁ దల్లికిన్ గూర్మి బా
హుళ్య మోతల్లి యేఁదొల్లి యేస్నాన మేదాన మేయోగ మేయాగ మెచ్చో
టఁ గావించినానో నినున్ జూడఁగాఁ గల్గె బ్రహ్మామరేంద్రాదిబృందారకేంద్ర
స్ఫురద్భర్మకోటీరకోటీతటీరత్నవిభ్రాజమానప్రభారాజినీరాజితంబైన నీయంఘ్రి
యుగ్మంబు సేవించితిన్ బూర్వజన్మార్జితాశేషదోషంబు నీసత్కటాక్షంబునం
బాసె నే నిన్ను వీక్షించి తిం కేమి కాంక్షింపఁగా నున్న దైనన్ మనశ్చంచ
లత్వంబునన్ వేఁడెదన్ వ్రీడకున్ దోడునీడైన యీయాఁడురూపంబుఁ బ్రాపిం
చి యుష్మత్కృపాభావితప్రాజ్యసామ్రాజ్యమున్ బాసి గాసిల్లఁగా నోప నా

పూర్వపాపంబు మన్నించి నన్నుఁ భవత్కింకరశ్రేణితోఁ గూర్చి రక్షింపు మోనాతి యేరీతిఁ జింతించినన్ విశ్వలోకప్రపంచంబు నీచేతి దీచేతనాచేతన శ్రేణి నేలాగు గావించ నూహించి యాలాగునన్ నీ కసాధ్యంబు లే మున్న వో పన్నగవ్యూహసమ్రాడ్భుజాకోటిభృద్దేహినీ విశ్వసంమోహినీ సౌధపాథోధి రాడంతరానంతరత్నాంతరీపస్థిరా మధ్యమాద్యత్కదంబాటవీవాట ఖేటద్రు మూలస్థలీ దివ్యచింతామణీ భద్రపీఠాగ్రసంవాసినీ వాసవాద్యష్టదిక్పాలకాది త్యగంధర్వరుద్రానిలవ్యాళవక్త్రప్సరస్సిద్ధసాధ్యాదిదివ్యస్తవాకర్ణ నాగోధకర్ణోత్ప లామోదలోభ భ్రమద్భంభరోజ్జృంభిత శ్రీసఖత్పార్శ్వ భాస్వద్వయస్యామణీ చామరవ్రాతజాతానిలాధూతనీలాలకస్నిగ్ధముగ్ధేందులీలాలసత్ఫాల కస్తూరికా చిత్రకోద్భాసినీ సంతతోల్లాసినీ గౌరి మాహేశ్వరీ శాశ్వతైశ్వర్యలక్ష్మీకరీ శాం కరీ కాళి కంకాళనాళీకధారావళీ భీకభర్గాశ్రితస్వీయవక్షోరుహాక్షోణిభృద్దుర్గ దుర్గామహాదేవి దేవీమతల్లీ శ్రితార్తిఘటాభల్లభిల్లీ ననుఁ గన్నతల్లీ నమత్క ల్పవల్లీ నమస్తే నమస్తే నమః. 435

క. అని కొనియాడిన గిరిజా, వనజానన సంతసించి వల్లభుమదిలో
నెనరొలయఁ దెలిపి యయ్యెలఁ, గనుఁగొని యిట్లనియెఁ గరుణ గడలుకొనంగన్.

క. సగపాలు శంకరుండును, సగపాలే నగుట నీకు సగ మియ్యఁ దగున్
మగువ వయి కొన్నినాళ్లున్, మగతనమునఁ గొన్నినాళ్లు మను మికమీఁదన్.

వ. అని పలికి యప్పరమేశ్వరి యిట్లనియె. 438

{ పార్వతీదేవి యిలున కొకమాసము మగతనమును నొకమాసము మగువతనంబును గలుగునట్లు కరుణించుట }

ఉ. ఎన్నిదినంబు లింతితన మీవు వహించి చరింతు వుర్విలో
నన్ని దినంబు లుండుము నృపాకృతి నెప్పటిపౌరుషంబుతో
నున్నపుడింతి వౌ టెఱుఁగ కుండుము కామినివైన వేళ ము
న్నున్న నృపత్వమున్ మఱచి యుండుము రెంటను సౌఖ్య మబ్బెడిన్. 439

చ. వలదు విచార మన్నను భవానికి నయ్యిల మ్రొక్కి క్రమ్మఱన్
బలికె మహాప్రసాద మనపాయదయానిధి నీయనుజ్ఞచే
నలయక యొక్కమాసము నృపాకృతిఁ జెందుచు నొక్కమాస మి
చ్చెలితన మొందుచున్ గ్రహణ సేసెదఁ గాలము పంపవే యనన్. 440

క. మంచిది యటువలె నౌఁ బో, మ్మంచును బొమ్మంచు మోవిహాసనాంకురముల్
మించఁగ గిరిసుత వంచిన, జంచలలోచనలు గొల్వఁ జనె నిల యనుచున్. 441

పంచచామరము—

ఇలానుతాధినాథుఁ డానతిచ్చినన్ సవిస్మయా
త్ములై సహోదరుల్ నరేంద్ర తొంటిరూపు వాసి య

య్యెలుంగు గాంతయై మఱెక్కడెక్కడఁ దెలంగె నే
స్థలంబులఁ జెలంగెఁ దద్విధంబు దెల్పవే యనన్. 442

ఉ. తమ్ములఁ జూచి రామవసుధాపతి యిట్లను నట్లు గోరి చే
సమ్మతిమై వరంబు గొని సర్వసుహృద్భటమంత్రిపుంగవుల్
గొమ్మలపోఁడుముల్ దొరసి కొల్వఁగ వాహనకోటి నొక్కచా
క్కట్టమున డించి యయ్యెల ప్రసన్నమతిఁ విహరించెఁ గానలన్. 443

సీ. తిరుగు నొక్కొకచోటఁ జరణాబ్జములు సోఁక మహి యెల్ల మెట్టదామరలు గాఁగఁ
బలుకు నొక్కొకచోటఁ బలుకుఁజక్కెరలకై కలికిరాచిలుకలబలగ మొలయఁ
జూచు నొక్కొకచోటఁ జూపులు పొదలపై నెలసి తేఁటులదాటు లినుమడింప
నవ్వు నొక్కొకచోట నవ్వువెన్నెలలచే వనములో నెల్లఁ గ్రొన్ననలు మించఁ

తే. జొక్కముగఁ బాటఁ బాడు నొక్కొక్కచోట
డగరకోయిల లెల్లఁ జిట్టడిక మరయ
సొలసి యొక్కొకచో నిల్చు సొగసుమేని
కమ్మతావులు దిశ లెల్ల గమ్ము మనఁగ. 444

వ. ఇవ్విధంబునఁ బ్రథమమాసంబున నసమానవిలాసంబుల మించునమ్మించు
బోఁడి త్రిలోకకామినీకామనీయకంబులకు నాస్పదంబై సానుమత్సానుభాగం
బులఁ సానఁ దీరిన మానికంబువలె డంబు గని ఘనతరవనౌఘమేఘమాలిక
యందుఁ దులకించుతొలుకరిమించు మించుల వహించి మహితనికుంజపుంజమ్ముల
చేరువఁ జారుమల్లికామతల్లికాసముల్లాసంబు లెల్లఁ గొల్లలాడి కళంకు లేని
కొలంకులకెలంకులఁ బంకజప్రభవునివారువంబుగారవంబున సొరు వడసి విడిసిన
చోట విడియక నిలిచినచోట నిలువక చూచినచోటఁ జూడక కోడెప్రాయంబు
తోడిచేడియలఁ గూడుకొని వేడుకతోఁ బెక్కుజాడలఁ గ్రీడించుచు నొక్క
నాఁడు చొక్కపుఁగొండకుఁ జక్కనిదక్షిణంబునఁ జుక్కలరాజుచక్కని కొడుకు
తపంబు సేయుపెక్కుతరులతాదులఁ బెంపెక్కు నొక్కయక్కజపువనంబు గని
దఱియఁ జొచ్చి యచ్చట. 445

క. విహరించుచు విరిపూఁదా, విహరించుచు గొడ్పు మెలఁగ విలసిల్లుచు న
మ్మహిళామణి సహచరబహు, మహిళలఁ గూడి గహనమధ్యమునందున్.

చ. గగనముతోడ రాయు నొకగట్టుఁ గనుంగొని హొన్నుచాయలఁ
దగు నొకదివ్యచంపకవనంబునఁ గంకణపద్మరేఖలఁ
దగి కమలాకరత్వము యథాతథభావమునఁ బొసంగఁ జె
న్నుగులు నొక్కదీర్ఘికఁ గనుంగొని తజ్జలమధ్యమంబునన్. 447

ఇలను బుధుఁడు వరించుట

క. మరునిఁ వేలుపురాచకొ, మరునిఁ నగుసొగసు మించ మహిమ రహింపఁ
దురుసుతప మూని తగుచుఁ, దురుసుతు బుధుఁ జూచి యిల మనోజాతుర యై.

చ. ఎగుభుజముల్ వెడందయురము మిందుని గిందుని మించనీనినె
మ్మొగ మపరంజిడాల్ తలిరుమోవియుఁ జేరల మీఱుకన్నులున్
జిగి గలపెందొడల్ గలిగి చెల్వు వహించిన యీతఁ డీడ బె
ట్టగుతప మూనినాఁడు చెలులార కనుంగొనుఁ డంచుఁ దెల్పుచున్. 449

క. వికచారవిందబృంద, ప్రకటతరామోదభరితపాటీరమరు
న్నికరచలాచలనీలా,లకలు సకులు గొల్వ నక్కొలఁకు సేరి వేసన్. 450

తే. కలికిరాయంచవలె సోయగంపునడలు, గులుక నక్కల్కి చెంగావికోక వదలి
చలువపావడఁ గోఁ జొచ్చెఁగొలఁకు నెలకు, మారుపై మారుఁడనుచుకటారిఁబోలి.

వ. అప్పుడు. 452

చ. హాళిహాళి సేయుచున్ జలరుహంబులు గోయుచు మీఁద వేయుచున్
నిలు మని హెచ్చరించుచును నీళ్లను ముంచుచు నుత్సహించుచున్
బులుఁగులఁ దోలుచున్ గలువపువ్వుల వ్రాలుచుఁ దావిఁ గ్రోలుచున్
వెలఁదుక లొండొరుల్ గొలన వేడుకఁ గూడుక క్రీడ సేయఁగన్. 453

శా. తత్కాంతాకుచశైలఘట్టనసముద్యత్తుంగభంగాకరం
గత్కంజాతసమంజసంభ్రమర ఝుంకారానుకారిస్ఫుర
త్ఫూత్కారాన్వితవారివారణకరాధూతారికోయష్టికా
ద్యుత్కంఠార్భటి వీనులన్ బడిన నెంతో సామ్యుఁ డుద్భ్రాంతుఁడై. 454

తే. తపముసాలించి వారిలోఁ దళుకువాలుఁ, గన్నులనువాలుఁగన్నులచెన్ను వెలయు
నన్నెలఁతచిన్నిప్రాయంపుఁజిన్నె లెల్లఁ, జోద్యపడి ఱెప్ప వేయక చూచెనంత. 455

తే. మోదమున నైదుతూపుల పాదుపాదు, తమ్మిదోదుమ్మిఁ గొందిడెందమ్ము గుమ్మి
క్రమ్ముకొని దొమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లను నెమ్మనమున. 456

ఉ. ఎక్కడనుండి వచ్చె నొకో యిచ్చెలి యెవ్వనిముద్దుగుమ్మయో
యెక్కడిసోయగం బిది సురేంద్రునికొల్వు మెఱుంగుఁబోండ్ల కీ
చక్కదనంబు లున్నవె బిసప్రసవప్రభవుండు వింతగా
నిక్కలకంఠకంఠి సృజియింపఁగ నెట్టితపం బొనర్చెనో. 457

మ. చిగురాకుంజిగి నేలుఁ గేలుకవడాల్ చెండమ్మి చందంబునన్
సొగసొందున్ మొగ మిందుకాంతరుచి మించున్ మించుఁజెక్కుల్ జగా
పగడంబున్ బగడంబుగన్ బెదవి మేల్ పాలిండ్లు హరొంగిం డ్లనన్
దగురా యీమృగరాజమధ్యసరిచానన్ గాన నే నెక్కడన్. 458

చ. పలుమఱుఁ గప్పవెన్నెలలు బారలఁ గొల్వఁగ వచ్చు నచ్చపున్
దెలిజిగిచెక్కుటద్దముల నీడలు సూడఁగ వచ్చుఁ గాంచనా
చలయుగి గల్గినన్ గలికిచన్గవతో సరితూఁగ వచ్చు ని
చ్చెలినడుమే యలంతి యని సింగము గెల్వఁగ వచ్చు బాపురే. 459

ఉ. కొంకక గుబ్బచన్నులను గుంకుమపంక మలంది చెక్కులన్
గుంకుమదంబుఁ బూసి నెఱజాణతనంబున జాణిక స్ఫురిన్
బొంకము మీఱఁగా నుదుట బొట్టిడి పువ్వులశయ్యఁ జేర్చి మీ
నాంకుని కేళి నేలి జవరాలికి బాళి ఘటింతు నెన్నఁడో. 460

ఉ. ఏల తపంబులున్ వ్రతము లీలలితాంగిని గూడి యుండినన్
జాలదె యంచు నక్కొలఁకుఁ జయ్యన వెల్వడి పర్ణశాలకున్
బాళి దలిర్ప నేఁగి మునిబాలురచే బుధుఁ డయ్యిలాఖ్యనీ
లాలకయాళులన్ నలుగు రైదుగురిన్ బిలిపించి యిట్లనున్. 461

చ. అలికులవేణులార యిపు డబ్జవనంబునఁ దమ్మితూపులన్
వెలఁదిని వ్రేయుచున్ వలచెవిన్ ధరియించిన నల్లగల్వపై
నొలసిన తేఁటిఝంకృతుల కుల్కుచుఁ గుల్కుచుఁ గేళి సల్పు నా
నలినదళాక్షి కెవ్వఁ డధినాథుఁ డ దెవ్వతె దెల్పరే యనన్. 462

క. నెలతనయునిపదముల క,న్నెలఁతలు నతు లాచరించి నిలిచి యనఘ య
చ్చెలి మా కెల్ల నధీశ్వరి, యళి చేరని పువ్వువంటి దని తెల్పుటయున్. 463

క. తనయోగదృష్టిఁ గర్దమ, తనయోదంతంబు తుద మొదలు నేర్పడఁ గ
న్గొని నేర్పడరన్ బుధుఁ డ,వ్వనితల వీక్షించి పలికె వారనికరుణన్. 464

చ. సరసిజనేత్రలార శివశప్తవనంబున మీరు స్త్రీత్వమున్
బొరసితి రింక మీజననముల్ ఫలియింపఁగ నాయనుజ్ఞఁ గిం
పురుషులభార్య లై సుఖముఁ బొందుఁడు వారల నే సృజించి యి
ద్ధర మును నిల్పినాఁడ నని తత్క్షణ మందఱ వీడుకొల్పినన్. 465

క. ఇల యొక్కటె దక్కఁగ నిల, చెలు లందఱు నతని యాజ్ఞ చేఁ గింపురుషా
వలిఁ గలిసి వెలసి రొంటిగ, నిలిచినయిలఁ జేరి బుధుఁ డనియె ననురక్తిన్. 466

చ. సరసమరాళసంగతిఁ బ్రసంగనిపద్మినిఁ బోలి కోకిల
స్ఫురణము లేనిమామిడిని బోలి మదభ్రమరాభియోగమున్
బొరయని పుష్పమంజరిని బోలి వృథా వసియింప నేల నన్
వరునిగ నింకఁ జేకొని భవంబు ఫలింప సుఖింపవే చెలీ. 467

ఉ. ఎవ్వఁడొ వీఁ డటంచు నను నిచ్చఁ దలంపకు మిందుపుత్త్రుఁడన్
జవ్వని నే బుధుండ నినుఁ జక్కఁ గనుంగొనినంతనుండియున్
బువ్విలుకాఁడు నాహృదయమున్ నొగిలింపుచు నున్నవాఁడు నీ
నవ్వుమొగంబు నామొగమునన్ గదియింపవె యాదరింపవే. 468

చ. ఇగురులవంటి నీయడుగు లిక్కడికర్కశభూమి సోఁకినన్
నొగిలెనొ యంచు నామనసు నొవ్వి వహించిన దింత మక్కువన్
దగిలిన నన్నుఁ బాసి చన ధర్మువుగా దిఁక లెస్స చూడవే
మగువ యటంచు నాతఁ డనుమాటకు మోము మఱవంచి సిగ్గునన్. 469

చ. ఎలనగ వంకురింప నలయించుని భానన వల్కె స్వామి నీ
పలుకొనరించు టెంతయును భాగ్యము గాదె సుఖింపుఁ డిచ్చకున్
వలసినయట్టు లేమిటికి నన్నడుగన్ బతి నీవు భావ్య నే
నెలమి నొనర్చె మన్మథుఁడె యిద్దఱకున్ దగులాట మియ్యెడన్. 470

క. అనుమాటలు చెవి నాటిన, ననుమానము మాని సౌమ్యుఁ డలరుచు నపు డ
య్యనుమానమధ్యఁ జేకొని, యెను మానసభవునిపంత మీఁడేరంగన్. 471

వ. ఈవిధంబున నలభావజనిహావభావంబు లలర నయ్యలరుఁబోఁడిఁ బరిగ్రహించి
మించుపూవుతావుల గుబాళించు తనపర్ణశాలఁ బ్రవేశించె నప్పుడు. 472

తే. అయ్యలరుఁబోఁడి సిగ్గరి యయ్యు నిచ్చఁ, బచ్చవింటిదునేదారి హెచ్చరింపఁ
బతికివిడెమిచ్చి యడుగులుబత్తినొత్తి, బాళిగనుపించ దమి హెచ్చిపలికె బుధుఁడు.

సీ. కలికి కప్పురపుబాగా లొసంగినయట్ల వేడుకతో ముచ్చటాడితేని
మగువ యా తెలియాకుమడుపు లిచ్చినయట్ల యెలమిఁ జెక్కిలి గీఱనిచ్చితేని
చెలి పాదములఁ గేలుఁజిగురు లుంచినయట్ల చిగురువాతెఱ దయచేసితేని
కొమ్మ వీజనము చేకొని విసరినయట్ల కమ్మయూర్పులయఁ బైఁ గ్రమ్మితేని

తే. నెలఁది తగుసేవ నీవు గావించినటుల, గోర్కె మీఱంగ నన్నేలుకొంటివేని
నేల యాలస్య మీవేళఁ దాళనీయఁ, డించువిల్తుండు కౌఁగిలీవే లతాంగి. 474

చ. అని మృదులోక్తులం దిడి నిజాంఘ్రిసరోజము లొత్తుచున్న చ
క్కనిచెలి మీఁదికిన్ దిగిచి గ్రక్కున నక్కున నుంచినంతఁ బ
క్కనఁ దనయంత వీడె సతికంచుక మిర్వురగాత్రసీమలన్
మునుకొని యొక్క మరుం డిడినముల్కులొ నాఁ బులకాంకురావళుల్. 475

చ. చనుఁగవపేరిహేమకలశద్వయి దాఁచినచో వడంకుచున్
మినుకుకడాని చెక్కులను మీటఁగఁ బూనెడుచో వడంకుచున్
మొనసి కటీసువర్ణధర ముట్టినచోఁ బులకల్ వహించుచున్
వనజదళాక్షిఁ గూడు నెడ వల్లభు కేల్ దగెఁ దస్కరాకృతిన్. 476

ఉ. అంటినఁ గందునో యనక యంగము నిర్దయవృత్తి మీఱఁ గౌఁ
గింటికిఁ దార్చి నుజ్జుగునొ కెంజిగురట్టిది నాక మోవిఁ బ
ల్గంటు లొనర్చి చన్గవ నలంగునొ నాక నఖాళిఁ జేర్చి వా
ల్గంటి రమించె నాథుఁడు స్వకార్యపరుల్ మగవార లెంచఁగన్. 477

సీ. నునుచెమ్మటలఁ గరంగిన యంగరాగ కుంకుమరక్తి మెఱమట్టి కొమరు గాఁగ
నిర్దయాశ్లేషసన్నిహితాంగములఁ జెలంగుట భుజాభుజిఁ బెనంగుటలు గాఁగ
నన్యోన్యదంతాచలాక్రాంతరవముఖోద్ధతు లొడుగఱచుచందములు గాఁగ
గల్లస్థలచపేటగాఢవక్షోఘట్టనాదులు ముష్టిప్రహృతులు గాఁగ

తే. జంకెనలు వాఁడిచూపులు బింకములు క
ళారవములుఁ బైకొను నలవు లుల్ల
సములు నగవులుఁ దెఁకువలు సమము గాఁగ
మల్లయుద్ధంబుఁ బోలె దంపతుల రతము. 478

చ. ఇటువలె నయ్యిలన్ గలిసి యిందుకుమారుఁడు చంద్రకాంతసం
ఘటితలసద్వితర్దికల గ్రావగుహాకుహరంబులన్ సర
స్తటములఁ జల్వచప్పరపుఁజాయల మవ్వపుఁబువ్వుఁదోఁటలన్
బటుతరమంజుకుంజగృహభాగములన్ విహరింపుచున్నెడన్. 479

క. కళలు గలవానికొడుకున్, గలిసినయయ్యిలకు నొక్కకళ యై చనె న
న్నెల యతఁడు గళవళింపఁగఁ, బాల తితనము మాని యంతఁ బురుషుండయ్యెన్.

ఇల బుధునివలనఁ బురూరవసుండను కుమారుం గనుట

చ. ఇలుఁ డిటులన్ నిజాకృతి వహించి మహేశ్వరునాజ్ఞ బోఁటి యై
మెలఁగుట లచ్చటన్ బుధు రమించుట మాస మతిక్రమించుటల్
దెలియక మున్ను వేఁట చనుదెంచుట లెంచుచు సేన నవ్వన
స్థలి వెదకన్ దొడంగె గిరిజాసతిమాటకుఁ దప్పు గల్గునే. 481

క. వన మెల్ల వెదకి యచ్చటఁ, దనసేనన్ గాన కతఁడు తహతహతోడన్
జనుదెంచి సరసిమధ్యంబున నుగ్రతపం బొనర్చుబుధుఁ బొడగాంచెన్. 482

చ. పొడగని యమ్మహామహునిపొంతకుఁ బోయి నమస్కరించి యో
యుడుపతిపుత్త్ర బాహ్లి యన నొప్పెడుప్రోలికి నేను రాజ ని
య్యడవికి వేఁటవచ్చితి భటాదులఁ గూడుక వార లెల్ల నె
క్కడఁ జనిరో ననున్ విడిచి కాన ననన్ బుధుఁ డిట్లనున్ గృపన్. 483

మ. వసుధాధీశ్వర నీభటుల్ పటుశిలావర్షంబుచేఁ గొండ ఉ
గ్రసమీరోద్ధతిఁ గొండఱున్ మడిసి రింకన్ వారికై కుంది పా
లసునిన్ బోలకు కందమూలఫలముల్ భక్షించి యీయాశ్రమం
బు సమస్తార్తిహరంబు నిల్వు మిచటన్ మోదంబుతో నావుసున్. 484

శా. ఆబాహ్లీకుఁడు సమ్మతించి యను నయ్యా మంత్రిసామంతనా
నాబంధుప్రకరంబు లెల్ల ననిలోనన్ ద్రెళ్లె నేకాకి నై
నేఁ బో నొల్ల పురంబుఁ జేర నిచటన్ మీపాదముల్ గొల్చుచున్
మీబోధల్ వినుచున్ గ్రమింతు దినముల్ మీ రిప్పు డన్నట్టులన్. 485

క. విశదయశోమృతనిధికిన్, శశిబిందువుగాఁగఁ జెలఁగుసత్సుతుఁ డిపుడా
శశిబిందుఁడు భూభర మసదృశగతి భరియించుఁ గాక యిఁక నని పలుకన్.

క. అలరాజతనయుఁ డలరుచు, నిలరాజ యట్లైన మంచి దేఁడా దిచటన్
నిలువుము నీకు శుభంబులు, గలిగెడి నని తెలుప నతఁడు గైకొని నిలిచెన్.

క. అన్నెల గడచినఁ గ్రమ్మఱఁ, గ్రొన్నెల నగునుదురు గలుగుకోమలి యయ్యెన్
వెన్నెలగీముకుమారుఁడు, గన్నులలరఁ జూచి దానిఁ గలిసి సుఖించెన్. 488

క. మగువ యయి వలచి యుండున్, మగవాఁడై కొలిచియుండు మదనునిఁ బోలన్
మగతనము మగువతనమును, జగతీనాయకుఁడు దనకు సఫలతఁ జెందన్. 489

తే. మగువ యై యున్న నెలయెల్ల మమతఁ జూచి
చాల ననురక్తుఁడై యుండుఁ జంద్రజుండు
మగతనము గన్న నెల యెల్ల మౌన మూని
తా నతివిరక్తుఁడై ఘోరతపము సేయు. 490

క. విరహాగ్ని మాన్పుకొనఁ జను, కరణిఁ దఱుణిఁ బొసినపుడు కాసారజలాం
తరమగ్నుం డగు నానం, దరసాంబుధిమగ్నుఁ డగు నతఁడు చెలిఁ గన్నన్. 491

క. నెలపట్టి యిటుల నలరఁగ, నిల యై యొక నెలయు మరల నిలుఁడై నెలయున్
మెలఁగుచుఁ గ్రమమునఁ దొమ్మిది, నెలలునసఁ బురూరవున్ గనియె నది యంతన్.

తే. ఆపురూరవుఁ బోషింపుఁ డనుచు నాత్మ, గురున కొప్పించె బుధుఁ డాతఁడు రసుధార
సంబు ద్రావించి పెంచె వాత్సల్యముంచి, యుచితకళాప్రపంచజ్ఞుఁ డయ్యె శిశువు.

ఉ. అంతట నింతి యా టుడిగి యయ్యిలుఁ జెప్పటిలీలఁ గొల్వఁగా
నెంతయుఁ గూర్మిఁ బుట్టి బుధుఁ డీలని దుర్దశ మాను నిప్పుడం
చాంతర నైరిహాంత లగు నత్రి భృగుచ్యవనాదిమౌనులన్
శాంతులఁ బిల్వఁగాఁ బనిచి చారుసపర్య లొనర్చి యిట్లనన్. 494

ఇలుఁ డశ్వమేధము చేసి శివునియనుగ్రహమునఁ దన స్త్రీత్వంబు తొలఁగించుకొనుట

క. ఈయిలునియంగనాత్వముఁ, బాయంగాఁ జేయుటకు నుపాయం బేమో
మీయందఱు నాలోచన, సేయన్ దగు ననిన వారు చింతించు నెడన్. 495

చ. క్రతుపులహాదియుక్తుఁ డయి కర్దముఁ డచ్చటి కేఁగుదెంచి య
య్యతులును సౌమ్యుఁడున్ జలుపునర్చనలన్ ముద మంది పుత్త్రు నా
నతుఁ గని యాదరించి కరుణానిధి యాశివుఁ గూర్చి విశ్వవ
ర్ణిత మగునశ్వమేధ మొనరింపక యిద్దురవస్థ తీఱునే. 496

క. మటుమాయ యాఁకఁతన మొ, క్కటియు నడచుపని యదెంత గల దతని కతం
బటువలె వలసిన నటువలె, ఘటియింపన్ గలఁ డటంచుఁ గర్దముఁ డనినన్.

తే. అందఱును సమ్మతించి శివార్పణముగ, నశ్వమేధంబు సేయించి రతనిచేత
యాగపరిపూర్ణకాలంబునందు మునుల, కిందుధరుఁడు ప్రసన్నుఁడై యిట్టు లనియె.

ఉ. మీ రొనరించినట్టి హయమేధము మెచ్చితి మౌనులార మీ
కోరినయట్ల యయ్యిలునకున్ బురుషత్వము శాశ్వతంబుగాఁ
గూరిమి నిచ్చితిన్ మఱియుఁ గోరిక లున్నవె తెల్పుఁ డన్న న
క్కాఱణికాగ్రగణ్యునకుఁ గర్దమముఖ్యులు మ్రొక్కి వేడుకన్. 499

క. వేదాంతములకుఁ దోఁపని, నీదివ్యపదాంబుజములు నే మిప్పుడు సా

మీ దర్శించితి మింతియు, కాదే మామనసులందుఁ గలకోరికయున్. 500

క. నారీత్వము లే కెప్పటి, పౌరుషమున బ్రతుకు మనుచుఁ బలికితిఁ గదా
ఈ రాజు నదియు నుందఱ్, కోరిక యని పొగడ శివుఁ డగోచరుఁ డయ్యెన్. 501

క. మును లరిగి రంత నిలుఁడు బుధుని వీడ్కొని యతనిపుత్త్రుఁ దోడ్కొని జనకుం
డనుమతి సేయఁ బ్రతిష్ఠా, నగరమున నిలిచి భూజనంబులఁ బ్రోచెన్. 502

తే. అతని వెనుకఁ బురూరవుం డప్పురమున
కధివిభుం డయ్యె నటుగాన నశ్వమేధ
యాగ మఖిలార్థసాధకం బనుజులార
యని రఘుస్వామి మఱియు ని ట్లనుచుఁ బలికె. 503

క. భూనుత మైన యిలోపా, ఖ్యానం బిది వినిన జనుల కఘరాశి నశిం
నానార్థంబులుఁ జేకుఱు, మానితముగ నశ్వమేధమఖఫల మొదవున్. 504

ఆశ్వాసాంతము

ఉ. సారసగేహినీసుదృఢసారసనప్రవిమోక్షణక్రియా
సార సముజ్జ్వలస్మితసారసవన్మధురాధరామృతా
సార పదానురాగ ఘనసారసదాశివహారసారకా
సార సఖద్యుశోవ్రజవిసారసదృఙ్నయనామనోహరా. 505

క. అబ్జారిబంధునయన జ, యాబ్జారిగదాసిధనురుదగ్రశయాబ్జా
కుబ్జాతరుణీ రమణ క, కుబ్జాతగజోపమారికుంభీంద్రహరీ. 506

కవిరాజవిరాజితము.

ఘనతరకారణ కల్మషకారణ కాయనికారణ కర్మపరా!
సనకసనందన శక్తిజనందన సాధ్వభినందన సత్త్వమనా!
జనితవినోదన శత్త్రుపనోదన చారువినోదన సర్వహరా!
వినతసుదర్శన విస్తృతదర్శన విస్ఫుటదర్శన వేద్యపదా! 507

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణవైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతం బైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబునందుఁ సప్తమాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము

## అష్టమాశ్వాసము

—:౦:—

శ్రీకాంతాధామ సుధం
శాకాంతాప్రేమ రవిసుతాద్యృక్షావల
వ్యాకీర్ణాతిశ్యామల
శాకలితసుధామ లక్ష్మణాద్యభిరామా. 1

తే. అవధరింపుము రామచంద్రావనీంద్ర
చంద్రుఁ డీరీతిఁ దెల్పినసత్కథ విని
యనుజమణు లిట్లు రఘునాయ త్తచిత్తు
లగుచు నానంద మొంది రయ్యవసరమున. 2

రాముఁ డశ్వమేధయాగము సేయుట

చ. మనుకులరాజశేఖరుఁ డమందగుణాంబుధి రాముఁ డెంతయున్
ఘనహయమేధయాగకుతుకంబు మనంబున మించ లక్ష్మణున్
గనుఁగొని వత్స నీవు చని కశ్యపకుత్సవసిష్ఠకణ్వము
ఖ్యనిఖిలసంయమీశ్వరుల గ్రక్కునఁ దోడ్కొని రమ్ము నావుడున్. 3

ఉ. ఆలవణారియన్న పతియానతి యాదలఁ దాల్చి చెచ్చెరన్
గాలవకౌశికాత్రిభృగుకణ్వపరాశరవామదేవజా
బాలివసిష్ఠకశ్యపవిభాండకముఖ్యుల వేదశాస్త్రముల్
చాల నెఱుంగు బ్రహ్మమునులన్ దోడితెచ్చె వినీతి హెచ్చఁగన్. 4

ఉ. అంతకుమున్నె నిండుకొలువై భరతాదులు గొల్వ నున్న భూ
కాంతుఁడు వారిరాక విని కాంచనపీఠిక డిగ్గి నిర్మల
స్వాంతముతో నెదుర్కొని సువర్ణకిరీటరుచుల్ తదీయపా
దాంతికభూమి ముంచుకొన నందఱకున్ బ్రణమిల్లి వేడుకన్. 5

తే. వినయమునఁ దోడితెచ్చి వేర్వేఱ సముచి
తాసనంబుల నునిచి హస్తాంబుజములు

మొగిచి తనచూపుఁ దేఁటు లమ్మునులవదన
పద్మములయందు నిగిడించి పలికె విభుఁడు. 6

చ. అనితరపుణ్యులార భువనాంచిత మాహయమేధమేను మీ
యనుమతిఁ జేయువాఁడ నని యాత్మఁ దలంచితి మీర లమ్మఖం
బునకు ననుజ్ఞ యిం డనిన బోరన నమ్మును లెల్లఁ బల్కి రో
జనవర ముజ్జగంబులకు సమ్మత మాక్రతు వాచరింపవే. 7

తే. అన్యథాభావ మెందు నే యధిప నీయ, మోఘసంకల్పమునకన్న ముదముఁ జెంది
ప్రోల నిలుచున్న లక్ష్మణు మోముఁ జూచి. పలికె నమ్మేటి గంభీరభాషణముల. 8

చ. హవనముఁ జూడఁగా రవిసుతాంగదవాయుజనీలజాంబవ
ద్గవయగవాక్షధూమ్రనలతారసుషేణసువేగవేగద
ర్శివినుతగంధమాదనదరీముఖమైందసుబాహుకేసరి
ద్వివిదగజప్రజంఘముఖవీరకపీంద్రులఁ బిల్వ నంపుమా. 9

మ. అనలాద్యన్వితు నవ్విభీషణుని లంకాధ్యక్షు రప్పింపు చ
య్యనఁ బిల్పింపుము కేకయాధిపవిదేహక్ష్మాధినాథప్రవ
ర్ధనముఖ్యప్రియబంధులన్ హితసుహృత్సందోహముల్ గూడి ర
మ్మనుచుల్ లేఖలు పంపుమీ యఖిలదేశాధీశసంఘాళికిన్. 10

శా. నానాదేశనివాసులై నద్విజుల్ నానానదీతీరవ
న్యానిత్యాశ్రయులౌ మహర్షులను మింటన్ మించు సప్తర్షులన్
నానాదేవధరస్థలాంతరములన్ నల్వొందు దేవర్షులన్
నానాదిక్కుల నున్నబ్రహ్మఋషులన్ రప్పింపుమా గ్రక్కునన్. 11

తే. బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై బ్రహ్మఁ బోలు, బ్రహ్మవర్చస మింపొంద బ్రహ్మపరత
బ్రహ్మలోకంబునవసించు బ్రహ్మమునుల, ననఘ ప్రార్థించిపిలిపింపుయాగమునకు.

క. కవిగాయకపరిహాసక, వివిధస్తుతిపాఠకులను వీణావాద్య
ప్రవణుల నర్తకవాంశిక, నివహము రప్పింపు యజ్ఞనిలయంబునకున్. 13

సీ. నైమిశారణ్యపుణ్యక్షేత్రమున మించు గోమతీనదితీరభూమియందుఁ
జాల్పు వెడల్పును శాస్త్రరీతి నెఱుంగు చతురశిల్పాచార్యజనులచేత
మఖమండపంబు నిర్మాణంబు సేయింపు మమ్మఖశాలకు నన్నియెడల
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రప్రముఖులు నిల్వఁ దగుఅచ్చుకొట్టములను

తే. బొక్కసపుటిండ్లు నుగ్రాణముల నెలవులుఁ, బాకశాలలు మఠము లనేకభోజ
నార్హశాలలు పటశాల లాపణములు, గరిరథతురంగశాలలుఁ గట్టఁ బనుపు. 14

ఆ. చలువచప్పరములుఁ జలివిందరులు నెడ, నెడలఁ గలుగఁ జేయు మెప్పటికిని
విపణివీథులందు వివిధవస్తువు లమ్మ, కొనుఁ డటంచు వైశ్యజనుల కనుము. 15

సీ. సెనగలు గోదుమల్ మినుములుఁ దిలలుముద్గములుమున్నుగఁ గలకాయధాన్య
ములు పర్వతాకారములు గాఁగఁ బోయింపు తండులరాసులఁ దఱుచుగూర్పు
దధిఘృతతైలముల్ మధుగుడశర్కరల్ కదళీఫలాదులు కందమూల
ములతెగల్ దెప్పింపు పలుగాయగూరలు చాల నిప్పటినుండి సంగ్రహింపు
తే. మనఘ మఖసాధనము లైనయఖిలవస్తు, సమితిమునుగల్గఘటియింపుశతసహస్ర
సంఖ్యల రహించుగోవుల సర్వరత్న, భారకోటులజతగూర్చి పనుపు మటకు. 16

క. వివిధోక్తుల నేఁ దెలిపిన, యవియును నేఁ దెలుప మఱచినవియును జతగూ
ర్పవలయు నని లక్ష్మణుతోఁ, రవికులపతి దెలిపి మఱి భరతుతో ననియెన్. 17

ఉ. పౌరుల నిష్టబాంధవులఁ బ్రాజ్ఞుల నంతిపురంబుకాంతలన్
దారకులన్ భటాదికులఁ దల్లుల నాశ్రితులన్ ధరాసుతా
కారసువర్ణపుత్త్రికను గ్రక్కున నధ్వరశాలఁ జేర్చు మీ
చేరినవస్తువాహనవిశేషము లేమఱకుండు మచ్చటన్. 18

క. యాగమునకు శత్రుఘ్నుని, వేగంబునఁ బిల్వఁ బనుపు విసువక మఖశా
లాగతు లగుయతులకు న,భ్యాగతులకుఁ బూజ సేయు మన్వహ మచటన్. 19

క. అని నిర్దేశించినఁ దన, యనుమతి నేకాగ్రచిత్తులై విసువక య
ప్పను లెల్ల సంఘటించిన, యనుజన్ముల మెచ్చి రాముఁ డనురాగమునన్. 20

క. సంపూర్ణాంగము లక్షణ, సంపన్న ముదీర్ణకృష్ణసారం బగుచున్
బెంపొందుహయము వెంబడి, బంపెన్ లక్ష్మణు ననేకబలసహితముగన్. 21

చ. అతఁడు ననేకసైనికసమన్వితుఁడై బహుఋత్విగావళి
యుతుఁ డయి శత్రుభీకరబలోద్ధతుఁడై చతురంతధారుణిన్
గ్రతుతురగంబుఁ ద్రిప్పె భుజగర్వము దక్క సమస్తధారుణీ
పతులును భీతులై తన కుపాయనముల్ దగ నిచ్చి కొల్వఁగన్. 22

ఉ. రాజకులాభిరాముఁ డగు రామునితమ్ముఁడు లక్ష్మణుండె యి
త్తేజికి రక్షకుండు ధరధీరులు గల్గినఁ బట్టుఁ డటంచు న
వ్వాజిలలాటపట్టమున వ్రాసినవ్రాల్ గని దానిఁ జేర రే
రాజులు భీతులై తమపురంబుల చెంతల సంచరింపఁగన్. 23

సీ. దక్షిణక్షితిధరోద్యద్గోపురద్వారమరకతాంశుకఘాసనికర మొలసి
పశ్చిమక్ష్మానాథపట్టణప్రాకారనిర్మలస్ఫటికాభ నీడఁ జూచి
యుత్తరోర్వీశబాహ్యోద్యానభూరుహచ్ఛాయాంతరముల విశ్రాంతిఁ జెంది
ప్రాగ్ధరాధీశ్వరప్రత్యగ్రకేళీకానీరజాకరముల నీరు ద్రావి
తే. మఱియుఁ దక్కినధారుణీమండలముల, స్వైరవృత్తి నటింపుచు జానకీమ
నోహరాధ్వరమఖముక్తవాహ మలరె, శక్రజిద్వైరిరక్ష నేజడుపు లేక. 24

ఉ. అంతకు మున్నె రామవసుధాధిపుఁ డాశ్రితబంధుమంత్రిసా
మంతనృపాప్తమిత్రభటమండలి గొల్వఁగ గోమతీనదీ

ప్రాంతము: జేరి యందు భరతాదుల నధ్వరసాధనక్రియా
వంతులఁ గూర్మిఁ జూచి తగుసౌఖ్య మందఱ నాదరింపుచున్. 25

శా. నానాభూములనుండి వచ్చిన నరేంద్రశ్రేణులన్ బంధులన్
భానుప్రోద్భవుని న్విభీషణునిఁ దత్ప్రావాస్యస్థులన్ బ్రాంచిత
స్థానాభ్యంతరసీమలందు విడియింపన్ బంచె శత్రుఘ్నునిన్
శ్రీనిండార నృపాలుఁ డట్లు విడియించెన్ వారి నమ్మేటియున్. 26

వ. మఱియును. 27

సీ. బ్రాహ్మణక్షత్రియప్రముఖులఁ బూజించుపట్ల నేమఱకుండు భరత యనుచు
గెలఁకులనుండి కావలయు మార్గవస్తువు లంది యిమ్ము శత్రుఘ్న యనుచు
నడుమ వారలకు లే దనక యిష్టపదార్థరాసు లిమ్మా కపిరాజ యనుచుఁ
గ్రతువిఘ్నకరులశిక్ష యొనర్చి క్రతుప్ర రక్షణ యొనర్పుము విభీషణ యటంచుఁ
తే. గొడవ వడినవి వేవేగఁ గొంచువచ్చి, నియతి నెఱవేర్పుభారంబు నీది సుమ్ము
వాయునందన యనుచు భూవరుఁడు వారి, వారి నియమించె నుచితప్రవర్తనముల

ఉ. మించిన వేడ్కనట్లు నియమించి నృపాలుఁడు కాంచనేష్టికో
దంచితభూస్థలంబు ఖదిరాదికయూపయుతంబు రుక్మప
క్షాంచలపక్షిరాజచయనాఢ్యము సౌమఖవాటముం బ్రవే
శించె బులస్త్యకశ్యపవసిష్ఠభృగుప్రముఖార్యసమ్మతిన్. 29

తే. ఇవ్విధమున బ్రవేశించి యెల్లజగము, లెల్ల రక్షింప దీక్ష వహించినట్టి
యాగదీక్షావిచక్షణుఁ డపుడు యజ్ఞ, దీక్ష వహియించె సకలదిదృక్షు లలర. 30

సీ. స్థండిలస్థితయూపసంయుక్తపశుప్రోక్షణాక్షీణతంత్రయుగ్యాజకంబు
హోతృహస్తపవిత్రజాతవాతప్రజ్వలితకీలికీలికావృతనభంబుఁ
బరమాన్నపృషదాజ్యచరుపశామిక్షాదిహోమజస్వాహారవోల్లసితముఁ
దత్తత్క్రియాహృష్టతరసభాస్తారలోకముహుర్ముహుశ్శిరఃకంపనంబుఁ
తే. జంచదుద్గాతృసామగానాంచితంబు, విశ్రుతాధ్వర్యుఋగ్యజుర్వేదమంత్ర
నికరమకలుషహవిరర్థనిర్జరప్ర, శాంతికరరాజ్ఞ మగుమ నాజన్న మమరె. 31

చ. భరతునిచే ధరామరులుఁ బార్థివముఖ్యులు నన్నపానవి
స్ఫురణలఁ దృప్తులై ముదముఁ బొందిరి బ్రహ్మఋషుల్ విభీషణా
ర్చితసపర్యలన్ గడుఁ బ్రసన్నతఁ జెందిరి యాచకుల్ విభా
కరసుతుఁ డిచ్చు నర్థముల కాంక్షలు దీఱి సుఖించి రయ్యెడన్. 32

చ. ఎడపక యేడుఁగాల మిటు లేఁగఁగ లక్ష్మణుఁ డంతలోనఁ ద
త్తడిఁ గొని తెచ్చినన్ నృపతి తద్దయు వేడుక యాగకృత్యముల్
నడుపుచునుండె విప్రులు దినంబును భోజనదక్షిణాదులన్
గడు ముదమంది రందఱును గాంక్షితముల్ గని రమ్మఖంబునన్. 33

చ. వలసినవారికిన్ వలయు వస్తువు లన్నియు నిత్తురే కదా
నలిసహితాత్మజాదికపినాయకు లొల్లక యున్నవారికిన్
బలిమిని బిల్చి భోజ్యములు భక్ష్యములున్ ధనరత్నభూషణా
వళులును గంధమాల్యము లవారిగ నిత్తురు సార్వకాలమున్. 34

చ. వలసినభోజనాభరణవస్త్రధనాదులఁ జెంది తృప్తులై
పలుమఱుఁ జాలు చాలు నని పల్కెడువారలె కాని మాకుఁ గా
వలయు నొసంగు మం చనెడువారల ముందునకైనఁ గాన నా
స్థలమున జానకీవిభునిజన్నము వైభవ మెంచ శక్యమే. 35

తే. అర్థులెల్లఁ గృతార్థులై రందువలన, వ్యర్థులై రన్నదాతలు వసుధలోన
లేమి కెచ్చోట వసియింప గీము లేక, తజ్జనులనామములయందె తావుకొనియె.

చ. మలినులు లేరు లేరు కృశమానశరీరులు లేరు పేద ల
న్నెలవున నున్న యందఱు మణీమయభూషణభూషితుల్ సము
జ్జ్వలకనకాంబరుల్ మలయజస్రగవారితగంధగంధిలా
ఖిలదిశు లంచితార్థజితకిన్నరనాయకు లెంచిచూడఁగన్. 37

ఉ. ఆమఖవైభవంబునకు నద్భుత మంది మహర్షు లెంచి రా
రా మును బ్రహ్మ చేసిన మహాధ్వరమున్ మఘవంతుయజ్ఞమున్
సోమునియాగమున్ దపనసూనుహవం బుదధీశుహోమ మీ
రామునియశ్వమేధమఖరాజముతోఁ బ్రతిసేయవచ్చునే. 38

సీ. ఖర్వమహాఖర్వకైలాసములు కుప్ప వేసినచో నింత వెండి యగునె
శతకోటికాంచనాచలములబంగారు గూడఁబెట్టిన నింత పైఁడి యగునె
యర్బుదాయుతరోహిణాద్రిమణుల్ పోగొనర్చిన నిన్నిరత్నంబు లగునె
యమితకల్పమహీరుహము లొక్కదిక్కున నిలిచి యిచ్చిన నిన్నివలువ లగునె

తే. నూఱులక్షలు కామధేనువులుగూడి, యన్నియును బోటికొసఁగిన నిన్నిసముచి
తాంచితపదార్థనిచయంబు లవునె సవన, మిట్టులొనరించిరే తొల్లి యెవ్వరైన.

తే. అవనిజామాతృతాప్రేమ నర్కకులుని, కాత్మగతబీజనిచయంబు లన్నియును మ
ఖార్థమర్పింపఁదొడఁగెనో యనఁగ నక్ష, యంబులైనవి వివిధధాన్యంబు లిచట.

క. ధనసామగ్రియు నానా, జనసామగ్రియును రామజనవిభునకుఁ గ
ల్గినకతన నమ్మహోత్సవ మొనరించెన్ గాక లేక యొరులకు వశమే. 41

మ. అని సభ్యుల్ గొనియాడఁగా రఘుకులాధ్యక్షుండు సంవత్సరం
బును బూర్ణంబుగ సాంగదక్షిణలచేఁ బొల్పొంద యాగంబు సే
యు నెడన్ దన్మఖవైభవంబు గనఁగా నూహించి వాల్మీకి శి
ష్యనికాయంబుఁ బ్రశిష్యసంఘము భజింపన్ వచ్చె నచ్చోటికిన్. 42

క. వచ్చినయమ్మునిచంద్రుని, హెచ్చినరహిఁ నెదురుకొని నరేశ్వరుఁ డర్ఘ్యం
బిచ్చి సపర్యల నాతని, యిచ్చ యలరఁ గుశల మడిగి యిట్లని పలికెన్. 43

చ. వరమునిచంద్ర మీ రిటకు వచ్చుట నామఖమున్ ఫలించె మీ
చరణయుగంబు సోఁకి క్రతుశాల పవిత్రతఁ జెందె మామకా
ధ్వరవిధి పూర్ణ మౌ నదనుక వచ్చినయమ్మునుబట్ల మీరు నిం
దిరవుగ నిల్వుఁ డంచు విడియించెఁ దదర్హగృహాంతరంబునన్. 44

కుశలవులు వాల్మీకియాజ్ఞచే రామునికడకేతెంచి రామాయణముసు గానము సేయుట

చ. ప్రశమనశీలుఁ డమ్మునియు భక్తిమెయిన్ దను వేఁడుకొన్నయ
ద్దశరథరాముమాట జవదాఁటక తత్క్రతుదర్శనక్రియా
వశుఁ డయి యందు నిల్చి పటువైణికఆఖ్యుల నాత్మశిష్యులన్
గుశలవులన్ మనోజనలకూబరతుల్యులఁ జూచి యిట్లనున్. 45

చ. ప్రవణత మీఅ మీరు కవ పాయక రామకథాప్రపంచ మీ
యవనిపుకొల్వుకూటమున నధ్వరశాలల మౌను లున్నచో
ట్ల విపణివీథులన్ వనములన్ బహురాజసభాంతరంబులన్
గవిజనసన్నిధిన్ జదువఁ గా వలయున్ జను లందఱున్ వినన్. 46

చ. స్వరములుఁ దాళముల్ లయలు సారపుమీటుకొలంబు లేర్పడన్
జిరముగ మీకు నారదుఁడు సేసిన శిక్ష ఫలింప నింక మీ
రిరువురు వీణె లూని దిన మిర్వదిసర్గలలెక్క రాఘవే
శ్వరుసభఁ బాడుఁ డవ్విభునిచారుచరిత్రము సభ్యు లౌ ననన్. 47

మ. ఫలమూలాశను లై ధనేచ్ఛ వహియింపన్ బోక రామాయణం
బెలమిన్ రేపటినుండియున్ దొరఁకొనుం డెవ్వారు మీ రంచుఁ గే
వలమైత్రిన్ రఘుభర్త మి మ్మడిగినన్ వాల్మీకిమౌనీంద్రుశి
ష్యుల మంచున్ వచియింపుఁ డవ్విభుఁ దలంపుం డాత్మలోఁ దండ్రిగన్. 48

ఆ. ఏల యంటిరేని నిలజేనిఁ బ్రజ కెల్లఁ, దండ్రిగాఁ దలంపఁ దగవు గానఁ
దెలిపినాఁడ నటులఁ దలఁపుఁ డవ్విభు నంచు, నానతిచ్చె నమ్మహర్షివిభుఁడు. 49

ఉ. ఆయతి యానతిచ్చినక్రియన్ జగతీసతిముద్దుమన్మలా
రేయిఁ గ్రమించి వేగుటయు రేపటికృత్యము లెల్లఁ దీర్చి వీ
ణాయుతపాణు లై మునిగణంబుల సన్నిధి రాజులొద్ద దే
వాయతనంబులన్ విపణులందును గావ్యము పాడుచున్ రహిన్. 50

చ. సమయముఁ జూచి యొక్కదివసంబునఁ రామునియజ్ఞశాల క
ర్మొక్కమిరులు పోయి యందుఁ గవఁ గూడి విపంచిక లూని తాన మా
నములును రాగముల్ వినవినన్ జెలు వై చెవు లాన నందఱున్
బ్రమదపయోధిలో మునుఁగఁ బాడిరి రామచరిత్ర మింపుగన్, 51

తే. శ్రుతులు బెరయుట స్వరములచొప్పు విడక
చాలశుద్ధతఁ గనుట దోషములఁ బాసి
ఘనవిధముగాన షడ్జంబుఁ గలసి మెలసి
యక్కవలవారిగానంబు సొక్కొనర్చె. 52

చ. మదిఁ గన వారిగానమహిమం బది యెట్టిదొ వార్ధ లెల్ల నొ
క్కదెసనె నిల్చిన ట్టులివుఁ గాంచినయట్టి సభాస్థలంబునన్
బెదవిఁ గదల్చి పల్కఁ డొక పెద్దయుఁ దద్దయు సద్దు మాన్పుచున్
గదలక చిత్రరూపములకైవడి నుండిరి పాటసొక్కునన్. 53

చ. కొలువున నున్న రాజవరకోటులదివ్యమణీవిభూషణా
వళులఁ గరంగి నీరయి ప్రవాహగతిన్ బ్రవహించె నన్నచో
సలలితజానకీతనయసారసుధారసచారుగానభం
గులకుఁ గరంగు టెంత యతికోమలసభ్యజనాంతరంగముల్. 54

మ. పదసందర్భము లర్థకల్పనలు శబ్దస్ఫూర్తు లుత్ప్రేక్షలిం
పు దలిర్పన్ ముని యాచరించినజగత్పూజ్యాదికావ్యంబులో
మొదటన్ జెప్పిన కొన్నిశ్లోకములు సమ్మోదంబుతో నాలకిం
చి నరేంద్రాన్వయభర్త యక్కుమరులం జేసన్న వారింపుచున్. 55

మ. సమయార్హం బగు హోమకృత్యములు నిష్ఠన్ దీర్చి రమ్యప్రదే
శమునన్ గొల్వయి కూరుచుండె మును లాచార్యుల్ మహీశ్రోత లా
గమతంత్రజ్ఞులు శాస్త్రవేత్తలు కవుల్ గాణల్ పురాణజ్ఞు లా
ప్తమణుల్ మంత్రులుఁ దమ్ము లాశ్రితులు భూపాలు ర్హితుల్ గొల్వఁగన్. 56

క. కొలువుండి యక్కుమారులఁ, బిలిపించి సమీపభూమిఁ బ్రీతి వసింపన్
సెలవిచ్చినఁ బ్రతిబింబయు,గళమున్ వలె నున్నవారిఁ గనుఁగొని సభ్యుల్. 57

ఉ. ఈముఖకాంతు లీనగవు లీకనుదామర లీయెలుంగు లీ
చామనచాయ లీయెగుభుజంబుల పొంకము లీయురంబు లీ
కోమలమూర్తు లీవచనగుంభనలున్ గనుఁగొన్న గట్టిగా
రామునిలీల మించి రభిరామశరీరులు వీర లెవ్వరో. 58

ఉ. హారకిరీటకుండలభుజాంగదవస్త్రసుగంధమాల్యముల్
వీరు ధరింప కీజటిలవేషము లేటికిఁ దాల్చిరో శుభా
కారవిలాససంపదలఁ గంతుజయంతుల ధిక్కరించినా
రేఋషిపుత్రులో ఋషుల కెక్కడి వీమహనీయరూపముల్. 59

చ. అని తమలోనఁ దాము ప్రజ లాడెడిసుద్దులసద్దు లొక్క పె
ట్ట నెగసె నంత లక్ష్మణుఁ డడంచెఁ గరాంబుజసంజ్ఞ నప్పు డ
జ్జనకకుమారి కాత్మజులు సారెలు చక్కఁగఁ బెట్టి మేళవిం
చినకవవీణియల్ మొరయఁ జేయుచుఁ బాడిరి రంగురక్తులన్. 60

క. నారదనిగదితసంక్షే,పారూఢప్రథమసర్గ యాదిగ నాఁ డిఁ
పారఁగ నిరువదిసర్గలు, వారలు వినిపించి రచటివారలు మెచ్చన్. 61

చ. స్వరము లఁబూరె మేలు శ్రుతి చాగురె మూర్ఛన కంపితంబు బా
పురె బళి రయ్య డాల్ సెఱసెఁ బో నెఱమీఁటు కులంబుతాయి యు
ద్ధిర స్ఫురితంబు లమ్మ యని తేనియ లొల్కెడి వారిపాట లా
దరణము మీఱఁగాఁ విని ముదం బొదవన్ బళి మెచ్చె నెమ్మదిన్. 62

క. ఈలీల మెచ్చి పతి పది, వేలవరా లిమ్ము భరత వీరికి మఱియున్
లోలత నడఁగిన వన్నియు, వాలాయ మొసంగు మనిన వారలు నగుచున్. 63

చ. కరములు మోడ్చి యోనృపశిఖామణి కానలఁ దాపసస్థితిన్
బరఁగుచుఁ గందమూలముల భక్షణ సేయుచు నుండు మాకు దే
వర యిపుఁ డానతిచ్చిన సువర్ణము లేమిటి కేల నన్యవ
స్తురతి యటన్న లేనగవుతోఁ బతి వారలఁ జూచి క్రమ్మఱన్. 64

చ. అనియె గుణాఢ్యులార నిజ మూ నది యాకృతి యెవ్వ రాచరిం
చియది యేప్రమాణమునఁ జెల్వగు నెవ్వని దీచరిత్ర మిం
దుల కభిధాన మే మెలమితో నిది యెవ్వరివంక నేర్చినా
రనిన వినీతులై కుశలవాహ్వయు లిట్లని రమ్మహాత్ముతోన్. 65

సీ. ఇనవంశశేఖర ఈకావ్య[illegible]ంచిన సుకవి వాల్మీకిమౌని
రామాయణం బనునామంబు దీనికిఁ గావించె నది భవత్కథయ సుమ్ము
విను మిరువదినాల్గువేలగ్రంథం బిది యేనూఱు సర్గల నింపుఁ గులుకుఁ
బట్టాభిషేచనపర్యంతకథ లాఱు కాండంబుల రచించెఁ గడపటికథ

తే. నవల నుత్తరకాండంబునం దమర్చె, నమ్మహా[illegible]ాని యతనిదయానిరూఢి
నేము నేర్చితి మిది విన నిచ్చగల్గె, నేని వినఁ దగు దినమును నిర్విధమున. 67

వ. అని మఱియు నిట్లనిరి.

క. ఇమ్మఖనిష్ఠలు దీర్చిన, పిమ్మట నొకకొంతసేపు ప్రియమున నికా
వ్యమ్ము వినవలయు మాగీ,తమ్ములు సాఫల్య మొంద ధరణీశ యనన్. 68

ఆ. సమ్మతించి రామజనపతి బహుమతి, వెలయ వారిఁ బనిచి ద్విజపురోహి
తార్యబంధుసహితుఁ డై యాగమండపా,భ్యంతరమున నుండె నర్హవిధుల.

చ. దినదిన మిట్లు వచ్చి జగతీసతిమన్నలు పువ్వుఁదేనె వం
చినగతిఁ గప్రపుర్ రజము చిందిన కైవడి జాజిపొట్లముల్
మునుకొని విప్పినట్టు లతిమోహనగానకళానిరూఢి న
య్యనఘులు మ్రోల నచ్చరిత మిం పెసఁగన్ వినిపించుచున్నెడన్. 70

చ. జనవరుఁ డంత నొక్కదివసంబున వారితనూవిలాసముల్
గనుఁగొని జానకీరమణికై వడి నున్నవి వీరిరూపు ల

వ్వనజదళాక్షికిన్ మును కవల్ జనియించి రటంచు వింటి న
త్తనయులె యీశుభాకృతులు తక్కిన నీ చెలువంబు లుండునే. 71

చ. జడలు ధరించి కృష్ణమృగచర్మములున్ బలునారచీరలున్
గొడుగులుఁ దానుఁ గట్టుకొని కూరలఁ గాయల ద్రుంతు మాన్పుచున్
గుడికొనునంత రేవగలుఁ గుందుచు నెంత నలంగియున్నదో
యడవులలోన సీత యకటా యిఁకఁ జూడక యెట్టు తాళుదున్. 72

ఉ. క్ష్మాసుతఁ బాసి నేను బహుకాలము తాళితి ధైర్యశాలినై
యాసతిఁ బిల్వ నంపి ప్రజలందఱు నమ్మికఁ జెంద నీసభన్
బాస యొసర్ప బంచి యిఁకఁ బావని యౌ నెఱిఁగింపకుండినన్
నాసుతు లంచు వీరిఁ బ్రజ నమ్మునె యంచుఁ దలంచి చెప్పెఁదన్. 73

తే. చెంత నిలుచున్న శత్రుఘ్నుఁ జేరఁ బిలిచి, పతికె నిటు లని యోవత్స పవనసుతవి
భీషణసుషేణులను వెంటబెట్టుకొని యకల్మషుండైన వాల్మీకిఁ గానఁబోయి. 74

రఘుపుంగవుండు వాల్మీక్యాశ్రమంబున నున్న సీతం బిలిపించుట

చ. జనకజ ధర్మచారిణియు సాధ్వియు నోట యెఱింగియుండియున్
జనులొనరించునిందఁ బెఱఁ జాలక వీడినమాత్రమంతె యి
జ్జనులకుఁ బ్రత్యయం బొదవ సభ్యులలో శపథంబుఁ బల్క న
వ్వనజదళాక్షిఁ దోడుకొని వచ్చుట మే లను మమ్మునీంద్రుతోన్. 75

క. ఈమాట కమ్మహామునిని, యేమని ప్రతిభాష లానతిచ్చునొ సీతా
భామిని హృదయస్థితిఁ గని, యే మనునో యదియు దెలిసి యేతెం డనినన్. 76

ఉ. స్వామి మహాప్రసాద మని వారలు నల్వురు నమ్మహాముని
గ్రామణి యున్నచోటి కధికత్వర నేఁగి నమస్కరించి శ్రీ
రామనృపాలుమాటల తెఱం గెఱిఁగింప నతండు వల్కెఁ దా
నేమి దలంచె నట్ల ఘటియించు ధరాసుత శంక యేటికిన్. 77

క. పతిదేవతాశిరోమణి, క్షితిసుత శపథంబు సేయు సిద్ధము రేపా
క్షితిపతికిఁ దెల్పుఁ డిది యని, యతఁ డనిచిన వారు వచ్చి యధిపతితోడన్. 78

ఉ. అమ్మునిమాట లెల్ల వినయమ్మునఁ దెల్పిన రాముఁ డెంతయున్
సమ్మద మంది యందుఁ గలసభ్యుల నందఱఁ జూచి యెల్లలో
కమ్ములు మెచ్చ రేపు జనకప్రభుకన్యక యీసభన్ యథా
ర్థమ్ముగఁ బూని పల్కు శపథంబు వినం దగు మీఱ లిందఱున్. 79

చ. శపథము సేయుచో నయిన జానకి సత్య మెఱుంగుఁడీ యనన్
దపసులు ధారుణీపతులుఁ దక్కినజాతులవారు బాంధవుల్
కపులు నిశాచరుల్ హితులుఁ గౌతుకవిస్మయభీతిమగ్నులై
రపుడు నృపాలుఁ డాజనుల నందఱ నిండ్లకుఁ బంచె నాఁటికిన్. 80

వ. ఇవ్విధంబున సభాసదుల నందఱ విడిదలకుఁ బనిచి ననిచిన ముదంబున నత్త
పనవిభావరిష్ఠుం డవ్విభావరిష్ఠుఁ గ్రమించి మఱునాఁ డరుణోదయంబున గోమతీ
జలంబులఁ బ్రాతఃకరణీయంబు లొనర్చి యగ్నిహోత్రాదిదేవతార్చనంబు లాచరించి
సముచితప్రకారంబున బహిర్మండపంబు ప్రవేశించి భరతాదిసోదరులును సుగ్రీ
వాదివానరులును విభీషణాదిరాక్షసులును విదేహరాజ కేకయరాజ ప్రముఖ
బాంధవులును బ్రవర్ధనాదిమిత్త్రులును సుమంత్రాదిమంత్రిజనంబులును మధు
మద్విజయభద్రాదినర్మసఖులును బరివేష్టించి కొలువ నిండుకొలు వుండి పృథివీ
సుతాకథితావితథశపథవచోవిధాశ్రవణకుతూహలంబునన్ బఱతెంచిన వసిష్ఠ
వామదేవ దేవలపులహపులస్త్య కశ్యపాగస్త్య విశ్వామిత్త్రఋచీకాగ్నిమిత్త్ర
మైత్త్రేయభృగుచ్యవనపరాశరాత్త్రేయకాత్యాయన గౌతమ శ్వేతశాతాతప
సుతీక్ష్ణోపరతంతుభరద్వాజవాలఖిల్యశాండిల్యమాండవ్యవిభాండకమార్కండేయ
కౌండిన్య కణ్వప్రస్కణ్వప్రదేవశ్రవఋష్యశృంగ మతంగమంకణాంగిరసశతా
నందమందపాల జాబాలి గాలవ పైలపౌలస్త్యదుర్వాసపర్వతనారదదధీచిపిప్ప
లాదప్రముఖమహర్షులకుఁ బ్రత్యుత్థానాదు లొనరించి యుచితాసనంబుల నుండ
నియమించి పాంచాలమాళవగౌళచోళమలయాళమగధమత్స్యమద్రద్రవిడ
విదర్భశకసింధుగాంధారసౌవీరకేరళకాశ్మీరచేది ప్రముఖనిఖిలదేశాధినాథులసపరి
వారంబుగాఁ దగుచోట్లం గూర్చుండ నియోగించి బ్రహ్మక్షత్త్రియవైశ్య
శూద్రులఁ దక్కిన పౌరజానపదాదిప్రకృతిజనంబులు నానాదిగంతరాగతవిద్వ
త్కవినటగాయకప్రహాసకముఖయాచకనివహంబులు నలుదిక్కులన్ గిక్కిఱిసి
నివసింప నిలింపవిభువైభవంబునన్ బొంపిరివోవుచుఁ బ్రాచేతసాగమనంబు బ్రతీ
క్షింపుచున్నయెడ నక్కడ వాల్మీకిమునీంద్రుండు దొలినాఁడు నిజాశ్రమంబున
నున్నజనకనందనన్ దాను విడిసిన గోమతీతటాశ్రమంబునకుఁ బిలిపించిన
వాఁడు గావున నద్దేవి నవలోకించి తల్లీ భవద్వల్లభుఁ డగురఘువంశవల్లభుండు
నీయుల్లంబు తెల్లంబుగాఁ దెలిసియుఁ బ్రల్లదంబులు వలికిన క్షుల్లకజనంబులు
విశ్వసింప విశ్వవర్ణితబ్రహ్మర్షీశ్వరసభామధ్యంబున నీచేత శపథంబు లాడింపఁ
దలంచి నిన్ను వెంటఁబెట్టుకొని రమ్మని నన్నున్ బనిచినవాఁ డతనివచనం బలంఘ
నీయం బదిగాక నినువంటిపతివ్రతలకుఁ బతియనుమతిం బ్రవర్తించుట స్వభావ
సిద్ధము గదా యని తెలిపిన నప్పల్లవపాణి ప్రాణేశ్వరసందర్శనంబు నేఁటి
కయిన నీనెపంబునన్ గలిగెఁ గదా యను మోదంబును దనపట్టంపుదేవిపై నిట్టి
వట్టిసంశయంబులు పుట్టిన నప్పట్టభద్రుండు రచ్చం బెట్ట నెట్టు దలంచెనో యను
ఖేదంబును మనంబునన్ బెనంగొనఁ గనుఁగొనలన్ బొటిల్లుకాటుక కన్నీరు
తెప్పలతుద నప్పళింపుచు నప్పరమతపస్విదిక్కు మొక్కులు నిగిడించి మహాత్మా
యెట్టిపుట్టువునఁ బుట్టిన నెంతవానిచేఁబట్టిన నెట్టియిల్లు మెట్టిన నాఁడినోములు

నోఁచిన ననువంటిమచ్చెకంటికిఁ దత్ఫలం బనుభవింపక పోవచ్చునే రచ్చలోనికి వచ్చి శాస యిచ్చి పొమ్మని పుడమిఱేఁడు నొడివినమాట జవదాఁటఁ గూడునే మంచిది తామసింప నేల విజయఁబు చేయుం డని తెగువ దోఁపం బలికి కమలసంభవుని వెనుకొను కమలామహాదేవిచందంబున డెందంబునఁ జాయనిశోకాంధకారంబు వెనుక వేసికొనెనన నపరభాగంబునఁ గనుపట్టు కీలుగంటుతో భుజపత్త్రవల్కలోత్తరీయంబున నాచ్ఛాదించిన ఘనస్తనకనకకలశయుగళంబుతోఁ బ్రపదంబులపై దిగజాఱఁ గట్టిన వలిపెంపునారచీరలతో బహుకాలపరీతరఘువల్లభాయల్లకభరంబునఁ గృశియించిన మోహనాంగకంబులతో నిటలతటంబున నెఱసినచికురనికురంబుతోఁ గపోలముకురంబులపై దిగజాఱు నయనఖంజనాంజనసమంజసాశ్రుజలధారాప్రవాహంబుతో నప్పటప్పటికి నిగిడించునిట్టూర్పుసెగలఁ బొగిలినచిగురుమోవితోఁ జిన్నఁబోయినచిన్నారి ముద్దుమొగంబుతో నాద్యంతంబులఁ దాను బడినయలజడితలంపునఁ బుట్టు నివ్వెఱపాటునం జేడ్పడుచిత్తంబుతో మహాసభామధ్యంబున నెట్టుకొని నిలిచి నిర్లజ్జనై యెట్లు మాటలాడుదు ననుభయంబునఁ బొడము స్వేదకంపంబులతో నిన్నియగచాట్లకు లోనయ్యుఁ దనవలెఁ బ్రాణంబుపై నాసఁ బూనినమానవతులు గలరే యనుతలంపునఁ బొడుకొను దీనభావంబుతో గడగడ వడఁకు నెన్నడుముతో నెడనెడఁ దడఁబడు నడుగుఁదామరలతోఁ దల్లీ నీకడుపునఁ బుట్టి యిట్టిఅట్టున కొడిగట్టితింగదా యనుసిట్టలఁపునగవునఁ బుడమిపై నెలకొల్పు చూడ్కులతో దైవంబు నలువురిలోఁ దన్ను దలవంచికొనం జేసెఁగదా యనువిన్నఁదనంబున వంచినశిరంబుతోఁ గరకమలంబులు ముకుళించుకొని యవ్వాలుఁగంటిమిన్న పంటవలంతియల్లుఁడు కొలువున్న బహిర్మండపంబునకు వాల్మీకివెంట నరుగుదెంచునప్పు డయ్యెప్పులకుప్పం దప్పక చూచి కన్నులఁ జిప్పిలుశోకబాష్పధారలతో నయ్యయో తల్లీ రామభద్రునంతటి పట్టభద్రునిఁ జెట్టపట్టిన నిన్నువంటిసౌభాగ్యవతికి నట్టడవుల నెట్టుకొని నారచీరలుగట్టుకొని యిట్టి యగచాట్లకు లోఁబడవలసెఁగా యనువారును నీయుత్తమురాలి గుణవిశేషంబు లెఱింగియుఁ బతంగకులపుంగవుం డంతరంగంబునఁ గరుణ దొఱంగి యడవులఁ ద్రోచి యెంతసాహసంబుచేసెఁ జూచితిరే యనువారును నవనివిభుండు లోకాపవాదభయంబునఁ గళత్త్రాభిగమనంబు విడుచుట దొడ్డగాదతనిమాట జవదాఁటక యిప్పరమపావని తపోవనంబులు డాసి గాసి కోర్చి ప్రాణంబులు భరించుట దొడ్డనువారును నసువు లుడిగి వసుమతీపతిఁ బ్రజాపరంపరలచేత మాటలం బెట్టుట పాటి గాదని కాక లేకున్న నీలోకమాత కాకుత్స్థు నెడఁబాసి ప్రాణంబు లాశించునే యనువారును నేకపత్నీవ్రతుం డగురఘునాథుని ధైర్యస్థైర్యంబులు సీతాసతిపాతివ్రత్యసత్యంబులు నింతయొప్పునే యను

వాఁడును నై బహువిధంబులఁ బలుకునానాజనంబులకోలాహలంబులు నలు దిక్కులం బిక్కటిల్లి చతుస్సముద్రఘోషంబు లొక్కదిక్కున గ్రిక్కిఱిసినట్లు పెక్కసంత లొక్కటి యైన తెఱంగున బహుళకోలాహలంబు లక్కొలువునఁ గలిగి యుండె నప్పుడు సీతాశపథసంశ్రవణతత్పరత్వంబునఁ బితామహుండు మహేంద్రశమనవరుణ కుబేరాదిలోకపాలక వసురుద్రాదిత్య మరుత్తుషితామర గరుడగంధర్వసిద్ధసాధ్య యక్షకిన్నరకింపురుష నభశ్చరభాస్వర మహారాజిక ప్రముఖనిఖిలబర్హిర్ముఖసమన్వితుండై వచ్చిదివ్యమణిరమణీయవిమానకోటులతో జడదెల్ల నలంకరింపనయ్యెడబృందారకబృందమందారమాలికాగంధసంబంధమం ధరగంధవహుం డప్పరిమళమ్ముపై నోలసె నీలాగున భూలోకంబునఁ గలిగిన సకల జనసమూహంబులు దిగువనుండి కనుంగొన దేవలోకంబునం గలిగిన సకల దేవతాగణంబులు దివినుండి కనుంగొన సీతాంగనాసహితంబుగా నమ్మహాసభా మంటపంబు దఱియఁజొచ్చి రఘువీరుని పురోభాగంబున నిలిచి వాల్మీకిమహర్షి శేఖరుం డచ్చటి ప్రజలకలకలంబులు చేసన్న నివారించి యొంటన్నులై దివి నున్న దేవతలును సభ నున్న సమస్తజనంబులును నాకర్ణింపఁ బ్రావృడంభోదగంభీర ఘోషంబున ని ట్లనియె. 81

భూపుత్త్రి నిష్కల్మష యని వాల్మీకి సభాసదులు విన రామునితోఁ జెప్పుట

మ. దిననాథాన్వయ యీధరాతనయపాతివ్రత్యముఁ సత్యముఁ
గనియుఁ నీవు జనాపవాదగతశంకఁ నిందుచాలాలిఁ గా
ననసీమఁ దిగఁ ద్రోయఁ బంచుటయు దైన్యం బొంది యస్మద్వనం
బునకుఁ వచ్చి కుశుఁ లవుం గనియె నీపుణ్యుల్ భవత్పుత్త్రకుల్. 82

చ. విలసితధర్మచారిణి వివేకవతీమణి సీత సుస్వభా
వులు యమలార్భకుల్ కుశలవుల్ గ్రహియింపుము వీరి మువ్వురఁ
వల దనుమాన మొందఁ దిటువంటి మహాసభఁ జేసి కల్ల లేఁ
బలుకుదునయ్య బొంకినఁ దపంబు ఫలించునటయ్య వానికిన్. 83

చ. బుధనుతుఁ డౌ ప్రచేతసునిపుత్త్రుఁడనై శ్రుతులెల్ల నేర్చి నే
నధికతపోవిభూతిఁ జెలువంది యసత్యము లాడ నేర్తునే
యధిప మనోవచఃక్రియల నన్య మెఱుంగదు సీత క్షీరవా
రిధిసుతకుఁ హిమాచలవరేణ్యజకుఁ బ్రతి సద్గుణోన్నతిన్. 84

ఉ. చారుపతివ్రతాత్వమున జానకి పెద్ద క్షమాసమున్నతిఁ
ధారుణి పెద్ద ధైర్యసముదగ్రత మేరువు పెద్ద తప్పులే
దారసినాఁడ సీతహృదయంబు వియన్మరుదగ్నితోయముల్
సారసవైరిభాస్కరులు సర్వసుపర్వులు సాక్షిగా నృపా. 85

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముఁ
జేసిన నాతపంబు రహిఁ జెందక నిష్ఫల మౌ జనంబు వి

శ్వాసము నొందఁ జేయుటకు స్వాంతము గల్గిన మీరు కోరిన
ట్టీసభవార లెల్ల విన నియ్యమయున్ శపథంబు వల్కెడిన్. 86

మ. అని వాల్మీకిమహామునీంద్రుఁ డపు డయ్యాస్థాన మెల్లన్ గలం
గ నితాంతస్థితబుద్ధి నిట్లు వలుకన్ గాకుత్స్థరాణ్మౌళి చ
య్యన బద్ధాంజలియై వచించె ననఘాత్మా సీత లోకైకపా
వని యంచున్ మును లంకలోన దెలిసెన్ వహ్నిప్రవేశంబునన్. 87

చ. తెలిసియు లోకు లాడుసడి దీర్పఁగఁ గూడక యింత సేసితిన్
గల దపరాధ మోర్వుఁ డలుకన్ వల దిక్కువ లస్మదీయపు
త్రులగుదు రీపె సాధ్వి యగు రూఢిగ నింకొకసారి సీత యిం
దలిప్రజ లౌ ననంగ శపథం బొనరించినఁ జాల మేలగున్. 88

వ. అని మఱియు నిట్లనియె. 89

ఆ. అనఘ మీరు పలుకు నంతకంటెను సీత, యాడుశపథ మెంత యైన నిచటి
ప్రజల కాపె పలుకుపలుకునఁ గాని ప్ర,త్యయము పుట్టదనుచు నధిపుఁ డనిన. 90

భూమిదేవి సీతాదేవినిఁ గైసేసి రసాతలంబునకుఁ గొనిపోవుట

ఉ. ఆరఘువీరుమాటలకు నద్భుత మందిరి తత్సభాసదుల్
వారిజసంభవాదిసురవర్యులు మేలని మెచ్చి రచ్చటన్
సారసుమావళుల్ గురిసెఁ జల్లనివాసన లుల్లసిల్లఁగా
సారెకు గంధసారగిరిసారసమీరము వీచెఁ బైపయిన్. 91

ఉ. అప్పుడు సీత రాముని పదాంబుజముల్ హృదయాంబుజంబునన్
దప్పక నిల్పి ధీరత నుదఙ్ముఖ యై తలవాంచి ధాత్రిపై
నొప్పు నిజావలోకనము లుంచి కరాంబుజముల్ మొగిడ్చి తా
నెప్ప టెలుంగుతో సభికు లెల్లను విస్మయ మంద నిట్లనున్. 92

శా. రామస్వామిపదాంబుజంబు లెద నారాధింతు నేనిన్ సదా
రామాజ్ఞన్ జరియింతు నేనిఁ దగుజాగ్రత్స్వప్నసుప్త్యాదులన్
రామున్ దప్పనిదాన నౌటయు యథార్థం బేని నాతల్లి యో
భూమీ యీయెడఁ ద్రోవఁ జూపి ననుఁ గొంపోవమ్మ నీలోనికిన్. 93

వ. అని శతానందపురందరాదిబృందారకసందోహంబునకు నానందంబును సనకస
నందనాదికర్మందిబృందారకులకున్ బరమాద్భుతంబును నరవానరనిశాచరప్రము
ఖనిఖిలజనంబులకు శోకదైన్యంబులు నుప్పతిలన్ బలికిన యచ్చిలుకలకొలికి
పలుకులతోడనె శతకోటిశతకోటిఘోషంబు ననుకరించి సంవర్తసమయసము
దితజలధర సంఘసంఘర్షణోజ్జాత నిర్ఘాతజాతస్ఫీతనినాదంబు ననుసరించి ప్రళ
య వేళాభయంకరఫణీశ్వరాభగ్నింకమ దంష్ట్రాంకురఘోరముఖసహస్రమోము

చ్యమానవిస్ఫురత్కీలికాజాలకస్ఫులింగస్ఫుటాభీల రవానుకూల విశాలఫూ
త్కారవిరావంబు నధిగమించి యనల్పకల్పాంతకాలకంఠకాలదిక్కూలము
ద్రుజ ఢక్కాఢమఢమత్కారంబునకు సహకారంబై బ్రహ్మాండకరండఖండ
నోద్దండతాఖండతరావరణ వరుణాలయోత్తుంగజంఘాలతరంగసంఘాత ఘుమ
ఘుమార్భటికిఁ బ్రతిఘటించి తత్సభామధ్యరత్నగర్భాగర్భంబుననుండి యొక్క
దీర్ఘనిర్ఘోషం బావిర్భవించె నప్పుడంహస్సదనహిరణ్యాక్షుక్షుంహారరంహస్సమా
రంభవిజృంభమాణవరనృసింహసంభవావసరవిస్ఫుటత్సభాస్తంభగంభీరనిస్స్వ
నంబులకుఁ దోఁబుట్టువులగు పటపటార్భటులు సంఘటిల్ల నిలిచిన తటిల్లతవలె
నిలుచున్న పుడమిపట్టిక ట్టెదుటఁ బుడమి బిట్టువిసి పటిల్లునన్ బగిలిన యప్పట్టున
మహాభీలం బగు నొక్క మహాబిలంబు గనుపట్టె నట్టి బిలంబులోనుండి కుండలి
మండలేశ్వరకులదంష్ట్రాపటలచటుల ప్రశలకై వడి భోగవతీసరిత్తరంగమాలి
కలవలెఁ దత్తటినీతటనికటస్థితహాటకేశ్వర కఠోరకంఠకాలకూట కాంతులవలెఁ
దత్సహచర పారిషదచ్ఛటాజటారుణరుచులవలె బహిర్గతాంతరపయోధిబాడబ
జ్వాలికలవలెఁ గోమలశ్యామల దూర్వాదళాంకురోచులవలె వజ్రమౌక్తిక
నీలప్రవాళ పద్మరాగమరకతప్రముఖనిఖిలమణిరమసృణఘృణివిసరంబులు వెల్లి
విరిసి యచ్చటివారి కన్నులకు మిఱుమిట్లు గొల్పె నంత ననంత వాసుకి తక్షక
కర్కోటక జనమేజయప్రముఖ మహానాగపుంగవుల భంగతరాభోగభోగ
చిరత్నరత్నఖచిత కిరీటకుండలహారకేయూరకంకణాదివివిధభూషణభూషితులై
కాంచనవేత్రధారులగు నపరిమితనాగకుమారులతోఁ గాన్పించి యద్దేవికిం
బ్రణమిల్లి యనంతులన్ బూజిం రయ్యుదంచితాకృతుల దివ్యవస్త్రమాల్యా
నులేపనోల్లాసి వాసనావిశేష లాగుబ్బగా నమ్మంటపం బెల్ల ఘుమ్ముమనన్
గ్రమ్ముకొన నొయ్యెడ వినుకెం నునుకెంపుసొంపులతో నెఱుఱుపడఁగలవిడికెంపుల
పడగలఁజె వగుచిలువ చకోరాక్షులచేత నొక్కరత్నసింహాసనంబుఁ బట్టించు
కొని దేవి నాగ కాకమ్రకరాంభోజరాజద్ధవళచామర మరుచ్చలాచల
నీలాలకంబు ఫలకస్థలనిస్తులకస్తూరితిలకంబుతోఁ జెలికారంబుసలుపఁ
జల వెన్నెలల లవుఁ దెలుపు మవ్వంపుఁ జిఱునవ్వుల తెలుపు రదన
క్షోరకబ ంబులతోఁ బోం దొనర్ప రతిదర్పకమణిదర్పణప్రభల నెక్క
ంబు డుచొక్కపుఁ జెక్కులపైఁ దళుకొత్తు క్రొత్తముత్యాలకమ్మల
ాలువి ం సూప విద్యాధరకుమారికాపఠితగద్యపద్యాభికర్ణనానుమోదకర్ణో
త్పల దసమ్మోద సంచర చ్చంచరీకచంచత్తార ఝుంకారంబులు మీఱ మేరు
ష శిఖరోపరిస్ఫురితతారకావారకంబుడంబున నొప్పదలుచుఁ గుచోపరిదేశం
హారహారంబులు వెలుంగ మెఱుఁగుతీఁగలతో నొప్పుగులుకు కప్పుమొగులు
ఱుంగున్ దుఱంగలించు బంగరువిరులసరులసిరులతో గొప్ప కీల్కొప్పు

మిఱ్ఱారించమించులజిగిఁ దులకించు మంచి బురుసాచీరసరిగంచుల కించుకించుక
మించు నించుకళుకుహొంగిలుకు మెట్టియలావళి నవలంబించు పదకంజరంజత్కాం
జరాగమణిపుంజపింజరితమంజీరసనజాతశింజాధ్వనులు నిజాగమనంబు సభ్యాల
కెఱింగింపఁ గించిదవలగ్నలగ్నకాంచనకాంచికాసంకలితమణి సంకీర్ణకింకిణీరవం
బులు వాణికంకణక్రేంకారంబులకు లంకెపాటు పాటింప సాటిలేని శృంగార
విలాసచాతురీశోభఁ గూతునకు సాక్షాత్కరించి చేరవచ్చి మచ్చిక హెచ్చి గ్రుచ్చి
కౌఁగిలించి నేమం బడిగి కన్నీరు మున్నీరుగా వగచుచున్న యప్పుత్త్రి ననున
యించుచుఁ దల్లీ యేల చింతిల్లెద వెవ్వారికి దైవగతిఁ దప్పించ వచ్చునే యూఱ
డిల్లు మని యనిమిషకన్యకాకరకీలిత కనకకలశవిలసితభోగవతీసలిలంబుల ముఖ
ప్రక్షాళనంబుఁ గావించి కస్తూరిబొట్టు పెట్టి కొప్పు చక్కఁగ సవరించి మందార
కుసుమమాలికలు ముడిచి దివ్యాంబరాభరణాదుల నలంకరించి ఘనసారగంధ
సారకాశ్మీరకస్తూరికాదిపరిమళంబుల నలంది సిద్ధభామినీ సమర్పితకర్పూరనీరాజ
నాదుల విరాజమాన యగునమ్మానవతి నసమానమణిపీఠంబుపై నుంచుకొని
నలుగడల ముంచుకొని గంధర్వచారణయక్షకిన్నరపన్నగబాలిక లడపంబు
సురటి గిండి కాళాంజి మొదలయినవి ధరియించి యూడిగంబులు ఘటింప
నచ్చరలు నటింప నింద్రాది దేవతలు మందారకుసుమంబులు గురియింప శంఖమర్దళ
పణవగోముఖ ఢక్కాహుడుక్కాది దివ్యవాద్యఘోషంబులు మించ భుజంగ
పుంగవులు బంగరుబెత్తంబు లూని రాబరు లొనరింప రసాతలంబునకుఁ గొం
పోయె నమ్మహాప్రభావంబునకు నద్భుతంబు నొందుచు బ్రహ్మాది దేవతలందఱుఁ
దమలోఁ దమరు జగతీనందన పాతివ్రత్యధర్మంబుల నభినందించు నెలుం
గులు నంతరంగంబు గలంగి సీతాంగనఁ గన్గొని విలపించు నభాసదులయాక్రం
దనధ్వనులు నేకీభవించి భూనభోంతరంబు లావరించె నమ్మహాలోకలంబున నేలం
బడి పొరలి పొరలి యేడ్చువారు నయ్యయో శ్రీరామభద్రుని యర్ధాంగలక్ష్మి
నేఁటితో మాస్వామి నెడఁబాసిపోయితే యని బిగ్గరగా నాక్రోశించువారు
నేమియు ననలేక శోకవ్యాకులితేంద్రియులై మూఁగలై మ్రగ్గువారును
నీలోకాపవాదం బింత చేసెఁగదా యనువారును ని[illegible] నల్లాడిన
యీలోకుల కొకసత్యం బున్నదే యనువారును నక్కట [illegible]లేని[illegible]లైతిరే
యన్నలారా యని కుశలవులఁ జూచి చూచి వగచువారును [illegible]
నిలిచినచోటుఁ గాంచి పలికినపలుకులు వర్ణించి పోయినపోకఁ ద[illegible]వచ్చి
పలుకుచుఁ బలుమాఱుఁ బరితపించువారును నిదిగో కన్నులఁ [illegible]దే
యది యజ్ఞగన్నాత నేరీతి మఱవవచ్చు ననువారును నందఱచే మా[illegible]
వినిపి వేసఁటి యాసరసిజాక్షి లోకనిందఁ బాపికొని కారణజన్మ
గావున మహనీయపదంబునకు జనియెఁ దత్ప్రభావం బెవ్వరికైన దె[illegible]
శక్యంబె యనువారును నింత యద్భుతం బెక్కడఁ గని విని యెఱుంగ ము

వాఁడును నొదలను వంచి యవిచ్ఛిన్నాశ్రుజలధారాపూరితనేత్రులై వెక్కసంబుగా వెక్కి వెక్కి యేడ్చు భరతలక్ష్మణశత్రుఘ్న సుగ్రీవాంగదహనుమత్సుషేణ నలనీలజాంబవద్విభీషణవిదేహకేకయరాజప్రముఖులం జూచి వగపులుక్రొత్తలై చిత్తంబు లుత్తలంబు లొందఁ గందండుఁ దల్లడించువాఁడును నధోముఖుండై చేష్టలు దక్కి చేడ్పడి యున్న యన్నరేంద్రచంద్రునిం జూచి పురపురం బొక్కువాఁడును సంతాపంబుల స్రుక్కువాఁడును దాలిమి దక్కువాఁడు నై వెక్కుచందంబుల సందఱుం దురపిల్ల నయ్యాస్థానంబు శోకదైన్యనిధానంబై యుండె నయ్యవసరంబున. 94

సీతాదేవి రసాతలంబున కరుగుటకు రాముఁడు చింతించుట

మ. జనకక్ష్మావరకన్య యిట్లడఁగ విశ్వంబంతయుం శూన్యమై
తనకుం దోఁచిన దీనభావ మడరం ధైర్యంబు పోనాడి లో
చనపంకేజము లశ్రుధారఁ మునుఁగం క్ష్మాభర్త హా జానకీ
యనుచుం మూర్ఛిలి క్రమ్మఱం దెలిసి శోకాక్రాంతుఁడై యిట్లనున్. 95

మ. జననిందం బడ లేక నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గాననం
బునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రుం
చుని చందంబున రచ్చఁ బెట్టితి నటంచుం డాఁగి పోనేల సాం
పున నేఁ డింకొకసారి నీనగు మొగంబుం జూపవే జానకీ. 96

మ. అకటా నీవు పతివ్రతామణివి నా యం దెంతయుం గూర్మిఁ బా
యక వర్తింతు వటంచు నమ్మితిఁ గదే యర్వంబె నీ వున్నచో
టికి నన్నుం గొనిపోక నిర్దయత నొంటిం డించి పోవం దలం
పక నా నేరము లిందు వచ్చి నిలవే మాటాడవే కోమలీ. 97

మ. సదనంబుం బెడఁబాసి నీవు బహువర్షంబుల్ వనక్షోణిఁ జెం
ది దురంతవ్యథ లొంద నిన్ను ననురక్తిం గూడి వర్తింపఁగా
నిది మేలైనయుపాయ మంచు శపథం బేఁ గోరితిం గాని నీ
హృదయం బించు కెఱింగినం దలఁతునే యీమాట ప్రాణేశ్వరీ. 98

చ. అడరెడుచిచ్చుఁ జొచ్చుతఱి నాఁడట నూరక చూచునాఁటిని
ల్కడయును గానఁ ద్రోచి చిరకాలము దాళినబెట్టిదంబు నా
యెడఁ గని వంతలం విసివి యీతని కెక్కడిమోహ మంచు ని
ప్పుడమి నడంగి మాయ మయి పోయితి వేమొ పతివ్రతామణీ. 99

ఉ. కన్నుల సారెకుం దొరఁగు కజ్జలసమ్మిళితాశ్రుధారతోఁ
విన్నఁదనంబుతో మిగుల వెచ్చనియూర్పుల వాడుమోవితోఁ
జిన్ని మొగంబు వంచి బలుసిగ్గునఁ గేల్గవ మోడ్చి యుందు ని
ల్చున్ననినుం దలంచుకొన నూహ గలంగెఁ గదే వధూమణీ. 100

చ. అనితరవామలూరుజవనాంతరవాసముఁ జెందినావు నీ
వెనసినప్రేమ నట్లఁ గదిసె దెప్పటి కైనను గూడి యుందు వం
చును నొకయాసఁ బెట్టుకొని స్రుక్కక పెక్కుదినంబు లోర్చితిన్
నను దిగనాడి యిట్లు చనినన్ వెత నెట్టు భరింతుఁ బ్రాణముల్. 101

ఉ. ఎక్కడి కిప్పు డేఁగితివొ యెక్కడ దీనతఁ బాసి నిల్చినా
వెక్కడఁ బోయె నాఁటిమరు లెంతకృపారహితాత్మురాల వై
తెక్కడఁ జొత్తు నేది తెరు వెక్కరణిన్ గ్రమియింతుఁ గాల మిం
కెక్కడ నున్నదాన వని యే వెదకింపుడుఁ బంకజాననా. 102

సీ. దర్పించి పరమేశుధన్వంబు విఱుచుట నీనిమిత్తమె కదే నీలవేణి
యెలమితోఁ గపిరాజు చెలిమి పాటించుట నీకోసమే కదే నీరజాక్షి
విబుధేంద్రసుతుఁ ద్రుంచి ప్రేసి నిర్జించుట నీకొఱకే కదే నిర్మలాంగి
క్రోధించి సాగరక్షోభంబు సేయుట నీపనికే కదే యోపురంధ్రి

తే. బ్రహ్మకులజునిఁ బౌలస్త్యపతి గెలుచుట
నిన్నుఁ గైకొంటకే కదే వన్నెలాఁడి
యకట యివి యెల్ల నెంచక నొకటిరెండు
తప్పులకు నన్ను నెడఁబాయఁ దగునె నీకు. 103

సీ. పడఁతి నీకటిసీమ యడుగుఁ బట్టుటఁ జేసి నేల గ్రుంగినయట్లు నేఁడు దోఁచెఁ
జెలువ నీలేఁగౌను బిలము దూఱుటఁ జేసి నింగి గూలినభంగి నేఁడు దోఁచె
నతివ నీముఖచంద్రుఁ డస్తమించుటఁ జేసి నిఖిలంబు తిమిరమై నేఁడు దోఁచె
సకియ నీకాంచనాంగక మడంగుటఁ జేసి నిబిడదారిద్ర్యంబు నేఁడు దోఁచె

తే. భామినీమణి నీసొందు లేమిఁ జేసి
యలఁతి మజ్జన్మ మిఁక వ్యర్థ మనుచుఁ దోఁచె
జలజముఖి నీవు వెడఁబాసి చనుటఁ జేసి
యిదిగొ యన్నియుఁ గొదవ లై యిపుడు దోఁచె. 104

క. నీగౌరవంబు నీయను, రాగము నీమైత్రి నీసరసభావంబున్
నీగరువతనము నీదయ, నీగుణముల్ మఱవవచ్చు నే యెన్నఁటికిన్. 105

ఉ. నామన సార యెంతకఠినంబొ తలోదరి నీవు సత్యభా
షామహిమోన్నతిన్ మహి యొసంగినతోవ నహీంద్రకన్యకా
చామరచంచలచ్ఛికురజాలక వై చనఁ జూచి ప్రస్సిపో
దేమియుఁగాదు ఱాతివలెనే చెలువొందెడుఁ జూడు మియ్యెడన్. 106

మ. అని సీతాపతి నాత్మనుంచి తొలిమోహం బెంచి శోకించి య
య్యనవంశాగ్రణి భూమి వచ్చి విభవం బేపార నయ్యింతిఁ దో
డ్కొని పాతాళబిలంబుఁ జొచ్చిన తెఱంగున్ బుద్ధి నూహించి మిం
చిన క్రోధంబున సభ్యులన్ గని వచించెన్ వార్షికాబ్దధ్వనిన్. 107

### రాముఁడు భూమిపై బాణము ప్రయోగింపఁ జూచుట

ఉ. కంటిరె సభ్యులార జనకప్రభుకన్యక వేఁడుకొన్నచో
బంటవలెంతి వచ్చి ప్రియభావముతో వెత దీర్చి పోక తా
గంటున నన్నొకింతయును గైకొన కల్పునిఁ గాఁ దలంచి వా
ల్గంటి నలంకరించుకొని గ్రక్కునఁ దోకొని చన్నచందముల్. 108

ఉ. బాలిశులీల నేను వెతపాలయి దీనత గాసిలంగ నా
పాలిటిభాగ్యలక్ష్మి ననుఁ బాయని జానకిఁ గొంచుఁ బోయె ని
న్నేలపడంతిదుండగ మనీతియుఁ జూచితిరే కదా యిఁకన్
దాళిమిఁ బూని యుత్తయని దండన సేయక తాళ వచ్చునే. 109

చ. లవణపయోధిఖేయమగు లంకకుఁ బోయి దశాస్యముఖ్యులన్
బవరములో జయించి మును భామను దెచ్చిననా కసాధ్యమే
తివిరి ధరిత్రి గొన్నసుదతిన్ మరలించుట చూడుఁ డిందఱున్
భువనము లెల్ల భీతిలఁగ భూరిశరాహతి భూమి వ్రచ్చెదన్. 110

చ. దురుసున నామదిన్ గినుక దోఁపక ముందర సీతఁ దెచ్చి యి
ద్ధరణి యొసంగినన్ బ్రతుకుఁ దక్కిన మామకచాపముక్తని
ష్ఠురవిశిఖప్రతానములఁ జూర్ణముఁ జేసి యజాండమెల్ల నా
వరణపయోధిలోఁ గలిపి వైచెద నొక్కక్షణంబులోపలన్. 111

వ. అని హిరణ్యగర్భస్వర్భువనాధినాథప్రముఖహావిర్భుజులకు గర్వనిర్భేదంబుగా బలికిన తనపలుకుల కళుకులేక నిరాకులస్థితిన్ బ్రవర్తిల్లు ధాత్రిమీఁదన్ బుట్టిన బెట్టిదంపురోషంబునఁ బెదవు లదర నిడుదకన్నుఁగ్రేవల బెడిదంపుమిడుఁగుఱులు చెదరఁ దటతటన్ గటతటంబులు చలింప ముక్కుపుటంబులఁ బ్రకటతరోచ్ఛ్వాసనంబు విజృంభింప నిటలతటంబున నతివికటభ్రుకుటి ఘటిల్ల రదనపటలంబునన్ బటపటార్భటు లుప్పతిల్లఁ బరుషపరుషారసోన్ముఖం బై ముఖంబు జేవురింప నెమ్మేనన్ జిఱుచెమ్మటలతెమ్మ లావరింపఁ బంచభూతవిలయసమయసముద్దండతాండవక్రీడాప్రచండ చండీశ్వర విశ్వభయంకరకరణ పారదృశ్వాశ్వద్వీరరసోల్లాసంబునకు నావాసంబై సంగి వాసవాదిపురప్రాసాద విలాసనిరాసక్రియాసముల్లసత్పురత్రయహరణకారణరణారంభశుంభచ్ఛంభుశరశరాసనవినిర్ముక్త ముక్తాశ్రయవిశిఖానివార్యక్రౌర్యంబుతో సాహచర్యంబు వాటించియవార్యధైర్యధుర్యతాదక్షదక్షమఖవిఘాతప్రభూత సముద్రేకతాక్షుద్రరౌద్రనిర్నిద్రవీరభద్రప్రభావంబావహించిభావభవాఖర్వగర్వసర్వస్వోన్మూలనఖేలనఫాలనయన విశాలఫాలస్థలకీలికీలికాభీలప్రళయకాలప్రద్యోతమానద్వాదశ ద్వాదశాత్మమండలాప్రతీపప్రతాపరీతిఁ బ్రదీపించి యపారపారావారవారి పూరాపహారక్రీడాఢౌకమానబడ

బానలశిఖాప్రకరతీవ్రతరౌష్ణ్యంబు నధిగమించి యనవధికసకలభువనాక్రమణ
ప్రవర్తనాతివర్తులావర్తసంవర్తసమయాంభోనిధానగాంభీర్యంబునన్ బోలువు
మీఱి భూరివిశ్వంభరాభారభరణప్రవణఫణికులేశ్వరముఖసాహస్రజంజన్యమా
నపవమానసఖసముజ్జాతసంకర్షణమూర్తిబింకంబున భయంకరుండై సకలప్రపం
చంబు నొక్కట నుక్కడంచి దిగమ్రింగ నప్పళించువిలయకాలమృత్యువు మహా
ద్ధత్యంబునన్ బొంపిరివోవుచు నఖిలజగమ్ములన్ గ్రమ్ముకొని దుమ్ముసేయ నుద్యో
గించు ప్రళయకాలఝంఝూసమీరంబుతీరున బలిమిన్ జెలువారి యెవ్వారికిఁ
దేఱి చూడరాక కోపంబు రూపంబు గైకొన్న కోపున నహంకరించి హుంకా
రంబు నివ్వటిల్ల నవ్వీరాధివీరుండు క్రూరనిరీక్షణంబుల నిప్పులు కుప్పలువడ
నప్పుడమి నట్టె యవలోకించి కించిజ్ఞవై జడమతి నన్నున్ గొంచెగానిం గాఁ
దలంచి సీతన్ జూడఁ బోవఁ బెరవైన నొసంగ వైతివిగదా మంచిది యీక్ష
ణంబున నిన్ను నిర్భేదించి నీగర్భంబున నున్న యతలవితలాదిసప్త పాతాళలో
కంబులు చీకాకు గావించి నీవు ధరించిన సరిత్సముద్రగిరిపురగ్రామవనకాననాదు
లతోడ నీయందుఁ గలనిఖిలజంతువుల నిర్మూలించి నిన్ను ధరించిన కులపర్వత
దిగ్గజభుజగవరాహకూర్మాదుల నింతలింతలు తునుకలుగా నొనరించి నేఁటితో
నీయేడులోకంబులు నీఱు గావించెదన్ దాళు మని చెంత నున్న లక్ష్మణుచేతి
శరాసనంబు నొడిసి పుచ్చుకొని మచ్చరంబు హెచ్చ నచ్చాపంబు మిక్కుటంపు
టుక్కున నెక్కు వెట్టి బెట్టుగా నారి సారించిన సైరించరానితద్దీర్ఘనిర్ఘోషంబున
బీఁటలువాఱి దిక్కులు వ్రక్కలయ్యెఁ జుక్కలు నేలపాలయ్యె సముద్రంబులు
పంకిలంబు లయ్యెఁ బర్వతంబు లొడ్డగెడవు లయ్యె నాదిశేషుం డవశుఁ డయ్యె
నజాండభాండంబు పగిలిన ట్లయ్యె దిక్పాలురు దిగులుఁ జెందిరి దేవతలు నెగులు
బొందిరి కిన్నరులు ఖిన్నతవహించిరి కింపురుషులు కంపించిరి సిద్ధులు చేడ్పాటు
నొందిరి విద్యాధరులు వికలతన్ గుందిరి గరుడులు కాందిశీకత వహించిరి
గంధర్వులు కళవళించిరి తుషితులు దుఃఖించిరి భాస్వరులు పరితపించిరి
యక్షులు దొలంగిరి రాక్షసులు కలగిరి నరులు మూర్ఛిల్లిరి వానరులు తల్లడిల్లిరి
వసువు లడలిరి మహారాజికులు బడలి రనిలులు చెదరి రాదిత్యులు బెదరి
రూర్ధ్వలోకంబుల నుగ్రాంధకారంబులు నిండుకొనియె నట్టి సమయంబునఁ
బ్రత్యాలీఢపాదుం డై కాకుత్స్థుండు చండకోదండంబునఁ గాండప్రకాండం
బులు దొడిగి భూమండలంబున నేయం దొడఁగుకడంక నెఱింగి యుత్సా
హంబు దొఱంగి గడగడ వడంకుచు వెడవెడం గొంకుచుఁ బంకజాసనుం డరుగు
దెంచి యయ్యురుగుణాఢ్యుని హస్తంబులు పట్టుకొని యఖిలదేవర్షిబ్రహ్మర్షిగణ
సమన్వితుం డై యిట్లని యభినుతింపఁ దొడంగె.

112

బ్రహ్మాదిదేవతలు శ్రీరాముని స్తుతించుట

చ. జయజయ సాధురక్షణవిచారవిచక్షణ చారసేక్షణా
జయజయ సర్వకారణ నిశాచరదారుణకృత్యహారణా
జయజయ సత్యభావన సుజన్మశుభావన లోకపావనా
జయజయ మంజుభాషణ లసత్కులభూషణ వార్ధిశోషణా. 113

సీ. తనవిల్లు విఱిచినట్లనె రథంబురు ద్రుంచఁ గడఁగెఁగాయనుచు శంకరుఁడు వగచె
దనమేఖలాలీలఁ దాల్పుభూమారత్న మడఁగుచున్నదె యంచుఁ నబ్ధి గలఁగె
నిజధరాధరసంజ్ఞ నేఁటికో నష్టమయ్యెడినో యంచు జలించె బుడమిదాల్పు
లిఁక నేమిగావింతు మొందుఁజొత్తు మటంచు ఫణిఘోణికూర్మముల్ పరితపించె

తే. నాకధరాదేవితోఁ జోనె సకలలోక, ములకుఁ జెడుకాలమొదవె నంచళుకుఁజెంది
రెల్లలోకులు నీచేత విల్లుపూని, ధాత్రిఁ గనుగొన్నమాత్ర సీతాకళత్ర. 114

ఉ. భూజలవహ్ని వాయునభముల్ మహదాదులు సృష్టిఁ జేసి నీ
వే జగదంతరాత్మ వయి యింతకు నాథ్యతఁ జెంది నాభిపం
కేజమునందు నన్నుఁ గలిగించితి పెంచితి నీప్రపంచముల్
రాజవె నీవు మన్మరయు రాజవు గాక త్రిలోకవందితా. 115

ఉ. కారణయుక్తి నీవలనఁ గల్గినలోకము లీవె త్రుంచ నె
వ్వారికిఁ గాదటంచనెడువారిది యెవ్వరి దిట్టిధాత్రిపై
మేరయె యింతకోపము శమించుము గాంచుము యోగిమానసా
గారవిభాసిదీపరుచిఁ గాంచి వెలింగెడినీస్వభావమున్. 116

శా. సత్తామాత్రుఁడవై ప్రపంచకలనాసాక్షిత్వధుర్యుండవై
చిత్తాదీంద్రియబోధరూపకుఁడవై చిచ్ఛక్తియుక్తుండవై
సత్త్వాద్యక్రిగుణాత్మకత్వమున నేతత్సృష్టిరక్షాత్యయా
యత్తానంతవిలాసముల్ గనిన నిన్నాత్మన్ విలోకింపవే. 117

వ. అని పలికి మఱియు నిట్లనియె. 118

సీ. కల్పక్షయమున నేకంబైన జలధిపైఁ బవళించి జగదిచ్ఛ యవధరించి
హృదయాబ్జమునన న్నుసృజియించి నిర్గమించుటకుఁ బొందమ్మిఁ బొక్కిటఁ బుటించి
బయలుదేఱినచోఁ దపంబు సేయు మటంచు నాకాశమూర్తివై యపుడు పల్కి
తపమునిష్ఠకు మెచ్చి తగ నంచవై వచ్చి తెలివినంతయు నుపదేశ మిచ్చి

తే. వెనుక వైకుంఠ మనుపేర విదితికెక్క, భువనరాజంబులో శేషభోగితల్ప
శాయివై తోఁచి నను జగత్సర్గమునకు, నియ్యకొలిపిన నాతండ్రి నీవె కావె.

మ. శిఖవిద్యాబలశౌర్యపణ్యకృషిసంసేవాదులన్ గూడి నీ
ముఖబాహూరుపదంబులన్ గ్రమమునన్ బుట్టెన్ జతుర్వర్ణముల్
నిఖిలాశల్ జనియించె నీచెవుల నీనేత్రంబులన్ గల్గి రిం
ముఖరాంశుల్ జగదంతరాత్ముఁడవు నిన్నున్ శక్యమే మెంచఁగన్. 120

మ. జనముల్ విభ్రమమొందఁ బ్రాకృతుని యోజన్ దైన్యశోకప్రథల్
చనునే యిట్లు వహింపఁ జాలు విడు మిచ్ఛాపంబు భూదేవి చే
సిన తప్పేమి త్వదాజ్ఞఁ గాదె తెరు విచ్చెన్ సీత నిత్యానపా
యిని నిన్నున్ బెడఁబాసి యెందరిగెఁ దండ్రీ బుద్ధి నూహింపుమా. 121

ఉ. నీకథ లాదినుండియును నేర్పలరన్ రచియించినాఁడు వా
ల్మీకిమహర్షి యక్కొదవ లెస్స వినన్ దగు నందునన్ మనో
వ్యాకులతాస్థితుల్ దొలఁగు నంతియ కాదు భవిష్యదర్థముల్
నీకెఱుఁగంగ వచ్చు నది నేనును వింటి మునీంద్రకోటితోన్. 122

శా. సారప్రజ్ఞ ఘటించు శ్రోతల కభీష్టంబుల్ ప్రసాదించు భా
గీరథ్యాపగఁ బోలి పంక మడఁచున్ గీర్వాణినీపాదమం
జీరస్ఫారమృదుధ్వనిన్ జెవులకున్ జేకూర్చు నుల్లాసమీ
శ్రీరామాయణ మాదికావ్యము సుమీ సీతామనోవల్లభా. 123

క. తత్తఱ మొందక యిత్తఱి, నుత్తరకాండంబు విన్న నుత్తల మడఁగున్.
జిత్తము ప్రసన్న మగు నని, యత్తామరచూలి పలుక నౌఁగా కనుచున్. 124

తే. కోప ముపసంహరించి కాకుత్స్థమౌళి
యనుజుచేతికి శరశరాసనము లొసఁగ
నలరి యవ్విభు వీడ్కొని యజుఁడు సురలు
మునులుఁ గొలువంగ దనలోకమునకు జనియె. 125

క. ఆసమయంబునఁ గాంస్యము, గీసినగతి నతులవల్లకీతతు లొకపై
మ్రోసినగతి నెలుఁగడరన్, భూసతికడనుండి యొక్కనుడి వినఁబడియెన్. 126

శా. రామాధీశ్వర చింతయేమిటికి శ్రీరామాశిరోరత్న మే
భూమిన్ సీత యనన్ జనించి హరి వై పొల్పొందు నిన్ గూడి నీ
వైముఖ్యంబు తుదిన్ సహింపక బుధుల్ వర్ణింప నాత్మీయ సూ
ధామంబున్ దొరసెన్ ద్వదాగమన మాత్మన్ గోరుచున్ బ్రేముడిన్. 127

చ. క్రియయును మేధయున్ ధృతియుఁ గీర్తియు శక్తియు హ్రీయు శాంతియున్
దయయును దుష్టిపుష్టియును దథ్యము సీతయె చుమ్ము తన్మనో
దయితుఁడ వైననీవె పరదైవము నిర్వురు మీరు తల్లిదం
డ్రియు నయి లోకరక్ష యొనరింపుచు నుండుదు రెల్లకాలమున్. 128

శా. ఏసీమంతినిపాదశోణరుచి దేవేంద్రాదిదిక్పాలకాం
తాసీమంతములందుఁ జెందిరముచందం బొందు నేదేవి వీ
క్షాసమ్యగ్ద్యుతిలేశ మర్థిజనదారిద్ర్యంబు మాయించు నా
శ్రీసీతాసతి లీల నిన్ను భజియించెన్ రామ కొన్నాళ్లిలన్. 129

ఉ. సీతఁ దలంచి యింక వెతఁ జెందకు శ్రీరఘురామ యామెపై
నాతతమైన నీకరుణ యంతయు నిక్కువలందు నిల్పు మ

జ్ఞాతభవోపదిష్ట మగుపద్ధతి నుత్తరకాండ మంతయున్
బ్రీతిదలిర్ప వీరు వినిపింప రహిన్ విను మంచుఁ దెల్పినన్. 130

## రాముం డశ్వమేధయాగంబు పరిసమాప్తి నొందించుట

ఉ. ఆపలుకుల్ చెవిన్ బడినయంత నొకించుక ధైర్యమూని యా
జ్ఞాపతి వామలూరుభవుఁ గన్గొని మానుషువుల్ వినంగ ని
త్యాపసు లీనృపాలకులుఁ దద్దయుఁ గోరుచునున్నవారికిన్
రేపటినుండియున్ బ్రియము నివ్వటిలన్ జదివింపుఁ డవ్వలన్. 131

క. అని పలికి సకలజనముల, ననిచిన నెయ్యమున ననిచి నందనులను దో
డ్కొని మఖశాలకుఁ జనియెన్, మనుకులమణి యంత గగనమణియున్ గ్రుంకెన్.

ఉ. ఆనిశ యెల్ల జానకిగుణాతిశయంబులె చింత సేయుచున్
మానవభర్త నిద్ర యనుమాట యెఱుంగక యుండి వేగినన్
స్నానము సంధ్యయున్ జపము జన్నపునేమములున్ ఘటించి యా
స్థానముఁ జేరి బ్రహ్మఋషిసంఘములో వసియించి యచ్చటన్. 133

తే. సుతులఁ గనుఁగొన్న వల్లకీశ్రుతులు బెరయ
శ్రుతుల కిం పని యతులు భూపతులు మెచ్చఁ
గతిపయదినంబు లుత్తరకాండకథలు
వారు తుదముట్టఁ జదివి రధ్వరము నయ్యె. 134

ఉ. ఆతఱి ఋత్విగావలికి నంచితదక్షిణ లిచ్చి యర్థిసం
ఘాతము కోరినట్ల కుతుకంబున నీవు లొసంగి ధారుణీ
నేతల దానవేంద్రరజనీచరముఖ్యుల భూషణాదులన్
బ్రీతులఁ జేసి వీడుకొలిపెన్ బతి యందఱ నర్హరీతులన్. 135

తే. ఇటులఁ గృతకృత్యుఁ డై రాఘవేశ్వరుండు
ధరణికన్యావియోగాగ్ని తప్తహృదయుఁ
డగుచుఁ దనుజులు ననుజులు నాప్తు లార్యు
లాశ్రితులు గొల్వఁగ నయోధ్య కరిగి యచట. 136

మ. నయమార్గంబున రాజ్య మేలె నవనీనాథుండు దేవద్విజ
ప్రియకార్యంబు లొనర్పుచున్ జగతిపైఁ బెక్కగ్రహారంబు లు
చ్ఛ్రియసంపన్నతఁ గల్గఁజేయుచు దురాచారస్థులన్ బాపుచున్
దయ నర్థార్థులకోర్కు లిచ్చుచు ననాథశ్రేణి రక్షింపుచున్. 137

సీ. అమితదక్షిణలతో నయుతాశ్వమేధముల్ గొనకొని యొనరించెఁ గొన్నినాళ్లు
శిష్టు లౌ ననఁగ నగ్నిష్టోమయజ్ఞముల్ గురునిష్ఠ నొనరించెఁ గొన్నినాళ్లు
భూరిదానముల విప్రులతృప్తిగ ననేకగోమేధము లొనర్చెఁ గొన్నినాళ్లు
జేజే లలరఁ బెక్కు వాజపేయములు మిక్కుటవుఁగల్మి నొనర్చెఁ గొన్నినాళ్లు

తే. ఎడతెగనియాహుతులను వహ్నికి నజీర్తి,యడర నతిరాత్రపౌండరీకాదియాగ
కోటుల ఘటించెఁబటుబుద్ధిఁ గొన్నినాళ్లు, హేమసీతాసమేతుఁడై యినకులుండు.

చ. పొలుపఱి సీతవంటిసతి పోయినపిమ్మట నింక నొక్క తెఱన్
వలయునె పెండ్లియాడ నన వారని నెంజిలి నెవ్వ రెన్నిభం
గుల వివరించినన్ వినక క్షోణిజఁ బోలినపైఁడిబొమ్మ ని
శ్చలమతిఁ జెంత నుంచుకొని క్ష్మాపతి సేసె ననేకయాగముల్. 139

వ. తత్కాలంబున. 140

సీ. అవని వసుంధరాఖ్యకుఁ దగ నెడలేసి హేమరాసులకాంతి నెసక మెసఁగి
వనధి రత్నాకరత్వము యథార్థముఁ జేసె బలుతరఁగల రత్నపంక్తు లూని
యభ్రనామము వ్యోము మనురూపముగఁ దాల్చె జనులు గోరినవస్తుసమితిఁగురిసి
ధర్మాభిధాన మంతకుఁడు నిక్కమొనర్చె ముదుసళ్లునైనను గదియఁబోక

తే. వలసినపుడెల్ల వానలు గలిగి యుండెఁ, బ్రబలి రందఱుఁ బాఁడియుఁ బంట లెనసి
నెట్టుకొని కొల్చుపోకఁ బుట్టెఁ దమ్మె, శ్రీరఘుస్వామి రాజ్యంబు సేయునపుడు.

క. తరణికులాధీశ్వరునకు, భరియింపఁగ నపుడె రెండుభారము లొదవెన్
ధరణీభారము సీతా, తరుణీచిరవిరహభూరితర భారంబున్. 142

చ. మఱవఁగ నేర్చు లోకు లధమస్థితిఁ బల్కినయట్టినిందలున్
మఱవఁగ నేర్చు నాశ్రితులు మాటికిఁ జేసినయన్ని తప్పులున్
మఱచిన మర్వరాక మదినాటినసీతవియోగదుఃఖమున్
మఱవఁగ నేరఁడయ్యె గుణమండితుఁ డారఘువీరుఁ డయ్యెడన్. 143

సీ. విద్యావయోరూపవినయశౌర్యాదుల బ్రబలులై కొడుకులు భక్తిసలుప
హృదయానుగుణముగా నేనుఱ కేవేళ ననుజన్ము లఖలకార్యములు నడప
సకలదేశాధినాయకులుఁ గింకర్వాణులై పదాబ్జము లెప్పు డనుసరింప
హితమంత్రిగురుపురోహితబంధుసామంతముఖులు మనఃపూర్వముగ నుతింప

తే. భూమిఁ జిరకాల మేలుము స్వామి యనుచుఁ
బ్రజలు జేపెట్టఁ గలిమియు బలిమి గలిగి
యొప్పి యుండియు సీత లేకున్కతన
నన్నియుఁ గొఱంతలై తోఁచె నవని పతికి. 144

కౌసల్యాకైకేయీసుమిత్రలు దివంబున కరుగుట

తే. ఏకతంబున నున్నచో నినకులుండు, భామినీమణి నూహించి పరితపించుఁ
గొలువులో నున్నయప్పుడు కొడుకులఁ గని, సీతరూపంబు భావించిచింతనొందు.

సీ. రాజ్యంబుఁ జేయుశ్రీరాముని విభవంబు కన్నులు చల్లగాఁ గాంచి యలరి
యమితదక్షిణలతో నాతఁ డొనర్చినయాగకోటులు కని హర్ష మొంది
యవ్వ యంచు సపర్య నాచరించు కుశాదిపౌత్రులఁ గనుఁగొని బాళిఁజెంది

సీత వోయినచింతఁ జెందనీక భజించునార్తిఁ గాదులఁ జూచి యూఱడిల్లి

తే. యెల్లబంధులఁ బోషించి యిహసుఖంబు, లెల్లఁ గనియెల్ల సవతులయుల్లమలర
నడిచి నడిసన్న కౌసల్యనాథుఁ డున్న, లోకమున కేఁగె నుతులెల్ల శోకమొంద. 147

వ. అప్పుడు.

క. తల్లి సాధ్వీలోకమ, తల్లీ మముఁ బాసి పోవ దగునే యనుచుం
దల్లడమందుచు రఘుపతి, తల్లికిఁ బరలోకవిధులు తగ నొనరించెన్. 148

చ. పతికడ కామె చన్నయొకపక్షములోపల నేఁగెఁ గేకయ
క్షితిపతిపుత్త్రియుం విభుని చెల్మికి నంతటిలోఁ గ్రమంబునం
గతిపయవాసరంబులకుఁ గాంతునిఁ జేరె సుమిత్రయుం నయ
వ్రత లయినం సపత్నులు పరస్పరసౌఖ్యము లోర్వ రెయ్యెడన్. 149

క. ఆమాతలఁ గూర్చి రఘుగ్రామణి మహిసురల కొసఁగె రత్నాభరణ
స్తోమంబులు హేమంబులుఁ, గ్రామంబులు పారలౌకికక్రియలయెడన్. 150

చ. అతులవిభూతి మీఱఁ బితృయజ్ఞము లిట్టు లొనర్చి రామభూ
పతి యశుచిత్వముం దొఱఁగి బంధుపురోహితమంత్రిసోదరా
న్వితుఁ డయి యొక్కనాఁడు మహనీయసభం గొలువున్నఁ గేకయ
క్షితివరుదూత వచ్చి నుతిఁ జేసి కరంబులు మోడ్చి యిట్లనెన్. 151

ఆ. స్వామివారికడకు మీమామ తమపురోహితుని బంపె నాతఁ డిదిగొ వచ్చు
చున్నవాఁడు నేను మున్నుగాఁ దెలుప వచ్చితి నటన్న నృపతిశేఖరుండు. 152

రాముని కడకు గార్గ్యమహాముని వచ్చుట

చ. అలరుచుఁ గేకయాధిపతి యంపినగార్గ్యునికిం వినీతి హె
చ్చిల నెదురేఁగి వందనముఁ జేసిన దీవన లిచ్చి యాతఁడుం
విలసితలీల మించుపదివేలహయంబుల రత్నభూషణా
వళుల ధనంబులం వివిధవస్తుచయంబు లొసంగెఁ గానుకన్. 153

ఆ. అవి పరిగ్రహించి యివి యేల దెచ్చితి రింతవింత చేతురే యటంచు
నతనిఁ దోడితెచ్చి యర్ఘ్యాదు లిచ్చి యుచ్చాసనమున నుంచి యధిపుఁ డనియె.

చ. లలితగుణాబ్ధి మీకుఁ గుశలంబు కదా ఘనుఁ డస్మదీయమా
తులుఁడు సుఖించునే వినయదోహలుఁ డాయనతండ్రి వైభవో
జ్జ్వలుఁ డయి యున్నవాఁడె శుభవంతులె పుత్త్రులు గూర్మి మాపయిం
గలదె త్వదాగమంబునకుఁ గారణ మేమి గణింపవే యనన్. 155

మ. మృదువాక్యోక్తివిదుఁ డమ్మునీంద్రుఁ డనియెం మీమాతులుం డయ్యుధా
జిదలాధీశ్వరుఁ డార్యబంధుయుతుఁడై క్షేమాన నున్నాఁడు పే
మ దలిర్పం శుభశీలురం మిముఁ బరామర్శింప నం బంపినాఁ
డది గాకింకొకవార్త దెల్పు మనినాఁ డాలింపు ముర్వీశ్వరా. 256

శా. గంధేభప్రతిమానవిగ్రహు లుదగ్రస్యందనుల్ బాహుగ
ర్వాంధుల్ సింధుతటోభయాశ్రితులు మాయాయుద్ధబద్ధాశయుల్
గంధర్వుల్ శరచాపధారులు ప్రజన్ గాఱింపుచున్నారు దు
స్సంధుల్ వారలఁ బట్టి చంపి బుధులన్ సంరక్ష సేయన్ దగున్. 157

ఉ. ధారుణికిన్ భరం బయిన దారుణచిత్తుల సంహరించినన్
భూరియశంబు పుణ్యమును బొందెడినే కద గల్గు రాజ్యముల్
శూరత మించు నీసుతులలోపల నెవ్వరి నైన నిర్వురన్
వారక యచ్చటన్ నిలుప వచ్చుఁ బ్రజావలి హెచ్చు నందునన్. 158

తే. అనియు నీమామ పనిచినాఁడనిన రాముఁ, డెవ్వనికుమారులవ్వీరు లెందఱుగల
రనిన వారెల్ల మూఁడుకోట్లవనినాథ, ఖిలులు శైలూషసుతులంచు గార్గ్యుఁడనిన.

చ. విని కడు సమ్మతించి రఘువీరుఁడు గార్గ్యునిఁ జూచి పల్కె నో
మునివర యద్దురాత్ముల నమోఘశరాహతి నుక్కడంచి శౌ
ర్యనిధుల దక్షపుష్కరుల నాత్మతనూజుల నందు నిల్ప నా
యనుజలలామునిన్ భరతు నంపెద రేపు బలాన్వితంబుగన్. 160

తే. విభవములమించు గంధర్వవిషయములకుఁ, బట్టములుగట్టఁబనిచెద భరతసుతుల
నీక్షణంబున నని వారి కిర్వురకును, జెలఁగి పట్టాభిషేకముల్ సేసె విభుఁడు. 161

భరతుఁడు రామాజ్ఞచే గంధర్వులమీఁదికి యుద్ధమునకుఁ బోవుట

ఉ. ఇట్టుల దక్షపుష్కరుల కిర్వురకున్ రఘుభర్త పట్టముల్
గట్టి వినీతుఁ డౌ భరతుఁ గన్గొని గార్గ్యులఁ గొల్చి రేపె పో
మిట్టల మైనబల్మిఁ బొలియింపుము వైరులఁ గట్టు మచ్చటన్
బట్టనయుగ్మ మందులఁ గుమారుల నిల్పుము రమ్ము నావుడున్. 162

చ. సవినయబుద్ధి నాతఁడు హసా దని యమ్మఱునాఁటి వేకువన్
దివసముఖోచితక్రియలు దీర్చి కుమారుల తోడ వచ్చి రా
ఘవునకు మ్రొక్కి దీవనలఁ గైకొని వీడ్కొని యంగిరస్తనూ
భవునిఁ బురస్కరించుకొని పౌరుష మొప్పఁ జనెన్ జయార్థి యై. 163

వ. అప్పుడు. 164

సీ. అతిఘోరఘీంకారకృతవైరిమదవారణము లైనమదవారణములు గదలె
ఘనఖురోత్థరజోంధకారాంధహరిసైంధవము లైనబహుసైంధవములు నడిచెఁ
జటులకేతనకాండచలితతారామండలము లైనరథమండలములు దరలె
వీతిభాగభియాతివిదళనోద్ధతహేతికోటి యైనపదాతికోటి వెడలె

తే. నందుభేరీధణంధణల్ గ్రందుకొనియె, శంఖభుంభుంనినాదముల్ సందుకొనియె
మురజపణవాదిఘోషముల్ ముంచుకొనియె, నమితకాహళరవము మిన్నందు [కొనియె.

శా. ఈలీలన్ బహుసేనఁ గూడి భరతుం డేఁగంగ నాత్రోవలోఁ

గాలగ్రీవుఁ డితండె సుమ్ము మనకుఁ గంధర్వమాంసాదులన్
కీలాలంబులఁ దృప్తి చేయు ననుచుఁ గీర్తింపుచుఁ భూతబే
తాళక్రూరపిశాచకోటి నడిచెన్ దండుం బలెన్ వెంబడిన్. 166

క. ఆలాగె యనుసరించె సృగాలవృకవ్యాఘ్రముఖమృగంబులు ఖగముల్
నేలయు నింగియు నెఱసె వి,శాలదమూ కలకలము పిశాచార్భటులున్. 167

వ. ఇవ్విధంబున. 168

మ. నెలమీఁదన్ బదియేనునాళ్లకు మహానీకంబుతో నాత్మమా
తులు ప్రోల్ చేరి యతండు నిల్వ రహి నందున్ నాఁటికిన్ నిల్చి పెం
పలరంగా మఱునాఁడె కేకయులు సాహాయ్యంబు రా శాత్రవుల్
గలఁగన్ రామసహోదరుండు సనియెన్ గంధర్వదేశంబుపై. 169

మ. పటహధ్వానములున్ భటార్భటు లదభ్రక్రోధయోధచ్ఛటా
ఘటితేష్వాసగుణధ్వనుల్ నిజవధూగర్భైకనిర్భేదనో
ద్భటలీలన్ నిగుడన్ దదాగమనవార్తల్ విన్నవా రాట నో
క్కట గంధర్వులు వచ్చి తాఁకి రలుకన్ గాకుత్స్థసేనావలిన్. 170

క. కడలిన్ గడలి యెదుర్కొను, కడిమిన్ భరతేంద్రసేన గంధర్వులపై
వడి నిగుడ బెడిదముగఁ దల,పడి పోరెడునపుడు పోరు భయదం బయ్యెన్. 171

క. నిలునిలు మను నెలుఁగులు తల, తలమని యెడు నెలుఁగు లదరి తాఁకెడియెలుఁగుల్
కిలకిల నార్చు నెలుంగులు, బళిబళి యను నెలుఁగులును నభం బవియించెన్. 172

సీ. నఱకు చప్పుడు డాసి పొడుచు చప్పుడుఁ గేక వ్రేయు చప్పుడు దొమ్మి సేయు చప్పు
డాఁగు చప్పుడు చెలరేఁగు చప్పుడుఁ గత్తులొరయు చప్పుడు మూఁకవిరియు చప్పు
డెదిరించు చప్పుడు బెదరించు చప్పు డగ్గించు చప్పుడు హుంకరించు చప్పు
డదలించు చప్పుడు విదళించు చప్పుడుఁ బిలుచు చప్పుడుఁ బురికొలుపు చప్పు

తే. డుభయసేనల సమరీతి నుప్పతిల్లి
మిక్కుటవుఁగిన్క చదలాని పిక్కటిల్ల
మనుజయోధులు శైలూషతనుజయోధు
లేడహోరాత్రములు పోరి రీరసమున. 173

వ. మఱియును. 174

సీ. చరణాహతుల భూమి దనియించు రజముచే నిఖిలదిక్కుల నిర్లు నించి నించి
జళిపించువిచ్చుకత్తులవల్లఁ దులకించు మించులు దివి యెల్ల ముంచి ముంచి
జముఁడు బిట్టాడించు జంత్రంపుబొమ్మల ట్లలతఁ జెందక క్రుమ్ములాడి యాడి
కుసుమితాశోకాళికొమరునఁ గ్రొత్తనెత్తుటి వాఁకలను దొప్పఁ దోఁగి తోఁగి

తే. చెయ్వు లులియంగ మూర్ఛలఁ జెంది చెంది
యలవుకలిమి నొకింతలోఁ దెలిసి తెలిసి

సింహములలీల గర్జనల్ సేసి చేసి
యుభయ యోధులు పోరాడి రొక్క మొగిని. 175

వ. అప్పుడు. 176

తే. ఒరలుమడకరు లుర్విపైఁ బొరలువారలు
విఱుగుతేరులు బలమేది యొఱఁగుభటులు
వ్రాలుపడగలు నెత్తుటఁ దేలుగొడుగు
లలబలమునందు రెంటను గలిగియుండె. 177

సీ. పొలసులేకాఁటిప్రేగులు మూడియున్న ప్రేతవ్రాతములబీదతనము వాసెఁ
బ్రమథలకస్థిహారము లియ్యఁ గోరినఢాకినీతతి యభీష్టములు నిండెఁ
గీలాలనదులలోఁ గేలి సల్పఁ దలఁచు శాకినీసమితి ముచ్చటలు దీఱె
బచ్చిపీనుఁగులకై బహుదేశ మరుదెంచినట్టి బేతాళులయాత్ర లలరెఁ

తే. గ్రొవ్వు మజ్జయు మెదడును గూర్చి బ్రహ్మ,రాక్షసశ్రేణులకు సమారాధనంబు
సేయ నెంచినదయ్యంపుఁజెలులయెన్ని,కలును ఫలియించె నమ్మహాకదనమునను.

శా. ఆలోనన్ బగవారిఁ గన్గొనఁగి మాయాయుద్ధలీలారతిన్
శైలూషాత్మజు లంబరస్థు లయి మజ్జామాంసచర్మాస్థులన్
శైలాదుల్ గురియించి సేన నొగిలించన్ గాంచి కల్పక్షయ
క్ష్వేలగ్రీవునికై వడిన్ భరతుఁ డక్షీణక్రుధాక్రాంతుఁడై. 179

శా. సంవర్తారుణమండలస్ఫురితతీక్ష్ణజ్యోతిరుజ్జృంభి యౌ
సంవర్తాస్త్రము వింటఁ బూన్చి జగముల్ శంకింపఁగా నేసినన్
సంవర్తాశుగవేగ మొప్ప నదియున్ జ్వాలాస్ఫులింగోగ్రమై
సంవర్తాగ్నివలెన్ దహించె నపు డా శైలూషజశ్రేణులన్. 180

క. ఈరీతి మూఁడుకోట్ల మ,హారథికుల క్షణములోన నడఁగించినయా
ఘోరాస్త్రరాజ ముపసం,హారము గావించె భరతుఁ డమరులు వొగడన్. 181

### భరతుండు గంధర్వులం బరిమార్చి తనకుమారులగు తక్షపుష్కరులఁ దద్రాజ్యంబున నిలిపి యయోధ్యకు వచ్చుట

మ. భరతుం డీగతి నుగ్రశాత్రవతతిన్ భంజించి తద్దేశముల్
సరసప్రౌఢిమ నాక్రమించి ప్రజ లెంచన్ సింధుభూమిన్ సమ
గ్రరమావైఖరి మించ నొక్కపురమున్ గాంధారధాత్రిన్ శుభా
కరశిల్పోన్నతిఁ గాంచు నొక్కపురమున్ గల్పించె నారెంటికిన్. 182

ఆ. పొసఁగఁ దక్షశిలయుఁ బుష్కరావతియు నా, సంజ్ఞ లాచరించి స్వర్గభంగిఁ
దనరుతక్షశిలను దక్షునిఁ బుష్కరా,వతిని బుష్కరాఖ్యసుతుని నిలిపె. 183

చ. పురముల రెంట నిక్కరణిఁ బుత్రకులన్ సిరులొంద నిల్పి యా
భరతుఁడు నాఁడునాఁటి కలపట్టణముల్ ధనధాన్యవస్తుభా

స్వరములుగా ద్విజాతినృపవైశ్యభటాదికవర్ణవైభవా
కరములుగా రథేభతురగస్ఫురితంబులుగా నొనర్చినన్. 184

సీ. రాజితజ్యోతిగపరాజితస్త్రాగార రాజితప్రాకారరాజిఁ దనరి
చంద్రమండలతుంగచంద్రమండితశృంగచంద్రశాలాభంగశాలలఁ దగి
రమణీయతరవాసరమణిప్రఘర్షిసారమణిస్ఫురితగోపురముల వెలసి
రాజరాజధనోత్కరాజస్రసంవాసరాజమార్గములచే రహి వహించి

తే. కేళికాసారవాపికాఖేయకూప, కృతకకుధరోపవనదేవగేహమందు
రాధ్వజవిచిత్రకుడ్యతోరణవిశేష, భాసురశ్రీల నొప్పె నప్పట్టణములు. 185

క. అలకామరావతులక్రియ, నలరెడునప్పట్టణముల నైదేండ్లలమిన్
నిలిచి కుమారుల వీడ్కొని, బలువేడుక రాముకడకు భరతుఁడు వచ్చెన్. 186

తే. వచ్చి పరమేష్ఠి నర్చించువాసవుండ
పోలె నతఁడన్నపాదాబ్జములకు మ్రొక్కి
యతులమణిపూజ లొనరించి యరివధంబు
మున్నుగాఁ గలకార్యముల్ విన్నవించె. 187

తే. విన్నవించినరఘురామవిభుఁడు సంత,సించి తమ్ముల నిరువురఁ గాంచి యనఘు
లార మన యూర్మిళేయుల కైనపురము,లెవ్వియనఁ గైకయీపుత్త్రుఁడిట్టులనియె.

ఉ. అంగధరాంగనామణికి నంగద మై తగునంగదీయ మి
య్యంగదుఁ డేలు నుత్తరదిశాభరణం బనఁ జంద్రకాంతసం
జ్ఞం గర మొప్పుప్రోల్ తదనుజన్ముఁడు గైకొనునట్ల సేయుఁ డ
న్నం గడు సంతసిల్లి రఘునాయకుఁ డంచితవాసరంబునన్. 189

తే. అట్టె వారికిఁ బట్టముల్ గట్టి పశ్చి,మమున నంగదు నిలుప లక్ష్మణునిఁ బనిచెఁ
జంద్రకేతుని మల్లదేశమున నునుపఁ, బనిచె భరతునిసమముగా బలములొసఁగి.

చ. పనిచిన వారు నవ్విభుఁడు పంచినకైవడి నందు నందు న
త్తనయుల నుంచి వారికి హితం బుపదేశ మొసంగి రాజ్యముల్
పనుపడ నొక్కవత్సరము పాయక తాము వసించి తత్తదా
ర్యనుతుల వారి వీడ్కొని నిజాగ్రజుఁ గొల్వఁగ వచ్చి రయ్యెడన్. 191

ఆ. వచ్చి కొలుచు ననుజవరులతో రఘుభర్త, దనరు గార్హపత్యదక్షిణాగ్ను
లనుసరింప వెలయు నాహవనీయాగ్ని,వలె విభూషణాంశువులు వెలుఁగ. 192

ఆ. ఇవ్విధమున రాముఁ డేకాదశసహస్ర,వత్సరములు పరమవైభవమున
నేల నాల్గుచెఱఁగు లేలెఁ ద్రేతాయుగం,బాదియుగములీల నతిశయిల్ల. 193

క. ఘనమతులు భరతలక్ష్మణు, లనవరతము రామసేవ నాసక్తమతిన్
దనరుచుఁ గాలము చేరువ, యని యెఱిఁగియుఁ గలఁగకుండి రాసమయమునన్.

### యముఁడు మునివేషధారియై రామునికడకు వచ్చి రహస్యంబున బ్రహ్మవాక్యములు దెలుపుట

సీ. తనశోణతారకాంతరకాంతిచంచలచంచలాంచజ్జటాచ్ఛటల నించి
తనచతుర్దంష్ట్రికాధళధళల్ పరిశుద్ధభసితాంగరాగసంపదల నుంచి
తనకేళిదండంపుదండితనం బెల్ల హస్తస్ఫురద్బ్రహ్మయష్టి నిలిపి
తననిండుమేనికందెనచాయ కటిబద్ధనవ్యకృష్ణమృగాజినమునఁ బూన్చి
తే. శాంతభావంబు కరుణాప్రసన్నముఖము, నిర్మలోదకపూర్ణకుండికయుఁ దనర
జటిలవేషంబు ధరియించి జముఁడు వెలిహజారమున కేఁగుదెంచి లక్ష్మణునిఁ గనియె

ఉ. ఇచ్చటి కొక్కతాపసకులేశ్వరుఁ డంపఁగ నేను దూత నై
వచ్చితిఁ బద్మబంధుకులవర్యునిఁ గన్గొని మాటలాడఁగా
నచ్చతురాత్ముతోఁ దెలుపుమయ్య మదాగమనంబు నావుడున్
జెచ్చెర లక్ష్మణుండు నృపుఁ జేరి కరంబులు మోడ్చి యిట్లనున్. 196

చ. దినకరతీక్ష్ణతేజమున దృష్టికిఁ వేఁడిఁ గొనరింపుచున్నవాఁ
డనితరధర్మమూర్తి యొకయార్యునిదూత తపస్వి దేవరన్
గనుఁగొని మాటలాడుటకుఁ గా మొగసాలకు వచ్చి నిల్చినాఁ
డన విని రాముఁ డాతని రయంబునఁ దోడ్కొని రమ్ము నావుడున్. 197

చ. అతఁడును శీఘ్రయానమున నమ్మునిఁ దోకొని వచ్చునంతలోఁ
బతి యెదురేఁగి నమ్రుఁడయి పాద్యము మున్నుగఁ బూజ లిచ్చి యు
న్నతకనకాసనస్థితు నొనర్చి ప్రసన్నత మించి పల్కె నో
యతులవివేక యెవ్వరిట కంపఁగ వచ్చితి వానతియ్యవే. 198

చ. మిముఁ గనుఁగొన్న యంత నలమిత్త్రునిఁ జూచినయట్లు మానసా
బ్జ మలరె నామ మేమి తెలుపన్ గదె యన్న నతం డనున్ రహ
స్యముగ వచింతు నిజ్జనుల నందఱఁ బంపుము రామ నీవె కా
క మఱి పరుల్ వినంగ నధికారులు గారు మదీయవాక్యముల్. 199

క. అదిగాక యిర్వురమును స,హృదయులమై మాటలాడునెడ నిచటికి నీ
తి దొఱంగి వచ్చి నాతని, విదళించెద వేనిఁ గార్యవిధ మెఱిఁగింతున్. 200

చ. అన విని కొంతసేపు హృదయాబ్జమునన్ దలపోసి మంచిదే
యని సభ నున్నయందఱఁ బ్రియంబునఁ బంచి విభుండు లక్ష్మణున్
గనుఁగొని నీవు వాకిట నె కాచుక యుండు మి కెవ్వరైన వ
చ్చిన నిది వేళ గా దని వచింపుము పొమ్మని పల్కె నయ్యెడన్. 201

క. ఆకుహనామునిశేఖరుఁ, డేకతమున నున్న రాఘవేశ్వరుఁ గని సీ
తాకాంత బ్రహ్మ వనుపఁగ, నీకడ కేతెంచినాఁడ నే నంతకుఁడన్. 202

ఉ. ఈవు నృపాలమాత్రుఁడవె యీసచరాచరభూతకోటికిన్
దేవుఁడ వైన విష్ణుఁడవు దేవకిరీటచిరత్నరత్నశో

భావృతపాదపద్ముఁడ వనాది వనంతుఁడ వబ్జగర్భుఁ డ
య్యా వినుపింపు మన్నవిధ మంతయు నూఁకొను ముగ్గడించెదన్. 203

సీ. ఆదికాలమున క్షీరాబ్ధిలోఁ జిలువమున్నిపైఁ బవళించి నిదురఁ జెంది
కొన్నికల్పము లరుగుటయు మేల్కని భవన్నాభిఁ బుట్టినతమ్మి నను సృజించి
నీవీనులందె జన్మించిన మధుకైటభాఖ్యులన్ ద్రుంచి తదస్థితతుల
ధరములు మెదడున ధాత్రియుఁ గల్పించి లోకాధిపత్యంబు నాకొసంగి

తే. బాధలిడుదైత్యుల వధింపఁ బ్రతినఁ బూని, వెనుక రావణుచేనొచ్చి వేఁడుకొన్న
సురల రక్షింప దశరథసుతుఁడ వగుచు, నవతరించితి వని నొంచి తసురవరుని.

తే. మొదటఁ బలికినచందానఁ బదునొకండు, వేలయేం డ్లుర్వి యేలితి వేలయింకఁ
దామసము సేయ రమ్మాత్మధామమునకు, నిలుము రాజ్యేచ్ఛగలిగిన నేలనధిప.

చ. అని పరమేష్ఠిఁ దెల్పు మనె నంచుఁ బరేతవిభుండు వల్కినన్
విని చిఱునవ్వు నవ్వి రఘువీరుఁడు వారిజసంభవుండు ప
ల్కినదె హితోక్తి గావలయుఁ గృత్యము లన్నియు నయ్యె నియ్యెడన్
బను లిఁక లేవు వచ్చెదఁ బ్రభావనిధీ యని పల్కుచున్నెడన్. 206

దుర్వాసుఁడు క్షుత్పీడితుం డై రామునికడకు వచ్చుట

సీ. అనసూయగర్భశుక్తిని రూపు గని యేమహర్షి ముక్తాగ్రగణ్యత వహించె
నత్రిసంయమి తపోధాత్రీరుహమున కేయతివరేణ్యుఁడు ఫలాకృతి రహించె
నింద్రరాజ్యవిభూతి నేమౌనిశాపాక్షరావలి వాయువై యబ్ధిఁ గలిపె
రుద్రునియత్యుగ్రరోషాగ్ని యేమునీశ్వరునిచందమున గోచరతఁ జెందె

తే. నట్టిదుర్వాసుఁ డవ్వేళ నరుగుదెంచి
మోసల వసించు రాముతమ్మునిఁ గనుఁగొని
యధిపుతోఁ దెల్పు మారాక యనిన నతఁడు
నెంతయు వినీతుఁ డై మ్రొక్కి యిట్టు లనియె. 207

మ. జటిలాగ్రేసర వేళ గాదు రఘువంశస్వామి యేకాంతలం
పటచేతోగతి నున్నవాఁడు క్షమియింపన్ జెల్లు నొక్కింతసే
పటకున్ నాకును బోవరా దనిన రోషాగ్నిజ్వాలజ్వాలికా
చటులక్రూరకటాక్షుఁ డై యతఁ డనున్ సౌమిత్రితోఁ గ్రమ్మఱన్. 208

చ. నను నిలుపన్ బితామహజనార్దనశంభుల కైన శక్తి లే
దనఁగ నొకండు శక్తుఁడె నృపాగ్రణి కీవు మదాగమంబు దె
ల్పనిపని నిక్కమేని హితబాంధవమంత్రులతోఁ ధనంబుతోఁ
దనయులతో మిమున్ గినిసి దగ్ధులు గా శపియింతు నావుడున్. 209

తే. గడగడ వడంకి పెక్కండ్రు మడియుకంటె
నరయ నొక్కనిచావు మే లని తలంచి

రాఘవునిఁ జేరి మ్రొక్కి దుర్వాసుఁ డిపుడు
దేవ యరుదెంచినాఁ డంచుఁ దెల్పుటయును. 210

ఉ. వాసరరాజవంశమణి వాసరరాట్సుతు వీడుకొల్పి దు
ర్వాసునిఁ జేరఁ బోయి యభివందనముల్ ఘటియించి యేల వి
చ్చేసితి రేనిపూజనలు సేయుదు నావుడు వేయియేఁడ్లు నేఁ
జేసిన బత్తపంబునఁ గృశించితి నాఁకలి దీర్పవే యనన్. 211

చ. వడియము లొల్పుఁబప్పుఁ గలవంటకముల్ వరుగుల్ ఫలాదులున్
బడిదము లప్పముల్ వడలు పాయసముల్ కలమాన్న మాజ్య ము
ప్పడములుఁ గూరలున్ బెరుఁగుఁబచ్చడు లాదిగ నించి భోజనం
బిడిన నతండు మెచ్చుచు యథేష్టముగా భుజియించి పోయినన్. 212

క. కీనాశునిసమ్ముఖమునఁ, దా నూనిన ప్రతినఁ దలఁచి దశరథసూనుం
డాననము వంచి ధైర్యవిహీనుం డై దీనవృత్తి నిట్లని వగచెన్. 213

— లక్ష్మణుండు రామపరిత్యక్తుం డై సరయూనదిం గ్రుంకి దివంబున కరుగుట —

చ. కటకట యేల యిచ్చటికిఁ గాలుఁడు వచ్చె మహాప్రతిజ్ఞ యే
మిటికి నొనర్చితిన్ సుజనమిత్త్రుని నాసహజన్ముఁ బాసి నే
నెటువలె నిల్తు నెట్లు వచియింపుదు నివ్విడమాట యెవ్వరున్
గటికిమనంబుకోడ నవకార్యము లిట్టివి యాచరింతురే 214

సీ. స్రక్చందనాంగనాసౌఖ్యముల్ వర్జించి నాతోడఁ దొల్లి కానలకు వచ్చె
నెడపక పదునాలుగేండ్లు నిద్రాహారములు మాని నాకు సేవలు ఘటించె
సీతఁ బాసినవంతఁ జెందనీయక ధైర్య మొదవ మాటాడి నన్నుపచరించె
రణరంగమున మదర్థమ్ముగా నతికాయశక్రజిత్ప్రముఖుల సంహరించె

తే. హృదయ మెఱిఁగి ప్రవర్తించె నిన్నినాళ్లు, నిట్టిహితు నిట్టివిశ్వాసి నిట్టియాప్తు
నిట్టితమ్ముని బ్రతినకై యెట్లు నొంతు, నేమి సేయుదుఁ దుది దైవ మెంతసేసె.

వ. అని శోకబాష్పాకులితనేత్రుం డై యద్దశరథపుత్త్రుండు పెక్కుభంగులన్ బనవి
పనవి కన్నీరు కరతలంబునన్ దుడుచుకొని యెట్టకేలకు నెప్పటియెలుంగు
నూల్కొల్పి చెంగటనున్న యనుంగుఁదమ్మునిన్ గనుంగొని యిట్లనియె. 216

చ. అలుకవహించి యత్త్రికోడు కాఁకటిపెల్లున రేఁగి యందఱున్
బొలియఁగఁ దిట్టిపోయినను బోదుము నెమ్మది నాత్మహానికిన్
దలఁకక యేల వచ్చితివి నాయెడకున్ సడి కోర్చి నిన్ను ని
ర్మలు నెడఁబాసి నొంటి నిఁకఁ బ్రాణము లెట్లు భరింతుఁ దమ్ముఁడా. 217

క. ప్రతిన యొనర్చిననెపమున, మృతిఁ బొందన్ జేయు ననుచు నేమోయి ననున్
సతతంబు నమ్మి కొలిచితి, వతులగుణాభరణ లక్ష్మణా యని వగవన్. 218

ఉ. ఆరఘువీరుఁ జూచి వినయంబున లక్ష్మణుఁ డిట్లనున్ ననున్
గూరిచి చింత సేయకుము కోవిదు లాపదలన్ గలంగ రె
వ్వారికిఁ గాలమున్ గడవవచ్చునె మీరు ప్రతిజ్ఞఁ దప్పినన్
ధారుణి గ్రుంగదే స్వకులధర్మము మానుదురే నరాధిపుల్. 219

చ. ఎలమి వహించి నన్నుఁ ద్యజియింపక యుండితి రేనిఁ బల్కులన్
గలయు నసత్య మందులకుఁ గారణ మేఁ గన నన్నుఁ జెందుఁ ద
త్ఫల మటు గాక యుండ నరపాలక నన్నుఁ దొఱంగి సత్యమున్
విలసితకీర్తియున్ నిలుపవే యన రాముఁడు ఖేద మందుచున్. 220

క. కులగురుఁ డైన వసిష్ఠుని, నలఘుమతుల మంత్రివరుల నాద్యుల హితులన్
బిలిపించి జమునిరాక మొదలుకొని సకలంబుఁ దెలిపెఁ దత్సభ్యులకున్. 221

చ. తెలిసి వినీతు సోదరుఁ బ్రతిజ్ఞ యటంచుఁ ద్యజింపఁ గూడునే
తలఁకెడిఁ జిత్త మెయ్యది హితం బెఱిఁగింపుఁడు మీర లిందఱున్
గలఫల మన్న నొండొరు మొగంబులు సూచుచుఁ దేర్చి యెద్దియున్
బలుకఁగ నేర కూరక సభాసదు లున్న వసిష్ఠుఁ డిట్లనున్. 222

చ. ప్రతిన యటంచు లక్ష్మణునిఁ బాయుట యెట్లన నేల రామ నీ
ప్రతిన దొలంగినన్ బలు కబద్ధ మనంబడు నయ్యసత్యతన్
హత మగు ధర్మ మాసుకృత మంతముగా జగముల్ నశించు లో
కతతులు పెక్కునాశ మగుకంటె సహోదరుఁ డొక్కఁ డెక్కుడే. 223

చ. సకల మనిత్య మెప్పటికి సత్యము నిత్యము సత్యసంధులై
ప్రకటయశోవిభూతి మనరా మనరాజు లసత్య మాడ నో
పక కద నిన్నుఁ గానలకుఁ బంచె భవజ్జనకుం డెఱుంగవే
యకుటిలసత్యసంపద జనాధిప కీర్తి వహింపు నావుడున్. 224

క. ఆమాటలు విని సభ్య,స్తోమము విధి చెట్ట యనుచు దూఱఁగ రామ
స్వామి కడుఁ దెగువ చేకొని, సౌమిత్రిన్ జూచి ధైర్యసంపద ననియెన్. 225

చ. ఎడపక యెంతతప్పు ఘటియించినచో నినువంటి తమ్మునిన్
గడఁగి వధింపఁ జాల నధికప్రణిభాన్వితు లైనవారికిన్
విడుచుట చంపు టొక్కగతి నిన్నుఁ ద్యజించితి నీకు నిచ్చ యా
నెడ కిఁక నేఁగుమన్న నతఁ డెంతయు శోకవిషాదమూర్తి యై. 226

చ. అడలుచు నన్నపాదముల కప్పుడు సాఁగిలి మ్రొక్కి యార్య ల
క్కడిజనముల్ విభుండు దనుఁ గన్గొని యశ్రులు నించఁ గొల్వు వె
ల్వడి సరయూతరంగిణి కవార్యధృతిన్ జని క్రుంకి యోగ మ
య్యెడ ధరియించి యాత్మఁ దనయెప్పటిరూపుఁ దలంచునంతలోన్. 227

చ. ఎలమిఁ బ్రసూనవృష్టిఁ గురియింపుచు నింద్రుఁడు వచ్చి శంఖకా
హళములు మ్రోయ రంభ మొదలైన చెలుల్ నటియింప నమ్మహో

జ్వాలనిధి మేనితోడఁ ద్రిదివంబునకున్ గొనిపోయె వేడ్క నం
దలిబుధు లార వచ్చె హరినాలవపా లని ప్రస్తుతింపఁగన్. 228

తే. దివమునకు నిట్లు లక్ష్మణదేవుఁ డరిగి, యచట దివిజులచేఁ బూజలంది కోటి
భానుబింబప్రభాభాసమానుఁ డగుచు, నిత్యముక్తాశ్రయంబైన నెలవుఁ జేరె. 229

ఉ. అంత వసిష్ఠముఖ్యు లగునార్యులఁ గన్గొని రాముఁ డిట్లనున్
వింతగఁ దోఁచుచున్నయది విశ్వము లక్ష్మణుఁ బాసి నిల్వలే
నింతటనుండియున్ భరతు నిప్పుర మేలెడునట్లు సేసి లో
కాంతరగామి నైనభరతానుజునిన్ దిలకింప నేఁగెదన్. 230

చ. అన విని భీతుఁడై భరతుఁ డన్నకుఁ జాఁగిలి మ్రొక్కి పల్కె నో
యినకులనాథ యీధరణి యేటికి నింద్రపదాధిపత్య మి
చ్చిన మిముఁ బాసి నే క్షణముసేపయినన్ వసియింపఁ జాల మీ
కనిశము సేవఁ జేయుటయె యంచితరాజ్యము వేయు నేటికిన్. 231

క. నరవర కోసలదేశము, పరిపాలన సేయఁ గుశుని బట్టము గట్టుం
డురుకృప నుత్తరకోసల, ధరణికిం బతిఁ జేయుఁ డతనితమ్ముని ననఁగన్. 232

చ. అనియె వసిష్ఠుఁ డోరఘుకులాధిప మీపలు కాలకించి యీ
జను లెడఁబాయలేనివెత జాలి వహించిరి వీరిఁ దేర్పఁగా
జను నన రామచంద్రుఁడు ప్రసన్నత నాప్రజఁ జూచి మీరు కో
రినపని యేమి తెల్పుఁ డొనరించెద నెట్టిది యైన నావుడున్. 233

ఉ. పౌరులు మంత్రులున్ భటులు బంధులుఁ బ్రాంజలు లూని నిల్చి యో
కారుణికాగ్రగణ్య కలకాలముఁ బ్రోచి మమున్ త్యజించి పో
మేరయె పుత్త్రపౌత్త్రసఖమిత్త్రసహోదరగేహినీసుహృ
ద్వారములతో మిమున్ గొలిచి వచ్చెద మెక్కడఁ జన్న నావుడున్. 234

క. ఎలనగ వారలయ రఘూద్వహుఁ, డలమనుజులమనవి విని కృతాంతునిపలుకుల్
దలఁచుకొని మంచి దనియెన్, గలవె సమర్థుల కసాధ్యకార్యము లెందున్. 235

రాముండు కుశలవులకుఁ బట్టము గట్టుట

క. కోసలకన్యాసుతుఁ డిటు, లాసించినయట్టిప్రజల నలరించి కృపన్
గోసలదేశమునకుఁ బతిఁ, జేసెఁ గుశు విపక్షకరటిశితాంకుశునిన్. 236

క. లవు నంఘ్రిద్యుతిజితపల్లవు నంగవిలాసవిభవలజ్జితరతిప
ల్లవు నుత్తరకోసలమున, కవనీశ్వరుఁ డధిపుఁ జేసె నార్యులు మెచ్చన్. 237

ఆ. ఇటుల దొరలఁ జేసి యిద్దఱుసుతులకుఁ, బ్రేమ నిచ్చినట్టిభూములందు
రావణాహితుఁడు కుశావతి యనుప్రోలు, శ్రావితాఖ్యపురము సంఘటించె. 238

ఉత్సాహ—
దేవతాసరిత్సరోజ దేదివన్మరాళసం
భావితాభ్రవిభ్రమభ్రమస్ఫురత్సురేశ్వర

గ్రావబద్ధగోపురప్రకాశముల్ కుశావతీ
శ్రావితాభిధానసత్పురంబు లొప్పె నెంతయున్. 239

చ. పురయుగ మిట్లొనర్చి యటఁ బుత్త్రులఁ బంపెడువేళ రాఘవుం
డిరుపురకున్ సమానముగ నిచ్చె రథేభభటాశ్వపంక్తులన్
గరుణఁ గనుంగొనెన్ జనకకన్యఁ దలంచి కవుంగిలించి త
చ్ఛిరములు మూర్కొనెన్ నయవిశేషము లెల్ల దలంచి ప్రేముడిన్. 240

చ. ఇనకులభర్తచేఁ దనయు లిట్లుపలాలితులై తదంఘ్రియు
గ్మనఖవిభల్ స్వఫాలఫలకప్రలసద్ఘనసారరేఖలన్
జెనకఁగ మ్రొక్కి దీవనలు సేకొని వీడ్కొని బాష్పపూర్ణలో
చను లయి పోయి రవ్విభుఁ డొసంగిన చోట్లకు సైన్యసంగతిన్. 241

శత్రుఘ్నుఁడు తనకుమారులకుఁ బట్టముఁ గట్టి రామునికడకు వచ్చుట

తే. అంత శత్రుఘ్నుఁ దోడితెమ్మని నృపాలుఁ
డాప్తుఁ డగుదూత నొక్కని ననుప వేగి
రమునఁ జని వాఁడు మూఁడహోరాత్రములకు
నధికసౌభాగ్యమధుర యామధురఁ జేరి. 242

మ. అలశత్రుఘ్నునిఁ గాంచి లక్ష్మణుని నిర్యాణంబు పౌరాశ్రితా
దులు రాముం బతిఁ గొల్చి పోవుటకు నుద్యోగించు టాత్మీయపు
త్త్రులకున్ గోసలభూము లిచ్చి జననాథుం డూర్ధ్వలోకోన్ముఖా
కలితప్రజ్ఞ వహించి యున్కి మొద లౌ కార్యస్థితుల్ దెల్పినన్. 243

క. విని కలఁగియుఁ గలఁగక య,జ్జననాథసుతుండు ధైర్యసంపన్నతఁ గాం
చనుఁ డనుపురోహితునిఁ బుర,జనములఁ బిలిపించి ప్రియమెసఁగ నిట్లనియెన్.

తే. అన్న నెడఁబాసి లక్ష్మణుం డమరపురికి
నేఁగెనఁట యెల్లప్రజలతో నింక విభుఁడు
వెడల నున్నాఁడఁట యయోధ్య విజనమయ్యె
నఁట విలోకించితిరె కాల మెటుల వచ్చె. 245

ఉ. రామవిభుండు లేనియమరావతినైన క్షణంబు నిల్తునే
యీమధురాపురంబునకు నింక సుబాహు నుదగ్రపుత్త్రునిన్
స్వామిగఁ జేసి యుంచి విదిశాపురరాజ్యము శత్రుఘాతికిన్
బ్రేమ నొసంగి పోయెదను మీర లనుజ్ఞ యొసంగుఁ డియ్యెడన్. 246

క. అని పలికి వారియనుమతిఁ, గొని యాయాపురములకును గొడుకుల నభిషే
చన మొనరిచి చెచ్చెరగముగ, ఘనబలములఁ బంచి యొసఁగి గమనోన్ముఖుఁడై.

క. సుతదారాదుల వీడ్కొని, యతఁ డతిధైర్యమున నొంటియరదముతో క్ష్మా
పతిసంప్రేషితదూతా,న్వితుఁ డయి సాకేతమునకు నేతెంచి వెసన్. 248

శా. సందర్శించె మహాసభాంతరమునన్ శత్రుఘ్నుఁ డుద్యత్సదా

నందుఁ భూరికుశాసనస్థితు మునీన్ద్రశ్రేణిసంభావితుఁ
సందీప్తానలతేజు శాంతినిరతుఁ క్షౌమాంబరోద్ధారు స్వ
చ్ఛందుఁ జంద్రనిభాననుఁ ఘనసదృక్షశ్యామునిఁ రామునిన్. 249

క. సందర్శించి ప్రియంబున, వందనమొనరించి స్వామివారియనుజ్ఞన్
నందనులఁ దగినభూముల, యందు నిలిపి వచ్చినాఁడ నకలంకమతిన్. 250

చ. పలుకులు వేయునేల మిముఁ బాసి యిఁకన్ క్షణమైన నిట్టిభూ
స్థలమున నిల్వఁ జాల నిది సత్యము నేనును గొల్చి వచ్చెదన్
వలదని యానతీయకుఁడు త్వాదృశు లెయ్యెడ నమ్మియున్నవా
రల విడరంచు వేఁడుకొన రమ్మనె నాతని రాముఁ డాదృతిన్. 251

వ. తత్కాలంబున. 252

చ. నరపతి యూర్ధ్వలోకగమనంబు చరుల్ వినిపింప ఋక్షవా
నరులు నిశాచరుల్ విని స్వనాథులఁ గూడి యయోధ్య కేఁగుదెం
చిరి వినయంబు మించ రఘుశేఖరుఁ గాంచి ప్రణామముల్ ఘటిం
చిరి కరముల్ మొగిడ్చిరి వచించిరి యిట్లని యంద ఱొక్కటన్. 253

క. ధరణీనాయక మే మిం దఱముఁ మిముఁ గొల్చి వచ్చుతలఁపున నిటకున్
బఱతెంచితి మెడపక మము, గురుకృప నిఁక వెంటఁబెట్టుకొని పోవఁ దగున్.

చ. అను నెడ భానుసూతి వినయంబున రాముని జేరి మ్రొక్కి యో
మనుకులనాథ దేవవిభుమన్నని వానర రాజ్యపట్టభ
ద్రునిఁగ నొనర్చి మీచరణతోయజయుగ్మంబులు గొల్వ వచ్చితిన్
నను విడనాడి పోవకుఁ డనన్ బతి సమ్మత మొందె నెమ్మదిన్. 255

క. ఫాలన్యస్తాంజలి యై, యాలోన విభీషణుండు నండకు రాఁగా
నాలోకించి రఘూద్వహుఁ, డేలా యీతలఁపు రాక్షసేశ్వర నీకున్. 256

చ. ధరణి చరాచరావళులు దాలిచి యుండెడునంతకాలమున్
పరమవినీతి లంక పరిపాలనసేయు మి దేల యంచు ను
త్తరములు పల్కరాకుము సదా చరియింపుము ధర్మపద్ధతిన్
నిరతిశయప్రభావమున నెయ్యము మర్వకు మంచుఁ బల్కినన్. 257

క. రామాజ్ఞకు వెఱచి యతం, డేమియు నన నేరకుండె నినకులుఁ డంతన్
సామీరి మోముఁ జూచి సు,ధామధురవచోనిరూఢి తగ నిట్లనియెన్. 258

శా. ఏతన్మాత్రుఁడవే విభాకరకృపాపీయూషసమాసాదిత
శ్రౌతస్మార్తరహస్యరాశివి భవిష్యద్ధాత వధ్యాత్మవి
ద్యాతాత్పర్యనిరూఢబుద్ధివి విశుద్ధబ్రహ్మచర్యవ్రతో
ద్ధూతాంభశ్చరకేతనుండ వఖిల స్తుత్యప్రభావోదయా. 259

క. మత్కీర్తిచంద్రికలు యా,వత్కాలము కువలయమున వన్నియఁ గనుఁ దా
వత్కాలముఁ గపిచంద్ర భ,వత్కాయం బమృతగతి ధ్రువంబుగ నిల్చున్.

క. నామాటలు నిక్కువ మగు, నీమదికోర్కియు ఫలించు నిత్యుఁడ వగు మిం
కేమియు బలుకకు మని రఘు, రాముఁడు సామీరినని కరం బనురక్తిన్. 261

తే. బ్రహ్మసుతు ఋక్షకులసార్వభౌముఁ జూచి, నీవు చిరకాలజీవివి నిర్మలుఁడవు
కలఁగ కెప్పటివలె భూమి నిలువు మని వచించి మైందద్వివిదువీక్షించి విభుఁడు.

చ. బలువగువేడ్క మీ రమృతపానముఁ జేసినవారు గావునన్
తలుగదు మీకు హాని చిరకాలము వర్తిలుఁ డుర్వి నంచుఁ బెం
పలరఁగఁ బల్కి తక్కిన వనాటుల నాబడి నేఁగుడెందు చిం
తిలక తలంచి నట్ల యని తేటపడన్ వివరించె నయ్యెడన్. 263

క. ఆరఘురాముని మాటలఁ, బౌరులు బాంధవులుఁ గవులు బహుజానపదుల్
గోరికఁ బెండ్లికిఁ బోయెడు, వారివలెన్ వెలఁగి రుత్సవంబులు వెలయన్. 264

సీ. చూడవచ్చిన మహీసురులకుఁ దమయిండ్లు వేడ్కతోఁ జూఱలు విడుచువారు
దిక్కులనుండి యేతెంచిన యర్థుల కెల్ల పదార్థంబు లిచ్చువారు
ధరణి దాఁపుటయును ధర్మమంచు ధనంబు చెలఁగి నిక్షేపముల్ సేయువారు
కళ్యాణ మిఁక నింతకంటె నెట్టిది యని సకలోత్సవంబులు సలుపువారు

తే. బంధములు దీఱె మనతపఃఫలము లొదవె
నెప్పు డిఁక వేగుఁ బతివెంట నెపుడు వోదు
మంచు నలరేచి యుగముగా నెంచువారు
నైరి సాకేతముననున్న యఖిలజనులు. 265

మ. మఱునాఁ డంత వసిష్ఠుఁ జూచి రఘురామస్వామి వల్కెన్ మునీ
శ్వర నేఁడే పరమేష్ఠివీడుఁ దిలకింపన్ వేడ్క వాటిల్లెడిన్
పరిపాటిన్ నెరవేర్పుఁ డంచితమహాప్రస్థానకర్మంబు ముం
దర సాగింపుఁడు యాగవహ్ను లన నాతం డట్ల కావించినన్. 266

సీ. పండు వెన్నెలడాలు బైటవేయగఁ జాలు ప్రవిమలక్షౌమాంబరములు గట్టి
గరుడపచ్చలమేను పరిహసింపఁగ నోపు దర్భాంకురములు హస్తములఁ దాల్చి
హరినీలములరంగు నపహరింపఁ దొడంగుఘన కేశబంధంబు వెనుకఁ జేర్చి
తమ్మిఱేకులజోక తలఁగఁ జేయువిలోకనములు స్వనాసికాగ్రమున నుంచి

తే. శాంతలక్ష్మి వసించుకంజాత మనఁగ
మొగము దులకించఁ బటుమౌనముద్ర మించ
నేవికారంబు లేక యయ్యినకులేంద్రుఁ
డల్లనల్లన నాత్మగృహంబు వెడలె. 267

శ్రీరాముఁడు తమ్ములతోడను పౌరులతోడను సరయూనదిం బ్రవేశించుట

వ. అప్పు డప్పరమకృపాళునిడాపలిభాగంబునం గరపద్మంబులు ముకుళించుకొని
పురలక్ష్మి యనుసరించె దక్షిణభాగంబున హ్రీ యనుశోయజాక్షి యాకారంబు

ధరియించి దాక్షిణ్యకారుణ్యధైర్యగాంభీర్యస్థైర్య చాతుర్యాది వివిధగుణంబు
లతో ననుగమించె ముందర విజయవినయధర్మ సత్యక్షమాశమదమౌదార్య
వివేకవిశేషంబులతో నుద్యోగంబు గనుసించె వెనుక ననేకశస్త్రాస్త్రనివహం
బులు పురుషవిగ్రహంబులు ధరియించి తనకుఁ గొలువఁ బురుషాకారంబుతోడఁ
గార్ముకం బనుసరించె ఋగ్యజురాదివేదంబులు బ్రాహ్మణరూపంబులతో నగ్రభా
గంబున నరుగుచుండెఁ దన్మధ్యంబున సావిత్రీమహాదేవి స్త్రీరూపధారిణియై
సప్తవ్యాహృతులతోఁ బ్రణవంబుతో ఛందోఋషిన్యాసదేవతాబీజశక్తికీలక
ప్రముఖమంత్రాంగంబులతో నమితమంత్రతంత్రయంత్రసమూహంబుతో ద్వా
త్రింశదుపనిషత్సమేత యై నడిచె నద్దేవిపిఱుంద స్మృతిశాస్త్రపురాణేతిహాసం
బులు పౌరుషవిలాసంబులు వహించి యనుగమించె సమంచితక్షేమంబునఁ
జనురఘురాము నవలోకింపుచు దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి శేఖరు లప్సరస్సిద్ధసాధ్య
విద్యాధరప్రముఖనిఖిలదేవవర్యులు నలుదిక్కులఁ గిక్కిఱిసి సమ్మర్దంబుగాఁ
బఱతెంచిరి దాసదాసీజనంబులతోఁ బుత్త్రమిత్త్రకళత్త్రంబులతో నాప్తసఖిబంధు
సోదరముఖ్యులతో నయోధ్యలోఁ గలసకలజనంబులు చుట్టుపట్లపల్లెపట్టులఁ
గలప్రజలు జానపదులు మొదలుగా నొక్కండును జిక్కక యొక్కుమ్మొత్తం
బై నడతెంచిరి యంతఃపురస్త్రీజనంబులు వృద్ధులు పశ్వాదులు పరివేష్టింప
భరతశత్రుఘ్నులు సదారబాంధవులైన సుమంత్రాదిమంత్రులతో సామంతుల
తో సుభటపుంగవులతో హితసహితులై యహితభీకరుం డగ్గుణాకరు నను
సరించి సాగ్నిహోత్రులై నానాగ్రహారవిశిష్టాగ్రవర్ణులు కుటుంబసమన్వితం
బుగా సవత్సకంబులగు గోధనంబులు మున్నిడుకొని వెంబడిఁ జనిరి సుగ్రీవసుషేణ
గంధమాదన పనసగజగవయ గవాక్షశతబలినలనీలవినత కేసరి గ్రథనదధిముఖ
ధూమ్రవేగసువేగతారకుముదప్రజంఘప్రముఖ మహావలీముఖులు ఋక్షవానర
సమేతులై పరమహర్షంబునఁ గదలిరి వాంశిక వైణికమార్దళికమౌరజికఢాక్కిక
వైతాళికవందిమాగధప్రముఖులు కవినటగాయకులు భద్రమధుమత్తకాశ్యపప్ర
ముఖనర్మసఖులు గణికాబ్జముఖులు నిఖిలకర్మంబులు దిగంద్రోచి నిష్కల్మషభా
వంబున రామగుణకీర్తనంబులు సేయుచు నతనివెనుకొనిరి విద్వత్పురోహిత వేదాం
తికతార్కికవైయాకరణప్రముఖులు జన్మబంధంబులు దీఱెనని సంబంధులై సింధు
బంధనస్నేహానుబంధనంబున వెంబడిఁ గొలిచి పోయిరి యదృశ్యభూతంబులు
నదృశ్యనగరవాసులు నతిసూక్ష్మశరీరులు నతిస్థూలశరీరులు నరుదెంచిరి పశుపక్షి
మృగక్రిమికీటకాదులు శైలవృక్షలతాగుల్మాదు లుపాధిరహితసదాభిలాషంబున
నయ్యగశోభను నాశ్రయించె నివ్విధంబున నఖిలచరాచరంబు లొక్కదిక్కై

నడచునప్పీటిమహాఘోషంబు ప్రళయసముద్రఘోషంబు ననుసరించె భేరీపణవ శంఖాదివాద్యఘోషంబు లజాండ గర్భ నిర్భేదనం బాచరించె నించుకయుఁ జలింపక కొంచక యిహాసుఖంబులు దలంచక దుఃఖించక యేకచిత్తులై యజ్జను లందఱుఁ బెండ్లికిఁ బోవుచందంబున రఘునందనుపదారవిందంబులు సేవించు చుఁ బోయి రవ్వింతఁ జూడవచ్చిన వివిధరాష్ట్రనివాసులు తమకు నిదియే త్రోవ గాక యింతకంటె నేమి విశేషంబు లున్నవి యని కృతనిశ్చయు లై వెంబడించి రిట్లు రఘువీరుం డామడదూరంబు మందగమనంబున నతిక్రమించి పశ్చిమవాహిని యైన సరయూనదీతీరంబు చేరఁ బోయె నయ్యవసరంబున, 268

ఉ. అన్నదికిన్ ముహూర్తమున నంబుజగర్భుఁడు లోకపాలకుల్
కిన్నరయక్షకింపురుషఖేచరులున్ వసురుద్రసంఘముల్
పన్నగు లాదితేయులును బ్రహ్మాఋషుల్ గొలువన్ మణిప్రభా
చ్ఛన్నవిమానకోటులు దిశల్ వెలుఁగన్ జనుదెంచి వేఁడుకన్. 269

శా. ధింధింధి మ్మని మ్రోయుమద్దెళతో దేవాధిరాడ్భేరికా
ధంధంధ్వానము లాకసం బొరసె నంతన్ దాళసంరావసం
బంధంబుల్ దగ నాడి రచ్చరలు సమ్యగ్గీతముల్ పాడి ర
గ్గంధర్వుల్ జడి వట్టి బెట్టు గురిసెన్ గల్పప్రసూనచ్ఛటల్. 270

క. సరసీజాక్షుఁడు రాముఁడు, సరయూనదిఁ జొచ్చె నపుడు సహజన్ములతోఁ
జరణాంభోజము లచ్చటి, యరుణాంభోజములు వియ్యమందుచు నలరన్. 271

ఉ. ఆరఘువీరశేఖరుముఖాబ్జమునందు నిజావలోకనో
దారమిళిందబృందములు దార్కొనఁ జేసి విధాత భారతీ
చారుముఖీపదాంబురుహసంగతహంసరవానుసారిమం
జీరఝుళంఝుళధ్వని విశేషముతో దివి నుండి యిట్లనున్. 272

క. శ్రీరామచంద్ర జగదా, ధారా దివ్యావతార దాసశరణ్యా
కారుణ్యాసార రవికుల,హారా భవ్యప్రచార యఖిలస్తవ్యా. 273

ఉ. ఈయఖిలప్రపంచమున కీవు విభుండవు నీయవాచ్య మా
మాయ నెఱుంగ మాతరమె మానుషవేషము మాని యాదినా
రాయణమూర్తి వై యనుచరావలి గొల్వ ఖగేంద్రునెక్కి వి
చ్ఛేయుము కాలయాపనము సేయఁగ నేల మహాత్మ యిచ్చటన్. 274

ఉ. అవ్యయ మప్రతర్క్య మఖిలాశ్రయ మక్షయ మాద్య మార్యసం
స్తవ్య మనన్ దనర్చుపరతత్త్వము నీవయి సృష్టిసాధన
ద్రవ్యగుణాత్మకత్వమునఁ దాలుతు వేతను వైనఁ జూపు మ
ద్దివ్యశరీర మందఱకు దేవ కనుంగొన వేడ్క యయ్యెడిన్. 275

క. శ్రీరామ సీత యనఁ జను, శ్రీరామ భవత్పదంబుఁ జేరి మునుపుగా
నీరాకఁ గోరుచున్నది, కోరికయును గూర్పవయ్య గొబ్బున ననుచున్. 276

క. వనజాసనుండు దెలిపిన, విని రాముఁడు సంతసించి విశ్వజగన్మో
హనలీలావిలసిత మగు, తనదివ్యశరీర మాత్మఁ దలఁచిన యంతన్. 277

సీ. శతకోటిభాస్కరద్యుతుల మిటారించు ఘనకిరీటము మౌళిఁ గానిపించె
శేషభోగీశ్వరశ్రీలరాజిల్లు నాజానులంబిచతుర్భుజములు దోఁచె
నసురులకు సురశ్వా మొసఁగించుశంఖచక్రగదాసిశార్ఙ్గముల్ కడు రహించెఁ
గౌస్తుభ శ్రీవత్స కమనీయవైజయంతికలతో వక్షంబు తేజరిల్లె
తే. ధాతఁ గాంచినపొక్కిటితమ్మి వెలసెఁ, గటితటంబునఁ దులకించెఁ గనకపటము
పొలిచె నఖిలాంగములదివ్యభూషణంబు, లఖిలలోకంబు లవ్వేళ నరుదుఁ జెందె.

సీ. మకరకుండలవజ్రమహనీయధళధళల్ చికిలిలేనగవుతోఁ జెలిమి సలుప
మకుటపంకజరాగమణిరుచుల్ వినువీథిఁ గపటసంధ్యారాగకాంతిఁ బెనుప
శారీరగారుడాశ్మచ్ఛాయ లెదవేలు వైజయంతికతోడ వాదులాడఁ
గరలగ్నశంఖచక్రశ్రీలు శతకోటి చంద్రసూర్యులజోకఁ జౌక సేయఁ
తే. గటితటాబద్ధకనకాంశుకము మెఱుంగు, లసమయతటిల్లతలసొంపు దెసల నింప
గరుడవాహనమెక్కి లోకములుపొగడ, రాముఁడవ్వేళవైకుంఠధాముఁడయ్యె.

సీ. మొసలివాయొంట్లకెంపులకెంపు దృక్కోణసంరక్తరుచులతో సంధి చేయ
లలితాలకస్థలాకలితాలకశ్రీలు ముకుటనీలములతో ముచ్చటాడఁ
గీర్తితేజములఁ జిక్కినచంద్రరవులట్ల శంఖచక్రములు హస్తముల వెలయ
వక్షస్స్థితేందిరావక్షోజకస్తూరిచెలువున శ్రీవత్సచిహ్న మమరఁ
తే. గోటి దశకోటి శతకోటి కోటికోటి, భానుబింబము లాకార మూనినట్లు
దుర్నిరీక్ష్యప్రకాశుఁడై దోఁచె నిదిగో, విష్ణుఁడని యెంచిరచ్చోటివిబుధవరులు.

మ. అపు డబ్జాసనలోకపాలవసురుద్రాదిత్యు లయ్యిందిరా
ధిపులోకైక మనోహరాంచితమహాదివ్యాంగసౌభాగ్య మ
చ్చపుభక్తిం దిలకింపుచుర్ బహునమస్కారంబు లర్పించి ఫా
లపరీతాంజలులై నుతించి రనరాళప్రౌఢవాగ్వైఖరిన్. 281

తే. ఎడ తెగక మ్రోసెసురభేరు లేకధార, గాఁ గురిసెదివ్యసుమములొక్క మొగిఁబాడి
రఖిలగంధర్వు లుడుగక యాడి రప్స, రోజనము లాఖగేంద్రాధిరూఢు నెదుట.

తే. భరతశత్రుఘ్ను లవ్వేళ బ్రహ్మమొదలు, గాఁ గలసమస్తదేవతల్ గనుఁగొనంగ
నద్భుతాఖండతేజోమయాత్ము లగుచుఁ, గలసి రద్దేవుదివ్యవిగ్రహమునందు.

తే. అమలసరయూజలముల దేహంబు విడిచి, భానునందనుఁ డర్కబింబమునఁ గలసెఁ
ననలుఁ బ్రాపించె నీలుండు నవ్విధమున, నమరవరశిల్పిలో నలుఁ డైక్య మొందె.

క. ఏయే వేల్పులయంశము, లేయేకపు లూని పుట్టి రిలలోపల ము
న్నాయా వేల్పులఁ గలిసిరి, యాయాకపియోధనాథు లాహరియాజ్ఞన్. 285

తే. యక్షకిన్నరగరుడగుహ్యకవియచ్చ, రాదిదేవాంశములఁ బుట్టినట్టిబుక్ష
వానరనిశాచరాదు లవ్వారి నంగ,కములు వర్జించి వారిలోఁ గలిసి రపుడు. 286

మ. గరుడారోహకుఁడైనవిష్ణు నెదుటన్ గన్గొంచు నానాజనుల్
సరయూతోయములన్ విముక్తతనులై సాంద్రవిజ్యోతి రు
ద్ధురులై దివ్యవిమానరాజములయందున్ బుత్రపౌత్రాప్తసో
దరకాంతాదులతో వసించి తగి రంతన్ దేవతామూర్తులై. 287

క. పక్షిపశుక్రిమికీటక, వృక్షలతాగుల్మశైలవితతులు సరయూ
నిక్షిప్తమూర్తులై యవు, డక్షయదేవత్వ మొనసి యలరె హరికృపన్. 288

మ. సరసీజోదరుఁ డంత బ్రహ్మఁ గని భాషానాథ యీప్రాణు లం
దఱు భూలోకముఁ బాసి నిత్యపదచింతన్ఁ జేసి నావెంట వ
చ్చిరి వీరెల్లను మాకు బ్రాణములు గాఁ జింతించి సౌఖ్యప్రదో
పరిలోకంబుల నిల్పు మంచుఁ గరుణాపారీణుఁడై పల్కినన్. 289

మ. అమరజ్యేష్ఠుఁడు తత్పశుప్రముఖతిర్యగ్జంతుసంఘంబులో
నమరత్వంబు వహించి యున్నజనులన్ హర్షంబునన్ సత్యలో
కము చెంతన్ బహుభోగభాగ్యములచేఁ గన్పట్టుసంతానలో
కములన్ నిల్పె ముకుందుకూర్మికి శిరఃకంపంబు గావింపుచున్. 290

క. పవనసుతాంగదమైంద, ద్వివిదవిభీషణులు ఋక్షవిభుఁడున్ భువిలో
నివసించిరి తక్కినవా, రవనీశ్వరుఁ గొలిచి చనిరి హర్షముతోడన్. 291

తే. నృపుఁడు సరయువునకు వచ్చునపుఁడు ఋక్ష
వానరులలీల వచ్చినవార లెల్ల
నవ్విభుఁడు విష్ణుమూర్తియై యాత్మపురికి
నరుగునెడ వేల్పులై పోయి రద్భుతముగ. 292

చ. ఇటువలె నమ్మియున్నప్రజ కెల్లను సద్గతు లిచ్చి బ్రహ్మధూ
ర్జటిబలభిత్కృశానుయమరాక్షసపాశిమరుద్ధనేశు లొ
క్కట నిరువంకలన్ గొలువ గారుడపర్ణసువర్ణదీధితి
చ్ఛట లఖిలాశలన్ దొరయఁ జక్రి స్వధామపథానువర్తియై. 293

శ్రీరాముఁడు వైకుంఠధామంబునకు వేంచేయుట

వ. వేంచేయునప్పు డుప్పరం బొరయుచప్పుడులతో నెడమీఁక సందర్శించుతలంపులఁ
బైపైఁ బడి క్రందుసేయు బృందారకాదులసందడి జడియక కనకమణివిచిత్ర
వేత్రపాణియై సూత్రవతీకళత్రుండు ముందర బరాబరు లొనర్చునెడ నుప్ప
తిల్లుహుంకృతుల నలంకరించు పరిసరస్థలానుచరచామరకరామరకన్యకా నవ్య
రత్నసంకలితకంకణక్రేంకృతులకు శ్రుతులగు తదీయకబరీభరనిబిడీకృతకుసుమ

మాలికావాసనోన్ముఖముఖరభ్రమరపాలికాఝుంకృతులకళుకునింద్రపురస్కృతై
రావణదంతావళరాజంబుఘీంకృతుల నావరించు సౌరభేరీభూరిభాంకృతుల నప్ప
ళించు సుపర్ణసువర్ణపర్ణఝూంకృతుల ననుసరించు నందసునందకుముదకుముదాక్ష
పుష్పదంతచండప్రచండప్రముఖ పార్శ్వచరహుంకృతులు నిఖిలదిగ్భాగంబు
లాక్రమించె నివ్విధంబున నవ్విహంగవాహనుండు భువర్లోకనివాసులయాసలు
దీఱ దర్శనం బొసంగుచు సువర్లోకమందిరులయభివందనంబు లంగీకరింపుచు మహ
ర్లోకలోకుల నమోనారాయణాయేతివాక్యంబు లాకర్ణింపుచు జనర్లోకజనంబుల
పూజనంబుల నలరుచుఁ దపోలోకతపోధనులసేవాంజలుల గ్రహించుచు సత్య
లోకసంచారు లోన్నమోనారాయణాయేతి మంత్రోచ్చారణపూర్వకంబుగా
సమర్పించిన యర్ఘ్యపాద్యాదులం జేకొనుచు సంతానలోకజనులు గురియించు
సంతానకుసుమవర్షంబుల హర్షంబులనొందుచు గోలోకప్రచారులు నివేదించు
కానుకలంగీకరింపుచు ధ్రువాదిపరమభాగవతజేగీయమానుండును దేవర్షి బ్రహ్మర్షి
సహాగమ్యమానుండును నఖండశతకోటిమార్తాండమండలద్యోతమానుండును
ననేక దివ్యాభరణ మణిప్రభా శోభమానుండును నై యుదక్పథంబునఁ జని
చని శరచ్చంద్ర చంద్రికాస్నిగ్ధ దుగ్ధజలధి సమావేష్టన శ్వేతద్యుతిప్రద్యోతిత
శ్వేతాంతరీపప్రదీపితజ్వలనజ్వాలికాసమానభాసమాన హిరణ్యాధరణ్యాంతరంబు
దఱియఁ జొచ్చి తన్మధ్యంబునఁ బునర్జననకారణలింగశరీరనికారణవిధానంబు
శరాభిధానంబును స్నాతకజనజరామరణక్షుత్పిపాసాద్యుపాధివిరామప్రభావం
బును నమృతప్రభావంబును సదాసదాశ్రయతాతిశయంబునఁ బుష్కరాహ్వ
యంబును యథార్థంబుగావించుసుధామధురశిశిరలఘుతరసలలితసలిలంబులడం
బుగని సకలసత్త్వమహనీయంబయ్యుఁ దపనీయసౌగంధికగంధసంబంధబంధుర
పుష్పంధయగరుత్ప్రచయుతమగపరిచయంబు గలిగి యభంగతరతరంగరంగత్క
మలకుడుంగసంగచక్రాంగచక్రవళక్ష పక్షవిక్షేపణోజ్జాతవాతవేగసమంతతపరి
పాతితరజోవికాసంబునఁ దనరియు విరజానామంబున బ్రకాశించునదీలలామం
బుచే నావృతంబై యూర్ధ్వముఖానంతఫణాక్రాంతబహిర్దిశాంతరానంతనితాంత
ధవళవపుర్విభావిశేషసూచకనిష్కలుష పురుషోపలప్రకరప్రకల్పిత శిల్పకల్పనా
కల్పవిశాలసాల జాలాచ్ఛతరచ్ఛవిచ్ఛటాదిపాండురిత బ్రహ్మాండకరండంబును
నభోమండలార్ణవశైవలాయమానశక్రనలశిలాశకలసంఘుసంఘటితోత్తుంగగోపు
రనీలరుచిరరుచి సమాయాతతమోవ్యాపృతతదగ్రసంస్థాపితశాతకుంభకుంభాభి
నవదివాకరబింబనికరాలోకలోకాలోకావలోకన విస్మయరసావేశకారణంబును
సార్వకాలపల్లవితపుష్పిత ఫలితసల్లలితవివిధవిద్రుమకుంజమంజువన భవనోపవన
చారణసంతతాత్మ నారాయణనామస్మరణక్రీడాపరాయణ కలకంఠ నీలకంఠ
శుకముఖనిఖిలఖగజాతచేతనానూతనప్రవాళదళవ్యూహ వారివాహబింబికాఫల

మోహకారివిద్రుమద్రుమలతాసితపట్టాంబరవితానపద్మరాగకపోతపాలికాభిరామం
బును గోమలదూర్వాదళశ్యామలప్రకాశామలగారుత్మతరత్నయూథసముత్సేధ
సౌధశిఖరాభ్రంకషగరుడకేతనద్యోతమానశ్వేతపటపటలద్యుతివ్యంజితత్రిభువ
నాక్రమణోపక్రమవిక్రమత్రివిక్రమోర్ధ్వప్రసారిత చరణాంగుష్ఠ నఖశిఖాముఖ
నిర్గళితావరణపయోధిపయోధారాప్రవాహంబును గేళికాచకోరపాళికాజ్యో
త్స్నాయమాన మానిత జ్యోతిరుత్కటస్ఫటికదృషత్ప్రకటిత ప్రతికుడ్యభాగ
చిత్రితనిజదశావతార కథాసూత్రచిత్రసందర్శనానందపరసలోకలోకమిథస్సంభా
షణవిధాధికనిరవధికవివిధవీథికాశతసహస్రసందానితమందారమాలికాకలితవన
మాలికా ఘుమఘుమాయమానంబును నవరత్నఘటితకిరీటమకరకుండలాంగద
కంకణాంగుళీయకకౌస్తుభహారశ్రీవత్సవైజయంతీ వనమాలికాకనకకౌశేయచ
తుర్భుజశంఖచక్రకౌమోదకీశార్ఙ్గనందకాద్యక్షీణలక్షణలక్షిత సురూప సరూప
ధారావరారోహణార్హ రోహిణాచలలసమానవిమానశతకోటికోటిసంకీర్ణకింకిణీ
కిణకిణారవాపూరిత దశదిశావకాశంబును వైదూర్యవిరచిత క్రీడాచలరాడ
ధిత్యకాచరన్నీలకచామణిముఖ చంద్రసేవాసమాగతతారకావారకభ్రమాకర
ముక్తాఫలవిలసితోపకారికానికాయ ప్రకాశమాన ప్రసూన సరధ్వజచ్ఛత్ర
చామరచిత్రాంబర ముకురాద్యలంకార దరీదృశ్యమానంబును గోమేధికరత్న
ఖచితానేకమండపాంగణ మహనీయమాణిక్యమయరంగవల్లికామతల్లికాంశు
వల్లికావేల్లితంబును బుష్యరాగమణివిభాసురప్రాసాదసమాసాదిత జాతరూప
వాతాయన రంధ్రాంతికనిస్తంద్రచంద్రకాంతకాంతవేదికాంతరకాంతాకాంత
విలోచనేందీవరదళార్చిత పథిగతాగతభాగవతపదాంబుజంబులు ఘనసారగంధ
సారకాశ్మీరకస్తూరికాదిపరిమళనిత్యనివాసంబును నై కర్బురాలోకదూరంబు
గాకుండియుఁ గర్బురాలోకదూరం బయి బహువిధరత్నకర్బుర కాంతులం
దేజరిల్లి చిత్రభానుసంభావితంబు గాకుండియుఁ జిత్రభానుసంభావితం బయి
యనంతమణివిలాసాస్పదంబు గాకుండియు ననంతవిలాసాస్పదం బయి స్వస్ఫు
రితప్రకాశాన్వితంబు గాకుండియు స్వస్ఫురితప్రకాశాన్వితంబై చంద్రవిభవాశ్ర
యంబు గాకుండియుఁ జంద్రవిభవాశ్రయం బయి ప్రకృతిగోచరంబు గాకుం
డియుఁ బ్రకృతిగోచరం బయి కరంబు రాణించు శ్రీవైకుంఠనగరంబు చేరం
బోయి త్రయస్త్రింశత్కోటిపురద్వారపాలకులు సాలోక్యసామీప్యసారూప్య
వంతులగు పరమభాగవతులు నఖిలప్రపంచమోహనశృంగారవతు లగుయువ
తులు ననేకవిమానకాంతులు దిక్కులం బిక్కటిల్ల దివ్యగంధమాల్యాంబరా
భరణ విభాసమానమూర్తులై యాడుచుఁ బాడుచు నపరిమిత వాద్యవిశే
షంబులు బోరుకలంగ నెదుర్కొని పుష్పాంజలు లిచ్చువారును నానందనర్త

నంబు లొనర్చువారును నారాయణవిష్ణుకృష్ణగోవిందముకుందాది దివ్యనామంబు
లుగ్గడించి సంకీర్తనంబు సలుపువారును గోటికందర్పసౌందర్యసుధారసంబు
నేత్రాంబుజంబులఁ బానంబుఁ జేసి రోమాంచకంచుకితాంగు లగువారును నాల
వట్టంబు లుభయచామరంబులు ముత్యాలగొడుగులు గరుడటెక్కెంబులు కనక
వేత్రంబులు బంగారుసురటులు సౌవర్ణతాళవృంతంబులు నమృతపూర్ణహైమ
కలశంబులు మొదలయినవి ధరియించి వివిధకైంకర్యపరాయణత్వంబున నగ్ర
భాగంబున నడుచువారును నై సందడించువైకుంఠనివాసులతో ముప్పదిమూఁడు
కోట్లదేవతలతో బ్రహ్మరుద్రాదిలోకాధికారులతోఁ బురప్రవేశంబు గావించి
యెడనెడ వైష్ణవీరత్నంబులు కర్పూరనీరాజనంబులు ముత్యాలసేసలుసమర్పింపఁ
గోటలు గోపురంబులు గొలువుకూటంబులు రత్నమండపంబులుఁ జలువచప్పరం
బులు రాజమార్గంబులుఁ గృతకాచలంబులుఁ గనకసౌధములుఁ దోరణస్తంభం
బులం జూచుచు సకలవిశేషంబుల నొప్పునప్పురంబు నట్టనడుమ నిట్టలంపుఁ
బులుదిండిచట్టులం గట్టిన యభ్యంతరవప్రగోపురద్వారంబునం గట్టినకుండ
నంపుఁజెట్టుపలకఁ గనుపట్టు పిట్టహుమాయి తేజి డిగ్గె నయ్యవసరంబున. 294

సీ. వలపటనుండి చౌవంచమోములదునేదారి నెయ్యమునఁ గైదండ యొసఁగెఁ
గళుకువజ్రంపుఁజెక్కడపుమేల్పావలై ఫణిలోకవిభుఁడు శ్రీపదము లానెఁ
జారుముక్తామయచ్ఛత్రంబు ధరియించి యెడఁ బాయక సునందుఁ డనుసరించెఁ
గడవన్నెతళుకుబంగరువీజనముఁ బూని విసరుచు ఖగరాజు వెంబడించెఁ

తే. గమ్మబాగాలొసఁగె నూడిగము వహించెఁ, బుష్పదంతుఁడు సేనానిభూరివేత్ర
పాణియై యగ్రమున బరాబరు లొనర్చె, హరినిజాభ్యంతరముఁ జేరునవసరమున.

సీ. బలువేల్పురాప్రతిమలచెక్కడపుగండపెండెంబు డాకాల బెరిమెఁ జూపఁ
గటిబద్ధకనకాంశుకంబుపై మణులయడ్డిగలయొడ్డాణంబు జిగి దలిర్పఁ
దళుకుఁగుంకుమపుఁగందపుఁబూఁత నెఱపుచు నురమునఁ గౌస్తుభం బొప్పుగులుక
నాజానులంబిబాహాచతుష్టయమునఁ బంచాయుధస్ఫూర్తి పరిఢవిల్ల

తే. మకరకుండలవజ్రసంపదలతోడ, ముకురతులితకపోలముల్ ముచ్చటాడ
స్వర్ణకోటీరరుచిరత్నవలభు లొలయ, నవ్విభుఁడు సేరె మొదటికభ్యంతరంబు.

సీ. ఫలములఁ గాంక్ష నిల్పక నిజాంఘ్రులు గొల్చి తపములు సేసినధన్యమతులు
నారాయణసమర్పణం బంచు వివిధయజ్ఞంబు లొనర్చిన శాంతినిధులు
గోవింద నృహరి ముకుంద మాధవ యంచుఁ దనుసంస్మరించిన దాంతియుతులు
తీర్థయాత్రలు పోయి దివ్యదేశంబులఁ దనువులు విడిచిన ధైర్యపరులు

తే. వేయితులసీదలము లెంచి వేయిపేళ్ల
దినమును స్వకీయపూజ సల్పిన కృతార్థు

లచటనుండి క్రియాశక్తి ననుసరించి
యెదురుకొని యర్చ లిచ్చిన నిచ్చ నలరి. 297

మ. ధవునిన్ సాధ్వి భజించుపోల్కిఁ దనకున్ దాసత్వమున్ జెంద భ
క్తివిశేషంబునఁ గొల్చుసాత్త్వికులు వర్తింపంగ తావైన రెం
డవశక్త్యంతరమున్ రమాధిపుఁడు వేడ్కన్ డాసిఁ తద్భక్తపుం
గవు లిచ్ఛాభావ్యయశక్తితో నొసఁగుసత్కారంబులం బ్రీతుఁడై. 298

మ. వనజాక్షుం డఖిలాత్మకత్వమున సర్వవ్యాపి యై యుండ నా
యన గాకున్న దొకండు లేదనువిశిష్టాద్వైతిసంఘంబు పా
యని యమ్మూఁడవశక్తిఁ జేరి కమలాధ్యక్షుండు చిచ్ఛక్తితోఁ
దనకున్ వారు సపర్య లియ్యఁ గొని మోదం బొప్పఁగా నావలన్. 299

మ. చని పూర్వం బవధూతచర్యల యదృచ్ఛాలాభసంతుష్టులై
తనుసత్త్వాదికకృత్యముల్ దొఱఁగి కాంతాద్రవ్యకాంక్షావివ
ర్జను లానిత్యవిరక్తులున్న చతురంచద్ద్వారమున్ జేరి య
వ్విసయాఢ్యుల్ విమలాభియుక్తిఁ దను సేవింపన్ బ్రహర్షింపుచున్. 300

చ. ఇరువదినాల్గుతత్త్వముల నేర్పడఁ గన్గొని వాని కవ్వలన్
బరఁగెడి పంచవింశకుని భావన సేయుచుఁ జిద్వివేకవి
స్ఫురణల మించు సాంఖ్యులకుఁ జొలగు నైదవవాకిటన్ దయా
కరుఁ డతఁ డొందె ప్రియనెడి కామినిచే వివిధోపచారముల్. 301

మ. సరసీజాక్షునిఁ గాఁ జతుర్భుజునిఁ గా సౌవర్ణకౌశేయుఁ గాఁ
బరమానందునిఁ గాఁ బ్రసన్నముఖుఁ గాఁ బ్రాదేశమాత్రాంగుఁ గా
నిరతంబున్ దనుఁ జింత చేసిన సుధీనిర్దోషరత్నాళి కా
కర మానాఱవచోట దృష్టివలనన్ గాంచెన్ విభుం డర్చనల్. 302

సీ. నానావిధానూననాడికాశోధనాభ్యంతరాంగికశుద్ధు లాచరించి
దేశికాకలితోపదేశపద్ధతి యమనియమాదియోగాతిశయము లెనసి
పరఁగుప్రాణాయామ బాహుళ్యమున సుషుమ్నాగర్భమునగు బ్రాణములు సేర్చి
కుండలి మేల్కొల్పి మండుజాఠరశిఖిజ్వాలసుధాధారఁ జల్లచేసి

తే. యూర్ధ్వముఖషట్సరోజనాళోపరిప్ర,భాసురసహస్రదళపద్మవాసిహంస
సంగతి రహించుహఠయోగిజనులు పుష్టి, గలసి సేవింప సప్తమస్థలముదాఁటి.

క. ఆనందకకరుఁ డార్యజ,నానందకరుండు వారిజాక్షుఁడు బ్రహ్మే
శానామరేంద్రవిష్వ,క్సేనాదులఁ గూడి యవలికిన్ జనువేళన్. 304

సీ. కొల్లాటమండలోత్ఫుల్లచంద్రికలతో విహరింప నేర్చిన విమలమతులు
రవిశశాంకాగ్రజాగ్రత్తారకజ్యోతు లొక్కటిగాఁ దిలకింప నోపుధన్యు
లానందతానాహతానూనగానంబు చవి యెఱింగిన మహాసౌఖ్యనిధులు
శాంభవీముద్రాశ్వసంరాధులై వట్టిబయలు ప్రాఁకఁగఁ జాలు బ్రహ్మవిదులు

తే. జననమరణార్తిముఖసమిత్సమితి యనుభ, వాగ్ని వేల్చినఘనయజ్వలను దనర్చు
రాజయోగాహ్వయప్రాజ్యరాజ్యకర్త, లష్టమద్వారగతు లౌట హరినిఁ గాంచి.

క. సనకసనందనముఖులగు, ననఘులతో నెదురుకొని ప్రియంబునఁ బూజిం
చిన నలరుచు శ్రీధరుఁ డ,జ్జనముల వీడ్కొని యవలఁ జనుసమయమునన్.

సీ. గిలుకుమెట్టియలమ్రోఁతల కంతికాంగుళీభూషణార్భటిప్రియంబులు గణింప
మంజీరసంజాతశింజారవములకు రాయంచరవళి పరాకు దెలుపఁ
గాంచిఘంటాఘణంఘణలకుఁ గరలసత్కంకణధ్వనులు కైదండ యొసఁగఁ
గర్ణోత్పలాళిఝుంకారంబునకుఁ గచోద్దేశికేకిరుతంబు తెరువు సూప

తే. సూత్రవతియాదిగాఁగలవేత్రవతులు, నలుగడల నిండుసందడి దొలఁగఁద్రోయ
నిరుగడల ధారుణీనీళ లేఁగుదేర, నిందిరాదేవి గోవిందు నెదురుకొనియె. 307

చ. ఎదురుగ వచ్చి యచ్చెలువ యింపగువాలు మెఱుంగుఁజూపులన్
మొదట నివాళి యిచ్చి ప్రియమున్ భయమున్ వినయంబు నెమ్మదిన్
గుదికొని పిమ్మటన్ యువతికోటులతోఁ దపనీయపాత్రికా
సదమలరత్నదీపికల శౌరికి నారతు లెత్తె వేడుకన్. 308

ఉ. ఆరతు లెత్తువేళ జవరాలిముఖాబ్జము తేటఁ జూచు నొ
య్యారపుఁజూపుఁ జూచు బిగియారుచనుంగవఁ జూచు మేని సిం
గారముఁ జూచుఁ జెక్కులప్రకారముఁ జూచు ముకుందుఁ డెంతయున్
గౌరవమొప్ప నెన్నఁడును గాననివస్తువుఁ గన్నకైవడిన్. 309

శా. ఆలో భూమి ధరించె వీజనము నీలాబ్జాక్షి కర్పూరతాం
బూలం బర్పణసేయు నాడిగములన్ బొల్పొందె శ్రీదేవియున్
గైలా గిచ్చె ననేలవార్షికవియోగప్రాజ్యచింతాభర
వ్యాలోలత్వముఁ బాసి కేశవుఁడు హర్షాంబోధి నోలాడఁగన్. 310

మ. కమలాకామినిపాణిపంకజము సోఁకన్ మై గగుర్పార న
క్కమలాక్షుం డనిశంబు సాత్త్వికమునన్ గన్పట్టియున్ సద్విలా
సమునన్ సాత్త్వికమూనెఁ బక్షివరవిష్వక్సేనశేషాదికుల్
దమశృంగారకళావిశేషములు సందర్శించి హర్షింపఁగన్. 311

శా. ఈలాఁ గిందిరఁ గూడి మందరధరుం డిర్వంకలన్ వైష్ణవీ
జాలంబుల్ వివిధోపచారము లొనర్పన్ జొచ్చె జంభద్విష
న్నీలాంభోరుహరాగవజ్రముఖమాణిక్యోరుశిల్పాంచిత
స్థూలస్తంభకవాటకోటిఁ జెలు వౌశుంభన్నిజాస్థానమున్. 312

పరమపదవర్ణనము

వ. అది మఱియు ననంతదివ్యరత్నసమాజతేజఃపుంజంబున కాస్పదం బయి యుపరి

మితవిచిత్రచిత్రాంబరసువర్ణవర్ణ పట్టాంశుకప్రతానంబులఁ గట్టిన మేలుకట్లు చెన్నునఁ గన్నులకు మిఱుమిట్లు గొల్పుచు నలుదిక్కులఁ బిక్కటిల్లుహరిచందనమందారకల్పకసంతానపారిజాతప్రసూనవాసనల కాస్పదం బయిన యత్యున్నతస్ఫటికమయమహాస్తంభకోటుల నీటుల దీటులేక యనేకబ్రహ్మాండసహస్రంబులఁ గలప్రాణులెల్ల నొక్కపరి వఱతెంచి నిల్చిన నొక్కయంకణంబునకుం జాల దనం జాలుచాలుపుఁ గలిగి యగణేయదృగ్బుజంబులు గలనిజనాథుని వలె నలఘుతరవజ్రజాలకరచితజాలకరంధ్రనికాయంబుల నవలోకనీయం బై కమనీయముక్తికమయప్రాలంబమాలికాపరంపరల పెంపున నింపొనర్చుచు దర్పణంబుల కెక్కునఁ దళుక్కున మెఱయు కాంతిమచ్చంద్రకాంతకాంతకుడ్యాంతరంబుల నెంతయు వింతమై చింతామణీగణనిబద్ధవిశాలవితర్దికానికరంబులఁ గరంబు రాణించి కెంపుటిటికగములఁ గట్టినయట్టలంపుమెట్టులఁ గనుపట్టి సుమమాధికగోమేధికతోరణప్రాంచిత పుష్యరాగవిటంకభాగభాగపరభాగవిభాభాగపరభాగతతుల నతులం బై స్వయంప్రకాశకం బై నిత్యముక్తాశ్రయం బై త్రైకాలికసత్యం బై స్వతస్సిద్ధం బై ముముక్షుజనాపేక్షణీయం బై శుద్ధసత్త్వానందకరంబు గావున నానందమణిమండపం బనఁ బ్రసిద్ధం బైన సభామండపంబుం బ్రవేశించి యందు శేషాత్మకం బై చెలువొందు నశేషవిశేషరత్నచిత్రితభద్రాసనంబు పై వసియించి శ్రీదేవి నురంబున నుంచుకొని భూనీళల నిరుపార్శ్వంబుల నిడుకొని యనంతగరుడవిష్వక్సేనాదినిత్యులలో శంఖచక్రగదాశార్ఙ్గ నందకాభిరాములు నీలమేఘశ్యాములు విగతమోహులు నాజానులంబిచతుర్బాహులుఁ గౌస్తుభహారకేయూరమకరకుండలాదిదివ్యభూషణధారులుఁ గనకాంబరధారులు వైజయంతీవనమాలికావక్షులుఁ బుండరీకాక్షులుఁ గుడాకేశులు నభంగురప్రకాశులు నగుసారూప్యధారులు దాను జూపిన విశ్వరూపంబువలె గణియింప నలవి గాక డాపలిపార్శ్వంబున నిలిచి సేవాంజలులు దాలిచి కొలువు సేయఁ బాంచజన్యంబుఁ బోలుకంఠంబులుఁ జక్రంబుఁ బోలుకటిమండలంబులు శార్ఙ్గంబుఁ బోలుకనుబొమలు నందకంబుఁ బోలుకీలుజడలుఁ గౌస్తుభంబుఁ బోలు కెమ్మోవులు శ్రీవత్సరుచులఁ బోలుముంగురులు నాభిపద్మంబుఁ బోలు ముద్దు మొగంబులుఁ గనకాంబరద్యుతులఁ బోలు నెమ్మేనిచాయలు నీలాభిరామంబు లగునూగారులు మీనాకారంబులగు బెళుకువాలుఁ జూపులు కమఠరూపసరూపంబు లగు ప్రపదంబులుఁ గల వన్నెలాఁడులు చిన్నారికెంగేలుజిగురులఁ గనకకలశంబులుఁ గాళంజికలు గుంచెలు సురటులు నాలవట్టంబులు నుభయ చామరంబులు మణిముకురంబులుఁ బరిమళకరండంబులు జిలుఁగుపావడలుఁ గర్పూరతాంబూలపేటికలుఁ గమ్మపూబంతులు గాంచనవేత్రంబులు మున్నై

నవిఘరియించి పెక్కువగల నూడిగంబులొనరింప సనకసనందనాదులు బాల్యంబు వహియించి తొల్యంబు లేనిభక్తియోగంబునఁ జెంతనుండి కన్నుల ముదశ్రుపూరంబు లొలుక నానందనాట్యం బొనరింప శతానందుండు పులస్త్యపులహ ప్రముఖనవబ్రహ్మలతో వలవంక నిలిచి సేవింప నేకాదశరుద్రులు ప్రమథగణంబులు గణేశ్వరగుహ చండీశ్వరాదులుఁ దనుబరివేష్టింప నష్టమూర్తిగోమాంచకంచుకితమూర్తియై సహజస్నేహంబున ననువర్తింప నిలింపపాలకుం డఖిలలోకపాలకులతో ముప్పదిమూఁడుకోట్లదేవతలొక్కచక్కిఁ బెక్కుటిల్లనిటలఘటితాంజలియై భజియింపఁ జిత్రరథహాహాహూహూప్రముఖగంధర్వులతోఁ దుంబురు నారదాదులు పరివాదినులు మొరయింపుచు నింపుగా నిజబిరుదాంకితగీతంబులు వినిపింప ననుకంపాయతకటాక్షంబు లభిలషించి నలువదినాల్గుకోట్లమహర్షులుపనిషత్పరంపర లుగ్గడింపుచు నొక్కదిక్కున నెనకొని యభినందింప రంభోర్వశీమేనకాదిచతుష్షష్టికోట్ల్యప్సరసపాటలాధర లాటలఁ బాటలఁ బాటవంబు నెఱపుచు నుందట నటింప నభంగురప్రభావంబున నీడుజోడులేక శతకోటిమార్తాండమండలప్రకాశంబు లొక్కరాశియైనట్లు ప్రచండతేజోవిశేషంబున దిర్నిరీక్షుండయి కోటిపుండ్రేక్షుకోదండులచక్కఁదనంబులొక్కటియైనట్లు సకలలోకాశ్చర్యకరసౌందర్య లీలావిలాస విభ్రమావిర్భావహేతుదివ్యమంగళవిగ్రహంబుచే నభీక్షణీయుండయి సప్తవ్యాహారగాయత్రి యగుగాయత్రిసీమంతపదాంత ముక్తామణికాంతుల నిజపాదనఖచంద్రిక లొలయఁ జేయుచుండఁ బురుషాకారంబులు వహించి కొలిచి యున్నఋగ్యజుసాదుల నాదరింపుచు సరూపంబులయి కొలుచుస్మృతిపురాణేతిహాసప్రముఖవిద్యల సప్రేమంబుగా నవలోకింపుచు మేను లూనినయజ్ఞాదిక్రియాకలాపంబుల సత్త్వజ్ఞానవైరాగ్యంబులఁ దగురీతి గారవింపుచు సర్వనియంతృత్వసర్వభోక్తృత్వసర్వకర్తృత్వసర్వపాలకత్వసర్వజ్ఞత్వాదిసర్వశక్తియుక్తుం డయి యఖండితప్రభావంబున నిండు కొలువుండె నయ్యవసరంబున. 313

శా. శుక్సంభేదక తత్ప్రభాస్థితబుధస్తోమంబు క్రందెల్ల వి
ష్వక్సేనుండు కరాబ్జసంజ్ఞలను మాన్పఁ శౌరినెమ్మోమునఁ
దృక్సంఘం బిడి హస్తముల్ మొగిచి గౌరీభర్త పల్కెఁ శిరో
భాక్సాపర్వధునీఘుమంఘుమరవప్రత్యగ్రవాగ్గుంభనన్. 314

## శివుఁడు విష్ణువును స్తుతించుట

శా. శ్రీమంతంబు సనాతనంబు దితిభూజిద్బాణబాణాసనో
ద్దామం బాశ్రితరక్షణక్షమము సీతాలక్ష్మణోపేత మా
శ్యామోదప్రద మాంజనేయహిత ముద్యత్తారకం బౌభవ
ద్రామాకారము నామనోంబుజమునఁ ధ్యానింతు నశ్రాంతమున్. 315

శా. విశ్వాసంబున నార్తి మాన్పు డని యీవేల్పుల్ మిముం వేడినన్
విశ్వామిత్రవిలుంఠనంబునకు నావిర్భావముం జెంది యా
విశ్వామిత్రహితంబు ముందుగనె కీర్తిన్ జేసి చెల్వొందు మీ
శశ్వచ్చిత్రచరిత్రముల్ దలఁతు నశ్రాంతంబు స్వాంతంబునన్. 316

శా. ఆదిత్యేందుహుతాశనప్రముఖదీవ్యత్కాంతమచ్ఛైవిని కు
చ్ఛేదింపంగ దరంబు గాక దరముం జేకూర్చునగ్రాతమ
స్త్రీద్రోహాంధతమిస్రముం క్షణములో ఛేదించి వెల్గొందు మీ
పాదాంభోజనఖాంశువుల్ నిటలముం బ్రాపింపఁగా మ్రొక్కెదన్. 317

శా. ధర్మారంభనిరూఢులై జనపతుల్ దౌర్గ్యందు రెందేనియుం
శర్మంబుల్ ధరణీసుతాపరిణయేచ్ఛన్ మీరు మున్నద్ధతిన్
ధర్మచ్ఛేదన మాచరించిన విచిత్రం బెంత వర్ణింతునో
ధర్మాధ్యక్ష దిగీశరక్షణమహోదారప్రభావోదయా. 318

మ. వితతప్రౌఢిమ జామదగ్న్యమది నావేశించి దుష్టక్షమా
పతులన్ దక్కక పెక్కుమార్లడఁచి భూభారంబు వారించి త
ద్గతతేజంబు శరాసనంబు గొనువీఁకన్ గ్రమ్మఱన్ గొన్నమీ
యతిగాంభీర్యపరాక్రమాదిగుణమాహాత్మ్యంబు లూహించెదన్. 319

క. గురువులకు నాదికారణ, గురుఁడని ప్రఖ్యాతిఁ గనియు గురునాజ్ఞ వనాం
తరమునఁ గాంతాసంగతిఁ, జరియించిన మీచరిత్ర శక్యమె పొగడన్. 320

సీ. అఖిలలోకములకు నభయప్రదాతవై యలరియు మునులకు నభయమొసఁగి
పుణ్యాజనప్రీతిఁ బొరసియు ఖరదూషణాదిపుణ్యాజనుల హతులఁ జేసి
యమృతంబు గొనుపక్షి నాది నేలియుఁ గాన నమృతంబు గొనుపక్షి నాదరించి
యాదిత్యజాతకార్యముఁ బూని యుండియు నాదిత్యజాతకార్యము వహించి

తే. వాలి నని నొంచి వనచరావళుల మన్చి
వనధి బంధించి దానవేశ్వరు జయించి
సీతఁ బ్రాపించి పురిఁ బ్రవేశించి మించి
ధరణియేలినమిముఁ గొల్తుఁ బరమపురుష. 321

క. అని కొనియాడినశంభునిఁ, గనుఁగొని దరహాసవదనకమలుండై య
వ్వనజదళేక్షణుఁ డిటు లను, ఘనవర్షాంభోదనాదగంభీరోక్తిన్. 322

మ. గిరిజాధీశ్వర నీవు నీయజుఁడు నీగీర్వాణరాజాదిది
గ్వరు లీకిన్నరయక్షఖేచరమరుద్గంధర్వముఖ్యుల్ వనే
చరరూపంబులు దాల్చి శత్రుహతికిన్ సాహాయ్యముం జెందుటన్
సురవిద్వేషణుఁ డీల్గెఁ దాపసమనక్షోభంబు దీఱెన్ భువిన్. 323

తే. శిష్టజనరక్షణము దుష్టశిక్షణంబు
నవని నొనరించుకొఱకు నే నవతరించి

మత్కథాగాంగలహరి కామహీను జనుల
పాపజంబాల మడఁగింపు పాలనయన. 324

శా. శ్రీరామాయణముఖ్యమామకకథాశ్రేణుల్ ప్రసంగింపుచున్
బారీణత్వము మీఱఁగాఁ జదువుచున్ బాటించి యాలింపుచున్
సారప్రజ్ఞ రహించు మానవులకున్ షడ్వర్గముల్ దారఁ జే
కూరున్ గోటికలాఱు ఘోరదురితౌఘస్నల్ మీఱు నైశ్వర్యముల్. 325

తే. అని ప్రియంబున హరునితోఁ నానతిచ్చి, యబ్జగర్భాదిదివిజుల నాదరించి
కొలువడికందఅనుపీకుకొని కళత్రములుముగురుగొల్వహరియంతిపురముసొచ్చె.

ఉ. చొచ్చి మెఱుంగుకెంపునునుసోరణగండ్లఁ గడానిలోపలన్
బచ్చలతల్పులన్ స్ఫటికబంధురకుడ్యములన్ శశాంకర
త్నోచ్చయవేదులన్ వెలయునొక్కమహోజ్జ్వలసౌధమెక్కి యం
దచ్చపుఁబువ్వుఁజప్పరపుటందములన్ దగుమందిరంబునన్. 327

తే. కుందనపుఁదళ్కుచప్పరకోళ్లఁగుల్కు
మేలిసకినలమంచంబు మీఁద నీవి
మ్రానిపూఁబాన్పుజిగి మించుమంజు శేష
శయ్యఁ గూర్చుండె హరి రమాసహితుఁ డగుచు. 328

తే. అపుడు భూనీళ లనురాగ మతిశయిల్ల
సురఁటి యడపంబు గొని కొల్వఁ జూచి వెన్నుఁ
డింతిడెందం బెఱిఁగి నవ్వి యిరుకరములఁ
బట్టి వారల గూర్చుండ బెట్టుకొనియె. 329

ప్రణయకలహాదివర్ణనము

తే. రాజకీరంబు లవ్వేళ రాజవేషధారియై మున్ను దా నున్న మేర లెన్న
నంకగతయైన శ్రీదేవి నాదరింప, నవుడు గోవిందుఁ డోకలేనియలుకఁ బూని.

చ. అవు నవు మంచిదాన వతివా నిను నే మనవచ్చు నొంటిగా
నవని నను న్త్యజించి సభయం దపు డిద్ధర ద్రోవ యయ్యెఁగా
నవమతిఁ జేసి వచ్చితివ యాకఱకుందన మాత్మ నెంచినన్
దివిరి కనుంగొనన్ దగునె నీ మొగ మింకఁ దలోదరీమణీ. 331

తే. అనుచు శ్రీలక్ష్మితోఁ బల్కి యవనిదిక్కు, మాఱుమొగమైన నే నేమి నేరమాచ
రించితినొ యంచు ధరణిప్రార్థింపనీవె, కావె తోడైతెచ్చి తని చక్రధరుఁడు వల్కె.

వ. అప్పుడు. 333

మ. కరపద్మంబులు మోడ్చి పద్మ యను నోకంజాక్ష నామీఁద నే
తిరుగన్ దప్పు ఘటించి మీ రనిన వాదింపంగ నే నేర్తునే

నరు లే మో యొకనిండఁ బెట్టి రని కాంతారంబునన్ ద్రోయఁ బం
పరె వేయేం డ్లెడఁబాసి గాసిలనె మీ పాదంబు లూహింపుచున్. 334

క. నను మును గలుగఁగ నిచటికిఁ, బనుచుతలంపునను గాదె ప్రత్యయ మిమ్మం
చనుట మిముఁ గానకుండన్, గొని తెచ్చెనె ధరణి యేల కోపింపంగన్. 335

చ. గతజలసేతుబంధము లిఁకన్ బని యేమసి యెన్ని కార్యముల్
మతిని సహించియున్న నను మాటికి నిచ్చట నేర మెన్న వ
చ్చితిరె యటంచు మో మవలఁ జేసిన ప్రేయసిఁ జూచి శౌరి న
వ్వితి క్షమియింపవే యనుచు వేమఱుఁ గౌఁగిట గ్రుచ్చె మచ్చికన్. 336

చ. ఉరమున నిట్లు శ్రీరమణి నుంచుక భూవనితాంసవీథి శ్రీ
కర మిడి నీళ పెందొడలఁ గమ్రకరాబ్జము సాఁచి కేళినీ
శ్వరశతకోటిరూపవిభవం బెసఁగన్ ఫణిరాట్ఫణాళిపై
నొరఁగి ప్రహర్ష మొందె హరి యుజ్జ్వలసౌఖ్యరసైకలోలుఁడై. 337

తే. ఇటువలె నిసర్గవైభవం బెసకమెసఁగ, శ్రీధరానీళలను గూడి శేషగరుడ
ముఖ్యదాసులఁ బ్రోచుచు ముదముఁజెందె, నఖిలరక్షాచణుండు నారాయణుండు.

పఠనశ్రవణాదిఫలము

తే. ఈమహాకావ్యమతిభక్తి నెవ్వఁడువిను, నతఁడిహంబున సకలసౌఖ్యములఁజెంది
తనివి గని యంతఁ బునరాగమనవిరహిత, శాశ్వతబ్రహ్మలోకవాసంబునొందు.

సీ. ఇది త్రిలోకస్తవ్య మిది విబుధశ్రావ్య మిది దివ్య మిది భవ్య మిది యఘువ్య
మక్షరసంభావ్య మాదికావ్యం బిది ద్విజుఁడు పఠింప వాగ్విదుఁ డనఁదగు
క్షత్రియుండు పఠింప సర్వంసహాభర్త యగు వైశ్యుఁడు పఠింప నమితపణ్య
ఫలశాలి యా శూద్రకులజుఁడు పఠియింప వంశంబులో వాసి వన్నె గాంచు

తే. నఖిలవేదంబులు పఠింప నగుఫలంబు, నఖిలదానంబు లొనరింప నగుఫలంబు
నఖిలతీర్థంబులను గ్రుంక నగుఫలంబు, నొదవు నిక్కథ నొక్కింత చదివినంత.

క. ప్రత్యక్షరమున నానా, హత్యలు నశియించుఁ గరతలామలకగతిన్
బ్రత్యక్షం బగు మోక్షము, సత్యం బీ రామచరిత చదువుజనులకున్. 341

క. ఎందాఁకఁ జెలఁగు వేదము, లెందాఁకన్ దివిఁ జరింతు రిందుఁడు సూర్యుం
డెందాఁకఁ గులగిరులు దగు, నందాఁకన్ బొసఁగు నిమ్మహాకావ్య మిలన్. 342

ఆశ్వాసాంతము

శా. వైదర్భీకుచపత్రభంగరచనావైయాత్యసత్యారతా
హ్లాదా జాంబవతీకపోలముకురప్రాంచన్ముఖా మిత్రవిం
దాదంతచ్ఛదచుంబనాభిరత భద్రాద్యూతలోలా సుదం
తాదృఙ్మోహన భానుజాంకతలసుప్తా లక్షణాశ్లేషణా. 343

క. శ్రీవత్సగోత్రశుభకర, శ్రీవత్సశ్రితతలోదరీకౌస్తుభ సు
శ్రీవత్స రవిసహస్ర, శ్రీవత్సప్రముఖదనుజశిఖరిబలారీ. 344

మాలిని—

సరసిజదళనేత్రా చారుసౌవర్ణగాత్రా
గరుడజవనపత్రా కాలభిత్కాంకపత్రా
చరణవినతమిత్రా శాత్రవధ్వాంతమిత్రా
కరధృతఘనగోత్రా కంజవిద్వేషిగాత్రా. 345

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన వద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర్ణ వితీర్ణవైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర ధరాధిప సభాంతర స్తవనీయ నయకళాయుగంధరబంధురమనీషావిశేషమంథాన వసుంధరాధర శోధితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సంక్రందన నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతంబైన శ్రీమదుత్తరరామాయణంబను మహాకావ్యంబునందు సర్వంబును నష్టమాశ్వాసము.

ఉత్తరరామాయణము సమాప్తము.

---

శ్రీ ఎల్. వి. ప్రెస్, మదరాసు—1951.

# సి. వి. కృష్ణా బుక్కు డిపో, గ్రంథములు.

—:o:—

| | రు.అ. | | రు.అ. |
|---|---|---|---|
| బాలనాగమ్మకథ | 0-12 | గంగావివాహము | 0- 6 |
| పెద్ద బొబ్బిలిరాజు కథ | 0-12 | కుశలాయకము | 0- 6 |
| శుకసప్తతి కథలు | 1- 0 | సక్కుబాయిచరిత్ర | 6- 6 |
| దేశింగురాజు కథ | 0-12 | వరహావతార | 0- 4 |
| నలమహారాజు కథ | 0-12 | లంకాయాగము | 0- 4 |
| కొక్కోకము పటములతో చేరినది | 2- 0 | త్రినాదవ్రతకల్పము | 0- 4 |
| కామకాల కొక్కోకము | 1- 0 | లక్ష్మణమూర్ఛ పదము | 0- 4 |
| పెద్ద బాలశిక్ష | 0-12 | శృంగార పద్యములు | 0- 4 |
| ధర్మాంగదచరిత్ర-పాముపాట | 0- 8 | సారంగధర నాటకము | 0- 4 |
| హింది తెలుగు ప్రయిమరు | 0- 8 | యక్షప్రశ్నలు | 0- 3 |
| ఆంగ్లో తెలుగు ప్రయిమరు | 0- 8 | నీతిశాస్త్రము | 0- 4 |
| యిగుడూరు కంసవధ నాటకము | 0-10 | నవగ్రహచింతామణి | 0- 4 |
| సైంధవ పరాభవనాటకము | 0-10 | కామమ్మకథ | 0- 4 |
| కళాపూర్ణోదయనాటకము | 0- 8 | కాంభోజరాజు కథ | 0- 4 |
| గరుడాచల నాటకము | 0- 8 | కబీరుదాసు చరిత్ర | 0- 4 |
| హరిశ్చంద్ర నాటకము | 0-12 | ఆత్మబోధామృత తత్వము | 0- 4 |
| ప్రహ్లాద నాటకము | 0- 8 | భగవన్నామసంకీర్తనలు | 0- 4 |
| కృష్ణవాస్తు శాస్త్రము | 0-12 | గానామృత భజనకీర్తనలు | 0-12 |
| పురూరవచక్రవర్తి కథ | 0- 8 | వేమనపద్యములు | 0- 8 |
| మైరావణచరిత్ర పెద్దది | 0-12 | కుశలవ యుద్ధము | 0-12 |
| శ్రీరామవనవాసము | 1- 8 | కుశలవకుచ్చల చరిత్ర | 0-12 |
| అపూర్వచింతామణి 2. భా. | 3- 8 | 28 వ్రతములు | 2- 0 |
| మలయాళమంత్ర రాజీయం | 1-12 | 6 వ్రతములు | 0- 8 |
| యడ్లరామదాసు | 0- 8 | త్రికాండము అమరము అట్టబైండు | |
| తారకామృతసారము | 0-12 | 3 కాండములు చేరినది | 3- 8 |
| సన్యాసమ్మ కథ | 1- 0 | ఆరుమరాటీల కథ | 0- 2 |
| కాలజ్ఞాన తత్వములు | 0- 8 | లక్ష్మమ్మ కథ | 0- 3 |
| నలచరిత్ర ద్విపద | 1- 0 | చిన్నమ్మ కథ | 0- 3 |
| నలచరిత్ర వచనము | 0-12 | బాలగ్రహదోష చికిత్స | 0- 2 |
| భద్రాచల రామదాసు | 0-12 | సహదేవప్రశ్న శాస్త్రము | 0- 2 |
| గరుడపురాణం | 0-12 | పెద్దదాసు చరిత్ర | 0- 2 |
| పులిప్పాణివైద్యం | 2- 0 | త్యాగరాయకృతులు | 0- 2 |

## శ్రీ భగవద్గీత

ఇందులో చాల విశదముగా జనులు తెలుసుకొనుటకుగాను తాత్పర్యమును వ్రాయబడియున్నది. మీరు భగవద్గీత చదివియే ముక్తిపొందుటకు మార్గము.

వెల 2-0-0

## శ్రీ మహాభారత నాటకము

శ్రీ మహా భారతంబును పదిపర్వంబులుగాచేసి పదిపర్వంబులును నాటకంబుగా కొత్తూరు-రామలింగార్య కవిచే వ్రాయబడినది.

| | |
|---|---|
| ఆదిపర్వ నాటకము | అ. 12 |
| సభాపర్వ నాటకము | అ. 8 |
| ఆరణ్యపర్వ నాటకము | అ. 8 |
| విరాటపర్వ నాటకము | అ. 10 |
| ఉద్యోగపర్వ నాటకము | అ. 5 |
| యుద్ధపంచక నాటకము | రు. 1 |

యుద్ధపంచక నాటకంబులో, భీష్మపర్వము, ద్రోణపర్వము, కర్ణపర్వము, శల్యపర్వము, గదాపర్వము చేరినది.

వెల 2-12-0

## మదనకామరాజు కథ

ఇది యతి చమత్కారముగా వ్రాయబడినది. ఈ కాలమున నూతన చిత్ర విచిత్ర అఫ్టోన్ పటము రాబర్ పేజియందు ముద్రింపబడి యున్నది. గ్లేజు కాగితం క్రౌను సయిజు. వెల 2-0-0

## అసల్ పంచపాడవుల అజ్ఞాతవాసము

పాండవులు పదమూడవసంవత్సరము విరాటరాజుచెంత మెలగుచుండిన సామర్థ్యమును కీచకుని వధయును ఉత్తర గోగ్రహణ దక్షిణగోగ్రహణ యుద్ధములును అతి విమర్శగా వ్రాసి ముద్రించి యున్నాము. వెల 2-0-0

## భట్టివిక్రమార్కుల కథలు

మ. సుబ్బరాయులునాయునిచే వ్రాసినది.

ఇందులో భోజరాజు రాజ్యపరిపాలనము చేసినదియు 32 ప్రతిమలు భోజరాజునకు జెప్పిన 32 కథలును భేతాళుడు జెప్పిన 24 కథలును అతి చమత్కారముగా వ్రాసియున్నది. చదువ చదువ మనసునకు సంతోషము కలిగించును. దీని వెల 3-8-0

## శ్రీ భక్త విజయము

ఇందులో స్త్రీలు మోక్షమొందుటకుగాను 20 మహాపతివ్రతల కథలుగలది బహు అద్భుతముగా వ్రాయబడియున్నది. దీనిని చదివిచూచి మా మాటలయందలి సత్యాసత్యములు తెలిసికొనుడు. వెల 1-8-0

## అసల్ పంచపాండవుల వనవాసము

ఇందులో పంచపాండవులు 12-సంవత్సరంబులు వనవాసంబు చేసినదియును అందందుపడిన కష్టంబులను ఓరుపిచ్చుకల సామర్థ్య కథయును నీలకంఠుని భక్తియు విశదీకరింపబడి యున్నది.

వెల 1-8-0

## అసల్ కాశీరామేశ్వర మజిలీ కథలు

ఇందు నీతి, ధర్మ, వేదాంత, మత, సాంఘిక నియమాఖ్యాయికములు కలిగి ఒక్కొక్క కథను నొక్కొక్క క్రొత్త వింతను వెలయించుచుండును. ఇది స్త్రీ పురుషులందరు చదువుటకు తేట తెనుగును బోధపడునట్లు సులభశైలిని 27 కథలను కాంచీపురమునుండి బయలుదేరి కాశికిపోయి కాశినుండి రామేశ్వరము వఱకు 17 మజిలీలుగా ముద్రించియున్నది. వెల 2-0-0